1.గ్రంథం: నా గురువు.

రచన: జ్ఞానశిశువు

---

అనిలాచల ఋషి

---

అనంతవిశ్వంలో ప్రతిబిందువూ కేంద్రమే
అని ప్రబోధించిన అనిలాచలఋషి కథ ఇది...

నిశ్చలంగా నిద్రిస్తున్న వ్యక్తి
కలలో మరో ప్రపంచాన్ని సృష్టించుకుని
నడయాడుతున్నట్టు

అచలరూపుడైన పరమేశ్వరుని సంకల్పపరంపరయే
ఈ బ్రహ్మాండగోళములుగా మహా సృష్టి ఏర్పడింది...

జగత్తు యావత్తు శివుని సంకల్పరూపమే.
శివుడు మెలకువతో కనే కలే ఈ ప్రపంచం.

ఒకే పరతత్త్వం-
సంకల్పం లేనప్పుడు శివుడుగా ఉంటుంది.
సంకల్పం ఉన్నప్పుడు పార్వతిగా ఉంటుంది.

ఆ శివుడే అనిలాచలశివుడుగా శ్రీకాళహస్తిలో ప్రాణలింగంగా కొలువై ఉన్నాడు...

ఆ పార్వతే జ్ఞానప్రసూనాంబిక పేరుతో
జ్ఞానకేంద్రమై క్రీడిస్తోంది....
ఆపదలోకి త్రోయడం...
ఆపద నుంచి రక్షించడం...
ఆ క్రీడలో భాగమే.

అజ్ఞానానికి గురి చేయడం...
దానిని తొలగించడానికి జ్ఞానప్రబోధం చేయడం...

ఆ క్రీడలో భాగమే.

మంచి-చెడులనే తక్కెడలను అటు ఇటూ సమాంతరంగా లేనట్లు...
మళ్లీ ఉన్నట్లు...
సరిచూసుకుంటూ ఉండడం ఆ క్రీడలో భాగమే.

ప్రతిజీవి కర్మఫలాన్ని
ప్రతిజీవికీ సరాసరిన పంచుతూ ఉండడం ఆ క్రీడలో భాగమే.

అవతరించడం...అనుగ్రహించడం....
ఆగ్రహించడం...అంతం చేయడం...
ఆ క్రీడలో భాగమే.

ఆ క్రీడలో "ఎందుకు" అనే ప్రశ్నకు తావులేదు.
యెందుకంటే అది క్రీడ కాబట్టి....
క్రీడలో గెలుపు ఓటములు రెండూ వినోదమే కాబట్టి.

ఆ క్రీడలో భాగంగానే... సకల నామరూపాలూ తానే అయినప్పటికీ
జ్ఞానప్రసూనాంబిక 1942 ఆగస్టు 24 న శ్రీకాళహస్తిలో "సుబ్రహ్మణ్యం" అనే ప్రత్యేక నామంతో, ప్రత్యేక రూపంతో వ్యక్తమయ్యింది....

శ్రీకాళహస్తి రమణసత్సంగంలో ఓ గురువుగా తనను తాను
నామరూపాలతో ప్రకటించుకుని, తన శిష్యులకు జ్ఞానప్రబోధం చేస్తోంది.

ఆ జ్ఞానప్రసూలన్నింటినీ బాబు అనే శిష్యుడు(జ్ఞానశిశువు) ఏరుకుని
గ్రంథస్తం చేసి జ్ఞానాంబప్రేమను లోకానికి పంచాడు...

వారు నడయాడిన శ్రీకాళహస్తి క్షేత్రం ఇప్పుడు మరింత తేజోవంతమై
అలరారుతోంది.

ఆర్తులనే దీపపు పురుగులు ఆ జ్ఞానాగ్నికి ఆకర్షింపబడి
తమ సంస్కారబీజములను దహింపచేసుకుంటున్నారు.

దీపం దీపపు పురుగులను ఆహ్వానించదు...
సముద్రం నదులను ఆహ్వానించదు...
గురువు జ్ఞానప్రబోధానికై యెవర్నీ ఆహ్వానించడు...

ఎవరికివారే...స్వచ్ఛందంగా ఆకర్షింపబడి
వారి పాదాల వద్ద వాలిపోతుంటారు....

వారి దివ్యపాదారవిందం శక్తికేంద్రం.
అజ్ఞాన తిమిరాన్ని మ్రింగే జ్ఞానకేంద్రం.

ఇక్కడకు వచ్చి అనుగ్రహం పొందటం కాదు,
నా అనుగ్రహం పొందినవాడే నా గడప దాటి రాగలడు.
అని ముక్తి పొందాలని వచ్చిన అతిథులకు తక్షణమే అభయమిస్తారు.

ఇక్కడ పొందలేనివాడు ఎక్కడా పొందలేడు...
"నేను" ఉన్నచోటే క్షేత్రం.
"నేను" అన్నమాటే వేదం.
అని భరోసా ఇస్తారు గురువుగారు...

కామినీ కాంచనములను జయించినవారికి ముక్తినివ్వడానికి
రామకృష్ణులు అవతరించారు.

కామినీ కాంచనములను జయించలేనివారికి ముక్తినివ్వటానికి
నేను అవతరించాను...అంటారు ఆ కరుణామయులు.

కానీ సందర్శకులు మాత్రం-
ముక్తి కూడా వద్దు....మీ పాదాలపై భక్తి ఒక్కటి చాలు..
భక్తే ముక్తి అని నిశ్చింత అవుతుంటారు.
* * *

వారి అనుగ్రహభాషణం పుస్తకరూపం దాల్చాయి....
వాటిల్లో కొన్ని-

అనిలాచలశివమాల
జయశ్రీ రమణ గీతామృతం
మౌనభాషణం
దేవీప్రసాదం
పరమపదం
ఇప్పుడు-ఇక్కడ-ఇలా

సరాసరి
భగవదిచ్ఛ
జ్ఞానగీత
అది అంతే - ఇది అంతే
మొదలైనవి...
మొత్తం ఇప్పటివరకు 26 గ్రంథాలు అచ్చు అయినాయి...

* * *

ఈ గ్రంథాలన్నీ స్వస్వరూపాన్ని జ్ఞప్తికి తెచ్చే జ్ఞానగుళికలు....

* * *

సముద్రమంత దుఃఖం
బిందువంత సుఖం
అంటాడు బుద్ధుడు.

ఆ బిందువంత సుఖాన్ని కూడా సుఖం అని  అనుకోనక్కర్లేదు.
దుఃఖమే రెండు భాగాలుగా ఉంది...
దుఃఖంగా, సుఖంగా...
తక్కువ దుఃఖాన్నే సుఖం అనే పేరుతో వ్యవహరిస్తుండేది మనం.

* * *

తనకు సుఖం కాదు, తానే సుఖం అంటారు గురుదేవులు.
తానేసుఖం అనేది మరచి, తనకు సుఖం అంటూ
ప్రాకులాడుతున్నాడు మనిషి.

తనకు తానై తగిలించుకున్న బంధాలే ఇవి.
తనకు తానై పెంచుకున్న వ్యవహారాలే ఇవి.

అవి కొంత, ఇవి కొంత చేరి సముద్రమంత అయ్యింది.

దాన్నుంచి తరించడానికి(దాటడానికి)
తగిన నావ(గురుబోధ)కై ప్రజ ఆర్తితో ప్రార్థిస్తుంది.

అవసరమైన వేళలో...అవసరమైన చోటులో...
గురువులు అవతరిస్తూనే ఉంటారు...

ఆర్తులను సమాధానపరుస్తూనే ఉంటారు...

సమాధానపరచడానికి అవతరించిన అలాంటి సద్గురువులలో ఒకరు - సద్గురు సుబ్రహ్మణ్యం.

* * *

ఆర్తులను ఓదార్చడానికి
జిజ్ఞాసువులకు సమాధానమివ్వడానికి
వారు సామాన్యుల వలె
ఇంకా చెప్పాలంటే-
దాసులకు దాసుడు వలె
తన భక్తులకు, శిష్యులకు ప్రేమతో దాస్యం చేస్తారు...
తల్లి తన చంటిబిడ్డకు చేసినట్లు.

వారు జ్ఞానాంబావతారులు....
వారి సన్నిధిలో ఉన్నవారందరూ జ్ఞానశిశువులు...

వారి ఘనత్వం పైన కూర్చోవడంలో కాదు,
'పరమపదం' పటాన్ని పైన పెట్టి,
శిష్యులలో ఒకడుగా క్రింద కూర్చోవడంలోనే ఉంది.

వారి సంస్కారం నమస్కారం పెట్టించుకోవడంలోనే కాదు,
భక్తులు వారి పాదాలను తాకి నమస్కరించి లేచే లోపే వారికి
నమస్కరించడంలోనే ఉంది.

తనను తాను తగ్గించుకునువాడు
తనను తాను హెచ్చించుకొనును.
అన్న క్రీస్తు వాక్యం గుర్తుకువస్తోంది.

అణగి మణగి ఉండేవాడే అందరీలోకి ఘనుడు.
అన్న భక్తతుకారాం పాట గుర్తుకువస్తోంది.

వారి నిరాడంబరత్వం, సాధారణత్వం, సహజత్వం,
ఆ కలుపుగోలుతనం, చెదరని చిరునవ్వు....

అలా వారిలో చూసి మురిసిపోవల్సిందే తప్ప...
కనీసం అనుకరించడం కూడా మనకు కుదరదు అనిపిస్తుంది.

ఏ మాత్రమూ నిలకడ స్వభావము లేని నేను
వారి సహచర్యంలో ఇన్నేళ్లు  గడిపానంటే...
అది వారి గొప్పతనమేగాని నాది కాదని అనిపిస్తుంది.
అంతగా చేరదీస్తారు శిష్యుల్ని.

చాపలు పఱచి, మంచినీళ్లు చెంబు పెట్టి, ఫ్లాస్కు నిండా టీ పెట్టి...శిష్యుల రాక కోసం గేటు వైపు పలుమార్లు చూస్తూ యెదురు చూసే వాత్సల్యమూర్తి గురువుగారు.

దోషాల్ని అస్సలు పట్టించుకోరు....
సవరించాలనిగానీ, సంస్కరించాలనిగానీ
అస్సలు అనుకోరు.

మనకు తెలియకుండానే వారి సన్నిధిలో మన దోషాలు
సవరించబడతాయి...లేదా రూపుమాపబడతాయి...
అదే సద్గురుబోధామృత మహిమ.

ఒక్క పైసా కూడా ఖర్చుపెట్టని లోభిని కూడా వారు విమర్శించరు....

"పై వాడి అనుమతి" లేనిదే వాడు మాత్రం ఏం చేయగలడు పాపం...!
అంటూ ఆ లోభిని కూడా వెనకేసుకొచ్చే కరుణామయులు వారు.

అలా ఉండొద్దు.
ఇలా ఉండు.
అని నా 30 ఏళ్ల వారి సహచర్యంలో ఒక్కసారి కూడా
వారి నోట ఆ మాట వినలేదు.

వారు ఉంటారు....అంతే.
వారు చూస్తారు....అంతే.
దేనికీ ప్రతిస్పందించరు.

అడిగితే చెబుతాడు....
లేకుంటే ఊరకుంటాడు....

జ్ఞానప్రసూనాలన్నీ అడిగినవారికి చెప్పబడినవేగానీ
వారుకు వారై చెప్పినవి ఏవీ లేవు అనాలి...

వారిని చాలామంది తరచూ అడిగే ప్రశ్న -
బ్రహ్మానుభూతిని పొందాలంటే ఏం చేయాలి? అనేదే.

'నేను బాబు-బాబు' అనుకుంటున్నావు....
ఇక నుంచి 'నేను బ్రహ్మము-బ్రహ్మము' అనుకో అంటారు.

అనుకుంటే సరిపోతుందా? అని అడిగితే,
అవును...సరిపోతుంది...అని కరాఖండితంగా చెబుతారు.

నేను బాబు అనే అబద్దాన్ని అనుకుని అనుకుని నిజం చేసుకున్నావు...

నేను బ్రహ్మమును అనే నిజాన్ని అనుకుని అనుకుని
ఎందుకు నిజం చేసుకోలేవు? అని అడుగుతారు గురువుగారు.

* * *

గంధానికి గంధం పూయగలమా?
నీటిని పలుచన చేయగలమా?
ఆకాశాన్ని విస్తరింప చేయగలమా?
అవి అంతే.

గురుతత్త్వం కూడా అంతే.
వారి నోటి నుండి పలుకబడే పరమతత్త్వం యొక్క సౌందర్యం కూడా అలాంటిదే...
ఇక దానిని ఏ మార్పులూ చేయలేం.

దానికి ఏ సొబగులూ అద్దకుండా
ఉన్నదానిని ఉన్నట్టుగా స్వీకరించగలిగితే చాలు.

ఇక దానిని వ్రాసుకోవడమో, భాషాపరమైన సొబగులు అద్దడమో  చేస్తే ఆ సహజమైన సౌందర్యాన్ని దూరం చేసుకున్నవారమవుతాము.

జ్ఞానేశ్వరులు అన్నట్టు-
బంగారునగకు వెండి పూత పూయడమే అవుతుంది.

కానీ వ్రాయడమే స్వభావముగా కలిగిన "బాబు" అనే ఓ శిష్యుడు వారి వాక్యాలను ఏరుకుని, వ్రాసుకుని వాటిని గ్రంథరూపంగా వెలువరించాడు...

కానీ ఆ గ్రంథం కంటే
వారి ప్రత్యక్ష సన్నిధే గొప్ప జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది.
ఇది కేవలం వారి సన్నిధికి చేర్చే చిరునామా మాత్రమే అంటాడు బాబు
తను వ్రాసిన గ్రంథాల గురించి.

బజారులో దొరికే సీసాతేనెను కొని తెచ్చుకోవలసిన దౌర్భాగ్యంగా కాకుండా నేరుగా పువ్వులవద్దకు వెళ్లి మకరందాన్ని ఆస్వాదించే భ్రమరం వలె సద్గురు సన్నిధి చేరి....జ్ఞానప్రసూనాల్లోని తత్త్వామృతాన్ని జుర్రుకోండి.... అంటాడు బాబు.

* * *

గురువుగారికి ఎంతోమందిశిష్యులున్నారు...
అలాంటప్పుడు 'మా గురువు' అని కాకుండా
'నా గురువు' అని ఈ పుస్తకానికి పేరు పెట్టడం సరియేనా? అని
అడిగారొకరు.

సరియే.

ఒక గురువుకు 12 మంది శిష్యులున్నప్పుడు,
ఆ 12మందికి 12 మంది గురువులున్నట్లే.

అందరికీ కలిపి ఒకే గురువున్నట్టు
పైకి కనిపించవచ్చుగాక, కాని ఎవరి గురువు వారికే,
ఎవరి అవగాహన వారిదే.

'నా గురువు' అని నేను అన్నప్పుడు
'గురువు' అనే అద్దంలో నేను దర్శించిన నాస్వరూపమే.

ఎవరు ఎవరి గురించి వ్రాసినా సరే,
అది తన గురించి తాను ఆవిష్కరించుకోవడమే అవుతుంది.

ప్రతి రచనా  రచయిత యొక్క అనుభవపు ఆవిష్కరణయే....

లేకుంటే ఇన్ని రామాయణాలు, ఇన్ని భగవద్గీతలు ఉండేవి కావు.

"మొల్ల రామాయణం" చదివితే
రామాయణాన్ని మొల్ల ఏ మాత్రం అర్థం చేసుకున్నది
అనే విషయం మాత్రమే అర్థమవుతుంది.

"వినోభాభగవద్గీత" చదివితే
భగవద్గీతను వినోభా భావే ఏ మాత్రం అర్థం చేసుకున్నాడు
అనే విషయం మాత్రమే అర్థం అవుతుంది.

అలా నేను "నా గురువు" అనే రచన ద్వారా
గురువును బాబు ఏ మాత్రం అర్థం చేసుకున్నాడు అనేది మాత్రమే అర్థం అవుతుంది.

అంతేగాని పూర్తిగా  గురుస్వరూపాన్ని బాబు చెప్పేశాడు అనికాదు.

యెవరికి వారు సద్గురు సన్నిధి చేరి గురుతత్త్వాన్ని అనుభవించాలేగాని,

ఏ ఒక్కరో వ్రాసిన పుస్తకం పరమప్రమాణం కాదు.
చదవొచ్చు....కాలక్షేపంగా...అంతే.
కానీ నీ స్వానుభవమే నీకు పనికొచ్చే పుస్తకం.

అందుకే మన పెద్దలు పురాణ కాలక్షేపం....హరికథాకాలక్షేపం....అన్నారు.
అన్నీ కాలక్షేపాలే....
నీకు పనికొచ్చేది నీ జీవితానుభవగ్రంథమే.

* * *

సముద్రపు నీటిని దోసిళ్లలో పట్టగలమే గానీ
మొత్తం సముద్రాన్ని దోసిళ్లలో పట్టలేం.

గురుచరిత్ర యెవరు వ్రాసినా అంతమాత్రమే...
గురుచరిత్ర వ్రాయడం గురువుకు కూడా సాధ్యం కాదు అన్నారు
గురువుగారు ఓసారి.

మరెందుకు మీరు వ్రాయడం అంటారేమో....

'రామాపురం పోవుదారి' అనే సూచికబోర్డు
రామాపురానికి దారి చూపిస్తుంది.

అలా గురుచరిత్ర గురువు వద్దకు చేరుస్తుంది.

అలా దేశ నలుమూలల నుండి గురుదర్శనానికి వచ్చిన ప్రతి ఒక్కరూ "మా జన్మ ధన్యమయ్యింది" అన్న తృప్తితో తిరిగి వెళ్లినవారేగాని,
ఎవరూ లోటుతో వెళ్లలేదు.

గురువు ఇచ్చినట్టూ కనబడదు,
భక్తులు తీసుకున్నట్టూ కనబడదు.
కానీ తమకే తెలియని ఏదో వెలితితో ఉంటారు ప్రతి ఒక్కరూ....
సద్గురు సన్నిధిలో ఆ వెలితి పూడిపోయినట్లు అనుభూతి కలిగి సంతృప్తితో తిరిగి వెళుతుంటారు.

"నా గురువు" అనే రచన చదివి,
"బాబు గురువు" గా కాకుండా,
మీరు కూడా గురువుచెంత చేరి...
"నా గురువు" అని అనుభూతి చెందుతారని ఆశిస్తున్నాను.....

* * *

2. అంతిమ ప్రయోజనం

---

గురు-శిష్య భేదం తొలగిపోవడమే
సద్గురు సత్సంగం యొక్క అంతిమ ప్రయోజనం.

దేవ-జీవ భేదం తొలగిపోవడమే
దైవోపాసన యొక్క అంతిమ ప్రయోజనం.

అనేకత్వాన్ని విడిచి ఏకత్వం వైపుకు చేరడమే
ఈ ఆధ్యాత్మికతకు  అంతిమ ప్రయోజనం.

అభేదభావం కేవలం సిద్ధి కలిగినప్పుడు మాత్రమే కాదు,
సాధనావస్థలో కూడా అభేదభావం కలిగి ఉండడమే
సద్గురు సంప్రదాయం.

భేదభావనాత్
సో2హ మిత్యసౌ
భావనా2భిదా
పావనీ మతా

ఈశ్వరుడు వేఱు, నేను వేఱు అనే భావముతో కూడిన ఈశ్వరభావన కంటే
'అతడే నేను' అన్న అభిన్నభావనయే పావనమైనది
అన్న రమణుల మాటే పరమ ప్రమాణం.

* * *

"మీరు భగవంతుణ్ణి లేదా ఆత్మను పొందిన
అనుభవం మీకు లేకపోవచ్చునుగాక....
కానీ 'నేను పొందాను' అనే భావనతోనే
నా సన్నిధికి  రండి..."అంటుంటారు గురువుగారు.

ఆత్మానుభవం పొందావా? అని నిన్నెవరైనా అడిగితే
"పొందాను" అని ఘంటాపథంగా చెప్పండి అంటారు గురువుగారు.

యెందుకంటే, నీ స్వరూపమే అది....

నేను పొందలేదు....అని నీవనుకుంటే, నీవు కూర్చున్న చాపకు కూడా
అవమానమే....అన్నారు గురువుగారు.

కాకపోతే అది జ్ఞప్తికి రావడానికి కొందరిలో కాస్త ఆలస్యం కావొచ్చు అంతే.

IAM THAT IAM (నేను అదే నేను) అనేది పక్కా.

అదే నేనన్న జ్ఞప్తికి తెచ్చేవే ఈ అధ్యయనము, సద్గురుప్రబోధము,
ధ్యానము....మొదలైనవి....

* * *

'జ్ఞానప్రసూనాలు' పుస్తకం చదివి దూరప్రాంతాల నుండి
గురుదర్శనానికి వస్తుంటారు...

రమణాశ్రమం వెళ్లివస్తూనో
శ్రీకాళహస్తి దర్శనానికి వెళ్లి వస్తూనో

పనిలో పనిగా సద్గురు దర్శనం చేసుకుందామని వచ్చేవారు యెక్కువ.

అందులో ఏ కొద్దిమందో గురుపాదాలకు అంకితమై,
ఇక మాకు ఏ క్షేత్రమూ, ఏ ఆశ్రమమూ అవసరం లేదని
స్థిమితపడినవారున్నారు.

తెలుసుకోవాలని ప్రశ్నించే జిజ్ఞాసువులు కొందరు.
మౌనంగా కూర్చొని తిరిగి వెళ్లేవారు కొందరు.

గురువుగారు దీర్ఘోపన్యాసాలు ఇవ్వరు...
ఒకటి రెండు మాటల్లోనే వారు చెప్పదలచుకున్న విషయమంతా
నిండిపోయి ఉంటుంది.

* * *

సమస్య తెగకో...
సమస్య తెగడంఇష్టం లేకనో...
లేక ప్రశ్నించడం స్వభావమై ఉండడం వల్లనో
ప్రశ్నిస్తూనే ఉంటారు పట్టెయ్య, సంతోష్ రెడ్డి మొదలైన వారు...

సమాధానం పొందటం వారికి  ఇష్టం లేదు....
ప్రశ్నించడం ఒక వ్యసనం....
ఇదొక రకమైన దురద అంటారు గురువుగారు.

* * *

గురువు ద్వారా సమాధానం కాదు,
గురువే సమాధానం.

* * *

వారి ప్రశ్నలు ఒకస్థాయికి చేరుకున్నాక...
'నిద్రలో అడగండి చెబుతాను....'అని గురువుగారనడం కద్దు.
అంతటితో ప్రశ్నల పరంపరకు ఫుల్ స్టాప్ పడుతుంది.

* * *

ప్రశ్న - వ్యక్తిగతమైనది.
సమాధానం - సర్వగతమైనది.

* * *

సద్గురు అనుగ్రహప్రసారానికి,
సద్గురు నిజబోధాప్రవాహానికి
మన ప్రశ్నే(మాటే)ఆటంకం.

* * *

మాట ఆగిపోతే మనసు మూగబోతుంది.
మనసు మూగబోతే ఆత్మ తేటపడుతుంది.

* * *

గురుసన్నిధే గొప్ప సమాధానం అన్నట్టు
గురుసన్నిధిలో మౌనంగా కూర్చొని గురుతత్త్వాన్ని సంపూర్ణం, నిశ్శబ్దంగా ఆస్వాదిస్తుంటారు...
వెంకటనరసయ్య, చెంగల్వరాయరెడ్డి...మొదలైనవారు.

* * *

మాకు ఈ వేదాంతంతో పనిలేదు....
మేం గురువుగారికి శుభ్రంగా వండిపెడతాం అని
వంటపనిలో నిమగ్నమయి ఉంటారు...
త్రిపుర, సునీత...మొదలైనవారు.

* * *

పుస్తక ప్రచురణలు, ముఖపుస్తక(facebook) ప్రచారాలు చేస్తుంటారు
బాబు, దాము, నరసింహరావు...మొదలైనవారు.

* * *

వారంలో రెండుసార్లు గురువు తలనే శివలింగంగా భావించి,
గుండు చేస్తుంటారు కైలాసం, రాజేంద్ర... మొదలైనవారు.

* * *

పనిమనుషులు అని పేరేగాని
స్వంతమనుషుల్లా సేవ చేస్తుంటారు యశోదమ్మ,
ధనలక్ష్మి...మొదలైనవారు.

* * *

వారి చేతుల మీదుగా...
బిరియానీలు తినే కాలభైరవులు...

బోండాలు తినే మార్జాలాలు...

ధాన్యం తినే పిచ్చుకలు...

అన్నీ వారి దర్శనం నిమిత్తం వారి సన్నిధిలో తిరుగాడేవేగాని, తిండికై కాదు....

* * *

క్రీడనిమిత్తంగా ఉత్తరకైలాసం నుండి దక్షిణకైలాసానికి(శ్రీకాళహస్తికి)
దిగివచ్చిన పార్వతీదేవి - గురువు.
వారి ముఖాముఖిన ఉన్నవారంతా గణపతి మొదలైన శివగణాలు...

* * *

రాబోవు తరాలవారు-
గురువుతో ముఖాముఖిన గడిపినవారిని సైతం తాకి, నమస్కరించుకునే రోజులు వస్తాయి...

వారు నడయాడిన భూమిపై ఉన్న ధూళిని తీసుకుని
నెత్తిన జల్లుకునే రోజులు వస్తాయి....

వారి చిత్రపటాలు ప్రతి ఇంట్లో వెలిసే రోజులు వస్తాయి...

వారి దివ్యసూక్తులు ప్రతి నోట్లో పలికే రోజులు వస్తాయి...

అందుకే నేనిచ్చే సందేశం ఏమంటే-
సద్గురువును ముఖాముఖి దర్శించండి...తరించండి...

* * *

## 3. ఓ పురాణ గాథ

---

పురాణగాథలు జరిగాయా? లేదా? అని సందేహం అవసరం లేదు.

జరగడం-జరక్కపోవడం
ఈ రెంటికీ ఆవలి విషయం అది.

అది తాత్త్విక విషయం.

మన తేదీలకు, మన ప్రాంతాలకు ఇమడని విషయం.

యోగులు యోగపరంగా దర్శిస్తారు.
జ్ఞానులు తత్త్వపరంగా దర్శిస్తారు.
మిగతావారు "పురాణ కాలక్షేపంగా" ఉపయోగిస్తారు.

ప్రస్తుతం మనం కూడా జ్ఞానాంబ కథను చందమామ కథలా చెప్పుకుందాం.

చంద్రుడూ చేతికి అందడు,
దేవుడూ చేతికి అందడు.

కానీ వెన్నెల్ని మనం ఆస్వాదించగలిగినట్లుగా
దేవుని అనుగ్రహాన్ని మనం అనుభవించగలం.

* * *

శివపంచాక్షరీమంత్రాన్ని తనకు ఉపదేశించమని
శివుని చేరి గోముగా కోరింది పార్వతి.

వద్దు పార్వతీ...నీవు చంచలవు...నీకు మంత్రం ఇవ్వడం కుదరదు అన్నాడు శివుడు.

పార్వతి అలిగింది.
కైలాసంలో ఆనంద తాండవాలకు సెలవయ్యింది.

శివుడు ఎంత నచ్చచెప్పినా వినలేదు.
శివుడు మంత్రాన్ని ఇవ్వక తప్పలేదు.

అచంచంచలంగా ఆ మంత్రాన్ని ఉపాసించడం మాని
చంచలయై  చెలెకత్తెను చేరి
నా అందచందాలకు మోహితుడై శివుడు నాకు మంత్రమిచ్చాడని
మిడిసిపడింది పార్వతి.

శివుడు రుద్రుడయ్యాడు.
శాపం పెట్టాడు.
భూలోకంలో మతిలేనిస్థితిలో పడి ఉండు అని.

పార్వతి పశ్చాత్తాపపడింది.
శివుణ్ణి శాప విమోచనం కోరింది.

దక్షిణకైలాసమైన శ్రీకాళహస్తిలో
సువర్ణముఖరీ నదీ తీరాన
శ్రీకాళహస్తీశ్వరుడు అనే పేరుతో నెలకొని ఉన్న నన్ను ఉపాశించి
తిరిగి నీ స్వస్థితిని పొందు అన్నాడు శివుడు.

పార్వతి తన దివ్యదేహాన్ని తక్షణం వదిలిపెట్టింది.
అది శ్రీకాళహస్తిలో ఈశ్వరసన్నిధిలో మారేడువృక్షమయ్యింది.

మానవశరీరంతో భూలోకం చేరి,
దారి తెలియక అటూ ఇటు తిరుగాడుతూ ఉంటే,
మన బుజ్జిగణపతి తల్లి చేయిపట్టుకుని శ్రీకాళహస్తిలో తపోభూమికి చేర్చాడు.
అందరికీ దారి చూపే అమ్మకు దారి చూపాడు
జ్ఞానశిశువు గణపతి.
పార్వతీదేవి తీవ్రతపస్సుతో శివానుగ్రహం సంపాదించి
శివజ్ఞానం పొంది "జ్ఞానప్రసూనాంబ" గా శివుని చెంత చేరింది.
* * *

అరుణాచలం భౌతికప్రపంచానికి హృదయం.
అనిలాచలం ఆధ్యాత్మికప్రపంచానికి హృదయం.
* * *

శ్రీకాళహస్తి దేవాలయంలోని అమ్మవారి మూలవిగ్రహం శివపంచాక్షరీ మంత్రాన్ని వింటున్నట్లుగా ఒకవైపు వంగి ఉంటుంది.
అందువలన ఈ క్షేత్రంలో అక్షరాభ్యాసాలు విశేషంగా జరుగుతుంటాయి.

ఆదిశంకరులు ఈ క్షేత్రాన్ని దర్శించి, జ్ఞానాంబ సన్నిధిలో శ్రీచక్ర ప్రతిష్ఠాపన చేశారు. పూజారులు కుంకుమార్చనలను శ్రీచక్రంపై వేసి భక్తులకు ప్రసాదంగా పంచుతారు. ఆ కుంకుమ నుదుటన ధరించినవారికి జ్ఞానప్రసూనాంబ సదా తమ వెంటే ఉన్నట్లు అనుభూతి కలుగుతుంది. తత్ఫలితంగా వారికి సకల శుభాలు కలుగుతాయి.

"కాశీలో కనుమూస్తేగానీ రాని మోక్షం కాళహస్తిలో కాలు పెడితే వస్తుంది" అన్న సామెత అక్షర సత్యం.

జ్ఞానాంబయే సద్గురువు.

జ్ఞానమే శ్రీకాళహస్తి క్షేత్రంలో అధిష్ఠానదేవతై "జ్ఞానప్రసూనాంబిక" గా జ్ఞానప్రకాశాన్ని వెదజల్లుతోంది.

ప్రపంచంలో ఎక్కడ ఏ మూల జ్ఞాని అవతరించినా
అది జ్ఞానప్రసూనాంబ జ్ఞానప్రకాశంలోని కిరణమే.

ప్రపంచంలోని అందరి జ్ఞానులకూ, అన్ని జ్ఞానాలకూ
కేంద్రస్థానం శ్రీకాళహస్తి.

ప్రతీ జ్ఞానీ జ్ఞానాంబ అవతారమే.
ప్రతీ అవతారమూ జ్ఞానాంబ అంశమే.

అటువంటి జ్ఞానావతారములలో ఒకరు - సద్గురు సుబ్రహ్మణ్యం.

* * *

అవతారం దాల్చిన ప్రతి ఒక్కటీ జగన్మాత అయిన పార్వతీ అంశమే.

అన్ని ప్రకృతులకు(స్వభావాలకు) ఆధార తత్త్వమై నిరాకార పరబ్రహ్మ స్వరూపమై ఉన్న ఆ పరమపురుషునికి అవతారం దాల్చవలసిన అవసరంగాని, అవకాశంగాని లేదు.

రంగులరాట్నానికి మధ్యభాగములో అన్ని గుర్రాల పరుగులకు ఆధారమై, అచలమై ఉన్న స్తంభం వంటివాడు పరమేశ్వరుడు.

* * *

ఊరక ఉండడం పార్వతికి తెలియదు.

కదలడం శివునికి తెలియదు.
ఇద్దరి స్పర్శతో పుట్టినవాడే జీవుడు.

జీవుడు నాణేనికి బొమ్మ బొరుసు వలె చల-అచల ప్రవృత్తులను కలిగి ఉంటాడు. అందువల్లనే జీవుడు బంధ-మోక్షముల మధ్య ఊగిసలాడుతుంటాడు.

జీవుడికి శాశ్వతమైన బంధమూ లేదు,
శాశ్వతమైన మోక్షమూ లేదు.
ఈ లీల అనంతం.
"ఎందుకు?" అన్న ప్రశ్న అనవసరం.

* * *

ఈ అనంతమైన(ఎప్పటికీ ముగింపు లేని) లీలలో భాగంగానే అమ్మ పార్వతి ఈ భువిపై అవతరించి దక్షిణకైలాసమను శ్రీకాళహస్తి పుణ్యక్షేత్రమున జ్ఞానప్రసూనాంబికయై విరాజిల్లుతోంది.

సద్గురు సుబ్రహ్మణ్యుని రూపంలో జ్ఞానప్రబోధం చేస్తూ జిజ్ఞాసువులకు జ్ఞానార్తిని తీరుస్తోంది.

* * *

సముద్రంలో కలిసేవరకు నదికి ఒడిదుడుకులతో కూడిన ప్రవాహం ఉన్నట్టు దేవునిలో కలిసేవరకు జీవునికి సుఖదుఃఖరూపంతో కూడిన సంసారం ఉంటుంది.

'దేవునికి విడిగా నాకు ఉనికి లేదు, నేను పరిపూర్ణుడను' అని జీవునికి పూర్ణానుభవం కలిగేవరకు జీవుడు పడే తపనే తపస్సు అయ్యింది.

జీవుని తపన తపస్సుగా మారడానికి ఆ దేవుని 'శక్తి' అనేక రూపాలతో ఈ భూమ్మీద అవతరించి అనుగ్రహిస్తుంటుంది.

అందులో ఓ రూపమే - సద్గురు సుబ్రహ్మణ్యం.

శ్రీకాళహస్తి క్షేత్ర అధిష్ఠాన దేవత ఐన జ్ఞానప్రసూనాంబికా దేవి సద్గురువుగా అవతరించి అనుగ్రహించిన దివ్యోపదేశ సుమాలే ఈ జ్ఞానప్రసూనాలు.

అమృతపానం చేసిన క్షణమే అమరుడైనట్లు
ఈ దివ్యగ్రంథాన్ని పారాయణం చేసిన క్షణమే ఆత్మానుభవం కలగడం తథ్యం.

* * *

సాధారణంగా పాఠకుడు గ్రంథాన్ని ఎన్నుకొంటాడు.
కానీ ఈ గ్రంథం పాఠకుణ్ణి ఎన్నుకొంటుంది.

* * *

## 4. జ్ఞానశిశువు

---

నేను శ్రీకాళహస్తి కైకాలవీధి వాస్తవ్యులైన తిరువీధుల శ్రీనివాసుల శెట్టి-సావిత్రమ్మ దంపతులకు రెండవ సంతానంగా 3-2-1970 జన్మించాను.

ఇంటిపేరు - తిరువీధుల.
కులదైవం - వేంకటేశ్వరుడు.
మా తాతగారి పేరు - నారాయణస్వామి.
మా భారతక్క నన్ను ముద్దుగా పిలిచిచే పేరు - బాబు.

అన్నీ కలిపి....తిరువీధుల వేంకట నారాయణ బాబు(T.V.N.BABU) అని నామకరణం చేశారు.

* * *

నేను తొలి నుంచి జ్ఞానప్రసూనాంబ ఉపాసకుడను. ప్రతిరోజూ సాయంత్రం 4 గంటలకు శ్రీకాళహస్తీశ్వరస్వామి దేవాలయం వెళ్లి స్వామిని, జ్ఞానాంబను దర్శనం చేసుకొనేవాణ్ణి. దక్షిణామూర్తి సన్నిధిలో ధ్యానం చేసుకొనేవాణ్ణి. గుడి నుండి వచ్చి సద్గురు సన్నిధిలో గడిపేవాణ్ణి. ఇలా చాలా ఏళ్లు కొనసాగింది.

ఓసారి స్వప్నంలో జ్ఞానప్రసూనాంబ దర్శనమిచ్చి....తన ముందున్న ప్రసాద గంగాళం నుండి కొద్దిగా ప్రసాదం తీసి ఇచ్చింది...

ఆ జ్ఞానాంబ ప్రసాదమే...ఈ సద్గురు ప్రబోధము...
అదే "జ్ఞానప్రసూనాలు" గా గ్రంథం రూపు దాల్చింది.

తొలిసారిగా అచ్చయిన "జ్ఞాన ప్రసూనాలు" పుస్తకం ప్రూఫ్ మా షాప్ లో కూర్చొని దిద్దుతూ ఉండగా... మనసులో ఓ ఆలోచన మెదిలింది.....
ఇవన్నీ సత్యవాక్కులని నాకు నేనే అనుకుంటున్నానా...?
ఇది లోకానికి అందించదగిన గొప్ప గ్రంథమేనా...?
అని పరిపరివిధాల మనసు పోతోంది....
ఇంతలో మా షాప్ కు ఓ చిన్నపాప వచ్చింది...
తోడుగా ఎవరో ఒకరు ఉండవలసిన అవసరం ఉన్నంత
చిన్నపిల్ల...ఒంటరిగా వచ్చింది....

"ఏం కావాలి?" అని అడిగా...

బాటిల్ వైపు చూపి "చాక్లెట్" అంది...

"మరి పైసా....?"

ఉత్త చేతులు చూపింది....నా వద్ద ఏమీ లేదన్నట్లు...

ఎందుకో ఒక చాక్లెట్ ఇవ్వాలనిపించింది.

ఇచ్చాను...

అసలు ఎవరినీ నీ పేరేమి? అని అడిగే అలవాటు అస్సలు లేని నేను

ఎందుకో ఆ పిల్లని నీ పేరేమి? అని అడిగా....

"జ్ఞానప్రసూన" అంది స్పష్టంగా....

అంటూ వెళ్లిపోయింది....

అదిరిపోయాను...

నేను ఆశ్చర్యంలో నుంచి తక్షణం మేలుకొని ఇటు ఇటు చూశాను...ఎక్కడా ఆ పిల్ల జాడ లేదు.

ఆహా! ఏమీ అద్భుతం....."జ్ఞానప్రసూనాలు" గ్రంథానికి జ్ఞానాంబే స్వయంగా వచ్చి ఆమోదముద్ర వేసినట్లయ్యింది...

ఆ ఒక్క అనుభూతి చాలు....
ఈ జన్మానికి అనిపించింది...

* * *

నేను రాత్రి నిద్రించే ముందు దిండుపై తల పెట్టి నిద్రపోతున్నాను....అని కాకుండా...జ్ఞానాంబ ఒడిలో తల పెట్టి నిద్రపోతున్నాను అని భావన చేసుకుని నిద్రలోకి జారుకోవడం నాకు అలవాటు.

సావిత్రమ్మ - భౌతిక శరీరానికి తల్లి.
జ్ఞానాంబ - ఆధ్యాత్మిక శరీరానికి తల్లి.

మా అమ్మగారి మరణానంతరం....సావిత్రమ్మ బిడ్డగా
కాకుండా...జ్ఞానాంబకు శిశువుగా అనగా "జ్ఞానశిశువు"గా ఉండడమే నాకిప్పుడు ఇష్టం.

* * *

నేను ఇంటర్మీడియట్ వరకే చదువుకున్నాను.
సంగీత సాధనలో పడి, చదువును దూరంచేసుకున్నాను.

కాలేజీ చదివే రోజుల్లో నేను గుడిపాటి వెంకటాచలం అభిమానిని. ఆయన వ్రాసిన పుస్తకాలను తెగ చదివేవాణ్ణి.
వారు వ్రాసిన "ఓ పువ్వు పూసింది" కథ నాకు కంఠోపాఠం. అది నాకంత ఇష్టం. ఆయన రచనల్లో అక్కడక్కడ రమణాశ్రమం, రమణ భగవాన్ ప్రస్తావన వస్తూ ఉండేది.
భగవాన్ తొలి పరిచయం చలం వల్లనే.

ఏదో చలం పుస్తకంలో భగవాన్ ఫోటో ఉంటే....అది చలం వృద్ధుడయ్యాక తీసుకున్న ఫోటో అనుకునేవాణ్ణి....

ఒకసారి గురువుగారి సతీమణి పద్మావతమ్మగారు ఆ ఫోటో
చూసి....అరె...రమణమహర్షి....అన్నారు....

వీరు చలం కాదా...! అని అడిగా ఆశ్చర్యంగా.....

కాదు బాబూ....ఆయన రమణ మహర్షి....అన్నారు.

అలా అమ్మగారే నాకు రమణుణ్ణి నాకు చూపించారు.

అదే నా తొలి రమణ దర్శనం.

* * *

నా 9 వ ఏట మా అమ్మా నాన్న శ్రీరమణాశ్రమం వెళ్లారు నన్ను మా పెదనాన్న వద్ద వదిలిపెట్టి.
ఆ రాత్రి మెలకువ వచ్చి నన్ను విడిచిపెట్టి వెళ్లిపోయారని ఎంతగా ఏడ్చానో...నాకు ఇప్పటికీ గుర్తుంది.

మా అమ్మగారు శ్రీరమణాశ్రమాన్ని దర్శించి గొప్ప ఆనందాన్ని పొందారు.
తిరిగొచ్చాక భగవాన్ గుఱించి గొప్పగా వర్ణించి చెప్పారు.
"ఆహా! యోగి అంటే అలా ఉండాలి!" అన్న అభిప్రాయం ఆ చిన్నవయస్సులోనే నాకు కలిగింది.

మా అమ్మగారు 'రమణమహర్షి' అనేవారు కాదు.
'రమణముని' అనేవారు.
గురువుగారికి చెబితే -
అవును 'అదియే సరి. మౌనియే ముని' అన్నారు.

* * *

19-5-1990 న గురువుగారు నాకు అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించారు రహస్యంగా చెవిలో.

భరద్వాజ తీర్థం వెళ్లి అక్కడ శివాలయంలో తీవ్రధ్యానం చేసేవాణ్ణి.

ఆ తీవ్రధ్యానం వలన తరచూ నేను ధ్యానించే భగవద్రూపం కలలో కనబడేది.

దానిని గొప్పగా భావించి, గురువుగారికి గర్వంగా చెప్పుకున్నాను ఓరోజు.

ఆ ప్రక్కనే పడుకుని ఉన్న కుక్కను చూపించి,
ఈ కుక్క కలలో కనబడినా కూడా అంతే...కల కలే అన్నారు.

సమాధానం తీవ్రత కలిగిందే ఐనప్పటికీ
అవగాహన చేసుకున్నాను.

అప్పట్నుంచి కలలో, ధ్యానంలో కనబడే దృశ్యాలకు
అంత విలువ ఇచ్చేవాణ్ణి కాను.

* * *

నేను కొంత ఎదిగాక-
'ఈ జీవితం కూడా కల లాంటిదే, ఉన్నట్లున్నదే' అని ప్రబోధించారు గురువుగారు.

తత్ఫలితంగా -
అతడు మహనీయుడు, ఇతడు సామాన్యుడు అనే భేదం తొలగింది నాలో సహజంగా.

* * *

నేను ఇంకా కొంత ఎదిగాక -
'జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడూ కలిపి ఓ పెద్దకల'
అని ఎఱిగిన మెలకువే నీవు. ఆ నీవు 'బాబు' కాదు.

అది 'ఏదో'
అతడు 'ఎవడో'
అదే నీవు.
అతడే నీవు.

రూపానికీ, నామానికీ...వాక్కుకూ, భావానికీ అతీతమైన అంతస్సత్యం "నేను" అని తెలుసుకుంటే చాలు నీవు ముక్తుడవే అని ప్రబోధించారు.

దాంతో నామరూపాల భావన పూర్తిగా తొలగిపోయి
కేవలం "నేను" అన్న సద్వస్తువు మాత్రమే
అనుభవంలో ఉండడం మొదలయ్యింది.

ఆ స్ఫురణ జీవనది వలె నిరంతరాయంగా ప్రవహించడం మొదలయ్యింది.

ఇంతకంటే గురువు ఏమివ్వగలరు?
ఇంతకంటే శిష్యుడు ఏమి పొందగలడు?

* * *

1992 లో "రమాదేవి"తో వివాహం.
సంతానం కలుగలేదు.

మేమిద్దరమూ బ్రతకడానికి 1993 లో ఓ చిన్న స్టేషనరీ షాప్ పెట్టించారు మా తండ్రిగారు.

పెద్దగా సంపాదన లేదు....

ఇదే మాట హిందూపురం రామాంజనేయులుగారి వద్ద అంటే-

భలేవారే...మీ కన్నా గొప్ప (ఆధ్యాత్మిక)సంపాదనపరులు ఎవరూ లేరు లోకంలో...అన్నారు.

నాకు ఇష్టమైన పుస్తకాలు చదువుకోవడానికి...
గురువాక్యాలను వ్రాసుకోవడానికి...
సాయంత్రం గురుసన్నిధిలో గడపడానికి...
అనుకున్నప్పుడల్లా అరుణాచలం వెళ్లడానికి...
మా షాప్ నాకు చాలా అనుకూలం అయ్యింది.
ఏదయినా ఉద్యోగం చేసి ఉన్నట్లయితే,
ఈ ఆధ్యాత్మిక జీవితం  ఇంతగా పండేది కాదేమో...!
ఇన్ని సద్గురు గ్రంథాలు వెలువడేవి కావేమో...!
* * *
రమణ తత్త్వం...
చలం సాహిత్యం...
ఇళయరాజా సంగీతం...
అరుణాచల ప్రదక్షిణం...
సద్గురు సత్సంగం...

నాకివన్నీ దొరకడం నా పురాకృత పుణ్యఫలంగా భావిస్తాను.

వీటన్నిటి వలన నా జన్మ పరిపుష్టం ఐనట్టుగా సంతృప్తి పొందాను.

రమణుల "ఉన్నది నలుబది" తత్త్వపరిశీలన చేస్తున్నా...

చలంగారి "ఓ పువ్వు పూసింది" చదువుతున్నా...

ఇళయరాజాగారి BGM వింటున్నా...

అరుణాచల ప్రదక్షిణంలో మాణిక్యవాచకర్ మఠం వద్ద నిలబడి అరుణాచల సౌందర్యాన్ని తన్మయత్వంతో ఆస్వాదిస్తున్నా...

సద్గురు సన్నిధిలో "వర్తమానం" గురించిన వారి ప్రబోధామృతాన్ని నిశ్శబ్దంగా శ్రవణం చేస్తున్నా...

ఆ సమయంలో -
స్వయంగా ఇంద్రుడే వచ్చి స్వర్గధామానికి ద్వారం తెరచినా సరే కాలదన్నుకునేంత రసమయానందంలో తేలియాడుతుంటాను...

వీటినే గొప్ప వ్యాసంగములుగా నా జీవితంలో  అనుభవించాను...ఇప్పటికీ ఆ రసాస్వాదనంలోనే తేలియాడుతున్నాను.

మోక్షం అంటే మరుజన్మ లేకపోవడమే ఐతే
అలాంటి మోక్షం కూడా నాకొద్దు అంటాను...
* * *

నా మనసుకు సదా ఆత్మనిష్ఠలో ఉండగలిగే శక్తీ ఉంది...

అందుండి కాస్తజారి(వెలికి వచ్చి) రసాస్వాదనం చేయగలిగే శక్తీ ఉంది...

ఆ మనసే లోపల అచలంగా-స్వరూపంగా-శివుడిగా ఉంటుంది.

ఆ మనసే వెలుపల చలనంగా-ప్రపంచంగా-పార్వతిగా ఉంటుంది.

"నేను" అర్థనారీశ్వరుణ్ణి.
* * *

ఒకే బిందువులో ద్వంద్వాలూ ఉన్నాయి...
ఒకే బిందువులో త్రిపుటులూ ఉన్నాయి...
* * *

ప్రకృతి రసాస్వాదనమే గొప్ప తపస్సు అంటారు గుడిపాటి వెంకటాచలంగారు...

అహంమూలాన్ని కనుగొనడమే గొప్ప తపస్సు అంటారు అరుణాచల రమణభగవానులు...

ఒకటి వెలుపలి సౌందర్యం...
మరొకటి లోపలి సౌందర్యం...

* * *

రమణులు అన్నట్లు-
"ఒకటే" మూడయ్యింది.
ఎప్పుడును మూడు మూడే అనుట అహంకారము.
మూడూ "ఏకం" అనుట అహంస్వరూపము.

* * *

దుఃఖం, సుఖం రెండూ దైవప్రసాదితాలే...
బంధం, మోక్షం రెండూ దైవానుగ్రహాలే...

* * *

ప్రతి కష్టంలోనూ
మన వైపు దైవం ఒక కన్ను వేసి వుంచే వుంది...
అని తెలిసినప్పుడు ఆ కష్టపరిస్థితి నుండి తెలియకుండానే దాటేయగలం.

ఏడ్వడంలో ఉన్న సుఖం ఏడ్చినవానికే తెలుసును.
బంధం కూడా మోక్షమంత సుఖమయ వారాశి.

ఏడుపు అనేది పై పొర మాత్రమే.
లోపలంతా గొప్ప సుఖం నిండి ఉంటుంది.

నవ్వు అనేది పై పొర మాత్రమే.
లోపలంతా గొప్ప దుఃఖం నిండి ఉంటుంది.

సుఖ-దుఃఖాలు గొప్ప స్నేహితులు....
ఒకణ్నే రమ్మనలేం.
ఒకణ్నే కాదనలేం.

ఒకణ్ణి పిలిస్తే ఇద్దరూ వస్తారు.
ఒకణ్ణి కాదంటే ఇద్దరూ రారు.

ఇద్దరూ కావాలంటే - సంసారం.
ఇద్దర్నీ కాదంటే - పరమపదం.

ఏకకాలంలో -
సంసారంలో ఉంటాను, పరమపదంలోనూ ఉంటాను.
వెలుపల నేను జీవుణ్ణి, లోపల నేను దేవుణ్ణి.
వెలుపల నేను సంసారిని, లోపల నేను సన్న్యాసిని.
వెలుపల నేను మనిషిని, లోపల నేను ఋషిని.

* * *

5. తొలి దర్శనం

___________

మా వీధిలో మా దాయాది అయిన  తిరువీధుల రామ్మూర్తి అనే అతనికి రెండు అద్దె ఇళ్లు ఉండేవి.
అవి పెంకుటిళ్లు.

అందులో ఒక ఇంట్లో నరసయ్య అనే అతను అద్దెకున్నాడు. విద్యుత్ శాఖలో పని చేసేవాడు.
శ్రీకాళహస్తికి ఓ అయిదుమైళ్ల దూరంలో ఉన్న కొణతనేరి అనే గ్రామంలో డ్యూటీ చేసేవాడు.

ఆ కొణతనేరి గ్రామంలోనే మన గురువుగారు ఉపాధ్యాయుడుగా పని చేస్తున్నారు.
పైగా గురువుగారి సొంతూరు కూడా అదే.
ఆ కారణంగా వారికీ వీరికీ స్నేహం కుదిరింది.

* * *

గురువుగారి తండ్రి పేరు - సిద్ధయ్య.
తల్లిగారు - విజయలక్ష్మి.
వీరికి తొలి సంతానంగా 24-8-1942 న జన్మించారు.

వీరిది వ్యవసాయ కుటుంబం.

తన  19 ఏటనే తండ్రిగారితో తనకు పెళ్లి చేయమని గొడవపడి మరీ పెళ్లి చేసుకున్నారు పద్మావతిగారిని.

వీరికి ముగ్గురు సంతానం - శంభు, కృష్ణ, యుగ.

* * *

గురువుగారి తండ్రిగారు కాలమయ్యాక, ఆ ఉమ్మడి కుటుంబం వేర్లు పోవడం...ఆర్థికపరమైన ఇబ్బందుల వలన ఇళ్లూ, పొలాలు అమ్ముకోవడం....
ఇక ఆ గ్రామంలో "నాది" అనడానికి ఏమీలేని పరిస్థితుల్లో ఆ గ్రామం విడిచి భార్యాబిడ్డలతో కలిసి శ్రీకాళహస్తిలో ఏదైనా అద్దె ఇల్లు తీసుకొని కాపురం పెడదామని నిర్ణయించుకున్నారు.
అదే విషయాన్ని తన స్నేహితుడు నరసయ్యతో ప్రస్తావించారు...

"కైకాలవీధిలో ప్రస్తుతం నేను కాపురముంటున్న ఇంటిని ఖాళీ చేసి వేరే ఇల్లు మారబోతున్నాను. కావాలంటే నీవు ఆ ఇంట్లో చేరవచ్చు...." అన్నాడు నరసయ్య.

అలా 1975 ప్రాంతంలో భార్యాబిడ్డలతో కలిసి శ్రీకాళహస్తి, కైకాలవీధిలో రామ్మూర్తి అనే ఆయనింట్లో తొలిసారిగా కాలుమోపారు గురువుగారు.

అదే తొలి సద్గురు దర్శనం.
నా వయస్సు అప్పటికి ఐదేళ్లు.

వారి రెండవ కుమారుడు కృష్ణప్రసాద్ త్వరలోనే స్నేహితుడై అతని కొరకు పోతూ వస్తూ ఉండేవాణ్ణి.

* * *

ఏవో కొన్ని పటాలు పెట్టుకుని ప్రతిరోజూ పూజ చేసుకునేవారు.
అందులో ముఖ్యంగా "నేను" అనే అక్షరాలు మాత్రమే కలిగిన పటం ఒకటి ఉండేది.
బహుశా మనకు "పరమపదం" దక్కడానికి తొలి బీజం అదేనేమో!
పటాల వద్ద తన తొలి గురువైన వీరయ్యగారి చేతికర్ర కూడా పూజలందుకోవడం నాకు గుర్తే.

* * *

గురువుగారు తన ఉపాధ్యాయవృత్తిలో కొనసాగిస్తూనే తత్త్వ సంబంధమైన వ్యాపకాలతోను, గురువులతోను కాలం గడిపే వారు.

డ్యూటీ అయ్యాక, బస్సులో దిగి రోడ్డు నుంచి ఇంటివరకు వచ్చే లోపే ఇరవై ముప్పై పావురాలు ఎదురెళ్లి తీసుకురావడం నా కళ్లారా చూశాను...

ఇంటిపట్టున ఉండే సమయాల్లో పావురాలకు గింజలు వేస్తూ కాలం గడిపేవారు.

అల్లాకు వదిలిన మేకపోతు కూడా ఒకటి వచ్చేది...
కాస్త గంజాయిని దాని నోట్లో పెట్టేవారు...అది తిని తదేకనిష్ఠతో గురువుగారి వైపు చూస్తుండేది.
* * *

ఇంటి ఆరుబయట నులక మంచం వేసుకొని నింపాదిగా సిగరెట్ కాలుస్తూ గడపడం వారికి ఇష్టమైన కార్యక్రమాల్లో ఒకటి.

అప్పుడప్పుడు మెయిన్ రోడ్డుకు ప్రక్కన జాఫర్ టీ త్రాగడం మరొక ప్రీతికరమైన విషయం.

ఈ జాఫర్ అనే అతను గురువుగారికి క్లాస్ మేట్...
అందుకే "ఒరే అయ్యోరా...!" అని పిలిచేవాడు సరదాగా.

గురువుగారు అనేవారు-
పిలిస్తే  పూర్తిగా ఒరే....అని పిలువు.
లేదా అయ్యోరా...అని పిలువు.
ఒరే అయ్యోరా...అని పిలవడం బాగాలేదు...అనేవాడు సరదాగా.
* * *

1988 నుండి నేను, నా బాల్యస్నేహితుడు దేవీప్రసాద్ ఇద్దరమూ సాయంత్రం వేళ గురువు వద్దకు వెళ్లి వారు కూర్చునే నులక మంచం పైనే కూర్చుని వారి మాటల్ని ఆశ్చర్యంగా వింటూ ఉండేవాళ్లం.

ఆ దివ్యమైన సద్గురు సత్సంగానికి అలా మేమిద్దరము తొలి సభ్యులైనాము.

* * *

గురువుగారి ఇంటికి ఆనుకుని ఓ చుట్టుగుడిసె ఉండేది. అందులో ముక్కంటి గురప్ప అనే అతను కాపురముండేవాడు, సుబ్బులమ్మ అతని భార్య. మగ్గం నేస్తుండేవాళ్లు, కోళ్ల పందేలు అంటే అతనికి ప్రియం. ఇంటి బయటే పొయ్యి పెట్టి వంట చేసుకునేవాళ్లు.

ఆ గురప్పకు, గురువుగారికి పరిచయం పెరిగి, వారి స్నేహం గురుశిష్య సంబంధంగా ఎదిగింది.

గురువుగారు గురప్పకు పంచాక్షరీ మంత్రాన్ని బోధించారు.
బహుశా ఇతనే గురువు వద్ద మంత్రం తీసుకున్న తొలి శిష్యుడై ఉండవచ్చు.

ఈ సందర్భంగా  ఈ గురు-శిష్యులకు సంబంధించిన
ఓ తమాషా అయిన ఘట్టం ఒకటి గుర్తుకొస్తోంది...

గురువుగారు నులక మంచంపై  కూర్చొని సిగరెట్ కాలుస్తూ ఉన్నారు...

ఆ ప్రక్కనే సుబ్బులమ్మ పొయ్యి మీద వంట వండుతోంది...

గురప్పగారు పొయ్యి లోకి ఎండుపుల్లలు ఎగదోస్తూ ఉన్నారు...

గురప్పగారు తటాలున ఓ ప్రశ్నను సంధించారు...

"అయ్యోరా...! మహామాయ అంటారే! అదేమి?అని.

"ఏం గురప్పా....సమాధానం అర్జంటుగా కావాలా...?"
అని అడిగారు గురువుగారు.

"అవును అయ్యోరా! ఇప్పుడే కావాలి సమాధానం..."
అన్నాడు గురప్ప.

గురప్ప ఇస్త్రీ చేసిన తెల్ల చొక్కాజేబులో నుంచి పదిరూపాయిల నోటు ఉన్నట్టు కనిపించింది గురువుగారికి...

"గురప్పా! నీ జేబులో ఎంతుంది?" అని అడిగారు గురువుగారు.

గబ గబా జేబులో నుంచి పదినోటు తీసి "పదిరూపాయిలుంది" అన్నాడు గురప్ప.

"దాన్ని నాలుగు ముక్కలుగా చించి, ఆ మండుతున్న పొయ్యిలో వేసేయ్!" అన్నారు గురువుగారు.

సుబ్బులమ్మ అవాక్కై భర్తవైపు చూస్తోంది...
ఎక్కడ అయ్యోరు మాటలు విని అన్నంత పనీ చేస్తాడో అని.
ఆ రోజుల్లో 10 రూపాయిలు 100 రూపాయిలతో సమానం.

గురప్ప పెద్దమనిషేగానీ, సుబ్బలమ్మ అంటే భయం. ఆమె కోపం వస్తే, ప్రక్కవీధివారిక్కూడా ఇట్టే తెలిసిపోతుంది.

గురప్ప ఇటు భార్య వైపు, అటు గురువు వైపు మార్చి మార్చి గుడ్లప్పగించి చూస్తున్నాడు.

మొత్తానికి  ఆ శిష్యుడు సాహసం చేయలేకపోయాడు.

వెంటనే గురువుగారు గురప్పచేతినుంచి ఆ నోటు లాక్కుని చించి పొయ్యిలో వేసేశారు.

హమ్మయ్య...అనుకుంది సుబ్బులమ్మ.
యెందుకంటే అయ్యోరు చించేశాడు కాబట్టి, మళ్లీ అయ్యోరే పదిస్తాడని నమ్మకం.

సుబ్బులమ్మ ఇంట్లోకెళ్లింది.

గురువుగారు చెప్పారు -

చూడు గురప్పా...ఆ నోటు చించితే చినిగిపోతుంది...
మంటలో వేస్తే కాలిపోతుంది...
(అంటే అంత బలహీనమైన వస్తువు అది)

ఏ శక్తి అయితే...  నీకు బలం ఉండి కూడా నీ చేత ఆ చిన్న పని చేయించలేకపోయిందో...ఆ శక్తే మహామాయ.
అర్థమైందా...?

అర్థమైంది అయ్యోరా...అన్నాడు గుటకలు మ్రింగుతూ...

* * *

ఈ గురప్ప చివర్లో నిద్దట్లోనే కన్నుమూశారు...

"అలా పోవడం ఈశ్వరుడు ఇచ్చిన వరం....అదంతా పంచాక్షరీ మంత్రజప ప్రభావం" అన్నారు గురువుగారు.

* * *

## 6. సద్గురు తత్త్వం

---

శ్రీగురుడే కన్న తల్లి, కన్నతండ్రి.
వారిని గన్నవారు అతడే.
తోబుట్టువులు, బంధువులు, మిత్రులు అతడే.
అతడే తల్లిగర్భమున పడిన నాటి నుండి రక్షకుడు.
విద్యాబుద్ధులు నేర్పిన గురువులు అతడే.
రేయంబవళ్లు వెంటనుండి తోడునీడయై మెలగినవాడు అతడే.
చేపట్టిన ఇల్లాలు, కలిగిన సంతతి అతడే.
మిత్రులు అతడే, శత్రులు అతడే.
కాలుబెట్టి నడయాడెడు భూమి, త్రాగునీరు, భుజించు అన్నము, నిప్పు, పీల్చెడు గాలి,
సకలమునకు అవకాశమైయున్న ఆకాశము శ్రీగురుడే.
అతడే సకలము నొసగిన దాత.
సర్వకాల సర్వావస్థలయందు
కష్టముల రూపమన, సుఖముల రూపమున తటస్థించువాడు అతడే.
అజ్ఞానమున గప్పియుండువాడు,
జ్ఞానమొసగి ఉద్ధరించువాడు అతడే.
అతనిని ఎరిగినవారికిని, ఎరుగనివారికిని,
నమ్మినవారికిని, నమ్మనివారికిని
సమ్మతించినవారికిని, మతించనివారికిని సకలము అతడే.
అతడు సర్వకాలములందు ఉన్నాడు.

కాలమే అతని యందు రూపొంది తన అంతము గానక కనుగొనుటకో
అనునట్లుగా పరుగిడుచున్నది.
అతడు సదా వర్తమానుడు.
అతడు సకలసాక్షి.
సకలమును అనుమతించువాడు.
ధరించి, భరించువాడు, అనుభవించువాడు,
నియమించువాడు, పాలకుడు, స్వంతమైనవాడు అతడే.
ఉండుట, ఆనందించుట అతడే.
ఉన్నది సకలము అతని ఉనికి వలన ఉన్నది.
తెలియుట సకలము అతని తెలివి వలన తెలియచున్నది.
ఆయనకు సమానుడు లేడు.
అతని కన్నా అధికుడు లేడు.
అక్కడ, ఇక్కడ, ఎక్కడా అతడొక్కడే ఉన్నాడు.
అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ అతడొక్కడే ఉన్నాడు.
అది, ఇది సకలమూ అతడొక్కడేయై ఉన్నాడు.
'నేను' అని తన నామమును ప్రకటించును.
అతడొక్కడే ఏకైక నామవాచకం.
రెండులేని, రెండవది ఎరుగని ఒకే సంఖ్య అతడు.
ఒకటి అను పరిపూర్ణ సంఖ్య అతడు.
అతడు నమ్మినవారికి సొమ్ము.
తలచినవారికి తలచినంత.
తెలిసినవారికి తెలిసినంత.
అనుభవించినవారికి అనుభవించినంత
అయి ఉన్నాడు.
అతనిని తెలుపగలవాడు, తెలియగలవాడు, అనుభవింపగలవాడు అతడే.
అన్యులనుట ఒట్టిమాట.
అతడన్నాడని అతని మాటలు వినిన ఏమి?
అతడు మన మాటలు వినవలె.
అతడిని తాకిన ఏమి? అతడు తాకవలె.

అతడిని చూచిన ఏమి? అతడు చూడవలె.
అతడిని తలచిన ఏమి? అతడు తలపవలె.
అపుడే ఫలము.
అతడే జన్మము, మరణము అతడే.
పుట్టుక ప్రశ్న, మరణము సమాధానము.
ప్రశ్న అర్థం కావడమే, అనుభవమునకు వచ్చుటే సమాధానము.
అర్థంకాని, అనుభవమునకు రాని సమాధానమే ప్రశ్న.
ప్రశ్న అతడే, సమాధానము అతడే.
సమస్య అతడే, పరిష్కారము అతడే.
సమస్య పండు, పరిష్కారము దానిలోని బీజము.
ప్రతి సమస్య గర్భములో పరిష్కారము బీజరూపమున ఉండును.
అతనిని -
నేనన్న జ్ఞానము,
నీవన్న భక్తి,
అతడే యన్న కర్మము.
నేను, నీవు, అతడు అనువాడు వాడొకడే.
అతడే శ్రీ గురుమూర్తి.
సకలమై ఉన్నది అను తెలివి అతడే.
సకలము తెలివియే అని ఉన్నది అతడే.
అనుభవమననేమి? అను భావమే అనుభవము.
తాను అను భావమే సుఖమునకు, దుఃఖమునకు అనుభవమై ఉన్నది.
సుఖిని తాను, దుఃఖిని తాను అను భావమే
సుఖానుభవము, దుఃఖానుభవము కలుగుటకు మూలము కదా!
ఔనన్నవారికి ఔను కదా!
కాదన్నవారికి కాదు కదా!
లేదన్నవారికి లేదు కదా!
విని, విననివాడు
తాకి, తాకనివాడు
చూచి, చూడనివాడు

తిని, తిననివాడు
మూచూచి, మూచూడని వాడు
శ్రీగురుడే.
అతడు తలచి తలపడు.
ఎంచి ఎంచడు.
చేసి చేయడు.
పొంది పొందడు.
శ్రీగురుడు తనను గూర్చి వేదములు పలికిన పలుకులు విని
పసిబిడ్డల చిటిపొటి పలుకులకు తల్లి మురియు చందాన మురిపెము
నొందును.
పిల్లవాండ్రు బొమ్మరిళ్లు కట్టి ఉత్తుత్తి పెండ్లిండ్లు చేసి
సంసారముల నడుపుట గని సంతసించు పెద్దవారివలె
త్రిమూర్తుల సృష్టి స్థితి లయ క్రియలకు పరవశించును.
బ్రహ్మర్షుల దేవమునుల వర్తనము లాతని మ్రోల
వడి వడి జని పడి లేచెడి బిడ్డల తప్పడుగులు గదా!
సకల మతములు అతని పంటభూముల కమతములే.
ప్రవక్తలందరూ అతని సేద్యమునకు తలకాపులు.
అనుకొనుట, అనుట, జరుపుటలు వేఱువేఱు అందరకు.
శ్రీగురునకు ఆ మూడును ఒకటియే.
జీవకేంద్రము, జగత్ కేంద్రము, బ్రహ్మకేంద్రము అను పేర్లతో
బరుగునది అతడే.
ఏకాకి, అనామకుడు, అమాయకుడు, అవ్యక్తుడు శ్రీగురుడే.
నా అనువారు, తనవారు లేనివాడు పెరవారసలే లేరు.
కనబడు సకలము అతని కలవరింత.
అనబడు సకలము అతని పలవరింత.
కలవరించువారికి, పలవరించువారికి భూతవైద్యులు కలరుగాని,
శ్రీగురునికి రక్షకట్టువారెవరు?
నిదురలో కలగనుట అందరికి పరిపాటి.
శ్రీగురుడు కలలో నిదురించును.

అతని శ్వాసము సకలమునకు విశ్వాసము.
శ్రీగురుడు మేల్కొనిన సకలము మేల్కొనును.
అతడు మరచిన సకలము మరచును నిజమిది.
అతడు మెలకువ కాదు.
నిదుర కాదు.
వాటికతడే ఆధారము.
ద్వంద్వములు అతడు కాడు.
కాకున్నను వాటికతడే ఆధారము.
త్రిపుటులు అనునవి అతడు కాడు.
కాకున్నను వాటికతడే ఆధారము.
శ్రీగురునియందు సకలము పుట్టునట్లు, ఉన్నట్లు, లీనమగునట్లు
తోచుచున్నది.
అతడే మహాప్రభువు.
సకల కారణములకు మూలకారణమతడే.
సకల చరములకు చరము.
అచరములకు అచరము.
జీవములకు జీవము.
చిత్తములకు చిత్తము.
మనసులకు మనసు.
ప్రాణములకు ప్రాణము.
బుద్ధులకు బుద్ధి శ్రీగురుడే.
శ్రీగురుడు మొదట నిర్మలము, నిశ్చలము, నిర్వికారము అయి,
అనంతమైన ఆకాశము వలె ఉన్నాడు.
అది అన్ని జగములను,
అన్నిటను మిన్నయై
ఎన్నగరాక వన్నియులు లేకున్న వెలుగై ఉన్నది.
దానిని చిదాకాశము పేర బిలుతురు.
ఉన్నది అనుట దాని స్వరూపము.
దానియందు మరుభూమిలో మరీచకల వలె మరొక ఆకాశమును పోలినది,

కలిగినది.
అది అట్టిది, ఇట్టిది అని అనరాక ఉన్న సకలమునకు తల్లియై
సకలమును తనయందు అవ్యక్తరూపమున ధరించియున్నది.
చిత్తాకాశమను పేర బరగునది ఇదేయని తోచుచున్నది.
సంకల్పముల ప్రోగే ఇది.
త్రిమూర్తులాదిగా, క్రిమికీటక పర్యంతమునకు ఇదే బీజమై యున్నది.
దీనియందు సూక్ష్మాంశ మాత్రమే తోచునదే
జాగ్రద్దశ యందు మనమనుభవించు భూతాకాశము.
దీనియందు సకల ప్రపంచములు నామరూపములు ధరించి
పంచేంద్రియముల కందుబాటులో యున్నవి.
ఒకే కేంద్రమును ఆధారముగా గొని రెండు వృత్తములున్నవి.
కేంద్రమునకు సమీప వృత్తవైశాల్యము భూతాకాశము.
రెండవ వృత్తవైశాల్యము చిత్తాకాశము.
తరువాత విస్తృతికి పరిధి అనంతము.
దానిని ఉన్నది అనికాని, లేదు  అనికాని అనుటకు వీలెట్లు?
మొదట రెండింటిని ఎట్లో తలుపవచ్చు పలుకవచ్చు.
అనంతము, ఏకము, ఏకకేంద్రమైన దానిని
తలంచుట ఎట్లు? పలుకుట ఎట్లు?
వాగాడంబరము చిదంబరమును దెలుపునా?
పలుకు, తలపులకు అందనిదగు అదే శ్రీగురుడు.

## 7. సద్గురు  ప్రబోధ సారం

---

అప్పుడే ఉదయిస్తున్న అరుణోదయ లేలేత కాంతుల వలయాల్ని,

అప్పుడే వికసిస్తున్న కమలముల యొక్క సహజ సుందరమైన కోమలత్వాన్ని

చల్లని వెన్నెల కాంతుల్ని
పసివాని బోసి నవ్వుల్ని

స్వయంగా చూసి అనుభవించాల్సిందేగాని,
ఏదో పుస్తకాల్లో ఉండే వర్ణనలను చదవడం వలన ఆ మధురానుభూతిని మనం పొందలేం.

సద్గురు బోధామృతం కూడా అచ్చంగా అలాంటిదే.

స్వయంగా తాను సద్గురు సన్నిధిలో అనుభవించే తన్మయత్వం అలాంటిదే.

ఆ సన్నిధిన గడిపిన సమయం
అది మహదానందకరమైన సమయం.

సద్గురుదేవులవారు నిరంతరం భాషిస్తూ ఉన్నప్పటికినీ అదే సమయంలో అస్సలు ఏమీ మాట్లాడని "మౌని" వలె కూడా కనబడతారు.

అంతటి గంభీరమైన ప్రశాంతత ఆ సన్నిధిలో ఆవరించి ఉంటుంది. వారిని దర్శించిన ప్రతి ఒక్కరు ఆ ప్రశాంతతను స్వరూపంగా మార్చుకుని వెళుతుంటారు.

* * *

"జ్ఞానప్రసూనాలు"లోని ప్రతి సూక్తి ఆణి ముత్యమే.
శ్రీరమణమహర్షి చెప్పిన క్లుప్తమైన జవాబుల్లాగే లక్ష పొటెన్సీ హోమియోపిల్స్ లాగే ప్రవచించారు సద్గురుదేవులవారు. ప్రత్యక్షంగా విన్నవారు ధన్యులు."
అన్నారు అన్నాజీరావుగారు(యోగవేదాంత విజ్ఞాన అకాడమీ)

ఇది నిజం.

వారి పాదాల వద్ద కూర్చొని ఆ దివ్యమైన ప్రబోధాలను వింటుంటే, చెవి నుండి హృదయానికి ఎడతెగని ఓ అమృతధార ప్రవహిస్తున్నట్లుంటుంది.
* * *

విన్న బోధనలను నేను గుర్తుపెట్టుకొని ఇంటికొచ్చాక డైరీల్లో వ్రాసి భద్రపరచేవాణ్ణి. అవే ఇప్పుడు "జ్ఞానప్రసూనాలు"గా ప్రచురింపబడుతున్నాయి.

సద్గురు వాగామృతాన్ని ప్రత్యక్షంగానే ఆస్వాదించాలి.
ఆ దివ్యవాణిని తిరిగి వ్రాసుకోవడంలో ఆ మాధుర్యం తగ్గినట్టు అనిపిస్తోంది. కారణం- అనుభవానికి మాత్రమే గోచరమయ్యే ఆ పరతత్త్వాన్ని పరిమితులు కలిగిన భాషలో ఇరికించాలని ప్రయత్నించడమే.

సద్గురు సన్నిధిలో మౌనం కూడా గొప్ప ఉపదేశంగా విరాజిల్లుతుండేది.

* * *

మబ్బుల నుండి మేడపై పడిన వర్షపు నీరు సింహపుబొమ్మ నోటి నుండి జాలువారినట్లు, విశ్వచైతన్యానికి అధిష్ఠానదేవత అయిన జ్ఞానప్రసూనాంబ తన దయాహృదయం నుండి వెలువడిన అనుగ్రహవర్షాన్ని జిజ్ఞాసువులైన తన శిశువులకు అందించడానికి ఉపయోగించుకున్న ఉపకరణమే సద్గురు సుబ్రహ్మణ్యులు.

వారి బోధల్లో ఏదైనా క్రొత్త విషయం ఒకటి వ్యక్తమైనప్పుడు-

"నేను కూడా మీతో పాటు ఇప్పుడే విన్నాను..."
"నాక్కూడా ఈ విషయం ఇప్పుడే తెలిసింది..."
అనడం కద్దు.

తన ప్రబోధాలకు తానే మొదటి శ్రోతగా ఉంటారు. నేను చెప్పాను అన్న అహం ఏ కోశానా వారిలో ఉండదు. నిత్యవ్యవహారాల్లో సైతం 'కీ' ఇచ్చిన బొమ్మలా తటస్థంగా ఉంటూ, తన పనిని తాను అలా చేసుకుంటూ వెళ్లిపోతారు. ఏ పని చేస్తున్నా, మాట్లాడుతున్నా వారి ముఖంలో చిరునవ్వు చెరగదు.

* * *

ఇలా ఉండు.
ఇలా ఉండొద్దు.

ఈ రెండు మాటలను నా గురువునోట ముప్పై ఏళ్ల ఆయనతోటి సాంగత్యంలో ఒక్కసారి కూడా వినలేదు.

"ఎవరు ఎలా ఉండాలో అలానే ఉన్నారు.
ఏ కార్యాన్ని నెరవేర్చడానికి ఈ భూమ్మీదకు వచ్చారో

అది చేసి తీరుతారు.
ఇది ఈశ్వర నియతి."

అని నిశ్చయజ్ఞానం వలన కలిగిన నిశ్చింత వారి ముఖంలో స్ఫుటంగా కనిపిస్తుంటుంది.

* * *

నేను గురువు వద్దకు చేరిన తొలి రోజుల్లో వారి ప్రబోధాలను మంత్రముగ్ధుడనై వినేవాణ్ణి.
అవి చాలా గొప్ప మాటలుగా అనిపించేవేగాని సంపూర్ణ అవగాహన అయ్యేవి కావు.
అందుకోసం మళ్లీ మళ్లీ సద్గురు సన్నిధికి వెళ్లి,
వేసిన ప్రశ్నలే మళ్లీ వేస్తుండేవాడిని.

రెండవసారి అదే ప్రశ్న వేసినప్పుడు మొదటిసారి ఇచ్చిన సమాధానం ఇచ్చేవారు కాదు. వైవిధ్యమైన సమాధానం ఇచ్చేవారు.

అటు వేదాంతపరంగానూ, ఇటు సాహిత్యపరంగానూ తెలుగు భాష యొక్క సొబగుల్ని  గురువుగారి నోట ఏకాంతంగా వినే మహద్భాగ్యం నాకు 30 సంవత్సరాలు దొరికింది.

* * *

ప్రపంచానికి హృదయం అరుణాచలం.
జ్ఞానానికి హృదయం అనిలాచలం.

అరుణాచలంలో సుబ్రహ్మణ్యుడు రమణుడుగా ఉన్నాడు.

అనిలాచలంలో రమణుడు సుబ్రహ్యణ్యుడుగా ఉన్నాడు.

* * *

ఆ అరుణాచల రమణుని తత్త్వవైభవానికి కొనసాగింపే
ఈ అనిలాచల సుబ్రహ్మణ్యగురుదేవులవారు.

రమణసన్నిధిలో ఉన్నంత శాంతి, కాంతి సద్గురు సన్నిధిలోనూ నిండి ఉంటుంది.

ఇంట్లో ఓ మూల ఉన్న పూలకుండీ నుండి వెలువడిన పరిమళం ఆ గదంతా నిండిపోయినట్లు, ప్రపంచంలో ఏ మూల ఏ మహనీయుడు గుట్టుగా జీవిస్తున్నా వారి ఉనికి లోకానికంతా శ్రేయస్కరం అవుతుంది.

వారి అనుగ్రహం ప్రతి జీవికి సమంగా పంచబడుతుంది.

అందుకే వేలమంది సంస్కర్తలు చేయలేని పనిని గుహలో కూర్చునే ఓ ఋషి నిశ్శబ్దంగా పూర్తి చేయగలడు.

సద్గురు ఉనికే లోకానికి ఆశీర్వాదం.

* * *

గురువుగారి ప్రబోధసారాన్ని ఒక్కముక్కలో
చెప్పాలంటే-

"నాతో సహా సర్వమూ నాలో ఉన్నట్లున్నది"

* * *

"నేను" ఒక్కటే సత్యము(ఉన్నది)

నామరూపాలతో కూడిన ఈ నేను,
ఈ నేనుకు ముడిపడి ఉన్న జగత్తు
మొత్తం కలిపి అసత్యమే(ఉన్నట్లున్నదే)

ఈ విషయం అర్థమైతే(అనుభవమైతే)చాలు.
ఇక తాను ఏమిగా ఉన్నా తనకేమీ ఇబ్బంది ఉండదు.
ఆ ఇబ్బంది లేని స్థితియే మోక్షము.

8. మరణించి జీవించాలి

---

రమణుల "నేనెవడను?" పుస్తకానికి, ఆ పేరు కంటే "మరణించి జీవించడమెలా?" అనే పేరే సరిగ్గా సరిపోయి ఉండేది అన్నారు గురువుగారు ఓసారి

అంతేగా...అంతేగా...

'అహం మరణమే స్వరూపదర్శనము' అన్నదే
'నేనెవడను?' అనే గ్రంథసారము.

మరణించి జీవించడం అనే అనుభవాన్నే నిజంగా జ్ఞానానుభవం అనాలి.

చరిత్రకు ఎక్కకుండా అలాంటి జ్ఞానానుభవం పొందినవారు మన చుట్టూనే తిరుగుతూ ఎంతోమంది ఉండి ఉంటారు....

అందుకే త్యాగరాజస్వామి ఒక్క మాటలో చెప్పేశారు....

ఎందరో మహానుభావులు...
అందరికీ వందనములు...అని.

ఏమో.... పక్కలో పడుకుని ఉన్న భార్య కూడా జ్ఞానవంతురాలై ఉండి ఉండవచ్చు....
చూడాల వలె...ఎవరు చెప్పగలరు?

సంతలో కుండలు అమ్మే వ్యక్తి కూడా జ్ఞానపూర్ణుడై
ఉండవచ్చు....గోరాకుంభార్ వలె...ఎవరు చెప్పగలరు?

మనకు బట్టలు కుట్టిచ్చే దర్జీ కూడా జ్ఞానపూర్ణుడై ఉండవచ్చు...
నామదేవుని వలె.

సాక్షాత్తుగా పాండురంగడే  వచ్చి కులవృత్తులనే భక్తిసాధనాలుగా మార్చుకున్న అలాంటి మహాభక్తులతో స్నేహితుడిలా మెలిగేవాడు...

జ్ఞానాన్ని కొలవడానికి థర్మామీటర్లు లేవు.
'స్వానుభవమే' థర్మా మీటరు.

నిజానికి 'పొందినవారంతా' అప్రయత్నంగా పొందినవారే...
తర్వాతివారంతా ప్రయత్నంతో పొందాలనుకునేవాళ్లే.

పొందినవారంతా అదే చెప్పారు-
'అది' అప్రయత్నంగా పొందబడుతుంది అని...
అదే నిన్ను ఆవహిస్తుందని అని...
ఊరికే ఉండు అని...

కానీ వీరు ఊరుకుంటేగా...

"దాన్ని పొందాలంటే ఏం చేయాలి?"
అన్న ప్రశ్న యుగాలపర్యంతం వేయబడుతూనే ఉంది.

వీరి మనస్సును ఊరటపరచడానికి అన్నట్టు
ప్రతి మహనీయుడూ ఆయా కాలమాన పరిస్థితులను అనుసరించి తలా ఓ మార్గాన్ని తయారుచేసి వెళ్లిపోయారు...
అవన్నీ కలిసి మోపెడయ్యాయి...

పరమహంస చెప్పినట్టు...
నీటి కోసం గుంతలు తవ్వుతున్నారేగాని,
ఒక్క గుంతనే లోతుగా తవ్వడం లేదు...

అన్ని మార్గాలనూ పుస్తకాల్లో నింపేసుకున్నారేగాని
ఏ మార్గంలోనూ చివరివరకు నడవడం లేదు...

అన్నింటిలో ఏ మార్గం గొప్పదో వివేచించడానికే జీవితం సరిపోతోంది...

ఇక తానెప్పుడు గమ్యం చేరేది?

ఊరికే ఉండండిరా బాబూ! అని రమణులు అంటే....
ఊరికే ఉండే స్థితి కలగడానికి ఏం చేయాలి? అని మళ్లీ ప్రశ్నిస్తారు...

1.నిన్ను నీవు తెలుసుకో
2.నీ లోపలికి వెళ్లు
3.ఆత్మలో స్థిరపడు

అని మళ్లీ ఏవేవో సిద్ధాంతాలు చెప్పాల్సివచ్చింది.

సరే అదయినా చేశారా....?
లేదు
అది తప్ప మిగతా అన్నీ చేశారు...
* * *

జీవించి మరణించువాడు - అజ్ఞాని.
మరణించి జీవించువాడు - జ్ఞాని.

* * *

ఈ ఒక్క ఉపదేశాన్ని ప్రపంచానికి అందించడానికే గురువుగారు
అవతరించారు ఈ భూమ్మీద...
అనేది నా ప్రగాఢనమ్మకం.

* * *

క్రీస్తు అన్నాడు...

మళ్లీ కొత్తగా పుట్టాలి....అని.

చనిపోయి మళ్లీ తల్లిగర్భంలోంచి పుట్టాలా?
అని అడిగారు శిష్యులు...

కాదు....మారుమనస్సు పొందటం....అంటారు క్రీస్తు.

మారుమనస్సు అంటే ఏమంటే-
కన్యగా ఉన్న అమ్మాయికి
వివాహం కాగానే భర్తకు భార్యగా,
ప్రసవం కాగానే బిడ్డకు తల్లిగా
స్త్రీత్వానికి పూర్ణత చేకూరడం లాంటిదే.

వ్యక్తి ఏమో చూడ్డానికి ఆమెయే...
కానీ ఆ వ్యక్తిలో పూర్ణత్వం(సఫలత) సిద్ధించి ఉంటుంది.
అలాంటి పూర్ణత్వాన్ని పొందినవారే ఋషులు...
పూర్ణత్వం అనేది బాహ్యవిషయం కాదు.

* * *

"మరణించి జీవించాలి"

ఆ స్థితి కలగడం అనేది పూర్తిగా మన స్వాధీనంలో లేని విషయమే
ఐనప్పటికీ, జిజ్ఞాసువులు మార్గం చెప్పమని అడుగుతూనే ఉంటారు
గురువులను.

వీరి పోరు పడలేక.... కర్మ-భక్తి-జ్ఞాన మార్గాలను ఏర్పరిచారు ఋషులు.

రమణులు - "నేనెవడను" అనే ఆత్మవిచారణా మార్గాన్ని బోధించారు.

వారి వారి మనస్సు పరిపక్వతను బట్టి ఆయా మార్గాలను ఎన్నుకొని ఆ మార్గంలో ప్రయాణిస్తూ ఉంటారు జిజ్ఞాసువులు.

నిజానికి
పొందినవారు చెప్పిన మార్గంలో వెళ్లి
పొందినవారు ఎవరూ లేరు చరిత్రలో.

అందుకే -

"ఏ సాధనా అవసరం లేదు" అని చెప్పిన ఏకైక మహానుభావులు - సద్గురు సుబ్రహ్మణ్యులు.

* * *

మాటల వల్ల, చేతల వల్ల తెల్లారేదేమీ లేదు.
అని తమకు తెలిసినా సరే
కొంతమంది గురువులు ఏదో చెప్పారు...
ఏదో చేశారు...
బహుశా "చెప్పడం" అనేది వారి స్వభావం అయి ఉంటుంది.

చందనంచెట్టుకు ఏ భూమి ఆధారమో
నాక్కూడా ఆ భూమే ఆధారం అని వేపచెట్టుకు జ్ఞానోదయం కలిగింది.
అంతమాత్రం చేత తనలోని చేదు గుణం పోదు.
తెలుసుకోనంత మాత్రాన చందనంచెట్టు సుగంధం పోదు.

జ్ఞానం వలన స్వభావాలు, వ్యవహారాలు తారుమారు కావు. అన్నీ యథావిధిగానే ఉంటాయి.

జ్ఞానం అంటే అవగాహన అంతే.
అదొక మార్పు కాదు.

"అవగాహన" అనేది ఒక్క సద్గురు సన్నిధిలో మాత్రమే లభ్యం.

జపాలు, తపాలు, భజనలు, సత్సంగాలు....
ఇవన్నీ secondary....

అలాంటి గురువు దొరకాలంటే -
ఈశ్వరానుగ్రహం కలగాలి.

ఈశ్వరానుగ్రహం పొందాలంటే,
మూడు రకాలైన పెట్టుబడులు పెట్టాలి...

మొదటి పెట్టుబడి - ఆర్తి.
రెండవ పెట్టుబడి - శ్రద్ధ.
మూడవ పెట్టుబడి - శరణాగతి.

ఈ మూటింటి వలన-
వ్యక్తిత్వాన్ని నష్టపోతాం.
దైవత్వాన్ని లాభపడతాం.

పావలా పోగొట్టుకుని రూపాయిని పొందినట్లుగా.
ఆ రూపాయిలో మనం పోగొట్టుకున్న పావలా కూడా అందులో ఉంటుంది పూర్ణంగా.

నది సముద్రంలో కలిసి తనను తాను పోగొట్టుకున్నట్టే కనబడుతుంది.
కానీ అది మహాసముద్రంగా మారుకుంటుంది.
అలాంటిదే ఈ శరణాగతి అనేది.

* * *

గురువుకు అన్ని చరిత్రలూ, అందరి చరిత్రలూ తెలుసు.
కానీ గురుచరిత్ర గురువుకు తెలియదు.

రామచరిత్ర వాల్మీకి వ్రాసినట్టు
కృష్ణచరిత్ర వ్యాసుడు వ్రాసినట్టు
సాయిచరిత్ర హేమాద్పంతు వ్రాసినట్టు
రమణచరిత్ర కృష్ణభిక్షు వ్రాసినట్టు
గురుచరిత్రను జ్ఞానశిశువు వ్రాస్తున్నాడు.

గురుచరిత్ర అంటే తత్త్వరచనే...
అంతేగానీ తేదీలతో కూడిన వారి జీవిత చరిత్ర కాదు.

ఆధ్యాత్మిక సాహిత్యాల్లో శాస్త్ర ప్రమాణం లేని రచన ఏదైనా ఉందంటే అది ఇదే అవుతుంది.
ఎందుకంటే నాకు ఏ శాస్త్రమూ తెలియదు...
గురుసన్నిధిలో కూర్చొని వారి నోటి నుండి జాలువారిన మాటలను మౌనంగా ఏరుకోవడం తప్ప.

ఇదంతా జ్ఞానశిశువు యొక్క కేరింతలే.
కేరింతల్లో  గ్రామర్ ఉండదు, గ్లామర్ తప్ప.

9. శ్రీ వీరయ్యగారు

---

గురువుగారి మొదటి గురువు - శ్రీ వీరయ్యగారు.

వీరబ్రహ్మేంద్రస్వామి మనవరాలు ఈశ్వరమ్మగారి శిష్యుడైన శంభుగురుస్వామి శిష్యుడే
ఈ వీరయ్యగారు.

వీరయ్యగారు పిన్నవయసులో పశువులకాపరి.
ప్రతిరోజూ ఊరు చివర్లోకి వాటిని తీసుకెళ్లి మేపేవాడు.

అక్కడే ఉన్న శంభుగురుస్వామి సమాధి వద్ద విశ్రాంతి తీసుకునేవాడు.

ఓ రాత్రి శంభుగురుస్వామి దివ్య తేజస్సుతో వెలిగి పోతూ దర్శనమిచ్చారు వీరయ్యగారికి.
రా! నా వెనుక...అని ఆదేశించారు.

శంభుగురుస్వామి సర్పరూపంలో ముందు వెళుతున్నారు.
వెనుకనే వీరయ్యగారు తన  స్వాధీనంలో లేకుండా ఆ సర్పాన్ని వెంబడించి అలా నడిచి వెళుతున్నాడు.

ఊరు చివర నీటి కొలను వద్దకు తీసుకెళ్లి,
అక్కడ సర్పరూపం పోయి, మానవరూపం దాల్చి వీరయ్యగారికి మంత్రోపదేశం చేశారు.

అప్పట్నుంచి వీరయ్యగారికి కొన్ని దివ్యశక్తులు కలిగాయి.
ఏ జాతకచక్రాలూ వేయకనే మనిషిని అలా చూడగానే వారి భవిష్యత్తు

అంతా అలా చెప్పేసేవారు.

"నీకు ఈ శక్తులెలా కలిగాయి?" అని అడిగితే -
'నా గురువు శంభుగురుస్వామి అనుగ్రహం" అన్నారు.
ఊళ్లోవాళ్లంతా నవ్వుకున్నారు.
కారణం శంభుగురుస్వామి 300 ఏళ్ల క్రితమే సమాధి అయ్యారు.
ఇప్పుడెలా నీకు గురువవుతాడు? అని హేళన చేశారు.

వీరయ్యకు పౌరుషం కలిగి సమాధి తవ్వేశారు.
ఊరిజనమంతా అక్కడకు చేరింది.
శంభుగురుస్వామి శిరోభాగం కనబడింది.
ఎగతాళి చేసినవారంతా వీరయ్యపాదాలపై పడి క్షమాపణ కోరారు.

వీరయ్య శాంతించారు.
తిరిగి సమాధి మూసేశారు.

* * *

గురువుగారి సతీమణి పద్మావతమ్మగారి బావగారే ఈ వీరయ్యగారు.

గురువుగారికి పెళ్లయిన క్రొత్తలో వారి పరిచయం కలిగి, త్వరలోనే వారు మహనీయతను గుర్తించి వారి పాదాలకు అంకితమైనారు.

"నీకు మొదటగా మగ సంతానం కలుగుతుంది.
ఆ పిల్లాడికి మా గురువుగారైన "శంభుగురు" పేరు పెట్టు అని ఆశీర్వదించారు.

వీరయ్యగారు అన్నట్టుగానే గురువుగారికి మొదటగా మగ సంతానం కలిగింది. "శంభుప్రసాద్" అని నామకరణం చేశారు.

శ్రీ వీరయ్యగారు శ్రీవిద్యోపాసకులు.
శ్రీపీఠం ఇస్తాను తీసుకో... అన్నారు.

స్త్రీని మంచి చూపుతో చూసే బుద్ధి నాకు లేదు...
అందుకు నేను అర్హుడను కాను...
మీ ఆశీర్వాదం ఒక్కటి చాలు...నాకు ఏ పీఠమూ వద్దు... అన్నారు గురువుగారు.

"అది ఎప్పుడూ ఉంటుంది" అని ఆశీర్వదించారు వీరయ్యగారు.

ఆ ఆశీర్వాదమే ఇప్పటివఱకూ నన్ను నడిపిస్తోంది అంటుంటారు గురువుగారు.

* * *

యంత్రాలు, మంత్రాలు వ్రాసిచ్చారు వీరయ్యగారు.
వాటినన్నింటినీ చింపి ఆవతల పడేశారు గురువుగారు.
'ఏం అలా చేశావు?' అడిగారు వీరయ్యగారు.
'నీలో సత్యంఉండాల, నాలో సత్యం ఉండాల...
మట్టిచ్చినా పని చేయాల...మాటిచ్చినా పని చేయాల...'
అని సమాధానమిచ్చారు గురువుగారు.

శిష్యునిలో ఉన్న సత్యనిష్ఠను చూసి ఎంతో ముచ్చట వేసింది వీరయ్యగారికి.

* * *

నా "జ్ఞానాంబ ఉపాసన" గమనించి గురువుగారు అన్నారు ఓ రోజు....

ఇది నా తొలి గురువు చేసిన శ్రీవిద్యోపాసన యొక్క ప్రభావం అన్నారు....

* * *

కానీ గురువుగారికి దేవీదర్శనం అయ్యింది ఓరోజు.
వారు నాకు స్వయంగా చెప్పిన మాటల్ని మీ ముందు ఉంచుతున్నాను...

"పార్వతి దర్శనం అయ్యింది...

ఏం వరం కావాలో కోరుకో...అన్నది.

నిన్ను అనుభవించాలని ఉంది...అన్నాను.

'నేను అమ్మను' కదా...! అన్నది.

నటించమంటావా...? అన్నాను.

ఆమె చిరునవ్వుతో నా తలపై చేయి పెట్టి ఆశీర్వదించి అంతర్ధానమయ్యింది.

* వారు అప్పుడు 'శివుడు' గా ఉన్నారనుట నిస్సందేహం.

* * *

వీరయ్యగారు ఓరోజు తనశిష్యుణ్ణి దుమ్ముమట్టిలో
కూర్చోమన్నారు...తానూ శిష్యునికి ఎదురుగా పద్మాసనం వేసుకొని
కూర్చున్నారు...
తన దోసిళ్ల నిండా మట్టి తీసుకుని శిష్యుని దోసిల నిండా పోసి,

"ఇది దుమ్ము అంటే దుమ్మే.
సొమ్ము అంటే సొమ్మే.

అని దివ్య ప్రబోధం చేశారు వీరయ్యగారు.

* * *

గురువుగారితో కలిసి శిష్యులమంతా ఓ మూడుసార్లు వీరయ్యగారి
సమాధిని దర్శించుకునే భాగ్యం కలిగింది.

అక్కడే "వీరయ్యగురువు నాకు రహస్యంగా ప్రసాదించిన ద్వాదశాక్షరీ
మంత్రాన్ని మీకందరికీ  బహిరంగంగా ఉపదేశిస్తున్నాను..." అంటూ బిగ్గరగా
ఉచ్చరిస్తూ మాకు ఆ మంత్రాన్ని అనుగ్రహించారు గురువుగారు.

ఓం హ్రీం క్లీం శివాయ బ్రహ్మణే నమః

నెల్లూరు జిల్లా సంగమేశ్వరాలయానికి దగ్గర్లో ఉన్న సూరాయపాలెం అనే
గ్రామం చివర్లో వీరయ్యగారి సమాధి ఉంది.

10. తాతగారు

---

గురువుగారికి రెండవ గురువు - తాతగారు.
హిమాలయ యోగి.

గురువుగారికి 1970 నుంచే పరిచయం ఉన్నప్పటికీ...
1975 నుండి మా వీధిలోకి గురువుగారి కోసం వస్తూ పోతుండేవారు.

ఆ చిన్నవయస్సు నుండే వారిని విచిత్రంగా చూస్తూ ఉండే వాళ్లం.

వారి నడిచే వేగం, మాట్లాడే తీరు అంత వైవిధ్యంగా ఉండేది.

తాతగారు కోయంబత్తూరు వాస్తవ్యుడైన ప్రముఖ ఇంజనీరు G.D.నాయుడుగారి దాయాది.

తాతగారి తల్లిదండ్రులకు పిల్లలు పుట్టి, పోతుంటే....

పుట్టినబిడ్డను ఏ సన్న్యాసికైనా దానమిచ్చి తీసుకుంటే బ్రతుకుతారని నమ్మకం...

అలాగే చేశారు ఓ బిడ్డను...

వారే తాతగారు.

ఆ బిడ్డను ఆ సన్న్యాసికివ్వడం ఏ శుభలగ్నాన జరిగిందోగాని ఆ బిడ్డ నిజంగానే సన్న్యాసి అయిపోయాడు.

తిరిగి ఆ బిడ్డ తల్లిదండ్రుల వద్దకు చేరనేలేదు.

దత్తుకు తీసుకున్న ఆ సన్న్యాసి చరమదశలో...
ఓ జత కాషాయదుస్తులు తీసి ఆ పిల్లవాని చేతిలో పెట్టి,
"ఇదే నా ఆస్తి...ఇది తప్ప నీకివ్వడానికి  నా వద్ద ఏమీలేదు..." అని అన్నారు.

ఆ పిల్లవాడు అదే మహద్భాగ్యంగా తీసుకుని కళ్లకద్దుకుని ఆ కాషాయాన్ని ధరించారు.

అంతే అప్పట్నుంచి తాతగారు ఆ చిన్న వయసు నుంచి చరమాంకం వరకు సన్న్యాసిగానే జీవించి, తనువు చాలించారు.
* * *

వాడు(GD.నాయుడు) విజ్ఞాని అయ్యాడు.
నేను జ్ఞాని అయినాను.

అని మన గురువుగారితో అన్నారు తాతగారు.
* * *

తాతగారు 1916 లో షిరిడీ బాబాను ప్రత్యక్షంగా దర్శించారు. బాబా మధ్వా బ్రాహ్మణుడని చెప్పారు.

తాతగారు చాలా కోపిష్టి.
అందర్నీ తెగ తిట్టేవారు...దేవతలను కూడా.
జ్ఞానాంబ, కుమారస్వామి, వేమన ఈ ముగ్గురిని మాత్రం గౌరవంతో నమస్కరించుకునేవారు.

* * *

తాతగారి మాటలు, చేష్టలు తీవ్రంగా ఉండేవి.
వందేళ్ల వయసులో కూడా వారి నడక పరిగెడుతున్నట్టుండేది.

"స్వామీ...ఫలానా బాబాను దేవుడని కొలుస్తున్నారు...ఇది సరియేనా..." అని అడిగితే...

"ఏడబడిన నా కొడుకులంతా దేవుళ్లయిపోతే...అసలు దేవుడు ఏమైపోవాల స్వామీ...?"

అని తీవ్రంగా సమాధానమిచ్చారు.

సత్యం అంత కఠినంగా ఉంటుంది.
సత్యం ఎప్పుడూ జనరంజకంగా ఉండదు....
అది పిడుగు వలె పడుతుంది....
చెప్పినవాడు, వినినవాడూ ఇద్దరూ భస్మమైపోతారు....సత్యమే శేషిస్తుంది.

"స్వామీ...మీరు ఇంత కఠినంగా మాట్లాడితే...మీ వద్దకు ఎవరూ రారు...." అని అంటే....

"మనకు గుంపు అవసరం లేదు స్వామీ....
వీటన్నిటికీ సిద్ధపడి వచ్చేవాడు ఒక్కడు రానీ....
వాడొక్కడు చాలు మనకు." అన్నారు తాతగారు.

* * *

గంజాయి, సారాయి, బీడీ, టీ త్రాగేవారు.
ఏడాదికి ఒకటి రెండు సార్లు మాత్రం రెండు బిరియానీ పేకెట్ లు హోటల్ నుంచి తెప్పించుకుని ఒకటి విప్పి కాలభైరవుడికి పెట్టేవాడు. తానొకటి తినేవారు.

వీరి సంరక్షణలోనే గురువుగారు 90 రోజులు ఉపవాస దీక్ష చేశారు.

ఆ ఉపవాసం చేసే రోజుల్లో కాళ్లకు చెప్పులు లేకపోయినా సరే, వేసవి మండుటెండలో నడుస్తున్నా సరే కాళ్లు కాలేవు కావు అని గురువుగారు చాలాసార్లు  చెప్పారు.

90వ రోజు గురువుగారికి కరకరమని ఆకలేసింది.
అంటే ఆ 90 రోజుల్లో ఒక్కసారి కూడా ఆకలివేయలేదు.

సరే...ఈ ఆకలేసిన విషయం తాతగారికి చెబుదామని గబగబా వెళ్లారు.

గురువుగారు అల్లంత దూరంలో ఉండగానే..."ఆకలేసిందా...! వెళ్లి భోంచేయి..." అని అనుమతి ఇచ్చారు తాతగారు.

అక్కణ్ణుంచి త్వరత్వరగా ఇంటికెళ్లి...త్వరగా అన్నం వండమని భార్యకు పురమాయించారు...

ఆవిడ బియ్యం కడుగుతోంది...నింపాదిగా....

గురువుగారు ఆకలికి తట్టుకోలేక కడుగుతున్న ఆ తడి బియ్యాన్నే నోట్లో వేసుకుని నిమిలి తిని ఆకలి తీర్చుకున్నారు...

* * *

తాతగారు ఒక్కొక్క రోగనివారణకు ఒక్కొక్క మంత్రాన్ని వ్రాసిచ్చారు గురువుగారికి...

ఆ వ్రాసిన కాగితాలన్నింటినీ చింపి అవతల పడేశారు గురువుగారు...

"ఏం సుబ్రమణ్యం...! అలా చింపేశావు...?
అడిగారు తాతగారు.

"ఒక్కొక్క రోగానికి ఒక్కొక్క మంత్రం అనే విధానం నాకు నచ్చలేదు...నీ పేరు చెబితే సమస్య నివారింపబడాలి...అంతే...అన్నారు గురువుగారు.

తాతగారు శిష్యుని భక్తికి మెచ్చి-
అలాగే సుబ్రమణ్యం...సమస్య తీరే అవకాశం ఉన్నవాడే నీ గడప దాటి రాగలడు...అని వరమిచ్చారు తాతగారు.

* * *

ఏ అర్హతా లేకపోయినా నన్నెందుకు అనుగ్రహించావు? అని మన గురువుగారు తాతగారిని అడిగితే -
తాతగారు చెప్పిన అద్భుతమైన సమాధానం-
"నా ఇష్టం".

* * *

శ్రీకాళహస్తిలో యెప్పుడూ 8 మంది అవధూతలు తిరుగాడుతూ ఉంటారని తాతగారు చెప్పారు.

అందులో ఒకరు - అవధూత గోపాలస్వామి.

* * *

ఓ అర్ధరాత్రి గురువుగారికి విపరీతమైన ఆకలి వేసింది...

ఎప్పుడూ తనకు అలా ఆ సమయంలో ఆకలి వేయలేదు...ఎందుకిలా....!! అని ఆశ్చర్యపోతూ చొక్కా వేసుకొని బజార్ లోకి వెళ్లారు....రోడ్డు ప్రక్కన ఉన్న చెట్టుక్రింద అవధూత కూర్చుని ఉన్నారు...నన్ను దగ్గరకు రమ్మని పిలిచారు...గురువుగారు వారి దగ్గరకు వెళ్లారు.... నాకు ఆకలిగా ఉంది...తినటానికి ఏదైనా తీసుకురండి...అని అడిగారు...గురువుగారు టీకొట్టుకెళ్లి తానొక టీ త్రాగి...అవధూతకు టీ, బ్రెడ్ తీసుకెళ్లి ఇచ్చారు...అది తింటూ అవధూత అడిగారు..."భగవంతుడంటే ఎవరో తెలుసా?...."
"తెలియదు" అన్నారు గురువుగారు....
"భగవంతుడంటే.....భగవంతుడంటే....భగవంతుడంటే భగవంతుడే" అన్నారు బిగ్గరగా నవ్వుతూ...

నిజమే...ఆకాశంతో పోల్చదగినది ఏదైనా ఉందంటే అది ఆకాశమే కదా!

అప్పుడే అర్థమైంది గురువుగారికి ఆ అవధూత ఎంతగొప్ప జ్ఞానస్థితిలో ఉన్నారో అనేది.

* * *

ఓ వేసవికాలం...మిట్ట మధ్యాహ్నం ....ఏటి గట్టున...కాగుతున్న ఇసుకలో పడుకుని ఉన్నాడు అవధూత గోపాలస్వామి...

నదీస్నానానికని ఆ దారినే వెళుతున్న తాతగారు ఆ దృశ్యం చూసి - "ఏం గోపాలా....పరీక్ష వ్రాస్తున్నావా?" అంటూ వెళ్లిపోయారు...

అంటే...నేను అవధూతను అయ్యానా లేనా? అని ఎండలో పడుకుని పరీక్షించుకుంటున్నావా? అని అడగడమన్నమాట...

* * *

ఓసారి ఓచోట ఓ పీఠాధిపతి పల్లకీలో వెళుతున్నారు....
"ఏంస్వామీ....ఎక్కడకి పోతున్నారు...కాటికా...?" అని అడిగారు తాత.
వారి శిష్యులకు కోపం వచ్చి ఏదో చేయబోయారు...పీఠాధిపతి వారించారు...
"మీరు పల్లకీని ముందుకు పోనిచ్చండి...." అన్నారు.

నిజమే....అందరి ప్రయాణాలూ కాటికే కదా....

* * *

మరణించి, తిరిగి లేచినవారు
క్రీస్తు, రమణులు...మనకు చరిత్రలో కనిపిస్తారు.

మరొకరు కూడా ఉన్నారు... తాతగారు.

ఈ విషయం స్వయంగా గురువుగారే నాకు చెప్పారు...

తాతగారికి తన 30వ యేట మరణానుభవం కలిగి, తిరిగి తీగలోకి కరెంటు ప్రవహించినట్లు
శవమైపోయిన శరీరంలోకి చైతన్యం ప్రహించినట్లు...చెప్పారు.

ఆ వయస్సులో ఉన్న శరీరపు నిగారింపే వందేళ్లు నిండాక కూడా ఆ నిగారింపు అలానే ఉందని పలుమార్లు గురువుగారు నాకు చెప్పి ఉన్నారు...

1990 అక్టోబర్ 18న తాతగారు శాశ్వతంగా శరీరాన్ని విడిచాక...

శరీరత్యాగం చేసిన గది(శిష్యురాలు లల్లెమ్మ గారి గది)కి వెళ్లి వారి దివ్య పాదాలను ముట్టుకుని నమస్కారం చేసుకున్నాం నేను, నా మిత్రులు, గురువుగారి కుమారులు....

తాతగారిని అటుపోతూ, ఇటువస్తూ చూడ్డమేగాని, వారిని స్పర్శించడం అదే తొలిసారి...

మరుసటి రోజు ఉదయం 9 గంటలకు వారి పార్థివశరీరాన్ని శ్మశానం తీసుకెళ్లాం...రఘుపతి రాఘవ రాజారాం...భజన చేసుకుంటూ....

వారి పార్థివశరీరాన్ని కాసేపు భుజంపై మోసే భాగ్యం కూడా నాకు కలిగింది.

శ్మశానంలో మరోసారి వారి కాళ్లను తాకి పరిశీలించాను....అది వందేళ్లు నిండిన వృద్ధుని శరీరంలా లేదు....గురువుగారు చెప్పినట్టు 30 ఏళ్ల యువకుని శరీరంలా ఉంది...

ఖనన కార్యక్రమం పూర్తయ్యాక వెంకటసుబ్బయ్య అనే భక్తుడు ఆ చోటులో గుర్తుగా ఓ కర్రముక్క గుచ్చి వచ్చారు...మరుసటిరోజు వెళ్లి పూజలు చేయటానికి....

ఆ రాత్రి కుంభవర్షం కురిసి...ఖననం చేసిన ప్రదేశం గుర్తుపట్టలేనివిధంగా అంతా జలమయం అయిపోయింది...

తాతగారు అనేవారు....మనం మరణించాక సమాధి లాంటి గుర్తులేవీ ఉండకూడదు...అని.

"మన రూపు-పేరు లోకంలో ఉన్నంతవరకు మనకు ముక్తి లేదు."అన్నారు తాతగారు.

"మన గురుపరంపర దక్షిణామూర్తి పరంపర" అన్నారు ఓ సందర్భంలో.

కాబట్టి-
మౌనమే మన భాషణం.
మౌనమే మన స్వరూపం.

* * *

జ్ఞానశిశువు
9533667918

11. పొగడ్తే ప్రమాదం

———————————

మా కొత్తపేటలో రాగిచెట్టు వీధిలో పెరుమాళ్లు  టీకొట్టు ఉండేది...

"పులిపొంగళాలు" అనే అద్భుతమైన రుచి కలిగిన బోండాలు కూడా అమ్మేవాడు...

ఎదురెదురుగా ఉండే రెండు పొడవైన బెంచీల మీద జనం కూర్చొని, ముందుగా రెండు బోండాలు తిని, తరువాత టీ త్రాగడం అనేది కొత్తపేట ప్రజలందరికీ సుపరిచతమే.

ఆ పెరుమాళ్లు కుమారుడు మురళి
నా చిన్నస్నేహితుడు, క్లాస్ మేట్...

టీ కొట్టు  ఎదురుగ్గానే మేము చదువుకున్న Elementary School ఉండేది.

ఆ స్కూల్ టీచర్లుకు చాలాసార్లు "టీ"లు మోశాం...

తాతగారు అక్కడకు టీ త్రాగడానికి వచ్చేవారు.
టీ గ్లాసు తీసుకొని ఎదురుగా అంటే స్కూల్ ప్రక్కనే కమలామేడం అనే టీచర్ గారి పెంకుటిల్లు ఉండేది...
బయట అరుగుమీద స్థిమితంగా కూర్చుని టీ త్రాగేవారు...

నాకు ఆ దృశ్యం బాగా గుర్తుంది...

ఆ కమలా మేడం కూడా మన గురువుగారికి
క్లాస్ మేట్.

కమలా మేడం ఓ రోజు అన్నది-
బాబూ! మీ గురువు సామాన్యుడు కాదు నాయనా...!
క్లాసుకు తెలుగు టీచర్ రాకపోతే ఈయనే పాఠం చెప్పేసేవాడు...
అంత చిన్నవయస్సులోనే తెలుగుభాషలో మంచి పట్టు ఉండేది...అని అన్నారామె.

* * *

ఏం జరిగిందో ఏమో...ఆ పెరుమాళ్లు కొద్దికాలానికి తాతగారికి భక్తుడయిపోయాడు...

అప్పట్నుంచి తాతగారికి Tea free...

కానీ తాతగారిది చిన్నపిల్లల మనస్తత్వం...
చిన్న పొరపాటు జరిగినా తెగతిట్టేవారు...

ఆ పెరుమాళ్లునూ అందరి ముందూ తిట్టేవాడు.
తాతగారిని గురువుగా భావించి కొలుస్తున్నారు కాబట్టి తిరిగి తాతగారిని ఏమీ అనలేక మౌనం వహించేవాడు ఆ పెరుమాళ్లు.

కాని మన గురువుగారికి మాత్రం చెప్పుకున్నారు ఓరోజు...
అందరిముందూ తిడుతున్నాడు...
నా పరువుపోతోంది...అని.

మామూలుగా పెరుమాళ్లుదే పెద్ద నోరు ఆ ప్రాంతంలో...
అందరి మీదా అరిచేవాడు, తిట్టేవాడు, అందరికీ పెరుమాళ్లు అంటే భయం.
అలాంటి పెరుమాళ్లు ఒక ముసలాడి దగ్గర తిట్లు తింటుంటే మరి పరువుపోదా?

గురువుగారు ఇలా ఓదార్చారు -
చూడు పెరుమాళ్లూ...!
తాతగారు తిట్టడం వల్ల నీ కర్మలన్నీ కాలిపోతాయ్...
దాని గుఱించి నీవేమీ బాధపడవద్దు.
తాతగారు ఎప్పుడైనా నిన్ను పొగిడితే చెప్పు...
తాయెత్తు కడతాను.
పొగడ్తే చాలా ప్రమాదం చేస్తుంది...అన్నారు.

ఆ పెరుమాళ్లు ఇంకేం మాట్లాడగలడు?
నమస్కారం పెట్టి మౌనంగా శెలవు తీసుకున్నాడు.

తాతగారు మహానిర్యాణం చెందినప్పుడు తాతగారి పార్థివశరీరాన్ని మోసిన "ఆ నలుగురు" లో పెరుమాళ్లు ఒకడు.

* * *

శ్రీకాళహస్తిలో కనకదుర్గమ్మ కొండపాదాన పాండు అనే ఒకతను ఉండేవాడు...బీడీ వ్యాపారస్తుడు...
అతను తాతగారి భక్తుడు...
ఓరోజు తాతగారికి పూజ చేసి ఓ కుర్చీలో కూర్చోబెట్టి కలర్ ఫోటో తీయించారు...
తాతగారి లైఫ్ లో అదే తొలి, చివరి ఫోటో...
ఆ సమయంలో భక్తునిపై ఉన్న ప్రేమతో ఫోటో తీసుకోవడానికి అంగీకరించారేగాని, అనంతుడైన తనను అలా ఫోటోలో, పటంలో ఇరికించడం తనక ఇష్టం ఉండదు...

తాతగారనేవారు-
లోకంలో తన పేరు, రూపు ఉన్నంతరకు ముక్తి లేదు...అని.

తనకు పేరు ఎలాగూ లేదు...
రూపం మాత్రం ఎందుకుండాలి...? అనుకున్నాడేమో...

ఓరోజు వీరావేశంతో పాండు ఇంటికెళ్లి తన పటాన్ని నేలకేసి కొట్టి ఫోటో చించేశాడు...

పాపం ఆ పాండు ప్రతిఘటించలేకపోయాడు...
తన గురువు కాబట్టి.
* * *

తాతగారు మహానిర్యాణం అయిన తర్వాత మండలారాధనను కైకాలవీధి కోమట్లవారి రామమందిరంలో చేయాలని నిర్ణయించారు...
ఆ ఫంక్షన్ కు తాతగారి పటం ఉంటే బాగుండునని గురువుగారికి అనిపించింది...

పాండు గుర్తొచ్చాడు...

గబగబా పాండు ఇంటికెళ్లారు.
పాండూ...! తాతగారు తన ఫోటో చించేసినా, నీ దగ్గర ఆ ఫోటోకు

సంబంధించిన నెగిటివ్ ఫిల్మ్ ఉండాలే... ఉందేమో చూడు....అన్నారు గురువుగారు...

ఏమో ఎక్కడ పెట్టేశానో ....వెతికి చూస్తాను ఉండండి... అంటూ చాలాసేపు వెతికారు...
ఆశ్చర్యంగా ఆ నెగిటివ్  దొరికింది..

గురువుగారు దానిని ఫోటోగ్రాఫర్ పొన్నారావు దగ్గర ఇచ్చి దానిని డెవలప్ చేసి పటం చేయించారు...

మండలారాధన రోజున ఆ పటం పెట్టి పూజ చేశారు...

తాతగారి పటానికి పూజ అదే మొదలు...

ఇక ఆ రోజు నుండి ఈ రోజు వరకు తాతగారిపటం కొన్ని వేలమందిచే పూజలందుకుంటోంది...

"జ్ఞానప్రసూనాలు" పుస్తకరూపంలో ముద్రించినప్పుడు వాటిల్లో తాతగారి కలర్ ఫోటో కూడా వేసేవాళ్లం...

అందువల్ల అసలు ఒక్క ఫోటోనే వద్దనుకున్న తాతగారి ఫోటో అలా పుస్తకాల ద్వారా కూడా కొన్ని వేల ఫోటోలు వేలమంది వద్దకు చేరిపోయాయి...

తాతగారి కళ్లు, జీవించివున్నప్పుడు ఎంత తీవ్రతతో ఉండేవో...ఇప్పుడు పటంలో చూసినా సరే ఆ తీవ్రత, ఆ రుద్రతేజస్సు మనకు స్పష్టంగా కనబడుతుంది...

నేనూ, నా స్నేహితుడు సుధాకర్ ఇద్దరం కలిసి తాతగారి ఫోటో తీయించిన పాండు ఇంటికెళ్లాం ఓ రోజు...

తాతగారి జ్ఞాపకాలను అడిగి తెలుసుకున్నాం...
మాకు టీ ఇచ్చి మరీ ఓపిగ్గా చెప్పాడు ఆ విశేషాలన్నీ....

వాటిల్లో చాలావరకు తీవ్రత కలిగినవి అయి ఉండడం వల్ల వ్యాసంలో వ్రాయలేకపోతున్నాను...

తాతగారు రుద్రాంశ...
గురువుగారు జ్ఞానాంబ అంశ...

అది తీవ్రత...
ఇది సౌమ్యత...

పాండు  చివర్లో ఓ మాటన్నాడు-
బాబూ...! వారిని ఎలా చూసుకున్నామంటే-
నా కన్నబిడ్డల్ని కూడా అలా చూడలేదు...
అంత సేవచేసుకున్నాం...అన్నారు.

* * *

మా ఆత్మీయ మిత్రుడు దొరబాబుకు తాతగారంటే పరమప్రీతి...

నిజం చెప్పాలంటే దొరబాబుకు గురువుగారి మీద ఉన్న భక్తి కంటే తాతగారి మీద ఉన్న భక్తి ఎక్కువేమో అనిపిస్తుంటుంది.

గురుసన్నిధికి వచ్చినప్పుడల్లా...గురువుగారి వద్ద తాతగారి విశేషాల్ని అడిగి తెలుసుకుంటూ ఉంటాడు....

గురువుగారు తాతగారి గురించి గంటల తరబడి అలా ఆనందంతో చెబుతూనే ఉంటారు...
దొరబాబు అలా విష్ణుమూర్తిలా చాప మీద పడుకుని వింటూ ఉంటాడు...

ఇలాంటి ఆత్మీయదృశ్యాల్ని...
ఇలాంటి గురు-శిష్య సంబంధాన్ని...

మా సద్గురు సత్సంగంలో తప్ప ఎక్కడా చూడలేం...

* * *

బాబుగారూ...! తాతగారి గురించి
ఇంకా వ్రాయండి...ఇంకా వ్రాయండి...అంటూ దొరబాబు చాలాసార్లు నన్ను కోరడం వలన వారి కోరికపై వ్రాసిందే ఈ చిన్న వ్యాసం...

దొరబాబూ...!
ఈ అక్షరలక్షలు తప్ప నీకివ్వడానికి నా వద్ద ఇంకేమీలేదు.

ఈ వ్యాసం నీకే అంకితం...

* * *

ఈ వ్యాసం పూర్తయి దొరబాబుకు పంపుతున్న సమయంలోనే దొరబాబు నాకు ఫోన్ చేసి పలకరించడం అనేది....కించిత్ ఆశ్చర్యము...బోలెడంత ఆనందము...
ఇదంతా దైవనియతి గాక ఇంకేముంది?

* * *

## 12. అయ్యోరమ్మ

---

శ్రీకాళహస్తి ప్రాంతంలో ఉపాధ్యాయుణ్ణి "అయ్యోరు" అని అంటారు.
వాని భార్యని "అయ్యోరమ్మ" అంటారు...

మన గురువుగారు Elementary School Teacher...గా పని చేసి, voluntary retirement అయ్యారు...

ఓ మారుమూల గ్రామంలో...
ఓ పదిమంది పిల్లలు మాత్రమే ఉన్న
ఓ చిన్నబడిలో...
ఓనమాలు దిద్దించే ఆ సామాన్య ఉపాధ్యాయుడు ఇప్పుడు
అసమాన్యుడైన "విశ్వగురు" అయ్యారు...
వేలాదిమంది జిజ్ఞాసువులకు "అంతిమపాఠం" చెబుతున్నారు...

* * *

గురువుగారి సతీమణి పేరు -
పుట్టినింట్లో - పద్మావతమ్మ.
మెట్టినింట్లో - సరోజనమ్మ.

అయ్యోరిని పెళ్లి చేసుకొని,
అందరికీ అయ్యోరమ్మ అయ్యింది.

వీధిలో తనదారిన తాను పోతుండేవాళ్లను కూడా పిలిచి మరీ పలకరించేది...

మాట్లాడుతున్నసేపు ఆమె ముఖంలో చిరునవ్వు నిలకడగా ఉండేది...

పేదరికంలో ఉండి కూడా
తన ముగ్గురి బిడ్డల్ని కళ్లలో పెట్టుకుని సాకిన మహాతల్లి...

భర్తను ఏనాడూ "నాకిది కావాలి..." అని అడగని సాధ్వీమణి...

భర్తగా కాకుండా ఓ గురువుగా వారికి సేవ చేసిన తొలి శిష్యురాలు...

ఇంట్లో గురువుగారు లేనప్పుడు తాతగారి లీలలు(వారి తీవ్రచర్యలు) గురించి నాకు చెబుతుండేది...

గురువుగారు దూరంగా రావడం చూచి,
ఆ......ఇట్లా అంతా చేసేవాడు ముసలాడు...
అంటూ లోపలికెళ్లిపోయేది...

ఆ గురుశిష్యులిద్దరికీ సిగరెట్ పీకలో పొగాకును తీసివేసి అందులో గంజాయి దట్టించి ఇవ్వడం అయ్యోరమ్మకు ప్రతిరోజూ అన్నం వార్చడం కంటే ముఖ్యమైన కార్యక్రమం...

తాతగారికి ప్లేట్ లో కోడిగ్రుడ్లు పొర్లింపు, ఆ ప్రక్కనే నిమ్మకాయ ఊరగాయ దబ్బ ఒకటి పెట్టి ఇచ్చేది...

వారు ఆ గంజా సిగరెట్టు త్రాగి, ఆ కోడిగ్రుడ్డు నంజుకొని తినేవారు...

తాతగారు ప్రేమయముడే...
కాని కొన్ని విషయాల్లో తీవ్రచేష్టలతో ప్రవర్తించేవారు...

వీధిలో నడిచేటప్పుడు...ఆడవాళ్లు వాకిళ్లు ఊడుస్తుంటే... ఆ దుమ్ము తనకు తగిలితే చాలు వాళ్లని నానా బూతులు తిట్టేవారు...

గురువుగారింటికి అప్పుడే వచ్చిన చుట్టాలను
పంపించేయమని ఆజ్ఞాపించేవాడు...

ఓ కుక్కపిల్ల మెడకు త్రాడుకట్టి తీసుకొచ్చి తనకు సమానంగా దానికి సేవలు చేయమనేవాడు...

గురుకుమారులను సారాయి అంగడికెళ్లి సారా సీసాతెమ్మనేవాడు...

అయ్యోరమ్మకు ఇవన్నీ నచ్చేవి కావు...
భర్త కోసం అవన్నీ భరించేది...
లోలోపల దుఃఖించేది...

మా అమ్మగారి వద్దకు వచ్చి తన బాధల్ని చెప్పుకొని ఊరట పొందేది...

తాతగారి విపరీత ధోరణులకు విసిగి గురుపుత్రుడు కృష్ణ , తాతగారిపై ద్వేషం పెంచుకున్నాడు...

తాను కాలేజీకి వెళ్లే వయస్సొచ్చేసరికి తాతపై తిరగబడడం నేర్చుకున్నాడు...

అద్దంలో దువ్వుకునేటప్పుడు,
అందులో తాతగారి ప్రతిబింబం కనబడ్డా సరే కళ్లెర్ర చేసేవాడు కృష్ణ...

తాతగారిపై తన కుటుంబం చూపే వ్యతిరేకత కూడా తాతగారిపై ఉన్న భక్తిలో భాగమే...అన్నట్లు నిమ్మళంగా ఉండేవారు గురువుగారు...

ముగ్గురు కుమారులు కూడా ఇప్పుడు ఆర్థికంగా గొప్పస్థితిలో ఉన్నారు.

తాతగారి వీపుపై ఎక్కి ఆడుకున్నవాడు యుగంధర్ ఒక్కడే (గురువుగారి మూడవ కుమారుడు).

తాతగారి ఆ దివ్యశరీరంతో  యెక్కువగా స్పర్శ పొందిన ధన్య జీవి యుగంధర్.

"మిగతా ఇద్దరి కంటే వీడి కథ వేఱుగా ఉంటుంది స్వామీ..."అన్నారట తాతగారు యుగంధర్ గుఱించి...

తాతగారి వాక్ మహిమకు తగ్గట్టే...
ఇద్దరి అన్నలకు కొండంత అండగా నిలబడి,
వారికి సంబంధించిన  ప్రతికార్యాన్ని సమర్థతతో నిర్వహిస్తుంటాడు....వారి గృహనిర్మాణాలకు సంబంధించిన కార్యమైతేనేమి... వారి అమ్మాయి వివాహాది కార్యాలు చేయడానికి సంబంధించిన కార్యమైతేనేమి...తానే ముందుండి జరిపిస్తుంటాడు యుగంధర్...

తన తండ్రిగారికి సేవ చేయడంలో ముగ్గురు కుమారుల్లో చివరివాడే ప్రథమం.

మింగే మాత్ర అయినా, తినే పాత్ర అయినా
వేళకు గురువుగారి చేతికి అందిస్తాడు యుగంధర్.

* * *

"అందరూ నీకు ఏవో మహిమలున్నాయని అంటారే...! నెల రోజులుగా కురుస్తున్న వానలతో జనాలు ఇబ్బంది పడుతున్నారు...వర్షం ఆగేట్టు చేయి చూద్దాం..." అంటూ గురువుగారికి ఛాలెంజ్ విసిరింది ఓరోజు అయ్యోరమ్మ.

గురువుగారు  తన గురువులైన వీరయ్యగారి, తాతగారి చేతికర్రలను తీసుకొచ్చి బయట మేడమెట్ల మీద వర్షంలో కాసేపు తడవనిచ్చి, తరువాత వాటిని తుడిచి మళ్లీ పూజాపీఠం మీద యథాస్థానంలో ఉంచారు.

ఆశ్చర్యం!!! వర్షం ఆ క్షణమే గీత గీసినట్టు ఆగిపోయింది... మళ్లీ వర్షం రాలేదు.

ఈ అద్భుతమైన ఘట్టాన్ని నేను ప్రత్యక్షంగా చూశాను...

* * *

సదా తాతగారి సేవలో, భర్తగారి సేవలో జీవితాన్ని గడిపిన అయ్యోరమ్మ చివరిశ్వాస విడిచే ముందు "ఒరే శివా...!" అంటూ ప్రాణం విడిచింది(14-1-1999).

ఆ రోజుల్లో నేను రమణులు స్వయంగా తెలుగులో రచించిన  'ఉన్నది నలుబది'లోని 42 పద్యాలను రోజుకొకటి చొప్పున కంఠోపాఠం చేస్తున్నాను ఒంటిపూట ఉపవాసంతో...

కానీ ఆ రోజు మాత్రం పూర్తిగా ఉపవాసం ఉండి,
అయ్యోరమ్మను భూమికి దానం చేసి వచ్చాక భోంచేశాను...

సువర్ణముఖరీ నదీ తీరంలో ఖననం చేశారు...
దానిపై కట్టడం కట్టించాడు యుగంధర్...

ఆ సమాధికి ఇప్పుడు నిత్యపూజలు జరుగుతున్నాయి...

ఇదంతా ఆవిడ తాతగారికి సేవ చేసిన పుణ్యఫలమే...అన్నారు గురువుగారు...

* * *

అమ్మగారు సమాధి అయిన కొద్దిరోజులకే కాశిరెడ్డి అనే అతను పరిచయం అయ్యారు మా సత్సంగానికి...

అంతే ఆ రోజు నుంచి తన తుదిశ్వాస వఱకు సద్గురు సేవలోనే ఉంటూ తరించి"పోయారు"...

శ్రీకాళహస్తికి ప్రక్కనే ఉన్న తిరుమంజనం వారి కండ్రిగ అనే గ్రామం నుంచి ప్రతిరోజూ సైకిల్ మీద వచ్చి గురుసేవ చేసేవాడు...

పటాలకు పూలు పెట్టడం...
అయ్యోరమ్మ సమాధికి పూజ చేయడం...
గురువుగారి అవసరాలను దగ్గరుండి చూసుకోవడం...
వచ్చిన అతిథులను ప్రేమతో ఆదరించి, వారికి బస ఏర్పాటు చేయడం...
అన్నీ మౌనంగానే చేసుకుంటూ పోయేవాడు...

సదా గురువుసేవలో ఉంటూనే...
తల్లి లేని తన ఇద్దరి కూతుళ్లను డాక్టరు, ఇంజనీరు
చేశాడు...

గురువు కంటే ముందుగా తాను ప్రాణం విడవాలని కోరుకున్న గొప్ప గురుభక్తుడు కాశీరెడ్డి.

కాశీగారు అయ్యోరమ్మను ప్రత్యక్షంగా చూడకపోయానా,
వారి సమాధికి ఏళ్ల తరబడి పూజలు చేయడం అనేది అతను ఏ జన్మలో అయ్యోరమ్మకు బిడ్డగా ఉన్నాడో...! అనిపిస్తుంది...అంత శ్రద్ధతో, నిబద్ధతతో సమాధికి పూజలు చేసేవాడు...

"మా అమ్మకు మేం ముగ్గురమే కాదు, కాశీతో కలిపి మేం నలుగురు బిడ్డలం...అన్నాడు గురుపుత్రుడు కృష్ణ నాతో ఓసారి...

అలాంటి కాశీరెడ్డి ఏదో అర్జంటు పని ఉన్నట్టు పై లోకాలకు ఎగసిపోయాడు 2020 చలికాలం.

కాశీ వెళ్లిపోయాడట కదా...అని ఒకరు గురువుగారితో అంటే,

ఎక్కడకీ వెళ్లలేదు "నా" వద్దనే నిలిచిపోయాడు...
అన్నారు గురువుగారు.

కాశిరెడ్డి నడచిన బాటలోనే వేంకటనరసయ్య, త్రిపుర మొదలైన గురుభక్తులు అయ్యోరమ్మ సమాధికి పూజలు చేసి తరిస్తున్నారు...

ఆవిడిప్పుడు అయ్యోరమ్మ కాదు...
ఆధ్యాత్మిక తాపాలను తీర్చే కామధేనువు...

అది సమాధి కాదు...
వరాలిచ్చే కల్పతరువు...

* * *

## 13. సద్గురు  దినచర్య

---

శ్రీకాళహస్తి, కొత్తపేట, కైకాలవీధిలో కాంతమ్మ అనే ఆవిడ ఇంట్లో అద్దెకు ఉండేవారు గురువుగారు....

కైకాలవీధిలోనే నాకు తెలిసి ఏడిళ్లు మారారు....
అందులో చివరిది కాంతమ్మ ఇల్లు.

వృద్ధాప్యంలో మా తండ్రిగారు మాతో ఉండడం సౌకర్యం అనే ఉద్దేశంతో వారి కుమారులు తమ సొంత ఇంటికి(LIC కాలనీకి) తీసుకెళ్లిపోయారు...

కైకాలవీధికి దూరమైపోయారేగాని....
వారి మనసంతా కైకాలవీధి వైపే ఉండేది.

అక్కడున్న గ్రామీణ వాతావరణం వలన కావొచ్చు...

అక్కడున్న శ్రీరామ మందిరం వద్ద కనబడే సంప్రదాయపు సందడి వలన కావొచ్చు...

తన గురువుగార్రైన తాతగారు గతంలో తన కోసం వస్తూ పోతూ ఉండే వీధి అనే కారణం కావొచ్చు....

తన సతీమణి పద్మావతమ్మ అంతిమయాత్ర జరిగిన చోటు అనికావొచ్చు....

తన వద్ద తాయెత్తులు తీసుకోవడం కోసం చుట్టుప్రక్కల గ్రామాలనుంచి వచ్చే గ్రామీణులపై ఉన్న దయ చేత కావొచ్చు.

బాబు, ప్రసాద్, కుమారస్వామి లాంటి ఆధ్యాత్మిక జిజ్ఞాసువులతో కాలం గడపొచ్చు అనే కారణం కావొచ్చు....

కారణం ఏదైతేనేం....

"మా నాయన కైకాలవీధికి అడిక్ట్ అయిపోయాడు...ఆయనేం జ్ఞాని!"
అని రెండవ కుమారుడు కృష్ణ కోపగించుకునేంతవరకు వారు కైకాలవీధిని వదలలేదు....

ఇప్పటికీ కైకాలవీధిని ప్రేమిస్తూనే ఉన్నారు...
నేనెప్పుడు వెళ్లినా "ఏంటి విశేషాలు?" అని అడగడం వారికి అలవాటైపోయింది.

ఆ కాంతమ్మ ఇంట్లో ఉన్నప్పుడు గురువుగారి దినచర్య ఇలా ఉండేది....

* * *

గురువుగారు ప్రతిరోజూ ఉదయాన్నే 3.30 కు నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని చన్నీళ్లతో తలస్నానము చేసేవారు.

కొయ్యతో తయారుకాబడిన చేసిన టైబుల్ పై పరివేష్ఠించి ఉన్న తన గురువుగారి పటం ముందు దీపం వెలిగించేవారు.
వారు రెండు చేతులు జోడించి నమస్కరించడం అనేది అరుదైన దృశ్యం...

తాతగారి ఆరాధన రోజు అలా నమస్కరిస్తారు తప్ప మిగతా రోజుల్లో దండాలు పెట్టడాలు అవేవీ ఉండవు...
గురువును, దేవుణ్ణి తన కుటుంబ సభ్యుల్లో ఒకరుగా ఉన్నారనేది వారి అనుభూతి.

క్రియలు లేని భక్తి వారిది.
నిశ్శబ్ధమైన భక్తి వారిది.
విభూది తీసుకొని నుదుటన అడ్డంగా మూడు పట్టీలు తీసేవారు, వెంటనే ఆ పట్టీలు ఎవరూ గుర్తించకుండా రఫ్ చేసేసేవారు.

రహస్య భక్తి వారిది.
పటాటోపం లేని భక్తి వారిది.

స్నానం చేసిన ప్రతిసారీ ఇస్త్రీ చేసిన తెల్లటి పంచె, తెల్లటి బనీయన్, తెల్లటి జుబ్బా...వేసుకునేవారు.

బయటకు వచ్చి అలా నడచుకుంటూ రోడ్డు వీధి చివర్న ఉన్న నెల్లూరు రోడ్డు మీదకు వచ్చేవారు...

రోడ్డు ప్రక్కనే ఉన్న జాఫర్ టీ అంగట్లో పొడవైన బెంచీ ఉండేది....వెళ్లి దాని మీద కూర్చోగానే....జాఫర్ వేడివేడి టీ ఇచ్చేవారు గాజుగ్లాసులో...
అది త్రాగడం పూర్తయ్యే లోపు మరో టీ ఇచ్చేవారు...
వరుసగా అలా మూడు టీలు త్రాగేవారు....
ఉదయం మాత్రమే  అలాత్రాగేవారు...
మిగతా సమయాల్లో మామూలుగా ఒక "టీ" మాత్రమే త్రాగేవారు....

ఒక సిగరెట్టు ముట్టించి అలా కాసేపు జాఫర్ తో ముచ్చట్లు....

ఆ జాఫర్ గురువుగారితో చిన్నప్పుడు తనతో పాటు చదువుకున్నవారు.

ఆ తరువాత తిరిగి తన గదికి వచ్చేసేవారు....

TV ఆన్ చేసి తమిళ ఛానెల్ లో 'స్కందషష్టి కవచం' పెట్టేవారు.

పట్టెయ్య అనే భక్తుడు ప్రతి రెండునెలలకు తూగో జిల్లానుండి వచ్చి సద్గురు సన్నిధిలో కొద్ది రోజులుండి గడిపేవారు...

వారు, నేను, నా స్నేహితుడు దేవీప్రసాదు  ఆ ఉదయం 5 గంటల సమయంలో సద్గురు సన్నిధిలో కూర్చుని మాట్లాడుకునేవాళ్లం...

అలాంటి నిశ్శబ్ద వాతావరణంలో అద్భుతమైన ఆధ్యాత్మిక వాక్యాలు గురువు నుండి మాకు దొరికేవి...

ఆ జ్ఞానవాక్యాలకు నేపథ్య సంగీతంలా స్కందషష్ఠి కవచం వస్తూ ఉంటే,

ఓ ప్రక్క పట్టెయ్య గారు స్వయంగా కాచి పెట్టిన వేడి  వేడి తేనీరు సేవిస్తూ ఉంటే,

మనసుకు ఆనందమే ఆనందం.....
అవి అద్భుతమైన ఉషోదయాలు....

7 వరకు అలా గడిపేవారం....
తరువాత గురువుగారు తన మోటారు వాహనం ఎక్కి తన మూడవ కుమారుని ఇంటికి బయలుదేరి వెళ్లేవాడు.

అక్కడ 8.30 వరకు మనవడు, మనవరాలతో గడిపి, అక్కడే టిఫన్ చేసి, తిరిగి తన గదికి బయలుదేరేవారు.

వచ్చేదారిలో ఓ టిఫన్ హోటల్లో ఇడ్లీలు వడలు  కలిపి, ఓ పది పార్శెళ్లు కట్టించుకునేవారు....
కైకాలవీధిలో ఉన్న పేదవారికి పంచిపెట్టేవారు...

9 గంటల నుండి పది వరకు విశ్రాంతి.

మధ్యాహ్నం 1 గంటకు మూడవ కుమారుడు యుగ భోజనం తీసుకొచ్చేవాడు.

సాయంత్రం 5 గంటలకు సత్సంగం  ప్రారంభమౌతుంది.
శిష్యులెవరూ ఇంకా రాక మునుపే వారు కూర్చోవడానికి చాపలు పరుస్తారు గురువుగారు...
వారు త్రాగడానికి మంచినీళ్ల చెంబు పెడతారు...
తేనీరు నింపిన ఫ్లాస్కు పెడతారు...
టీలో అద్దుకుని తినడానికి మేరీ బిస్కట్ల డబ్బా పెడతారు...

గురువులకు సేవ చేసే శిష్యులుంటారేగాని,
శిష్యులకు సేవ చేసే గురువుండడం
మా రమణసత్సంగంలోనే చూడగలం.

అంతా అయ్యాక గురువుగారు ఫ్రేం కుర్చీలో కూర్చుంటారు...
ప్రక్కనే ఓ స్టూల్ పైన విబూధిగిన్నె, సిగరెట్ ప్యాకెట్, ఓ అగ్గిపెట్టె, యాష్ ట్రే ఉంటాయి...

శిష్యులు ఒక్కొక్కరుగా వస్తుంటారు...
శిష్యుల నుదటన విబూధి పెట్టి తీర్థం ఇస్తారు...

శిష్యులు గురుపాదాలను తాకి నమస్కరించుకుని గురువు చుట్టూ పరచిన చాపలపై కూర్చుని పారాయణానికి ఉపక్రమిస్తారు...

1.అనిలాచలశివమాల
2.విష్ణుసహస్రనామం
3.గురుచరిత్రలో ఓ అధ్యాయం...
వరుసగా పారాయణం చేస్తారు.

ఆ తర్వాత ప్రసాదం తీసుకుంటారు...
ముఖ్యంగా బోండాలు, కారంబజ్జీలు, వడలు...
తర్వాత కప్పు టీ...

ఆ తర్వాత కాలభైరవులకు ఓ ఐదు బిరియానీ పేకెట్లు విప్పి పెట్టేస్తారు...
అవి తృప్తిగా భోంచేస్తాయి...

8.30 వరకు అలా పిచ్చాపాటి మాటలు...
అందులోకి రాని సబ్జక్టులు ఉండవు...
ఎప్పుడో ఒకసారి ఓ చిన్న వేదాంతభాషణం...
ఆ కొద్ది మాటలనే ఈ జ్ఞానశిశువుకు ఆహారం...
ఆ కొద్ది మాటలే వెలుగురవ్వల్లా ఉంటాయి...
ఆ వెలుగురవ్వల సమాహారమే - జ్ఞానప్రసూనాలు.

* * *

ఓ రోజు గురువుగారు సత్సంగంలో ఒంటరిగా కూర్చుని ఉన్నారు...
ఆ సమయంలో శంకరయ్య అనే టీచరు వచ్చారు...
"ఏం సుబ్రమణ్యం...! ఒంటరిగా ఉన్నావు...!" అని అన్నారు....

గురువుగారు దేవుళ్ల పటాలవైపు చూసి,
"ఏం శంకరయ్యా...! ఇంతమంది నాతో ఉంటే, "ఒంటరి" అంటావేమి?
అన్నారు.

* * *

మన సత్సంగం చరిత్రకు ఎక్కకపోవచ్చు...
ఇది అంతకంటే గొప్పది...

మన సత్సంగం ఒకరికి సర్టిఫికేట్ ఇచ్చే సత్సంగమేగాని, ఒకరి చేత సర్టిఫికేట్ పొందే సత్సంగం కాదు...

యెందుకంటే నా ఇష్టదైవమైన సుబ్రహ్మణ్యుడే శిష్యులరూపంలో ఉన్నాడనేది నా అనుభవం...

తిరునాళ్లలో తండ్రి తన బిడ్డను తన భుజాలపై ఎక్కించుకొని చూపించినట్లు, భగవంతుడు నన్ను పైన కూర్చో పెట్టి, ఆయన మాత్రం శిష్యుల రూపంలో క్రింద కూర్చుని ఉన్నాడు...
ఇది నా అనుభవం...అంటారు గురుదేవులు.

"గురుసన్నిధిలో ఉన్న శిష్యులకు గురువు అనే designation ఉండదుగాని, నిజానికి వారందరూ కూడా గురువులే" అంటారు వైజాగ్ పావనీగారు.

సత్సంగంలో ఓ గంట గడిపి వెళ్లిపోయే అతిథికి కూడా ఆ సత్సంగమనత ఏమిటో తెలిసిపోతుంది.

అంతటి పరమశాంతిని మూటగట్టుకుని తిరిగి వెళ్లగలడు తన స్వంత ఊరికి.

అరుణాచల శిఖరాగ్రం ఎక్కి, అనంతాకాశంతో మమేకమైనంత ఆనందంగా ఉంటుంది సద్గురు సన్నిధి.

అంతటి జ్ఞానసంపదను సమకూర్చుకుని తిరిగి వెళ్లగలడు తన స్వంత గూటికి(హృదయానికి).

* * *

సద్గురు సత్సంగం మిగతా సత్సంగాల్లా అంత సీరియస్ గా ఏమీ జరుగదు...

పార్కులో కలుసుకున్న స్నేహితుల్లా వయసులు మరచి, అందరూ అన్ని విషయాలూ మాట్లాడుకునేవాళ్లం....తెగ నవ్వుకునేవాళ్లం...

మళ్లీ మరురోజు సాయంత్రం 5 అయ్యే సమయం కోసమే మిగతా సమయమంతా గడుపుతున్నాం అనిపిస్తుంది.

ఆ రోజులు మళ్లీ రావు....అని అనుకుంటూ ఉంటాం ఇప్పుడు.

మా కైకాలవీధిలో 1975 నుండి 2017 వరకు
అనగా 42 ఏండ్లు గురువుగారితో నిరంతర సహచర్య భాగ్యం కలిగింది నాకు.

కారణాలు ఏవైతేనేం?
మా వీధిని విడిచి వెళ్లిపోయారు...

ప్రస్తుతం వారు గడిపిన గదిని "అత్మ్యాశ్రమం" గా మార్చుకుని, ప్రతిరోజూ నేను, మురళి, ప్రసాద్, రాఘవులు, రాజేంద్ర....మొదలైన స్నేహితులమంతా కలిసి సాయంత్రం 7.00 నుండి 8.30 వరకు అక్కడ గడుపుతున్నాము...

* * *

## 14. సద్గురు సన్నిధి

---

ఓ ఆదివారం సాయంత్రం గురుసన్నిధికి వెళ్లాము నేను, దేవీప్రసాదు.

గురువుగారు ఒంటరిగా కూర్చొని సిగరెట్ త్రాగుతూ...
తనలో తాను రమిస్తూ ఉన్నారు...

ఒకరి వల్ల భంగం అయ్యే ఏకాంతం కాదు వారిది.
మమ్మల్ని చూశారు...ఏ ప్రత్యేకభావమూ లేకుండా...

వారి సమీపంగా వెళ్లగానే మా ఇద్దరి నుదుటన విభూధి పెట్టి, తీర్థం ఇచ్చారు...

దేవీప్రసాద్ గురుపాదాలను తాకి నమస్కరించుకున్నాడు...

నేను ఎప్పుడూ వారి పాదాలను తాకి నమస్కరించిందే లేదు...

యెందుకంటే, నా జీవితమంతా వారి దివ్యపాదాల వద్దనే గడిచిపోయింది...

నా నివాసమే అది.

అందువల్ల ప్రత్యేకంగా 'నమస్కరించడం' అనే క్రియ అవసరం లేకుండా పోయింది.

నేను వారి ప్రత్యక్షసన్నిధిలో ఉన్నా లేకున్నా
సదా వారి(తత్త్వ)చింతనలోనే ఉంటాను కాబట్టి వారికి, నాకు ఎడం అనేది లేదు...

అందువల్లనే గురుసన్నిధికి రాగానే గురువుకు నమస్కరించడంగానీ,

తిరిగి వెళ్లేటప్పుడు వెళ్లొస్తానని చెప్పడంగానీ

ఒక్కసారి కూడా నా జీవితంలో
చేయలేదు....

సద్గురు సన్నిధిలోకి నిశ్శబ్దంగా ప్రవేశిస్తాను...
నిశ్శబ్దంగా నిష్క్రమిస్తాను.
* * *

నిన్న విజయవాడ నుంచి గంగయ్య అనే గెస్ట్ వచ్చారట కదా...!
అన్నాను...వారిని మన పరిధిలోకి తీసుకురావాలని...

చాలాసేపు ఆలోచించి "అవును" అన్నారు చిన్నగా...

"ఈ మధ్యకాలం నుంచి ఏ సంఘటనా పట్టుమని కొద్ది సమయం కూడా నిలవడం లేదు బాబూ...! అంతా తుడిచిపెట్టుకుపోతోంది" అన్నారు.

కానీ అది మెదడుకు సంబంధించిన మతిమరపు కాదు...

వారు సదా "ప్రస్తుత క్షణం" లో సంస్థితమై ఉండడం వలన వచ్చిన విస్మృతి అది.

వారిది సహజ సమాధి.

కళ్లు తెరుచుకునే సమాధినిష్ఠలో ఉండగలిగే అరుదైన ఋషి వారు.
* * *

మా దాయాది తిరువీధుల కేశవులు...
తత్తూరి సిద్ధయ్యగారి శ్రీరామమందిరానికి ప్రెసిడెంటు...
నాకు తెలిసి అంత చురుకైన మనిషి కాదు...
కానీ అతని ద్వారా మందిరం అద్భుతంగా పునర్నిర్మాణం జరగడం ఆశ్చర్యకరం... అన్నాను నేను.

"నిజమే" అన్నారు...

నేను ముక్కీ ముక్కీ పదవతరగతి పాసయ్యాను...
అలాంటి నా ద్వారా 27 ఆధ్యాత్మిక గ్రంథాలు తయారుకావడమూ ఆశ్చర్యకరమే అన్నాను...

"నిజమే" అన్నారు...

కాసేపాగి-

మీరు కేవలం "ద్వారా"లే తప్ప కర్తలు కారు.
"కర్త" వేరే ఉన్నాడు అన్నారు గురువుగారు.

* * *

వారి సన్నిధిలో రెండు పిల్లులు తిరుగాడుతూ ఉన్నాయి...

వారి కళ్లు వాటివైపు చక్రాల్లా తిరుగాడుతూ ఉన్నా, వాటికి ఆహారం వేసేందుకు మనసు, శరీరం కదులుతూ ఉన్నా వారు ఏమీ చేయనట్టే ఉంటారు.

వారి ఆత్మ మాత్రం అచలమై ఉందన్న విషయం అప్పుడే క్రొత్తగా వచ్చిన అతిథి కూడా ఇట్టే గ్రహించేయగలడు.

* * *

స్తబ్ధత వేఱు, జ్ఞానప్రకాశంతో ఊరికే ఉండడం వేఱు.
పైకి రెండూ ఒక్కలాగే కనిపిస్తాయి.

స్తబ్ధత అనేది , చూచేవారికి విసుగు పుట్టిస్తుంది.
కాని జ్ఞానిసన్నిధి మనల్ని అంతర్ముఖత్వానికి తీసుకెళ్లి స్వరూపనిష్ఠలో ఉండడానికి దారి చూపిస్తుంది.

* * *

దక్షిణామూర్తి చిత్రపటం ఇలాంటి జ్ఞానుల స్థితికి అది సంజ్ఞారూపం.

ఆత్మస్తుతిగా అనిపించినా సరే ఓ మాట చెప్పుకుతీరాలి.

వారి పాదాల వద్ద పరివేష్టించి ఉన్న శిష్యగణం కూడా ఋషిగణమే.

వారి ఆకారాలు, వారి పేర్లు, వారి దుస్తులు రకరకాలుగా ఉండొచ్చు....కానీ వారందరూ దక్షిణామూర్తి సన్నిధిలో పరివేష్ఠించి ఉన్న సనక సనందనాది మునులే...సందేహం లేదు.

దూరప్రాంతాల్లో ఉన్నవారు(ఇంకా గురువును ప్రత్యక్షంగా దర్శించనివారు)

అందుకు ప్రమాణం ఏమి? అని (ఫోన్ లో) అడుగుతూ ఉంటారు...

వాచా నేనేమీ నిరూపించలేను గానీ...
సద్గురుసన్నిధికి వచ్చి నిశ్శబ్దంగా కూర్చోండి...
ఆ సన్నిధే మీ ప్రశ్నలన్నింటికీ సమాధానం ఇస్తుంది....
అంటాను నేను.

* * *

15. నిత్య స్మరణీయం - 1

---

సాక్షాత్తు జ్ఞానప్రసూనాంబికా అవతారులైన సుబ్రహ్మణ్యులు
తన జ్ఞానశిశువులైన శిష్యులకు మిక్కుటమైన వాత్సల్యముతో
అనుగ్రహించిన దివ్యప్రబోధములే
ఈ జ్ఞానప్రసూనాలు.
* * *
జ్ఞానప్రసూనాలు ఒకటా రెండా...కొన్ని వేలు ఉన్నాయి...

"ఏరుకున్నవారికి ఏరుకున్నంత" అన్నారు వేంకటనరసయ్య గారు.

నిజమే....అందులో 108 ఏరి నిత్యపారాయణం చేసుకునేందుకు వీలుగా "నిత్యస్మరణీయం" అనే శీర్షికతో వ్రాయమని కొందరు జిజ్ఞాసువులు కోరగా, వ్రాద్దామని ప్రారంభించాను.....
* * *
ఈ 108 జ్ఞానసూత్రాలను ఒక్కసారి చదువగానే
వెంటనే ప్రశ్నలను సంధించకండి...
కొంతకాలం ఆ పరమవాక్యాలతో సహవాసం చేయండి...

ఈ108 జ్ఞానసూత్రాలను జీర్ణం చేసుకుంటే చాలు...
గురుతత్త్వం మొత్తం అవగావన అయినట్లే.
జీవితం ధన్యమైనట్లే.

మొదట్లో అర్థం అయినా, అవకున్నా
నిత్యపారాయణం చేస్తూ ఉండండి...
తరువాత అవే మీకు మీలోపలనుండి ఆయా సమయాల్లో
మీకు అవసరమైన సమాధానాలను అందిస్తుంది.
ఒక్కమాటలో చెప్పాలంటే...మీ అంతరాత్మయే గురువుగా
మారుకుంటుంది... మీరే సమాధానం అయిపోతారు...

ఈ చిన్ని పుస్తకం మీ చేతిలో ఉంటే...
ఇక భౌతికగురువు యొక్క అవసరం ఉండదు...
ఈ పుస్తకం నుంచే గుర్వనుగ్రహ ప్రసారం జరుగుతుంటుంది...
* * *
అమ్మ తాను తయారుచేసిన వంటను
అరచేతిలో కాస్త వేసుకుని రుచి చూసినట్టు

జ్ఞానాంబ జ్ఞానశిశువుల కోసం తయారుచేసిన
జ్ఞానపదార్థాన్ని కాస్త రుచి చూపించడం కోసం
ఈ 'నిత్యస్మరణీయం' అనే పుస్తకం తయారు చేయడం జరిగింది.

తృప్తిగా భోంచేయాలంటే మాత్రం
"సద్గురు సన్నిధి" ఒక్కటే మార్గం.
* * *

అడగండి-ఇవ్వబడుతుంది.
తట్టండి తెరువబడుతుంది.
వెదకండి దొరకబడుతుంది.
అన్నారు క్రీస్తు.

ఎవరు అడుగతారా? అని యెదురు చూసే దయామయ స్వరూపులు
గురువు.

అర్థరాత్రి సందేహం కలిగినా సరే నా తలుపు తట్టండి...
మీకు సమాధానం ఇస్తాను...అంటారు గురువుగారు.

మనల్ని మన లోపలికి త్రోసి
మనల్ని మనం వెతికేట్టు చేసి
'ఆత్మ' వస్తువు దొరికేట్టు చేస్తారు గురువు.

* * *

తల్లీ బిడ్డల దాగుడుమూతల ఆటలో
జ్ఞానాంబే సద్గురువుగా వచ్చి యెదుటపడ్డా సరే
గుర్తించలేనంత అమాయకత్వపు శిశువులు కూడా ఉంటారు....

అడగనిదే అమ్మయినా అన్నం పెట్టదు...
అనేది జ్ఞానశిశువుల విషయంలో చెల్లదు.

జ్ఞానాంబ విషయం వేఱు,
జ్ఞానశిశువుల విషయం వేఱు.

'నాకు ఆకలి' అని శిశువు నోటితో అడగకపోయినా సరే
బిడ్డ ఆకలి తీర్చే దయామయి జ్ఞానాంబ.

బిడ్డ తలుపు తట్టే అవసరం లేకుండా
యెల్లవేళలా తలుపులు తెరిచే ఉంచుతుంది జ్ఞానాంబ.

బిడ్డ వెతికివేసారిపోయి నిరాసపడేలోపే
ఇదిగో 'నేనున్నాను' అంటూ ఎదుటపడి
సంతోషపెట్టి సంతోషపడే పిచ్చితల్లి జ్ఞానాంబ.

* * *

జ్ఞానప్రసూనాంబిక దర్శనం కంటే
జ్ఞానశిశువుల దర్శనం జ్ఞానాంబకు ప్రీతికరం.

వీరి కేరింతల వలన
జ్ఞానాంబ వాత్సల్యము మిక్కుటమై
జ్ఞానక్షీరమును అపరిమితముగా వెలువరించును.

శిశువు కడుపార త్రాగి, బుగ్గలపై జాలువారిన పాలచారలు ఈ జ్ఞానవాక్యములు...ఈ జ్ఞానప్రసూనములు...

---

## నిత్యస్మరణీయం - 1

---

1.విశ్వపరిమాణం
నీ కనుచూపు పారినంత మాత్రమే.

2.నాతో సహా సర్వమూ నాలో ఉన్నట్లున్నది.

3.జాగ్రత్-స్వప్న-సుషుప్తులు మూడూ కలిపి ఓ పెద్దకల అని ఉండడమే నిజమైన మెలకువ(మోక్షం)

4.'నేను' అని, దానికి ఇంకొక్క అక్షరం కూడా చేర్చకుండా
అక్కడితో ఆగిపోతే, ఆ 'నేనే' పరమాత్ముడు.

5.'అందరూ' అంటూ ఎవరూ లేరు.
ఉండేది నీవొక్కడివే.

6.నీకు నీవు ఒక్క అడుగు ఎడంగా ఉండు.

7.ఉన్నది ఒకే వస్తువు
మాట వరుసకు కూడా రెండవ వస్తువును
అంగీకరించవద్దు.

8.ప్రతి కదలికా భగవంతునిదే.
నేను కదులుతున్నానని భ్రమపడుతున్నావు.

9.సకలమూ పరమాత్మలో ఉన్నది, పరమాత్మయే అయి ఉన్నది.
ఆ పరమాత్మ నాలో ఉన్నాడు, నేనే అయి ఉన్నాడు.

10.పుట్టువారిలో మొదటివాడను.
గిట్టువారిలో చివరివాడను.
నా ఈ రెండు కార్యముల నెరుగుటకు

నాకు ముందు వెనకలు ఎవ్వరూ లేరు.
"నేను"తప్ప.

11.నాకు జ్ఞానం, నాకు సుఖం అని కాకుండా
నేను జ్ఞానం, నేను సుఖం అని ఉండాలి.

12.కావాలి అంటే బంధం.
వద్దు అంటే మోక్షం.

13.పొందేవాడు సత్యం కాదు.
పొందబడేది దైవం కాదు.

14.నేను ఆత్మను చేరుకోవడానికి ఎంత దూరమో తెలుసా?
కుండ మట్టిని చేరుకోవడానికి ఎంత దూరమో అంత దూరం.

15.ఏ మనస్సయితే సకలాన్ని త్రోసివేస్తుందో
ఏ మనస్సయితే సకలాన్ని తనలో ఇముడ్చుకుంటుందో
ఆ మనస్సే బ్రహ్మము.

16.సాకారుడైన భగవంతుడే భక్తుడు.
నిరాకారుడైన భక్తుడే భగవంతుడు.

17.తనలోనే పుట్టి, ఉండి, తనలోనే నశించే
ఆలోచన వంటిది ఈ దేహం, ఈ ప్రపంచం.

18.శిష్యునికి గురువున్నాడు. గురువుకు శిష్యుడుండడు.
భక్తునికి భగవంతుడున్నాడు. భగవంతునికి భక్తుడుండడు.
అజ్ఞానికి జ్ఞాని ఉన్నాడు.
జ్ఞానికి అజ్ఞాని ఉండడు.

19.స్మరణ వలన లభించేవాడు కాడు పరమాత్ముడు.
పరమాత్ముడు లభించిన తర్వాత కలిగే కదలికే స్మరణ.

20.తానై సంసారాన్ని పట్టుకుని ఉంటే తాను సంసారి.
సంసారం తనను పట్టుకుని ఉంటే తాను సన్న్యాసి.

తాను భగవంతుణ్ణి తలిస్తే తాను భక్తుడు.
భగవంతుడు తనను తలిస్తే తాను ముక్తుడు.

21.ప్రతి నది గమ్యం సముద్రం.
ప్రతి జీవి గమ్యం దైవం.

22.నా పూర్వ పూర్ణస్థితియే నా పూర్వజన్మ.
ఆ మరచినస్థితిని జ్ఞప్తికి తెచ్చుకోవడమే మరుజన్మ.

23.ఇక్కడ నుంచి అక్కడకు వెళ్లాలి అనుకోవడం సాధన.
అక్కడ నుంచే ఇక్కడికి వచ్చాము అని ఉండడం సిద్ధి.

24.ఎవరూ లేకపోవడమే దేవుడు ఉండడం.
ఏమీ తెలియకపోవడమే దేవుణ్ణి తెలియడం.
ఏ అనుభవమూ లేకపోవడమే దైవానుభవం.

25.జగన్నాటక రచయిత, ప్రవక్త, నటీనట సమూహము,
నేపథ్యము, ప్రదర్శకుడు, ప్రేక్షకులు, సూత్రధారి, నిర్మాత
సకలమూ భగవంతుడే.
సర్వశక్తుడు కదా! విమర్శకుడు కూడా అతడే.

26.నామము, రూపము, పదము, అర్థము, ఉనికి, జ్ఞానము, అనుభవము
అన్నిటి లక్ష్యమై ఉన్న ఏకైక స్ఫురణ "నేను".

27.దేవుడిలా ఉండే శక్తి నాకు లేదు.
దేవుడికి నాలా ఉండే శక్తి ఉంది.
నేను దేవుడవ్వాలనుకోవడం - సాధన.
దేవుడు నాలా ఉన్నాడని ఉండడం - సిద్ధి.

28.తనను మినహాయించి జగత్తును చూస్తే తాను జీవుడు.
తనతో కలిపి జగత్తును చూస్తే తాను దేవుడు.

29.నీవు ఎలా ఉండాలో అలానే ఉన్నావు.
ఈ ప్రపంచం ఎలా ఉండాలో అలానే ఉన్నది.
మార్పు తేవలసిన అవసరం ఎప్పుడూ, ఎక్కడా లేదు.
సృష్టిలో ప్రతీది దేనికది సహజంగా, పూర్ణంగా ఉన్నది.

30.నీకు ఇష్టమున్నా లేకున్నా
నీవు అంగీకరించినా, అంగీకరించకపోయినా
దైవమే నీవు.

31.ఇహపరాలకు సంబంధించిన సకలసమస్యలకు
ఒక్కటే పరిష్కారం-
నీవు పుట్టక ముందు లేదా నీవు మరణించాక
ఉన్నస్థితిలో నీవుండడం.

32.అన్నిటికీ సిద్ధపడి ఉండడమే సిద్ధి.

33.సక్రమమైనా అక్రమమైనా అది ఈశ్వరేచ్ఛ అంతే.

34.ముందు దేవుడు నిన్ను ధ్యానిస్తాడు.
ఆ తర్వాతే నీకు దేవుని ధ్యానించాలని తలంపు కలుగుతుంది.

35.జనన మరణాలు ఉండేది 'నాది'కి.
'నేను'కు కాదు.

36.జగద్రూపంగా ఉన్నది సద్గురువే.
జగత్తులో ఏ ఒక్కడు మాత్రమే సద్గురువు కాడు.

37.మనం పదిమంది ఉంటే, పదకొండవవాడు కాదు భగవంతుడు.
మన పదిమంది రూపాల్లో ఉండేది భగవంతుడే అని తెలుసుకొంటే అదే
భగవత్సాక్షాత్కారము.

38."తలంపులను అణచి ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవాలి" అని
యెందుకు భావించడం?
ఇది చాలా శ్రమతో కూడిన సాధన.
"తలంపురూపంగా ఉన్నది ఆత్మయే" అని తెలుసుకొంటే తర్వాత
తలంపులు వచ్చినా తలవనివాడివే అవుతావు.

39.ఒకటి యెప్పుడూ రెండు కాలేదు, కాదు.

40.ఆధ్యాత్మికం లాభనష్టములు లేని వ్యాపారం.
అని ఎఱుగడమే గొప్ప లాభం.

41.జ్ఞాని పుడతాడు, తయారుకాడు.

42.ఇతరాన్ని చూసినప్పుడు తననే చూసినట్టుండాలి.
తనను చూసినప్పుడు ఇతరాన్ని చూసినట్టుండాలి.

43.ఉన్నదానిని ఉన్నట్లుగా, ఒకటిని ఒకటిగా, దానినే అదిగా, తననే తానుగా అనుభవించడమే ఆత్మానుభవము.

44.తల్లిదండ్రులను మనం పొందటం కాదు,
తల్లిదండ్రులే మనల్ని పొందారు.
దేవుణ్ణి మనం పొందటం కాదు,
దేవుడే మనల్ని పొందాడు.

45.చూడబడేదంతా - మాయ.
చూచేవాడు - దైవం.

46.లేకనే ఉన్న తాను
లేకుండాపోవడమే
ఆత్మవిచారఫలం.

47.దేవుడు యెలా ఉంటాడు?
అచ్చం నీవలె ఉంటాడు నీవెవరివో విచారిస్తే.

48.నన్ను అంటుకొనునది ఏదియు లేదు.
నేను అంటుకొనుటకు ఏమియు లేదు.
నేను ఏ విధమైన అంటులేనివాడను.
అను అనుభవరూపమైన నా స్థితియే
నేను స్థితి(స్వస్థితి).

49.తెలియనివాడికి దేవుడే లేడు.
తెలిసినవాడికి తానే లేడు.

50.నేను ఎవరో ఒకరుగా, ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో అక్కడ, ఎలాగో ఒకలాగు ఉన్నాను.
ఇక బాధేముంది?

51.మోక్షము కలదని ఉండుట బంధము.
బంధము లేదని ఉండుట మోక్షము.

52.దేనినయినా సరే వదలగలిగి వదలకుండా ఉండు.
దాటగలిగి దాటకుండా ఉండు.

53.అందరూ "ఒక్కడి"లో ఉన్నారు.
ఆ "ఒక్కడు" అందరిలో ఉన్నాడు.

54.ప్రపంచాన్ని ప్రపంచంగా చూస్తే - బంధం.
ప్రపంచాన్ని బ్రహ్మంగా చూస్తే - మోక్షం.

55.నిజాయితీపరుడు, మోసగాడు ఇద్దరూ స్వతంత్రులు కారు.
త్రిమూర్తులతో సహా ప్రతి ఒక్కరూ వివశులై ప్రవర్తిస్తున్నారు.

56.సుఖదుఃఖములు రెండూ లేనివాడే
నిజమైన సుఖి.

57.నీతో నీవు ఉండు.
నీవుగా ఉండొద్దు.

58. ఉన్నది పోదు
లేనిది రాదు.

59.జీవిత లక్ష్యం జీవించడమే.

60.అవిశ్వాసియే సాధన చేస్తాడు.
విశ్వాసి ఊరక ఉంటాడు.

61.ఏకవస్తువుగా తన్నెఱిగి ఆనందించుటయే యోగము.

62.జ్ఞానికి జీవితమొక అభినయం.
అన్యులకది అనుభవం.

63.తాను వెదకే దేవుడు
తనలోనే ఉన్నాడు,
తానుగానే ఉన్నాడు.

64.మన అవసరాలకు భగవంతుడు అని కాకుండా
భగవంతుడే మన అవసరంగా ఉండాలి.

65.ఎవడు నేనుగా ఉన్నాడో వాడే నేను.

66.దేవుని విషయమై ప్రస్తావన జరుగువేళ
అది తనను గురించిన ప్రస్తావనగా అనిపించినప్పుడు
దానినే స్వానుభవమనదగును.

67.జీవించయినా, మరణించయినా నేనుంటాను
అని ఉన్నవాడు మృత్యుంజయుడు.

68.బ్రతికి చచ్చువాడు - అజ్ఞాని.
చచ్చి బ్రతుకువాడు - జ్ఞాని.

69.జగత్తులో నేనున్నాననుట ఐహికము.
జగత్తుగా నేనున్నాననుట ఆముష్మికము.

70.చలనానికి ఏ శక్తి అవసరమో
నిశ్చలానికి కూడా అదే శక్తి అవసరం.

71.ప్రపంచాన్ని చూడు, ప్రపంచంగా చూడొద్దు.

72.శ్వాస ఆగితేనే నిద్ర వచ్చేది.
తిరిగి శ్వాస కదిలితేనే మెలకువ వచ్చేది.

73.ఉన్నదేదో అది
ఇప్పుడే ఉంది, ఇక్కడే ఉంది.
తనలోనే ఉంది, తానుగానే ఉంది.

74.అనంమైన వృత్తవైశాల్యంలో ఉన్న ప్రతి బిందువూ కేంద్రమే.
అనంతమైన విశ్వచైతన్యంలో ఉన్న ప్రతి అణువూ దైవమే.

75.కాశీని చూడడానికి వెళ్లవచ్చు.
విశ్వేశ్వరుని కోసం వెళ్లకూడదు.

76.తనువులో తానుంటే బంధం.
తనలో తనువుంటే మోక్షం.

77.ప్రయత్నం ఆగినప్పుడు పొందడం జరుగుతుంది.
చూసేవాళ్లకు ప్రయత్నం వలన పొందినట్టు కనిపిస్తుంది.

78.మాయ అంటే నామరూపాలు.

79.గడచిన క్షణం వరకు జరిగినదంతా దైవసంకల్పమే.

80.అణువుకు, తనువుకు, జగత్తుకు కేంద్రం ఒక్కటే.

81.దేనినయినా సరే ఆక్షేపణ, సమర్థన చేయకుండా ఉండు.

82.తానే ఓ పెద్ద అబద్ధం అని తెలిసేవరకు
ఏదీ అబద్ధం కాదు.

83.సత్యం ఒక్కటే.
దానిని పొందేవాడు కూడా ఒక్కడే.

84.భయమే బంధం.
నిర్భయమే మోక్షం.

85."అంతా సహజంగా ఉంది" అని ఉండడమే
సహజ సమాధి.

86.దైవసృష్టిలో ప్రతిక్షణమూ, ప్రతి అణువూ విలువైనదే.
నిరుపయోగం అని తలచి ఒక్క అణువును పెరికివేసినా సరే
ఈ సృష్టి కుప్పకూలిపోతుంది.

87.నీ ప్రయత్నాలతో నిమిత్తం లేకుండా
నీకిష్టమున్నా లేకున్నా నీవెలా ఉంటే
నీకు, లోకానికి శ్రేయస్సో అలానే ఉంచుతాడు
నిన్ను భగవంతుడు.

88.జీవించడమే యజ్ఞం.
యజ్ఞం చేసేవాడు భగవంతుడు.

89.'ఒకటి' సదా ఒకటిగానే ఉన్నది.
మనమే ఒకటిని ఒకటిగా చూడడం లేదు.

90.కర్త-కర్మ-క్రియ భగవంతుడే.

91.పోల్చుకోవడం మానివేస్తే
నీవే దేవుడవు.

92.యావత్తు సృష్టి ప్రయోజనం
నీ ఒక్కని కొఱకే.

93.భగవంతుణ్ణి కోరవలసింది భగవంతుణ్ణే.

94.ఈ సృష్టి వయసు నీ వయసు కన్నా రెండేళ్లు తక్కువే.

95.కనేదంతా కలవరింత.
పలికేదంతా పలవరింత.

96.ఏ కర్తవ్యమూ లేకపోవడమే మన కర్తవ్యము.

97.ఏ కత్తికీ అది తెగదు.
అది తెగడానికి కత్తే అవసరం లేదు.

ఏ సాధనకూ అది దొరకదు.
అది దొరకడానికి సాధనే అవసరం లేదు.

98.మీరు సత్సంగంలో ఉండడం కాదు
మీరున్న చోట సత్సంగం కావాలి.

99.పొందటానికి ఏదీ కారణం కాదు.
దానికదే కారణం.

100.భగవంతుని కోసం చేసే ప్రతి సాధనా
భగవంతుడు అవసరం లేని స్థితినే ప్రసాదిస్తుంది.

101.భేదబుద్ధి లేనివానికి మృత్యుభీతి ఉండదు.

102.ఏ ప్రార్థనా చేయక, దైవసన్నిధిలో
ఊరక ఉండడమే నిజమైన ప్రార్థన.

103.ఒకటి అనక లెక్కించుటెట్లు?
ఆత్మ కాక ఆత్మవిచారమెట్లు?

104.ఉన్నదానికి ఒక లెక్క కూడా ఉండదు.
లేనిదానికే 84 లక్షల లెక్కలున్నాయి.

105.పునర్జన్మలో క్రొత్త శరీరమే కాదు
క్రొత్త ప్రపంచమే ఏర్పడుతుంది.

106.నీ తలను(బుద్ధిని) తీసి ప్రక్కన పెట్టు.
అదే శరణాగతి అంటే.

107.నీకు నీవు తటస్థంగా ఉంటే
మొత్తానికి తటస్థంగా ఉన్నట్లే.

108.ఆత్మనిష్ఠయే సర్వశాస్త్రసారము.

---

నిత్యస్మరణీయం - 2

---

1.సృష్టి ప్రయాస అంతా
భగవంతుణ్ణి నిరూపించడానికే.

2.ఈశ్వరుడు ఆదిదేవుడు.
నేను అంత్య దేవుడను.

3.వైరాగ్యం అంటే వదలటం కాదు.
ఏ క్షణంలోనైనా వదలటానికి సిద్ధంగా ఉండటం.

4.త్యాగరాజు రామభక్తుడు అనేది అందరికీ ఎఱుకేగాని
రాముడే త్యాగరాజు అనేది ఎందరికి ఎఱుక?

5."బాబు" నుండి వచ్చిన మాటగా కనబడినా సరే
అది "నేను" నుండి వచ్చిన మాటే.

6.పరమసత్యం వినబడినా
పరమాత్ముడు కనబడినా
మరుక్షణం నీవుండవు.

7.ఎవడెట్లా ఉన్నాడనేది చూస్తాడు భగవంతుడు.
తన వద్ద ఎట్లా ఉన్నాడనేది చూడడు భగవంతుడు.

8.మైమరపు వలన కలిగే సుఖం - ఐహికసుఖం.
సుఖం వలన కలిగే మైమరపు - పరమసుఖం.

9.మనసును నమ్మితే చెడ్డ చేస్తుంది.
నమ్మకపోతే మంచి చేస్తుంది.

10.బ్రతికి చచ్చేవాడిది బ్రతుకు కాదు.
చచ్చి బ్రతికేవాడికి చావు లేదు.

11.'ఇతరం కూడా నేనే' అనే ఎఱుకతో చేసే ప్రతి పనీ భగవత్సేవే.

12.సముద్రం యొక్క ఉపరితలభాగం అల్లకల్లోలం.
లోపలిభాగం నిశ్చలత.

సద్వస్తువు యొక్క ఉపరితలభాగం ప్రపంచం.
లోపలిభాగం అచలత.

13.గురువు ఇచ్చేది ఏమీలేదు.
గురువు ఇవ్వనిది కూడా ఏమీలేదు.

14.జ్ఞానాన్ని ఎవరూ పొందరు.
జ్ఞానమే అందరినీ పొందుతుంది.

15.శబ్దమే కాదు,
రూపం కూడా లేనివాడు
దక్షిణామూర్తి.

16.మతానికి దేవుడు అవసరమే.
దేవుడికి మతం అవసరం లేదు.

17.ఓ మహనీయుడు మహిమల్ని ప్రకటించినట్లున్నాళ
వాస్తవానికి మహిమే మహనీయుణ్ణి ప్రకటిస్తుంది.

18.జీవితమంటే మనకెందుకింత మమకారమంటే
దీనితో సహవాసం వల్లనే.

మృత్యువంటే మనకెందుకంత భయమంటే
దానితో సహవాసం లేకనే.

19.నీ అనుభవం శాస్త్ర ప్రమాణానికి సరిపోతే సరిపోనీ...
తేడా వస్తే వదలాల్సింది శాస్త్రపప్రమాణాన్నే,
నీ అనుభవాన్ని కాదు.

20.కలవరింతల, పలవరింతల సమ్మేళనమే
జీవితం.

21.ఇహమైనా, పరమైనా తన లోపలుంటే అది పరమే.
ఇహమైనా, పరమైనా తన వెలుపలుంటే అది ఇహమే.

22.ఎండమావిలోని నీరు సముద్రంలో కలవడం
భక్తుడు భగవంతునిలో కలవడం
రెండూ ఒక్కటే.

23.దేవుని కోసమంటూ ఒక్క అడుగు కూడా వేయవలసిన అవసరం లేదు.
నీవే దేవుడవు.

24.తల్లి కేవలం శిశువునే కాదు
శిశువుకు సంబంధించిన
యావత్తు జీవితాన్ని ప్రసవిస్తుంది.

25.నిశ్శబ్దంగా ఉంటే ఎవడైనా దేవుడే.
చలిస్తే దేవుడైనా జీవుడే.

26.వ్యక్తిత్వభావన పోవాలంటే రెండు మార్గాలు-
1.వ్యాకోచిస్తూ వెళ్లిపో.
లేదా
2.సంకోచిస్తూ వెళ్లిపో.

27.బతికి బట్ట కట్ట దలచినవాడు
పొరపాటున కూడా కోరకూడనిది - దైవదర్శనం.

28.దేవునిదృష్టిలో -
దోమ ఎంతో, మనిషీ అంతే.
ఆయనకు  దేని పట్లా, ఎవరి పట్లా
ప్రత్యేకత ఉండదు.

28.దైవసంకల్పం కూడా పురుషప్రయత్నం యొక్క ఫలితమే  అన్నట్లు అనిపిస్తుందేగాని
నిజానికి దైవసంకల్పానుసారంగానే
పురుషప్రయత్నం జరుగుతుంది.

29.తనువే తానుగా ఉండుట - అజ్ఞానము.
తానే తనువుగా ఉండుట - జ్ఞానము.

30.అనుభవాన్ని
అనుభవించే
అనుభవమే
ఆత్మానుభవము.

31.ఆదర్శం అనేది ఆకాశంలో కనబడే చుక్క లాంటిది.
కనబడుతుందేగాని, పొందటానికి వీలుకానిది.

32.అమూల్యమైన దాని కొరకు
చెల్లించవలసిన మూల్యం
అమూల్యమైనదానినే.

33.దక్షిణామూర్తి ఒక్కడే చెప్పక చెప్పినాడు.
మిగతా వారంతా చెప్పి చెప్పలేకపోయారు.

34.చరిత్రలో ఓ భాగం  కాదు గురువు.
గురువులో ఓ భాగం చరిత్ర.

35.నిన్ను నీవు అల్పుడవని భావిస్తే
నిన్ను సృష్టించిన సృష్టికర్తనే నీవు అవమానించినట్లు.

36.ఆది కవి - ఈశ్వరుడు.
ఆది కావ్యం - ప్రపంచం.

37.దేవుడు 'నేను కర్తను' అని అనకపోయినా కర్తే.
జీవుడు 'నేను కర్తను' అన్నా సరే కర్త కాదు.

38.మనం మోక్షాన్ని ఇచ్చేవాళ్లమేగాని
మోక్షాన్ని పొందేవాళ్లము కాము.

39.అనుభవం వలననే అనుష్ఠానం.
అనుష్ఠానం వలన అనుభవం రాదు.

40.కుబుసంలో పామును వెదుకుతున్నాం.
శాస్త్రాల్లో పరమాత్ముణ్ణి వెదుకుతున్నాం.

41.సకలాన్ని మీరు ఏ భావంతో చూస్తే
సకలమూ మిమ్మల్ని ఆ భావంతోనే చూస్తుంది.

42.నేనుతో ఉండడం - కర్మయోగం.
నేనులో ఉండడం - భక్తియోగం.
నేనుగా ఉండడం - జ్ఞానయోగం.

43.నీకు అన్యం తోస్తే - బంధం.
అన్యం తోయకుంటే - మోక్షం.

44.వెలుపలున్నదంతా చిత్తమే.
లోపలున్నదంతా దైవమే.

45.ధనం సుఖం కాకపోవచ్చు
కాని సుఖం మాత్రం ధనమే.

46."నేను"స్మరణ తప్ప
ఇంకే స్మరణ చేసినా ప్రయోజనం లేదు.

47.గెలిచిందంతా ధర్మమే.
ధర్మం ఓడిపోదు.

48.ఆనందం కోసం చేసేది - కర్మ.
ఆనందంగా ఉండి చేసేది - లీల.

49.ఉన్నదానికి సిద్ధాంతమెందుకు?
లేనిదానికి రాద్ధాంతమెందుకు?

50.మరణమనేది ఓ నమ్మకమేగాని అనుభవం కాదు.
ఆధ్యాత్మికమనేది ఓ అనుభవమేగాని నమ్మకం కాదు.

51.శివపార్వతులకు ఒకడే కొడుకు-
శివునికి కార్తికేయుడిలా
పార్వతికి గణపతిలా కనిపిస్తాడు.

52.ఇచ్చిన అప్పు తిరిగి వస్తే తీసుకున్నవాని బాకీ తీరినట్టు.
ఇచ్చిన అప్పు తిరిగి రాకుంటే మన బాకీ తీరినట్టు.

53.కొండ పైన స్వామి కాదు.
కొండే స్వామి.

54.సమూహంలో ఏకాంతం
అదే ఋషి లక్షణం.

55.జీవితాంతం అర్థం కానిది జీవితమే.

56.వ్యాపారానికి ముందే పెట్టాలి పెట్టుబడి.
ప్రార్థనకు ముందే తీర్చాలి మ్రొక్కుబడి.

57.శంకరులకు అద్వైతం తెలుసునేమోగాని
అద్వైతానికి శంకరులు తెలియదు.

58.లోకాన్ని పట్టించుకోనివాణ్ణి
లోకమంతా పట్టించుకుంటుంది.

59.మహనీయుల లిస్టులోనూ
పనిమాలినవాళ్ల లిస్టులోనూ
తన పేరే మొదటి పేరుగా ఉండాలి.

60.ప్రమాణం అవసరమైతే అది సత్యం కాదు.
శాస్త్రం అవసరమైతే అది ధర్మం కాదు.
వాదం అవసరమైతే అది న్యాయం కాదు.

61.ఉన్నదేదో అది ఉన్నది.
అది ఎవర్నీ తెలుసుకోదు.
ఎవరూ దానిని  తెలుసుకోలేదు.

62.భయమే దెయ్యం.
నిర్భయమే దైవం.

63.ఒకటిని కోటితో గుణిస్తే  కోటి అవుతుంది.
తనను దేవునితో గుణిస్తే  దైవం అవుతుంది.

64.నీవు తినేదంతా నీవుగా మారిపోతుంటే
నీవు కనేదంతా నీవుగా ఎందుకు మారిపోదు?

65.శివుణ్ణి ముద్దగా చేసి మ్రింగేస్తే
శివార్పణం శివార్పణం అనే శ్రమ తొలగిపోతుంది.

66.ప్రశ్నించడం అవిద్యామాయ.
సమాధానమివ్వడం విద్యామాయ.

67.నిద్రలో ప్రశ్న ఉండదు.
మెలకువలో సమాధానం ఉండదు.

68.తక్షణం సద్గురు సన్నిధిని అనుభవించాలంటే
మౌనంగా ఉండు సరిపోతుంది.
మౌనమే నిజంగా సద్గురువు.

69.అందరి లెక్కలో తానుండి
తనకు ఏ లెక్కా లేనివాడు
ముక్తుడు.

70.లోకవ్యవహారానికి
మనో వ్యాపారానికి

అంటక ఉన్న ఆత్మను "నేను".

71.తాను ఉండాలి.
లేనట్టూ ఉండాలి.
"సున్న"లాగా.

72.నేను జ్ఞానిని అని
నేను అజ్ఞానిని అని
జ్ఞానమే అంటుంది.

73.భగవంతుని అభీష్టానికి
స్వచ్ఛందంగా లొంగిపోవడమే
శరణాగతి.

74.కర్మకు ఆచారం అవసరం.
భక్తికి ఆర్తి అవసరం.
జ్ఞానానికి విచారం అవసరం.

75.పునర్జన్మ లేనే లేదు.
యెందుకంటే
ప్రస్తుత జన్మే లేదు గనుక.

76.అనిపించినా
కనిపించినా
అది నిజం కాదు.

77.ఎవరికైనా మృత్యుభయమే ఉంటుంది.
మృత్యువు ఉండదు.

78.నోరు మూసుకుంటే నిశ్శబ్దం.
మనసు మూసుకుంటే మౌనం.

79.నా నామరూపములను తెలుసుకొనగలరేగాని,
నన్నెలా తెలుసుకోగలరు?

80.సృష్టి అంతా తిరుగతుండేది
తన చుట్టే.

81.బంధం అనే భ్రమను
సాధన అనే భ్రమతోనే తొలగించాలి.
తప్పదు.

82.ఉండేది దైవసంకల్పమే.
మన సంకల్పం కూడా దైవసంకల్పంలో భాగమే.

83.ఎవరిని చూసినా, దేనిని చూసినా
"నేను" అనే అనుభవం కలగడమే ఆత్మానుభవము.

84.ప్రతి భోగమూ ఓ యోగమే.
ప్రతి యోగమూ ఓ భోగమే.

85.ప్రపంచంలో నేను ఉంటే మైల అంటుతుంది.
నాలో ప్రపంచం ఉంటే ఏ మైలా అంటదు.

86.అనుభవానికి అనేకులుంటారు.
అనేకులకు అనుభవం ఉండదు.

87.బ్రతికేది చావడానికే.
చచ్చేది బ్రతకడానికే.

88.అరుణాచలంలో గుహ ఉండడం కాదు,
హృదయగుహలో అరుణాచలం ఉంది.

89.అదిగా ఉండేది ఇదే.
ఇదిగా ఉండేది అదే.

90.ఏదైనా సరే-
తనకు వెలుపల ఉంటే తాను భోగి.
తన లోపల ఉంటే తాను త్యాగి.

91.కర్మలో శ్రమకు తావులేదు.
భక్తిలో తర్కానికి తావులేదు.

జ్ఞానంలో సంశయానికి తావులేదు.

92.ప్రపంచంలో సమాధానం లేని మాట
"ఎందుకు" అనేదే.

93.యెవరెన్ని లెక్కలు వేసినా
'ఆయన' లెక్కలు ఆయనకు ఉన్నాయి.

94.దైవానుభవం కలగాలంటే-
తాను లేని ప్రపంచమైనా ఉండాలి.
ప్రపంచం లేని తాను అయినా ఉండాలి.

95.ఆత్మసన్నిధిలో-
మౌనం కూడా తాను శబ్దమే అని అంగీకరిస్తుంది.
చైతన్యం కూడా తాను జడమే అని తెలుసుకుంటుంది.
జ్ఞానం కూడా తన అజ్ఞానాన్ని చూసి నవ్వుకుంటుంది.

96.వేదంలో ఉండేది నువ్వు చెప్పకూడదు.
నువ్వు చెప్పేది వేదం కావాలి.
నువ్వెళ్లి క్షేత్రాలను దర్శించడం కాదు,
నువ్వున్న చోటు క్షేత్రం కావాలి.

97.ఒక మహనీయుడు తన మహిమ చేత
ఒకరికి వ్యాధిని నయం చేస్తాడు.
అప్పుడతడు సూత్రధారి.

ఆ మహనీయుడే ఒక వ్యాధిచేత
పీడింపబడుతున్నట్లు కనబడుతాడు.
అప్పుడతడు పాత్రధారి.

98.సర్వాన్ని శివమయంగా చూడడం వలన నీవు శివుడివి కాలేవు.
ముందు నీవు శివుడివైతే సర్వం శివమయం అవుతుంది.

99.నేనే దేవుణ్ణి అన్నవాడు హిరణ్యకశిపుడు.
నేను కూడా దేవుణ్ణే అన్నవాడు ప్రహ్లాదుడు.

100.కోయిల ఎవరి కోసమూ కూయదు.
ఋషి ఎవడి కోసమూ జీవించడు.

101.తండ్రిలో దేవుణ్ణి చూసినవాడు పుండరీకుడు.
దేవుడిలో తండ్రిని చూసినవాడు ప్రహ్లాదుడు.

భర్తలో దేవుణ్ణి చూసింది అనసూయ.
దేవుడిలో భర్తను చూసింది మీరాబాయి.

గురువులో దేవుణ్ణి చూసినవాడు సిద్ధయ్య.
దేవుడిలో గురువును చూసినవాడు రమణుడు.

102.ఉపవాసం అంటే ఆకలిని భోంచేయడం.
జాగరణ అంటే మెలకువ నుండి మేలుకోవడం.

103.భగవంతుడు మాత్రమే ఉన్నాడు.
ప్రపంచం ఆయన ప్రకాశం.

104.ఈ ధ్యానకేంద్రాలలో సాధన చేయడం కంటే
శ్మశానంలో సమాధి అరుగులపై కూర్చొని కాసేపు గడపడం మంచిది.
అంతకు మించిన సాధనే లేదు.
ఆ సమయం నీకు ఎన్నో జీవితసత్యాలను ప్రబోధిస్తుంది.

105.'నాకేమీ తెలియదు' అనే విషయాన్ని
మొట్టమొదటగా తెలుసుకున్నవాడు శ్రీరామకృష్ణులు.
చివరగా తెలుసుకున్నవాడు వివేకానందులు.

106..మెలకువ రావడానికి ఏ సాధన చేస్తున్నారు?
మోక్షం కలగడానికి కూడా ఏ సాధనా అవసరం లేదు.

107.సృష్టీ లేదు
పరిణామమూ లేదు
విలయమూ లేదు
ఇదే అజాతవాదము.

108.'ఏకం సత్' అంతే.
అక్కడే నిలిచిపో.

* * *

16. ప్రార్థన

---

1. సుఖమును దుఃఖము, దుఃఖమును సుఖము వరుసగా ఒకదానికొకటి అనుసరించి ఉన్నవి. సూక్ష్మము వైపునకును, స్థూలమువైపునకును ఈ వరుస అనంతముగా తోచుచునే ఉన్నది. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

2. జ్ఞానమును అజ్ఞానము, అజ్ఞానమును జ్ఞానము
వరుసగా ఒకదానికొకటి మూలములై అనుసరించి ఉన్నవి. సూక్ష్మము వైపునకును, స్థూలము వైపునకును ఈ వరుస అనంతముగా తోచుచునే ఉన్నది. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

3. వెలుగును చీకటి, చీకటిని వెలుగు వరుసగా ఒకదానికొకటి మూలములై అనుసరించి ఉన్నవి. సూక్ష్మము వైపునకును, స్థూలము వైపునకును ఈ వరుస అనంతముగా తోచుచునే ఉన్నది. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

4. నిశ్శబ్దమును శబ్దము, శబ్దమును నిశబ్దము వరుసగా ఒకదానికొకటి మూలములై అనుసరించి ఉన్నవి. సూక్ష్మము వైపునకును, స్థూలము వైపునకును, ఈ వరుస అనంతముగా తోచుచునే ఉన్నది. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

5. ద్వంద్వములన్నియు ఇట్లే అని వీటిని అంటక చూచుచున్న వానిని శరణువేడుచున్నాను. చెట్టుముందా? విత్తుముందా? గ్రుడ్డుముందా? పిల్లముందా? మొదలగు ప్రశ్నలకు కూడా ఇదే సమాధానం కాబట్టి ఇట్టి సందేహములన్నింటికీ అంటక ఉన్న నా గురువును శరణువేడుచున్నాను.

6. ఒకప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ అనగా భూత వర్తమాన భవిష్యత్తులు వరుసగా ఒకదానికొకటి మూలములై అనుసరించి ఉన్నవి. స్థూలము

వైపునకును, సూక్ష్మము వైపునకును ఈ వరుస అనంతముగా తోచుచున్నది. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

7. అక్కడ, ఇక్కడ, ఎక్కడా అనునవి వరుసగా ఒకదానినొకటి మూలములై అనుసరించి ఉన్నవి. స్థూల సూక్ష్మముల కిరువైపులకు ఈ వరుస అనంతముగా తోచుచున్నది. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

8. జీవ జగత్ ఈశ్వరులనునవి వరుసగా ఒకదానినొకటి మూలములై అనుసరించి ఉన్నవి.  స్థూల సూక్ష్మముల కిరువైపులను ఈ వరుస అనంతముగా తోచుచున్నది.వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

9. కర్త-కర్మ-క్రియలు వరుసగా ఒకదానినొకటి మూలములై అనుసరించి ఉన్నవి. స్థూల సూక్ష్మముల కిరువైపులను ఈ వరుస అనంతము తోచుచున్నది. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

10. ప్రశ్న, అన్వేషణ, సమాధానములు వరుసగా ఒకదానినొకటి మూలములై అనుసరించి ఉన్నవి. స్థూలసూక్ష్మముల కిరువైపుల ఈ వరుస అనంతముగా తోచుచున్నది. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

11. త్రిపుటులన్నియు ఇట్లే అని వీని నంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

12. కనులు తెరచి చూచిన కనుపించునది భూతాకాశము.
దానియందలి నామరూపాత్మక జగత్తు.
కనులు మూసి చూచిన కనుపించునది చిత్తాకాశము.దానియందలి తలంపులు.
ఈ రెండు ఆకాశములను చూచునది చిదాకాశము. వీటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

13. ఉన్నది ఒక్కటే.
అన్యము లేనేలేదు.
ఆ ఉన్నదే నేను అని ఉండుట
జ్ఞానయోగము.

ఉన్నది ఒక్కటే.
అన్యము లేనేలేదు.
ఆ ఉన్నదే నీవు అని ఉండుట
భక్తియోగము.

ఉన్నది ఒక్కటే.
అన్యము లేనేలేదు.
ఆ ఉన్నదే అతడు అని ఉండుట
కర్మయోగము.

ఈ మూడూ ఒకదానినొకటి మూలములై అనుసరించి ఉన్నవి స్థూలసూక్ష్మముల రెండు తెరగుల అనంతముగా తోచుచున్నది. ఈ మూటిని అంటక చూచుచున్న నా గురువుకు శరణువేడుచున్నాను.

14. నేనని అనుచున్నది అహంకారం.
నేనుగా ఉన్నది అహంస్వరూపం.
మొదటిది దేహమాత్రము.
రెండవది దేహము లోపల వెలుపల నిండియున్నది.
వీనిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

15. బుద్ధికి అందినంతవరకు గల ప్రపంచము విశ్వాంతరాళమునందే పుట్టి, పెరిగి, ఉనికి గలిగి అందే లీనమగుచున్నది. సకలమునకు విశ్వాంతరాళమే మూలకారణము. ఇది అనంతము కూడా. ఎరిగిన వాటి కన్నిటి కంటే పెద్దది. త్రిమూర్త్యాత్మకమని చెప్పబడునది ఇదియే.
ఇదియే శక్తి, ఇదియే పదార్థము. వాఙ్మానస గోచరమగునంత వరకు ప్రపంచమని, తరువాతది పరమాత్మయనియు అనుభవింపబడుచున్నది.
దీనిని అంటక చూచుచున్న నా గురువుకు శరణువేడుచున్నాను.

16. అజ్ఞానిగా తోచుచున్న గురువే శిష్యుడు.
జ్ఞానరూపమున తోచుచున్న శిష్యుడే గురువు.
తారతమ్యములెక్కడ? వీరిరువురిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

17. భగవంతునితో సమానుడైన భక్తుడు లేడు.
భక్తునితో సమానుడైన భగవంతుడు లేడు.
భక్తుడనగా సాకారుడగు భగవంతుడు.
నిరాకారుడైన భక్తుడే భగవంతుడు.
వీరిరువురుని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

18. విని చూడు; తాకి చూడు; రుచి చూడు; వాసన చూడు; తలచి చూడు అని పలువిధముల చూచుటే చెప్పబడుచున్నది. అన్ని చూపులు చూడగల కన్నే కన్ను. అదే మూడవ కన్ను. అట్టి కన్ను గల వానిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

19. నిద్రించు బిడ్డకు కలవరింతలు, పలవరింతలు ఉన్నప్పుడు విభూతి పెట్టుట, రక్షలు కట్టుట, వైద్యములు చేయుంచుట ప్రసిద్ధము. సత్యదర్శనమున వేదముల వాక్కులు, బ్రహ్మర్షుల దర్శనములు కూడా పలవరింతలు కలవరింతల వంటివే...అన్నచో ఇతరముల ఎన్నుట ఎందులకు? దీనినంతటిని అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

20. ఉనికి జ్ఞాన లక్షణము. జ్ఞానము ఉనికి లక్షణము. జ్ఞానము ఆనంద లక్షణము. ఆనందము జ్ఞాన లక్షణము. లక్షణమే స్వరూపము. స్వరూపమే లక్షణము. దీనినంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

21 అణువుకు కేంద్రము ఉన్నది. పిండమునకు కేంద్రము ఉన్నది. అనంతమై యున్న విశ్వమునకు కేంద్రమున్నది ఈ మూడును అండాకారములుగా మున్ను పెద్దలు వర్ణించిరి. తన్ను తానెరుగని స్థితిలో మూడింటికి వేర్వేరు కేంద్రములుగా తోచినను, ఎరిగిన స్థితిలో మూడింటికి

ఒకే కేంద్రమనుట అనుభవసిద్ధము. ఆ కేంద్రమే తాను. వీనినన్నింటికి అంటక చూచుచున్న నా గురువును శరణువేడుచున్నాను.

* * *

17. సద్గురు మహిమ

---

మహిమ అంటే ప్రకృతి స్వభావానికి మించిన శక్తి
ఓ వ్యక్తి ద్వారా ప్రకటనం కావడం.

* * *

అది ఆ ప్రత్యేక వ్యక్తికి మాత్రమే ఎలా సాధ్యం?
సాధన వలన సాధ్యమా? లేక
అది అప్రయత్నంగా సిద్ధిస్తుందా?

ఇంతకీ మహిమల వలన  ప్రయోజనం ఏమి?
ఏది ముఖ్యం....మహిమా? జ్ఞానమా?

* * *

సాధకుడు భగవత్సాక్షాత్కారం కొఱకు ప్రయత్నిస్తున్నప్పుడు, ఈ పరిమితి మనసు అనంతాత్మతో తల్లీనమవుతున్న తరుణంలో
ప్రకృతికి మించిన శక్తి పరాప్రకృతి యొక్క శక్తులు తనను ఆవహిస్తున్న సమయంలో కొన్ని సిద్ధులు అప్రయత్నంగా తన ద్వారా ప్రకటనం కావడం జరుగుతుంది.

సాధకుడు సిద్ధుడు అవుతాడు.

మనసు ఆత్మగా మారుకుంటున్న
ఆ సంధ్యాసమయంలో -
ఇవన్నీ పరమాత్ముని ద్వారా వ్యక్తమౌతున్న శక్తే తప్ప తనది కాదన్న జ్ఞానం సుస్థిరమైతేనే పరమగమ్యం చేరగలడు.
లేదంటే ఆ సిద్ధుల వలన ఉన్నత స్థితి నుండి జారి అధోగతి పాలౌతాడు.

* * *

బంగారంపై ఆశలేని వానికే స్వర్ణసిద్ధి కలిగినట్లు
సిద్ధులపై దృష్టిలేనివారికే సర్వసిద్ధులూ కలుగుతాయి.

సంసారంలో మునిగిపోతూ ఒకడు తనను తరింపచేయమని ఆర్తితో శరణన్నవాణ్ణి కాపాడ్డానికి సిద్ధుడు అసంకల్పితంగా ఉపయోగించే ప్రక్రియే "మహిమ".

మహిమ అనేది వ్యవస్థను చక్కబరచడానికేగాని
కీర్తిప్రతిష్టలకు కాదు.

ప్రకృత్యాతీతశక్తి ఒకటి ఉందని మానవునికి గుర్తుచేసేందుకు దోహదపడేదే మహిమ.

అచలంగా ఉన్న చైతన్యం క్రియాశీలం అవడమే
తొలి మహిమ.

"తండ్రి నేను అభిన్నులం" అని క్రీస్తు అన్నప్పుడు,
తాను పరమతండ్రితో(అనంతశక్తితో) మమేకం అయి ఉన్నారు.

తాను ఈ మహిమను ప్రకటించాను...అన్న స్పృహే వారికి లేదు.
అందువల్లనే క్రీస్తు మానవుడిగా కనబడినా మానవాతీత కార్యాలను వారు చేశారు.

భౌతిక నియమాలేవీ ఆ సిద్ధుని సన్నిధిలో పని చేయవు.

ఆ "ఈశ్వరనియతి"ని మాటల్లో  మనం వివరించుకోలేం...
మన మెదడుకున్న పరిమితులు అంతే మరి.

మహిమ అనేది యెప్పుడూ ఉంది...
"విశ్వాసం"తో  దానిని చవిచూడగలడు ఎవడైనా.

శిష్యునికి జ్ఞానప్రబోధం కంటే ముందుగా
శక్తి నిరూపణం(మహిమ) చేయగలగాలి గురువు.

అప్పుడే గురువు మీద గురి కుదిరి,
శ్రద్ధగా జ్ఞానప్రబోధాన్ని స్వీకరించగలడు శిష్యుడు.
మన భారతీయ ప్రాచీన గురువులందరూ అంటువంటి శక్తి సంపన్నులే...

జ్ఞానం శక్తిపూర్ణంగా ఉండాలి.
శక్తి జ్ఞానపూర్ణంగా ఉండాలి.
అంటారు మన గురువుగారు.

అలాంటి శక్తిపూర్ణమైన జ్ఞానసూక్తులే
ఈ "జ్ఞానప్రసూనాలు".

అలాంటి శక్తిపూర్ణమైన జ్ఞానియే
సద్గురు సుబ్రహ్మణ్యులు.

ప్రపంచానికి ఆవల నుండి ప్రసారమయ్యే ఆ దైవీశక్తికి ఓ వాహకంలా
తానుండి, ఎంతోమందికి
భౌతిక,మానసిక,అధ్యాత్మిక సమస్యలను తీరుస్తూ
స్వస్థత చేకూరుస్తున్నారు శ్రీకాళహస్తిలో...

వారి సన్నిధిలో దెయ్యాలు వదులుతాయి...
బాలారిష్ఠాలతో బాధపడే పిల్లలకు తాయెత్తులు కడతారు...

అది ఏ రకం సమస్య అయినా సరే, ఫోన్ చేసి వారి చెవిన పడేస్తే
చాలు...వారి సమస్య తగ్గుముఖం పడుతుంది...

వారి సూచించే చికిత్సావిధానం చిత్రంగా ఉంటుంది...

మాంసంతో వండిన ఆహారంలో ఒక ఔన్సు ఆల్కహాలు కలిపి "శివా..." అని
తలచి కాలభైరవులకు నైవేద్యంగా పెట్టమంటారు...
అవి  తిని మత్తుగా ఒక నిద్రపోయి లేవగానే వారివారి సమస్యలన్నీ
తగ్గుముఖం పట్టేవి...

కొందరి వ్యాధులను తమపైకి తీసుకుని అనుభవించిన సందర్భాలు కూడా
ఉన్నాయి...

వారి నోట సదా వెలిగే సిగరెట్టు కూడా
అవధూతలు రగిలించే ధుని లాంటిదే.

సిగరెట్టు వలన దగ్గు వస్తున్నా సరే
ఆగని పాప సంహారిణి ఆ నిత్యాగ్నిహోత్రం.

విశ్వశక్తికి తానొక వాహకంగా ఉన్నానన్న స్పృహ వలన, ఇతరుల బాధలను స్వీకరించడంలో ఆనందాన్ని పొందుతాడు ఆ సిద్ధుడు.

వారి సన్నిధిలో స్వస్థత పొందినవారి అనుభవాలను వ్రాస్తూపోతే చాలా పుస్తకాలు తయారవుతాయి.

వారు "భగవదిచ్ఛ" మీద ఆధారపడి జీవించే సంస్కారి కనుక,

భగవంతుణ్ణి, భగవద్విశ్వాసాన్ని ఘనపరచే వాక్యాలను మాత్రమే ఏరుకుని "జ్ఞానప్రసూనాలు" గా లోకానికి ఇవ్వడం జరిగిందే తప్ప, గురువు చేసిన మహిమలేవో కొన్ని చూపి జనాకర్షణ పొందాలనే వాంఛ నాకు లేదు.

అందువలన "సద్గురు మహిమ" అనే ఈ చిన్న వ్యాసాన్ని ఇంతటితో ముగిస్తున్నాను...

మహిమను ఎప్పుడూ భగవద్విశ్వాసాన్ని పెంపొందించే విధంగా మలచుకోవాలేగానీ, వాటికై ప్రాకులాడకూడదు.

నిజానికి ప్రతీది మహిమే.
మహిమే జీవితంగా ఉంది.

కాకపోతే అది అందరికీ సర్వసామాన్యమై ఉండడం వలన అవి మహిమలుగా తోచడం లేదు అంతే.

ఎవరూ చేయని, చూడని మహిమను చూడగలిగినప్పుడు మాత్రమే దానిని మహిమగా తీసుకుంటున్నాడు.

కదలని ఆకాశంలో భూమి కదలడం మహిమ కాదా?
కదిలే భూమిపై మనం నిశ్చలంగా ఉండడం మహిమ కాదా?
చూడగలిగే దృష్టే ఉండాలిగాని, మహిమ కానిదంటూ ఏమీ ఉండదు.

ప్రతి కదలికా దేవుని మహిమే.

* * *

18. గురుపాదుకలు

---

facebook లో వచ్చే సద్గురు బోధలకు ఆకర్షితులై
చాలా మంది జిజ్ఞాసువులు శ్రీకాళహస్తికి వచ్చి సద్గురు దర్శనం
చేసుకుంటుంటారు...

చాలామంది ఐహిక సమస్యలతో వస్తుంటారు...
కొద్దిమంది ఆధ్యాత్మిక సమస్యలతో వస్తుంటారు....

సమస్య ఏదైనా సమస్యే కదా...

అందరినీ ఆదరిస్తారు గురువుగారు...
అన్నిటికీ పరిష్కారం చూపుతారు గురువుగారు...

విరాగులను వివాహితులుగాను,
వివాహితులను విరాగులుగాను
మార్చేస్తుంటారు గురువుగారు....

నిరక్షరాస్యుడు కూడా తానొక పండితుడిగా
పండితుడు కూడా తానొక నిరక్షరాస్యుడుగా
తోపింపచేస్తుంటాడు గురువుగారు...

గురువుగారిని చూసి-
చిన్నపిల్లవాడు కూడా తన స్నేహితుడుగా
ఫీల్ అవుతాడు...

బహువృద్ధుడు కూడా తానొక చిన్నపిల్లాడిలా ఫీల్ అవుతాడు....

పేరుకే వారు నా కుమారులు....
నా (జ్ఞాన)వారసులు మీరే....అంటారు గురువుగారు తన శిష్యులతో....

జన్మనిచ్చేవాడు తండ్రి.
జన్మ లేకుండా చేసేవాడు పరమతండ్రి(గురువు)

వారి దివ్యపాదాలను తాకి నమస్కరించుకున్న ప్రతి ఒక్కడూ వారి బిడ్డడే.

ఆడుకునే బిడ్డ కంటే ఉయ్యాల్లో బిడ్డ పైనే శ్రద్ధ తల్లికి.
ఏవేవో అడిగేవాడి కంటే ఏమీ కోరనివాడిపైనే ఎక్కువ శ్రద్ధ గురువుగారికి.

గురువుకు అలాంటి పసిబిడ్డడే
ఇంజం వేంకటనరసయ్య...

ఖమ్మం వాసి...
పాత్రికేయులు...

facebook ద్వారా పరిచయమై....
అయ్యప్పమాలతో వచ్చారు ఓ రోజు...
అంతే. అప్పట్నుంచి సద్గురు పాదాలకు అంకితమైపోయారు...
అయ్యప్ప ఇక్కడ నడిచే అయ్యప్పగా ఉన్నాడని గ్రహించేశారు తొలి దర్శనంలోనే....

సద్గురు పాదాలకు వెండిపాదుకలు తొడిగి...
అంగరంగ వైభవంగా ఉత్సవం జరిపి...
ఆ పాదుకలను తన శిరస్సున ధరించిన ధన్య జీవి ఇంజం.

గురునివాసం ప్రక్కనే తానొక ఇంటిని అద్దెకు తీసుకుని
వీలైనప్పుడల్లా కుటుంబ సమేతంగా వచ్చి గురుసన్నిధిని అనుభవించే భాగ్యశీలి ఇంజం.

గురుసన్నిధిలో ప్రశాంతంగా కూర్చుంటారు అంతే.
ఉలకరు...
పలకరు...

సద్గురు "జ్ఞానప్రసూనాలు"లోని జ్ఞానమకరందాన్ని
నిశ్శబ్ధంగా జుర్రుకునే భ్రమరం ఇంజం.
* * *

గురుపాదుకలను మనము తాకి నమస్కరించుకున్నట్టే

గురువుగారు కూడా ఆ పాదుకలను తాకి నమస్కరించుకుంటారు....

వారు వాటిని  వారి గురుపాదుకలుగా చూస్తారు...

ఈ మధ్య ఒకరు "గురువుగారూ....మీ పాద పూజ చేసుకోవాలని ఉంది....." అంటే....

మంచిది....లోపల మా గురువుగారి పాదుకలు ఉన్నాయి....పూజ చేసుకోండి....అన్నారు.

నిజానికి అవి మన గురుపాదుకలు.

ఇక్కడే మనం తత్త్వన్ని అవగాహన చేసుకోవాలి.

అవి "గురు"పాదుకలు. అంతే.

ఏ గురువు? ఎవరి గురువు? అనేది ముఖ్యం కాదు....

"గురువు సదా ఏకవచనం" అని కదా మన గురువు చెప్పింది.

గురువులు....అని బహువచనంగా వాడితేనే
ఆ గురువు గొప్పా? ఈ గురువు గొప్పా?
అనే పుర్షణ ఉంటుంది....

గురువు ఒకడే అంటే ఏ పుర్షణా ఉండదు....

గురువే కృష్ణుడు.
గురువే బుద్ధుడు.

గురువే క్రీస్తు.
గురువే ప్రవక్త.

గురువే బాబా.
గురువే రమణుడు.

గురువే వీరయ్యగారు.
గురువే సుబ్రహ్మణ్యుడు.

ఏ గురువులోనైనా నీ గురువును దర్శించు.
ఏ గురుపాదుకలోనైనా నీ గురుపాదుకలను దర్శించు.

గురువు చెంత చేరి గురుస్థాయికి తాను ఎదగడమే
ఆ గురువుకు తానిచ్చే నిజమైన గురుదక్షిణ.

ఇది సద్గురుదేవులవారు స్వయంగా వ్రాసిచ్చిన సద్గురు మంత్రం:

ఓం సద్గురు - శ్రీ సద్గురు - శివ సద్గురు - జయ సద్గురు

* * *

## 19. పుణ్య భూమి

---

ఓ వందేళ్ల క్రితం మాట...

శ్రీకాళహస్తి  కైకాలవీధిలో ఓ పెద్ద పెంకుటిల్లు ఉండేది...
అందులో తత్తూరి సిద్ధయ్య అనే అతను కాపురముండేవాడు...

అతను గాండ్లకులమునకు చెందినవాడు...
తన కులవృత్తి(గానుగ) చేసుకుంటూ,
తాను నిర్మించుకున్న రామమందిరంలో రామసేవ చేసుకుంటూ
ఉండేవాడు...
పరమభక్తుడతడు.
గొప్ప తపశ్శాలి.
తన యావదాస్తిని రామమందిరానికి వ్రాసిచ్చి, నిర్వహణాబాధ్యతలను
కైకాల కులస్థులకు అప్పగించి శ్రీరామునిలో ఐక్యమయ్యారు.
ఆ రోజు నుంచి ఈరోజు వరకు కైకాల కులస్తులే శ్రీరామ మందిర
నిర్వహణను కొనసాగిస్తున్నారు.

వారు పూజించిన రాములవారి పటం ఇప్పటికీ
ఆ మందిరంలో పూజలందుకోవడం చూడవచ్చు.

* * *

సిద్ధయ్యగారి తపఃప్రభావమో ఏమోగాని,
ఆ తర్వాత ఎందరో మహనీయులు ఆ దివ్యమందిరంలో అడుగుపెట్టారు...

1.గోపాలస్వామి,
2. మూటలమ్మ,
3. కాయంపేటస్వామి,
4. మడుగులస్వామి
5.కోట్లమ్మ
6.అవధూత లక్ష్మమ్మ

7.తాతగారు,
8. సద్గురు సుబ్రహ్మణ్యం....

ఇలా ఎంతోమంది మహనీయుల దివ్యస్పర్శతో మరింత దైవీశక్తిని నింపుకొని ఆ మందిరం భక్తుల కోరికలు తీర్చే కల్పవృక్షంలా నిత్యశోభాయమానంగా విరాజిల్లుతోంది....

మందిరం వసారాకున్న నాలుగు రాతిస్తంభాలలో చివరి స్తంభం వద్ద గురువుగారు గొంతుక్కూర్చొని, సిగరెట్ త్రాగుతూ  పడమట వైపుకు అలా శూన్యంలో చూస్తు ఉండేవారు.

ఒక్కోసారి వెన్నెలకంటి సుందరరామ శర్మగారు రచించిన జ్ఞానవాశిష్ఠం చదువుతూ ఉండేవారు...
మేం వెళ్లి వారికి యెదురుగా కూర్చోగానే....ఆసక్తిగా
ఆ గ్రంథం గురించి, అందులోని ఉపాఖ్యానాల గురించి గొప్పగా వివరించి చెప్పేవారు...అందులోని తత్త్వరహస్యాలన్నీ తేలిక మాటలతో మాకు వివరించి చెప్పేవారు...

గురువుగారు ఖాళీసమయమంతా ఆ మందిరం వద్దనే గడిపేవారు...

వారి మహనీయతను తొలిసారిగా గుర్తించిన నేను, మా మిత్రబృందం కాళేశ్వరరావు, సుధాకర్, దేవీప్రసాద్, సాంబ, కుమారస్వామి....వారి ప్రక్కన చేరి ప్రతిరోజూ సాయంత్రం  వారి  వాగామృతాన్ని ఆస్వాదించేవాళ్లం....

ఆ మందిరం ప్రక్కనే చెంచురామయ్య అనే రిటైర్డ్ పోలీసు ఉండేవాడు....
గురువుగారు సాక్షాత్తు వీరబ్రహ్మేంద్రస్వామి అని చెప్పేవారు...
అతను రమణమహర్షిని ప్రత్యక్షంగా దర్శించిన పుణ్యాత్ముడు.
అతను గురువుగారి కంటే వయసులో ఎంతో పెద్దవారు అయినప్పటికీ గురువు వద్ద ఎంతో అణకువతో ఉండేవారు, గౌరవభావంతో నమస్కరించుకునేవారు...
అరుణాచలరమణుణ్ణి దర్శనం చేసుకున్న పుణ్యమో, లేక సద్గురు తత్త్వాన్ని ఎఱిగిన పుణ్యమో కార్తికపౌర్ణమి రోజున అతను ప్రాణం విడిచాడు.

* * *

మందిరం తొలిధర్మకర్త మహనీయులు తత్తూరి సిద్ధయ్యగారు కాపురమున్న ఇంటిని, ఇప్పటి ప్రెసిడెంటు మూడు గదులుగా చేసి అద్దెకిచ్చారు...అందులో ఓ గదిలో "సద్గురు సత్సంగం" ఏర్పాటు చేసుకున్నాం...

గురువుగారు ప్రతి సాయంత్రం 5 గంటలకు వచ్చి కూర్చునేవారు...శిష్యులందరూ వారి చుట్టూ చాపలు పరచి కూర్చునేవారు....

చిన్నపిల్లలు వచ్చేవారు....వారికి విభూతి పెట్టి, చాక్లెట్ ఇచ్చేవారు....

ఆ సద్గురు సత్సంగంలో వెలువడిన సద్గురు బోధామృతమే - జ్ఞానప్రసూనాలు.

2017లో గురువుగారు కైకాలవీధిని విడిచి తన కుమారుల వద్దకు శాశ్వతంగా వెళ్లిపోయారు.

మురళీ అనే గురుభక్తుడు ఆ గదిని అద్దెకు తీసుకొని  సత్సంగం కొనసాగిస్తున్నాడు...

"పరమపదం" ఆ సత్సంగానికి అధిష్టానదైవం.

సద్గురు స్పర్శ వలన పునీతమైన
ఆ గదిలో అడుగుపెట్టగానే పరమశాంతి ఆవరించడం అనేది ప్రతి ఒక్కరి అనుభవం.

* * *

మా అమ్మ(సావిత్రమ్మ)గారు మరణించినరోజు(25-9-017)న  కాశీ, నేను మందిరం వద్ద నిలబడి ఏదో మాట్లాడుతూ ఉన్నాం...

హఠాత్తుగా నేనొక మాట అన్నాను కాశీతో...
ఈ మందిరం కూలిపోయే పరిస్థితులు ఉన్నాయి, ముందుగానే కూలదోసి, పునర్నిర్మాణం జరిగితే బాగుండును...ఇక నా జీవితాంతమూ ఈ రామమందిరంలోనే గడిపేస్తాను....అన్నాను.

జ్ఞానాంబ నా మాటలను ఆలకించి ఆనందించిందేమో
యేడాది తిరక్క ముందే ఆ ప్రాచీన  శిధిలమందిరాన్ని పడగొట్టి
కైకాలకులస్తులు నూతన మందిరాన్ని నిర్మించారు...

గురువుగారు లక్షలాది రూపాయిలు ఆ మందిర నిర్మాణానికి విరాళంగా ఇచ్చారు...

ఆ మందిరానికి 7-2-2020 శుక్రవారం నాడు మహాకుంభిషేకం మహా వైభవంగా జరిగింది గురువుగారి సమక్షంలో.

ఆ రోజే అది "అంతే-ఇది ఇంతే" అనే ఆధ్యాత్మిక గ్రంధాన్ని కూడా సద్గురు సత్సంగం తరపున విడుదల చేయడం జరిగింది.

ఆ నూతన మందిరం వలన, మా వీధికి క్రొత్త కళ వచ్చింది.

ఇక నుంచి ఈ మందిరం సద్గురు సత్సంగానికి(అత్యాశ్రమానికి) కేంద్రమని చెప్పడానికి నాకు ఎంతో సంతోషంగా ఉంది.

'నా గురువు' అనే గ్రంథ రచనగానీ,
'రమణీయం' అనే గ్రంథ రచనగానీ
ఆ మందిరంలోనే, రాముని సన్నిధిలో కూర్చొని వ్రాసినవే....

* * *

20. జ్ఞానసాధనలు

---

గురువుగారు కొంతకాలం వారి గురువుగారి పటం ముందు చాప పరచి ధ్యానం చేసుకుంటూ ఉండడమనేది నాకు తెలుసు.

బహుశా ఆ ధ్యానం ఇతరులు ఏదో పొందాలనే చేసే ధ్యానం లాంటిది కాకపోవచ్చు.

ఆ సమయంలో కూడా సంపూర్ణ ఎఱుకలో ఉండేవారు.

ఉదాహరణకు-

వారు ధ్యానంలో ఉన్న సమయంలో...
నేను, నా స్నేహితుడు ముక్కంటి చంద్ర ఇద్దరమూ సద్గురు సన్నిధిలో

కూర్చుని ఉన్నాం ఓ రోజు.

మౌనంగా వారి నిశ్చలరూపాన్ని అలా చూస్తూ ఉన్నాం.

ఇంతలో ఓ ఎద్దు పూజాగదిలోకి రావడానికి ప్రయత్నించింది....గురువుగారి సతీమణి లోపల నుంచి పరిగెత్తుకుంటూ వచ్చి దానిని అదిలించి తరిమివేసింది.

నేను చాలా మెల్లగా గొణిగినట్టు... నా ప్రక్కనున్న స్నేహితునితో ఇలా అన్నాను..."అయ్యవారమ్మ  అజ్ఞానం చూడు...ఇక్కడ ధ్యాననిష్ఠలో ఉన్న పరమేశ్వరుణ్ణి చూడడానికి నందీశ్వరుడు వస్తే అయ్యవారమ్మ అది గ్రహించలేక తరిమివేసింది...
అన్నాను.

గురువుగారు ధ్యానంలో నుంచి లేచిన తరువాత...సత్సంగంలో అన్నారు "నువ్వన్నది నిజమే బాబూ!" అని.

కాబట్టి వారి ధ్యానం మైమరచిన ధ్యానం కాదనేది తేటతెల్లమయ్యింది
* * *

వారు కళ్లు తెరుచుకుని ఉన్నా కూడా ధ్యానం చేస్తున్నట్టే ఉండేది...

ఎంత వ్యవహారంలో ఉన్నా వారి ఆత్మనిష్ఠకు భంగమేమీ లేనట్టుండేది....

భగవాన్ "సంచార సమాధి" అన్నట్టు
దీనిని "వ్యవహార సమాధి" అనాలేమో.

కొంతమంది మాకు మంత్రోపదేశం చేయమని, ధ్యానం నేర్పమని   నోరు తెరచి అడిగినా సరే వారికి ఏమీ చెప్పలేదు సరికదా...అవేవీ అవసరం లేదని చెప్పేవారు.

'నేను ప్రతిరోజూ ధ్యానం చేస్తున్నాను' అని
డాక్టర్ వళర్ మతి గారు గురువుగారితో అన్నప్పుడు, వెంటనే గురువుగారు
'ఇక నుంచి చేయకండి'
అన్న మాటను నేను స్వయంగా విన్నాను.

* * *

మరేం చేయమంటారు? అని అడిగితే...
ఏమీ చేయొద్దు అంటారు.

ఏ సాధనా చేయకపోవడమే గొప్ప సాధన అంటారు.

మీ పని మీరు చేసుకోండి చాలు....అదే గొప్ప సాధన అంటారు.

అవిశ్వాసే సాధన చేస్తాడు.
విశ్వాసి ఊరక ఉంటాడు....అంటారు.

నాతో మాట్లాడుతూ ఉండండి...
అదే సాధన...అంటారు.

* * *

శిష్యులతో మాట్లాడేటప్పుడు వారి ముఖంలో బ్రహ్మతేజస్సు మరింతగా ప్రజ్వలించడం యెన్నోమార్లు గమనించాం.

వారి మొత్తం జీవితంలో ఆనందంగా గడిపిన సమయం ఏదంటే....తన శిష్యులతో గడిపిన సమయమే అనేది అందరూ అంగీకరిస్తారు గురువుతో సహా.

నా నిజమైన ఆస్థి మీకే చెందుతుంది అంటారు...

నేను పొందింది నిజమే అయితే అది మీకు చెందే తీరుతుంది...అంటారు....

ఉచితంగా ఇవ్వబడింది...ఉచితంగానే ఇవ్వండి...
అన్న క్రీస్తు వాక్యం గుర్తుకొస్తోంది.

వారు ఆ బ్రాహ్మీస్థితిని ఉచితంగా పొందారు.
శిష్యులందరూ ఉచితంగానే పొందాలనేది వారి హృదయం.

అందుకే వారు ఏ సాధనా వద్దనేది.
"అది" మనకు ఉచితంగా ఇవ్వబడుతుంది.

తండ్రి ఆస్థికై కుమారుడు ఏ సాధన చేస్తున్నాడు?

పరమతండ్రి పరిపూర్ణుడు...కావున నీవూ పరిపూర్ణుడవే అన్నారు క్రీస్తు.

* * *

అంతవరకు(ఆత్మానుభవం పొందేవరకు) మనం చేయవలసిన సాధన...
కాయ కొమ్మను అంటిపెట్టుకుని ఉన్నట్లు
మనం సద్గురు సన్నిధిని అంటిపెట్టుకుని ఉండడమే.

కాయ పండైనట్టు
తాను పండిపోతాడు.

* * *

వారు వివిధ సందర్భాలలో ప్రబోధించిన
జ్ఞాన సాధనలు కొన్ని....

1. నీకు నీవు ఒక్క అడుగు ఎడంగా ఉండు.

2. తనువులో నేనున్నాను అని కాకుండా
నాలో తనువుంది అని ఉండు.

3. నేనుగా జీవించు....బాబుగా నటించు....

4. నేను తనువుకు లోపలే కాకుండా, వెలుపల కూడా నిండి ఉన్నాను అని ఉండు.

5. నేను-నేను అంటూ జపం చేస్తూ ఉండు.

6. 'ఇది ఒక కల' అని ఉండు.

7. మానసికంగా పాలపుంత కూడా చిన్న చుక్కలా కనిపించేంత దూరం వెళ్లిపో. అక్కడే ఉండు.

8. వ్యవహారం ఎట్లైనా ఉండనీ..."నాలో" అని ఉండు.

9. మృత్యువును తలపోస్తూ ఉండు.

10. ఏది నేనుగా ఉన్నదో అదే నేను అని ఉండు.

* * *

జ్ఞానశిశువు
9533667918

21. దేవీప్రసాదం

---

దేవీప్రసాద్ నా బాల్య స్నేహితుడు.
పుట్టి, పెరిగిందంతా మా వీధిలోనే...

రామ మందిరానికి ముందరింట్లో ఉండేవాళ్లు...
వాళ్లనాన్న చిరుద్యోగి...పేదరికం...

అయినా సరే పట్టుదలతో మంచి చదువు చదివి,
చదువుచెప్పే ఉద్యోగం సంపాదించుకున్నాడు దేవీప్రసాద్...
భాషణం మితం...వ్యవహారం మితం...

ప్రతిరోజూ సాయంత్రం మేమిద్దరం వాళ్ళ ఇంటిముందు యెప్పుడూ వాల్చబడిన నులకమంచంపైన కూర్చుని కబుర్లు చెప్పుకునేవాళ్ళం....

మా చిన్ననాడు చదువుచెప్పిన వెంకటముని అయ్యవారు కూడా...మాతో గడిపేవారు...వివేకానంద గుఱించి మేము అబ్బురపడే విధంగా చెప్పేవారు...

నేను వివేకానంద గుఱించి మొదటిసారిగా విన్నది
మా వెంకటముని అయ్యవారి ద్వారానే...

వారి పూజా మందిరంలో దేవుడిపటాలతో పాటు వారి పటం కూడా పూజలందుకోవడం ఆ చిన్నవయస్సులో నాకు ఆశ్చర్యానికి గురి చేసింది...

గురువుగారనేవారు-
"అంతా మాయే" అన్నా,
"అంతా ఆత్మే" అన్నా
నీ నుంచే మొదలుపెట్టు...అని.

మరి మా వెంకటముని అయ్యవారు చేసింది కూడా అదే...
అంతా "భగవత్స్వరూపమే" అనే సత్యాన్ని తన నుంచే మొదలుపెట్టారు కాబోలు...

నుదటన త్రిపుండ్రాలు తీసి, పెద్ద కుంకుమ బొట్టు పెట్టేవారు....

దాని గుఱించి ఆసక్తికరమైన విషయం చెప్పారు-
"బాబూ...! ఈ బొట్టు పెట్టడం నేనేదో గొప్ప భక్తుణ్ణని ప్రకటించుకోవడానికి కాదు...

ఈ చంచలమైన మనసు తప్పుడు మార్గంలో వెళ్లినప్పుడు ఈ బొట్టు గుర్తుకు వచ్చి నన్ను అదుపులో పెడుతుంది...

"ఏమయ్యా! ఆ ముఖం మీద అంత పెద్ద బొట్టుకుని వచ్చావు నువ్వే ఇలా చేస్తే ఎలా?" అని ఎవడైనా ముఖం మీదే అడిగేస్తాడేమోనని భయపడి అయినా తప్పు చేయకుండా ఉండటానని ఇలా బొట్టు పెడుతున్నాను...అన్నారు.

వారు రమణమహర్షి ప్రత్యక్షభక్తులైన కె.కె.నంబియార్(ఇంజనీరు)వద్ద పనిచేశారు.....
కానీ వారు ఒక్కసారి కూడా తనతో రమణ భగవానుల గురించి ప్రస్తావించలేదని....లేకుంటే తనకు రమణభగవానులను ప్రత్యక్షంగా దర్శించుకునే భాగ్యం కలిగి ఉండేదని నాతో వాపోయారు...

రమణభగవాన్ గురించి తొలిసారిగా ఆ అయ్యవారు నా ద్వారానే విన్నారు....

అప్పట్నుంచి ఆ గురువు నన్ను గురువుగా భావించి
నా యెడల యెంతో విధేయతతో ఉండేవారు....
అది నాకు ఇబ్బందిగా కూడా అనిపించేది....

భగవానులా తానూ కౌపీనం ధరించి ఓ ఫోటో తీసుకునేంతగా మమేకం అయ్యారు రమణభక్తిలో....

తన తండ్రి వ్రాసిచ్చిన జాతకం ప్రకారం ఇక నేనుండేది కొద్దిరోజులే...అని నాకు చెప్పారు.....

వారు చెప్పినట్టే....కొద్దిరోజులకే....."హే!భగవాన్!" అంటూ ఇంట్లోనే ప్రాణం విడిచారు.

వారు ప్రాణం విడిచిన ఆ ఇంటిలో
గతంలో మన గురుదేవులవారు అద్దెకుండేవారు...

వారు ప్రాణం విడిచిన గది
గురువుగారు గతంలో పూజామందిరంగా ఉపయోగించిన గది.

గురువుగారు ఎంతోకాలం ప్రాణాయామం, ధ్యానం, పూజ...లాంటి అనుష్ఠానాలు చేసిన గది.

అటువంటి గదిలో ప్రాణం విడిచి రమణైక్యం చెందిన మహాభక్తుడు మా వెంకటముని అయ్యవారు.

వారింటికి ఎదురులైన్ లోనే మా ఇల్లు ఉండేది...వారు ప్రాణం విడిచిన పదినిషాల్లోపే అక్కడికి చేరుకుని వారి నిశ్చల శరీరాన్ని చూశాను...
"బాబూ! నా జాతకంలో మానాన్న చెప్పిన తేదీ ఈ రోజే"
అని వారు అన్నట్టు నాకు అనిపించింది.

దేవీప్రసాద్ కు సంబంధించిన వ్యాసంలో వెంకటముని అయ్యవారి ప్రస్తావన అప్రస్తుతం కాదు, సుబ్రహ్మణ్యగురుదేవులవారు పరిచయం కాక మునుపే మా స్నేహితులిద్దరికీ వివేకానంద కథలు చెప్పి ఆధ్యాత్మిక స్ఫూర్తినిచ్చినవారు వెంకటముని అయ్యవారు...వారికి ఈ కొద్ది అక్షర సుమాంజలి.

* * *

నాకు ఇళయరాజా సంగీతం అంటే చాలా ఇష్టం. అందుకోసమే నేను గిటారు,ఫ్లూటు... లాంటి సంగీత పరికరాలు తీసుకుని సాధన చేసేవాడిని.

దేవీప్రసాద్ కు మాత్రం  నాటకాలు అంటే చాలా ఇష్టం. ఆ ఇష్టంతోనే స్వయంగా నాటకాలు రచించి, తనే దర్శకత్వం వహించి రామమందిరం వద్ద జరిగే ఉత్సవాలలో ప్రదర్శించేవాడు.

* * *

గురువుగారి గురువైన తాతగారు వీళ్ల ఇంటిముందునుంచే గురువుగారి ఇంటికి పోతూ....వస్తూ...ఉండేవారు...
తాతగారి నడకను, వారి శైలిని విచిత్రంగా చూస్తుండేవాళ్లం....

* * *

అది 1988 వ సంవత్సరం. ఆరోజు గురువారం... సాయంకాలం నాకోసం దేవీప్రసాద్ మా ఇంటికొచ్చాడు. ఆ సమయంలో నేను ఇంట్లోలేను...

అదే సమయంలో  గురువుగారు మా ఇంటి ముందున్న అరుగుపై కూర్చోని ఉన్నారు. గురువుగారు మానాన్న స్నేహితుడు.
అప్పుడప్పుడు మా నాన్న కోసం
ఎక్కువగా నా కోసం వచ్చేవారు.

"బాబు ఎక్కడకెళ్ళాడు?" అని దేవీప్రసాద్ ని అడిగారట గురువుగారు.
"ఏమోసార్, నాకూ తెలియదు. నేనూ బాబుకోసమే వచ్చాను" అన్నాడు దేవీప్రసాద్.

గురువుగారికి సిగరెట్టు తాగడం అలవాటు కదా!
ఆ సమయానికి సిగరెట్టు పెట్టె ఖాళీ అయిపోయింది.

సిగరెట్టు ఖాళీ అట్టముక్క మీద....
దుర్వాసమహాముని పార్వతీదేవికి అనుగ్రహించిన-
"పార్వతీ స్వయంవర మంత్రం" వ్రాసిచ్చారు.

ఓం హ్రీం యోగినీ యోగినీ యోగీశ్వరీ
యోగ భయంకరీ సకల స్థావర జంగమస్య
ముఖహృదయం మమ వశం
ఆకర్షయ ఆకర్షాయనమః

ప్రతిరోజూ ఒకసారి ఆ మంత్రాన్ని జపం చేసుకోమన్నారు.

అంతేకాదు "నీవు ప్రతి శుక్రవారం శివాలయానికెళ్ళి...
అపసవ్యదిశగా అనగా ముందు జ్ఞానప్రసూనాంబను దర్శించుకుని తర్వాత శివుణ్ణి దర్శనం చేసుకుని,
తొమ్మిది సార్లు పై మంత్రాన్ని జపం చేసుకోమన్నారు.
ఇలా తొమ్మిది వారాలు చేయమన్నారు గురువుగారు.

చదువుకుంటున్న పసిబాలుడు, 16 ఏళ్ల దేవీ ప్రసాద్ కు ఏ సరస్వతీమంత్రమో వ్రాసివ్వాలిగాని, విచిత్రంగా పార్వతీ స్వయంవర మంత్రాన్ని ఎందుకు వ్రాసివ్వడం? అనిపిస్తుంది.

గురువుగారు భవిష్యద్దర్శనం చేసినవారు గనుకనే
ఆ మంత్రం వ్రాసిచ్చారు....

దేవీప్రసాద్ కు ఉద్యోగం వచ్చి వివాహం చేసుకోదలిచాడు....

యెన్ని సంబంధాలు చూస్తున్నా సరే ఒక్కటీ కుదరటం లేదు....

కుటుంబ సభ్యులు విసిగివేసారిపోయారు...

ఇక వీడికి పెళ్లి కాదు....అనుకునేశారు అంతా...

స్నేహితులంతా "పెళ్లికాని ప్రసాద్" అని అవహేళన చేసేవారు...

2010 ధనుర్మాస దీక్ష చేశాడు దేవీప్రసాదు...
దీక్ష చివరిరోజైన సంక్రాంతి నాడు గురుపత్ని పద్మావతమ్మగారి సమాధి వద్ద ఆరాధనోత్సవం....
గురువుగారు దేవీప్రసాదును పిలిచి...
వివాహం కావాలి....అని సంకల్పించి కొబ్బరికాయ కొట్టమన్నారు....అలానే చేశాడు.....

ఆశ్చర్యం....
ఆ సాయంత్రమే మా వీధిలోనే పండక్కి అవ్వగారింటికి వచ్చిన
భాగ్యచందన అనే అమ్మాయి కనబడింది...
ప్రసాదుకు ఆ అమ్మాయి తెగ నచ్చేసింది....
నన్ను విచారించమన్నాడు...
మా భార్య వెళ్లి అమ్మాయి పెద్దలతో మాట్లాడి సంబంధం ఖాయం చేసేసింది.
త్వరలోనే వివాహం అయ్యింది...
కార్తికేయుడే కుమారుడుగా జన్మించాడు.

ఇదంతా గురువు అనుగ్రహించిన దివ్యమంత్రఫలం....

* * *

నేను, దేవీప్రసాద్ ప్రతిరోజూ సాయంత్రం గురువుగారితో గడిపేవాళ్లం.
గురువుగారి చెప్పే
ఆ అమృత తుల్యమైన మాటలను నేను రాసి పెట్టుకునే వాణ్ణి.

దేవీప్రసాద్ మాత్రం ఎప్పుడూ మౌనంగా వినేవాడు.
వారి చిన్న చిన్న మాటల స్ఫూర్తితో కథలు వ్రాయడం మొదలుపెట్టాడు....
చిత్తూరు జిల్లాలో ప్రముఖ రచయితగా పేరొందాడు.

* * *

దేవీప్రసాద్ ప్రతి గురువారం గురువుగారికి ప్రసాదం తెచ్చేవాడు.
ఏదైనా పని ఉండి ఒక వారం దేవీప్రసాద్ సత్సంగానికి రాకపోతే...
"ఏంబాబు...! ఈరోజు గురువారం కదా... ప్రసాద్ ప్రసాదం తేలేదా?" అని అడిగేవారు గురువుగారు.
ఒక్కొక్కసారి గురువారం దేవీప్రసాద్ మరచిపోయి ప్రసాదం తీసుకురాకపోతే అడిగి మరీ తెప్పిచ్చుకునేవారు.
అవును మరి అది "దేవీప్రసాదం" కదా!

* * *

అంతేకాదు-
1.దేవీప్రసాదం
2. సద్గురు హృదయం(కలర్)
3. లోపలిమాట
అనే పేర్లతో గురుబోధలు కలిగిన మూడు పుస్తకాలను ముద్రించి ఆధ్యాత్మిక లోకానికి ప్రసాదంగా ఇచ్చాడు దేవీప్రసాద్.

* * *

దేవీ (జ్ఞానప్రసూనాంబిక)
మా రమణ సత్సంగానికి ప్రసాదించిన
దివ్యప్రసాదం మా దేవీప్రసాదం...

* * *

22. అవధూత పొన్నారావు

---

రమణ సత్సంగంలో, సద్గురు సన్నిధిలో
ఓ శ్రద్ధాళువు ఉండేవాడు.

అతని పేరు "పొన్నారావు".

నా ప్రియ స్నేహితుడు.
నా బాల్య స్నేహితుడు.

గురువు తనకు అప్పగించిన ప్రతి పనిని ఎంతో శ్రద్ధతో చేసేవాడు.

వారంలో ఒకరోజు గురువుగారి స్కూటర్ ను సబ్బు నీటితో  కడిగి, తుడిచి అద్దంలా తయారు చేసేవాడు.

అతనికి "నా" అన్నవారెవరూ లేరు.
ఏకాకిగా తిరుగుతుండేవాడు.

ఎక్కడ తింటాడో, ఎక్కడ పడుకుంటాడో
అతడికే తెలియదు.

అతను మంచిఫోటోగ్రాఫర్...
వివాహాది కార్యాలకు వెళ్లి ఫోటోలు తీసేవాడు....

డబ్బులు ఇస్తే తీసుకునేవాడు, ఇవ్వకపోతే అప్పు చేసైనా వారి ఆల్బం వారికి చేసిచ్చేసేవాడు....

బాగా తీసేవోయ్....!

ఫోటో తీస్తే పొన్నారావే తీయాలి...!

అంటూ పొగడ్తలు....

డబ్బులు ఇచ్చేవాళ్లు కాదు...

డబ్బులు వాయిదా వేసేవాళ్లు....

ఆల్బమ్ కై చేసిన అప్పులు తీర్చలేక తిప్పలు....

అప్పులోళ్ల బాధలు పడలేక ఒక్కొక్క వీధిలోకి సరిగా వెళ్లలేకపోయేవాడు...

"ఆ వీధిలో నాకు కర్ఫ్యూ విధించారు...." అనేవాడు నవ్వుతూ...

రమణాశ్రమం డైనింగ్ హాల్ లో... వరల్డ్ బెస్ట్ ఫోటోగ్రాఫర్ David Gogai ప్రక్కన కూర్చుని భోంచేసే అవకాశం కలిగింది....అంటూ ఎంతో మురిసిపోయి,  అందరికీ సంతోషంగా చెప్పుకునేవాడు...

గురువుగారివి మంచి మంచి చిత్రాలు తీసిచ్చేవాడు.

గురువుగారు వాటిని అందరికీ మురిపెంగా చూపించేవారు...

ఈ రోజుటి వరకు సద్గురు గ్రంథాలలో వాడుకుంటున్న ఫోటోలు అతను తీసినవే.

కొంతకాలం పాటు తన స్వంత ఖర్చులతో రమణ సత్సంగాన్ని నడిపారు.

అలా పొన్నారావు నిలబెట్టిన సత్సంగం వల్లనే ఎన్నో విలువైన సద్గురు బోధలను బాబుకు భద్రపరుకునే అవకాశం కలిగింది.

ఈ రోజు దేశ నలుమూలల నుంచి భక్తజనం వచ్చి సద్గురుసన్నిధిని అనుభవిస్తున్నారంటే,
దానికి కారణం పొన్నారావే అనడంలో అతిశయోక్తి కాదు.

ఈ విషయంలో ప్రతి సత్సంగ సభ్యుడూ పొన్నారావుకు ఋణపడి ఉంటాడు.

స్వేచ్ఛాజీవియైన తాతగారి శైలే
పొన్నారావులో పొటమరించేది.

అందుకే పొన్నారావుతో సహవాసం
మాకందరికీ ఎంతో ఆనందాన్నిచ్చేది.

పొన్నారావు బీడీ త్రాగినా సరే ఎంతో స్టైల్ గా ఉండేది.
వాడు నిర్లక్ష్యంగా వదిలిన పొగ
ఈ స్వార్థప్రపంచంపై ఉమ్మి వేసినట్లుండేది.

ప్రతి యేడు తాతగారి మరియు రమణ ఆరాధనోత్సవాల్ని ఘనంగా జరిపేవాడు.

హఠాత్తుగా అతనికి అనారోగ్యం కలిగింది...
మిత్రుడు భూపతి హాస్పిటల్ కు తీసుకెళ్లి చూపించాడు...
ఎక్కువ కాలం బ్రతకడు అన్నారు డాక్టర్లు...

నవ్వాడు పొన్నారావు....
నిజంగా స్థితప్రజ్ఞుడు పొన్నారావు....

ఆ పరిస్థితిలో ఎవడికీ నవ్వు రాదు...

భూపతి తీవ్ర దుఃఖంతో సద్గురు సన్నిధి చేరి భోరున ఏడ్చాడు....

అతని అనారోగ్యాన్ని తనకు ట్రాన్స్ ఫర్ చేయమని వేడుకున్నాడు....

"పొన్నారావు అదృష్టవంతుడు...ప్రాణం ఇవ్వగలిగే నీ లాంటి స్నేహితుణ్ణి కలిగి ఉన్నందుకు...." అన్నారు గురువుగారు భూపతి తో.

ఆ మాటలేవీ అతణ్ణి సంతోషపెట్టలేదు...
ఆ తీవ్ర దుఃఖంలో ఈశ్వరనింద చేశాడు....

ఎందుకు ఈశ్వరుడు  మనుషులతో ఇలా  ఆడుకుంటాడు...?
అని గురువుగారిని నిలదీశాడు భూపతి....

"ఏమో...నాకు మాత్రం ఏం తెలుసు?  ఈశ్వరుణ్ణే అడుగు" అన్నారు.

పొన్నారావు ఏం తప్పు చేశాడని....అమ్మా లేదు, నాన్నా లేడు, గురువూ లేడు, దేవుడూ లేడు....

అందరూ అలా వదిలేస్తే వాడి పరిస్థితి ఏమి? అని గట్టిగా ప్రశ్నించాడు భూపతి....

"వచ్చిన కలను చూడడం తప్ప, నచ్చిన కలను చూడడం సాధ్యం కాదు" అన్నారు గురువుగారు.

"ఇది నిజం అనుకుంటేనే అన్నీ బాధిస్తాయి...ఇది ఒక కల అని ఉంటే ఏదీ బాధించదు."

నీవనుకున్నట్లు....ఈశ్వరుడు బాధించడమే కాదు... ఈశ్వరుడు అనుగ్రహించడం కూడా కలలో భాగమే"

పాప పుణ్యాలు
కష్ట సుఖాలు
స్వర్గనరకాలు
బంధమోక్షాలు

రెండూ సమమే...
రెండూ స్వప్నమే....

అంటూ భూపతిని ఓదార్చారు గురువుగారు.

కొద్ది కాలానికి పొన్నారావు కన్నుమూశాడు.

సద్గురు శైలిలో చెప్పాలంటే -
ఈ జగత్తు యావత్తు ఎవడి కలో
వాడిలో కలిసిపోయాడు పొన్నారావు...

అందరి ఫోటోలూ తీసి
తనకంటూ ఒక్క ఫోటో కూడా తీసుకోని
వైరాగ్యమూర్తి పొన్నారావు....

ఓ సన్న్యాసిలా  జీవించాడు పొన్నారావు...
ఓ అవధూతలా తనువును త్యజించాడు పొన్నారావు...
నా ఆత్మీయుడు పొన్నారావు...

* * *

23. భోజరాజు

---

మా రమణ సత్సంగసభ్యుల్లో ఓ ఆణిముత్యం - రెడ్డిగారు.

చిన్నా పెద్దా అందరూ ఆప్యాయంగా "రెడ్డన్నా" అని, "రెడ్డిగారు" అని పిలుస్తారు.

అసలు పేరు ఆధారుకార్డు, రేషనుకార్డులో ఉండడం తప్ప ఇంకెవరికీ తెలియదు.

రెడ్డిగారి పూర్తి పేరు..."మాడంబాకం మునికృష్ణారెడ్డి."

జ్ఞానప్రసూనాంబ జన్మస్థలమైన "జ్ఞానాంబ ఖండిక" అనే గ్రామంలో జన్మించడం....

జ్ఞానప్రసూనాంబావతారులైన సద్గురువు చెంత చేరడం...
సద్గురు బోధలైన "జ్ఞానప్రసూనాలు" గ్రంథాలు ప్రచురించడం....
ఇవన్నీ "రెడ్డి నా బిడ్డ" అని జ్ఞానాంబ చెప్పక చెప్పినట్లయ్యింది....

* * *

భూమ్మీద అంతరించిపోతున్న జాతులలో
"అమాయక జీవుల" జాతి కూడా ఒకటి.

రెడ్డిగారు అమాయక జీవి.

ఆపదలో ఉన్నవారికి మధ్యవర్తిగా ఉండి అప్పులు తీసిస్తుంటాడు....

వారు కట్టకపోతే రెడ్డిగారే మరో చోట అప్పు చేసి, అసలు, వడ్డీ కట్టేస్తుంటాడు.....

అప్పు ఎగ్గొట్టినవారి వల్ల రెడ్డిగారి వ్యక్తిత్వానికి నిండుతనం వచ్చిందేతప్ప, రెడ్డిగారు బెదిరిపోలేదు, చెదిరిపోలేదు...

ఇతరుల వలన తాను మోసపోతున్నాను అని తెలిసి కూడా ఆనందంగా మోసపోయే అమాయకపు జీవి రెడ్డిగారు.

తనకు స్తోమత లేకపోయినా సరే, అప్పుచేసి మరీ
ఓ ఐదు సద్గురుగ్రంథాలను ప్రచురించి ఆధ్యాత్మిక లోకానికి ఉచితంగా ప్రసాదించిన అమాయకపు జీవి రెడ్డిగారు.

సత్సంగంలో యెంతోమంది ధనికులున్నా సరే
వారు చేయలేని పనులను తానే చొరవ తీసుకుని
' పుస్తక ప్రచురణలు, సత్సంగం నిర్వహణ, యాత్రలు, సద్గురు జయంత్యోత్సవాలు....ఇలా...చాలా చాలా వాటికి ఉదారంగా ఖర్చు పెట్టే అమాయకపు జీవి రెడ్డిగారు.

ప్రముఖ సినీనటులు చిత్తూరునాగయ్యగారి జయంత్యుత్సవాన్ని ప్రతి యేటా ఘనంగా నిర్వహించే అమాయకపు జీవి రెడ్డిగారు.

చేసిన అప్పులు తీర్చడానికి...
ఉన్న వ్యవసాయభూమిని కూటినీళ్లకు అమ్ముకున్నా సరే, ముఖంలో చిరునవ్వు చెరగని అమాయకపు జీవి రెడ్డిగారు...

* * *

రెడ్డిగారు ప్రచురించిన "జ్ఞానప్రసూనాలు" పుస్తకావిష్కరణ సందర్భంగా గురువుగారు రెడ్డిగారిని "భోజరాజు" అని కొనియాడారు...

ఆశీర్వాదాలు తీసుకోవడానికని గురువు వద్దకు యెంతోమంది కోటీశ్వరులు వచ్చిపోతుంటారు...

వారెవరికీ రాని "భోజరాజు" అనే పేరు రెడ్డిగారికి రావడం మనమందరం హర్షించదగిన విషయం...

అంతేకాదు..."రెడ్డి పాదాలకు నా నమస్కారాలు" అన్నారు హఠాత్తుగా నిండు సభలో.

గురుభక్తులంతా అదిరిపోయారు....

గురువుగారు ఏ మాత్రమూ నామోషీ పడకుండా శిష్యుని యెడల తనకున్న భావాన్ని అలా అందరిలో వ్యక్తీకరించడం...
నిజంగా ఆ అరుదైన ఘటనతో గురుకీర్తి ద్విగుణీకృతమైంది....

ఏ గురుచరిత్రలోనూ ఇటువంటి ఘటన జరిగి ఉండి ఉండదు....

* * *

తాతగారు రెడ్డిగారికి పరిచయం లేరుగాని,
ఉంటే మాత్రం రెడ్డి వెనుకే తిరిగుండేవారు...
తాతగారు సహవాసం చేసేది అమాయకపుజీవులతోనే  కదా!

తాతగారు యెక్కువగా "నక్కలవాళ్లు" నివసించే చోట్లకు వెళ్లి వారితో కలిసి సంతోషంగా గడిపేవారు...వారితో కలిసి మద్యం తీసుకునేవారు...వారు వండి పెట్టే రకరకాల పిట్టల మాంసం తినేవారు...

అలాంటివారే రెడ్డిగారు కూడా...
రోజూ మద్యం, మాంసం ఉండవలసిందే....

తాతగారు కోపస్వభావి.
రెడ్డిగారు శాంతస్వభావి.

తప్పితే ఇద్దరూ గొప్ప స్థితిలో ఉన్నవారే.
ఇద్దరికీ ప్రపంచం పట్ల నిర్లక్ష్యమే.

జనాభిప్రాయంతో  బ్రతికే బ్రతుకులు కావవి.
దేవుడు కోసం ప్రాకులాడే బలహీన జీవితాలు కావవి.

తలపై కిరీటం లేని స్వేచ్ఛా చక్రవర్తులు వారు.
కాళ్లకు చెప్పులు లేని సంచార యోగులు వారు.

* * *

రెడ్డిగారు కేవలం మత్తుడు మాత్రమే కాదు,
స్నేహం కోసం ప్రాణమిచ్చే ఉన్నతుడు...
గురువు కోసం ప్రాణం విడిచే ఉన్మత్తుడు....

గురువుగారూ!
"నేను నిద్దట్లోనే చనిపోవాలి" అని
గురువుగారిని నికార్సయిన కోరికను కోరిన నికార్సయినవాడు రెడ్డిగారు.

* * *

ప్రతి అరుణాచల యాత్రలో రెడ్డిగారు ఉండవలసిందే...
అప్పుడే ఆ యాత్ర సఫలం అయినట్లు సత్సంగసభ్యులు భావిస్తారు...

* * *

సాధారణంగా అందరికీ ఐహికభోగమే ఉంటుంది....
రెడ్డిగారికి పారమార్థిక భోగం కూడా సమకూడింది...

ప్రతిక్షణాన్ని సంపూర్ణఎఱుకతో జీవించడమే
ఆ పారమార్థిక భోగం....

"విశ్వాసం" అనే మత్తుపానీయాన్ని ఘూటుగా త్రాగి
మత్తెక్కి గురుపాదాలపై సోలిపోవడమే ఆ పారమార్థిక భోగం.

"నవ్విపోదురుగాక...నాకేటి సిగ్గు" అన్న చందాన
నవ్వులపాలవుతున్నా సరే, అందర్నీ నవ్విస్తూ, నవ్వుతూ ఉండడమే
పారమార్థిక భోగం

ఆ మహా భోగికి...
ఆ మహా యోగికి...
ఏమిచ్చి సంతోషపెట్టగలం...

చిత్తూరుజిల్లా యాసలో-
"ఏంబా రెడ్డిగారూ....!"
అంటూ అతణ్ణి పలకరించడం తప్పు....
* * *

## 24. "శూన్యయోగి"

---

మా శ్రీకాళహస్తి, కైకాలవీధిలో పురుషోత్తం అనే గణపతి భక్తుడుండేవాడు...
విద్యుత్ శాఖలో పనిచేసేవాడు...

అనిలాచల పర్వతానికి దిగువనే ఉన్న ముక్తిగణపతి ఆలయాన్ని జీర్ణోద్ధరణ చేసి, వెలుగులోకి తీసుకొచ్చాడు...

అక్కడ ఏవేవో హోమాలు చేయిస్తుంటాడు...
పూర్ణిమ సమయాల్లో అన్న సంతర్పణం చేయిస్తుంటాడు...

అతని కుమారుడు - మురళీ.
ఇతనూ గణపతి భక్తుడే.

మురళీ మా సత్సంగానికి అప్పుడప్పుడు  వచ్చేవాడు...
ఐతే, మాతో పాటు కూర్చునేవాడు కాడు...
నిలబడే ఉండేవాడు...
మేమందరం తినడానికి వేడివేడిగా వడలు, బోండాలు, కారంపచ్చడి తెచ్చేవాడు...

మొదట్లో గురువుగారి చేత సిగరెట్స్ మాన్పించాలని ప్రయత్నించాడు...

మురళీనే స్వయంగా నాకు సిగరెట్స్ తెచ్చిచ్చే రోజు వస్తుంది....అన్నారు గురువుగారు.

నిజంగానే కొంతకాలం తర్వాత, మురళీనే స్వయంగా సిగరెట్ పెట్టెలు కొని తెచ్చాడు...

గురువుగారిని "ఖాళీ"స్వరూపంగా గుర్తించాడు.
సిగరెట్స్ వారినేమీ చేయవు...అనే నిశ్చయానికొచ్చాడు...

తాను "ఏదో" గురువులో కూడా "అదే" దర్శిస్తారు. కాబట్టి, గురువుగారిని "ఖాళీ" స్వరూపంగా గుర్తించిన మురళీ కూడా "ఖాళీ" స్వరూపమే...

* * *

గురువుగారు మా కైకాలవీధిని వీడి శాశ్వతంగా
తన కుమారుని ఇంటికి చేరుకున్నాక-

ఆ సత్సంగం గదిని గురువుగారి జ్ఞాపకార్థంగా ఉండాలని భావించి ఆ గదిని అద్దెకు తీసుకున్నాడు మురళీ.

మేము ప్రతిసాయంత్రం 7 నుండి 8.30 వరకు
ఆ గదిలోనే గడుపుతాం.

మా సత్సంగానికి "అత్యాశ్రమం" అని పేరు పెట్టుకున్నాం.
"పరమపదం" మా అత్యాశ్రమానికి అధిష్ఠానదైవం.

* * *

సాయంత్రం మురళీ రాక ముందే నేను ఆ గదికి వచ్చి, దీపం పెట్టి, చాపలు పరచి కూర్చుంటాను...

నేను ఏదో ఒక పుస్తకం తీసుకొని చదవడమో
ఫోన్ లో నోట్స్ వ్రాసుకోవడమో చేస్తుంటాను..

మురళీ ప్రవేశించగానే అతని ప్రభావం వలన
నేను కూడా "ఖాళీ" అయిపోతాను...
పుస్తకం, ఫోను వదిలి
అలా ప్రశాంతంగా కూర్చుండిపోతాను...
వాతావరణం, అంతఃకరణం "హాయి"గా ఉంటుంది...

సద్గురు సన్నిధిలో ఉండే ప్రశాంతత
మురళీ సన్నిధిలో కూడా ఉండడం విశేషం.

గురువు తరువాత గురువు - మురళీ.
సందేహం లేదు.

అటు పరమగురువును(తాతగారిని)
మధ్యలో సద్గురువును,
ఇటు మూడోతరం గురువైన మురళీని

ముగ్గురి సాన్నిధ్యాన్నీ అనుభవించిన "బాబు" ఎంత అదృష్టవంతుడు!!!

వేంకటనరసయ్య అన్నట్టు-
దేవతలు సైతం బాబును చూసి ఈర్ష్యపడవలసిందే...
* * *

మురళీ స్ఫూర్తితోనే "ఖాళీ" అనే వ్యాసం కూడా వ్రాయడం జరిగింది.
(వ్యాసం నెంబర్: 44 )
* * *

మా సత్సంగంలో ఓసారి భక్తి గురించి ప్రస్తావన వచ్చినప్పుడు-

"భక్తి-భక్తి అంటారే! ఇంతకీ భక్తి అంటే ఏమి?
ఇంతవరకూ దాని రుచి నాకు తెలియదు..."అన్నాడు రైల్ మురళి హఠాత్తుగా.

నిజమే...ఎలా తెలుస్తుంది?
మురళీ శూన్యోపాసకుడు.
సదా "ఖాళీ" లో ఉంటాడు.

పుట్టుకతోనే కర్మకు భక్తికి పై స్థాయిలో ఉన్నవాడు...
అతడు పుట్టుకతోనే "శూన్యయోగి".

అతనికి నేను భక్తి నిర్వచనాలు చెప్పి ఒప్పించడం
నా కర్తవ్యమూ కాదు,
వాటితో అతనికి అవసరమూ లేదు.

అందుకే మౌనం వహించా...
సమాధానం కోసం అతడు నా వైపు చూడలేదు...

బహుశా ఆ "శూన్యయోగి" నా మౌనాన్నే సమాధానంగా తీసుకొని ఖాళీలోకి జారిపోయి ఉంటాడు...

ఒకవేళ నేను ఏదో ఒక నిర్వచనం ఇచ్చివుండినా సరే,
నా సమాధానాన్ని కూడా తనతో పాటు తీసుకెళ్లి ఖాళీలోకి
జారిపోయేవాడే...

అంత సంబడానికి నేనెందుకు సమాధానం చెప్పడమని నేనూ మౌనంలోకి
జారిపోయా...

ఆ "శూన్యం"
ఈ "మౌనం"
రెండూ ఒకటే... పేర్లు మార్పు అంతే.

కర్మలో భక్తిలో కదలిక ఉంటుంది.
శూన్యంలో మౌనంలో అచలత ఉంటుంది.

భక్తికి నిర్వచించడం కష్టమే.
కష్టపడి నిర్వచించినా అది విన్నవాడికి
ఏ మాత్రమూ, ఏ మాత్రమూ, ఏ మాత్రమూ
ఉపయోగపడదు.

భక్తి అంటే ఏమి?
భక్తి ఎలా కలుగుతుంది?
భక్తి కలగాలంటే ఏం చేయాలి?
లాంటి ప్రశ్నలు అర్థరహితం.

మా వీధిలో  ఓ పిచ్చి రచయిత్రి ఉండేది...
ఏవేవో పిచ్చి పిచ్చి కథలు వ్రాస్తుండేది...
నాకు చూపెడుతుండేది...

ఓ రోజు ఓ ప్రేమకథ వ్రాసి, ఎలా ఉందో చూడు అంటూ నా చేతికిచ్చింది...

కథ  గుర్తు లేదుగానీ, అందులో ఓ డైలాగు నాకు ఇప్పటికీ బాగా గుర్తు...

ఆ డైలాగ్ గుర్తుకొచ్చినప్పుడల్లా నాకు నవ్వొస్తుంటుంది...

అందులో హీరోయిన్ హీరోతో అంటుంది...

"నేను నిన్ను ఈరోజు నుంచి ప్రేమించాలని అనుకుంటున్నాను..."అని.

"ఈ రోజు నుంచి" అనేమాట,

"ప్రేమించాలని అనుకుంటున్నాను" అనేమాట...

ఈ రెండూ నాకు నవ్వు తెప్పించాయి...

ప్రేమ అనేది సహజంగా, అకారణంగా, అప్రయత్నంగా  కలుగుతుంది...

ఏదో చేసి దొరకపుచ్చుకునేది కాదు...
ఏదో కారణంగా కలిగేది కూడా కాదు...

భక్తి కూడా అంతే....

ప్రేమ-భక్తి రెండూ ఒకటే.

వ్యక్తి భక్తి - ప్రేమ.
సమిష్టి ప్రేమ - భక్తి.

భక్తిసాధన అంటుంటారు....తప్పు.
సాధన వలన భక్తి కలుగదు.
భక్తి ఉన్నప్పుడు సాధన అవసరం ఉండదు.

నారదభక్తి సూత్రాలు చదివినంతమాత్రాన
భక్తి కలుగదు.
లేదా భగవద్గీతలో భక్తియోగాన్ని నిత్యపారాయణం చేసినంతమాత్రాన భక్తి కలగదు.

భక్తి అనేది జన్మసంస్కారం...అంతే.

రామకృష్ణులు కాళీమాత దర్శనానికై దొర్లి దొర్లి ఏడ్చేవాడు.
ఇలా ఏడవాలి, అలా దొర్లాలి అని ఏ గురువు వద్దా శిక్షణ పొందలేదు.

మనం దేవునికోసం తప్ప మిగతా అన్నిటి కోసమూ ఏడుస్తాము...

"దేవుని కోసం కన్నీరు కార్చేవాడికి అదే చివరిజన్మ"
అంటారు రామకృష్ణులు.

సంసారం కోసం ఏడ్చినప్పుడు వచ్చే కన్నీరు
వేడిగా ఉంటుంది.

భగవంతుని కోసం ఏడ్చినప్పుడు వచ్చే కన్నీరు
చల్లగా ఉంటుంది.

భగవంతుని కోసం ఏడ్వడంలో ఉన్న సుఖమే వేరబ్బా....

* * *

మురళీకి-
శరీరం ఉంది...
కుటుంబం ఉంది...
ఉద్యోగం ఉంది...
సత్సంగం ఉంది...
కానీ ఏమీలేవు...

అలా ఉంటారు "ఖాళీ"గా.

* * *

గురువుగారిని "తాతా" అని పిలిచేవాళ్లు ఇద్దరున్నారు...

1. మురళీ
2. శివస్వామి.

సాధారణంగా గురువుగారికి ఎవరూ జ్ఞాపకంలో ఉండరు...

ఎవరైనా సరే ఫోన్ చేసినప్పుడల్లా...
ముందుగా తమను తాము పరిచయం చేసుకుని మాట్లాడవలసిందే...

శివస్వామి, ఫోన్ లో తాతయ్యా...! అనగానే
మురళీ, తాతా...! అనగానే
వెంటనే గుర్తుపడతారు గురువుగారు...

తాతా  అంటే  తాను తానుగా ఉన్నవాడు.
కాబట్టి తాత అనేది మంచి సంబోధన.

* * *

పెద్ద గెడ్డం...పెద్ద పెద్ద కళ్లు....
నుదుటన విభూధి రేఖలతో...

Zero Feeling ఉండే ముఖం మురళీది.

గురువు తర్వాత  అంత తేజస్సుతో ఉండే వ్యక్తి మా సత్సంగంలో ఒక్క మురళీనే...

గుట్టుగా ఉంటాడు...
limited గా ఉంటాడు...

గురువుగారికి రహస్య శిష్యుడు మురళి.
రహస్య తాత్వికుడు మురళీ.
శూన్యోపాసకుడు మురళీ.
యోగవాశిష్టంలో 'ఆకాశజుడు' మురళీ.
ఒక్క మాటలో చెప్పాలంటే శుద్ధాకాశమే మురళి.

కొంత తెలుసు, కొంత తెలియదు అని కాకుండా-
పూర్తిగా "తెలియనితనం"లో సుస్థిరంగా ఉండే మహాయోగి మురళి.

సత్సంగంలో మా ఎదురుగా కూర్చొని ఉన్నా సరే,
అతడు లేనట్టే ఉంటాడు.

ఇప్పుడు ఈ వ్యాసంతో-
మురళీని బహిరంగం చేశాను...
తాతగారినీ అలానే చేశాను...
గురువుగారినీ అలానే చేశాను...

పురుగుపుట్రా తిని పుట్టలో పడుకునే పాము లాంటివారు-
ఆ పరమగురువు,
ఆ సద్గురువు,
ఈ శూన్యయోగి...

అలాంటి ఏకాంత జీవితాన్ని గడిపే పామును పాములవాడు  పట్టితెచ్చి,
ఊళ్లో ఆడించినట్టు
బాబు తన రచనావ్యాసాంగముల ద్వారా వారిని బట్టబయలు చేశాడు...

అలా చేయడం మంచిదో...? చెడ్డదో...?
నాకు తెలియదు...

కంటికి కనబడింది...
మనసుకు తోచింది...
వ్రాసేయడమే...
బహుశా ఇది నా విధి.

అందుకే పట్టెయ్య అన్నాడు ఓరోజు-
బాబూ! నీతో ఏం మాట్లాడాలన్నా భయంగా ఉంది, వాటిని వ్యాసంలో
ఎక్కడ చేర్చేస్తావో...అని.

ఈ మాటను కూడా వ్యాసంలో చేరుస్తానని
మర్చిపోయాడు పట్టెయ్య....

భయమెందుకు?

సత్యవాది నేను సత్యవాదిని అని చెప్పడం ఎంత సత్యవాక్కో,

అసత్యవాది నేను అసత్యవాదిని అని చెప్పడం కూడా అంతే సత్యవాక్కు.

ఆధ్యాత్మికత అనే పారదర్శకతలో
సత్యాసత్యాలు రెండూ సత్యమే అవుతాయి.

transparent గా ఉంటే భయమెందుకు?

* * *

తాతగారు-సద్గురువు-మురళీ-బాబు-దేవీప్రసాద్
ఈ పంచభూతాల్లాంటి శక్తులను కలిపి ఉంచిన
'అంతస్సూత్రం' అయిన కైకాలవీధిలో తత్తూరి సిద్ధయ్యగారి
శ్రీరామమందిరంలో కొలువై ఉన్న 'శ్రీరామచంద్ర ప్రభువుల
పాదపద్మములకు' ఈ వ్యాసం అంకితం.

* * *

25. యోగి రాజారాం

---

సతీష్ అన్నాడు ఓ రోజు....

మూఢమతులను సైతం జ్ఞానసంపన్నులుగా మార్చగలిగే శక్తి ఉన్న గురువు - సద్గురు సుబ్రహ్మణ్యం గారు.

మరి అలాంటి సద్గురువును వదిలి...
రమణాశ్రమం వెళ్లి....

"తప్పిపోయిన బిడ్డ తిరిగి తన తల్లి వద్దకు చేరినట్లు అనుభూతి చెందాను....నా మనస్సు శాంతించింది...."
అని వ్రాశారు ముందుమాటలో...

మరి అటువంటి శాంతిని మన గురువు ఇవ్వలేకపోయారా? అని ప్రశ్నించాడు.

* * *

యెంత గొప్ప ఉపాధ్యాయుడైనా తన బిడ్డల్ని మరో పాఠశాలలో(మరో ఉపాధ్యాయుని వద్ద) చేరుస్తాడు.....

18 పురాణాలను వ్రాసిన వ్యాసుడు సైతం శుకుడ్ని జనకుని వద్దకు పంపాడు...

తాను చెప్పలేక కాదు....తాను చెప్పవలసినదంతా చెప్పాడు...
కానీ శుకుడికి ఏదో తెలియని అసంతృప్తి అలానే మిగిలిపోయింది.

వ్యాసుడు ఏదైతే చెప్పాడో, అదే జనకుడూ చెప్పాడు....
కాకపోతే జనకుడు చివర్లో నొక్కి వక్కాణించినది ఒకటి ఉన్నది....

శుకా! మీ తండ్రిగారు నీకు బోధించక మునుపే, నీవు ఆత్మతత్త్వమును తెలుసుకుని ఉన్నావు...అదే మీ తండ్రిగారూ బోధించారు, నేనూ బోధించాను....ఇంతకు మించి ఏమీలేదు...నీవు తెలుసుకోవలసింది ఏమీలేదు....ఆ బోధలోనే స్థిరపడు...ఆత్మనిష్ఠుడవై ఉండు.

"ఇంతకు మించి ఏమీలేదు" అనే జనకుని ముద్ర కోసం వ్యాసుడు జనకుని వద్దకు పంపారు.

అలానే నేను గురుసాంగత్యంలో అన్నేళ్లు ఉన్నప్పటికీ, యెన్నో ప్రబోధాలు విన్నప్పటికీ

పరమశాంతిని అనుభూతి చెందలేకపోవడానికి కారణం
వారితో చెలిమి, చనువు...

రమణతత్త్వాన్ని అధ్యయనం చేసిన తరువాత తెలిసింది....
రమణమహర్షే సుబ్రహ్మణ్య మహర్షిగా ఉన్నారని....
రమణతత్త్వానికి కొనసాగింపే సద్గురు తత్త్వమని....

ఓ రాత్రి భుజానికి రమణాశ్రమం సంచి తగిలించుకుని, రమణాశ్రమం బయలుదేరాను...యెక్కడకు బయలుదేరినా గురువు వద్ద విబూధి పెట్టుకుని వెళ్లడం ఆనవాయితీ....

గురువుగారు బొట్టు పెడుతూ అన్నారు...నీవు రమణాశ్రమం చేరుకోగానే, రమణుడు ఇక్కడికి చేరుకుంటాడు అని.

నిజమే....రమణసన్నిధికి చేరుకోగానే....

"నా కోసం ఇన్ని మైళ్లు ప్రయాణం చేసి రావాలా?
నేను అక్కడే నీ గురురూపంలో ఉండేది నేనే కదా!"

అని రమణులు నా చెవిలో గొణిగినట్టయ్యింది....

* * *

అరుణాచల ప్రదక్షిణంలో నేర్ అణ్ణామలై గుడికి వెనుక వైపు ఓ పెద్ద కోనేరు ఉంది... కోనేరు గట్టున ఓ సిద్ధర్ సమాధి ఉంది...

అందులో నివాసం ఉంటాడు నా మిత్రుడు యోగి రాజారాం...

మధురై దగ్గర ఓ మారుమూల గ్రామంలో పుట్టి పెరిగారు....

యుక్తవయసులోనే తనవారందరినీ వదిలి
అరుణాచలుడే తనవాడని తలచి
అరుణాచలంలోనే శాశ్వతంగా నిలిచిపోయాడు.....

నేర్ అణ్ణామలై గుడి వద్ద ఉండే సేవకులకు సాధువులకు వంట తయారుచేస్తాడు....

ఆ యోగితో ఓ మూడుసార్లు అరుణాచలప్రదక్షిణం చేసే భాగ్యం నాకు కలిగింది...

వారు ఉన్న చోటనే ఉంటారు....యెక్కడికీ కదలరు....
అలాంటిది నా కోసం నా వెంట నడిచారు...
కాదు కాదు...వారి వెంట నేను నడిచాను....

నేను తరచూ అరుణాచలం వెళుతుంటే,
ఆ యోగి ఇలా అన్నారు-
ఏముంది అరుణాచలంలో ? రమణాశ్రమంలో ?
ఎక్కడకు పోయినా అవే గోడలు, అవే చెట్లు, అవే కొండలు....అని.

నా అనవసర అత్యుత్సాహం మీద నీళ్లు చల్లినట్టయిపోయింది...
ఆసక్తితో అరుణాచలం వెళ్లడం అదే చివరిసారి అయింది.

నిజమే కదా.....ఎక్కడకుపోయినా అవే గోడలు....అవే చెట్లు....
దేనికైనా  విలువను మనమే ఆపాదిస్తాం.... ఆరాధిస్తాం....
కొండ అంటే కొండే....శివుడంటే శివుడే....

వారి చిన్ని ప్రబోధం నాలో యెంతో ఆధ్యాత్మిక పరిపక్వతను కలిగించింది...

రాజారాం నా మిత్రుడే ఐనప్పటికీ
అప్పట్నుంచి నా గురువుగా కూడా భావించడం మొదలుపెట్టాను....

నేనున్నచోటనే దైవానుభూతిని చెందడం అలవాటయ్యింది....

నేను 30 సార్లు అరుణాచలం వెళ్లాను....అని గొప్పలు చెప్పుకుంటుంటారు కొందరు....

అంటే, తాము ఉన్న చోటనే భగవంతుణ్ణి అనుభవించడం చేతగానితనాన్ని 30 సార్లు ప్రకటించుకున్నట్టు....

షిరిడీ బాబా అన్నారు కదా....
షిరిడీలో మాత్రమే నేనున్నానని వచ్చేవారికి
నేనంటే వారికి అర్థం కానట్టే...అని.

షిరిడీయాత్ర అంటే
సర్వస్వశరణాగతికి రంగం సిద్ధం చేయడం.

అంతేగాని షిరిడీలోని బజారు సరుకును
మనింట్లోకి బదిలీ చేయడం కాదు.

బరువుతో వెళ్లి, తేలిగ్గా తిరిగి రావాలి.
కానీ జరిగేది తేలిగ్గా వెళ్లి బరువుతో తిరిగి వస్తున్నారు.

* * *

గురువుగారుగారన్నారు ఓసారి-
అరుణాచలం వెళ్లు....తప్పులేదు....
కానీ ఈశ్వరుడి కోసం వెళ్లొద్దు....అని.

అంటే ఊళ్లు చూడ్డానికి వెళ్లొచ్చుగానీ, దేవుని కోసమంటూ వెళ్లొద్దు....అని.

భగవంతుడు -
నీవున్న చోటనే ఉన్నాడు....
నీలోనే ఉన్నాడు....
నీవుగానే ఉన్నాడు....

ఆయన కోసం ఒక్క అడుగు కూడా వేయవలసిన అవసరం లేదు.

* * *

ఇప్పుడు నాకు మా సత్సంగమే రమణాశ్రమం అయ్యింది....
మా గురువే రమణభగవాడు అయ్యాడు....
మా అనిలాచలమే అరుణాచలం అయ్యింది...

అందుకే మా గురువుగారు అంటుంటారు-

నీవు క్షేత్రం వెళ్లడం కాదు
నీవున్న చోటే క్షేత్రం కావాలి.

నీవు వేదం పలకడం కాదు
నీవు పలికేది వేదం కావాలి. అని

* * *

పరిపక్వత అనేది పరుగులలో లేదు.
నిశ్చలతలో ఉంది.

పరిపక్వత అనేది పలుకులలో లేదు.
మౌనంలో ఉంది.

పరిపక్వత అనేది బహిర్ముఖంలో లేదు
అంతర్ముఖంలో ఉంది.

* * *

26. చురకత్తి

---

నేను నా డైరీల్లో చాలాకాలం పాటు దాచి ఉంచుకున్న సద్గురు వాక్యాలను ప్రచురించి ప్రపంచానికి అందివ్వాలనే తపన రోజురోజుకి పెరుగుతున్న రోజులలో.... ఏర్పేడు వ్యాసాశ్రమ వజ్రోత్సవాలు జరుగుతున్నాయి....

అక్కడ దేశ నలుమూలాల ఉన్న  వివిధ ఆశ్రమాల నుండి వచ్చి తమ తమ ఆశ్రమగ్రంథాలను విక్రయిస్తున్నారు....

సామర్లకోటకు దగ్గర్లో ఉన్న రాచపల్లి  శ్రీరమణసేవాశ్రమవాసులు కూడా ఆ వజ్రోత్సవాలకు హాజరైనారు...

అక్కడ ప్రముఖ ఆశ్రమ ప్రచురణలన్నీ అమ్మకానికి పెట్టారేగాని శ్రీరమణాశ్రమ ప్రచురణలు లేకపోవడం వారికి లోటుగా అనిపించింది....

అందరూ కలిసి తలా కొంచెం డబ్బులు వసూళ్లు చేసుకుని, ఒకర్ని అరుణాచలం పంపించి రమణమహర్షి పుస్తకాలు తెప్పించి వీళ్లు విడిగా ఒక కౌంటర్ ఏర్పాటు చేసి రమణ గ్రంథాలను అమ్మకానికి పెట్టారు...

ఆ సమయంలో మా రమణసత్సంగం వాళ్లు ప్రచురించిన "అనిలాచల శివమాల" పుస్తకాలను ఈ రమణమహర్షి కౌంటర్లో పెట్టడం జరిగింది ఉచితంగా పంచిపెట్టమని....

అప్పుడు అక్కడున్నవారు రాచపల్లి రమణసేవాశ్రమాధిపతి అయిన రామస్వామి విజిటింగ్ కార్డొకటి ఇచ్చారు...

వారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ పరిచయం పెంచుకున్నాను...రామస్వామి వారికి అడపాదడపా సద్గురుసూక్తులను

ఉత్తరాల రూపంలో  పంపుతూ ఉండేవాడిని....

వాటన్నింటినీ కట్టగా కట్టి వారి ఆశ్రమంలో ఒక అరలో దాచి ఉంచారు వారు....

* * *

ఒకసారి రమణజయంతికి పట్టెయ్య అనే శిష్యుడు  ఆశ్రమం శుభ్రం చేస్తుంటే, ఆ అర నుండి ఈ ఉత్తరాల కట్ట జారి క్రింద పడింది...మళ్లీ సర్దారు...మళ్లీ క్రిందపడింది...మళ్లీ సర్దారు...మళ్లీ క్రింద పడింది...

అరె...ఇదేమిటి ఇలా ప్రతిసారి కాళ్లమీద పడుతోంది....అనుకుని కట్ట విప్పి అందులో ఓ ఉత్తరం తీసి చదివారు....అందులో నిక్షిప్తమై ఉన్న అద్భుతమైన గురుబోధలు  వారిని విపరీతంగా ఆకర్షించాయి...

ఆ ఉత్తరాల కట్టను ఇంటికి తెచ్చుకుని తీరుబడిగా చదివారు పట్టెయ్య....అందులో బోధలన్నీ క్లుప్తంగా, సూటిగా, సారవంతంగా...మరో భగవానే  అనిపించేంతగా ఉండడం ఆశ్చర్యపోయి....నాతో నేరుగా ఉత్తరప్రత్యుత్తరాలు మొదలెట్టారు పట్టెయ్య.

వారు రమణభక్తులవటం వలన తరచూ అరుణాచలం వెళుతుండేవారు. అలా ఓసారి రమణాశ్రమం వెళుతూ మధ్యలో శ్రీకాళహస్తిలో దిగి సద్గురు దర్శనం చేసుకున్నారు....అంతే ఆ క్షణం నుంచి సద్గురు పాదాలకు అంకితం అయ్యారు...

నా డైరీల్లో దాచి ఉంచుకున్న గురువాక్యాలన్నింటినీ తన ఫోన్ కెమెరాలో బంధించుకుని తీసుకెళ్లిపోయారు.

ఇంటి వద్ద వాటిని చదువుతూ...
అందులో ఏవైనా సందేహాలొస్తే గురువుగారికి ఫోన్ చేసి సంభాషణ సలిపేవారు...

ఆ సంభాషణలు కొన్నింటిని చేర్చి "మౌన భాషణం" పేరుతో ఓ పుస్తకం కూడా విడుదల చేశాం...

ఆ పుస్తకం చాలా పెద్ద ప్రాచుర్యం పొందింది.
ఎందరి ప్రశంసలో అందుకున్నది ఆ భాషణం...

గురువుగారు కూడా నిత్యపారాయణం చేసేంతగా ఆకట్టుకుంది ఆ భాషణం...

మౌనానికి తీసుకెళుతుంది ఆ భాషణం...

ఇక ఏ పుస్తకమూ అవసరం లేని స్థితిని ప్రసాదిస్తుంది ఆ భాషణం...

* * *

గురువుగారు రచించిన 'అనిలాచల శివమాల' తొలిసారిగా తన చేతికొచ్చినప్పుడు...

అరుణాచల అక్షరమణిమాల కాకుండా ఈ అనిలాచలశివ ఏంటి?
రమణుల రచనకు కాపీలాగా...అని చిరాగ్గా ప్రక్కన పడేశారు పట్టెయ్య.

ఆ తరువాత ఆ పుస్తకం తన జీవితంలో ఎంతగా ప్రాధాన్యత సంతరించుకున్నదంటే....శ్వాసలా ఐపోయింది....ప్రతినిత్యం పారాయణం చేసుకోవడం మొదలయ్యింది...అంతేకాదు తన రాచపల్లి భక్తజనులచే సామూహిక పారాయణం చేయించేవారు సుమధురమధురంగా...

నలుదిశలా తిరిగి గురుతత్త్వవైభవాన్ని చాటి చెప్పారు.

ఈరోజు అనేకమంది జిజ్ఞాసువులు, యాత్రికులు  గురుదర్శనానికి వస్తున్నారంటే అదంతా పట్టెయ్యగారి ప్రచార విశేషమే.

* * *

గురువుగారు "నేను-నేను ఉన్నాను-నేను నేనై ఉన్నాను...." అంటూ ఓ 12 వాక్యాలను అనుగ్రహించారు. అవి వేదాంతసారమైన వాక్యాలు...
ఆ వాక్యాలకు పట్టెయ్యగారు గుర్తుగా "పరమపదం" అని నామకరణం చేశారు.

ఆ పేరుతో ఓ పుస్తకం కూడా తయారుచేశాం.
అంతేకాదు పరమపదం అధిష్ఠానదైవంగా ఓ సత్సంగమే ఏర్పడింది శ్రీకాళహస్తి కైకాలవీధిలో.

"పరమపదం" సృష్టిలోనే  చిట్టచివరి సత్-సందేశం.

అంతటి గొప్ప గురుప్రసాదం లభించిందంటే
అదంతా  చాతుర్మాస్య వ్రతంగా అరుణాచలప్రదక్షిణాఫలమే అనేది పట్టెయ్యగారి అనుభూతి.

* * *

పట్టెయ్య గారు బహు సాత్వికులు....
సత్యనిష్ఠులు...
మల్లెపూవు లాంటి తెల్లటి దుస్తులు ధరించి, రమణాశ్రమం సంచి తగిలించుకుని నిత్యయాత్రికునిలా కనిపిస్తారు.
నిజమే....వారు నిత్య సత్యాన్వేషకులు....
వారి మాటలు కోనసీమ యాసలో సంగీతం పలికినట్టు దీర్ఘాలు కలిగి ఉంటాయి.

గురువుతో వారు సంభాషిస్తున్నప్పుడు ప్రత్యక్షంగా విని తీరాలి...
మన మనస్సుకు ఒక విధమైన స్తబ్ధత కలుగుతుంది.....
అంత గొప్ప తాత్త్వికతతో నిండి ఉంటాయి అవి...

* * *

వృత్తిరీత్యా దర్జీ.
ప్రవృత్తి రీత్యా ఆధ్యాత్మిక జిజ్ఞాసి.
గోరస సుబ్రహ్మణ్యాచార్యులు, నిర్విషయానంద, రామస్వామి, సద్గురు సుబ్రహ్మణ్యులు....మొదలైన జ్ఞానుల సంపర్కంతో రాటుదేలి,
జ్ఞానాంబ(సద్గురువు) చేతిలో చురకత్తి(జ్ఞానఖడ్గం)లా తయారై, తన భాషణలతో ఎంతోమంది జిజ్ఞాసువుల అజ్ఞానాన్ని తెగ నరుకుతున్నారు...దేవసేనాధిపతిలా...
గురుబోధలుగాని, గురుమహిమలుగాని పట్టెయ్య నోటిద్వారానే వినాలి....
హృదయానికి అలా హత్తుకుంటాయి...  అంత సొగసుగా ఉంటుంది వారి భాషణం....

* * *

పట్టెయ్య - సద్గురువుల మధ్య జరిగిన సంభాషణయే
"మౌనభాషణం" అనే గ్రంథం.

జిజ్ఞాసువులు తప్పకుండా చదువవలసిన గ్రంథం అది.

నా శిష్యురాలు కృష్ణవేణి చెప్పినట్టు -

ఉయ్యాల్లో నిద్రపోతున్న శిశువుకు తటాలున మెలకువ వచ్చి అమ్మకోసం ఏడ్చినట్లు....
పరమవిశ్రాంతి స్థానమైన "జ్ఞానాంబ ఒడి" కోసం ఏడ్చే జ్ఞానశిశువుల కోసమే ఈ "మౌనభాషణం". అంటుంది...

ఆహా...! ఎంత గొప్ప భావుకత...!

* * *

నా చేతుల మీదుగా జరిగిన 26 ఆధ్యాత్మిక గ్రంధాల ప్రచురణకు సంబంధించిన విషయంలో పట్టెయ్య ప్రోద్బలం ఎంతైనా ఉంది.

గురువుగారితో తాను సలిపిన సంభాషణలను జాగ్రత్తపరచి లోకానికి అందిస్తున్నారిప్పుడు.

'కర్మకాలినవాడే గురువు వద్దకు రాగలడు' అంటారు చెంగల్వరాయరెడ్డి...

పట్టెయ్య గారి "మౌన భాషణం" చదివినా సరే
కర్మ కాలడం సత్యం అంటాన్నేను.

* * *

27. మన రమణస్వామి

---

రమణస్వామి అనే గొప్ప తాత్త్వికుడు, ఉపన్యాసకుడు, యాజ్ఞికుడు...
హిమాలయ పర్వతప్రాంతం నుండి వచ్చారు...
పొడవైన జులపాలతో, గెడ్డంతో, మెడలో రుద్రాక్ష దండలతో...
గంభీరంగా వచ్చారు....
గురువుగారికి నమస్కరించి కూర్చున్నారు....
తనను తాను పరిచయం చేసుకున్నారు...

కొద్దిరోజులు ఇక్కడే గడపాలని అడిగారు...
గురువుగారు అంగీకారం తెలిపారు....
ఐతే మీరెళ్లి నీట్ గా షేవ్(గుండు) చేసుకురండి....అన్నారు గురువుగారు...
తక్షణమే  రమణస్వామి టవున్ లోకి వెళ్లి గుండుగీయించుకొని, రూంలో స్నానం చేసి వచ్చి పూర్ణంగా కనబడ్డారు గురువుగారికి.
గురువుగారు సంతోషంతో చిరునవ్వు నవ్వారు.
బహుశా అతను  కాషాయంబరధారి అయి ఉంటే  అలా చెప్పి ఉండేవారు కాదేమో....
(తన గురువు కాషాయంబరధారి కావడం కారణం కావొచ్చు.)

రమణస్వామి కుర్రవాడే...ముప్పై ఏళ్లుంటాయి....
మా సత్సంగంలో కూడా మాలో ఎవరికైనా కొద్దిగా గెడ్డం పెరిగినా సరే సహించేవారు కాదు గురువుగారు....షేవ్ చేసుకోమనేవారు...
ఈ వయసులో గెడ్డాలు పెంచితే....
పెద్ద వయసులో షేవింగ్ చేయాలనిపిస్తుంది....
ఏ వయసులో ఎలా ఉండాలో అలానే ఉండాలి అనేవారు.....
గురువుగారిని ఎవరయినా పలకరింపుగా "ఎలా ఉన్నారు?" అని అడిగితే-
"70 వయసులో ఎలా ఉండాలో అలానే ఉన్నాను"అని అంటుంటారు...
"మేం వేదాంతులం" అనే విషయం ఇతరులకు తెలియాలని, రకరకాల వేషాలు వేస్తుంటారు కొందరు...
తన ఉపాసనావిషయం తనకు భగవంతునికి మధ్యే ఉండాలి తప్ప....లోకానికి ప్రకటితమయ్యేట్టు ఉండవలసిన అవసరం లేదనేది గురుహృదయం.
బహుశా ఆ అభిప్రాయంతోనే రమణస్వామిని క్షవరం చేసుకురమ్మని చెప్పి ఉంటారు.

* * *

గతంలో వీరబాబు అనే శ్వేతవస్త్రధారి, విరాగి....
అరుణాచలంలోనే తన పూర్తి జీవితాన్ని గడపాలని నిశ్చయించుకున్నవారు...

వారి తల్లిదండ్రులకేమో...తమతోపాటు ఉండి ....వివాహం చేసుకుని...గృహస్తజీవితం గడపాలనేది వారి ధార్మికవాంఛ...

శ్రీకాళహస్తిలో రమణులు లాంటి మహనీయులు ఒకరున్నారని పట్టెయ్య అనే గురుభక్తుడు చెప్పగా...గురుదర్శనానికి వచ్చారు ఆ శ్వేతాంబరధారి.

"త్వరలో నీవు పెళ్లి చేసుకుంటావు" అన్నారు గురువుగారు....

అతడు షాక్ తిన్నాడు...తేరుకుని చిరునవ్వు నవ్వాడు...
(అలా ఎప్పటికీ జరగనే జరగదు అనే నిశ్చితాభిప్రాయంలోంచి వచ్చిన అపహాస్యపు నవ్వు కావొచ్చు )

కాసేపు ఉండి శెలవు తీసుకొని అరుణాచలం బయలుదేరారు....

తరువాత ఏం జరిగిందో ఏమో.....

కొద్దికాలానికే శ్వేత వస్త్రాలు వదిలి, వివాహం చేసుకుని, గురుదర్శనానికి వచ్చారు....
* * *

అలా చాలా మంది యువ విరాగులను వివాహం చేసుకునేట్టు ప్రోత్సహించేవారు....ఆ దిశగానే తను ప్రబోధాలు చేసేవారు....

చెంగల్వరాయరెడ్డి, వెంకట్ లాంటి విరాగులు
సద్గురు సన్నిధిలోనే నిరాడంబరంగా వివాహం చేసుకున్నవారే.....
"ఈ చోటులో ఇంకొక్క వివాహం జరుగుతుంది....."
అన్నారు గురువుగారు....
ఆ పుణ్యదంపతులు ఎవరో మరి....
ఏమో మన  రమణస్వామే కావొచ్చు...
* * *

ఎవరీ రమణస్వామి? అడిగారట పట్టెయ్య గురువుగారిని....
"రమణమహర్షే" అన్నారట.
అంటే అంతటి నిష్క్రియాపరుడు మన రమణస్వామి.
* * *

ఏం చేస్తుంటారు మీరు? అని గురుసేవకుడు రవి రమణస్వామిని అడిగితే....
అంతలో మన గురువుగారు జ్యోక్యం చేసుకుని,
"అన్నీచేయగలడు....కానీ ఏమీ చేయడు...." అని అన్నారట.
అంటే అంతటి నిష్క్రియాపరుడు మన రమణస్వామి.

* * *

"మీరెక్కడున్నా మీ రూపంలో నేను అక్కడే ఉంటాను"
అన్న అభయం పొందినవాడు మన రమణస్వామి.

* * *

రమణస్వామి తొలి గురువు అవధూత వెంకటప్పస్వామి(తొప్పలహల్లి, కోలార్)
వారి తొలిదర్శనంలోనే రమణస్వామి మెడలో పూలమాలవేసి, "ఈ స్వామి ముక్తికాంత కొంగును పట్టుకొని లాగినవాడు"అన్నారట...
"ముగ్గురమ్మల పాలు త్రాగినవాడు(దత్తాత్రేయుడు)
అన్నారట...

ఉత్తరహిందూప్రాంతంలో ఉన్న ఓ సిద్ధుడు కూడా రమణస్వామితో ఇలా అన్నారట....
నీవు కావాలన్నా వద్దన్నా ఆధ్యాత్మికంలో చివరిదశ ఏదైతే ఉందో, దానిని నీవు ఏ సాధనా లేకుండానే అనాయాసంగా పొందుతావు....నిన్ను లోకం పూజించే రోజు వస్తుంది....
ఏ గురువూ నీకు అవసరం లేదు....అన్నారట.

కానీ  రమణ స్వామి మన గురువు వద్దకు చేరారు....

గురువు అవసరం లేనివారే మన గురువు వద్దకు చేరుతారేమో!

ఏ సాధనా అవసరం లేనివారే
మన గురువు వద్దకు చేరుతారేమో!

గురువుగారే స్వయంగా అన్నారు కదా...
ఇక్కడికి వచ్చి ముక్తి పొందడం కాదు,

ముక్తి పొందినవాడే ఇక్కడకు చేరుతాడు....అని.

'నేనేం చేయాలి?' అని రమణస్వామి గురువును అడిగితే,

మీకేదయినా కర్మ  ఉంటేకదా! నేనేమైనా చెప్పడానికి'
అన్నారట గురువుగారు.

"కర్మ కాలినవాడే గురువు వద్దకు వస్తాడు" అంటుంటాడు గురుభక్తుడు చెంగల్వరాయరెడ్డి.

అలా కర్మకాలి, ఇక్కడ అడుగు పెట్టాడు మన రమణస్వామి.

* * *

28. చలం - సౌరీస్ - సద్గురు

---

1920 నుంచి ఓ ఏభై ఏళ్ళ పాటు ఆంధ్ర సాహిత్యాభిమానులను ఉర్రూతలూగించిన భావుకుడు, రచయిత గుడిపాటి వెంకటాచలంగారు.

స్త్రీ స్వేచ్ఛ గురించి చాలా రచనలు చేశారు.

తన స్నేహితుడైన చింతాదీక్షితులు ప్రోద్భలంతో రమణమహర్షి సందర్శనానికి వెళ్లారు.

చలం తొలిసారి భగవాన్ దర్శనానికని వెళ్ళినప్పుడు....

కొండమీదకు వాకింగ్ వెళ్లివస్తున్నారు  భగవాన్...
అందరూ ప్రక్కకు తప్పుకుంటున్నారు.....
చలం కదలలేదు....

నేనెందుకు తప్పుకోవాలి? వారే తప్పుకుని వెళతారు అని ధీమాగా నిలబడి ఉన్నారు....

భగవాన్ దగ్గరకు రాగానే....
చింతాదీక్షితులు చలాన్ని వెనక్కి లాగేశారు...

భగవాన్ కాస్త  ముందుకు సాగి...
తిరిగి చూసారు  చలాన్ని ....చిరునవ్వుతో ....

అప్పుడే తన మనసును జయించేశారు భగవాన్...
అంటారు చలం.

తన జీవిత అంత్యం వరకు చలం అరుణాచలంలో ఉండిపోయారు...
తన నివాసానికి "రమణస్థాన్" అని పేరు పెట్టుకుని...

* * *

విస్కీ త్రాగి వ్రాస్తున్నాను...అని మొదలు పెట్టి అరుణాచలం నుంచి తిరిగి రమ్మని శ్రీశ్రీ ఉత్తరం వ్రాసినా సరే కదలలేదు.

దాని కంటే గొప్ప మత్తు భగవాన్ సన్నిధి వలన లభిస్తుందని...నువ్వే ఇక్కడకి రావలసినదిగా  తిరుగు జాబు వ్రాశారు చలం.

* * *

చలం వ్రాసిన "భగవాన్ స్మృతులు" ప్రతి రమణ భక్తుడు చదివి తీరాలి. చదువుతున్నంతసేపు మనం రమణసన్నిధిలో ఉన్నట్టు అనుభూతి కలుగుతుంది.

"దర్శనం కన్నా దర్శనం కోసం ఆవేదన ముఖ్యం" అన్న భగవాన్ బోధ అందులోనిదే.

* * *

1969-70 ప్రాంతంలో గురువుగారు అరుణాచలం వెళ్లారు...మా నాన్నగారు కూడా...

రమణాశ్రమం దర్శించి...
చలం నివసించే రమణస్థాన్ లోకి వెళ్లారు...

అక్కడే ఉన్న చలం కుమార్తె సౌరీస్ మన గురువుగారి కళ్లలో కళ్లు పెట్టి తదేకంగా ఐదు నిమిషాలు చూశారట...

సౌరీస్ దైవీ సంపత్తి కలిగిన మహనీయురాలు.

తరువాత చలంగారితో ఆధ్యాత్మిక సంవాదం జరిగిందట....

ఓ దశలో చలం వాదించే అవకాశం లేని మౌనస్థితికి వెళ్లిపోయారట...

చలం నవ్వుతూ వాలుకుర్చీలో నుంచి లేచి గురువుగారిని ఆత్మీయ ఆలింగనం చేసుకున్నారట...

ప్రత్యక్ష సాక్షి అయిన మా నాన్నగారు చెప్పారు ఈ విషయాలన్నీ...

* * *

చలంగారి సమాధి, గిరిప్రదక్షిణామార్గంలో రమణాశ్రమం దాటగానే ఎడమవైపు ఫుట్ పాత్ మీద ఉన్నది.
అరుణాచల భక్తుల పాదధూళితో నిత్యమూ పవిత్రస్నానం చేస్తున్నారు చలం.

* * *

29. ఎందుకు?

---

సైన్సు "ఎలా?" అన్నదానికే సమాధానం చెబుతుంది గాని "ఎందుకు?" అన్నదానికి అది సమాధానం చెప్పలేదు...అన్నారు గురువుగారు ఓసారి.

ఆ "ఎందుకు?" అన్న ప్రశ్న నాలో కలకలం రేపింది...

సైన్సును విషయం సరే, దానిని ప్రక్కన పెడదాం....

ఇంతకీ మన భారతీయ తత్త్వశాస్త్రం ఈ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పింది? అనే ఉత్కంఠతో చేసిన అన్వేషణ నా ఆధ్యాత్మిక జీవితాన్ని ఓ మలుపు తిప్పింది.

* * *

భగవంతుడు ఎందుకీ జగత్తును సృష్టించాడు?

భ్రాంతి ఎందుకు కలిగింది?

ఇలా ప్రతిదానికీ ఎందుకు? అని ప్రశ్నించడం అలవాటైపోయింది.

"ఎందుకు?" అన్న ప్రశ్న కొంతకాలం నన్ను భూతంలా వెంటాడింది.

ఈ ఒక్క ప్రశ్ననే పలురకాలుగా, పలుసార్లు ప్రశ్నించాను గురువుగారిని...

వందలకొద్ది గ్రంథాలను తిరగేశాను....

నాకు సంతృప్తినిచ్చిన కొన్ని సమాధానాలను మీ ముందు ఉంచుతున్నాను.

* * *

యోగవాశిష్ఠంలో ఇలా చెప్పబడి ఉంది -

లీల: ప్రతి వ్యక్తి  ఎందుకు వేదనను, అజ్ఞానాన్ని అనుభవిస్తున్నాడు?

సరస్వతి: సృష్టి ప్రారంభమున అనంతచైతన్యము నెలకొల్పిన నియతి అట్టిది.

* * *

వివేకానందులు ఇలా చెప్పారు -

ఎందుకు? అన్న ప్రశ్న తర్క విదుద్ధం.
దేశకాల నిమిత్తాల పరిమితిలో సమాధానం ఏనాటికీ దొరకదు.
ఈ పరిమితి కావల ఏమి సమాధానం ఉందో మనం ఈ పరిమితిని అతిక్రమించితే తప్ప తెలీదు.

* * *

బి.వి.నరసింహస్వామి, రమణుల మధ్య సంభాషణ ఇలా జరిగింది -

బి.వి.నరసింహస్వామి: పరిమితంగానైన యీ సృష్టి, యీ సంసారము దుఃఖమయము పాపపంకిలము ఎందుకైనది?

శ్రీరమణులు: భగవదిచ్ఛ.

బి.వి.నరసింహస్వామి: భగవంతునికి ఆ ఇచ్ఛ ఏమి?

శ్రీరమణులు: అది దుర్జ్ఞేయమూ, అతర్క్యమూ  ఆ సర్వశక్తికి ఇందుకే నిమిత్తమునూ ఆరోపింపలేము.
సర్వసమర్థమూ, సర్వజ్ఞమూ, అపరిమేయమూ అయిన అతనికి కోర్కియేమి? ప్రాప్యమేమి?
ఆ దైవ సముఖాన జరిగే ఏ కర్మలూ వానిని అంటవు. సూర్యుని ప్రాపంచిక కర్మలనూపోల్చి చూడు.

ఆ ఏకానికి ప్రయోజనాపేక్షలూ, బాధ్యతలు నిరూపించడంలో అర్థం లేదు.

అత్యంత క్లిష్టమైన పురుషకార-దేవ వాదానికి ఈ 'భగవదిచ్ఛ' సిద్ధాంతం చక్కని పరిష్కారం.

భగవంతుడు సర్వ వివేకి, సర్వశక్తి, మనం విధి నిర్దిష్టాలైన పరికరాలము, మనం చేసే కార్యాలూ, పడే కష్టాలు, భగవంతునికి ఎట్లు నచ్చితే అట్లే. అన్ని భారాలు తనపైనే వేసుకుని మనకాయన శాంతిని ప్రసాదిస్తాడు.

* * *

సద్గురు సుబ్రహ్మణ్యులవారికి,
అరుణాచల నివాసినీ అయిన చిలకమ్మ గారికి
మధ్య జరిగిన సంభాషణ ఇలా ఉంది -

చిలకమ్మ : ఎందుకు పుట్టామో, ఎందుకు జీవిస్తున్నామో తెలియడం లేదు స్వామీ...!

సద్గురు: మనల్ని భూమ్మీదకు పంపినవాడికి మాత్రమే
ఆ రహస్యం తెలుసును.

చిలకమ్మ : అంతేనా స్వామీ....

సద్గురు: అంతే.
ఆ సమస్యను నువ్వు బయటకు చెప్పావు.
మేం చెప్పలేదు. అంతే తేడా.

ఎవడికి వాడికి స్వంతంగా తెలుసుకునే సత్తా ఉన్నట్లయితే వీళ్ళే దేవుళ్లయిపోరూ...

(నవ్వుతూ) వీళ్లే దేవుళ్లయిపోతే

'అసలు దేవుడు' ఏమైపోవాల?

* * *

నా ఆధ్యాత్మిక జీవన సౌధానికి నాలుగు స్తంభాలు లాంటివారు -

1. వశిష్ఠులు.
2. వివేకానందులు.

3. రమణులు.

4. సుబ్రహ్మణ్యులు.

అందుకే 'ఎందుకు?' అన్న ప్రశ్నకు ఈ నలుగురూ చెప్పిన సమాధానాలే ఉదాహరణలుగా ప్రస్తావిస్తాను.

ఈ నలుగురూ చెప్పిన సమాధానాలు అంతర్లీనంగా
తత్వతః ఒకటే ఐనప్పటికీ అందులో రమణుల 'భగవదిచ్ఛ' సమాధానం నాకు ప్రియం.

* * *

భగవదిచ్ఛ అంటున్నారు....

భగవంతునికి కూడా ఇచ్ఛ ఉంటుందా? అనిసందేహం రావొచ్చు.

ఎందుకుండదు? ఆయనేమైనా ఉత్త జడుడా?

Everything is Possible for GOD.
ఆయనకు అన్నీ సాధ్యమే.

ఆయన మహా నియంత.
ఇలానే ఉంటాడు, అలా ఉండడు అనేది ఏమీలేదు.
ఎలా అయినా ఉండగలడు.

మన ఇచ్ఛకు, భగవదిచ్ఛకు తేడా ఏమంటే-
ఇచ్ఛ స్వాధీనంలో మనం ఉంటాం.
భగవంతుని స్వాధీనంలో ఇచ్ఛ ఉంటుంది.

* * *

ఇంతకీ ఇప్పుడేమంటారు?
అంతా భగవదిచ్ఛకు వదిలేసి ఊరికే ఉంటే ఎలా?
లోకం స్తంభించిపోదూ...? అంటారేమో....
నా ఉద్దేశం అది కాదు.

నీ పురుషప్రయత్నం కూడా భగవదిచ్ఛలో అంతర్భాగం అనేదే.

ఒకడేదో గొప్ప పని చేశాడని కీర్తిస్తాం.
మరొకడు కాని పని చేశాడని నిందిస్తాం.

ఇద్దరూ అస్వతంత్రులే.
ఇద్దరూ దైవనియతికి బానిసలే.

చట్టాలు, శిక్షలు కూడా ఆ దైవనియతిలో అంతర్భాగాలే.

నీ ద్వారా ఏ కార్యాన్ని నెరవేర్చుకోవాలో
భగవంతుడు నీ చేత బలవంతంగానైనా సరే, నెరవేర్చుకు తీరుతాడు.

సకామ కర్మ అయినా
నిష్కామ కర్మ అయినా
నీ స్వాధీనంలో లేనివి.

* * *

వ్యవహారంలో 'ధర్మాచరణ' ఉండాలి.
అనుభవంలో 'భగవదిచ్ఛ' అని ఉండాలి.

* * *

30. ఊరక ఉండడం

---

ఒకసారి గురువుగారిని అడిగాను....
భగవాన్ చెప్పిన "సుమ్మా ఇరు" (ఊరక ఉండడం) అంటే ఏమి? అని.

నీ గురించిగాని,
నీ ప్రపంచం గురించిగాని,
నీ దైవం గురించిగాని
చెప్పకుండా ఏదైనా ఒక విషయం ఉంటే చెప్పు..అన్నారు.

ఏం చెప్పను?......ఏంచెప్పినా ఆ మూడింట్లోకే వస్తుంది...

మౌనం దాల్చాను.

గురువుగారు నవ్వి.....ఇదే సుమ్మా ఇరు అంటే అన్నారు.

* * *

రమణాశ్రమం పాతహాలులో భగవాన్ యెదుట ధ్యానంలో ఉన్న కొందరిని చూసి, "వారంతా ఏం చేస్తున్నారు? అని అడిగాడు ఓ పాశ్చాత్యుడు.
"ఊరక ఉన్నారు" అన్నాడు అతని గైడు.
భగవాన్ అది విని వెంటనే ఇలా సవరించారు-
"వారు ఊరక ఉండలేదు, ఊరక ఉండడానికి సాధన చేస్తున్నారు" అన్నారు.

* * *

కాబట్టి ఊరకున్నట్టు కనపించడం వేఱు,
ఊరకుండడం వేఱు.
ఊరకుండడానికి ఈ ఊరకుండడం ప్రయత్నం అంతే.

సోఫా మీద ఉన్న భగవాను కూడా ఊరకున్నారు.
కానీ ఆ ఊరకుండడం, ఈ ఊరకుండడం ఒకటి కాదు.
ఒక్కలా కనిపిస్తారు అంతే.

ఊరకుండడం వలన ఊరకుండే స్థితిని సాధించాలనే ప్రయత్నం సాధకునిది.

ఊరక ఉండడం అనే స్థితి వలన కలిగిన
ఊరక ఉండడం అనే స్వభావం రమణునిది.

* * *

సాధకుడు ఊరక ఉండడంలో -
తలంపులు లేకుండా చేయడం అనే ఘర్షణ ఉంటుంది.
లేదా తలంపును దాని మూలానికి చేర్చాలనే ప్రయత్నం ఉంటుంది.

సిద్ధుడు ఊరక ఉండడం అనేది -
అలలు లేని సముద్రం వంటిది.
మబ్బులు లేని ఆకాశం లాంటిది.
అక్షరాలు లేని కాగితం లాంటిది.

* * *

సాధన అనేది సిద్ధికి మార్గం కాదు....
రమణులు సిద్ధికై ఏ సాధనా చేయలేదు.
రమణులే కాదు ఏ మహనీయుడూ సాధన వలన
సిద్ధి పొందలేదు.

"సిద్ధి వలననే మార్గం ఏర్పడిందేగాని
మార్గం వలన సిద్ధి కలుగదు."
అంటారు గురువుగారు.

* * *

మరి రమణులు తన యెదుటే ధ్యానసాధన చేస్తున్నవారిని యెందుకు ఖండించలేదు?

ఖండించడం వారి ప్రవృత్తి కాదు....

సాధన వలన ప్రయోజనం ఏమంటే,
సాధనతో పనిలేదనే విషయాన్ని స్వయంగా తెలుసుకుంటారు.
అంతవరకు వద్దన్నా సరే సాధన చేస్తారు....చేసుకోనీ.....
అనే నిర్లిప్తభావన కారణం కావొచ్చు...

* * *

ఊరక ఉండే ఆ అరుణాలఋషి యెదుట
ఊరక ఉండడానికి సాధకులు చేసే ప్రయత్నంలో
అంతర్లీనంగా, తమకే తెలియనంతగా ఓ జెలసీ ఉంటుంది.

ఆ "జెలసీ"నే భక్తి అని , సాధన అని భ్రమపడతాం.....అంటారు గురువుగారు.

మహానుభావుడు సూరీడులా వెలిగిపోతుంటే
కళ్లు తెరచి ఆ దివ్యతేజోమూర్తిని కనులారా కాంచక, మేమేంత
ధ్యానపరులమో చూడు అన్నట్టు ఎందుకీ అర్థం లేని సాధనలు?
లేవండి...లేవండి...అంటూ ధ్యానం చేసేవాళ్లనందరినీ తట్టి లేపేసేవారట
కావ్యకంఠ గణపతిముని.

ఎన్ని దీపాలు వెలిగిస్తే సూర్యుడికి సమానమవుతుంది?
ఎన్ని బావులు కలిపితే సముద్రుడికి సమానమవుతుంది?

భగవానుకు ఊరక ఉండడం అనేది అప్రయత్నంగా దొరికింది.

సాధకులకు ఊరక ఉండడం అనేది ప్రయత్నంగా ఉంటోంది.

భగవాన్ తరువాత భగవాన్ రాలేదు...రారు.

గురువుగారు అంటుంటారు-
"జ్ఞాని పుడతాడు. తయారుకాడు" అని.

మనం తయారుకావాలని చూస్తున్నాం.....
అది వీలుకాదు.

ఇది నిరాశావాదంగా కనిపించవచ్చు.

"ప్రయత్నంతో  పొందలేం" అనే విషయాన్ని
నిస్సందేహంగా తెలుసుకొంటే అదే ఆశావాదం.

అంత్యనిష్ఠూరం కన్నా ఆదినిష్ఠూరం మేలు అన్నారు పెద్దలు.

ప్రయత్నం కంటే ప్రయత్న విరమణే దగ్గరిమార్గం
ఊరక ఉండడానికి.

* * *

"స్వర్గరాజ్యం ఇలాంటి వారిదే" అని పసిపిల్లలను చూపుతూ అన్నారు క్రీస్తు కొండ మీద ప్రసంగంలో.

పసి పిల్లలు గతాన్ని జ్ఞప్తిలో ఉంచుకోరు.
భవిష్యత్తును ఊహించరు.
వారు సదా వర్తమానంలో ఉంటారు.

* * *

అలా నవశిశువు వలె
"ప్రస్తుతక్షణం"లో ఉండగలిగితే
అదే "ఊరక ఉండడం" అవుతుంది.

వర్తమానం - జ్ఞానప్రసూనాంబిక.
వర్తమానంలో ప్రతి ఒక్కడు - జ్ఞానశిశువే.

* * *

జ్ఞానశిశువు
9533667918

31. శరణాగతి

---

ఎండగానీ నీడగానీ ఏమైనా గానీ
కొండలరాయుడే మా కులదైవము
అన్నాడు అన్నమయ్య.

ఇదీ...శరణాగతి అంటే.

అంతేగాని నీవు కోరిందల్లా తీర్చడం భగవంతుని పని కాదు, అది నీ భక్తికి కొలమానమూ కాదు.

మనం 'మహనీయులు' అని ఎవర్ని అంటున్నామో
వారెన్ని బాధలకు గురి అయ్యారో!!

తుకారాం, మీరాబాయి, రామకృష్ణులు, వివేకానంద, రమణులు.....

వారు అనుభవించిన బాధల్లో ఒక్క శాతం మనకుగాని వస్తే దేవుణ్ణే వదిలేస్తాం,
నువ్వూ వద్దు, ఈ భక్తీ వద్దు...అని.

* * *

గురువుగారు కూడా యెన్నో కష్టాలను అనుభవించారు...
భార్య, ముగ్గురు పిల్లలు, వారి చదువులు, ఇంటి అద్దె...
చాలీ చాలని జీతం, మధ్యలో తాతగారు(వారి గురువుగారు) నీ చావు నీవు చావు అన్నట్టు నాకు ఇచ్చే మామూలు(దక్షిణ) నాకిచ్చేయ్....అని రోజూ 5 రూపాయిలు తీసుకుని వెళ్లేవాడు....ఇదిగాక తాతగారికి  అప్పుడప్పుడు సారాయి సీసా, మటన్ ఫ్రై, బిరియానీ పార్సెలు....

జీతం చాలక అప్పుడప్పుడు మా నాన్నగారి వద్ద 5 లేదా 10 వేలు అప్పుతీసుకుని నెల నెల వడ్డీ కడుతుండేవారు...

గురువుగారు, మా నాన్న ఇద్దరూ దగ్గర దగ్గర స్కూళ్లలో ఉపాధ్యాయులుగా పని చేసేవారు...

గురువుగారి కంటే మా నాన్నగారు వయసులో పెద్ద.
మా నాన్నను అన్నా...! అని సంభోదించేవారు గురువుగారు.

మా నాన్న మాత్రం పేరుపెట్టి సుబ్రమణ్యాం....! అని పిలిచేవారు.

గురువుగారు ఒకే ఒక గది ఉన్న చిన్న అద్దె ఇంటిలో కాపురం ఉండేవారు....ఫ్యాను కూడా ఉండేది కాదు, ఆరుబయట కానుగ చెట్టు క్రింద ఓ నులక మంచం వేసుకుని కూర్చునేవారు. T.V.లో న్యూస్ చూడడానికి మా ఇంటికి వచ్చేవారు.

ఈరోజు పరిస్థితులన్నీ మారిపోయాయి...

డబుల్ కాట్ బెడ్, కలర్ T.V. ప్రతి గదిలో ఏ/సి, సేవ చేయడానికి శిష్యగణం....సమకూరాయి....

ఇదంతా ఎందుకు  చెబుతున్నానంటే-

నేను అదీ చూశాను, ఇదీ చూశాను...
కానీ వారి స్వభావంలో ఏ మాత్రమూ మార్పు కలుగలేదు...

అప్పుడు బాధలు అనే స్పృహ గానీ,
ఇప్పుడు సుఖాలు అనే స్పృహ గానీ
రెండూ వారికి లేవు.

గురువుగారి గురించి ఒక్కమాటలో చెప్పాలంటే-

వారి కంటే సామాన్యుడు లేడు,
వారి కంటే మహానీయుడూ లేడు.

అటువంటి స్థితప్రజ్ఞునితో నా వయసు మరచి వారితో స్నేహితుడిలా ఇంతకాలం మెలిగానంటే....
వేంకట నరసయ్య గారు చెప్పినట్లుగా "దేవతలు సైతం ఈర్ష్య పడే అదృష్టం నీది" అని అన్నారు.

1990 లో మంత్రోపదేశం తీసుకో బట్టి గురువుగా భావించడమేగానీ, ఇద్దరమూ చెట్టాపట్టాలేసుకుని స్నేహితుల్లా తెగ తిరిగేవారం.

"నీకు అంత వయస్సాయనతో సావాసం ఏందిరా?"
అని మా నాన్న మందలించాడు ఓ రోజు.

మా నాన్న రోజూ సాయంత్రం క్లబ్ కు వెళ్లేవాడు...

నేను రోజూ సాయంత్రం సద్గురు సత్సంగానికి వెళ్లేవాడిని...

యెవరో అన్నారు-

"మీ నాయన వెళ్లే చోటుకి నీవు వెళ్లాలి,
నీవు వెళ్లే చోటుకి మీ నాయన వెళ్లాలి" అని.

గురువుగారికి చెబితే నవ్వుకున్నారు.....

* * *

ఎన్ని కష్టనష్టాలు కలిగినా వారు చెదరలేదు, బెదరలేదు.

కర్మసిద్ధాంతం వారి నోట ఒక్కసారి కూడా, ఒక్క మాట కూడా వినలేదు ఇన్నేళ్లలో.

సక్రమంగా కనిపించినా, అక్రమంగా కనిపించినా
అంతా ఈశ్వరేచ్ఛ...అనేవారు.

కష్టాలను కూడా భగవదనుగ్రహంగానే భావించేవారు.

నిజానికి మనం చేసే 'వందరూపాయల' తప్పులకు
భగవంతుడు వేసేది ఒక్క పైసా శిక్ష మాత్రమే.
అంటారు గురువుగారు.

నేను చేసిన తప్పులకు నా నెత్తిన ఒకేసారి వంద పిడుగులు పడాలి...కాని లక్షణంగా ఉన్నాను...ఇంతకన్నా భగవదనుగ్రహానికి గుర్తేమి? అన్నారు గురువుగారు ఓసారి.

పవిత్రమూర్తులు వారే అంత మాట అంటే
శ్వాస పీల్చినంత సులభంగా తప్పులు చేసే మన నెత్తిన ఎన్ని పిడుగులు పడాలో...!

ఒకటి పడ్డాక, తరువాత ఎన్ని పడ్డా లెక్క లేదనుకోండి....

భగవంతుడు యెంతటి దయామయులో చెప్పడానికే అదంతా....

* * *

శరణాగతికి గొప్ప అర్థం చెప్పారు గురువుగారు...
అది ఏమంటే-

తెల్లకాగితం తీసుకుని అందులో ఏమీ వ్రాయకుండా క్రింద నీ సంతకం చేసేసి భగవంతుని పటాల ముందు పెట్టేయమన్నారు.
అందులో ఏమి వ్రాస్తాడో ఇక భగవంతుని ఇచ్ఛ అంతే.

తరువాత మన జీవితంలో తటస్థపడే ప్రతి ఘట్టమూ అది సుఖమైనా, దుఃఖమైనా దానిని భగవత్ప్రసాదంగానే స్వీకరించాలే తప్ప 'ఎందుకు' అని ప్రశ్నించడం భక్తుని స్వభావం కాదు.
ఇదే షిరిడీబాబా చెప్పిన "సర్వస్య శరణాగతి" అంటే.

కానీ మనం సాధారణంగా అలా చేయం....
తెల్లకాగితం నిండా మన కోరికలను నింపేసి,
భగవంతుని సంతకం కోసం ఆయన ముందు నిలబడతాం.

ఓటమి లేని గెలుపు వలన సుఖం ఉండదు.
గెలుపు ఓటములు రెండూ ఉంటేనే ఆటలో మజా.

జీవితాన్ని జీవితంగా అనుభవించేవాడు సంసారి.

జీవితాన్ని 'భగవంతుని క్రీడ' గా భావించేవాడు సారమెరిగిన యోగి.

పరిస్థితులు ఇద్దరికీ సమం.

భగవంతుని క్రీడగా మనం తీసుకున్నందుకు గుర్తేమంటే
సుఖదుఃఖాలకు చలించం.

ఈ తనువు, ఈ సంసారం, ఈ ప్రపంచం...అన్నీ మనకు ఉచితంగానే దొరికాయి....

అందుకు మనం ఏ పెట్టుబడీ పెట్టలేదు....
ఉచితంగా అనుభవిస్తున్నాం...

ఎప్పుడో ఒకప్పుడు ఇవన్నీ జారిపోతాయి....
పోతే పోనీ.....

కానీ 'నేను' సదా ఉంటాను...
జీవుడుగానో...దేవుడుగానో...

* * *

ఏడాది నిండిన తన బిడ్డకు పుట్టినరోజు వేడుక చేస్తుంది తల్లి.
ఆ బిడ్డకు ఏవేవో అలంకరించి మురిసిపోతుంది.

ఇవేవీ ఆ బిడ్డకు తెలియదు...ఆ బిడ్డకు కావలసినది తల్లి ఒడి ఒక్కటే.

అలాగే మన జీవితంలో మనకు లభించేటివన్నీ భగవంతుడు మనకు అలంకరించుకుని చూసుకునే ముచ్చటే.

ఏమైనా రానీ, ఏమైనాగానీ భగవంతుని శిశువుగా మనముందాం....

శ్రీకాళహస్తీశ్వర శతకంలో దూర్జటి కవి మంచి శరణాగతి పద్యం చెప్పారు...

నిను సేవింపగ నాపదల్పొడమనీ, నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుండననీ, మహాత్ముడననీ, సంసారమోహంబు పై
కొననీ, జ్ఞానము గల్గనీ, గ్రహగతుల్ కుదింపనీ, మేలు వ
చ్చిన రానీ, యవి నాకు భూషణములే శ్రీకాళహస్తీశ్వరా!

* * *

పరమేశ్వరా!

నేను నిన్ను సేవిస్తుండగా, నాకు కష్టాలు రానీ, సుఖాలు రానీ, నన్ను సామాన్యుడు అననీ, గొప్పవారు అననీ, సంసారవ్యామోహము కలుగనీ, జ్ఞానము కలుగనీ, గ్రహచారము నన్ను క్రుంగదీయనీ లేక మంచి చేయనీ, అవి అన్నీ నాకు ఆభరణాలు వంటివే అవుతాయి. నీ పాదసేవ చేస్తున్న నాకు అన్నీ నీ అనుగ్రహాలుగానే కనిపిస్తాయి.

* * *

చివరగా ఈ వ్యాసాన్ని గురువాక్యంతో ముగుస్తాం...
"అన్నిటికీ సిద్ధపడి ఉండడమే మహాసిద్ధి."

* * *

32. కలకాని కల్లగాని కల

________________

1990 నుండి  ప్రతిరోజూ సాయంత్రం రెండుగంటలు పాటు గురువుగారితో గడపడం అనేది
అప్పట్లో నా నిత్యకృత్యం.

మళ్లీ మరురోజు సాయంత్రం వచ్చే ఆ "రెండు గంటలు" కోసం మిగతా 22 గంటలు ఆసక్తితో ఎదురుచూస్తుంటాను అనడం అతిశయోక్తి కాదు.

ఆ రెండుగంటలు ఏకధాటిగా గొప్ప గొప్ప బోధలు చేసేవారు గురువుగారు...

చాలాకాలం పాటు నేనొక్కణ్ణే వారికి ఏకైక శ్రోతను.

అలౌకికమైన ఆ బోధల్ని వ్రాసుకోవడం నాకు చేతయ్యేది కాదు...

ఇంటర్ ఫస్ట్ ఇయర్ తో చదువు ఆగిపోయిన మొద్దుబాబును...

"బాధ" అనే పదంలో వత్తు ఏ అక్షరానికి ఇవ్వాలో కూడా తెలియనివాణ్ణి...

మా స్నేహితుడు నారాయణరెడ్డి టీచర్ ను ఒకరోజు అడిగితే వారు చెప్పారు తమాషాగా-

మామూలు బాధ అయితే 'ద' కు మాత్రమే వత్తు ఇవ్వు.
ఎక్కువ బాధ అయితే రెంటికీ వత్తు ఇవ్వు...అని అన్నారు.

ఎంత బాధలో ఉన్నా వారి మాట జ్ఞాపకానికి రాగానే నవ్వొస్తుంది.

వ్రాయడం చేతగానితనంతో అలా కొన్ని వందల సద్గురు సూక్తులను జారవిడుచుకున్నాను...

ఒకరోజు చెప్పినవి మళ్లీ చెప్పరు...
ప్రతిరోజూ సంగీతంలో క్రొత్త పాఠం నేర్చుకున్నంత ఆనందంగా ఉండేది నాకు.

ప్రతిరోజూ వారి బోధల్లోని శైలిని, వైవిధ్యతను భలే ఎంజాయ్ చేసేవాడిని...

1991 ప్రాంతంలో...ఎందుకో ఒకరోజు నాకనిపించింది...
వారి మాటలను వల వేసి పట్టగలిగే శక్తి నాకు ఎలాగూ లేదు...

వారి చేతనే కొన్ని మాటలు వ్రాయించుకుంటే బాగుండునని అనిపించింది....

ఓ మంచి నోట్ బుక్ కొనిద్దామంటే నా వద్ద డబ్బులుండేవి కావు.

ఓ డజన్ తెల్లని పేపర్లు కొని మధ్యలో దారంతో కుట్టి తెచ్చాను.

ఇంట్లో పాకెట్ మనీ ఇచ్చేవాళ్లు కాదు నాకు అప్పట్లో...

చదువూ సంధ్యా లేకుండా తిరిగేవాణ్ణి...

"వీడికి కూడు ఏయడమే దండగ" అని మా నాన్న అనుకునే రోజులవి.

1992 లో నా పెళ్లి జరిగిన రోజున నా జేబులో ఒక్కరూపాయి బిళ్ల కూడా లేదంటే నమ్మండి...

గురువుగారు, నేను కలిసి టీకొట్టుకెళ్లినా సరే
గురువుగారే డబ్బులిచ్చేవాళ్లు.

డబ్బుల్లేకుండా అలా గడిపేశాను చాలాకాలం.

డబ్బూ బాధ్యతా రెండూ లేకుండా గడపడం అనేది
జీవితంలో అదొక మజా.

సన్న్యాసి కాని సన్న్యాసిని.
సంసారి కాని సంసారిని.
అన్నట్లుండేవాణ్ణి.

మా నాన్నగారు నాకు షాప్ పెట్టిచ్చాక,
అప్పట్నుంచి డబ్బును కళ్లార చూడగలుగుతున్నాను...

గురువుగారు ప్రతిరోజూ ఓ గంట సమయం మా షాప్ లో కూర్చొని గడిపేవారు అప్పట్లో.

నా వ్యాపారలక్షణం చూసి-

నువ్వు అంగడిని పట్టుకోలేదు.
అంగడి నిన్ను పట్టుకుని ఉంది...అన్నారు నవ్వుతూ.

అలా వైట్ పేపర్లతో నేను తయారు చేసిన నోట్ బుక్, ఓ రైనాల్డ్ పెన్ తీసుకెళ్లి దేవుడి పటాలముందు పెట్టాను...

"ఏమది!!" అడిగారు ఆశ్చర్యంగా గురువుగారు.

"ఏదైనా వ్రాయాలనిపిస్తే వ్రాయండి..." అన్నాను.

మౌనంగా వాటి వైపు చూస్తూ ఊరకున్నారు...

తరువాత ఆ నోట్ బుక్ కనబడలేదు.

నేనూ మరచిపోయాను...

కొంతకాలం తర్వాత ఆ నోట్ బుక్ ను లోపల్నుండి తెచ్చి నా చేతికిచ్చారు...

తెరచి చూశాను-
ఆశ్చర్యం...! అందులో గురువుగారు స్వదస్తూరితో
సుబ్రహ్మణ్య-పరమేశ్వర మధ్య జరిగిన సంభాషణగా కొన్ని ఆధ్యాత్మిక పదాలకు క్రొత్త నిర్వచనాలు ఇచ్చిన రచన అది.

ఎప్పుడు వ్రాశారో ఏమో...!!
నా కంటబడకుండా వ్రాశారు...

అలా ఆ జ్ఞానామృతాన్ని హఠాత్తుగా
నా చేతిలో పెట్టేసరికి ఎంత ఆనందపడ్డానో!!!
మాటల్లో చెప్పలేను...

ఆ నోట్ బుక్ ను ఇంటికి తీసుకెళ్లి ప్రతిరోజూ చదువుకుంటూ ఉండేవాడిని...

నా నరనరాల్లోకి ఇంకిపోయేంతగా దానిని పారాయణం చేశాను...

ఆ తరువాత చాలాకాలానికి దానిని ముద్రించే సమయం వచ్చినప్పుడు, ఆ సంభాషణకు ఏదైనా టైటిల్ పెట్టండి....అని అడిగాను గురువుగారిని.

కలకాని, కల్లగాని కల...అని టైటిల్ పెట్టారు.

ఆ టైటిల్ కు అర్థమేమంటే-

ఊహ, వాస్తవం రెండూ ఒకటే జ్ఞానిదృష్టిలో.

మనం ఓ కల కంటాం...మేల్కొన్నాక ఆ కలను ఇంకొకరితో చెప్పుకుని నవ్వుకుంటాం...

అంటే ఈ జాగ్రదవస్థ వాస్తవమైనట్టు.

నిజానికి జాగ్రదవస్థ కూడా ఓ కలే.
ఆ కలకు కొనసాగింపే ఈ కల.

కల-మెలకువ రెంటినీ వేరు వేరు అని
అనుభవించడం అనేది అజ్ఞాని లక్షణం.

కల-మెలకువ రెంటినీ కలగా అనుభవించడం
జ్ఞాన లక్షణం.

మన కల, మరొక కలకు కారణమవుతుంది.
అదే జన్మపరంపర అంటే.
మనది 'అజ్ఞానం' అనే గాఢనిద్ర.

జ్ఞాని కల మెలకువతో(ఎరుకతో) కనే కల.
కాబట్టి జ్ఞాని, కలకు బంధితుడు కాడు.
వారిది 'ప్రజ్ఞ' అనే మెలకువ.

'ఇది కల' అనేది మనం మరచిపోతుంటాం కాబట్టి
బంధాలు తగులుకుంటున్నాయి.

ఈ సుబ్రహ్మణ్య-పరమేశ్వర సంవాదం అనేది
ఓ జ్ఞాని కలలో నుంచి పుట్టినది.

ఈ 'సంభాషణ' కూడా కలేకాని,
అట్లని కలా కాదు, కల్లా కాదు...

మనల్ని 'నిజమైన మెలకువ'లోకి తీసుకెళ్లే
కల ఇది.

అందువల్ల "కలకాని, కల్లగాని కల" అని
ఈ సంభాషణకు నామకరణం చేయడం జరిగింది.

అలా నా కోరిక మేరకు గురువుగారు స్వయంగా వ్రాసి నాకు ప్రసాదించిన
అద్భుతగ్రంథం ఇది.

నేను నా గురువచనాలను ఎంజాయ్ చేస్తున్నట్టు,
నా ప్రతి పిచ్చివ్రాతనూ ఆహా! ఓహో! అంటూ ఎంజాయ్ చేస్తున్న
నా పిచ్చితల్లి "రాధిక"కు ఈ వ్యాసం అంకితం...

* * *

శ్రీ గురుబ్రహ్మమగు పరమేశ్వరుని ఒడిలో కూర్చొని
ఆడుచున్న సుబ్రహ్మణ్యుడొకసారి తండ్రితో ఇట్లనెను-

1. సుబ్రహ్మణ్యుడు: నాయనా! నేను ఎవరు?
పరమేశ్వరుడు: నేనే నీవు.

2. సుబ్రహ్మణ్యుడు: నేను ఎక్కడ నుండి వచ్చితిని?
పరమేశ్వరుడు: నేను వచ్చిన చోటు నుండియే.

3. సుబ్రహ్మణ్యుడు: నీవు ఎక్కడ నుండి వచ్చితివి?
పరమేశ్వరుడు: నీవు వచ్చిన చోటు నుండియే.

4. సుబ్రహ్మణ్యుడు: నను కన్నవారు మీరే కదా!
పరమేశ్వరుడు: నిను కన్నవారము కాదు,
నీచే మొదట కనబడినవారము.

5. సుబ్రహ్మణ్యుడు: నా చేత యెట్లు కనబడిరి?
పరమేశ్వరుడు: నేనని నిన్ను నీవు కనిన తదుపరి కనినది మమ్మే కదా!

6. సుబ్రహ్మణ్యుడు: ఈ నామరూపములు నేనేనా?
పరమేశ్వరుడు: అయిన సందేహము ఎందుకు?

7. సుబ్రహ్మణ్యుడు: సందేహమననేమి?
పరమేశ్వరుడు: దేహముతో పాటు వచ్చి, ఉండి,
దేహముతో పాటు తీరునది.

8. సుబ్రహ్మణ్యుడు: ఈ సందేహము యెందుకో తెలియదు కాని
కలుగుచున్నది.
పరమేశ్వరుడు: కావున నీవు నామరూపములు కాకుండా ఉండవలె.

9. సుబ్రహ్మణ్యుడు: మరి నేనెవరు?
పరమేశ్వరుడు: నేనే నీవని అంటిని కదా!

10. సుబ్రహ్మణ్యుడు: నా ప్రశ్నకిది సమాధానమా?
పరమేశ్వరుడు: ప్రశ్న అనగానేమి?

11. సుబ్రహ్మణ్యుడు: అర్థముకాని, అనుభవములో లేని సమాధానము.
పరమేశ్వరుడు: సమాధానమనగా?

12. సుబ్రహ్మణ్యుడు: అర్థమయి, అనుభవమైయున్న ప్రశ్న అనుకొందును.
పరమేశ్వరుడు: ఈ ప్రశ్న సమాధానములు ఎవరికి?

13. సుబ్రహ్మణ్యుడు: నాకే.
పరమేశ్వరుడు: నీవు యెవరు?

14. సుబ్రహ్మణ్యుడు: బాగున్నది...అది నేనడిగినది కదా!
పరమేశ్వరుడు: అదే ఆ నేను ఎవరని కదా!

15. సుబ్రహ్మణ్యుడు: అమ్మ ఎవరు?
పరమేశ్వరుడు: నా యొక్క ప్రకృతి.

16. సుబ్రహ్మణ్యుడు: నాన్న ఎవరు?
పరమేశ్వరుడు: అమ్మ యొక్క పురుషరూపం.

17. సుబ్రహ్మణ్యుడు: ప్రకృతి, పురుషులు ఎవరు?
పరమేశ్వరుడు: ప్రశ్నించువాడు అనుభవించు రెండు రూపములు.

18. సుబ్రహ్మణ్యుడు: ప్రశ్నించు నేనెవరు?
పరమేశ్వరుడు: ప్రకృతి పురుషులు కాక వారికి ఆధారమైనవాడు.

19. సుబ్రహ్మణ్యుడు: అన్న యెట్లు కలిగెను?
పరమేశ్వరుడు: అమ్మ చేసెను.

20. సుబ్రహ్మణ్యుడు: మరి నేను?
పరమేశ్వరుడు: నా వలన.

21. సుబ్రహ్మణ్యుడు: అన్న యెవరు?
పరమేశ్వరుడు: వ్యష్టి ప్రకృతి.

22. సుబ్రహ్మణ్యుడు: అమ్మ యెవరు?
పరమేశ్వరుడు: సమిష్టి ప్రకృతి.

23. సుబ్రహ్మణ్యుడు: నేను యెవరు?
పరమేశ్వరుడు: వ్యష్టి పురుషుడు.

24. సుబ్రహ్మణ్యుడు: మరి నాన్న?
పరమేశ్వరుడు: సమిష్టి పురుషుడు.

25. సుబ్రహ్మణ్యుడు: దేవుడు అనగా?
పరమేశ్వరుడు: జీవుని అనంతస్వరూపము.

26. సుబ్రహ్మణ్యుడు: జీవుడు అనగా?
పరమేశ్వరుడు: దేవుని పరిమిత స్వరూపము.

27. సుబ్రహ్మణ్యుడు: ప్రపంచమనగా?
పరమేశ్వరుడు: దేవుని వ్యక్తరూపము.

28. సుబ్రహ్మణ్యుడు: మరి ప్రపంచం యొక్క అవ్యక్తరూపమేది?
పరమేశ్వరుడు: అదియే దైవము.

29. సుబ్రహ్మణ్యుడు: సృష్టి అననేమి?
పరమేశ్వరుడు: స్థితికి ముందటిది.

30. సుబ్రహ్మణ్యుడు: లయమనగా?
పరమేశ్వరుడు: స్థితికి తరువాతది.

31. సుబ్రహ్మణ్యుడు: సృష్టి స్థితి లయములెవరికి?
పరమేశ్వరుడు: ఉన్నవనువారికి.

32. సుబ్రహ్మణ్యుడు: జన్మమనగా?
పరమేశ్వరుడు: ఉన్నాననుట; ఊపిరి పీల్చుట.

33. సుబ్రహ్మణ్యుడు: మరణమనగా?
పరమేశ్వరుడు: లేననుట; ఊపిరి వదులుట.

34. సుబ్రహ్మణ్యుడు: ఇవి ఎవరికి?
పరమేశ్వరుడు: ఉన్నాననువారికి.

35. సుబ్రహ్మణ్యుడు: ఇవి లేనిది ఎవరికి?
పరమేశ్వరుడు: నేనని అనుకొనక, అనక, ఉన్నవారికి.

36. సుబ్రహ్మణ్యుడు: జ్ఞాని యెవరు?
పరమేశ్వరుడు: ఉన్నది జ్ఞానమొక్కటే. అన్యము లేదు అని ఉన్నవాడు.

37. సుబ్రహ్మణ్యుడు: అజ్ఞాని ఎవరు?
పరమేశ్వరుడు: జ్ఞానముతో పాటు అజ్ఞానమున్నదని ఉన్నవాడు.

38. సుబ్రహ్మణ్యుడు: భక్తుడు ఎవరు?
పరమేశ్వరుడు: భగవానుడై ఉన్నవాడు.

39. సుబ్రహ్మణ్యుడు: భగవానుడెవరు?
పరమేశ్వరుడు: భక్తుడై ఉన్నవాడు.

40. సుబ్రహ్మణ్యుడు: గురువనగాగా?గా ఎవరు?
పరమేశ్వరుడు: తనను తానెరిగిన శిష్యుడు.

41. సుబ్రహ్మణ్యుడు: శిష్యుడెవరు?
పరమేశ్వరుడు: తనను తాను మరచిన గురువు.

42. సుబ్రహ్మణ్యుడు: సాధన అనగా?
పరమేశ్వరుడు: తనను మరచి తిరిగి తానెవరో జ్ఞప్తికి తెచ్చుకొను ప్రయత్నం.

43. సుబ్రహ్మణ్యుడు: సిద్ధి అనగా?
పరమేశ్వరుడు: తానెవరో యని తెలుసుకొనుట.

44. సుబ్రహ్మణ్యుడు: జ్ఞానము అనగా?
పరమేశ్వరుడు: ఉన్నది ఒక్కటేయని అది తానే యై ఉండుట.

45. సుబ్రహ్మణ్యుడు: యోగము అనగా?
పరమేశ్వరుడు: ఏకవస్తువుగా తాను తన్నెరిగి ఆనందించుట. అన్యముతో సంయోగ వియోగములకు అవసరంకాని అవకాశంకాని లేకుండుట.

46. సుబ్రహ్మణ్యుడు: ఆత్మ యనగా?
పరమేశ్వరుడు: నేను.

47. సుబ్రహ్మణ్యుడు: బ్రహ్మమనగా?
పరమేశ్వరుడు: తనతో సమానముకాని, అధికము గాని అన్యముగాని లేని నేనే.

48. సుబ్రహ్మణ్యుడు: విష్ణువు ఎవరు?

పరమేశ్వరుడు:

1.తనువు
2.భార్య
3.ప్రపంచం
4.తల్లి
5.ఉపదేశం
6.పదము
7.నేను.

49. సుబ్రహ్మణ్యుడు: మహేశ్వరుడు ఎవరు?

పరమేశ్వరుడు:

1.ప్రాణము
2.భర్త
3.పరమేశ్వరుడు
4.తండ్రి
5.గురువు
6.అర్థము
7.నేను.

50. సుబ్రహ్మణ్యుడు: బ్రహ్మ ఎవరు?

పరమేశ్వరుడు:

1.ప్రాణమున్న తనువు
2.భర్తగల భార్య

3.పరమేశ్వరుని తోడి ప్రపంచం.
4.తండ్రి గల తల్లి.
5.గురువు గల ఉపదేశము.
6.అర్థము గల పదము.
7.నేనై ఉన్న నేను.

51. సుబ్రహ్మణ్యుడు: త్రిమూర్తులెవరు?

పరమేశ్వరుడు:
ప్రాణము శివుడు.
దేహము విష్ణువు.
వాటి సంయోగము బ్రహ్మ.
వారి స్వరూప, స్వభావ, లక్షణములు నేను.
మంచు బ్రహ్మ.
జలము విష్ణువు.
ఆవిరి శివుడు.

52. సుబ్రహ్మణ్యుడు: శక్తి అననేమి?
పరమేశ్వరుడు: చలించు శివుడు.

53. సుబ్రహ్మణ్యుడు: శివుడనగా?
పరమేశ్వరుడు: నిశ్చలమగు శక్తి.

54. సుబ్రహ్మణ్యుడు: కాలములెన్ని?
పరమేశ్వరుడు: ఒకటే. వర్తమానము.
గతమైన వర్తమానము భూతకాలము.
ఆగత వర్తమానము భవిష్యత్తు.
ఒకే కాలము సదా వర్తమానము.
అదే నేను.
అప్పుడు ఇప్పుడు ఎప్పుడూ ఉన్నది ఒక్కటే నేను.

55. సుబ్రహ్మణ్యుడు: దేశములెన్ని?
పరమేశ్వరుడు: ఒకటే,

స్వదేశము స్వయందేశము.
అచట, ఇచట, ఎచ్చటా స్వయందేశమే.
విదేశము లేనిది.
అదే నేను.

56. సుబ్రహ్మణ్యుడు: భక్తి జ్ఞాన కర్మములననేమి?
పరమేశ్వరుడు: సకలమై ఉన్నది నీవే అని ఉండుట భక్తి.
సకలమై ఉన్నది నేనే అని ఉండుట జ్ఞానము.
సకలమై ఉన్నది అతడే అని ఉండుట కర్మము.

57. సుబ్రహ్మణ్యుడు: వాటి ఫలమేమి?
పరమేశ్వరుడు: ఈ మూడు ఎవరికి అని తెలిసి
అతడే అయి ఉండుట.

58. సుబ్రహ్మణ్యుడు: దుఃఖము అనగా?
పరమేశ్వరుడు: తన కన్యమైనదొకటి కలదనుట;
నేను కర్తననుట; భోక్తననుట.

59. సుబ్రహ్మణ్యుడు: సుఖము అనగా?
పరమేశ్వరుడు: తన కన్యముగా వేరొకటి లేనే లేదని ఉండుట.
కర్తృత్వ, భోక్తృత్వములు లేక ఉండుట.

60. సుబ్రహ్మణ్యుడు: పరమసుఖమనగా?
పరమేశ్వరుడు: సుఖదుఃఖములెవరికని విచారించి
దాని మూలమున మునిగి, ఎరిగి తానేయై ఉండుట.

61. సుబ్రహ్మణ్యుడు: నరకమనగా?
పరమేశ్వరుడు: ఉన్నదానిని లేదని తలచుట,
ఐనదానిని కాదని తలచుట.

62. సుబ్రహ్మణ్యుడు: స్వర్గమనగా?
పరమేశ్వరుడు: లేనిదానిని ఉన్నదని తలచుట,
కానిదానిని ఔనని తలచుట.

63. సుబ్రహ్మణ్యుడు: మోక్షమనగా?
పరమేశ్వరుడు: తలంపులు లేకుండుట.

64. సుబ్రహ్మణ్యుడు: మాయ అనగా?
పరమేశ్వరుడు: అమ్మ అయ్యలు తనను కనిరి అనుట.

65. సుబ్రహ్మణ్యుడు: పుట్టుక ఎందుకు?
పరమేశ్వరుడు: తాను గిట్టుదునని అనుకుంటున్నందుకు.

66. సుబ్రహ్మణ్యుడు: గిట్టుట ఎందుకు?
పరమేశ్వరు: తాను పుట్టితిని అని అనుకుంటున్నందుకు.

67. సుబ్రహ్మణ్యుడు: స్త్రీ ఎవరు?
పరమేశ్వరుడు: తాను పురుషుడను కాను,
స్త్రీని అని అనుకొనునది.

68. సుబ్రహ్మణ్యుడు: పురుషుడు ఎవరు?
పరమేశ్వరుడు: తాన స్త్రీ కాదని పురుషుడను అనుకొనువాడు.

69 సుబ్రహ్మణ్యుడు: నపుంసకుడెవడు?
పరమేశ్వరుడు: స్త్రీ పురుషులు తాను కానని గాని,
ఔనని గాని అనుకొననివాడు.

70. సుబ్రహ్మణ్యుడు: ఎవరు స్త్రీ? ఎవరు పురుషుడు? ఎవరు
నపుంసకుడు?
పరమేశ్వరుడు: స్త్రీ పున్నపుంసకములు అయి, కాక ఉన్న నేనే.

71.సుబ్రహ్మణ్యుడు: ఇంతకీ నీవు స్త్రీవా? పురుషుడవా? నపుంసకుడవా?
పరమేశ్వరుడు: ఎవరు ఎట్లో వారికి నేనును అట్లే.

72. సుబ్రహ్మణ్యుడు: స్థూలమననేమి?
పరమేశ్వరుడు: వాఙ్మానసగోచరమగు సూక్ష్మము.

73. సుబ్రహ్మణ్యుడు: సూక్ష్మమననేమి?
పరమేశ్వరుడు: అవాఙ్మానసగోచరమగు స్థూలము.

74. సుబ్రహ్మణ్యుడు: జడమననేమి?
పరమేశ్వరుడు: వాఙ్మానస గోచరమై యున్న చైతన్యము.

75. సుబ్రహ్మణ్యుడు: చైతన్యమననేమి?
పరమేశ్వరుడు: అవాఙ్మానస గోచరమై యున్న జడము.

76. సుబ్రహ్మణ్యుడు: పంచముఖేశ్వరుడెవరు?
పరమేశ్వరుడు: నేనే.
ఒకే చెవి, ఒకే ముక్కు, ఒకే చర్మము, ఒకే కన్ను, ఒకే నాలుక
ఈ అయిదు ముఖములు.

వినువాడు, వినబడునది, వినికిడి కలిసి ఒకే చెవి.
మూర్కొనువాడు, మూర్కొనబడునది, మూర్కొనుట కలిసి ఒకే ముక్కు.
తాకువాడు, తాకబడునది, తాకుట కలిసి ఒకే చర్మము.
కనువాడు, కనబడునది, కనుట కలిసి ఒకే కన్ను.
రుచి చూచువాడు, రుచి చూడబడునది, రుచి కలిసి ఒకే నాలుక.

నాకు గలవి ఈ అయిదు ముఖములే.
ఇట్టి నేనే పంచముఖేశ్వరుడు.

77. సుబ్రహ్మణ్యుడు: ప్రార్థన ఫలించుట ఎట్లు?
ధ్యానము కుదురుట ఎట్లు?
పరమేశ్వరుడు: ప్రార్థన, ధ్యానములు మొదట నీచే చేయబడునని నీవనుకొనుట. జరుగునది అట్లు కాదు. దేవుడు మొదట నిన్ను ప్రార్థించును; ధ్యానించును. అపుడు నీకు దేవుని ప్రార్థింపవలెనని, ధ్యానింపవలెనని తలంపు కలుగును. దేవుడు తలుపక, దేవుని ప్రార్థించుట, ధ్యానించుట ఎవరి తరము?

78. సుబ్రహ్మణ్యుడు: పరమేశ్వరుడు సకలాత్మకుడు, సకలవ్యాపకుడు, సకలాధిష్ఠాన స్వరూపుడు, సకలసిద్ధుడు అనుట ఏమి?

పరమేశ్వరుడు: ఒకడు ఇలా కలగన్నాడు-
పొరుగూరికి వెళ్లాడు, అక్కడ తనకు తగిన కన్యను చూశాడు.
బంధుమిత్రుల సమక్షంలో వివాహమాడాడు, ఉద్యానవనంలో విహరించాడు,

తనను ఎదిరించిన శత్రువులను మర్దించాడు,
బిడ్డలను కన్నాడు...
కల నుంచి మేల్కొన్నాడు. తనకు తానే మిగిలాడు.
మరి అతని స్వప్నప్రపంచమున సకలాత్మకుడు, సకలవ్యాపకుడు,
సకలాధిష్ఠానస్వరూపుడు, సకలసిద్ధుడు తానే కదా!
అట్లే జగత్తున పరమేశ్వరుడన్నియూ అయినాడు.

79. సుబ్రహ్మణ్యుడు: మిథ్య, భ్రాంతి అననేమి?
పరమేశ్వరుడు: తత్కాలిక సత్యము, వికార్యము, అంతవంతము.

80. సుబ్రహ్మణ్యుడు: సత్యము అనగా?
పరమేశ్వరుడు: అవికార్యము, అనంతము, శాశ్వతము.

81. సుబ్రహ్మణ్యుడు: సత్-చిత్-ఆనందములన నేమి?

పరమేశ్వరుడు: అనంతమైన, అఖండమైన ఉనికి సత్.
అదే నేననుట చిత్.
అట్టి ఉనికి వలన కలిగిన నిర్భయస్థితి ఆనందము.

82. సుబ్రహ్మణ్యుడు: తలంపులు లేకుండుట అనగా?
పరమేశ్వరుడు: కల్పన చేయని కవి.
బొమ్మ గీయని చిత్రకారుడు.
పాడని గాయకుడు.
సృష్టి స్థితి లయములు చేయని పరమేశ్వరుడు.
వీరి స్థితియే తలంపులు లేకుండుట.

83. సుబ్రహ్మణ్యుడు: నిష్కామకర్మ యనగా?
పరమేశ్వరుడు: చేసీ చేయక, చేయక చేసి ఉండు కర్మ.
కవి కావ్యమును కల్పించును. కావ్యమందలి పాత్రల కర్మలు కవియే చేసెను.
చేసెనా అన చేయలేదు...అట్లే.

84. సుబ్రహ్మణ్యుడు: బ్రహ్మము అననేమి?
పరమేశ్వరుడు: ఏ ఒక్కటియూ కాక ఏదో ఒకటియై యున్నదే.

85. సుబ్రహ్మణ్యుడు: పలుకునదెల్ల ఏమి?
పరమేశ్వరుడు: పలవరింత.

86. సుబ్రహ్మణ్యుడు: కనుదెల్ల ఏమి?
పరమేశ్వరుడు: కలవరింత.

87. సుబ్రహ్మణ్యుడు: నిద్ర అనగా?
పరమేశ్వరుడు: జాగ్రత్, స్వప్న, సుషుప్తులు అనుభవించు స్థితి.

88. సుబ్రహ్మణ్యుడు: సమాధి అనగా?
పరమేశ్వరుడు: పై మూడు స్థితులలోను సాక్షిని నేనే అని మరువకుండుట.

89. సుబ్రహ్మణ్యుడు: ఆత్మసన్నిధిన అఖిలము ప్రవర్తించును అనుట ఏమి?

పరమేశ్వరుడు: రామకథ ఉన్నది. గ్రంథమును చదువువాని చూపు పడనంతవరకు రామాయణ కథాప్రపంచము జడమై ఉంటుంది. చూపు పడిన వెంటనే కథాప్రపంచమున కదలిక మొదలవుతుంది. పాత్రలు సజీవవంతములౌతాయి.

అట్లే ఏ చూపు పడిన వెంటనే ఈ విశ్వకథాప్రపంచము చైతన్యవంతమౌతుందో ఆ చూపే ఆత్మ.

ఆ చూపు పడుటయే సన్నిధి.
చూచువాడే ఆత్మ.

కథలో లీనమై తనను మరచి లీనమైనట్లే, ఈ జగత్కథలో లీనమైన ఆత్మవిస్మృతి సంభవించి తనను తాను మరచి జీవియౌతుంది.  విశ్వకథా పఠననమాపిన వెంటనే స్వస్వరూపానుభవ మౌతుంది.

90. సుబ్రహ్మణ్యుడు: యోగి ఎవరు?

పరమేశ్వరుడు: చలనచిత్ర ప్రదర్శనలో ఆసనములన్నీ తెరవైపుకే అమర్చబడి ఉంటాయి. వచ్చినవారందరూ తెరకు అభిముఖులై చిత్రకథలో లీనమైపోతారు. నూటికి కోటికి ఒకడు హఠాత్తుగా తెరపై పడుచున్న కాంతి మార్గము వెంబడి తన చూపును వెనకకు మరల్చి కాంతి ఉత్పత్తి స్థానము వైపు చూపు మరల్చుతాడు. తెరవైపు వీపు పెట్టి ఆ కాంతి ప్రసారమార్గానికి

అభిముఖంగా సూటిగా చూస్తాడు. కన్ను చెదరునంత కాంతి తప్ప మరేమీ కన్పించదు. అదే క్షణంలో అందరూ చిత్రాన్ని చూస్తుంటే అతడొక్కడు చిత్రపు కదలికకు కారణమైన కాంతిని మాత్రమే చూస్తుంటాడు. అదే రీతిన జగద్దృష్టిని మాని తనలోని కాంతి కేంద్రమునకు అభిముఖుడై కేవలము పరంజ్యోతిని దర్శించి అనుభవించువాడే యోగి.

91. సుబ్రహ్మణ్యుడు: అట్టి యోగులెందరున్నారు?
పరమేశ్వరుడు: ఒక్కడే.

92. సుబ్రహ్మణ్యం: అతడెవరు?
పరమేశ్వరుడు: అవాఙ్మానస గోచరుడగు నేనే.

93. సుబ్రహ్మణ్యుడు: సాకార నిరాకారోపాసనలన నేమి?
పరమేశ్వరుడు: నది ప్రవాహము సుడులతో కూడి ఉన్నప్పుడు అది సాకారోపాసన.
అలజడి లేక, సుడులు లేక ప్రవహించినచో అది నిరాకారోపాసన.
ప్రవాహ ప్రారంభ దశ ఒకటి.
సాగర సమీప దశ మరియొకటి.
రెండూ సాగరదిశలోనికే ప్రయాణిస్తాయి.

* * *

33. నీవే నిప్పు కావాలి...

---

1988 నుండి సద్గురు సన్నిధిలో కూర్చుని వారి దివ్యబోధలు వింటున్నప్పటికీ....
వాటిని వ్రాసుకుని దాచుకోవాలనే ఆలోచన నాకు కలుగనేలేదు.

2000 సంవత్సరం నుండే వ్రాయడం మొదలు పెట్టాను...

అప్పటివఱకు యెంత జ్ఞానసంపదను వదిలేసుకున్నానో....

నేనేదో వ్రాస్తున్నాను తెలిసి మా భారతక్క ప్రతి సంవత్సరం డైరీలు కొన్ని ఇస్తుండేది...

వైజాగ్ లక్ష్మి గారు కూడా బోలెడు డైరీలు, పెన్ పేకెట్టు తెచ్చిచ్చారు ఓ రోజు...మేం వైజాగ్ వెళ్లినప్పుడు...

ఆ డైరీలు చూసి...గురువుగారు అన్నారు...
పొగను ఎంత ప్రోగు చేసుకున్నా అది నిప్పు అవదు.
నీవే నిప్పు అయినప్పుడు పొగను ప్రోగు చేసుకోవలసిన అవసరం ఉండదు.

ఉపదేశవాక్యాలను ఎంత ప్రోగు చేసుకున్నా
అది ఆత్మ అవదు.
నీవే ఆత్మ అని తెలిశాక
వాక్యాల అవసరం ఉండదు.

ఇది నాకే హెచ్చరిక....

నేల విడిచి సాము చేయకూడదు అంటారు కదా...
తనను విడిచి చేసే ఏ సాధనా సఫలం కాదు.
'తన'ను విడవకుండా ఉండడమే సాధనా, సిద్ధీ...

* * *

2012 లో గురువుగారి ప్రబోధాలైన "జ్ఞానప్రసూనాలు"
తొలిసారిగా ముద్రణకు నోచుకున్నాయి....

గురుభక్తులైన అప్పాస్వామి, పద్మావతమ్మ, మునికృష్ణారెడ్డి....వరుసగా జ్ఞానప్రసూనాలను అచ్చువేయడానికి తగిన ఆర్థిక సహాయం చేశారు...

వారి పూనిక వలనే ఈ రోజు వేల సద్గురు గ్రంథాలు రాష్ట్రం నలుమూలలకు వెళ్లి, యెందరో జిజ్ఞాసువులను సద్గురు సన్నిధికి చేర్చింది.

గ్రంథాల ద్వారానే కాకుండా...facebook, whatsapp ద్వారా కూడా జ్ఞానప్రచారం చేయవచ్చు అని తెలిసి గురువుగారు నాకు ఒక phone కూడా కొనిచ్చారు....

దాంతో మరింతగా ఆ జ్ఞానబీజాలను ప్రపంచమంతా వెదజల్లే అవకాశం నాకు దొరికింది.

తమిళనాడు, కర్నాటక, ఉత్తరభారతం నుండి కూడా జిజ్ఞాసువులు రావడం మొదలైంది....

ఇదంతా జ్ఞానప్రసూనాంబ కరుణావిలాసమే....

శ్రీకాళహస్తి ఇప్పుడు జ్ఞానకేంద్రం అయ్యింది.

* * *

బాబూ!
ఇందులో ఒక్క వాక్యం కూడా నాకు గుర్తులేదు...
నీవు భద్రపరచుకుంటే అవన్నీ గాలిలో కలిసిపోయేవి...అన్నారు గురువుగారు....

వచ్చిన భక్తులకంతా ఆ పుస్తకాలు ఇవ్వడం...
ఇవన్నీ బాబు వలన వచ్చినవే అని గురువుగారు వారికి చెప్పడం....

వారు విచిత్రంగా నా వైపు చూడడం....
నేను టీ షర్ట్, జీన్స్ ఫ్యాంటు వేసుకుని ఉండడం వలన కావొచ్చు....

వాళ్లు నాకూ ఓ నమస్కారం పడేయడం....
నేనూ ఓ నమస్కారం వారికి పడేయడం.....

ఇలా జరుగుతుండేది....

* * *

రాబోయే తరాలవారికి  వేదాంతం అంటేనే 'జ్ఞానప్రసూనాలే' అవుతుంది....అన్నారు గురువుగారు.

గురుపుత్రుడు కృష్ణ అన్నాడు....
జ్ఞానప్రసూనాలు చదివాకే మా నాన్న విలువ తెలిసింది అని.
గురువుగారికి చెబితే, వారు నవ్వుతూ-
నిజంగా జ్ఞానప్రసూనాలు అర్థమై ఉంటే,
వ్రాసింది నాయన కాదు అనే విషయం తెలిసుండేది అన్నారు.

* * *

జ్ఞానప్రసూనాంబ నా డైరీలపై ఓ కన్ను వేసే ఉంచింది అనడానికి గుర్తేమంటే తక్కువ వ్యవధిలో 26 పుస్తకాలు ముద్రణకు నోచుకోవడమే.

ఈ మధ్య జరిగిన మరో అద్భుత సంఘటన...

మేము ఎలా పరిచయమో ఏమో....
వైజాగ్ నుండి శ్రీనివాసులు అనే వ్యక్తి వచ్చాడు గురుదర్శనానికి....నేనొక బుక్ ప్రింట్ వేయిస్తానని కోరారు....

'బాబుతో మాట్లాడు' అన్నారు గురువుగారు....

నన్ను వెతుక్కుంటూ వచ్చాడు....విషయం చెప్పాడు...
యెంత ఖర్చవుతుంది? అడిగాడు....50 వేలు కావొచ్చు అన్నాను...నా బ్యాంకు వివరాలు తీసుకున్నాడు...
వైజాగ్ వెళ్లి నా అకౌంటులో డబ్బులు వేశాడు....అంతే.

పదిరోజుల్లో బుక్స్ ప్రింట్ అయ్యి వచ్చేశాయి...

ఓ 10 బుక్స్ పంపుతాను అన్నాను అతనితో ఫోన్ లో....
నాకు ఒక్క బుక్ పంపండి చాలు....వాటిని అందరికీ పంచండి...అన్నారు.

ఆ పుస్తకమే...."అది అంతే - ఇది ఇంతే"
ఆ టైటిల్ ను మాత్రం స్వయంగా గురువుగారే పెట్టారు....

ఆ శ్రీనివాసులు మళ్ళీ ఎప్పుడూ శ్రీకాళహస్తికి రాలేదు....
కనీసం ఫోన్ కూడా చేయలేదు....

అతను "ఋషిఋణం" అలా తీర్చుకున్నాడేమో...!

జ్ఞానాంబ ప్రేరణ కాకుంటే....ఇదంతా ఎలా జరిగేది?

ఇదంతా "జ్ఞానప్రసూనాంబ లీలా విలాసం" అనడం కంటే నా వద్ద మరో సమాధానం లేదు.

* * *

34. అంతా రివర్స్......

---

అన్ని క్షేత్రాలలో దేవతామూర్తులను సవ్యదిశలో ప్రదక్షిణం చేస్తారు.
కానీ శ్రీకాళహస్తిక్షేత్రంలో అపసవ్య దిశగా ప్రదక్షిణం చేయడం సంప్రదాయం.

ముందుగా జ్ఞానప్రసూనాంబను దర్శించుకున్నాకే
తరువాత శ్రీకాళహస్తీశ్వరుని దర్శనం చేసుకుంటారు.

సాధారణంగా దేవుడు పైన ఉంటాడు,
భక్తుడు క్రింద ఉంటాడు.

కానీ శ్రీకాళహస్తిలో కొండ పైన భక్తకన్నప్ప ఉన్నాడు.
పరమశివుడు కొండ క్రింద ఉంటాడు.

దక్షిణదేశంలో నదులన్నీ తూర్పువైపుకు ప్రవహిస్తాయి.
శ్రీకాళహస్తిలో సువర్ణముఖరీ నది మాత్రం ఉత్తరదిక్కుకు ప్రవహిస్తుంది.

మిగతా సత్సంగాలలో -
శిష్యులు గురువుకు సేవ చేస్తారు.

శ్రీకాళహస్తి సద్గురు సత్సంగలో -
గురువే శిష్యులకు సేవ చేస్తాడు.

శిష్యులు కూర్చోవడానికి చాపలు పరచి,
త్రాగడానికీ నీళ్లచెంబు పెట్టి...
వేడి వేడి టీ నింపిన ఫ్లాస్కు పెట్టి....
తినటానికి బోండాలు, బజ్జీలు తెప్పించి....
శిష్యుల కోసం యెదురు చూసే గురువు ఎక్కడైనా ఉంటారా?

అంతేనా......

నా ఇష్టదైవమైన సుబ్రహ్మణ్యుడే శిష్యుల రూపంలో క్రింద కూర్చుని,
శిష్యుడైన నన్ను పైన కూర్చోబెట్టి తన ముచ్చట తీర్చుకుంటున్నాడు
అన్నారు గురువుగారు.

మన సత్సంగం ప్రత్యేకత ఇదే....
శిష్యుడు పైన కూర్చొని ఉంటాడు...

గురువులు క్రింద కూర్చొని ఉంటారు....
అంటారు యెంతో తన్మయంతో...

గురువుగారు తన శిష్యులకు
ఎంత గొప్ప స్థానం ఇచ్చారో....

సత్సంగంలో ఉన్న ఏ ఒక్కరికీ నేను శిష్యుడిగా ఉండటానికి కూడా అర్హత లేనివాణ్ణి.
కానీ భగవంతుడు నన్ను గురుస్థానంలో కూర్చోబెట్టారు.
భగవదిచ్ఛ....అంటారు గురువుగారు.

* * *

ఓ సారి గురువుగారు 12 నోట్ బుక్స్ తెప్పించి....అందులో .....

ఓం సద్గురు - శ్రీ సద్గురు - శివ సద్గురు - జయ సద్గురు

అనే సద్గురు మంత్రాన్ని వ్రాసి, ఆ సమయానికున్న 12 మంది శిష్యులకు వాటిని ఇచ్చి ఆ నోట్ బుక్ మొత్తం ఆ మంత్రాన్ని వ్రాయమన్నారు...వారం పదిరోజులలో వ్రాసి తిరిగి తనకు చేర్చమన్నారు....

ఆ సందర్భంగా గురువుగారు ఓ మాట అన్నారు....

12 మంది శిష్యులకు ఒక గురువు ఉండడం గొప్పా?
లేక
ఒకనికి 12 మంది గురువులు ఉండడం గొప్పా?

అని అడిగారు ....అందరూ మౌనం వహించారు....

దాని అర్థం మీకందరికీ కలిపి నేనొక్కణ్ణే గురువును.
నాకు మీరందరూ(12 మంది)గురువులు.

నేనే గొప్ప....అని సంతోషపడిన మహాగురువతడు.

ఒక్కోసారి శిష్యులతో పాటు తానూ క్రిందే కూర్చుంటారు...

ఏదైనా క్రొత ఆధ్యాత్మికవిషయం చెప్పినప్పుడు -
బాగుంది...క్రొత్త విషయం...అని బాబు అంటే...

"నాక్కూడా ఇది ఇప్పుడే తెలిసింది" అంటారు గురువుగారు.

తాను యెప్పుడూ తొలిశ్రోతగా అంటే తొలిశిష్యుడుగానే ఉండి
చిన్నపిల్లాడిలా సంతోషపడతారు క్రొత్త విషయం తెలుసుకున్నప్పుడు.

'నేను గురువును' అన్న దర్పాన్ని వారు ఎన్నడూ ప్రదర్శించలేదు.

మనం గురువు-గురువు అని వ్యవహరిస్తామేగానీ, తానెప్పుడూ తాను
గురువు అని అనుకోలేదు,
యెవరికీ తాను గురువుగా ఉండలేదు...

(తాతగారికి) శిష్యుడుగానే ఉండిపోయారు తన జీవితమంతా...

నేను గురువు కోసం వెదుకుతున్నాను...అని ఒకరు అంటే,

నేను శిష్యుని కోసం వెదుకుతున్నాను....
ఒక్కడూ దొరకలేదు...
నాకు అందరూ గురువులుగానే కనబడుతున్నారు...
అన్నారు గురువుగారు.

కేవలం ఇలాంటి బాహ్య విషయాలలో మాత్రమే కాదు...

వారి బోధించే తత్త్వం కూడా పూర్తిగా రివర్సులోనే ఉంటుంది; లోకంలో
ఉన్న తత్త్వంతో పోలిస్తే...
* * *

మాయ సత్యాన్ని మనకు తిరగేసి చూపెడుతుంది....
లోకం అదే సత్యమని వ్యవహరిస్తోంది.

మళ్లీ దానిని మనం తిరిగేసి చూస్తే అసలు సత్యం గోచరిస్తుంది
అంటారు గురువుగారు.

అందుకు వందలకొద్ది ఉదాహరణలను చూపవచ్చు....

ప్రస్తుతం నేను కొన్ని ఉదాహరణలు మాత్రమే చూపుతున్నాను...
* * *

1.లోకం: దైవాన్ని పొందాలి....
గురువు: పొందబడేది దైవం కాదు.

2.లోకం: తలంపులను అణచాలి...
గురువు: ఆత్మే తలంపులుగా ఉండేది.

3.లోకం: నేను దేవుడు కావాలి...
గురువు: దేవుడే నీవుగా ఉండేది.

4.లోకం: దైవానుభవాన్ని పొందాలి...
గురువు: ఏ అనుభవమూ లేకపోవడమే దైవానుభవం.

5. లోకం: అన్నింటినీ త్యాగం చేయాలి....
గురువు: "త్యాగి"ని త్యాగం చేయాలి.

6.లోకం: మాయను అంతం చేయాలి....
గురువు: మాయ సద్వస్తువు.

7.లోకం: ప్రపంచం అనంతం...
గురువు: కనుచూపు పారినంత మేరకు ఉన్నదే ప్రపంచం.

8.లోకం: నేను ప్రపంచంలో ఉన్నాను...
గురువు: నాలో ప్రపంచం ఉంది....

9.లోకం: శిష్యుడు గురువుకు చేసేది గురుసేవ...
గురువు: గురువు శిష్యుడికి చేసేది గురుసేవ.

10.లోకం: లేనిదానిని అడగడం ప్రార్థన....
గురువు: ఉన్నదానినే అడగడం ప్రార్థన.

11.లోకం: దేవుణ్ణి పొందాలి....
గురువు: దేవుడే నిన్ను పొందాడు.

12.లోకం: ధర్మాన్ని రక్షించాలి...
గురువు: ధర్మమే నిన్నూ, సకలాన్నీ రక్షిస్తోంది.

13.లోకం: ఆత్మానుభవాన్ని పొంది తీరాలి...
గురువు: ఆత్మానుభవం కలుగనే కలుగదు.

14.లోకం: జ్ఞానం అంటే తెలుసుకోవడం...
గురువు: జ్ఞానమంటే ఏమీ తెలియకపోవడం.

15.లోకం: నిద్ర అనేది అజ్ఞానం.
గురువు: నిద్ర అనేది స్వరూపం.

16.లోకం: సన్న్యాసం పుచ్చుకోవాలి...
గురువు: సన్న్యాసమే నిన్ను పుచ్చుకుంటుంది.

17.లోకం: చిరంజీవి అంటే చావు లేనివాడు.
గురువు: చిరంజీవి అంటే పుట్టుక లేనివాడు.

18.లోకం: జగత్తు సత్యము కాదు.
గురువు: సత్యమే జగత్తు.

19.లోకం: వ్యక్తి యొక్క ఆయుఃప్రమాణం వందేళ్లు.
గురువు: అది జగత్తు యొక్క ఆయుఃప్రమాణం...

20.లోకం: దుఃఖం తొలగడం సుఖం.
గురువు: సుఖదుఃఖాలు రెండూ తొలగడం సుఖం.

21.లోకం: అజ్ఞానం తొలగడం జ్ఞానం.
గురువు: జ్ఞానాజ్ఞానములు రెండూ తొలగడం జ్ఞానం.

23.లోకం: నాకు మోక్షం కావాలి...
గురువు: నేను పోతే మోక్షం

24.లోకం: జన్మపరంపర అంటే జన్మ తరువాత జన్మ.
గురువు: జన్మపరంపర అంటే ఏకకాలంలో అన్ని జన్మలు.

25.లోకం: జగత్తు అనేది సమిష్ట్యానుభవం.
గురువు: జగత్తు అనేది వ్యష్ట్యానుభవం.

26.లోకం: ఆ "నేను"ను నేనని తెలుసుకోవాలి.
గురువు: ఈ 'నేను' ను నేను కాదని తెలుసుకోవాలి.

27.లోకం: ప్రపంచం పెద్ద అబద్ధం...
గురువు: తానే తొలి అబద్దం.

28.లోకం: భగవద్గీతకు కర్త కృష్ణుడు.
గురువు: భగవద్గీతకు (తొలి)శ్రోత కృష్ణుడు.

29.లోకం: మనిషి ప్రాణం వదిలేస్తాడు....
గురువు: ప్రాణమే మనిషిని వదిలేస్తుంది.

30.లోకం: ఇక్కణ్ణుంచి అక్కడకు వెళ్లాలి....
గురువు: అక్కణ్ణుంచే ఇక్కడకు వచ్చాము.

31.లోకం: భక్తుడు అంటే భగవంతుణ్ణి తెలిసినవాడు.
గురువు: భక్తుడు అంటే భగవంతుడికి తెలిసినవాడు.

33.లోకం:జ్ఞానాన్ని సంపాదించాలి...
గురువు: జ్ఞానాన్ని పోగొట్టుకోవాలి.

34.లోకం: సృష్టి చేసినవాడు సృష్టికర్త.
గురువు: సృష్టి చూసినవాడు సృష్టికర్త.

35.లోకం: విశ్వాసం వలననే అనుభవం కలుగుతుంది.
గురువు: అనుభవం వలననే విశ్వాసం కలుగుతుంది.

36.లోకం: జ్ఞానికి విశేషణం జ్ఞానం.
గురువు: జ్ఞానమునకు విశేషణం జ్ఞాని.

37.లోకం: భగవంతుడు భక్తునికి ముక్తినిస్తాడు.
గురువు: భక్తుడే భగవంతునికి ముక్తినిస్తాడు.

38.లోకం: అన్నింటిలో చైతన్యం ఉంది...
గురువు: చైతన్యంలో అన్నీ ఉన్నాయి...

39.లోకం:మనకు దేవుడు సబ్జక్టు.
గురువు: దేవుడికి మనం సబ్జక్టు.

40.లోకం: భగవంతుణ్ణి సదా ధ్యానించు.
గురువు: భగవంతుడే నిన్ను సదా ధ్యానిస్తున్నాడు.

41.లోకం: చెడు వినకు - చెడు కనకు - చెడు అనకు.
గురువు: వినడమే, కనడమే, అనడమే చెడు.

42.లోకం: ఎవరికీ కనబడని దానిని తాను కనడం దివ్యదృష్టి.
గురువు: అందరికీ కనబడేదానిని తాను కనకపోవడం దివ్యదృష్టి.

43.లోకం: విజ్ఞానం అభివృద్ధికారకం.
గురువు: విజ్ఞానం వినాశకారకం.

44.లోకం: జ్ఞానిని జ్ఞానే గుర్తించగలడు...
గురువు: జ్ఞాని గుర్తించడానికి తనకు అన్యమేమీ ఉండదు.

46.లోకం: గురుచరిత్ర చదవాలి...
గురువు: గురువుకు చరిత్ర ఉండదు.

47.లోకం: భక్తి అనేది భగవంతుణ్ణి పొందే సాధనం.
గురువు: భక్తి అనేది భగవంతుణ్ణి పొందేక కలిగే ఫలం.

48.లోకం: శాస్త్రమే ప్రమాణం...
గురువు: అనుభవమే ప్రమాణం.

49.లోకం: గురువును పరీక్షించడం మహా పాపం.
గురువు: గురువును పరీక్షించడమే శిష్యుని మంచి లక్షణం.

50.లోకం: అందరూ జ్ఞానాన్ని పొందాలి...
గురువు: జ్ఞానమే అందర్నీ పొందుతుంది.

51.లోకం: ప్రాణుల్లో ప్రాణం ఉంటుంది.
గురువు: ప్రాణంలో ప్రాణులుంటాయి.

52.లోకం: ఆత్మసాక్షాత్కారం పొందడం కష్టం.
గురువు: కనురెప్పలు మూసి తెరవడం కన్నా సులభం.

53. లోకం: రమణులు సదా ఆత్మనిష్ఠలో ఉండేవారు....
గురువు: ఉండలేదు...ఉంచబడ్డారు.

54.లోకం: దేవుడు ఒక్కడే.
గురువు: "ఒక్కటి" అనేదే దేవుడు.

55.లోకం: దేవుడు భక్తసులభుడు.
గురువు: దేవుడు చిక్కడు-దొరకడు.

56.లోకం: పురుషయత్నం యొక్క ఫలితమే - దైవం.
గురువు: దైవయత్నం యొక్క ఫలితమే - పురుషయత్నం.

56. లోకం: అందరం ఒకే ప్రపంచంలో ఉన్నాం.
గురువు: ఎవడి ప్రపంచంలో వాడున్నాడు.

57.లోకం: మరణమంటే తాను మాత్రమే లేకపోవడం.
గురువు: మరణమంటే తనతో సహా మొత్తం ప్రపంచమే లేకపోవడం.

59.లోకం: త్రికరణశుద్ధి వలన ముక్తి కలుగుతుంది.
గురువు: ముక్తి కలిగాక త్రికరణశుద్ధి కలుగుతుంది.

60.లోకం: ధర్మాన్ని రక్షించాలి.
గురువు: ధర్మమే సకలాన్ని రక్షిస్తూ ఉంది.

61.లోకం:తాను దేవుడు కావడానికి సాధన చేయాలి.
గురువు: దేవుడే తనలా ఉన్నాడని ఊరక ఉండాలి.

62.లోకం: అనుష్ఠానం వలన అనుభవం వస్తుంది.
గురువు: అనుభవం వలననే అనుష్ఠానం వస్తుంది.

63.లోకం: ప్రకృతిని మనం వాడుకుంటున్నాం....
గురువు: ప్రకృతే మనల్ని వాడుకుంటోంది.

64.లోకం: కర్తవ్యనిష్ఠను కలిగి ఉండాలి....
గురువు: మనకు ఏ కర్తవ్యమూ లేదు.

65.లోకం: కామినీ-కాంచనములను జయించాలి.
గురువు: నేను-నాది అనే భావం వదలాలి.

66.లోకం: ఇలా ఉండొద్దు...అలా ఉండు...
గురువు: నీవు ఎలా ఉండాలో అలానే ఉన్నావు.

67.లోకం: పతితపావనుడు అంటే పతితులను పావనం చేసేవాడు...
గురువు: పతితుడూ అతడే, పావనుడూ అతడే.

68:లోకం: తల్లిదండ్రుల నుంచి తానొచ్చాడు...
గురువు: తనలో నుంచే తల్లిదండ్రులు వచ్చారు.

69.లోకం: బ్రహ్మమును ఎఱిగినవాడు బ్రహ్మజ్ఞాని.
గురువు: బ్రహ్మము చేత  ఎఱుగబడినవాడు బ్రహ్మజ్ఞాని.

70.లోకం: ప్రార్థనను బట్టి ఫలితం ఉంటుంది.
గురువు: ఫలితాన్ని బట్టి ప్రార్థనను లెక్కవేయాలి.

71.లోకం: పునర్జన్మలున్నాయి...
గురువు: ప్రస్తుత జన్మ కూడా లేదు.

72.లోకం: మతి యెంతో గతి అంత.
గురువు: గతి యెంతో మతి అంత.

73.లోకం: అందరూ సత్యాన్ని తెలుసుకోవాలి....
గురువు: "అందరూ" అంటూ ఎవరూ లేరు. ఉండేది నీవొక్కడివే.

74.లోకం: నిరాకారుడు అంటే ఆకారము లేనివాడు.
గురువు: నిరాకారుడు అంటే ఇంతని చెప్పలేని ఆకారము గలవాడు.

75.లోకం: సాక్షాత్కారానికి ప్రయత్నం అవసరం.
గురువు: సాక్షాత్కారానికి ప్రయత్నమే ఆటంకం.

76.లోకం: గాంధీ సత్యంతో ప్రయోగం చేశాడు.
గురువు: సత్యమే గాంధీతో ప్రయోగం చేసింది.

77.లోకం: గాంధీ చేతిలో అహింస ఓ ఆయుధం.
గురువు: అహింస చేతిలో గాంధీ ఓ ఆయుధం.

78.లోకం: భగవంతుణ్ణి పొందడం జీవితలక్ష్యం.
గురువు: జీవించడమే జీవితలక్ష్యం.

79.లోకం:  ప్రతి మాటలోనూ వేదాంతం ఉన్నది.
గురువు: వేదాంతమే మాటలుగా ఉన్నది.

80.లోకం: కృష్ణుడు విశ్వరూపం చూపాడు.
గురువు: కృష్ణుడు విశ్వరూపం చూపలేదు.

81.లోకం: సత్యమెరిగినవాడు సద్గురువు.
గురువు: సత్యమే సద్గురువు.

82.లోకం: నిన్ను నీవు తెలుసుకో.
గురువు: నిన్ను నీవు మరచిపో.

83.లోకం: నీవు నీవుగా ఉండు.
గురువు: నీవు నీవుగానే ఉన్నావు.

84.లోకం: "బాబు" అనే గొప్ప శిల్పాన్ని చెక్కిన గొప్ప శిల్పి సద్గురు.

గురువు: "సద్గురు" అనే గొప్ప శిల్పాన్ని చెక్కిన గొప్ప శిల్పి బాబు.

* * *

35. చివరి మాట

---

"పట్టపగటి వెలుగు పరమాత్ముడు
ఎట్ట ఎదుటనే ఉన్నాడు పరమాత్ముడు..."
అన్నాడు అన్నమయ్య.

మనం చూసేదంతా దేవుణ్ణే.
కానీ దేవుణ్ణి చూడాలని వ్యర్థప్రయత్నాలు చేస్తుంటాము.

"ఇందుగలడందు లేడని సందేహము వలదు..."

"హరిమయము గాని ద్రవ్యము పరమాణువు లేదు..."

అన్న అద్వైతవాక్యములను వల్లె వేస్తూనే ఉంటాము.

మరో ప్రక్క దేవుణ్ణి వెతుకుతూనే ఉంటాము.

నాకు దైవదర్శనం కాలేదని వాపోతూనే ఉంటాము.

* * *

సర్వత్రా ఉన్న దైవాన్ని మనకు దర్శింపజేయడానికి 'గురు' రూపంలో ఈ లోకంలోకి అప్పుడప్పుడు visit చేస్తుంటుంది మాయాశక్తి.

ఏ దివ్యసందేశాన్ని మనకు అందించడానికి గురువులు అవతరించారో ఆ సందేశాన్ని మనం తీసుకోగలిగితే చాలు...వారి అవతారప్రయోజనం పూర్తయినట్టే.

కాని మనం అది వదిలేసి, వారు ఏ ప్రాంత్రంలో పుట్టారు? ఏ తేదీన పుట్టారు? వారి తల్లిదండ్రులెవరు? వారు ఏ మతస్తులు? అన్న అనవసరమైన  శోధనలతో కాలాన్ని వ్యర్థం చేస్తుంటాము...

పోస్ట్ మేన్ ఎక్కడ ఎప్పుడు ఎవరికి  పుట్టాడో; అతని మతమేమో మనకు అనవసరం. పోస్ట్ మేన్ మనకు చేరవేసే 'లెటర్స్' ప్రధానం.

అలాగే షిరిడీబాబా, రమణమహర్షి, వివేకానంద, సద్గురు సుబ్రహ్మణ్యం లాంటి మహనీయులు దైవసందేశాన్ని మనకు అందజేయడానికి వచ్చిన దైవదూతలు.

వారి సందేశాన్ని తీసుకొని, వాళ్లని వదిలేయడమే వాళ్లని నిజంగా గౌరవించినట్లు.

కానీ మనం చేస్తున్నదేమిటి?
వాళ్లకి పటాలు కట్టి, మతాలు కట్టి సందేశాన్ని  పారవేసుకుంటున్నాము...

తత్త్వం తగ్గింది...
తతంగం పెరిగింది...

సంప్రదాయాలు ఇప్పుడు షోబిజినెస్ లు....
భక్తి ఇప్పుడు ఫ్యాషన్...
ఛారిటబుల్ ట్రస్ట్ లు ఇప్పుడు స్టేటస్ సింబల్స్...
* * *

మనం  ఉద్ధరింపబడడానికి ఉద్గ్రంథాలు అవసరం లేదు.
తతంగాలు అవసరం లేదు.

"భగవంతుడే యజమాని" అన్న షిర్డీబాబా సందేశం ఒక్కటి చాలు.

"నీవు నీవుగా ఉండు" అన్న రమణమహర్షి సందేశం ఒక్కటి చాలు.

"దేనికీ భయపడవద్దు" అన్న వివేకానందుల సందేశం ఒక్కటి చాలు.
* * *

డీప్ గా ఆలోచిస్తే దేవుని పేరుతో మనం చేసేదంతా దేవుని కోసం కాదేమో అనిపిస్తోంది...

దేవుని "ద్వారా" మరేదో పొందాలనేదే...

ఆ "మరేదో" అనేది వదిలేస్తే...
దేవుడు స్వచ్ఛంగా, పూర్ణంగా, ఉన్నపళంగా మనకు దొరికిపోతాడు.

'దేవుని కోసమే దేవుణ్ణి కొలువు' అంటారు గురువుగారు...

అలా దేవుని కోసమే దేవుణ్ణి కొలవడం...
అదే నిజమైన కర్మ, భక్తి, జ్ఞానం...

ఎవరు చెప్పారు అన్నది ముఖ్యం కాదు...
ఏం చెప్పారు అన్నదే ముఖ్యం.

అందరూ చెప్పింది ఒక్కటే -
"ఏకం సత్" అనేదే.

ఆ ఏకాత్మస్వరూపంలోనే సదా సంస్థితమై ఉండడం కన్నా జీవిత పరమార్థం మరొకటి లేనేలేదు.

* * *

36. అనిలాచలశివమాల

---

ఇప్పటి కాలానికి జటిలంగా అనిపించే వేదాంతాన్ని
చాలా సరళంగా...మనం నిత్యం వాడుకునే చిన్న చిన్న పదాలతోనే...
సద్గురుదేవులవారు 'అనిలాచలశివమాల'ను రచించారు.

అది 2000 సంవత్సరం...
ఓ రోజు సత్సంగంలో(గురువుగారి ఇంటి వరండాలో చాపలు పరచి)
గురువుగారి చుట్టూ అందరమూ కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటూ ఉన్నాం....

గురువుగారు హఠాత్తుగా లేచి వారి పడకగదిలోకి వెళ్లి అక్కడున్న కుర్చీలో ఒంటరిగా కూర్చొని...సిగరెట్ కాలుస్తూ ...స్పిరల్ బుక్ లో ఏదో వ్రాయడం మొదలు పెట్టారు....

మాకు అది చిత్రంగా అనిపించింది...
యెందుకంటే గతంలో ఎన్నడూ అలా చేయలేదు గురువుగారు.

ఆ స్పిరల్ నోట్ బుక్ లో ఒక్కో పేజీ అవగానే, ఆ పేజీని చించి, కాశీరెడ్డి ద్వారా బయట వరండాలో ఉన్న మా వద్దకు పంపడం ప్రారంభించారు....

నేను ఆ ఒక్కో పేజీని అప్పుడే గట్టిగా చదివి మిగతా సత్సంగ సభ్యులకు వినిపిస్తూ వచ్చాను...

చివరికి ఆ పేజీలన్నీ కలిపితే 108 ద్విపదలు అయినాయి....
అదే అనిలాచలశివమాల అయ్యింది.

మనం దానిని పారాయణం చేసినంత వ్యవధిలోనే అంత గొప్ప తత్త్వాన్ని రచించడం అనేది ఏ మానవమాత్రుడికీ సాధ్యం కాని పని.

అది సర్వ వేదాంతసారము....
ఆ ఒక్క గ్రంథమే కోటి గ్రంథాల పెట్టు.

త్రాసులోని ఒక తక్కెడలో అనిలాచలశివమాలను ఉంచి, మరో తక్కెడలో ప్రపంచంలో ఉండే వేదాంతగ్రంథాలన్నింటినీ వేసినా సరే ఈ చిన్న పుస్తకానికి సరి తూగవు.

మానవజాతే కాదు....దేవతలు సైతం ప్రతి నిత్యం పారాయణం చేయదగిన అద్భుతమైన ఆధ్యాత్మిక గ్రంథం ఇది.

ఈ మాట ప్రస్తుతానికి అతిశయోక్తిగా అనిపించవచ్చు.
పారాయణం చేయగా చేయగా అది
పరమసత్యమనేది త్వరలో మీకే తెలుస్తుంది...

ఈ శివమాల అనుభవంలోకి రాగానే తానే శివుడైపోవడం ఖాయం.

గురువుగారు సైతం నిత్యపారాయణం చేస్తుంటారు.

నేను వ్రాయలేదు....నా "ద్వారా" వ్రాయబడింది...అంటారు గురువుగారు.

అందుకే మేము ప్రచురించే ఏ పుస్తకంలోనూ రచయిత పేరును వ్రాయం.

రచయిత పరబ్రహ్మమే అనేది కాస్త చదువగానే పాఠకుడికి అర్థమైపోతుంది.

* * *

అనిలాచలశివమాలను ప్రచురించే ముందు....
గణేశ స్తుతి, శరవణ భవ అనే రెండు స్తోత్రాలను కూడా రచించి దానికి చేర్చారు....

వెయ్యి కాపీలు 2000 రూపాయిలు ఖర్చు అయ్యింది 2000 సంవత్సరంలో...

గురువుగారే ముద్రణాఖర్చులను భరించారు.

అదే మా రమణ సత్సంగానికి గురువుగారు మాకు అనుగ్రహించిన తొలి పుస్తకప్రసాదం.

ఆ తరువాత 27 పుస్తకాలు నా చేతుల మీదుగానే తయారుకావడం జరిగింది...
సద్గురు కృపతో.... గురుభక్తుల ఆర్థిక సహాయంతో...

ఈ దివ్యగ్రంథానికి  కర్త - ఆదిగురువు దక్షిణామూర్తి.
భోక్తలు - ఈ గురు,శిష్యులు.
* * *

అనిలాచలశివమాల పుస్తకావిష్కరణ సందర్భంగా గురువుగారు అన్న మాటలు -

ఇది నా ఆత్మకథ...
మరో విధంగా కూడా "ఆత్మ" కథే.

నేను(గురువుగా)
మీకు(శిష్యులకు) ఇవ్వదగింది ఇదొక్కటే.

నేనివ్వడానికి ఇక నా వద్ద ఏమీ లేదు....అన్నారు.
* * *

సాంబసదాశివ....సాంబ సదాశివ....అనే ప్రాచీన గేయాన్ని అనుసరిస్తూ వ్రాసిందే అనిలాచలశివమాల.
అందువలన దానికి ట్యూన్ కట్టవలసిన అవసరం లేకుండాపోయింది.

గణేశ్ స్తుతిని కూడా....సదాశివ బ్రహ్మేంద్రస్వామి వారి కీర్తన అయిన మానస సంచరరే....ట్యూన్ ని అనుసరించే వ్రాశారు.

ఇక శరవణభవ స్తోత్రాన్ని మాత్రం కైలాసం అనే గురుభక్తుడు (క్షురకుడు) ట్యూన్ కట్టాడు....

సత్సంగంలో తొలిసారిగా నేను, కైలాసం ఇద్దరమూ కలిసి పారాయణం ప్రారంభించాము.

ఆ రోజు నుంచి ఈ రోజు వరకు సద్గురు సత్సంగంలో జీవనది వలె నిరంతరం అనిలాచలశివమాల పారాయణం కొనసాగుతూనే ఉన్నది.

* * *

కొందరు భక్తులు కోరడం వలన ఆ అనిలాచలశివమాలకు "సద్గురు హృదయం" పేరుతో సులభవ్యాఖ్యానం వ్రాశాను.

* * *

మన తెలుగు ప్రాంతంలోనే కాదు....దేశం...ప్రపంచం నలుమూలలా ఈ అనిలాచలశివమాల యొక్క తత్త్వ వైభవం ప్రాకాలి.

ప్రతి ఇంట్లో వారి వారి భాషలలో అనిలాచలశివమాల గ్రంథం ఉండాలి.

అది అందరికీ  నిత్యపారాయణగ్రంథం కావాలి.
పిల్లల చేత కంఠస్తం చేయించాలి.
అప్పుడే ప్రపంచశాంతి వర్థిల్లేది.

ఇది మన శక్తి దృష్ట్యా అత్యాశే అయినప్పటికీ .....
పరమేశ్వరునికి సాధ్యం కానిదేముంది?

మానవమాత్రులం...మనం చేయదగింది ఏముంది?
సర్వేజనా సుఖినో భవంతు....అని ప్రార్థించడం తప్ప.

* * *

-జ్ఞానశిశువు
9533667918

---

శ్రీ గణేశ్ స్తుతి

---

భజరే గణనాథం సదాశివమ్
భజరే గురునాథం పరాత్పరమ్

సకల శుభకరం సంకట హరణమ్
గురు గుహ వదన సరోరుహ భాస్కరమ్

పరే ప్రధానం పరమానుగ్రహమ్
సంచిత సుకృత శాశ్వత ఫలదమ్

భక్తాధీనం పాశాంకుశ ధరమ్
భరిత చరాచరం ప్రణవాకారమ్

సిద్ధి బుద్ధి సంసేవిత చరణమ్
శివానందలహరీ విచేష్టితమ్

చింతిత ఫలదం చిన్మయరూపమ్
నియమిత సుబ్రహ్మణ్యేశ్వర కథనమ్

---

శరవణభవ గురు సన్నుతి

---

ఓంసద్గురు శ్రీసద్గురు  శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

1. అరుణారుణ కిరణాద్భుత
    సురుచిర సుందరవదనా

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

2. సురసేవిత మునిపూజిత
    శరణాగత సుజనాశ్రిత

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

3. ధరణీధరతనయ ప్రియ
    తనయా హిమ సమహృదయా

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

4. హర హర భక్తవశంకర
    హర గురవే దయానిధే

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

5. కరుణారస పరిపూరిత
    కమలనేత్ర పునచరిత

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

6. దండాయుధపాణి జ్ఞాన
    దండ ధరా పరాత్పరా

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

7. అసురతార కాంతక జయ
    అమరాధిప సురపాదప

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

8. శ్రీవల్లీ దేవసేన
    చిత్స్వరూప రమారమణ

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

9. స్వానుభవానంద రసా స్వాదన
పరవశిత భృంగ

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

10. పాప హరణ తాప హరణ
శిఖివాహన సంచరణ

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

11. సకలలోక సుఖదాయక
సదా సహిత వినాయక

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

12. వరదాభయ ముద్రకరా
భరిత సకల చరాచరా

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

13. అభయం కురు అభయం కురు
అభయం కురుమే దేవా

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

14. సకలయోగ క్షేమ ప్రదా
సర్వకార్య జయప్రదా

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

15. సత్సంగాధిష్ఠిత శివ
సాధుహృదయ పరితోషిత

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

* * *

16. సుబ్రహ్మణ్యార్చిత పద
శోభిత శ్రీ పరమాత్మా

ఓంసద్గురు శ్రీసద్గురు శివసద్గురు జయసద్గురు
శరణంభవ శరణంభవ శరణంభవ శరవణభవ

---

## అనిలాచల శివమాల

---

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

1.ఆదరమున సాలీడును బ్రోచిన
ఆదిజంగమవె అనిలాచలా

2. పంతముతో పూజించిన నాగుని
చెంతజేర్చితివే అనిలాచలా

* * *

3. శిరమున మోదిన కరినాథుని
పద సేవను నిలిపితె అనిలాచలా

4. కనులనొసగు కన్నప్ప నెనరునకు
కరగిపోతివే అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

5. చపలుడనని నను దూరము చేయకు
అపవాదగురా అనిలాచలా

6. పశుకామంబున తిరిగెడు వాడను
పశుపతి కావర అనిలాచలా

* * *

7. మరియాదెరుగని మత్తుడు వీడని
మారు మోమిడకు అనిలాచలా

8. పరుల మేలునకు పొక్కెడు బుద్ధిని
సరిచేయుట విధి అనిలాచలా

* * *

9. పాపపుణ్యముల నెంచక వంచన
తాప మొందితిని అనిలాచలా

10.దుఃఖమ్ముల పదిమందికి పంచిన
దుష్టుడ గావుము అనిలాచలా

* * *

11.పాపిష్ఠుడనని పరుషములాడకు
పన్నగ భూషణ అనిలాచలా

12.పాహి పాహియని పదముల బడితిని
స్నేహము జూపవె అనిలాచలా

* * *

13.ఎన్ని జన్మములు ఎచ్చట ఏ గతి
ఎత్తి తిరిగితినో అనిలాచలా

14.అన్నిట కంటికి రెప్పగ గాచితి
వన్న అబద్ధమె? అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

15.నవమాసమ్ములు మోసి నన్ను
కనినావు తల్లివై అనిలాచలా

16.సిద్ధరూపమున కన్న తండ్రివయి
బుద్ధి చెప్పితివి అనిలాచలా

* * *

17.పుట్టిన దాదిగ వెంటబడిన తో
బుట్టువు లీవెర అనిలాచలా

18.భవసాగరమున నావయైన
హృత్పద్మవు నీవే అనిలాచలా

* * *

19.శంభు కృష్ణ యుగంధరాకృతుల
ఛద్మవేషుడవె అనిలాచలా

20.వీరగురు, స్వాముల వేషంబుల
వేడుక సలిపితె అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

21.దేవతలెల్లరు నీ పదసన్నిధి
దిక్కని ఉందురు అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

22.యక్షులెల్ల నీ పక్షము నిలబడి
రక్షణ వేడుదు రనిలాచలా

23.)రాక్షసగణములు రభసముతో నీ
శిక్షణ మెలగుదు రనిలాచలా

* * *

24.గరుడులందరు వరుసల నిలబడి
కరుణ గోరుదురు అనిలాచలా

25.గంధర్వులు సౌగంధ్యయుక్తులయి
గానము సేయుదు రనిలాచలా

* * *

26.కిన్నెరులెల్లరు కన్నుల మోడిచి
కింకరులౌదురు అనిలాచలా

27.కింపురుషులు తలవంచుక నిలబడి
కిమ్మన కుందురు అనిలాచలా

* * *

28.సిద్ధులు అంజలి బద్ధులగుచు నీ
ఋద్ధున నుందురు అనిలాచలా

29.సాధ్యులు సాన్నిధ్యంబున గూడుక
సన్నుతి సేతురు అనిలాచలా

* * *

30.ఛారణ సంఘము నిర్విచారముగ
ఛత్రము బట్టుదు రనిలాచలా

31.విద్యాధురులెల్ల వేడ్క తమ
విద్యల జూపుదు రనిలాచలా

* * *

32.అప్సరగణములు పరవశ మొందుచు
ఆడి పాడుదురు అనిలాచలా

33.నందీశ్వర భృంగీశ్వరాదులు
వందన మిడుదురు అనిలాచల

* * *

34.గజముఖ షణ్ముఖ జలజ భవాదులు
గాదిలి మ్రొక్కుదు రనిలాచలా

35.మాయామయి జ్ఞానాంబ దయామయి
మక్కువ జూపుర అనిలాచలా

* * *

36.శ్రీలక్ష్మీపతి సరసన నిలబడి
మేలమాడురా అనిలాచలా

37.అష్టదిక్పతులు భయభక్తులతో
అణగి మణగుదురు అనిలాచలా

* * *

38.భద్రకాళి, శ్రీ వీరభద్రులు
భద్రత చూతురు అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

39.విశ్వోత్పత్తిని చేయగ నీవే
విశ్వబ్రహ్మవు అనిలాచలా

40.విశ్వరక్షణము జేయగ నీవే
విష్ణుదేవుడవు అనిలాచలా

* * *

41.విశ్వ లయంబును చేయగ నీవే
వీర రుద్రుడవు అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

42.ఉన్న సమస్తము పుట్టక పూర్వము
ఉన్నది నీవే అనిలాచలా

43.తానేక మనేక మౌదునని
తత్పరమైతివి అనిలాచలా

* * *

44.నేలయు నీరును నిప్పును నింగియు
నీవే అయితివి అనిలాచలా

45.అండ పిండ బ్రహ్మాండ భాండములు
నిండి యుంటివే అనిలాచలా

* * *

46.అహమహమని అన్నిటి లోగుహలలో
అలరుచునుంటివె అనిలాచలా

47.అహంకార మమకారము లెరుగని
ఆదిదేవుడవు అనిలాచల

* * *

48.అన్నిటికిని అవకాశంబయ్యేడు
ఆదిగురుండవు అనిలాచలా

49.ఎన్నగ వన్నెలు లేని వెలుగువయి
మిన్నగ యుంటివి అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

50.ఉన్నది ఒకటే అది ఆతండని
ఉండుట కర్మము అనిలాచలా

51.ఉన్నది ఒకటే అది నీవే యని
ఉండుట భక్తిర అనిలాచలా

* * *

52.ఉన్నది ఒకటే అది నేనే యని
ఉండుట జ్ఞానము అనిలాచలా

53.ఉలుకక పలుకక ఊరక యుండిన
ఉత్తమ యోగిర అనిలాచలా

* * *

54.కనినవెల్ల మరి కలవరింతలయి
కాసిపెట్టురా అనిలాచలా

55.పలుకులెల్ల మరి పలవరింతలయి
బాధ పెట్టురా అనిలాచలా

* * *

56.అప్పుడు ఇప్పుడు ఎప్పుడు తలచిన
ఇప్పుడె అగుదువు అనిలాచలా

57.అక్కడ ఇక్కడ ఎక్కడ జూచిన
ఇక్కడనే కద అనిలాచలా

* * *

58.నీవు నేననెడు బేధబుద్ధి మరి
నిజము కాదురా అనిలాచలా

59.నేనన నీవన నిఖిల జగంబన
నీవే ఔదువు అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

60.లింగ వచన విభక్తుల కందని
లింగము నీవెర అనిలాచలా

61.సంగా సంగము లెరుగని స్వామి  ని
స్సంగుడవీవే అనిలాచలా

* * *

62.ఆత్మానాత్మ విచక్షణ సలిపెడు
ఆత్మవు నీవే అనిలాచలా

63.నిత్యానిత్య వివేకము లెరిగెడు
నిత్యుడవీవే అనిలాచలా

* * *

64.సత్యాసత్య విచార మొనర్చెడు
సత్తవు నీవే అనిలాచలా

65.సదసత్తుల తత్త్వమును దెలిపెడు
చిత్స్వరూపమవు అనిలాచలా

* * *

66.యోగ వియోగము లెన్నడెరుంగని
యోగివి నీవే అనిలాచలా

67.జ్ఞానా జ్ఞాన వివాదమంటని
జ్ఞానివి నీవే అనిలాచలా

* * *

68.ఉన్నదెల్ల మరి ఉన్నట్లయితే
ఉన్నది నీవే అనిలాచలా

69.తలపుకు తలపుకు మధ్య ఉన్న పర
తత్త్వము నీవే అనిలాచలా

* * *

70.శ్వాసకు శ్వాసకు మధ్య ఉన్న
విశ్రాంతివి నీవే అనిలాచలా

71.పాహి అనెడు ఆపన్నుల గాచెడు
పరంధాముడవు అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

72.నీవు వినక నేవిన్నట్లయితే
నే వినిపింతుర అనిలాచలా

73.నీవు ముట్టకనె నే ముట్టినచో
నిన్ను ముట్టుదును అనిలాచలా

* * *

74.నీవు కనక నేకన్నట్లయితే
నిన్ను కందురా అనిలాచలా

75.నీవు స్మరింపక నేస్మరించినచొ
నిన్ను స్మరింతుర అనిలాచలా

* * *

76.నీవు తినక నే తిన్నట్లయితే
నే తినిపింతుర అనిలాచలా

77.నీవు తలంపక నేతలచినచో
నిన్ను దలతురా అనిలాచలా

* * *

78.నీవుండక నేనున్నట్లయితే
నీకడ నుందుర అనిలాచలా

79.నీవు తెలియకనె నే తెలిసినచో
నిన్ను తెలిసెదర అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

80.ఇంతవాడవని అంతవాడవని
ఏమని తలతుర అనిలాచలా
81.ఎంతని తలచిన అంతటి వాడుగ
ఏర్పడుదువురా అనిలాచలా
* * *
82.ఇట్టివాడవని అట్టివాడవని
ఎట్టుల తలతుర అనిలాచలా
83.ఎట్టుల తలచిన అట్టే ఔదువు
ఏమి చోద్యమో అనిలాచలా
* * *
84.ఇచ్చట కలవని అచ్చట కలవని
ఎట్లు పలుకుదును అనిలాచలా
85.ఎచ్చట కలవని నిన్ను చూచిన
అచ్చట ఉందువె అనిలాచలా
* * *
86.తనలో లోకము గనెడు వారలకు
తత్త్వము తెలియుర అనిలాచలా
87.అన్నిటి దెలిసెడు వానిని తెలిసిన
ఆత్మజ్ఞుడురా అనిలాచలా
* * *
88.పుట్టుక లేదని ఎరిగిన వారికి
గిట్టుట లేదుర అనిలాచలా
89.వెలుగు చీకటులు చీకటి అయితే
వెలుగు తానౌర అనిలాచలా
* * *

90.కలలు మెలకువలు కలయని ఎరిగిన
 మెలకువ తానే అనిలాచలా

91.తన్నుతా తెలియుక్రమమే జీవన
 ధర్మచక్రము అనిలాచలా

* * *

92.పన్నుగ ఆపద్బాంధవ నీవే
 పరమాప్తుండవు అనిలాచలా

93.తీగను పుట్టిన పూవుగ నీవే
 తెలియగ వత్తువు అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

94.జపములు తపములు నీకడ జెల్లునె
 విపరీతంబుగ అనిలాచలా

95.దేవర్షులు బ్రహ్మర్షులు నీకడ
 తెలియనివారే అనిలాచలా

* * *

96.ఎంత పిండియో అంత రొట్టె అగు
 అంతే నీ కృప అనిలాచలా

97.చింతాకంతయు చింత కలదె నీ
 చెంత నుండగా అనిలాచలా

* * *

98.ఆదమరచి నిదురించు బిడ్డ వలె
సేద తీరితిని అనిలాచలా

99.తల్లియు తండ్రియు గురు దైవంబును
తథ్యము నీవే అనిలాచలా

* * *

100.సకల వేదములు నీ సన్నిధిలో
సాగిలి మ్రొక్కవె అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

101.ఈ మాలను తలదాల్చిన వారికి
ఏలిక నీవే అనిలాచలా

102.ఇది పలికినచో కర్తను కానను
ఎరుక కలుగురా అనిలాచలా

* * *

103.ఇది తలచినచో చావు పుట్టుకలు
ఎట్లు కలుగురా? అనిలాచలా

104.ఇదె సంపద అని తలచు వారలకు
ఇదె సంపదరా అనిలాచలా

* * *

105.ఇదె యోగంబన ఇదె క్షేమంబన
ఇదె అది అగురా అనిలాచలా

106.ఇది నేనే అని ఉన్నవారలకు
ఇది తానే అగు అనిలాచలా

* * *

107.నమ్మిక సొమ్మై నమ్మక దుమ్మై
నలుగడ నిండుర అనిలాచలా

108.పరమాత్మా నేపలికిన పలుకుల
ఫలమీవేగద అనిలాచలా

* * *

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

అనిలాచలశివ అనిలాచలశివ
అనిలాచలశివ అనిలాచలా

* * *

ఆవు లేగ జూచి అనురాగమున డాసి
పాలనిచ్చి పెంచు లీల మెరసి
భక్తజనుల జూచి భద్రము లొడగూర్చి
పరమసుఖము నొసగు పరమ పురుష.

* * *

37. సద్గురు హృదయం

---

గురువుగారు 2000 సంవత్సరంలో...
కేవలం ఓ గంట వ్యవధిలోనే 'అనిలాచలశివమాల' అనే అద్భుతమైన 108 ద్విపదలు కలిగిన గ్రంథాన్ని తాను స్వయంగా వ్రాసి శిష్యుల చేతిలో పెట్టారు...

ఆనాటి నుండి ఈనాటి వఱకు మా సత్సంగంలో శివమాలను
నిత్యపారాయణం చేస్తున్నాం...

నా మిత్రులొకరు అనిలాచలశివమాలను
వచనంలో వ్రాయమని కోరారు...

రమణ సాహిత్యంలో రమణహృదయం అనదగినది "ఉన్నది నలుబది".

అలాగే సద్గురు సాహిత్యంలో "సద్గురు హృదయం"
అనదగినది ఈ "అనిలాచలశివమాల".

ఉన్నది నలుబదిని "రమణీయం" పేరుతోను...
అనిలాచలశివమాలను "సద్గురుహృదయం" పేరుతోను...
వ్యవహారశైలిలో వ్రాశాను...

ఆ జ్ఞానపూర్ణమైన గ్రంథాలను వ్యాఖ్యానం చేసేంత పండితుణ్ణి కానుగానీ, ఆ గ్రంథాల పట్ల నాకున్న అభిమానాన్ని, నాకు కలిగిన అవగాహనను ఈ విధంగా వ్యక్తపరచుకున్నాను...అంతే.

మీకు అర్థమైతే అది మీ గొప్పతనం...
మీకు అర్థం కాకుంటే అది నా గొప్పతనం...

* * *

ప్రవచనకర్త గరికపాటి నరసింహరావుగారు కూడా ఈ గ్రంథవైశిష్ట్యాన్ని గుఱించి పలుమార్లు ప్రస్తావించి ఉన్నారు...

కాళహస్తి కొత్తపేటలో సుబ్రహ్మణ్యం అనే సద్గురువులున్నారని...
వారి దర్శనం తప్పకుండా చేసుకోమని...
"సద్గురు హృదయం" పుస్తకం నా మిత్రులొకరు ఇస్తే చదివానని...
అందులో అద్భుతమైన మాటలున్నాయని...
నిజంగా బ్రహ్మజ్ఞానం ఉన్న గృహస్థు ఎవరన్నా ఉన్నారంటే ఆయనే అనిపించిందని...
లోకంలో ఇప్పుడు మన కళ్లముందర ఉన్న సద్గురువులలో వారొకరని...
గృహస్తే... బ్రహ్మనిష్ఠలో ఉన్నవారని...

అటువంటి వారికి అతీతమైనవిషయాలు తెలుస్తాయని... ప్రస్తావించారు.

---

అనిలాచలశివమాల వచనామృతం

---

హే! పరమాత్మా...!

ఏ మాత్రమూ నీడనివ్వని గూడు కట్టాడు సాలీడు.
విషపూరితమైన మణులతో నిన్ను అలంకరించాడు నాగులు.
తన తొండంతో ఎంగిలి కాబడిన జలంతో నీకు అభిషేకం చేశాడు గజరాజు.
పందిమాంసాన్ని నీకు నైవేద్యంగా పెట్టాడు బోయ తిన్నడు.

అయినా వారి దోషాలను లెక్కించక...
వారి ఆర్తిని, భక్తిని గమనించి ముక్తినిచ్చావు.

ఓ భక్తవత్సలా!
నీ పేరు, ఊరు కూడా అదే అయ్యింది...
శ్రీకాళహస్తీశ్వరా...!

కొండ పైన భక్తుణ్ణి నిలుపుకున్నావు...
కొండ క్రింద నీవు కొలువై ఉన్నావు...
భక్తుల్ని నెత్తిన పెట్టుకోవడంలో నీకు నీవే సాటి...

పరమేశ్వరా!
నన్ను నేను మైమరచిపోయి
నిన్ను నేను మైమరపించగలిగే భక్తిని ప్రసాదించు...
శ్రీకాళహస్తీశ్వరా...శరణం శరణం...
* * *

నా చపలత్వాన్ని...
నా పశుకామాన్ని...
నా అసూయను...
నా వంచనను..
లెక్కచేయక...

ఒకర్ని బాధపెట్టడమే తప్ప సుఖపెట్టడం చేతగాని
పాపాత్ముడు అని నిర్లక్ష్యం చేయక...

పశుపతీ...!
నా పాపాన్ని, నా తాపాన్ని పోగొట్టు...

నీ పాదాలను పట్టుకున్నాను...
స్నేహభావంతో నన్నాదరించు...

నీ లీలను...
నీ క్రీడను...
ఇలా ఎన్ని యుగాలైనా కొనసాగించు...
నన్ను ఎన్ని జన్మలైనా త్రిప్పు...
కానీ నన్ను కంటికి రెప్పలా కాపాడు...

శ్రీకాళహస్తీశ్వరా...! శరణం...శరణం...

* * *

ఓ భగవంతుడా!
నీకు నాపై ఉన్న మిక్కుటమైన ప్రేమ చేత
నాతో నీవు అత్యంత దగ్గరగా గడపాలని
నా తల్లిదండ్రులుగా...
నా అన్నదమ్ములుగా...
నా భార్యాబిడ్డలుగా...
నా గురువుగా...
ఇలా ఎన్నో మారువేషాల్లో నన్ను నీవు
అనుగమిస్తున్నావు...

సదా ఈ జ్ఞప్తిని నా మనస్సులో ఉండేటట్లు అనుగ్రహించు దయామయా...!

శ్రీకాళహస్తీశ్వరా...! శరణం...శరణం...

* * *

దేవతలు, రాక్షసులు...యక్షులు...
గరుడులు గంధర్వులు...

కిన్నెర కింపురుషులు...
సిద్ధులు సాధ్యులు...
చారణ విద్యాధరులు...
అప్సరసలు...
నందీశ్వర భృంగీశ్వరాదులు...
గజముఖ షణ్ముఖులు...
జ్ఞానప్రసూనాంబ...
లక్ష్మీనారాయణులు...
అష్టదిక్పతులు...
భద్రకాళి, వీరభద్రుడు...
అందరూ నీ పాదసేవకులే...
వారి ముందు నేనెంత?

శ్రీకాళహస్తీశ్వరా...! శరణం...శరణం...

* * *

ఒకడే -
తండ్రి వద్ద కొడుకుగా
భార్య వద్ద భర్తగా
కొడుకు వద్ద తండ్రిగా ఉన్నట్లు...

నీవొక్కడివే -
సృష్టి చేసేటప్పుడు బ్రహ్మగా
పాలించేటప్పుడు విష్ణువుగా
లయం చేసేటప్పుడు శివుడుగా
ఉంటావు.

* * *

కలకు మునుపు కలను కనేవాడు మాత్రమే ఉన్నట్టు
కుమ్మరి పాత్రలు చేయక మునుపు కుమ్మరి మాత్రమే ఉన్నట్టు
ఉన్న సమస్తము పుట్టక మునుపు నీవొక్కడివి మాత్రమే ఉన్నావు.

* * *

పాత్రలన్నీ మట్టివే ఐనప్పటికీ
ఒక్కొక్క పాత్రను ఒక్కొక్క రకంగా జనులు ఉపయోగించుకున్నట్లు
ప్రతిజీవీ ఆత్మస్వరూపమే ఐనప్పటికీ
ఒక్కొక్క జీవిని ఒక్కొక్క రకంగా నీవు వినియోగించుకుంటావు.

పరమేశ్వరా!
నా పాత్రను నీవు సృష్టించిందే...
నా పాత్ర నీకు పాత్రత కాకుండా ఉంటుందా?

శ్రీకాళహస్తీశ్వరా...! శరణం...శరణం...

* * *

ఏకంగా ఉన్నవాడివి ఏకంగా ఉండక
అనేకం అవ్వాలని ఎందుకు సంకల్పించావు?

అడిగితే 'నా లీల' అంటావు...
నీకు లీల...
మాకు గోల...

మాకెందుకీ బంధాలు...బాంధవ్యాలు...
విడిపోవడాలు...చనిపోవడాలు...

ఎవడో కవీశ్వరుడన్నట్లు-
"చచ్చీ చెడి బ్రతికేది చివరికి చావడానికా?"

ప్రపంచంతో మాకున్న సంబంధాన్ని
క్షణంలో పుటుక్కున తెంపేస్తావు...

జీవితసారమేమో మాకు తెలియబరచు.
మృత్యురహస్యాన్ని మాకు ఎఱుక బరుచు.

కాలకాలుడా...! శరణం...శరణం...

* * *

రామకథ కదలాలంటే
సీతమ్మ మాయలేడిని కోరవలసిందే...

జగన్నాటకం జరగాలంటే
పార్వతమ్మ నిన్ను పురిగొల్పవలసిందే...

ఇదంతా అమ్మ చేసిన పనే.
తండ్రీ...! నీవు అమాయకుడివి(మాయ అంటనివాడివి).

ఆ మహామాయ వలన పంచభూతములుగా వ్యక్తమయినావు...
తర్వాత జీవులుగా, జీవితాలుగా విస్తరిల్లావు...

అండ పిండ బ్రహ్మాండ భాండములు నిండిపోయావు...

నేను-నేను అంటూ అందరి హృదయాలలో
అహంస్ఫురణగా వెలుగుతున్నావు...

నేను అన్న అహంకారం
నాది అన్న మమకారం
ఎప్పటికీ నీ దరి చేరలేవు.

అంతరిక్షానికి అవకాశమై ఉన్న "ఆదిగురువు" నీవు.
వన్నెలు లేని వెలుగువు నీవు.

జ్ఞానప్రకాశా...! జ్ఞానాంబ సమేతా...!
శ్రీకాళహస్తీశ్వరా...! శరణం...శరణం...
* * *

శివా!
జగత్తుకావల కైలాసంలో నీవున్నావని అనుకుంటే
అది కర్మయోగం.

జగద్రూపంగా ఉన్నది నీవే అని అని ఉంటే
అది భక్తియోగం.

'నీవే నేను' అని ఉంటే అది జ్ఞానయోగం.
అసలేమీ అనకుండా ఉంటే అదే ఉత్తమయోగి లక్షణం.

యెందుకంటే -
కనేదంతా కలవరింత.

అనేదంతా పలవరింత.

ఎప్పుడైనా ఇప్పుడే.
ఎక్కడైనా ఇక్కడే.

నీవు, నేను అనే భేదబుద్ధి పోతే
నీవు,నేను అన్నీ నీవే అవుతావు.

అద్వైతరూపా...! శరణం...శరణం...

* * *

పరమాత్మా!
నీవు స్త్రీవో, పురుషుడవో, నపుంసకుడవో
తేల్చి చెప్పలేని లింగం నీవు.

నీవు ఏకమా? అనేకమా? అనేది
సాంఖ్యులు కూడా తేల్చి"చెప్పలేని సంఖ్య" నీవు.

ఏ విభక్తికీ అందక
భక్తికి మాత్రమే లొంగే భక్తవత్సలుడివి నీవు.

సంగాసంగములకు అవకాశం లేని
అనంతవస్తువు నీవు.

ఇది ఆత్మ, అది అనాత్మ
అని విచక్షణ సలిపే ఆత్మవు నీవు.

ఇది నిత్యము, అది అనిత్యము
అని విచారణ చేసే నిత్యము నీవు.

ఇది సత్యము, అది అసత్యము
అని వివేచించే సత్యము నీవు.

యోగ, వియోగములకు అవకాశము లేని
ఏకాత్మరూపుడివి నీవు.

ఏది జ్ఞానము? ఏది అజ్ఞానము? అనే
వివాదం అంటని జ్ఞానివి నీవు.

ఉన్నదంతా ఉన్నట్లున్నదే
అని "ఉన్న" కేవలుడవు నీవు.

హారంలో పూసకు-పూసకు మధ్య ఉన్న దారం వలె
తలపుకు తలపుకు మధ్య ఉన్న పరతత్త్వము నీవు.

శ్వాసకు శ్వాసకు మధ్య ఉన్న "పరమవిశ్రాంతి"వి నీవు.

శరణం అంటే చాలు
సకలాపదల నుండి రక్షించే పరంధాముడవు నీవు.

శ్రీకాళహస్తీశ్వరా...! శరణం...శరణం...

* * *

తెర వెనక ఉండి, ఆడించేవాడు ఆడిస్తే
తోలుబొమ్మ ఆడుతుంది.
వాడు పాడితే పాడుతుంది.

శివా!
నీవు ఆడించేవాడివి.
మేమంతా తోలుబొమ్మలం...

ముక్కంటీ...!
ముందు నీవు మమ్మల్ని తాకితేనే
మాకు నిన్ను తాకే శక్తి కలుగుతుంది.

ముందు నీవు మమ్మల్ని చూస్తేనే
మాకు నిన్ను చూసే శక్తి కలుగుతుంది.

ముందు నీవు మమ్మల్ని స్మరిస్తేనే
మాకు నిన్ను స్మరించే శక్తి కలుగుతుంది.

నీవుంటేనే మేముంటాము.
నీ తెలివే మా తెలివిగా ప్రకటనమౌతుంది.

నీవు ఎట్టా ఆడిస్తే అట్టా ఆడే బొమ్మలం.
మా మాటలు, చేతలు అన్నీ నీ స్వాధీనం.

మొత్తానికి మేం నిర్దోషులం.

శ్రీకాళహస్తీశ్వరా...! శరణం...శరణం...

* * *

శివా!
నీ దృష్టిలో ఆకాశమే "కొంత".
అందులో నేను "ఇంత".
నీవు "ఎంత"ని నేను కొలవను?
నిన్నేమని తలవను?

నదిలో ఏ పాత్రను ముంచినా
ఆ పాత్ర నీటితో నిండిపోయినట్టు
నీవు అన్నిటిలోను ఇట్టే ఒదిగిపోతావు నిండుగా.

శిల్పి ఏ రూపాన్ని తలిస్తే
శిలలో ఆ రూపాన్ని చెక్కగలిగినట్టు
నిన్ను ఎట్లా తలిస్తే అట్లా అయిపోతావు.
నిజంగా నీ చమత్కారం బహు విచిత్రం సుమా!

కల ఎలా ఉన్నా, కల మొత్తంలో కల కనేవాడే ఉంటాడు.
కల యావత్తు కల కనేవానిదే.

ఈ భౌతికజగత్తు యావత్తు నీవు కనే కలే.
అని ఎవడైతే గ్రహిస్తాడో వాడే నిజంగా తత్త్వవేత్త.

కల కంటూనే, కలలో ఉంటూనే
'ఇది కల' అని ఎఱుక కలిగిన పరమాత్ముడవు నీవు.

లేని వస్తువు పుట్టదు.
ఉన్న వస్తువు గిట్టదు.

వెలుగు లాంటి చీకటిని
చీకటి లాంటి వెలుగును
ఏకకాలంలో చూడగలిగే జ్ఞాననేత్రమును
కలిగిన దేవుడవు నీవు.

కలలే మెలకువలుగా ఉన్నాయని
ఎఱిగిన 'మెలకువలో కల' నీవు.

తనను తాను తెలుసుకునే ప్రయత్నమే
జీవనధర్మచక్రమని బోధించిన సద్గురువు నీవు.
అజ్ఞానమనే ఆపద నుండి రక్షించే ఆప్తుడవు నీవు.

రాత్రి తీగలో లేని పూవు
ప్రొద్దునే కనబడి సుగంధాన్ని వెదజల్లినట్టు
మాకు తెలియకనే మమ్ముద్ధరించి
ముక్తిని ప్రసాదించే జ్ఞానప్రసూనాంబవు నీవు.

శ్రీకాళహస్తీశ్వరా...! శరణం... శరణం...

* * *

తండ్రీ బిడ్డలు దాగుడు మూతలు ఆడుకునేటప్పుడు
ఉద్దేశపూర్వకంగానే తండ్రి ఓడిపోతాడు.
బిడ్డ మొహంలో  విజయానందాన్ని చూసి మురిసిపోతాడు...

శివా! నీకు నీవై తెలియబడితే  తప్ప తెలుసుకోలేని శిశువులం...

జపతపాదులతో నిన్ను పట్టేసుకున్నాం అనుకోవడం మా అమాయకత్వం.

మా అమాయకత్వమే నీ వాత్సల్యానికి ముఖ్యకారణమైంది.

మహర్షులు సైతం  నిన్నెఱుగక మౌనం వహించాడు.
ఇక మేమెంత?

పిండికొద్ది రొట్టె అన్నట్లు
శరణాగతే నీ కృపకు పెట్టుబడి.

శరణమని నీ పాదాలను పట్టుకున్నాక
ఇక చింతాకంత చింత కూడా ఉండదు.

తల్లీ తండ్రీ గురువు దైవము అన్నీ నీవే.
వేదములే నీకు సాగిలపడ్డాయి...
అందుకే నీ ఒడియే మాకు పెద్ద బడి.

శ్రీకాళహస్తీశ్వరా...! శరణం...శరణం...

---

## ఫలశ్రుతి

---

శివా!
సద్గురు హృదయమైన ఈ అనిలాచలశివమాలను
ఎవడైతే తలదాలుస్తాడో
వాడి బాగోగులన్నీ నీవే చూసుకుంటావు.

ఈ సద్గురు హృదయన్ని ఒక్కసారి చదివినా చాలు.
"నేను కర్తను కాను, భగవంతుడే కర్త" అనే ఎఱుక కలుగుతుంది.

ఈ సద్గురు హృదయాన్ని మనసులో ఒక్కసారి అలా తలచుకున్నా చాలు...
"చావుపుట్టుకలు లేని ఆత్మయే నేను" అన్న అనుభవం కలుగుతుంది.

సద్గురు హృదయమే
గొప్ప సంపద...
గొప్ప యోగం...
అదే క్షేమస్థానం కూడా...

పరమేశ్వరా...!
ఉన్నది ఒకే ఒక పరమార్థవస్తువు.
ఆ వస్తువు నీవే.

'సద్గురు హృదయం' పారాయణం వలన
నీవే నేను అన్న జ్ఞానం కలుగుతుంది.

ఏదయినా-
నమ్మితే సొమ్ముగా కనిపిస్తుంది.
నమ్మకపోతే అదే దుమ్ముగా కనిపిస్తుంది.

హే! పరమాత్మా...!
ఈ పలుకులన్నీ నా 'ద్వారా' పలికింది నీవే.
కర్మా నీవే, కర్మఫల ప్రదాతవూ నీవే, ఫలమూ నీవే.

* * *

ఆవు లేగ జూచి అనురాగమునడాసి
పాలనిచ్చు పెంచు లీల మెరసి
భక్తజనుల జూచి భద్రము లొడ గూర్చి
పరమసుఖము నొసగు పరమపురుష.

* * *

38. సద్గురు జయంతి

________________

పుట్టునాఁడెద్దియో పూనెదరు యుత్సవము
పుట్ట మన కెద్ది యను బుద్ధిఁ గొని - పుట్టుక
గిట్టుక లేదై వెలుగు కేవల వస్తువులో
పుట్టినదే పుట్టుదినంబు.

- భగవాన్

* * *

మధురలో కృష్ణజన్మస్థలమైన చెరశాలలో
ఒక బోర్డు తగిలించి ఉన్నారని చాలా యేళ్ల క్రితం విన్నాను...
ఆ బోర్డులో ఉన్న వాక్యం ఇది(ట) -

"ఇక్కడ కృష్ణుడు పుట్టలేదు...
పుట్టినట్టు కనిపించాడు" అని.

నాకు ఈ వాక్యం బాగా నచ్చింది.

కాకపోతే చిన్న సవరణ...

కృష్ణుడే కాదు...ఎవరూ పుట్టలేదు...ఏదీ పుట్టలేదు...
పుట్టినట్టు కనిపిస్తోంది అంతే.

ఉన్న"ట్టు" కనబడే లేని జగత్తులో
దేనికీ, ఎవరికీ ఉనికి లేదు.

ఉనికే లేనివారికి పుట్టుక ఎక్కడిది? చావు ఎక్కడిది?
బంధమెక్కడిది? మోక్షమెక్కడిది?

కలలో -
కోటి రూపాయిలు దొరికినా ఒకటే.
కోటి రూపాయిలు దారబోయినా ఒకటే.

మెలకువలో-
రెండూ నవ్వులాటే.

అంతే జ్ఞానం అనే మెలకువలో కూడా...
మనకు ఇదంతా లీలగా...నీడగా...తోస్తుంది.

* * *

ఓ గురుజయంతి రోజున గురుపుత్రుడు కృష్ణ ఇలా సందేశం పంపారు -

"పుట్టని నీకు పుట్టినరోజు శుభాకాంక్షలు" అని.

'నేను' పుట్టని చోటులో సంస్థితమై ఉన్నవాడే - గురువు.

'నేను' పుట్టని చోటుకు చేరుకున్నవాడే - శిష్యుడు.

ఆ చోటులో గురు-శిష్య భేదమే లేదు.

ఎవరు ఎవరికి జన్మదినం చేయడం?

ఎప్పుడూ ఏదీ పుట్టనేలేదు.

పూర్ణవస్తువు యెప్పుడూ పూర్ణంగానే ఉన్నది.
సూర్యుడికి చీకటి కనబడనట్టు
పూర్ణుడికి అపరిపూర్ణం కనబడదు.

అందువలన -
గురువుకు శిష్యులు తోచరు.

శిష్యులకు గురువు తోస్తాడు.
గురువు తోస్తున్నంతకాలం
జన్మదినం చేయవలసిందే.

ఓ గురూ!
నాకు చావుపుట్టుకలు లేవని తెలుసుకునేంతవరకు
నిన్ను మళ్లీ మళ్లీ పుట్టిస్తూనే ఉంటాను.
నీకు పుట్టినరోజు శుభాకాంక్షలు చెబుతూనే ఉంటాను.
నీకు ఇష్టమైనా, కష్టమైనా తప్పదు.
నీవు అంగీకరించి, ఆలకించవలసిందే.

నేను(అహమిక) చచ్చి బ్రతికేవరకు నీవు ఇలాంటి వేడుకల్ని జరిపించుకుంటూ ఉండవలసిందే...

అని వెంకట్ అనే శిష్యుడు వ్రాతపూర్వకమైన సందేశాన్ని ఇచ్చాడు.

* * *

అరుణాచలాన్ని స్టిల్ ఫోటో తీసినా ఒకటే, వీడియో తీసినా ఒకటే... అది కదలదు.

అచలస్వరూపుడైన గురువుకు ఉత్సవం చేసినా ఒకటే, చేయకున్నా ఒకటే...వారు చలించరు.

అన్ని ముచ్చట్లూ...అన్ని ఉత్సవాలూ...శిష్యులకే.

గురువుకు ఏమీ తెలియదు...
ఏకాత్మతో రమించడం తప్ప.
* * *

39. నేల విడిచి సాము చేయరాదు...

---

నక్క పుట్టి నాలుగు వారాలు కాలేదు...
ఇంత గాలీవాన నా జీవితంలో ఎన్నడూ చూడలేదు అందట.

మానవుని ఆయుస్సు వందేళ్లు...
రెప్పపాటు జీవితం.

కానీ తానెవడో , ఈ భూమ్మీదకు ఎందుకొచ్చాడో తెలుసుకోకుండా...

ప్రపంచ స్థితిగతుల్ని మార్చాలని
తన జీవితమంతా దారబోసి,
ఏదో చేయబోయయి చివరకు ఏదో జరుగుతోంది...

ఇదంతా సంఘసేవ అని చంకలు గుద్దుకుంటాడు...
కానీ వాని సిద్ధాంతాలు వలన లోకం మరింత గందరగోళంగా
తయారైపోతుంది. అప్పటికి వాడుండడు.

వాడి చరిత్రను పాఠ్యపుస్తకాల్లో ముద్రించి, పిల్లల బుర్రల్లోకి
ఎక్కిస్తారు..."ఆదర్శపురుషులు" అని.

* * *

వ్యక్తిగతమైన సంస్కరణలోనే
సంఘసంస్కరణ ఇమిడి ఉంది అన్న గొప్ప రహస్యాన్ని  మన ఋషులు
కనుగొన్నారు....

అందుకే మన ప్రాచీన భారతంలో
ఋషులు ఉన్నారేగాని సంఘసంస్కర్తలు లేరు.

అందుకే రామతీర్థులు -
"సంస్కర్తలు కావలెను...అర్హత: తమను తాము సంస్కరించుకుని
ఉండవలెను"
అని పత్రికాప్రకటన ఇచ్చారు...

దాని అర్థమేమంటే తనను తాను సంస్కరించుకుంటే
మరొకరిని సంస్కరించడానికి వానికి ఇతరం, ఇతరులు గోచరించరు.

అందుకే భగవాన్-
ప్రపంచం సంగతి ప్రపంచం చూసుకుంటుంది.
నీ సంగతి నీవు చూసుకో అనేవారు.

అద్దంలో చూసుకుని తలదువ్వుకుంటే, ఏకకాలంలో ప్రతిబింబంలోని తల
కూడా దువ్వబడే ఉంటుంది.

ఈ ప్రపంచం తన ప్రతిబింబమే...

ఈ వ్యక్తిగతమైన సంస్కరణలో భాగమే
బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు.

మన భారతీయ జీవన విధానంలోనే సంఘసంస్కరణ ఇమిడి ఉంది.

"సంఘసంస్కరణ" అనే ఓ ప్రత్యేక కార్యక్రమం అంటూ ఏమీ అవసరం లేదు.

సంఘాన్ని సంస్కరించడానికి కొంపా గోడు వదిలేసి దేశం మీద పడనక్కర్లేదు...

ఎవడికి వాడు వాడి వాకిలి శుభ్రం చేసుకుంటే, ఏకకాలంలో ఊరంతా శుభ్రమౌతుంది...

అంతేగాని నీవు చీపుర తీసుకుని ఊరినంతటినీ శుభ్రం చేయాలనుకోవడం మూర్ఖత్వం.

వివేకానంద అంతటివాడు విసిగిపోయి - "ఈ లోకం కుక్క తోక వంటిది. అది అలానే ఉండడం దాని స్వభావం" అన్నారు.

సంస్కర్త తాను జీవించి ఉన్నంతవరకు కుక్కతోకను లాగి పట్టుకుని ఉంటాడు. వాడు మరుగవ్వగానే మళ్లీ వంకరే.

* * *

మరి చెప్పడానికి ఎవరో ఒకరు ఉండాలి కదా! అంటారేమో....

నిజమే ఆ ఒక్కడు వేదబ్రాహ్మణుడు.

ప్రాచీనభారతంలో చక్రవర్తులు సైతం వారి రాకతో సింహాసనం మీద నుంచి లేచి ఎదురేగి అతిథిసత్కార్యాలు ఘనంగా చేసేవారు...

బ్రాహ్మణుడు అంటే కుల సంబంధమైన వ్యక్తి అని కాదు.
బ్రహ్మజ్ఞానమును పొందినవాడు అని అర్థం.
అనగా తనను తాను సంపూర్ణంగా సంస్కరించుకున్నవాడు అని అర్థం.

బ్రహ్మజ్ఞానం పొందినవాడు వాడు చండాలుడైనా సరే వాడు బ్రాహ్మణుడే.

ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రబోధించే సద్గురువును బ్రహ్మజ్ఞాని అనవచ్చు.

నిన్ను అంతర్ముఖంలోకి నెట్టేవాడు యెవడైనా సరే
వాణ్ణి బ్రహ్మజ్ఞాని అనవచ్చు.
* * *
ఎవడి పని వాడు చేసుకుంటే
అదే గొప్ప దేశ సేవ అవుతుంది.

నీ "కుటుంబం" అనే చిన్న యూనిట్ కు నీవు పరిపూర్ణంగా న్యాయం చేయగలిగితే చాలు
లోకానికంతా నీవు మేలు చేసినవాడివే అవుతావు
అంటారు గురువుగారు.

నీవు, నీ కుటుంబం వఱకే చూసుకో చాలు....
అనే మాటలు స్వార్థపరమైనవిగా అనిపిస్తాయి....
కానీ కాదు.

"సేవ" అనే మాట కంటే మోసపూరితమైన మాట మరొకటి లేదు అంటారు గురువుగారు.

ప్రతి ఒక్కరూ తాను, తన కుటుంబం వరకే చూసుకుంటే....దేశంలో ఇంతమంది  అనాధలు ఉండరు. ఇన్ని వృద్ధాశ్రమాలు ఉండవు.

దేశంలో అనాధాశ్రమాలు, వృద్ధాశ్రమాలు పెరగడం దేశాభివృద్ధి కాదు.

కుటుంబ వ్యవస్థ కుంటుపడడమే వీటికి కారణం.
* * *
నేల విడిచి సాము చేయరాదు...
తన్ను విడిచి సేవ చేయరాదు...
* * *
## 40. త్యాగం

---

ఈరోజు ఉదయం నేను గురు సన్నిధిలో ఉన్నప్పుడు...

పట్టెయ్య మిత్రబృందం గురువుగారితో వీడియోకాల్ లో గురుదర్శనం చేయాలని కోరారు ఫోన్ లో....

నేనన్నాను...
గురుదర్శనం అంటే
వ్యక్తిదర్శనం కాదు,
తత్త్వదర్శనం.

చేయవలసింది వీడియోకాల్ కాదు...
తక్షణం అనిలాచలశివమాల పారాయణం చేయండి
అదే నిజంగా గురుదర్శనం... అని చెప్పాను.

నేను వారికి  ఆ సలహా ఇస్తున్నప్పుడు
గురువుగారు నవ్వుతూ కనబడ్డారు....

బహుశా గురువుగారు ఏదో చెప్పడానికి ఉపక్రమిస్తున్నట్టు కనబడ్డారు...

పట్టెయ్య కాల్ అయిపోగానే....
గురువుగారు నా వైపు తిరిగి ఇలా అన్నారు....

అది కాదు బాబు చెప్పాల్సింది....
గురుదర్శనం కాలసినవారు లక్షరూపాయిలు డిపాజిట్ చేయమని చెప్పాల్సింది...అన్నారు నవ్వుతూ....

అప్పుడు తెలుస్తుంది నిజంగా "గురుదర్శనం" ఎంతమందికి అవసరం అనేది...

తాతగారిని ఒకరడిగారట-
స్వామీ...నాకు దేవుణ్ణి చూపించు...అని.

నీకు ఎన్ని ఎకరాలు ఉంది? అని అడిగారు తాతగారు.

'పది ఎకరాలు' చెప్పాడతను.

'ఆ పది ఎకరాలు నా పేరు మీద రిజిస్ట్రేషన్ చేయించు...దేవుణ్ణి చూపిస్తా' అన్నారట...

అంతే అతను అక్కణ్ణుంచి మెల్లగా జారుకున్నాడు.

"నీ యావదాస్తి దానమిచ్చి, నన్ను అనుసరించు" అన్న క్రీస్తు మాటలు గుర్తుకు వస్తోంది....

తనకున్న సర్వాన్ని వదిలినవాడే
సర్వమై ఉన్న దైవాన్ని పొందుతాడు.

తొలి సర్వం - స్వార్థం.
మలి సర్వం - పరమార్థం.

* * *

మనకు ఇద్దరు పిల్లలు ఉంటే, మన ఆస్తిని రెండు భాగాలు చేసి ఇద్దరికీ పంచుతాం...

కనీసం దేవుడికి అంతా ఇవ్వకపోయినా....
మూడో భాగం పెట్టి ఇచ్చినా అదొక పద్ధతి...

దేవుడికి మాత్రం రూపాయి కర్పూరం వెలిగించి....
నన్ను నా కుటుంబానికి రక్షణగా ఉండమని ప్రార్థిస్తాం.

మన ఇంటిని కాపాలా కాసే వాచ్ మేన్ కు ఇచ్చే జీతమంత కూడా విశ్వరక్షకుడైన దేవునికి ఖర్చు పెట్టం...

తెల్లదుస్తులు ధరిస్తాం...
పట్టీలు పెడతాం....
రుద్రాక్షలు ధరిస్తాం...
రుద్రాభిషేకాలు చేయిస్తాం...
ప్రతివారం గుడికెళతాం...
ఇదంతా దేవుడికోసమే అని భ్రమపడతాం...

దేవుని పేరుతో చేసేదంతా దేవుని కోసం కాదు, తనకోసమే...అన్నారు గురువుగారు.

రోగి ఔషధం పుచ్చుకునేది డాక్టరు కోసమా?
తన కోసమే కదా!

ఆధ్యాత్మికం అనే పేరుతో వీడు చేసేదంతా లౌకికవ్యవహారమే.

"ఆధ్యాత్మికం అనే వ్యవహారం ఉత్త బూటకమే" అంటారు గురువుగారు.

* * *

త్యాగం అంటే ఇప్పటికిప్పుడే అంతా ఇచ్చేయమని కాదు.
కనీసం మానసికంగానైనా  సంసిద్ధతను కలిగి ఉండమని చెప్పడం.

"నాది" అనుకున్నదంతా నాది కాదని తెలిసి ఉండడమే త్యాగం.

"నేను" అనేది, అనుకునేది
నేను కాదని తెలిసి ఉండడమే పరిత్యాగం.

* * *

నాది అనుకున్నది ఏ కారణం చేతనైనా నీ నుంచి  దూరమైపోతే,
చలించకుండా ఉండే శక్తి మనసుకు ఉండడమే త్యాగం.

వదలలేకపోవడం - లోభం.
వదలగలిగి వదలకుండా ఉండడం - త్యాగం.

* * *

నేనన నీవన నిఖిల జంగంబన
నీవే అవుదువు అనిలాచలా!

ఉన్నదంతా ఆయనే అయినప్పుడు
ఆయనది ఆయనికివ్వడం త్యాగమా?

త్యాగం అనేది మానసికవిషయమే.

ఏమైనా రానీ... ఏమైనా పోనీ...
సదా "నేను"ఉంటాను...
అన్న జ్ఞానమే త్యాగం, భోగం.

* * *

జ్ఞానశిశువు
9533667918

41. దైవారాధనలు

---

1992 కృష్ణాష్టమి రోజున....గురువుగారి రెండవ కుమారుడు కృష్ణ హాల్లో మంచంపై వెల్లికిలా పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటూ ఉన్నాడు...

గురువుగారు తన పూజాగది నుండి...హాలు మీదుగా...బాత్రూం వెళుతున్నారు...

హఠాత్తుగా కృష్ణ తన తండ్రి వైపు ఉరిమి చూసి...
ఈరోజు కృష్ణాష్టమి అన్న విషయం మరిచావా?
నాకు(కృష్ణుడికి) పూజ చేయవా? అని గద్దించాడు...

అయ్యావారమ్మ అవాక్కయింది....

కృష్ణ మామూలుగా తన తండ్రిగారిపై భయభక్తులు కలిగినవాడే....
మరి ఎందుకు కృష్ణ ఈరోజు ఇలా విచిత్రంగా ప్రవర్తిస్తున్నాడు!! అని అందరికీ ఆశ్చర్యమేసింది.

మాట్లాడేది తన కుమారుడు కృష్ణ కాదని అర్థమైంది గురువుగారికి.

కృష్ణభగవానుడే ఆవేశించి మాట్లాడుతున్నాడని గ్రహించారు.

"అలాగే చేస్తాను" అన్నారు గురువుగారు.

అయ్యావారమ్మ కృష్ణను బాత్రూం తీసుకెళ్లి తలస్నానం చేయించాక ఆ ఆవేశం పూర్తిగా పోయి, యధాస్థితికి వచ్చారు...

తరువాత కృష్ణను అడిగితే "నాకేమీ తెలియలేదు" అన్నారు.

గురువుగారు  నాకు డబ్బులిచ్చి బజారుకెళ్లి పూజాసామగ్రి తెప్పించి పూజ చేశారు కృష్ణభగవానులకు.

గురువుగారు అన్నారు-
"దేవుళ్లే అడిగి మరీ పూజలు చేయించుకుంటున్నారు...
ఏం గతి పట్టిందిరా దేవుళ్లకు మన కాడ" అన్నారు తమాషాగా.

* * *

నేను ప్రతిరోజూ సాయంత్రం 4 గంటలకు శివాలయం వెళ్లేవాడిని.

సోమవారం మాత్రం ఆలయంలో విక్రయించే మందారాకులలో చుట్టబెట్టిన పులిహోరా పొట్లం తెచ్చి పటాలను ఉంచే టేబుల్ పై పెట్టేవాడిని.

టేబుల్ మీద పెట్టిన  ప్రసాదం పొట్లం చూడగానే..."ఓ....ఈరోజు సోమవారమా?" అనేది అయ్యావారమ్మ.

ఎంతో ప్రీతిగా తినేవారు...

ప్రతి గురువారం షిరిడీబాబాకు బూందీ పెట్టేవారు గురువుగారు.
అందరమూ ఆ ప్రసాదాన్ని తీసుకునేవాళ్లం.

ప్రతి శనివారం శ్రీవేంకటేశ్వరస్వామి వారికి టెంకాయ కొట్టి కర్పూరహారతి ఇచ్చేవారు గురువుగారు.

తొలిరోజుల్లో సత్సంగంలో ఇవే కార్యక్రమాలు...
ఇవి తప్ప విశేష కార్యక్రమాలు ఏవీ జరిగేవి కావు.

మాకు మాత్రం గురువుతో గడిపిన ప్రతిదినమూ ఓ పండుగ లాగే ఉండేది.

అప్పట్లో ఇద్దరం ముగ్గురం ఉండేవాళ్లం అంతే.
ఏ సంపాదనా లేని మాకు గురువుగారికి కనీస ఖర్చులు పెడదామన్నా మా వద్ద డబ్బులుండేవి కావు...

గురువుగారే మాకు ఖర్చు పెట్టేవారు...బజారుకెళ్లినప్పుడు...

అప్పట్లో వారి ఆర్థిక పరిస్థితి కూడా అంతంత మాత్రమే.
కానీ దైవారాధనకు సంబంధించిన ఖర్చు విషయంలో గానీ, తాతగారికి ఖర్చుపెట్టే విషయంలోగానీ ఏ మాత్రమూ రాజీ పడేవారు కారు.

జీతం చాలకపోతే అప్పు చేసేవారు.

తాతగారికి ప్రతిరోజూ 5/- ఇచ్చేవారు....

ఆ అయిదు రూపాయిలే ఈరోజు (దక్షిణరూపంలో) అయిదువందల రూపాయిలుగా తిరిగి వస్తోంది అంటారు గురువుగారు.

"కిటికీలో నుంచి పది రూపాయిలు పారవేస్తే
గుమ్మంలో నుంచి వందరూపాయిలు వస్తుంది"
అనేవారు తాతగారు.

తాతగారు చేసే ప్రత్యేక దైవారాధన ఏమీలేదు...
పటాల ముందు గురుశిష్యులిద్దరూ కూర్చొని గంజాయి త్రాగేవారు.

టేబుల్ మీదున్న బ్రహ్మంగారి జీవిత చరిత్ర తీసుకుని ఏ పేజీ వస్తే ఆపేజీ చదవమని శిష్యుడి చేతికి ఇచ్చేవారు...
ఆ పేజీ అవగానే...మరో పేజీ చూపించి చదవమనేవారు....

ఇలా చాలా సేపు విసిగించేవారట మన గురువుగారిని.

ఇక లాభం లేదు....వారు ఆపమనే వరకు నేను చదువుతూనే ఉంటాను...అని మానసికంగా సిద్ధపడగానే-

"చాల్లే....ఆ పుస్తకం మూసేయ్!" అనేవారు తాతగారు.

గురువుగారి వద్ద శెలవు తీసుకునేటప్పుడు "వస్తాను స్వామీ!" అని తాతగారు రెండు చేతులు కలిపి నిండుగా నమస్కరించడం నాకు బాగా గుర్తుంది...

ఏ దేవుడికీ చేతులెత్తి నమస్కరించని తాతగారు తన శిష్యునికి అలా నమస్కరించడం మన గురు-శిష్య సంప్రదాయం మిగతా సంప్రదాయాల కంటే ఎంతో భిన్నమైనదిగా అనిపిస్తుంది.

* * *

ఎవరైనా గురువుగారికి దక్షిణ చేతికి ఇవ్వబోతే,
చేతికి తీసుకునేవారు కారు..."అక్కడ టేబుల్ మీద పెట్టండి" అంటారు గురువుగారు.

ఆ తరువాత తీసుకుంటారు...వారు ఎంత దక్షిణ పెట్టారో అస్సలు ఎంచుకోరు....అలాగే చొక్కా జేబులో పెడతారు....అందులో నుంచే అన్ని ఖర్చులూ పెడుతుంటారు.

దక్షిణ ఇచ్చిన సంగతి ఇచ్చినవాడూ మరచిపోవాలి.
దక్షిణ తీసుకున్న సంగతి పుచ్చుకున్నవాడూ మరచిపోవాలి.
అప్పుడే ఆ దక్షిణకు ఫలం అంటారు.

తాతగారనేవారట-
ఎంద దక్షిణ అయినా తీసుకో....
కానీ రాత్రి పడుకునే లోపు మొత్తం ఖాళీ అయిపోవాలి.
అప్పుడే ఆ దక్షిణల వలన ఏ దోషమూ అంటదు తీసుకున్నవానికి.

షిర్డీ బాబా కూడా అంతే కదా!
ప్రతి సాయంత్రం చిల్లర చల్లేసేవారట...
భక్తులు తనకు జోలపాట పాడే సమయానికి
జోలె ఖాళీ.

* * *

గురువుగారు తాతగారిని ఏనాడూ ఆధ్యాత్మిక ప్రశ్నలు వేసిందే లేదట.

తనలో ఏదైనా  ప్రశ్న కలిగితే...మాటల సందర్భంలో
తాతగారి నోటి వెంట దానికి సమాధానం దొరికేదట.

తాతగారి వద్ద సిగరెట్లు కాల్చడం, సారాయి త్రాగడం తప్ప ఇంకేమీ
నేర్చుకోలేదు అని నిందచేసినవారు కూడా ఉన్నారు.
కానీ గురువుగారు అవేవీ పట్టించుకోలేదు....
వారికి "గురువాజ్ఞ" ముఖ్యం అంతే.

* * *

క్రమశిక్షణతో కూడిన జీవితం.
ఎనలేని గురుభక్తి.
ఇతరుల బాగోగులు తెలుసుకోవడం.
వాటికి పరిష్కారం చెప్పడం...
పరిస్థితులు ఎలా ఉన్నప్పటికీ స్థిమితంగా ఉండడం.
దేనికీ ఆశ్చర్యపడకపోవడం.
సదా వర్తమానంలో ఉండడం.

ఇవే గురువుగారి నిత్య దైవారాధనలు...

* * *

## 42. నీకు నీవు ఒక్క అడుగు ఎడంగా ఉండు

---

గురుసన్నిధిలో మనసు ప్రయత్నంగా
తాను పుట్టుచోటుకి వెళ్లిపోతుంది.

గురుసన్నిధిలో మౌనం కూడా
ప్రవక్తలా ప్రవచిస్తుంది.

గురుసన్నిధిలో దైవం కూడా
శిష్యునిలా మెలగుతుంది.

* * *

ప్రతిసారీ ఏదో ఒక సందర్భంలో గురువుగారు తరచూ చెప్పే మాటలు నాలుగున్నాయి...

1. నీ కనుచూపు పారినంతమేరకు ఉన్నదే ప్రపంచం.

2. "అందరూ" ఎక్కణ్ణుంచి వచ్చారు?
ఉండేది నీవొక్కడివే.

3. ముందు నీవు వచ్చాకే, సకలమూ వచ్చింది.
నీవు పోయాక ఇక్కడ ఉండేది కూడా ఏదీ ఉండదు.

4. జాగ్రత్-స్వప్న-సుషుప్తులు మూడూ కలిపి ఓ పెద్దకల అని ఎఱుకే 'నిజమైన మెలకువ'.

* * *

పై నాలుగు వాక్యాలను జీర్ణం చేసేసుకుంటే చాలు...
మనిషి ఋషైపోవడానికి...

ఒక్క సంకీర్తనైనా చాలు...నన్ను ఒద్దిక రక్షింపగ...
తక్కినవన్నీ భండారాన దాగీ ఉండనీ అన్నాడు అన్నమయ్య.

సద్గురు సాహిత్యం కూడా  అంత పెద్ద మొత్తం మనకు అవసరం లేదు...
జ్ఞానప్రసూనాల్లో ఒక్క సూక్తి చాలు...తరించడానికి.

బట్టలషాపుకెళ్లి, మనకు సరిపోయే దుస్తులను కొనుగోలు చేసి
బయటపడతాం...మిగతా దుస్తులతో మనకు పనిలేదు.

అలాంటిదే ఈ "జ్ఞానప్రసూనాలు" గ్రంథం కూడా.
మనక్కావలసిన వాక్యాన్ని తీసుకొని ఈసంసారం నుండి బయట పడాలి.
మిగతా వాక్యాలతో మనకు పనిలేదు...ఎన్నైనా ఉండనీ, ఎలా అయినా
ఉండనీ...ఎంత గొప్పగా ఉండనీ...

* * *

"బాబుతో ఉండు...బాబుగా ఉండొద్దు"
అన్నారు గురవుగారు  నాతో ఓసారి...
ఆ ఒక్క ఉపదేశమే నా జీవితానికి సరిపోయింది.

అంటే బాబుగా ఉండొద్దు...సాక్షిగా ఉండు...
ఆ సాక్షిగా ఉన్నవాడు బాబు కాదు, బ్రహ్మమే.
ఆ బ్రహ్మమే నీవు.
అని ఆ ఉపదేశభావము.

ఆ ఉపదేశసారాన్ని ఒక్క మాటలో చెప్పాలంటే-
"నీకు నీవు ఒక్క అడుగు ఎడంగా ఉండు".

* * *

కొంతమంది శిష్యుల ప్రోద్బలంతో మూడుసార్లు గురువుగారితో కలిసి
అరుణాచలం వెళ్లే భాగ్యం కలిగింది నాకు.

అనంతనికేతన్ ఆశ్రమంలో చిలకమ్మకు అతిథులుగానే గడిపాం
మూడుసార్లు...

స్వామీ...! తమరితో కలిసి అరుణాచల ప్రదక్షిణం చేయాలని ఉంది...అని
పట్టెయ్య కోరినప్పుడు-
"అరుణాచలమే నా చుట్టూ ప్రదక్షిణం చేస్తోంది...
మీరు వెళ్లి రండి..." అన్నారు.

ప్రపంచానికి అరుణాచలం కేంద్రం అయితే,
అరుణాచలానికి కేంద్రం సద్గురుదేవులే.

* * *

"తమరు టచ్ చేసిన సబ్జక్టు, రమణులు కూడా టచ్ చేయలేదు" అని బాబు అంటే,

"రమణులే నా రూపంలో టచ్ చేస్తున్నారు..."
అని ఠక్కున పలికారు, క్షణం కూడా ఆలస్యం చేయకుండా...

అంతగా వారు ఏకాత్మవస్తువుతో మమేకం అయి వుంటారు....

తాతగారు అన్నట్టు- వారు శుభ్రమైన మణి.

* * *

ఓ గురుదేవా!

మిమ్ము స్తుతించుట యొక్క అర్థము
మౌనంగా ఉండడమే.

మిమ్ము పూజించుట యొక్క అర్థము
కర్మలు లేకుండా ఉండడమే.

మీ సాన్నిధ్యమును పొందుట యొక్క అర్థము
మీలో లీనమై శూన్యత్వమును పొందటమే.

అంటారు జ్ఞానేశ్వరులు.

* * *

కొంచెం కూడా కర్తృత్వభావం లేకపోవడమే శరణాగతి.
శరణాగతికి ఆటంకమైన అహాన్ని తొలగించేది
సద్గురు సన్నిధి.

తనను తాను పోగొట్టుకొని
తనను తాను పొందాలి.
ఇదే జీవితపరమార్థం.

అది సద్గురు సన్నిధిలో మాత్రమే నెరవేరబడుతుంది.

* * *

## 43. లాభనష్టములు లేని వ్యాపారం

---

తనదే, తానే అయి ఉన్న ఆత్మస్వరూపం
కనబడనంతగా....
మరిచిపోయేంతగా చేసుకున్నామంటే....

అంతగా ఆత్మను వదిలి
బాహ్యావిషయాలనే దుప్పట్లతో ఆత్మను కప్పేశామన్నమాట...

మళ్లీ ఆ దుప్పట్లను తొలగించాలంటే
ప్రాపంచిక వ్యవహారాలను అంతకంతకు తగ్గించుకోవాలి.

అవన్నీ అశాశ్వతమనే వైరాగ్యాన్ని
మనసులో నింపేసుకోవాలి.

అనేకం వదిలి ఏకం వైపుకే మనసును మళ్లించాలి.

నేను-నాది తుడిచేయాలి.
అనగా రెంటినీ ఏకం చేయాలి.

సదా ప్రపంచాన్ని నిరసిస్తూ ఉండాలి.
అప్పుడే ఆ దుప్పట్లు తొలగి
ఆత్మ తేటతెల్లమౌతుంది.

"తండ్రినైనను తల్లినైనను నా కంటె ఎక్కువగా ప్రేమించువాడు నాకు పాత్రుడుకాడు; కుమారునినైనను కుమార్తెనైనను నాకంటె ఎక్కు వగా ప్రేమించువాడు నాకు పాత్రుడు కాడు." అంటారు క్రీస్తు.

అంతగా దైవానికి ప్రధమస్థానం ఇచ్చినప్పుడు మాత్రమే తత్త్వం బోధపడగలదు.

దేవునికి ప్రధమస్థానం ఇవ్వడమే 'తపస్సు' .

* * *

ఆత్మకు సమానమైన విలువగలిగిన వస్తువు ప్రపంచంలో ఏదీలేదు.
మొత్తపు ప్రపంచం కూడా దానితో సరితూగదు.

కాబట్టి ఆత్మకు నీవిచ్చే విలువ
ప్రపంచంలో ఇక దేనికీ నీవు ఇవ్వకూడదు.

అప్పుడే నీ ఉపాసన సఫలం అవుతుంది.

* * *

నిష్కామకర్మ...
భగవద్భక్తి...
జ్ఞానవిచారణం....
అందులో ప్రధాన మార్గాలు...

మూడింటిలోనూ 'గురువు' పాత్ర అమోఘం.
మన ఆధ్యాత్మిక ప్రయాణాన్ని సులభతరం చేస్తుంది.

గురువులేని ప్రయాణం నావికుడు లేని నావలో ప్రయాణం చేయడం లాంటిది.

* * *

పరమపుణ్యక్షేత్రమైన శ్రీకాళహస్తిలో
సద్గురు సుబ్రహ్మణ్యల వారు ఉన్నారు.

వారు మూర్తీభవించిన జ్ఞానమే.
సందేహం లేదు.

వారు ఈ ప్రపంచానికి ఉచితంగా దొరికిన ఆధ్యాత్మిక ఖని.

తవ్వుకున్నవారికి తవ్వుకున్నంత.

నీ శ్రమకు తగ్గ ఫలితం అప్పటికప్పుడే దొరకడం అనేది
ఈ క్షేత్ర మాహాత్మ్యంలో ఉన్న వైచిత్ర్యం.

శ్రీకాళహస్తి వైపుకు...అందునా రమణసత్సంగం వైపుకు...అందునా సద్గురు సుబ్రహ్మణ్యుని వైపుకు

నీ మనసు తిరిగిందంటే...అదే నీ మనసుకు చివరిదినం...ఆత్మను సాక్షాత్కరించుకున్న శుభదినం అవుతుంది.

* * *

ఎవరికి సాక్షాత్కరించాలో ఆత్మే ఎన్నుకొంటుంది అన్న ఉపనిషత్ వాక్యం చాలా అద్భుతమైనది....
ఆ ఎన్నుకోవడం మన ప్రయత్నాలతో, సాధనలతో ముడిపడి లేదు.

భక్తులు చెప్పే "భగవదిచ్ఛ"అనే మాట కూడా
దానికి సరిసమానమైనదే.

ఏ అర్హతా లేకపోయినా అనుగ్రహించే నియంత భగవంతుడు.

అయినప్పటికీ....అర్హతను బట్టి అనగా సాధనను బట్టి కూడా భగవంతుడు అనుగ్రహిస్తాడు...
అని సాధన చేసేవారు కర్మయోగులు.

* * *

క్రీస్తు ఓ అద్భుతమైన కథ చెప్పారు తన శిష్యులకు-

ఉదయం నుంచి సాయంత్రం వఱకు పనిచేసినవానికి,
మధ్యాహ్నం నుంచి సాయంత్రం వరకు పనిచేసినవానికి
ఇద్దరికీ ఒకేరకంగా కూలీడబ్బులు చెల్లిస్తాడు ఓ యజమాని.

మొదటి కూలీ ఇదేం న్యాయమని అడుగుతాడు?
ఆ యజమాని ఇలా సమాధానమిస్తాడు-
మనిద్దరి ఒప్పందం(సాధన) ప్రకారం నీ కూలీ డబ్బులు(మోక్షం) నీకు ఇచ్చివేశాను...
ఇక నీవు వెళ్లవచ్చు...

ఇక రెండవవానికి అంతే డబ్బులు ఇవ్వడం అనేది...
నా డబ్బులు నా ఇష్టం(భగవదిచ్ఛ)...
అడగడానికి నీవెవరు? అంటాడు.

* * *

మొదటి కూలి - శ్రీరామకృష్ణులు.
రెండవ కూలి - శ్రీరమణులు.

ప్రయత్నంతో పొందినవాడొకడు.
అప్రయత్నంగా పొందినవాడొకడు.

మొదటిది కర్మసిద్ధాంతం.
రెండవది భగవదిచ్ఛ సిద్ధాంతం.

* * *

పువ్వులో మకరందం ఉంటే,
భ్రమరం దానికదే వచ్చి ఆస్వాదిస్తుంది.
భ్రమరాన్ని ఆహ్వానించనక్కర్లేదు.

మనలో ఆర్తి ఉంటే,
ఆత్మ దానికదే వచ్చి ఆవహిస్తుంది.
ఆత్మకై ప్రత్యేక సాధన అవసరం లేదు.

* * *

ఆత్మవిషయమై దీనులైనవారు ధన్యులు
పరలోకరాజ్యం వారిదే అన్నారు క్రీస్తు... కొండమీద ప్రసంగంలో.

లావొక్కింతయును లేదు...అని గజేంద్రుడు మొరపెట్టినప్పుడు...సిరికి కూడా చెప్పకుండా పరుగున వచ్చి కాపాడాడు భగవంతుడు...

నీ ఆర్తి నిజమే అయితే....భగవంతుడు నీ ఇంటి పై కప్పు పగలుగొట్టుకొని మరీ నీ ముందు సాక్షాత్కరిస్తాడు అంటారు గురువుగారు.

* * *

నాకు శ్రద్ధ ఉందిగానీ గురువు దొరకలేదు అన్నమాట కూడా సరికాదు.
గురువు దొరకడమే నీకు శ్రద్ధ ఉన్నందుకు గుర్తు.

శ్రద్ధ ఉన్నప్పుడు నీవున్న చోటుకే వచ్చి నిన్ను అనుగ్రహిస్తాడు గురువు.

అంతేగాని దారినపోయేవాళ్లందరినీ పిలిచి బోధించడు...
అలాంటి విధి, కర్తవ్యం ఏ గురువుకూ లేదు.

(ఆర్తితో)అడగండి ఇవ్వబడుతుంది అంటారు క్రీస్తు.

* * *

అడిగి పొందినవాడు - శ్రీరామకృష్ణులు.
అడగకనే పొందినవాడు - అరుణాచల రమణులు.

రమణుల విషయంలో -
ఆత్మనుంచి రమణుల వైపుకు ప్రయాణం జరిగింది.

రామకృష్ణుల విషయంలో -
రామకృష్ణుల నుంచి ఆత్మవైపుకు ప్రయాణం జరిగింది.

* * *

ఇద్దరి శైలి వైవిధ్యమైనది.

అందువల్లనే ఇరువురు ఆత్మసాక్షాత్కారానికి చెప్పిన ఉపాయాలు
వైవిధ్యంగానే ఉంటాయి.

"ఊరికే ఉండు" అన్నారు రమణులు.

"కామినీకాంచనములు జయించు" అన్నారు రామకృష్ణులు.

ఒకటి అప్రయత్నం.
మరొకటి ప్రయత్నం.

రెండూ సరియే ఆత్మవస్తువు దొరకడానికి.
రెండూ గురియే జ్ఞానఫలాన్ని కొట్టడానికి.

* * *

మన సాధనను బట్టి దైవానుగ్రహం లభిస్తుందా?
దైవానుగ్రహాన్ని బట్టి మన సాధన ఉంటుందా?

అని అడిగితే తేల్చి చెప్పడం కష్టం.
రెండూ సరియే.

మొదటివారు కర్మయోగులు.
రెండవవారు భక్తియోగులు.

ఒకడికి కర్మే భక్తి.
మరొకడికి భక్తే కర్మ.

* * *

సాధన అవసరమా? కాదా? అని గురువుగారిని అడిగితే,

"అవసరం లేదు" అని కరాఖండితంగా చెబుతారు.

"మరేం చేయాలి?" అని అడిగితే,

"ఎందుకు చేయాలి?" అని తిరిగి ప్రశ్నిస్తారు.

"ఆత్మానుభవం కొరకు" అంటే,

"ఆత్మానుభవం ఆత్మకు ఉంటుంది,
బాబు అనుభవం బాబుకు ఉంటుంది.

బాబు అనుభవంలో ఆత్మ ఉండదు,
ఆత్మానుభవంలో బాబు ఉండడు." అంటారు.

ప్రయత్నం ఏమీ చెయొద్దంటారా? అని అడిగితే,

చేయి, చేయకపో...
ఆధ్యాత్మికం అనేది లాభనష్టములు లేని వ్యాపారం
అని తెలిసి ఎలాగైనా ఉండు...నీ ఇష్టం...అంటారు గురువుగారు.

* * *

44. ఖాళీ

---

వివేకానందులు అమెరికా చేరిన మొదటి వారంలోనే అన్ని ఆధారాలూ
పోగొట్టుకుని "ఖాళీ"గా నిలబడ్డారు.
అక్కణ్ణుండి  దైవీశక్తి అతడ్ని నడిపింది.

అరవిందులు పాండిచ్చేరి సముద్రతీరంలో తన వద్ద మిగిలిన చివరి
నాణేన్ని  సముద్రంలోకి విసిరిపారేసి "ఖాళీ"గా నిలబడ్డారు.
అక్కణ్ణుండి  దైవీశక్తి అతడ్ని నడిపింది.

రమణులు ప్రయాణంలో మిగిలిన పైకాన్ని కోనేరులో విసిరివేసి, దుస్తులను సైతం వదిలి కేవలం ఓ గోచీతో "ఖాళీ"గా నిలబడ్డారు.
అక్కణ్ణుండి దైవీశక్తి అతడ్ని నడిపింది.
* * *

ఒకరు గురువుగారిని అడిగారు ....దైవీశక్తిని నేను చవి చూడాలంటే ఏంచేయాలి? అని....

అతనికి గురువుగారు ఇలా చెప్పారు-

500 రూపాయిలు జేబులో ఉంచుకుని, ఆ పైకంతో బస్సులోగానీ, రైలులోగానీ ఎంతదూరం ప్రయాణం చేయగలవో అంతదూరం ప్రయాణం చేసి అక్కడ దిగేయ్.... నీ జేబులో ఒక్కరూపాయి కూడా ఉండకూడదు....అక్కడ ఓ నెలరోజులు గడిపి, తిరిగి నీ స్వస్థలానికి చేరుకోగలిగితే తెలుస్తుంది....ఆ దైవీశక్తి నిన్ను ఎలా నడిపిస్తుందో అనేది.

ప్రత్యక్షానుభవం కలుగుతుంది...
కోటి ఆధ్యాత్మికగ్రంథాలు చదివినా కలగని అనుభవం, ఈ ఒక్క పని చేయడం వలన కలుగుతుంది...అన్నారు.

అతడు నవ్వుతూ ఓ హాస్యకథలాగా విన్నాడేగానీ,
ప్రాక్టికల్ గా సాహసం చేయలేకపోయాడు.

ఈ పట్టం విని నా స్నేహితుడు, గురుభక్తుడు అయిన సుధాకర్ అనేవాడు అలా రైలులో బయలుదేరి దత్తక్షేత్రమైన గాణ్గాపురం చేరాడు...

అక్కడ దిగి మిగిలిన చిల్లరపైకాన్ని పారవేసి, ఊళ్లోకి ప్రవేశించాడు....

అక్కడే ఓ కాషాంబరధారి వద్ద శిష్యుడిగా చేరి, ఊళ్లో భిక్ష చేసుకుంటూ ఓ నెలరోజులు గడిపి, తిరిగి స్వస్థలమైన శ్రీకాళహస్తి చేరాడు.

గురు బోధను అతనొక్కడే అలా ప్రాక్టికల్ గా చేసి దైవీశక్తిని అనుభవించాడు.

తిరిగొచ్చాక అతడు ఓ అవధూతలా మారిపోయాడు.....

కొందరు "అతడు పిచ్చివాడైపోయాడు" అని దూరమైపోయారు...

కొందరు అతన్ని ఓ గురువుగా ఆరాధించడం మొదలుపెట్టారు...

అతడు పిచ్చివాడో, అవధూతో దైవానికెరుక.

* * *

వాస్తవానికి ప్రతి ఒక్కడు ఈ భూమ్మీదకు దిగంబరంగానే వచ్చాడు...
"ఖాళీ"గానే ఈ ప్రపంచంలోకి ప్రవేశించాడు....

తనువును, తల్లిదండ్రులను, బంధువులను, స్నేహితులను,
భార్యాబిడ్డలను, సంపదలను, అనుభవాలను ఉచితంగానే పొందాడు....

తిరిగి అందరినీ, అన్నిటినీ, చివరకు తనువును కూడా "ఖాళీ" చేసి
వెళ్లిపోతాడు....

"ఖాళీ" అవడం తథ్యం....

కాబట్టి అన్నీ ఉన్నప్పుడు కూడా "ఖాళీ"గా ఉండడమే
గురువుగారు చెప్పిన "మెలకువలో నిద్ర".

భగవద్గీతలో చెప్పినట్టు- "అందరూ మేలుకుని ఉంటే, యోగి
నిద్రిస్తుంటాడు."

నిద్ర అంటే పడుకుని నిద్రపోవడం కాదు.
"ఖాళీ"గా ఉండడం...
అదే యోగనిద్ర.

భగవద్గీత చరమశ్లోకంలో-
సర్వధర్మాన్ పరిత్యజ్య....అన్నాడు కృష్ణభగవానుడు.
సర్వధర్మాలను వదిలేసి "ఖాళీ" అయిపొమ్మన్నాడు.

ధర్మములన్నీ ఇహానికి సంబంధించినవి.
"ఖాళీ" అనేది పరానికి సంబంధించినది

* * *

"నేను లేని స్థితి సర్వసమ్మతము"

"తాను ఆహారమగుటయే"

అని భగవాన్ ఉన్నది నలుబదిలో ప్రస్తావించిన వాక్యాలు ఈ "ఖాళీ" ని ఉద్దేశించినవే.

* * *

శ్రీరామకృష్ణులు ఆరాధించిన "ఖాళీ"యే కాళీమాత.
కాళీమాత అనేది ఓ విగ్రహం కాదు,

అర్ధరాత్రి...
ప్రపంచంలో ఉండే నిశ్శబ్ధాన్ని(మౌనాన్ని) అంధకారాన్ని(అభేదాన్ని) ఆస్వాదించడమే కాళీమాత దర్శనం.

మన గురువుగారు అలా అర్ధరాత్రి ఏకాంతంగా కూర్చుని "ఖాళీ" ని అనుభవించడం నేను ఎన్నోసార్లు చూశాను...

పట్టపగలు కూడా ఆ నిశ్శబ్ధాన్ని, ఆ "ఖాళీ"ని అనుభవించగలగడమే సహజ సమాధి.

అలా రమణులు ఉండేవారు...
మన గురువుగారు ఉండేవారు...

రాత్రయినా, పగలయినా వారిలో స్థితిభేదం ఉండదు.
వారు సదా "ఖాళీ"గానే ఉంటారు.

* * *

కర్తృత్వభావన "ఖాళీ" అయిపోవడమే కర్మయోగం.

వ్యక్తిత్వభావన "ఖాళీ" అయిపోవడమే భక్తియోగం.

అహమిక "ఖాళీ" అయిపోవడమే జ్ఞానయోగం.

* * *

కళ్లు తెరిచే వున్నా సరే -
ధ్యాననిష్ఠలో ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

* * *

వ్యవహారంలో మునిగి వున్నా సరే -
తనలో తాను మునిగి ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

* * *

మాట్లాడుతూ వున్నా సరే -
మౌనంగా ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

* * *

కరచరణాదులతో పని చేస్తూ వున్నా సరే -
అచలంగా ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

* * *

అన్నీ ఉన్నా సరే -
"ఖాళీ"గా ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

* * *

నిజానికి తాను "ఖాళీ" అయిపోతే....
ఆ ఖాళీ ఖాళీగా ఉండదు...
ఆ ఖాళీ దైవంతో నిండిపోయి ఉంటుంది.
ఇదే "ఖాళీతత్త్వరహస్యం".

* * *

గురువుగారు కొన్ని వేల ఉపదేశవాక్యాలు మాకు ప్రసాదించారు...
అందులో నుంచి ఒకే ఒక వాక్యం ఎన్నుకోమంటే...
జ్ఞానప్రసూనాలు 1-50 వాక్యాన్ని ఎన్నుకుంటాను...

అదే ఇది....

ఎవరూ లేకపోవడమే దేవుడు ఉండడం.
ఏమీ తెలియకపోవడమే దేవుణ్ణి తెలియడం.
ఏ అనుభవమూ లేకపోవడమే దైవానుభవం.

* * *

## 45. నా రమణాశ్రమ యాత్ర

---

నా 9వ ఏట మా అమ్మానాన్న  శ్రీరమణాశ్రమం వెళ్లారు...నన్ను మా పెదనాన్న వద్ద వదిలిపెట్టి.

మా అమ్మగారు శ్రీరమణాశ్రమాన్ని దర్శించి గొప్ప ఆనందం పొందారు...

తిరిగొచ్చాక శ్రీమహర్షి గుఱించి గొప్పగా వర్ణించి చెప్పింది...

"ఆహా! యోగి అంటే అలా ఉండాలి...! అనిపించింది నాకా చిన్నవయసులోనే...

కాలేజీ  చదివే రోజుల్లో నేను చలం అభిమానిని.
ఆయన వ్రాసిన పుస్తకాలను తెగ చదివేవాడిని.
ఆయన పుస్తకాల్లో అక్కడక్కడ రమణాశ్రమం, రమణభగవాన్ ప్రస్తావన వస్తూ వుండేది...

చలం పుస్తకాల్లో భగవాన్ ఫోటో ఉండేదిగానీ, అది చలం బాగా వృద్ధుడైనాక తీసిన ఫోటో అనుకునేవాణ్ణి...

ఓసారి గురువుగారి సతీమణి పద్మావతమ్మగారు
చలం పుస్తకంలో ఉండే ఆ ఫోటో చూసి,
"అరె రమణ మహర్షి...." అంది.

నేను అవాక్కయ్యాను...

ఈయన రమణమహర్షా? అన్నాను...

అవును బాబు...ఈయనే రమణమహర్షి...అంది.

అదే నా తొలి రమణదర్శనం...

* * *

1995 లో గురువుగారు నాకు దత్త మాలా మంత్రము వ్రాసిచ్చారు...

ప్రతిరోజూ 11 సార్లు చొప్పున 40 రోజులు పారాయణం చేయమన్నారు...

40 రోజులు పూర్తయ్యేలోపే నీకు అవధూత దర్శనం అవుతుంది...అని చెప్పారు...

---

దత్త మాలా మంత్రము

---

ఓం నమో భగవతే దత్తాత్రేయాయ
స్మరణమాత్ర సంతుష్టాయ
మహాభయ నివారణాయ
మహాజ్ఞానప్రదాయ
చిదానందాత్మనే
బాలోన్మత్త పిశాచవేషాయ
మహాయోగినే
అవధూతాయ
అనసూయానంద వర్ధనాయ
అత్రిపుత్రాయ
సర్వకామఫలప్రదాయ
ఓం భవబంధ విమోచనాయ
ఆం అసాధ్యసాధనాయ
హ్రీం సకల విభూతిదాయ
క్రోం అసాధ్యాకర్షణాయ
ఐం వాక్ప్రదాయ
క్లీం జగత్రయ వశీకరణాయ
సౌః సర్వమనక్షోభణాయ
శ్రీం మహాసంపత్ప్రదాయ
గ్లౌం భూమండలాధిపత్య ప్రదాయ
ద్రాం మహా చిరంజీవినే
వషట్ వశీకురు వశీకురు
వౌషట్ ఆకర్షయ ఆకర్షయ
హుం విద్వేషయ విద్వేషయ
ఫట్ ఉచ్చాటయ ఉచ్చాటయ
ఠః ఠః స్తంభయ స్తంభయ
ఖేం మారయ మారయ
నమః సంపన్నాయ సంపన్నాయ
స్వాహా పోషయ పోషయ

పరమంత్ర పరయంత్ర పరతంత్రాణి
ఛింది ఛింది గ్రహాన్నివారయ నివారయ
వ్యాధీన్ వినాశయ వినాశయ
దుఃఖం హరయ హరయ
దారిద్ర్యం విద్రావయ విద్రావయ
దేహం పోషయ పోషయ
చిత్తం తోషయ తోషయ
సర్వమంత్ర స్వరూపాయ
సర్వయంత్ర స్వరూపాయ
సర్వతంత్ర స్వరూపాయ
సర్వపల్లవ స్వరూపాయ
ఓం నమో మహాసిద్ధాయ స్వాహా||

ఇది శ్రీ గురుదత్తాత్రేయ చరణారవిందార్పణమస్తు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

* * *

పారాయణం ప్రారంభించిన 6వ రోజే(15-5-1995) ఇంట్లో కూడా చెప్పకుండా
హఠాత్తుగా అరుణాచలం వెళ్లాను...

అరుణాచలేశ్వర-అపీతకుచాంబిక దర్శనం చేసుకొని, వడివడిగా నడచుకుంటూ రమణాశ్రమం వెళుతుండగా...
దారిలో ఓ దిగంబరయోగి తనలో తాను మాట్లాడుకుంటూ...నవ్వుతూ...ఎదురుపడ్డాడు.

ఆహా...! గురువుగారు చెప్పినట్టు అవధూత దర్శనం అయ్యింది...అనుకున్నాను...

రమణాశ్రమం ఇంకా ఫర్లాంగు దూరం ఉండగానే ఆశ్రమనెమళ్లు తమ షడ్జమస్వరాలతో స్వాగతం పలికాయి...

ఆశ్రమంలో ప్రవేశించగానే నాగుమల్లి సువాసన చిరునవ్వుతో పలకరించింది...

భగవాన్ కన్నా గొప్ప అవధూత ఇంకెవరున్నారు...! అనుకున్నాను...అక్కడ వారి ఛాయాచిత్రములు చూసి.

నాకేదీ క్రొత్తగా తోచలేదు...
చాలాకాలం తర్వాత నా పుట్టినింటికి వచ్చినట్లనిపించింది...

భగవాన్ సమాధిని దర్శించగానే, తప్పిపోయిన బిడ్డ తిరిగి తన తల్లి వద్దకు చేరినట్లనిపించింది...

శుకుడు జనకుడి వద్ద సమాధానం పొందినట్లు
నా మనస్సు శాంతించింది...

పాతహాల్లో నేలను తడిమి తడిమి చూసుకున్నాను...

అది భగవానుల పాదస్పర్శతో పునీతమైన నేల కదూ...!

భోజనహాలు ముందు నుంచి వెళుతుంటే, ఒకతను తలుపు తెరచి -

"భోంచేశావా?" అని అడిగాడు...

"లేదు" అన్నాను.

"లోపలికి రండి" అంటూ విస్తరి వేసి భోజనం వడ్డించాడు...

తృప్తిగా ఆరగించాను...

మామూలుగా అయితే ఆఫీసు అనుమతి లేనిదే
ఎవరినీ లోపలకు రానివ్వరు...
భగవానే ఆ రూపంలో వచ్చి నాకు భోజనం పెట్టారు అనిపించింది...

ఇంతలోనే అనుకోకుండా తెలుగువారొకరు పరిచయమై, కొండమీదకు తీసుకెళ్లి స్కందాశ్రమం, విరూపాక్ష గుహ చూపించారు...

చార్జీల వరకు డబ్బులు ఉంచుకుని, మిగతా డబ్బులతో రమణసాహిత్యాలను కొనేశాను...

* * *

రమణానుగ్రహాన్ని పొందటానికి నేను చేసిన పూజలేమిటో, వ్రతాలేమిటో అని ఆలోచిస్తుంటాను అప్పుడప్పుడు.

ఒకవేళ అటువంటి పూజలు, పుణ్యాలూ చేయకపోయినా

గతజన్మలో ఆయన పాదాలక్రింద నలిగి చనిపోయిన ఏ పురుగునో...

లేక వారి చేతుల మీదుగా అరటిపండు తీసుకున్న ఏ కోతినో...

లేక వారి ఆశ్రమగేటు వద్ద నిలబడి కొంత కబళాన్ని పొందిన ఏ దీన భిక్షువునో...

లేక ఏ ఉడుతనో...
ఏ పామునో...
ఏ పులినో...

మొత్తానికి శ్రీరమణభగవానులతో బాంధవ్యాన్ని
ఈనాటి జీవితంలో సంపాదించుకున్నది మాత్రం కాదనిపిస్తుంది...

కచ్చితంగా గతజన్మలో భగవాన్ స్పర్శను పొందిన  జీవినని అనిపిస్తుంది...

భగవాన్ అన్నారు కదా  -
"నా అనుగ్రహం లేనివాడు నా పేరు ఎత్తలేడు." అని.

జన్మనిచ్చేవాడు - తండ్రి.
జన్మ లేకుండా చేసేవాడు  పరమ తండ్రి.
శ్రీరమణులు పరమతండ్రి.

* * *

ప్రపంచానికి హృదయం అరుణాచలం.
జ్ఞానానికి హృదయం అనిలాచలం.

అరుణాచలంలో -
సుబ్రహ్మణ్యుడు రమణుడుగా ఉన్నాడు.

అనిలాచలంలో -
రమణుడు సుబ్రహ్మణ్యుడుగా ఉన్నాడు.

* * *

శ్రీరమణ సన్నిధిలో ఉన్నంత కాంతి, శాంతి
సద్గురు సన్నిధిలోనూ నిండి ఉంటుంది.
* * *

## 46. కాలంలో కాలాతీతుడు

---

ఓ మహాసామ్రాజ్యానికి కేంద్రబిందువైన చక్రవర్తి
ఆరడుగుల శరీరమాత్రంగానే ఉన్నట్లు

గురువు అనంతమైన విశ్వానికి కేంద్రబిందువు.
అతడు అనంతవిశ్వానికి ప్రతీకగా ఉంటాడు.

వారి పాదాలు విష్ణుస్థానం.
విష్ణువనగా సర్వత్రా వ్యాపించి ఉన్న పరమతత్త్వం.

వారి పాదాలను స్పర్శిస్తే మొత్తపు విశ్వాన్ని స్పర్శించినట్లే.
అందుకే గురుపాదుకలకు అంత ప్రాధాన్యత లోకంలో.
* * *

అలాగే కాలవిషయంలో కూడా అంతే....
మనకు అతడు కాలంతో పాటు కదులుతున్నట్టే అనిపిస్తాడు...
కానీ కాలాతీతుడై ఉంటాడు.

యెవని యెదుట కాలమనే సర్పము
పుట్టి, పెరిగి, అంతమగుచున్నదో
అతడే సద్గురువు.

మా గురువు 1942 ఆగస్టు 24న పుట్టినారని గురుజయంతులు ప్రతియేటా శిష్యులు జరుపుతుంటే...
చిన్నపిల్లల ఆటల వలె సాక్షిగా ఉండి చూస్తుంటారు గురువుగారు.

అవుననరు...కాదనరు....

అవునంటే అంతరాత్మ నవ్వుతుంది.
కాదంటే శిష్యులకు నిరాశ మిగులుతుంది.

అందుకే-
అంతరంగలో ఆత్మనిష్ఠలో ఉంటారు...
బహిరంగలో ఆటగా ఉంటారు...

శిష్యులందరూ పూలమాలలు వేసి హారతులిస్తుంటే
తాను మాత్రం తానుగా ఉండక ఆ సమయంలో
ఆ స్థానంలో తన గురువుగా ఉంటారు...

తన పాదాలను తానే చేతులతో స్పృశించి
నమస్కరించి కళ్లకద్దుకుంటారు....

ఆ విచిత్రఘట్టం చూసి పరిణితి చెందనివారు విస్తుపోయి చూస్తుంటారు...

పరిణితి చెందిన కొందరు మాత్రమే ఆ విషయం గమనించి ...ఏకకాలంలో
గురువును, పరమగురువును దర్శించి  తన్మయులవుతుంటారు.

సద్గురు ఆశీర్వాదాల కొరకు భక్తులు వారి పాదాలకు నమస్కరించి లేచేలోపే
గురువుగారు వారికి నమస్కరించడం పూర్తయిపోయి ఉంటుంది.

గురువుగారికి స్పష్టంగా తెలుసు.....
తన వెనక ఉండి నమస్కారాలు స్వీకరించేవాడే
ఆశీస్సులు ఇచ్చేవాడు  కూడా వాడేనని.

కాబట్టి శిష్యులు చేసే యెటువంటి ఘనసన్మానానికైనా వారు చలించరు.

అక్బర్ లాంటి మూర్ఖులు వారిని నిందిస్తూ ఉత్తరం వ్రాసినా వారు
చలించలేదు...

ఈ రెండు ఘట్టాలనూ నేను ప్రత్యక్షంగా చూశాను...

వారు స్థితప్రజ్ఞులు....

* * *

"చూస్తారు" అంతే.
ఆ చూపు దృశ్యాన్ని చేరక, మధ్యలోనే
అనగా శూన్యంలోనే నిలిచిపోయి ఉంటుంది.

"ఉంటారు" అంతే.

ఇలా ఉండడం, ఇలా ఉండడం నేను యెన్నడూ చూడలేదు.

వారి నోటి నుండి వెలువడే చిన్ని చిన్ని మాటలే
తత్త్వపుష్టి కలిగి మనల్ని స్వస్థితికి తీసుకెళతాయి.

వారి "మాట" కంటే వారి మౌనమే చాలాసార్లు మాకు సమాధానమిచ్చింది.

* * *

వారి గంభీరత్వాన్ని చూసి సముద్రుడు కూడా సిగ్గుపడతాడు.

వారి నిశ్చలతత్త్వాన్ని చూసి ఆకాశం కూడా అబ్బురపడుతుంది.

వారి మౌనాన్ని చూసి దక్షిణామూర్తి కూడా ముచ్చటపడతాడు.

వారి జ్ఞానాన్ని చూసి వేదాలు కూడా
మూగబోతాయి.

* * *

ఇంతగా నేను గురువైభవాన్ని గుఱించి వ్రాస్తున్నానంటే
అది గురుసన్నిధి మహిమ వలన వచ్చిన శక్తియే తప్ప స్వంతంగా నాకా శక్తి ఉండి కాదు.

బంగారు ఆభరణాన్ని చుట్టి ఉన్న మెరుగు కాగితాన్ని నేను...

సుగంధద్రవ్యాన్ని నింపి ఉన్న గాజుసీసా నేను...

వారి వలననే నాకు కీర్తిగానీ
నా వలన వారికి కీర్తి కాదు.

కేవలం సద్గురు సాంగత్యం వలన-
ఏ లెక్కలూ వేయకనే
ఏ ప్రమాణాలూ లేకనే
ఏ ప్రయాణాలూ చేయకనే
ఏ సాధనలూ చేయకనే
జీవితం సఫలం అవుతుంది.

అలా సఫలత పొందింది ఈ అల్పుని జీవితం కూడా...

* * *

47. మన కులం - గురుకులం
మన మతం - సర్వసమ్మతం

---

ఏ కులజుడైననేమి ఎవ్వడైననేమి ఆకడ నాతడే
హరినెరిగినవాడు...

- అన్నమయ్య

* * *

మా గురువుగారి కులమేమిటో ఇప్పటికి ఎవ్వరికీ తెలియదు.
వారితో మొదట్నుంచి ఉన్నవారికి తప్ప.

వారికి అసలు నేను ఫలానా కులస్తుణ్ణి అనే స్పృహే ఉండదు...

కులసంఘాలవాళ్లు చందా కోసం వచ్చినప్పుడు అందరూ ఇచ్చేదానిమీద కాస్త ఎక్కువే ఇచ్చి పంపుతారు...కులసభలకు ఆహ్వానిస్తే వెళ్లరు.
సున్నితంగా, నవ్వుతూనే తిరస్కరిస్తారు.

* * *

గురువుగారు ఒకసారి నాతో ఇలా అన్నారు-

1.నేను ఫలానా కులస్తుణ్ణి అనేది పోవాలి.
2.నేను ఫలానా మతస్తుణ్ణి అనేది పోవాలి.
3.నేను స్త్రీని, నేను పురుషుణ్ణి అనేది కూడా పోవాలి... అన్నారు.

"ఉండటం" అనేది జ్ఞానస్వరూపం...
అదిగా ఉండడం ఇదిగా ఉండడం కాదు.

నేను వారి జీవితచరిత్రను క్లుప్తంగా పుస్తకాల్లో వ్రాసానేగాని, కులప్రస్తావన యెక్కడా తేలేదు.

కాలాతీతుడు, దేహాతీతుడైన వానిది ఏ కులమని వ్రాసేది?

కానీ ఒక గురుభక్తుడు మాత్రం అడిగాడు-
వారి చరిత్రలో కులం గురించి కూడా ప్రస్తావించి ఉంటే బాగుండేది అని.

"నేను అలా ఎప్పటికీ కులం గురించి ప్రస్తావించను...
అలా వ్రాయాల్సి వస్తే అసలు గురుచరిత్రే వ్రాయను." అని కరాఖండితంగా చెప్పాను అతనితో.

అడిగినవానిది ఆ కులమే...

ఫలానా మహనీయుడు మా కులస్తుడే అని పదిమందికి చెప్పుకుని గర్వంతో విర్రవీగే అవకాశాన్ని అతనికి ఇవ్వడం నాకిష్టం లేదు...

గురుతత్త్వం ఈ దేహాలకు, ఈ లోకాలకు అతీతమైనది...

అటువంటి ఉన్నతమైన తత్త్వాన్ని కులంలో మతంలో ఇరికించడం నాకిష్టం లేదు...

* * *

మన కులం - గురుకులం.
మన మతం - సర్వసమ్మతం.

* * *

కులవ్యవస్థను నేను సమర్థిస్తాను....
కానీ కుల దురభిమానానికి అవకాశం ఇవ్వను...

కులవృత్తి చేసుకుంటూ
కులాభిమానం ఉండొచ్చు...తప్పులేదు.
కులవృత్తి చేయకుండా కులాభిమానం ఉండడం
దురభిమానం.

కులం అనేది వృత్తి సౌలభ్యం.
మతం అనేది ప్రవృత్తి సౌలభ్యం.

* * *

ఓ మతవాది: ఇతర మతాలు బలం పుంజుకుంటున్నాయి...వారు బలవంతులై మిమ్మల్ని తమ మతాన్ని పుచ్చుకోమని బలవంతం చేస్తే ఏం చేస్తారు?

సద్గురు: తప్పకుండా వారి మతాన్నే పుచ్చుకుంటాను. నా దేవుడు శివా...! అన్నా పలుకుతాడు, అల్లా...! అన్నా పలుకుతాడు, యెహోవా...! అన్నా పలుకుతాడు.

"నా దేవుడు" సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడు...
నా దేవుడికి నేను ఏ మతంతో ఉన్నాననేది అవసరం లేదు...

(ఆ మతవాది అవాక్కయ్యాడు...ఏం చెప్పాలో తోచక లేచి వెళ్లిపోయాడు)

ఏ మతస్థుడికైనా సరే, ముందు తన మతం తనకు అర్థమై, అనుభవమైతే తరువాత ప్రపంచంలో తన మతస్థుడు కానివాడుగా ఎవడూ తనకు కనిపించడు.

* * *

మతస్థుడు ఒక్కడే ఉంటాడు.
ఆ మతం ఎవడి నుండి ఆవిష్కరింపబడిందో
అతడొక్కడే ఆ మతస్థుడు.

ఇంకొక్క వ్యక్తి కూడా దానిని అవలంబించలేడు.
కాబట్టి మతస్థు"లు" అని బహువచనం వాడడం సరికాదు.

గురువుగారు ఇంకా డీప్ గా వెళ్లి ఇంకో విషయం చెప్పారు -
ఆ మతానికి ఆద్యుడు అనేవాడు కూడా "అవలంబి" కాలేడు.
ప్రవక్తతో సంబంధం లేకుండా అతనిలో
ఆ మతం(ఆత్మస్థితి) కలుగుతుంది.

రమణతత్త్వం రమణునిదే.
బాబా తత్త్వం బాబాదే.

మరో రమణుడు రాలేదు.
మరో బాబా రాలేదు.

ప్రవక్తలో నుండే మతం పుట్టిందిగాని
మతంలో నుంచి ప్రవక్త పుట్టలేదు ఇప్పటివరకు.

* * *

శంకరులను పని గట్టుకుని హిందువును చేశారు.
అన్నారు గురువుగారు...

భారతీయులది సనాతనధర్మం.
"మతం" అనేది చాలా సంకుచితమైన పదం.

సనాతన ధర్మం ఓ సముద్రం.
అన్ని నదులనూ తనలో కలిపేసుకున్నట్లు
అన్ని మతాలనూ తనలో లీనం చేసేసుకుంటుంది.

సనాతనధర్మం యొక్క వయసును
తన వయసుగా చెప్పుకుంటోంది హిందూమతం.

శిల వయసును
తన వయసుగా శిల్పం చెప్పుకున్నట్లు.

* * *

సనాతనధర్మం చూపుడువ్రేలితో
దేవుణ్ణి చూపించింది.

హిందూమతం ఆ చూపుడువ్రేలునే
దేవుడిగా ఆరాధిస్తోంది.

* * *

సనాతనధర్మం అడవి లాంటిది.
మిగతా మతాలన్నీ తోటలు లాంటివి.

అడవిలో అన్ని రకాల చెట్లు ఉంటాయి.
తోటలో అన్నీ ఒకే రకం చెట్లు ఉంటాయి.

సనాతనధర్మంలో భావస్వేచ్ఛకు వీలుంది.
ఇతరమతాల్లో అది ఉండదు.

* * *

సనాతనధర్మం అనేది స్వయంగా ప్రాణవంతమైనది.
అది తనను తాను రక్షించుకోగలదు.

ఈరోజు ఉండి రేపు లేకుండా పోయేవాళ్లం మనం దానిని రక్షించడం ఏమిటి?

హిందూధర్మపరిరక్షణకు చేసే ప్రతి ప్రయత్నమూ
హిందూధర్మము యొక్క ఔన్నత్యాన్ని తగ్గించడమే అవుతుంది...అంటారు గురువుగారు.

* * *

ఏదో ఒక మతస్తుడుగా పుట్టడం అనేది సహజం.
అదే మతస్తుడుగా చనిపోవడం దురదృష్టకరం...
అంటారు వివేకానందులు.

అంటే మతం మారమని కాదు దాని అర్థం.
మతాతీతుడు కావాలన్నదే వారి హృదయం.

* * *

గురు ఆరాధన అంటే తత్త్వ ఆరాధనేగాని
వ్యక్తి ఆరాధనగా ఉండకూడదు.

గురువుకు ఇచ్చే  గౌరవం
గురుతత్త్వానికి ఇవ్వడం లేదు.

వారి పాదాలను పట్టుకుని నలిపేయడం
గురుసేవ కాదు...

ఓరోజు ఒకరు  గురుపాదాలను వొత్తుతుంటే తమాషాగా అన్నాను...

"గురువుగారికి ఫిజియోథెరపీ చేస్తున్నావా?" అని...
గురువుగారు నవ్వుకున్నారు.

నేను వారి పాదాలను తాకి నమస్కరించడం అనేది ఒక్కసారి కూడా చేయలేదు....

యెందుకంటే నా జీవితం మొత్తాన్ని వారి పాదాల వద్ద గడిపేస్తున్నవాణ్ణి....

సదా వారి స్మరణనే శ్వాసగా జీవిస్తున్నవాణ్ణి...
సదా వారి తత్త్వాన్నే అనుభవిస్తున్నవాణ్ణి...

ప్రత్యేకించి పాదాలను తాకి నమస్కరించడం అనేది నాకు అవసరం లేకుండాపోయింది.

* * *

'నా గురువు' వ్యాసాలు చదివి గురుదర్శనం కొరకు వచ్చేవారు గురువుగారి సాధారణత్వాన్ని చూచి కించిత్ ఆశ్చర్యపోవడం సహజమే.

వీరి గురించేనా  ఆ బాబుగాడు అంత గొప్పగా వర్ణించి చెప్పాడు....అనుకుంటారు.

వారి సన్నిధిలో కాసేపు గడపగానే, వారి దివ్యభాషణం కాస్త వినగానే.....

స్విచ్ ఆఫ్ చేసిన ఫ్యాన్ లాగా
ఆలోచనల కదలికలు ఆగిపోవడం మొదలవుతుంది...
మనసు శాంతిస్తుంది...
స్వస్థితి తేటతెల్లమౌతుంది...

ఆహా! బాబుగారు వ్రాసింది చాలా తక్కువ గురువుగారి గురించి....అనుకుంటారు.

నేను-నేను అన్న అహంశబ్ధం వినబడాలంటే
లౌకికవిషయశబ్ధజాలం ఉపసంహరింపబడాలి.
అదే జరుగుతుంది గురుసన్నిధిలో.

గురుసన్నిధిలో గడపడమే గొప్పసాధన.

* * *

ఈ దేహాన్ని గురించి ఎంత తక్కువగా ఆలోచిస్తే అంత మంచిది...అన్నారు వివేకానందులు.

గురుసేవ పేరుతో పిచ్చిపిచ్చి పనులు చేయకుండా,

ఆధ్యాత్మికం పేరుతో పిచ్చి పిచ్చి ప్రశ్నలు వేయకుండా

కళ్లు మూసుకుని ఓ కట్టెలా గురుసన్నిధిలో పడివుంటే చాలు...

త్రివిధ తాపాలను తొలగించి ముక్తిని ప్రసాదిస్తుంది ఆ సన్నిధి.

* * *

ఎవని సన్నిధిలో పరమశాంతి వెల్లివిరుస్తుందో
ఎవని సన్నిధిలో మరణభీతి తొలగుతుందో
ఎవని సన్నిధిలో అస్సలు ప్రశ్నే కలుగదో
ఎవని సన్నిధిలో కేవలం జ్ఞానులే కొలువై ఉంటారో
ఎవని సన్నిధిలో తర్కం మూగదవుతుందో
ఎవని సన్నిధిలో దేవతలు మోకరిల్లి ఉంటారో
ఎవని సన్నిధిలో శివుడు శిశువై ప్రాకుతుంటాడో
ఎవని సన్నిధిలో కాలం శిలలా నిలిచి ఉంటుందో
అతడే నా గురువు...నా దైవం...
* * *

## 48. అత్యాశ్రమి

---

వేదంలో చెప్పబడిన సృష్టిక్రమం ప్రకారం
మూలశక్తి ఐన ప్రకృతి యొక్క కంపన ద్వారా విశ్వసృష్టి మొదలవుతుంది.

ఈ విశ్వానికి ఉన్న శబ్ధప్రతీకే "ఓం".

ఉపాసనకు ఆలంబనగా ఒక ప్రతిమ ఉన్నట్టు
ఓంకారం పరమాత్మకు నాదపరమైన ప్రతీక.

ఉచ్ఛరించకుండానే లోపల వినిపించే నాదం ప్రణవం.

బాహ్య ప్రపంచంలోని ఆగిన నిశ్శబ్దంలో వినిపించే నాదం ప్రణవం.

నిరంతరం తనను తాను ప్రకటించుకునే నాదం ప్రణవం.

యోగికి మాత్రమే వినిపించే నాదం ప్రణవం.

ఓంకారం మనం సృష్టించేది కాదు.
నిత్యసిద్ధంగా నిరంతరము ఉన్నది ఓంకారమే.

ఆ నిరంతర నాదంతో అనుసంధానం చేస్తూ ఆ నాదాన్ని అందుకొని అందులో లయమై దానితో ఏకమై విశ్వలయలో లయం కావడానికే ఓంకార జపం.

* * *

సర్వగ్ం హ్యేతద్ బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ,
సో2యమాత్మా చతుష్పాత్|

నిజంగా సర్వమూ బ్రహ్మమే.
లోనున్న ఈ ఆత్మా బ్రహ్మమే.
ఆత్మకు పాదాలు నాలుగు.
అంటోంది మాండూక్యం.

ఆ నాలుగు పాదాలే....జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములు.

నాలుగుపాదాలు అంటే ఆవుకు నాలుగు పాదాలున్నట్లు కాదు....
రూపాయిలో నాలుగు పావలాలు ఉన్నట్లు....
నాల్గవ పావలా తురీయము.

పావలాలో మరో పావలా కలుస్తూ... చివరి పావలా కలిసినప్పుడే అది పరిపూర్ణవస్తువు అవుతుంది.
చివరి పావలా తురీయము.
చివరిపావలా కలిసాక ఉన్న పరిపూర్ణవస్తువే తురీయము.

నాల్గవ అవస్థ తురీయము అని పేరేగాని
నిజానికి అది అవస్థ కాదు,
చివరిపావలా కలిసాక ఉన్న సమగ్ర రూపము(రూపాయి) తురీయము.

ప్రణవం యొక్క నిశ్శబ్దరూపము - తురీయము.

తురీయానికి ఉండే మూడవస్థలే జాగ్రత్-స్వప్న-సుషుప్తులు అని చెప్పవచ్చు.

* * *

జాగ్రదవస్థలో ఉండే కర్త స్వప్నావస్థలో ఉండడు.
స్వప్నావస్థలో ఉండే కర్త సుషుప్తావస్థలో ఉండడు.

మూడవస్థల్లోనూ ముగ్గురు కర్తలున్నారు.
ముగ్గురు కర్తలకు మూడు పేర్లు పెట్టారు మన ఋషులు.

1.జాగ్రదవస్థలో ఉండే కర్త - వ్యష్టిగా వైశ్వానరుడు అని, సమిష్టిగా విరాట్ పురుషుడు అని పేర్లు.

2.స్వప్నావస్థలో ఉండే కర్త - వ్యష్టిగా తైజసుడుఅని, సమిష్టిగా హిరణ్యగర్భుడు అని పేర్లు.

3.సుషుప్తావస్థలో ఉండే కర్త - వ్యష్టిగా ప్రాజ్ఞుడు అని, సమిష్టిగా ఈశ్వరుడు అని పేర్లు.

* * *

ఈ ముగ్గురికీ సాక్షి ఒకడు ఉన్నాడు...
వాని పేరే - పరబ్రహ్మం.

ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తులే అకార-ఉకార-మకారములు.

ఈ మూడింటి సమిష్టియే - ఓంకారము(తురీయము)
అంశలు లేని ఓంకారమే తురీయము.

పరబ్రహ్మమే ఓంకారం.
ఓంకారమే తురీయం.
తురీయమే అత్యాశ్రమం.

* * *

గురువుగారు తురీయాన్ని "గాఢనిద్ర" పేరుతో వ్యవహరిస్తుంటారు.

గాఢనిద్ర అనేది సదా....

అందులో జాగ్రత్-స్వప్న-సుషుప్తులు అనేవి
వచ్చి పోతుంటాయి.....

ఈ మూడింట్లో ఒకటి అయిన సుషుప్తే....
మనం రోజూ పడుకుని అనుభవించే నిద్ర.
ఇది నిద్రలో నిద్ర అన్నమాట.

మొదటి నిద్ర - చైతన్యం.
రెండవ నిద్ర - జడం.

* * *

నిద్రలో నుంచి మేలుకొని,
ఆ మెలకువలో నుంచి మేలుకోవడమే
నిజమైన మెలకువ(తురీయము).

మొదటి మెలకువ - స్వప్నము.
రెండవ మెలకువ - తురీయము.

* * *

నిత్యమైనదే సత్యమైనది అనేది తిరుగులేని సిద్ధాంతం.
సత్యము, నిత్యము అనేవి పర్యాయ పదములు.

ఈ దృష్ట్యా తురీయానికి ఉన్న సత్యత్వము మిగతా మూడవస్థలకు లేదు.

అందులో రెండవస్థల్లో మాత్రమే గోచరించే ప్రపంచానికి అస్సలు సత్యత్వమే లేదు.

స్వప్నంలో కనబడే వస్తువులు ఎలా ఊహారూపాలో
మెలకువలో కనబడే వస్తువులు కూడా అలా ఊహారూపాలే.

స్వప్నంలో నుంచి మేలుకోవడం అంటే
ఒక స్వప్నంలో నుంచి మరొక స్వప్నంలోకి జారుకోవడమే.

రెండూ అనిత్యాలే.
రెండూ మిథ్యే.

ఇలా జీవాత్మలూ, వాటి అనుభవాలూ, ప్రపంచ వికారాలూ అన్నిటికి కూడా ఊహాశక్తే మూలకారణము.

ప్రాణులుగా, పంచభూతాలుగా, గుణాలుగా, ప్రపంచంగా, దేవతలుగా, దేశకాలాలుగా, మనోబుద్ధులుగా, పాపపుణ్యాలుగా...ఊహించేది ఆత్మే.

ఈ అద్వయమైన ఆత్మే భిన్న భిన్న దృశ్యాలతో ద్రష్టలతో ప్రపంచంగా భాసిస్తున్నది అని తెలుసుకున్నవాడే అత్యాశ్రమి.

అత్యాశ్రమికి ఎవరితోనూ ఏ విధమైన విరోధమూ లేదు.
ఎందుచేతనంటే అతనికి సర్వమూ ఆత్మే.

సఖ్యత పెట్టుకోవడానికిగాని, విరోధం పెట్టుకోవడానికిగాని వేరే వస్తువు అతనికి లేదు.

* * *

ప్రతిదానికీ కారణం వెతకడం అలవాటు మన బుద్ధికి.
ప్రపంచానికి కూడా కారణాన్ని వెతుకుతోంది.

ప్రపంచానికి కారణాన్ని వెతకడం అజ్ఞానం.
ప్రపంచం ఆత్మకభిన్నం అని తెలియడం జ్ఞానం.

సరే....ఏ కారణం వలన ఆత్మ తద్భిన్నమైన ప్రపంచంగా కనిపిస్తోంది? అన్నది చెప్పలేం.

ఈ చెప్పలేకపోవడాన్నే 'మాయ' అంటారు.

ప్రపంచాన్ని స్వప్నం అనీ, భ్రాంతి అనీ, ఆకాశపుష్పం అనీ ఉదాహరణలు చూపడం ఈ 'చెప్పలేని' స్వభావాన్ని సూచించడానికి, ఉన్నవస్తువును మరొక వస్తువుగా కన్పింపచేసే అజ్ఞానపుశక్తిని వత్తి చెప్పడానికేగాని, ప్రపంచం అస్సలు లేదని చెప్పడం ఆ ఉదాహరణల ఉద్దేశం కాదు.

మూలకారణం అనాది.
కారణమే కార్యంగా పరిణమిస్తోంది.
పరిణామం కలిగి కార్యం కూడా నిత్యమే.

ఉన్నవస్తువు పుట్టదు.
లేనివస్తువు కూడా పుట్టదు.
దీనికే అజాతవాదం అని పేరు.

ఆత్మ పుట్టదు, గిట్టదు.
కాబట్టి బంధమూ లేదు, మోక్షమూ లేదు.
అందువల్ల ముముక్షువూ లేడు, ముక్తుడూ లేడు.
సాధనా లేదు, సిద్ధీ లేదు.
దీనికే అజాతవాదం అని పేరు.

* * *

ప్రపంచంలోనే ఈ ద్వంద్వాలకు, త్రిపుటులకు ఉనికి.
ఇవన్నీ సాపేక్షకాలు...

ప్రపంచాతీత స్థితిలో ఇవేవీ లేవు.

ఆ 'కేవలస్థితి'లో సదా మనం ఉండడమే
మనకు శ్రేయస్కరం.
ఇవతలకు వస్తే అన్నీ చుట్టుకుంటాయి.

సదా ఆ 'కేవలస్థితి'లో ఉన్నవాడే అత్యాశ్రమి.

నిందలకు క్రుంగని, స్తుతులకు పొంగని అతీతుడు అతడు.

శరీరపోషణకై, కుటుంబ నిర్వహణకై, సంఘ నియమాలను
అనుసరిస్తూ...యాదృచ్ఛికంగా ఏది లభిస్తే దానితో తృప్తిపడేవాడు
అత్యాశ్రమి.

నిజానికి అత్యాశ్రమి యొక్క నిజమైన ఆనందం
తనతో సహా సర్వాన్ని తనలోనే చేర్చుకున్న ఆత్మలోనే.

* * *

ఆకాశంలో సూర్యచంద్రులు, గ్రహాలు, నక్షత్రాలుగా విభాగాలు
కనబడుతున్నప్పటికీ ఆకాశానికి ఏ మార్పూ లేనట్టే...

ఆత్మలో ద్రష్ట-దృశ్యము అని విభాగాలు ఉన్నప్పటికీ కూడా ఆత్మ
అమలినంగానే ఉంటుంది.

ఘటాకాశం మహాకాశం కంటే ఎలా భిన్నం కాదో
జీవాత్మ కూడా పరమాత్మ కంటే భిన్నం కాదు.

ఘటాకాశాన్ని మహాకాశం యొక్క భాగమనిగాని, అందులోంచి ఇది
పుట్టిందనిగాని ఎలా అయితే భావించమో

అలాగే జీవాత్మ కూడా పరమాత్మ యొక్క భాగం కాని, సృష్టి కాని కాదు.

లేని విషయాల్ని ఊహించేది మనస్సే.
ఊహించడం మానేసిన మనస్సే ఆత్మ.

ఊహించడం మానేసిన మనస్సుగా ఉన్న స్థితులే...1.గాఢనిద్రాస్థితి
2.సమాధిస్థితి.
ఈ రెండూ అద్వైతస్థితులు.

వస్తుతః ఆత్మా మనస్సూ ఒకటే.
జ్ఞాతా జ్ఞేయమూ ఒకటే.
"ఆత్మ కేవలము". అంతే.

* * *

గాఢనిద్రలోనూ, సమాధిలోనూ
విషయప్రపంచం ఉండదు.
అంతమాత్రం చేత అవి రెండు ఒకటి కావు.

రెండూ ఒక్కలాగే అనిపిస్తాయి అంతే.

గాఢనిద్రలో మనసు ఉపసంహరింపబడి(అణగి) ఉంటుంది....స్ప్రింగు వలె.

నిద్ర నుంచి మేలుకోగానే తిరిగి ఆ అజ్ఞాన పిశాచి పట్టుకుంటుంది.

సమాధిలో అలా కాదు.... మనసు ఆత్మలో ఐక్యం అయి ఉంటుంది.
అతనికి జాగ్రత్-స్వప్న-సుషుప్తి మూడవస్థల్లోనూ ఆ ఐక్యతానుభవం
కొనసాగుతుంటుంది...కాబట్టి అతనిని అజ్ఞాన పిశాచి ఆవహించే ప్రశ్నే
లేదు.

అతడు కళ్లు మూసినా సమాధే....కళ్లు తెరచినా సమాధే....

అతడు నడిచే సమాధి.....అతడే అత్యాశ్రమి.
అతడికి ఏ విధి-నిషేధములు లేవు.

అజ్ఞాని మనసును అణచాలని చూస్తాడు.
అత్యాశ్రమి బ్రహ్మమే మనసని ఉంటాడు.

అజ్ఞాని ప్రయత్నం చేస్తూనే ఉంటాడు.
అత్యాశ్రమి అప్రయత్నంగా ఉంటాడు.

* * *

సూర్యుడే సూర్యకాంతి.
రెండూ అభిన్నం.
అంతేగాని సూర్యుడు సూర్యకాంతిని సృష్టించలేదు.

భగవంతుడే ప్రపంచం.
రెండూ అభిన్నం.
అంతేగాని భగవంతుడు ప్రపంచాన్ని సృష్టించలేదు.

ఆలోచనాస్థాయిలో మనం ఉన్నంతవరకు
దేశకాలానిమిత్తాల పరిధిని దాటిపోలేం.
మనం చూస్తున్న ప్రపంచానికి కారణాన్ని అది అడుగుతూనే ఉంటుంది.

ఎన్ని రకాల సమాధానాలు ఇచ్చినా మనసు సమాధానపడదు.

"ఉన్నది భగవంతుడు మాత్రమే"
అనే ఏకాత్మనిష్ఠలో ఉండడం ఒక్కటే ఈ సృష్టివికారమనే రోగానికి
పరమౌషధం.

ప్రపంచాన్ని ప్రపంచంగా చూడడం మిథ్య.
ప్రపంచాన్ని భగవంతునిగా చూడడం సత్యం.

ప్రపంచం అనేది మన కల్పనలో తప్ప ఎక్కడా లేదు.

బంగారం అనేది సత్యం.
ఆభరణాలు అనేవి మన కల్పన.

ప్రపంచం మిథ్యా కాదు, భ్రమా కాదు, అసత్యమూ కాదు.

ప్రపంచాన్ని ప్రపంచంగా గుర్తించినప్పుడు మాత్రమే ప్రపంచాన్ని  మిధ్య,
భ్రమ, అసత్యం అన్నారేగాని...
దీనికి కారణాన్ని(సృష్టికర్తను) చెప్పాల్సివస్తోందిగాని...

భగవంతుడే ప్రపంచం అనే అపరోక్షానుభూతిలో
సృష్టీలేదు, సృష్టికర్తా లేడు, "ఎందుకు" అన్న ప్రశ్న అసలే లేదు.

"భగవంతుడు మాత్రమే ఉన్నాడు" కాబట్టి
ప్రపంచానికీ ఆయనకూ ఏమి సంబంధమన్న ప్రశ్నకు అర్థమే లేదు.

* * *

క్రింది పక్షి పై పక్షిని చేరుకునేవరకు చేయవలసిన ప్రయత్నమే ఉపాసన.

అందుకు ఆలంబనగా భగవత్ రూపం అవసరమే.
భగవంతుడు అంటే మొత్తం.
భగవంతునికి "ఓం"కారమే సరియైన నామం.
భగవంతుడు అన్నా ఓం అన్నా సమిష్టికి చిహ్నాలే.

* * *

యెండమావుల్లో నీరుండదు అని తెలిసాక కూడా నీరు కనబడుతున్నట్లు.

సత్యసాక్షాత్కారం కలిగాక కూడా ప్రపంచం అదృశ్యం అయిపోదు. అలానే ఉంటుంది.

ఐతే అది సత్యమని భావించం.
ఆసక్తి ఉంచుకోం.
ఆసక్తి లేకుంటే బంధం కలుగదు.
బంధం లేకుంటే అదే మోక్షం.

ఇదొక్కటే సత్యసాక్షాత్కారం యొక్క ఏకైక ఫలితం.

* * *

ఆసక్తే - బంధం.
నిరాసక్తే - మోక్షం.

నిరాసక్తి ఉన్నవాడు  మెలకువలో ఉన్నట్టు కనబడుతున్నప్పటికీ, అతడు గాఢనిద్రలో ఉన్నట్టే లెక్క.

మన గురువుగారు చెప్పింది ఇలాంటి గాఢనిద్ర గురించేగాని, మనం పరుపు మీద పడుకుని గురకపుడుతూ ఉండే నిద్ర గురించి కాదు చెప్పింది.

ఎరుకతో కూడిన నిద్రయే - నిజమైన మెలకువ.
ఆసక్తిలేని మెలకువే - గాఢనిద్ర(నిజమైన మెలకువ.)

సదా మెలకువే అత్యాశ్రమి లక్షణం.

* * *

అత్యాశ్రమి-

అవసరమైతే శాస్త్రాన్ని అతిక్రమించగలడు.
అవసరమైతే శాస్త్రాన్ని సృష్టించగలడు.

* * *

అత్యాశ్రమి-

నిత్య దిగంబరుడు.
అది కంటికి కనబడని దిగంబరత్వం.

* * *

అత్యాశ్రమి-
అతనికి బడీ లేదు, గుడీ లేదు, మడీ లేదు.
అతనికి అదీ లేదు, ఇదీ లేదు, ఏదీ లేదు.

* * *

అత్యాశ్రమి-

జగత్తుకు ఆధారం.
మౌనానికి ఘనరూపం.
శాంతికి శాశ్వత చిరునామా.
జ్ఞానానికి సంకేతం.
మోక్షానికి మహాద్వారం.

* * *

అత్యాశ్రమి-

సప్తవ్యసనాలు అతనికి కీర్తిప్రతిష్టలు పెరగనీకుండా రక్షణగా ఉంటాయి.
అతని "ఏకాంతాన్ని" భంగపరచకుండా  జాగ్రత్తపడతాయి.

* * *

అత్యాశ్రమి-

అతని ధూమపానం నిత్యాగ్నిహోత్రం.
అతని సురాపానం జ్ఞానయజ్ఞానికి ఆజ్యం.

అతని స్త్రీలోలత్వం మాయతో కేళీవిలాసం.

* * *

అత్యాశ్రమి-

అతని మౌనం దివ్యప్రబంధం.
అతని భాషణం ఉపనిషత్సారం.
అతని పాదస్పర్శ భూమాతకు పులకాంకురం.
అతని శ్వాసక్రియ వాయుదేవునికి సన్మానం.
అతని చూపు అగ్నిదేవునికి అనుగ్రహప్రసారం.

* * *

అత్యాశ్రమి-

రూపు దాల్చిన జ్ఞానం.
రూపు దాల్చిన ఓంకారం.
రూపు దాల్చిన అహంస్వరూపం.

* * *

అత్యాశ్రమి-

దేవతలకు దేవుడు.
రాక్షసులకు మిత్రుడు.
మానవులకు ఆప్తుడు.

* * *

అత్యాశ్రమి-

అతనిలో భూమి ఝుమ్మని తిరిగే భ్రమరం.
అతనిలో సముద్రం గోష్పాదం.
అతనిలో సూర్యుడు మిణుగురు పురుగు.
అతనిలో వాయువు అటు ఇటు తిరిగే తులవబాలుడు.
అతనిలో ఆకాశం తన సృష్టి విలాసానికి అవకాశం.

* * *

అత్యాశ్రమి-

చిక్కడు, దొరకడు.
కదలడు, వదలడు.

విధి,నిషేధాలకు అతడు అతీతుడు.
అతడే నా గురువు....

* * *

49. మహావాక్యం

---

మొత్తం నాలుగు వేదాల్లో నాలుగు మహావాక్యాలు మాత్రమే ఉన్నాయి.....

కానీ సద్గురువు బోధనల్లో అటువంటి మహావాక్యాలు కోకొల్లలు.

అందులో ఏ ఒక్క వాక్యాన్ని తీసుకొని ఉపాసన చేసినా
ఆత్మానుభవం కలగడం తథ్యం.

అటువంటి మహావాక్యాలలో ఒకటి -

"నాతో సహా సర్వమూ నాలో ఉన్నట్లున్నది"

* * *

"ఉన్నట్లున్నది" అనగా ఉన్నట్టు కనిపించే లేనిది.
అనగా ఎడారిలో యెండమావి వలె.
త్రాడులో పాము వలె.

ఉన్నది, ఉన్నట్లున్నది రెండూ ఒకే బిందువులో ఉన్నాయి.

నీ దృష్టిని ఏ వైపు మళ్లిస్తే
నీవు అదిగా మారుకునే వెసులుబాటుతనం మన మనసుకు ఉంది.

"ఉన్నది"కి, "ఉన్నట్లున్నది"కి మధ్య గీత మనసు.
అనగా చైతన్యానికి, ప్రపంచానికి మధ్య గీత మనసు.
రెంటి స్పర్శా ఉంటుంది మనసుకు.

అందువలన ఎన్నిక తన ఇచ్ఛ ప్రకారమే ఉంటుంది కాబట్టి

ప్రపంచదృష్టి కలిగి, వ్యవహారంలో మునిగి ఉంటే
కర్మబంధం ఉంటుంది.

ప్రపంచదృష్టి మాని చైతన్యం వైపుకు దృష్టి మరలిస్తే
కర్మబంధం తొలగుతుంది.

* * *

"నాతో సహా సర్వమూ ఉన్నట్లున్నది".

ఈ మహావాక్యాన్ని గురువుగారు తరచూ వాడుతుంటారు.

శిష్యులు యథార్థస్థితి నుండి జారిపోతున్నప్పుడల్లా
ఈ మహావాక్యాన్ని గుర్తుచేసి, తిరిగి స్వస్థితిలో స్థాపిస్తుంటారు.

శిష్యులు ఇతరుల గురించి, ఇతరాన్ని గురించి వాపోతున్నప్పుడల్లా.....

అంతమంది యెక్కణ్ణుంచి వచ్చారు?
ఉండేది నీవొక్కడివే....మిగతా అంతా....నీతో సహా నీవు కనే కలే...
నిన్ను విడిచి దేనికీ ఉనికి లేదు...

అని బోధిస్తూ మొత్తం వ్యవహారాన్ని "నేను" వైపుకు మళ్లిస్తారు....

"నేనే కేంద్రం" అనిపిస్తారు....

* * *

నేను - ఉన్నది.
నాలో ఉన్నదంతా - ఉన్నట్లున్నది.

బంగారం - ఉన్నది.
ఆభరణం - ఉన్నట్లున్నది.

ఆధారవస్త్రము - ఉన్నది.
నామరూపచిత్రములు - ఉన్నట్లున్నది.

* * *

యెడారిలో యెండమావి కనబడుతుంది.
దగ్గరకు వెళ్లి చూస్తే జల కనబడదు.

అలా స్వానుభవంగా తెలుసుకొని
యెండమావి వైపుకు పరుగులు మానడం ఎంతో

అనుభవజ్ఞుడు(గురువు) చెప్పే-
"అక్కడ జల లేదు" అనే మాటపై నమ్మకంతో పరుగులు మానడం కూడా అంతే.

అలా కాదు మేం స్వయంగా పరుగులు పెట్టి జల లేదనే విషయాన్ని తెలుసుకుంటాం... అంటే, గురువు కాదనరు.

ప్రయత్నం - కర్మయోగం.
నమ్మకం - భక్తియోగం.
అనుభవం - జ్ఞానయోగం.

* * *

దేవుడు - ఉన్నది.
జీవుడు - ఉన్నట్లున్నది.
అనగా దేవుడే జీవుడుగా ఉన్నట్లున్నాడు.

గురువు - ఉన్నది.
శిష్యుడు - ఉన్నట్లున్నది.
అనగా గురువే శిష్యుడుగా ఉన్నట్లున్నాడు.

"నేను" - ఉన్నది.
"నాది" - ఉన్నట్లున్నది.
అనగా నేనే సకలంగా ఉన్నట్లున్నది.

* * *

చిదాకాశమనే స్వచ్ఛమైన బ్లాక్ బోర్డు మీద వ్రాయబడిన(వ్యక్తం కాబడిన) వ్రాతలే ఈ ప్రపంచం.

"ఉన్నట్లున్నది" అనే డస్టర్ ను చేతబూని మొత్తాన్ని తుడిచేయి....
తర్వాత మిగిలి ఉన్నదేదో అదే సద్వస్తువు.

నేతి-నేతి ఇదికాదు-ఇదికాదు అంటూ త్రోసివేయమని ఋషులు చెప్పడం ఉద్దేశం కూడా ఇదే.

చెత్తను పారవేసి చెత్తబుట్టను తెచ్చుకుంటాం....
కానీ చెత్తబుట్టను కూడా పారవేయాలి.

ఆ చెత్తబుట్ట తానే(వ్యక్తే)

తననే మొదటి చెత్తగా గుర్తిసే చాలు...
శుద్ధాత్మ అనుభవంలోకి వస్తుంది.

"నేనిది కాదు" అని తెలిస్తే చాలు....
ఉన్నది ఏదో అది స్వరూపంగా శేషిస్తుంది.

* * *

## 50. అనుష్ఠాన వేదాంతం

---

ఆధ్యాత్మిక బోధకుల వద్ద తరచుగా ఈ క్రింది మాటలు వింటూ ఉంటాం...

ఉత్త మాటలు వలన లాభం లేదు...ఆచరణ ఉండాలి...

ఉత్త గ్రంథాలు చదవడం వలన ప్రయోజనం లేదు....
ఆచరణ ముఖ్యం...

ఉత్త గురుబోధలు వినటం వలన ఒరిగేదేమీ లేదు....
ఆచరణ ప్రధానం....

కావలసింది వాచా వేదాంతం కాదు....అనుష్ఠాన వేదాంతం...అని.

ఇలా చెప్పేవారందరూ బాధ్యతను బోధిస్తున్నట్టు కనబడే బాధ్యతారహిత గురువులే....

ఒక గురువు శిష్యుడికి మంత్రోపదేశం చేసి,
మంత్రాన్ని ధ్యానించేటప్పుడు కోతిని గుర్తుకు తెచ్చుకోవద్దన్నాడట...

నువ్వు కోతి గుఱించి ప్రత్యేకంగా చెప్పకుంటే, వాడికసలు కోతి గుర్తుకొచ్చే ఛాన్సే లేదు....

గుర్తుకు రావాలనే చెప్పాడు ఆ గురువు....

యెందుకలా?

శిష్యుడు సాధనలో పురోగతి చెందకుంటే తన మీద కేసు రాకుండా తెలివిగా తప్పించుకునేందుకు గురువు పన్నిన పన్నాగం అది.

శిష్యుడికి సరియైన అవగాహన కలిగించకుండా....
ఆచరణ ముఖ్యం అని చెప్పడం కూడా అంతే.

అవగాహన కలిగిస్తే....ఆచరణ యొక్క అవసరం రానే రాదు.

ఆధ్యాత్మికం అనేది పూర్తిగా అవగాహన విషయమే...
ఆచరణకు సంబంధించినది కానేకాదు.

* * *

ఆచరించడానికి వీలైనది - ఆచారం(ధర్మం)
ఆచరించడానికి వీలుకానిది - ఆధ్యాత్మికం(సత్యం)

* * *

ఆచరణ బాహ్య విషయం.
అవగాహన ఆంతర విషయం.

ధర్మాన్ని కేవలం తెలుసుకుంటే చాలదు...ఆచరించాలి.

సత్యాన్ని కేవలం తెలుసుకుంటే చాలు...అనుభవించవచ్చు.

ధర్మానికి, సత్యానికి తేడా ఇదే.....

* * *

అనుష్ఠాన వేదాంతం....అనే మాటే తప్పు....
అనుష్ఠించడానికి ఏమీ ఉండదు అందులో....

ధర్మాన్ని అనుష్ఠించగలం...."ధర్మానుష్ఠానం" అనే మాట సరి.

"అనుష్ఠానవేదాంతం" అనేమాట సరికాదు.

ఆధ్యాత్మికం అనేది కేవలం అవగాహన చేసుకోవాల్సిన విషయం...అంతే.

తల్లిదండ్రుల యెడల పుత్రుడు యెలా ఉండాలో
భర్త యెడల భార్య యెలా ఉండాలో

చెప్పేది ధర్మం....ఇది ఆచరణాత్మకం.

ఉన్నదానిని ఉన్నది అని చెప్పేది ఆధ్యాత్మికం.
ఇది అప్పటికప్పటికే అనుభవంలోకి వచ్చే విషయం.

* * *

"నీవిలా ఉండు" అని చెబుతుంది ధర్మం.
"నీవెలా ఉన్నావో" చెబుతుంది ఆధ్యాత్మికం.

కాబట్టి కర్తవ్య బోధ చేసే ప్రతీది ధర్మం.

ఏ కర్తవ్యమూ లేని ఏకాత్ముడవు నీవు అని చెప్పే ప్రతీది ఆధ్యాత్మికం.

ధర్మం బాహ్యవిషయం.
సత్యం ఆంతర విషయం.

బాహ్యంలో యెంత వెతకినా సత్యం కానరాదు.
ఆంతరంలో ఆత్మనిష్ఠకు తప్ప ధర్మనిష్ఠకు చోటులేదు.

నీతి(ధర్మం) అనేది పరమం(ultimate) కాదు,
అది పరమపదాన్ని చేర్చే ఓ సాధనం మాత్రమే.

* * *

16 ఏళ్ల తిరుచ్చిళి వేంకటేశ్వరశర్మకు
ధర్మం అంటే ఏంటో తెలియదు, సత్యం అంటే ఏంటో తెలియదు.
కానీ ఆత్మ అతణ్ణి ఆవహించి మనిషిని ఋషిగా మార్చివేసింది.

అతని ప్రతి నడకా ధర్మమయ్యింది.
అతని ప్రతి పలుకూ సత్యమయ్యింది.

భూలోకంలో భగవంతునికి చిరునామాగా మారి
ఆ బాలుడు "భగవాన్" అయ్యాడు.

ధర్మమూర్తి - రాముడు.
సత్యమూర్తి - రమణుడు.

ధర్మాన్ని మనమై ఆవహించాలి.
సత్యమే మనల్ని ఆవహిస్తుంది.

* * *

ధర్మంలో సత్యం, సత్యంలో ధర్మం ఉండదని కాదు.
అవి రెండూ ఒకే వస్తువు.

సత్యం యొక్క బాహ్యారూపం ధర్మం.
ధర్మం యొక్క ఆంతరరూపం సత్యం.

ధర్మం చలిస్తుంటుంది...చరిస్తుంటుంది....
సత్యం అచలంగా ఉంటుంది.

ధర్మం - మార్గం.
సత్యం - గమ్యం.

* * *

"నేను బాబు" అన్నదాంట్లో -

బాబు అనేది - ధర్మం.
నేను అనేది - సత్యం.

* * *

జ్ఞానశిశువు
9533667918

51. సరాసరి

________

"వాడికేం... సుఖపురుషుడు...
నాకున్న కష్టాలు అన్నీ ఇన్నీ కావు..."

"దేవుడు నన్ను చిన్న చూపు చూశాడు..."

"పగవాడికి కూడా వద్దురా బాబూ ఈ కష్టాలు...!"

ఇలాంటి మాటలు మనం తరచూ వింటూ ఉంటాం.

అంటే దాని అర్థం- మిగతావారి కంటే తనకే కష్టాలు ఎక్కువగా పెట్టాడు దేవుడు...అని.

నిజానికి అలాంటి పక్షపాతం ఏమీలేదు దేవుడికి.

* * *

అన్ని విషయాల్లో కాకపోయినా, కొన్ని విషయాల్లోనైనా స్వేచ్ఛగా కర్మలు చేయగలిగే వెసులుబాటు ఉంది మనిషికి.
అన్నింటినీ "భగవదిచ్ఛ" అని వదిలేయడం పలాయనవాదం అవుతుంది.

దుష్టజంతువు వెంటబడింది...పరుగెత్తి చెట్టు ఎక్కగలిగే శక్తీ తనకు ఉంది... ఎక్కు....

ఎక్కాక ఆ తర్వాత ఎటూ పోలేని పరిస్థితి...
ఇక ఏమీ చేయలేని దుస్థితి...
అప్పుడు మాత్రమే "భగవదిచ్ఛ" అనాలి.

ఏ ప్రయత్నమూ చేయక, భగవదిచ్ఛ...అనడం
అది సోమరి లక్షణం....
అది పనికిమాలిన వైరాగ్యం...

* * *

అటువంటి స్వేచ్ఛాయుత కర్మలను
ధర్మానికి ముడిపెట్టి చేయడం అనేదే
మోక్షానికి ముఖ్య సాధనగా చెప్పాయి శాస్త్రాలు.

ధర్మం అంటే-
తాను ఇతరులతో మనసా-వాచా-కర్మణా
ఇబ్బంది కలిగించని వ్యవహారాన్ని కలిగి ఉండటం.

ఒకరికి ఇవ్వడం అంటే, తనకు తాను ఇచ్చుకోవడమే...అనే అద్భుతమైన విషయాన్ని కనిపెట్టారు ఋషులు.

దానినే "త్యాగం" అన్నారు...

త్యాగేనైక అమృతత్వ మానశుః
త్యాగం ఒక్కదాని వల్ల మాత్రమే అమృతత్వం లభిస్తుంది అన్నది ఉపనిషత్తు.

మానవులందరినీ కలిపి ఒకే మానవుడుగా(ఒకే శరీరంగా) అనుభూతి చెందినప్పుడు మాత్రమే ఈ త్యాగబుద్ధి అత్యంత సహజంగా కలుగుతుంది.

* * *

రైతు తన పొలంలో విత్తనాలను వెదజల్లినప్పుడు
అతడు విత్తనాలను నేలపాలు చేశాడని అనగలమా?
నూరురెట్ల ఫలాన్ని అతడు తిరిగి పొందగలడు.

నదులు సముద్రంలో కలిసి నిరుపయోగం అవుతున్నాయని అనగలమా?

అవి ఆవిరై మేఘమై మన పంటలపై వర్షంగా కురుస్తోంది.

కాబట్టి "ఇవ్వడం అంటే పొందటం" అనే సూత్రాన్ని బాగా అర్థమయ్యేట్టు పిల్లలకు నీతి కథలుగా చెప్పాలి.

* * *

కర్మఫలం కర్మ చేసినవానికి మాత్రమే చెందదు.
ఆ ఫలం ప్రపంచంలో ఉన్నవారందరికీ
సరాసరిన పంచబడుతుంది...అంటారు గురువుగారు.
వానచుక్క సముద్రంలో పడి సముద్రవ్యాప్తమైనట్టుగా...

* * *

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వకర్మణి

శాస్త్ర విహిత కర్తవ్య కర్మను చేయటం వరకే నీకు అధికారం. ఆ కర్మ ఫలముల పైన నీకు హక్కు లేదు...అంటే,

ఆ కర్మఫలం నీ ఒక్కడి సొత్తు కాదు, అది సరాసరిన అందరికీ పంచబడుతుంది...అని అర్థం.
ఆ పంపకంలో నీవొక భాగస్వామివి మాత్రమే.

* * *

కంటిలో కలక పడినా,
కాలికి ముల్లు గుచ్చుకున్నా
శరీరం మొత్తం బాధకు గురి అవుతుంది.

అలాగే ఏదైనా మధుర పదార్థం నాలుక మీద వేసుకున్నప్పుడు శరీరమంతా సుఖానుభూతిని పొందుతుంది.

అలాగే కుటుంబంలో...
ఒకడు మరణిస్తే, ఆ కుటుంబం అంతా దుఃఖం అనుభవిస్తుంది.
లేదా ఒకడికి ఉద్యోగం వస్తే, ఆ కుటుంబమంతా ఆనందం పొందుతుంది.

అలాగే గ్రామం, దేశం, విశ్వాంతరాళం...

విశ్వాంతరాళంలోని మనకు తెలిసిన, తెలియని సమస్త చరాచరజీవుల సుఖానుభవం లేక దుఃఖానుభవం ప్రతి జీవి చేత సరాసరి లెక్కన అనుభవింపబడుతుంది.

అందువల్ల తేలిందేమంటే-
నీ సుఖదుఃఖాలు నీ ఒక్కని స్థితిపై ఆధారపడిలేదు. జగత్తు యొక్క మొత్తపు సుఖదుఃఖాల మీద ఆధారపడి ఉంది.

ఒక ధనికుడైనా, ఒక దరిద్రుడైనా
వారికి అనుభవంలోకి వచ్చేది కేవలం విశ్వంలోని సరాసరి సుఖదుఃఖాలే.

ఇతరుల దృష్టిలో
ఒకడు బెంజికారులో తిరగొచ్చు...
మరొకడు గంజికూడు తిని బ్రతకొచ్చు...
అనుభవంలో మాత్రం సరాసరి సుఖమే, సరాసరి దుఃఖమే కలిగేది.
అంతకు మించి వచ్చేది కల్ల.

నాకు అన్నీ ఉన్నాయి...కానీ మనశ్శాంతి లేదు...
అంటాడు బెంజికారులో తిరిగేవాడు.

రేపటి గుఱించి ఏ మాత్రం ఆలోచన లేకుండా
ఏ రోజు కథను ఆరోజు తృప్తిగా అనుభవిస్తాడు గంజి త్రాగేవాడు.

కారణం ప్రకృతిలోని ఈ సరాసరి లెక్కయే.

* * *

సరాసరి అనుభవిస్తున్నాడని
అందరికి ప్రకటన ఒకే విధంగా ఉండదు.

ప్రకటన పలువిధాలుగా ఉన్నప్పటికీ సుఖదుఃఖానుభవాల్ని సరాసరి లెక్కనే అనుభవిస్తుంటారు.

ఒక లోభికి ఒక్కరూపాయి నష్టం,
ఒక ఉదారుడికి కోటిరూపాయిల నష్టంతో సమానం.

ఉదారుడు కోటిరూపాయిల నష్టాన్ని అనుభవించే అనుభవం
లోభి ఒక్కరూపాయి నష్టంలోనే అనుభవిస్తాడు.

కాబట్టి ఇవన్నీ ఇతరుల దృష్టిలో నుంచి చెప్పబడిన మాటలే.
స్వానుభవంలో సరాసరియే అనుభవంలో ఉంటుంది.

కాబట్టి పైకి కనబడే దృశ్యంలో తేడాలున్నట్టు కనబడుతుంది.
వారు లోపల అనుభవించేది మాత్రం సరాసరి సుఖదుఃఖానుభవాన్నే.

మీరిప్పుడు అనుభవించే సుఖం సరాసరి సుఖమే.

మీరిప్పుడు అనుభవించే దుఃఖం సరాసరి దుఃఖమే.

* * *

లోకా సమస్తాన్ సుఖినోభవంతు సమస్త సన్మంగళానిభవంతు...అన్న ఋషుల వాక్కులోగానీ,

నీ వలె నీ పొరుగువారిని ప్రేమించు...అన్న క్రీస్తు వాక్కులోగాని అంతరార్థమిదే.

నీ కొఱకు, నీ శాంతి కొఱకు, నీ సుఖం కొఱకు, నీ క్షేమం కొఱకు...
నీ అవసరం కాబట్టి విశ్వశాంతి, విశ్వసుఖం, విశ్వక్షేమం కోరమన్నారేగాని, విశ్వం కొఱకు కాదు.

నీ శాంతి పైన విశ్వశాంతి ఆధారపడి ఉండలేదు.
విశ్వశాంతిపైన నీ శాంతి ఆధారపడి ఉంది.

ఇందుకు ఏం చేయాలన్నది నిర్ణయించుకోవలసింది నీవే.
నీ పరిమితులను బట్టి
నీ శక్తి సామర్థ్యాలను బట్టి
నీ అవకాశాలను బట్టి

నీ శాంతిని పెంపొందించుకోవడానికిగాను
విశ్వశాంతికి నీవు తోడ్పడాలి...
వేఱే మార్గమే లేదు...

అవసరం నీది...ఏం చేస్తాం...?

* * *

52. మౌనం నిశ్శబ్ధాన్ని పలకరించిన వేళ...

---

వేల్లూర్ లో ఓ వైరాగ్యమూర్తి అన్నీ వొదిలి
గోచీ పెట్టారు...మౌనం పట్టారు ...రమణుల వలె.

రమణులను ప్రత్యక్షంగా దర్శించుకోలేకపోయామే అన్న అసంతృప్తితో ఉన్న ఈ ఆధునిక ప్రజలు, ఆర్తులు, జిజ్ఞాసువులు స్వామివారి దివ్యరూపాన్ని, వారి నిశ్శబ్ధ భాషణాన్ని తమ ఆధ్యాత్మిక సాధనకు ఓ ఆలంబనగా మలచుకున్నారు.

"వేల్పూరుస్వామి" అనే పేరుతో ఉత్తరాంధ్ర జిల్లాలలో బాగా ప్రాచుర్యం పొందారు.

స్వామి వారి ప్రధాన సేవకులైన రామకృష్ణయ్యగారు.... మా గురువును శిష్యులతో సహా వేల్పూరు ఆశ్రమానికి ఆహ్వానించారు...

ఎక్కడికీ ఓ పట్టాన కదలని మా గురువుగారు యెందుకో ఆ ఆహ్వానాన్ని మన్నించారు...

2021 సంవత్సరం మార్చి నెల 27, 28, 29 మూడురోజులు ఆ రమణనిలయాశ్రమంలో వారికి అతిథులుగా గడిపాం.

తొలిరోజు ఉదయాన్నే 6 గంటలకు ఆ ఆశ్రమానికి కేంద్రబిందువైన "వేల్పూరు స్వామి"ని దర్శించుకున్నాం.

ఆ గురువులిద్దరూ
నమస్కార, ప్రతినమస్కారాలు
చేసుకున్నారు...

' ఉన్నది చైతన్యం ఒక్కటే, అన్యంగా ఏమీలేదు' అన్న రహస్యాన్ని వారిరివురు కనిపెట్టేశారు అన్నవిషయాన్ని వారిరివురి ముఖాల్లో విరిసిన చిరునవ్వులు బట్టబయలు చేసేశాయి.

గురువుగారికని ఏర్పాటు చేసిన ప్రత్యేక ఆసనం వైపు చేయి చూపారు స్వామి...
గురువుగారు వెళ్లి కూర్చున్నారు....

ఆశ్రమవాసులు మరియు స్వామి భక్తులు
గురువు వద్దకు వచ్చి వారి పాదాలను తాకి నమస్కరించుకున్నారు.

పట్టెయ్య గారు వేల్పూరుస్వామికి నన్ను పరిచయం చేయడానికని
తన చేతి మీద వ్రేలితో TVN అక్షరాలు గీయబోయారు...
నాకు తెలుసు... అన్నట్టు సైగలు చేశారు వేల్పూరుస్వామి.

తన ప్రక్కనే గోడకు వ్రేళ్లాడుతున్న మా అత్యాశ్రమి క్యాలెండర్ లో ఉన్న నా ఫోటోను చూపించారు.

వారి జ్ఞాపకాలలో నేనూ ఒకణ్ణయినందుకు నా మనసు కించిత్ పులకించింది...

నమస్కారం చేసుకున్నాను...
స్వామి పుస్తకప్రసాదం ఇచ్చారు...
* * *
గురుభక్తురాలు త్రిపురగారి పెద్దమ్మాయి 'అనామిక'
సదా నాతోటే ఉండడం చూసి- మీ అమ్మాయా? అని అడిగారు సైగలతోటి....
త్రిపురను చూపించి వారమ్మాయి అని చెప్పాను...
చిరునవ్వుతో ఊరక ఉండిపోయారు...

ఏమో...ఏ జన్మలలో నా బిడ్డగా ఉండిందో ఈ అనామిక...

ఇప్పుడు ఇలా ఈ జ్ఞానశిశువుకు ఆత్మీయురాలైంది అనామిక...
* * *
ఉదయం 7 గంటలకు-

ఉపాహారంగా నాలుగు ఇడ్లీ...
అనుపానంగా కొబ్బరిచట్నీ...
ఓ చిన్నిగ్లాసుతో వేడివేడి టీ...
* * *

సాయంత్రం 3.30 నుండి 5 వరకు సద్గురు సత్సంగం.
భక్తులు చాలా ఉత్సాహంతో ప్రశ్నలు అడిగి సమాధానాలు పొందారు.

చాలా యేళ్లపాటు ఆశ్రమంలో నిశ్శబ్ధంగా ఆశ్రమదినచర్యను గడుపుతున్నవారికి
ఇదొక ఆటవిడుపులా అనిపించింది.
తమ అంతరాంతరాలలలో అణిచిపెట్టబడిన
అనేక ప్రశ్నలను మా గురువు ముందుంచి, సమాధానాలు పొందారు.

'సాధన చేసి తీరాలి' అని తమ మైండ్ లో ఫిక్స్ అయిపోయి ఉన్నవారందరికీ....

'సాధన అవసరం లేదు' అని మనసు తేలికయ్యే ప్రబోధాలు చేశారు మా గురువుగారు.

ప్రతిమాటకూ చప్పట్లతోనూ, నవ్వులతోనూ
తమ ఆనందాన్ని వ్యక్తపరిచారు భక్తులు.

* * *

ఏ కర్మ కర్మరాహిత్యానికి దారి తీస్తుందో
ఆ కర్మప్రవాహానికే "కర్మయోగం" అని పేరు.

ఏ నామరూపాల ఉపాసన వలన నామరూపాతీతమైన అరూపస్థితికి చేరుస్తుందో
ఆ భావప్రవానికే "భక్తియోగం" అని పేరు.

ఏ వాక్కులు వాక్కుకు-తలపుకు అతీతమైన
స్వరూపనిష్ఠలో మనసు నిలిచేటట్టు చేస్తాయో
ఆ వాక్ ప్రవాహానికే "జ్ఞానయోగం" అని పేరు.

మా గురువు జ్ఞానయోగి....

* * *

నిశ్శబ్ధంగా ఉండడం వేఱు,
మౌనంగా ఉండడం వేఱు.

వేల్పూరుస్వామిని నిశ్శబ్ధస్వామి అనాలి.
నిశ్శబ్ధంగా చేతి కదలికలతోను, పలకపై రాతలతోను భాషిస్తూనే ఉన్నారు.

కానీ కాళహస్తిస్వామి  తమ భాషణం చేత అందరినీ మౌనంలోకి తీసుకెళుతున్నారు...
కనుక కాళహస్తిస్వామినే నిజంగా  మౌనస్వామి అనాలి.

నిశ్శబ్ధం అనేది సాధన.
మౌనం అనేది సిద్ధి.

నిశ్శబ్దం కాలంలో ఉంటుంది.
మౌనం కాలాతీతమై ఉంటుంది.

నిశ్శబ్ధానికి మాట  ఆటంకమే.
కాని మౌనానికి మాట ఆటంకం కాదు.

గురువుగారు అంటారు-
మౌనం అనేది మాట వలన భంగం కాదు,
మాట వలన భంగం అయ్యే మౌనం మౌనం కాదు అని.

కావ్యకంఠునికి ఉపదేశించడానికై రమణుడు మౌనం వీడాడు అంటారు...తప్పు.

వారెప్పుడూ మౌనాన్ని వీడలేదు.
వారికి మౌనం అనేది దీక్ష కాదు,
కనుక అది యెప్పుడూ చెదరలేదు.

మౌనం అనేది వారి స్వరూపం.
మౌనమే రమణుడు.
మాటలు వలన చెదరిపోయే మౌనం కాదు అది.

* * *

సమాధానపరచువారు ధన్యులు...
వారు దేవుని కుమారులనబడుదురు...
అని క్రీస్తు తనను తాను ప్రకటించుకున్నారు.

అడగండి ఇవ్వబడుతుంది...అంటూ అనుగ్రహభాషణం చేశారు క్రీస్తు కొండమీద ప్రసంగంలో.

* * *

అలా ఈ ఆధునిక లోకాన్ని సమాధానపరచడానికి అవతరించిన మహనీయమూర్తులు
ఆ అరుణాచలరమణులు,
ఈ అనిలాచలసుబ్రహ్మణ్యులు...

వీరు భాషణం మౌనంలోకి తీసుకెళుతుంది కాబట్టి
వీరు మాట్లాడుతున్న'ట్టు' కనిపిస్తున్నప్పటికీ, ఏమీ మాట్లాడనివారే....

నేను పలికిందీ లేదు.
మీరు వినిందీ లేదు.
అంటుంటారు గురువుగారు.

* * *

చెప్పక చెప్పినవాడు - దక్షిణామూర్తి.
చెప్పి చెప్పనివాడు - మా సద్గురుమూర్తి.

ఈ మాట అర్థమై, అనుభవంలోకి తెచ్చుకున్న ఎవడైనా వాడు 'మౌనస్వామి'యే.

* * *

వేల్పూర్ రామకృష్ణ గారు ఈ ఉదయాన్నే(2-4-2021) నాకు ఫోన్ చేసి చెప్పి మరీ 'నేనే కేంద్రం' వాట్సప్ గ్రూప్ నుండి left అయిపోయారు....

"సంతోషం" అన్నాను....

చెప్పి left అవడం అనేది అతని గొప్ప సంస్కారం...

ఎల్లకాలమూ దైవాన్ని, దైవవాక్యాల్ని పట్టుకు వ్రేళ్లాడకూడదు....అది కూడా ఒక రకమైన వ్యాధే..మీరు left అవడం నాకు సంతోషమే అన్నాను....

ఏమీ అనుకోకండి....వాట్సప్ వాడడం ఆశ్రమ నియమ నిబంధనలకు విరుద్ధం అన్నారు....

అలాగేనండి....అన్నాను...

వారిని add చేసిన తొలిరోజే ఈ మాట చెప్పి ఉండవచ్చు కదా!

పైగా తన జేబులో ఉండే ఫోనులో ఉండే వాట్సప్ లో ఉండే మెసేజ్ లు ఆశ్రమం వారికి ఎలా అభ్యంతరం అవుతుందో నాకు అర్థం కాలేదు.

అభ్యంతరం ఆశ్రమం వారికి కాదు, తనకే అనేది స్పష్టం.

మొత్తానికి వేల్పూర్ ప్రయాణం గురించి వ్రాసిన (మౌనం నిశ్శబ్దాన్ని పలకరించిన వేళ) వ్యాసం వారిని ఇబ్బంది పెట్టిందనేది వాస్తవం....

నేను వ్రాసిన ప్రతి అక్షరమూ సత్యమే....
జ్ఞానాంబ పలుకే...

తత్త్వవివేచన తప్పితే,
వ్యక్తి విమర్శ కాదు అనేది గ్రహించాలి.
* * *
గురువుగారు చాలా యేళ్ల క్రితమే ఓ మాటన్నారు-
బాబూ! సత్యాన్ని ప్రకటించవద్దు.
సత్యం చాలా కఠినమైనది.
లోకం తట్టుకోలేదు.
ఇతర మతస్థులు కాదు, నీ మతస్థులే నిన్ను హతమార్చడానికి
చూస్తారు...అన్నారు.
ఇది అక్షరసత్యం.

సత్యం లోకానికి రుచించదు.
లోకానికి అసత్యమే బహు రంజకంగా ఉంటుంది.

లోకంలో చెల్లని నాణెం పరలోకంలో చెల్లుతుంది...అంటారు గురువుగారు.

బాబుగారూ! మీ సత్యప్రకటనం బాంబు వేసినట్టుంది...అన్నాడు
సత్తిబాబు....

బా-బు మధ్యలో 'O' పెడితే బాంబు అవుతుంది...అన్నాను...

ఈ 'జ్ఞాన బాంబు'వలన సమస్తమూ పోతుంది బాబుతో సహా....
* * *
మనమున్నచోటే మనముండటం గౌరవం.
అవసరం ఉన్నవాడు వస్తాడు, ఉంటాడు, వింటాడు, పోతాడు...

UG చెప్పినట్లు...నా పాట నేను పాడతాను...
వింటే వినండి, నచ్చకపోతే వెళ్లిపొండి...అన్నారు.

కోయిల ఎవడి కోసమూ కూయదు...
జ్ఞాని ఎవడి కోసమూ జీవించడు...

మనం మరొక పరిధిలోకి వెళ్ళి ప్రబోధించడం
మనకు తగదు.

మనకే కాదు యెవరికీ తగదు.
ఎవడైనా చెట్టునీడకు వెళతాడేగానీ
చెట్టు ఎవరి వద్దకూ వచ్చి నీడనివ్వదు.

చొక్కాలు తగిలించుకునే 'కొక్కె' లా తానుండాలి.
ఏదైనా తనకు తగులుకుని ఉండాలేగానీ తాను దేనికీ తగులుకుని ఉండకూడదు.

ఇదే ఉత్తమఆధ్యాత్మికుని లక్షణం.

* * *

రమణుడు తన జీవితాంతం అరుణాచలం పొలిమేర దాటలేదు.
బాబా ద్వారకామాయిని వీడలేదు.
రామకృష్ణులు దక్షిణేశ్వరం దాటలేదు.

"జ్ఞానికి అజ్ఞాని కనబడడు" అని ఎఱిగిన మన గురుదేవులు కూడా శ్రీకాళహస్తిని వీడలేదు...

కానీ మురుగానంద, దొరబాబు, పట్టెయ్య లాంటి భక్తులు ఆర్తితో చేసిన ప్రార్థనకు లొంగి, కొన్ని చోట్లకు వెళ్లాల్సి వచ్చిందే తప్ప... "ఉన్నచోటు" ను వీడి వేరేచోటికి వెళ్లడం అనేది గురువుగారికి కూడా ఇష్టం ఉండదు.

దగ్గరి బంధువుల కార్యాలకు కూడా అసలు వెళ్లరు...

వారొక మాట అంటుంటారు -
నీవు వెళ్లకుంటే కార్యం నిలిచిపోతుంది అంటే, అటువంటి కార్యానికి మాత్రమే నీవు హాజరవ్వు అంటారు.

నిజంగా అలా ఉండగలిగితే, ఎంత అనవసర వ్యవహారం తగ్గుతుంది...!
మనసుకు ఎంత హాయిగా ఉంటుంది...!

అవసరం మేరకు వ్యవహారం ఉన్నవాడు-సన్యాసి.
అనవసరమైన వ్యవహారం ఉన్నవాడు - సంసారి.

* * *

క్రీస్తు కొండమీద ప్రసంగాన్ని గురించి చెబుతూ... క్రీస్తు ఓ సామాన్య

బోధకుని వలె కాక, ఓ అధికారి వలె ప్రవచించెను....అని ఉంది మత్తయి సువార్తలో.

మరి జ్ఞాని వాక్కులు అలా ఉంటాయి....

సత్తిబాబు అన్నట్టు-
జ్ఞాని వాక్కులు ఆర్గ్యుమెంటు కాదు, జడ్జిమెంటు....

అవి తిరుగులేని శాసనాలు....
జ్ఞాని శాసనానికి దైవమైనా, వేదమైనా తలవంచాల్సిందే....
* * *

ఈరోజు(4-4-2021) ఉదయాన్నే సద్గురు సన్నిధికి వెళ్లాం...నేను, దేవీప్రసాద్....

వెళ్లి కూర్చోగానే పింగాణీకప్పులో వేడివేడి టీ ఇచ్చాడు రవి.

చెంగల్వరాయరెడ్డి దినపత్రిక చదువుతున్నాడు... గురువుగారు ఆదివారం అనుబంధంలో ఉన్న గడి-నుడి నింపుతున్నారు....

కొన్ని వ్రాసి, నన్ను పూర్తి చేయమని వారపత్రికను నా చేతిలో ఉంచారు....

పూర్తి చేశాను....
* * *

నిశ్శబ్దం-మౌనం గురించి వాట్సప్ లో జరిగిన రగడ గురించి అడిగారు గురువుగారు...వారికి ఫోన్ చేసి ఎవరో చెప్పినట్టున్నారు....

అవునన్నాను...

ఏమది? అని ప్రశ్నించారు....

వేల్పూరుస్వామిని నిశ్శబ్దస్వామి అని
కాళహస్తి స్వామిని మౌనస్వామి అని
వ్రాశాను ఆర్టికల్ లో....

వారి భక్తులకేదో ఇబ్బంది అనిపించినట్లుంది ఆ మాట....
అన్నాను.

గురువుగారు గట్టిగా నవ్వి....

"వారు నిశ్శబ్ద స్వామి కూడా కాదు" అన్నారు ఘాటుగా...

ఒక్క క్షణం  అందరం అలా నిశ్చేష్టులైపోయాం...
సత్యం యొక్క పదును ముందు కత్తి యొక్క పదును కూడా దిగదుడిపే అనిపించింది.

కత్తి అన్నిటినీ నరుకుతుంది.
కత్తినే తెగ నరుకుతుంది సత్యం.

గురుబోధ వలన గురు-శిష్య భేదం పోతుంది అంటే అదే కదా అర్థం!

అన్ని కట్టెలూ కాలడానికి కారణమైన కొరివికట్టె కూడా చివరికి కాలి బూడిదైపోతుంది.

"సత్యం"లో  సభ్యులెవరూ ఉండరు.
సత్యంతో, సత్యంలో, సత్యంగా ఉండేది సత్యమొకటే.

సత్యం ఏకాకి.

తనకు నామరూపాలున్నట్లు తోస్తోందంటేనే
మౌనానికి అంతకన్నా ఆటంకం లేదు.

దక్షిణామూర్తికి నామం-రూపం ఉంది కదా!
కాబట్టి దక్షిణామూర్తి మౌనం కూడా నిజమైన మౌనం కాదు.
అని గురువుగారు ఘంటాపథంగా చెప్పారు.

* * *

కాబట్టి ఇదంతా తాత్త్విక విమర్శేగానీ
వ్యక్తి విమర్శ కాదు...అని గ్రహించాలి జిజ్ఞాసువులు.

పట్టెయ్య గారితో అదే అన్నాను....

వేల్పూరుస్వామి సంకల్పనిష్ఠ ముందు
నేను వారి కాలి గోటికి కూడా సరిపోను....

వారి గోచీలోని నూలుపోగులు కూడా
నా కంటే ఎంతో అదృష్టం చేసుకున్నాయి...అని.

పట్టెయ్యి చాలా సంతోషించారు నా వినయవచనాలకు...

* * *

దేహాభిమానం అంటే తన దేహంపై ఉన్న అభిమానం అని మాత్రమే కాదు,

ఇతరులకు దేహం ఉంది అనుకోవడం కూడా దేహాభిమానమే.

పై పైన నీటిపై తేలియాడే బుడగల్లా ఉండే నామరూపాల వ్యవహారమే - శబ్దం.

ఆ నామరూపాలకు ఆధారంగా ఉన్న
ఆత్మతత్త్వమే - మౌనం.

* * *

నాటకం ప్రదర్శిస్తుంటే ఇదొక నాటకం అని,
నాటకంలోని నటులకూ తెలుసు....
నాటకాన్ని చూసే ప్రేక్షకులకూ తెలుసు....

కానీ ఉద్దేశపూర్వకంగానే ఇది నాటకం అనే విషయాన్ని తత్కాలికంగా మరవాలి.
అప్పుడే నటులు గొప్పగా నటించగలరు,
ప్రేక్షకులు కూడా కథను బాగా ఎంజాయ్ చేయగలరు.

కాబట్టి
భగవంతుడు ఉద్దేశపూర్వకమైన మరపుతోనే
జీవుడుగా, ప్రపంచంగా అయ్యాడు.

జీవుడు ఉద్దేశపూర్వకమైన జ్ఞప్తితోనే(మననంతోనే)
తిరిగి ఆత్మస్వరూపాన్ని పొందుతాడు.

మరపుకు-జ్ఞప్తికి మధ్య ఊగిసలాడే
అందమైన నాటకమే జీవితం.

మన జీవితంలో తటస్థపడే సుఖదుఃఖానుభవాలన్నీ అంతర్గతంగా తన అంగీకారంతో ముడిపడి ఉన్నవే.

జగన్నాటకం అనే విషయం దేవునికి
జ్ఞప్తి ఉంటే - దేవుడు.
మరపుకొస్తే - జీవుడు.
అంతే.

జ్ఞప్తిలో ఉన్న జీవుడు - దేవుడు.
మరపులో ఉన్న దేవుడు - జీవుడు.

నిరాకారమే -మౌనం.
సాకారమే - శబ్ధం.

మౌనమే - దేవుడు.
శబ్దమే - జీవుడు.

మన అంతరాత్మయే నిజమైన మౌనస్వామి.
సచ్ఛీలమైన మన మనసే మౌనస్వామి ఆశ్రమం.

ఈ ఉన్నతమైనభావానికి ఆలంబనయే
మన వేల్పూరుస్వామి ఆశ్రమం...

కాదంటారా?

* * *

53. మురుగానంద నిలయం

---

తానున్నచోటే తానుంటూ...
తాను తానుగానే తానుంటూ...
తనలోనే తాను రమిస్తూ...

పురుగూ పుట్రా తిని పుట్టలో పడుకునే పాములా అలా గుట్టుగా ఉంటున్న గురువుగారిని

పాములవాడు పామును పట్టి ఊళ్లో ఆడించినట్టు
గుట్టుగా ఉన్న  గురువును జగత్ప్రసిద్ధం చేయాలనే

దుర్గతో గురువాక్యాలను(జ్ఞానప్రసూనాలను) ముద్రింపచేసి, లోకంలో ఉచితంగా వెదజల్లాడు బాబు....

ఇప్పుడు-ఇక్కడ-ఇలా అంటూ...
విషయాన్ని చాలా దగ్గరకు చేర్చాడు...

"నేనే" కేంద్రం అంటూ... విషయాన్ని ఇంకా తన లోలోపలికి త్రోసేశాడు...

నాతో సహా ఉన్న సర్వమూ "నాలో "
ఉన్నట్లున్నది అనే గురుతత్త్వాన్ని బట్టబయలు చేసేశాడు....

బాబు పుస్తకాలకు పెట్టిన టైటిల్స్ ను మననం చేసుకుంటే కూడా చాలు...
పుస్తకం తెరవకనే మన మస్తకం బాగయ్యే చమత్కారం చేశాడు బాబు...

నోరు తెరవకనే, నిశ్శబ్దంగా కూడా పొలికేక పెట్టి
పిలిచే ప్రక్రియే పుస్తక వితరణ...అని నిరూపణ చేశాడు బాబు...

సద్గురు నోట నుండి వెలువడిన ఆ దివ్యవాణి "బాబు" అనే కలం ద్వారా జాలురాలి మంత్రాలైనాయి...

ఏ ఒక్క సూక్తిని తీసుకుని మననం(ఉపాసన) చేసుకున్నా సరే
పరిపూర్ణానుభవం సిద్ధించడం ఖాయం.

ఆ పుస్తకాల వలన వేలాదిమంది జిజ్ఞాసువులు
గురుసన్నిధికి చేరి తరిస్తున్నారు...

* * *

యెంతోమంది గురుదర్శనం చేసుకొని, గురువును తమ ప్రాంతాలకు ఆహ్వానించాలని తాపత్రయపడుతుంటారు...

గురుదర్శనం అయ్యాక...
'బాబుగారూ...! మీ దర్శనం కూడా చేసుకోవాలని ఉంది...మీ వద్దకు ఎలా రావాలి? అని ఫోన్ చేస్తుంటారు...

ఏముంది ఇక్కడ చూడ్డానికి?
వారి చేతిలో 'బాబు' అనేది ఓ బ్రాండ్ పెన్...అంతే.

కలంతో పని కాగానే సొరుగులో దాచినట్టు
అలా సొరుగులో(తెర వెనుక)ఉండడం బాబుకు ఇష్టం.

కవికి సన్మానం చేస్తారేగానీ,
కలానికి సన్మానం చేసే పిచ్చివాళ్లున్నారా?

కలంతో దొంగసంతకమూ చేయొచ్చు
అందమైన కవిత్వమూ రాయొచ్చు
కలానికి ఏ కర్తృత్వమూ ఉండదు.
గురువుచేతిలో నేనొక కలాన్ని.

అందుకే నన్ను చూడాలని ఫోన్ చేసేవారికి
ఒకటే సమాధానం చెబుతాను....

"గురువును దర్శిస్తే చాలు...బాబును కూడా దర్శించినట్లే" అని.

గురువులోనే సకలమూ ఉంది....
ఈ నామరూపాలు కలిగిన ఈ గురువూ, శిష్యులూ, అందరూ కూడా
"గురువు"లోనే ఉండేది....

ఇప్పుడే ఫోన్ చేశారు...శ్రీకాకుళం నుండి సూర్యనారాయణగారు...

గురువాక్యాలను వాట్సప్ లో చూసి ఆనందించడమేగానీ, నేరుగా
గురురూపాన్ని దర్శించలేకపోతున్నాను...అని.

గురుదర్శనం అంటే వ్యక్తి దర్శనం కాదు,
తత్త్వదర్శనమే నిజంగా గురుదర్శనం.

అద్దంలో మిమ్మల్ని మీరు చూసుకోండి.
అదే గురు దర్శనం అన్నాను వారితో.

అవునండీ...అవునండీ...అవునండీ...అన్నారు ముమ్మారు...

గురుతత్త్వాన్ని గ్రహించినవాడు కూడా గురువే.
గురువు తప్ప గురుతత్త్వాన్ని గ్రహించలేరు అంటారు గురువుగారు...

గురుతత్త్వాన్ని అనుభవించి ఆనందించే సూర్యనారాయణగారు
గురువెందుకు కాకుండాపోతారు?

అందుకే అద్దంలో చూసుకోమన్నాను సరదాగా.

* * *

నిజానికి 'గురువు' అనేది "కేవలతత్త్వం".
అదే "పరమపదం".
అదే సత్సంగానికి ప్రధాన దేవత(అధిష్ఠానదైవం)
నామరూప సహితులైన ఈ గురువూ, ఈ శిష్యులూ ప్రధానం కాదు.
గురువుతో సహా శిష్యులందరూ పరివార దేవతలే.

* * *

ఈ పరివారదేవతల్లో ఒకరైన "మురుగానంద-వల్లి"
అనే విశాఖవాసులు తమ నూతన గృహప్రవేశ సందర్భాన్ని ఓ సాకుగా
తీసుకొని మా సద్గురు సత్సంగాన్ని ఆహ్వానించారు.

వారి ప్రేమకు వశులై సద్గురుదేవులవారు అంగీకరించారు.

ఇంత అనారోగ్యంలోనూ మురుగానంద గారి ఆహ్వానాన్ని ఎందుకు
అంగీకరించారా!!! అని ఆశ్చర్యపోయాను....

పైగా పది రోజుల క్రితం జరిగిన వేల్పూరు ప్రయాణంవలన బాగా
అలసిపోయివున్నారు...

మురుగానంద గారు ఓ మాటన్నారు నాతో -
గురువుగారిని మా ఇంటికి ఆహ్వానించడం కాదండీ...
"వారిల్లే ఇది"....వారింటికి వారొచ్చారు...అంతే.
అన్నారు.

అద్భుతం అనిపించింది ఆ మాట...

నిజంగా సిగ్గుపడ్డాను నేను.
అంత గురుభక్తి నాలో లేనందుకు.
మురుగానంద గారి పాదాలకు సాష్టాంగప్రణామాలు...

ఈ మాటే అన్నాను ఉదయం గురువు వద్దకు వెళ్లినప్పుడు....

అవును ఏ కోణంలోనూ వారితో మనం పోల్చుకోవడానికి లేదు...అని అన్నారు.

మురుగడి(కుమారస్వామి) ఇంట్లో సదా ఆనందమే ఉండడం వలన వారు "మురుగానంద" అయ్యారు అన్నారు సత్సంగంలో.

* * *

2021 ఏప్రిల్ 11 న చేరి నాల్గురోజులు అక్కడే గడిపాం అంతా.

రైలు దిగగానే కారు, కారు దిగగానే మురుగానంద ఇల్లు....
అలా మా కాలు నేల మీద పెట్టనీకుండా తీసుకెళ్లాడు...

మురుగానంద దృష్టిలో గురువు అంటే గురు-శిష్యులు మొత్తం కలిపి గురువు.

అలా గౌరవించారు ఆ నాలుగురోజులు మమ్మల్ని అందరినీ....

'గురు-శిష్యులు' మొత్తం కలిపి "గురుపీఠం" కాబట్టి
పైన-క్రింద అనే భేదాలు మా సత్సంగంలో అస్సలుండవు. మా సత్సంగంలో ఏ  పీటముడులూ ఉండవు.

గురుపీఠం అంటే అదొక అందమైన కుర్చీ కాదు.
గురుపీఠం అంటే విశ్వకేంద్రం.
గురుపీఠం అంటే సమిష్టితత్త్వం.

అందుకు తార్కాణం...
మురుగానంద గారు గురువుగారికని ఏర్పాటు చేసిన ఆసనాన్ని వదిలి...శిష్యులందరికీ ఏర్పాటు చేసిన విడిదిగృహానికి విచ్చేయడమే...

సాధారణంగా గురుసన్నిధిలో ఉండడానికి శిష్యులు తాపత్రయ పడుతుంటారు.

కానీ మా గురువుగారు శిష్యులసన్నిధిలో గడపడానికి తాపత్రయపడతారు.

గురువుగారు రాగానే గబగబ ఒకరు కుర్చీవేశారు....

క్రొత్తవారు, పాతవారు అందరూ వారి చుట్టూ చేరి
వారి ముఖారవిందాన్ని చూస్తూ ఆనందంగా గడుపుతూ ఉన్నారు.

ఆ  విరామ సమయాన్ని కూడా తాత్త్వికచర్చలతోనే కాలం గడపాలని పట్టెయ్య ఆశపడ్డట్టుంది....
అక్కడ ఉన్న ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ
'గురువుగారిని ఏదైనా అడగండి' అన్నాడు క్రొత్త వారితో.

గురువుగారు...చిరునవ్వుతో...
ఇలా అన్నారు-
చూడండి...ఈ గదిలో యెడతెగకుండా వీస్తున్న ఈ దక్షిణపుగాలి వలన ఎంత హాయిగా, సుఖంగా ఉందో...!
మీరు ప్రక్కగదిలోకి వెళ్లి హాయిగా పిచ్చాపాటి మాట్లాడుకోండి... నేను కాసేపు ఇక్కడే కునుకు తీస్తాను అన్నారు.

వారికి వేదాంతభాషణం యెంతో,
పిచ్చాపాటి మాటలు కూడా అంతే.
అన్నీ కాలక్షేపాలే వారికి.

వారికి నిర్వికల్ప సమాధి యెంతో
నిద్ర కూడా అంతే.
అన్నీ స్వరూపనిష్ఠయే వారికి.

వారికి ఏ విషయంలోనూ, ఎవరి విషయంలోనూ వైరుధ్యం రాదు...దేనినీ ఖండించరు...

ఆయా విషయాల్లో...ఆయా వ్యక్తుల్లో సహజంగా వ్యక్తమయ్యే జీవనశైలిని, బాడీ లాంగ్వేజ్ ను, మేనరిజమ్ ను... ఆ వైవిధ్యతను తటస్థంగా  చూస్తూ ఎంజాయ్ చేయడం అనేది వారికి నిత్యకృత్యం.

దేనినీ అంగీకరించరు, దేనినీ త్రోసిపుచ్చరు.
"చూస్తారు" అంతే. జడ్జిమెంట్ చేయరు.

రాధిక పిల్లలు వచ్చి మధురగానం చేసినా సరే
అలా "విన్నారు" అంతే...

"అదేం రాగం?" అంటూ బాబూలా ప్రతిస్పందించలేదు.

బాబు ప్రతిదానికీ స్పందిస్తాడు...
మాటలకు....పాటలకు....
అది అతని జీవనశైలి అంతే.

* * *

రాయడం(రచన)
పాడడం(గానం)
ఆడడం(నాట్యం)
ఇవి కళాకారుని లక్షణాలు...

ఆత్మానందాన్ని తనలో ఇముడ్చుకోలేక వమనం చేసుకున్న ఋషియే కళాకారుడు అంటారు గురువుగారు.

ఇలా ఆధ్యాత్మిక వ్యాసాలు బాబు వ్రాస్తున్నాడంటే
అజీర్ణవ్యాధి యేదో అతనికి ఉన్నట్టే.
వ్యాధి లేనివాడు ఏ వ్యాపకమూ లేక ఊరక ఉంటాడు.

* * *

పాతవారు, క్రొత్తవారు లేచి ప్రక్కగదిలోకి వెళ్ళాం... పిచ్చాపాటి మాట్లాడుకున్నాం....మురుగానంద భోజనానికి పిలిచేవరకు.

రంగయ్యమాష్టారు అని క్రొత్తవారొకరు అడిగారు-
బాబుగారూ! నా కుటుంబంలో ఓ అపశ్రుతి జరిగింది....అంటూ ప్రారంభించారు...

తన ఆలనా పాలనా చూసుకునే తన కోడలు రోడ్డుప్రమాదంలో చనిపోవడం గురించి చెప్పి బాధపడ్డారు....

బాబు: ఈశ్వరుణ్ణి నమ్ముతారా మీరు?
రంగయ్య: నమ్ముతాను...
బాబు: ప్రపంచం ఈశ్వరసృష్టి అనేది నమ్ముతారా?
రంగయ్య: నమ్ముతాను...
బాబు: మరి ఈశ్వరసృష్టిలో అపశ్రుతి యెందుకుంటుంది?
అన్నాను...

ఆ మాట మంత్రంలా పనిచేసింది అతనికి.

రంగయ్యగారికి దుఃఖం పోయి...వారి ముఖంలో చిరునవ్వు తొంగి చూసింది.

మాతో గడిపిన చివరిక్షణం వరకు ఓ చిన్నపిల్లాడిలా, సరదాగా చమక్కులు వేస్తూ అందరినీ నవ్విస్తూ ఉండిపోయారు...

నిజానికి అతని వయసు ఎనభై పైనే.
కానీ నేనన్నాను...మనందరిలో అతి తక్కువ వయసు కలవారు రంగయ్యే అని.
ఆ మాటను అందరూ అంగీకరించారు....
అంత ఎనర్జిటిక్ గా ఉన్నారు.
* * *
గురుభక్తురాలు రమాదేవి గారు వచ్చి
తమ క్రొత్తఇంట్లోకి గురువుగారొచ్చి అడుగుపెట్టాలని కోరారు....సరేనన్నారు.
మూడోరోజు సాయంత్రం 4 గంటలకు బయలుదేరివెళ్లాం.
పాదపూజలు చేయడం...
ప్రసాదాలు తినడం...
తేనీరు సేవనం...
ఫోటోలు దిగడం...
రొటీన్ గా జరిగిపోయాయి....

రమాదేవిగారి మేడపైన కాపురం ఉంటున్న ఒకావిడ వచ్చి మాకు భగవంతుడు సకల భోగభాగ్యాలూ ఇచ్చాడు...కానీ  సంతానభాగ్యం ఇవ్వలేదు... దయచేసి ఆ ఒక్క వరాన్ని మాకు ప్రసాదించండి అని వేడుకుంది.

మీకు సంతానంగా నేనే పుడతాను....అన్నారు గురువుగారు....

అడిగినావిడ పేరు పార్వతి...
భర్త పేరు శివ...

నేనే మీకు పుడతాను అని వరమిచ్చినవాడు
సుబ్రహ్మణ్యుడు.

అదొక విచిత్రవరంలా అనిపించింది....

పుట్టాలి అంటే గిట్టాలిగా....
వారి యొక్క అంతిమ క్షణాన్ని సూచించారా?
అన్న అనుమానం కలిగి గుండె గుభేలుమన్నది....

మహావిష్ణువు వైకుంఠంలో యోగనిద్రలోనే ఉంటూనే
ఈ భూమిపై దశావతారాలు దాల్చాడు...

కలను కంటున్న దేహం పడకపై ఉండగానే
కలలో మరో దేహాన్ని కల్పన చేసుకున్నట్లు

తాను తానుగానే ఉంటూనే తాను సకలంగా ఉండవచ్చు...అన్న
గురువాక్యం గుర్తుకు వచ్చి గుండె కుదుటపడ్డది.

* * *

పావనీగారికి తెలియజేశారా? అని అడిగాను మురుగానందను  వచ్చిన
తొలిరోజే...
మనవారందరికీ తెలియజేశామండీ...
పావనీగారు తప్పకుండా వస్తారు...అని అన్నారు...

చివరిరోజున నేను, పట్టైయ్య, చెంగల్వరాయరెడ్డి ముగ్గురమూ పావనీగారిని
జ్ఞాపకానికి తెచ్చుకున్నాం...

ఆశ్చర్యం... అదే క్షణంలో పావనీగారు మా గదిలోకి ప్రవేశించారు...

గురువుగారితో గడపడం సగం సత్సంగం.
శిష్యులతో గడపడం మిగతా సగం సత్సంగం.
అని అన్నారు పావనీగారు.
సరదాగా కాసేపు గడిపారు మాతో.

* * *

మొత్తానికి...

అనామిక అలకలతోను
భవ్యబంగారం అల్లర్లతోను
మురళీగారి సత్సంగాలతోను
terrace పై సభలతోను
త్రిపురగారి రికార్డింగులతోను

ఏమీ అనుకోకండి....అని ప్రారంభించి,
చివరికి అన్నీ అనుకునేలా చేసే నాగేశ్వరరావు గారి ఉపన్యాసాలతోను...

ఖాళీసమయాన్ని సద్వినియోగపరచుకోవాలంటూ దేవీప్రసాద్ వ్రాసే రచనావ్యాసంగాలతోను...

ఆ నాలుగు రోజులు నాలుగుక్షణాల్లా గడిచిపోయాయి...

ఈ రోజు తిరుగుప్రయాణం...అని గురువుగారితో అన్నప్పుడు...
ఇంకా మూడు రోజులు ఉందనుకున్నానే...!
అని గురువుగారు ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసినప్పుడు....

ఆ మాటలకు మురుగానంద గారి హృదయం ఉప్పొంగి
ఆనంద డోలికలలో తేలియాడుతున్నప్పుడు...

రైలొచ్చి మా ముందు ఆగింది.

* * *

## 54. అతడు - నీవు - నేను

---

నేనూ ప్రసాద్ ముందురోజు సాయంత్రమే చేసుకున్న ఒప్పందం ప్రకారం....
ఈ ఉదయాన్నే 5.30 కు శివాలయం దగ్గర్లో ఉన్న కేరళా టీ అంగడికి చేరుకున్నాం...
టీ త్రాగి...గురువు వద్దకు వెళ్లాం....

అప్పుడే రవి కూడా వచ్చాడు...
గేట్ తీసుకొని లోపలికెళ్లాం...
చెంగల్ రెడ్డి దినపత్రిక చదువుతున్నాడు...
గురువుగారు గడి-నుడిలో అక్షరాలు నింపుతున్నారు...

మాకు బొట్టుబెట్టి తీర్థం ఇచ్చారు...
పుస్తకం, పెన్ నా చేతిలో పెట్టి పూర్తి చేయమన్నారు...
పూర్తి చేసి తిరిగి ఇచ్చివేశాను.
అందులో శూర్పణఖ అనే కథ ఉంది...
శూర్పణఖ అంటే అర్థం తెలుసునా? అడిగారు గురువుగారు..
తెలియదు అన్నాను...
శూర్పము అంటే చేట.
నఖము అంటే గోరు.
శూర్పణఖ అంటే చాట వంటి గోళ్లు కలది అని అర్థం...అని వివరించారు.
* * *
రవి వంటగదిలో నుంచి మా నాల్గురికీ  వేడివేడి తేనీరుతో నింపిన కప్పులు తీసుకొచ్చాడు ట్రేలో...
ఒక్కొక్క సిప్ తో రసాస్వాదనం చేస్తూ ఉండగా...
TTD ఛానెల్ అన్నమయ్య కీర్తన వినబడింది....

నీవొక్కడవే సర్వాధారము...
నిన్నే ఎఱిగిన అన్నియు నెఱుగుట...

గురువుగారు దానిని ఉత్తమపురుషంలోకి మార్చి ఇలా చెప్పారు...

"నేను" ఒక్కడనే సర్వాధారము.
"నేను" ను ఎఱిగిన అన్నియు నెఱుగుట...

భగవంతుణ్ణి -
"అతడు" అని పరోక్షంగా వ్యవహరిస్తే
అది కర్మయోగం.

"నీవు" అని ప్రత్యక్షంగా దర్శిస్తే
అది భక్తియోగం.

"నేను" అని స్వానుభవంగా ఉంటే
అది జ్ఞానయోగం.

భగవంతుడు ప్రస్తావనకు వచ్చినప్పుడు
నీకెలా అనిపిస్తోంది?
"అతడు" - గానా?
"నీవు" - గానా?
"నేను" - గానా?

అనేది ఎవరికి వారు ప్రమాణం.

నీవు ఫలానా యోగివి అని ఇంకొకడు నిర్ధారించేది కాదు.

కర్మ-భక్తి-యోగములనేవి ఒక దాని కంటే మరొకటి శ్రేష్టమనీ కాదు, ఒకటి తరువాత మరొకటి సాధించవలసిందీ కాదు....
దేనికదే మార్గం...దేనికదే పూర్ణం.
* * *

జ్ఞాని భగవంతుణ్ణి స్వరూపంగానే అనుభవిస్తాడు కాబట్టి, జ్ఞాని సాక్షాత్తు భగవంతుడే.

భగవంతుని చేతిలో ఓ పరికరంగా ఉంటాడు కర్మయోగి.

భగవంతుని ఒడిలో శిశువుగా నిర్భయంగా ఉంటాడు భక్తియోగి.

భగవంతుడే జ్ఞానయోగి.
* * *

సద్గురు సన్నిధిలో నాకలాంటి అనుభూతే కలుగుతుంది....

ప్రపంచం వెతికే దేవుడు ప్రపంచంలోనే
ఉన్నాడు (గురురూపంలో) అనిపిస్తుంది.

గురువు ప్రపంచానికి ఆవల నిరాకారదైవంగా ఉన్నాడు.
ఆ నిరాకార దైవమే ప్రపంచంలో గురురూపంగా ఉన్నది.

అది, ఇది అని నిర్వచించడానికి వీలులేని పరతత్త్వం ముందు కూర్చొని,
దానిని అది, ఇది అని నిర్వచించడానికి ప్రయత్నం చేస్తూ
ఆధ్యాత్మికజగత్తులో కలకలం సృష్టిస్తున్న
ఓ విచిత్ర "కలం" - బాబు.

* * *

గురువు మన వైపు చూడక, TV వైపు చూస్తున్నట్టు ఉన్నా సరే
అదే సమయంలో మన వైపు కూడా చూస్తున్నట్టు ఉంటుంది.

మన వైపు చూస్తున్నట్టున్నా సరే ఆ చూపు మనల్ని తాకిందా? అనేది అనుమానమే...

ఆ చూపు వారికి, మనకు మధ్యలోనే ఎక్కడో ఆగిపోయి విశ్రాంతి తీసుకున్నట్టు అనిపిస్తుంది.

వారి "కన్ను" మనలా భౌతికమైనది కాదు.
అది అనంతం. అది జ్ఞానం.

చూడడం-చూడకపోవడం మధ్యలో ఉంటుంది
వారి చూపు.

గుర్తించడం-గుర్తించకపోవడం మధ్యలో ఉంటుంది
వారి మనసు.

అనుభవించడం-అనుభవించకపోవడం మధ్యలో ఉంటుంది వారి హృదయం.

బంధం-మోక్షం మధ్యలో ఉంటుంది వారి వ్యవహారం.

ఉన్నది-లేనిది మధ్యలో ఉంటుంది వారి ఉనికి.

అతడు అనిర్వచనీయుడు అనడానికి కారణం ఇదే.

అతణ్ణి నిర్వచించి తన జీవితాన్ని చరితార్థం చేసుకోవాలని...
"ఫుల్ స్టాప్" పెట్టి విశ్రాంతి తీసుకోవాలని...
"గురుచరిత్ర"లో తాను కలకాలం నిలిచిపోవాలని...
'కలం'(బాబు)సాగిస్తున్న ప్రయత్నమిది...
ఇది ఈ 'కలం' పాత్ర అంతే...ఏంచేద్దాం?

* * *

తానెవరో తానేమిటో తనకొక్కనికే తెలుసు.
అందుకే భగవాన్ 'నిన్ను నీవు తెలుసుకో 'మ్మంది.

నిన్ను నీవు తెలుసుకో అంటే,
క్రొత్తగా శోధించి తెలుసుకోవలసింది అని కాదు.
already నీకు తెలుసు నీవెవరివో...
'అది'గా ఉండడమే నీవు చేయవలసింది అని.

నీవు మూడు పొరలతో ఉన్నావు -

1. పై పొర వ్యక్తి (శరీరము) - కుండ.

2. రెండవది వ్యక్తిత్వము(స్వభావము) - నీరు.

3. మూడవది సచ్చిదానందము(స్వరూపము) - మట్టి.

భగవాన్ అన్నట్టు ఒకటే మూడయ్యింది...

మట్టి ఒకటే...

కుండగా ఉన్నప్పుడు అందులో నీరుండడం సహజం.

పొయ్యిగా ఉన్నప్పుడు అందులో మంట ఉండడం సహజం.

హుండీగా ఉన్నప్పుడు అందులో నాణేలు ఉండడం సహజం.

కుండీగా ఉన్నప్పుడు అందులో మొక్క ఉండడం సహజం.

కుండగా ఉండడం - పురుషకారం(ఈశ్వరనియతి)
నీరు ఉండడం - ప్రారబ్ధం(విధి)
మట్టిగా ఉండడం - స్వరూపం (జ్ఞానం).

నిన్ను నీవు తెలుసుకో అంటే...
ప్రతీది దేనికది సహజంగా ఉంది అని తెలుసుకోమ్మనే అర్థం.

అంతేగాని మరేదోగా మారిపోవడం కాదు.
ఎవరూ మారరు, ఏదీ మారదు.
అని తెలిసి, లాభనష్టములు లేని వ్యాపారం చేసుకోవడమే ఆధ్యాత్మికం.

లాభనష్టములు లేని వ్యాపారం అని తెలిసి వ్యాపారం చేసినవాడు -
వివేకానంద.

లాభనష్టములు లేని వ్యాపారం అని తెలిసి
వ్యాపారం మానినవాడు - రమణ భగవాన్.

అదొక పాత్ర .
ఇదొక పాత్ర.
అంతే.

గురువు పాత్ర - చెప్పడం.
నా పాత్ర - రాయడం.

మీ పాత్ర చదవడమే అయితే చదువుతారు...
లేదంటే పేజీ తిప్పేస్తారు....
లేదంటే పుస్తకాన్ని గిరాటు వేస్తారు...

నాకేమి?

* * *

55. జ్ఞాపిక

---

ఈరోజు(26-4-2021) ఉదయం 5 గంటలకు నేను వాకింగ్ చేస్తుండగా ప్రసాద్ వచ్చి గురువు వద్దకు వెళదామా? అన్నాడు....సరేనని వాడి స్కూటర్ లో బయలుదేరాం....
వాకింగ్ లోకి Hand Stick(వీపు గోక్కునే కర్ర) తీసుకెళ్లడం అలవాటు.
ఆ కర్రతో పాటే గురువు వద్దకు వెళ్లాను...
ఓ గంట గడిపి వచ్చేశాం....

అలాంటి sticks గురువుగారి వద్ద కూడా రెండు మూడున్నాయి...
సమయానికి ఒకటి కనబడకపోయేసరికి బాబు నా stick తీసుకెళ్లిపోయాడు అని భావించారు...

సాయంత్రం మేమందరం కైకాలవీధి సత్సంగంలో ఉండగా ప్రసాద్ కు ఫోన్ చేసి ఉదయం వచ్చేటప్పుడు నా stick ను తీసుకురండి...అన్నారు...
మేం అవాక్కయ్యాం....

సరే ఆ పాతది ఎందుకులే అని, క్రొత్త stick కొని తీసుకెళ్లాం మరునాడు ఉదయం(27-4-2021*చిత్రాపౌర్ణమి)

బయట గురువుగారికి క్షురకుడు రాజేంద్ర గుండు చేస్తున్నాడు....

వారిని,దాటుకుని లోపలికెళ్లాం...

మమ్మల్ని చూసి ఒకటే నవ్వుతోంది త్రిపుర.
గురువుగారు అడిగింది క్రొత్త కర్ర కాదు...
పాత కర్ర..అంది...

పాతకర్ర నాది బాబోయ్! అంటే ఎవరూ వినడం లేదు...

మళ్లీ నవ్వులు...

గురువుగారి దివానాకాట్ మీద క్రొత్త stick పెట్టి
వంటగదిలోకి వచ్చా...
అనామిక టీ పెడుతోంది...
త్రిపుర పూరీ పెట్టింది...తిన్నాను..

గురువు వద్దకు రాకుండా వంటగదిలోనే ఉండిపోయాను....

భవ్య చెయ్యిపట్టి లాగుతోంది...
త్రిపుర నవ్వు ఆపుకుంటూ పిలుస్తోంది...
గురు సన్నిధిలోకి నన్ను రమ్మని...

వామ్మో...నేను రాను తల్లీ...ఈ కర్ర గొడవేదో పూర్తయ్యాక  వస్తానన్నా...

మళ్లీ నవ్వులు...

గురువుగారు గుండు షేవ్ పూర్తయి దివానాకాట్ మీద కూర్చున్నారు...

నేను తెచ్చిన క్రొత్త stick ను చేతికి తీసుకుని పరిశీలించారు....

దానిని తన వద్దనే ఉంచేసుకుని,
వారి వద్ద ఉన్న మూడు పాత sticks లో ఒకటి ప్రసాద్ కు ఇచ్చి ఇది కైకాలవీధి సత్సంగంలో ఉంచమన్నారు....ఎందుకోమరి...

వీరయ్యగారి చేతికర్ర వారి వద్ద ఉన్నట్టు
గురువుగారి చేతికర్ర మా చేతికి వచ్చినట్లయ్యింది...

మా సత్సంగంలో already తాతగారి స్పర్శ కలిగిన బ్రహ్మంగారి చరిత్ర ఒకటి ఉంది...

ఇది రెండవది...

గురు స్పర్శతో పునీతమైన ఓ జ్ఞాపికగా మా సత్సంగంలో అధిష్ఠానదైవమైన "పరమపదం" ముందు ఉంచాం.

ఇంటికొస్తుండగా దారిలో ప్రసాద్ అన్నాడు ఈ ఘట్టం దేనికి సూచనో!! అని.

* * *

మహనీయుల జ్ఞాపకార్థంగా వారి పాదుకలను పూజించే సంప్రదాయం రామాయణం కాలం నుంచే ఉంది...
భరతుడు రామపాదుకలను అయోధ్యకు పట్టుకెళ్లిపోయాడు కదా!

గురువుగారి వద్ద వారి గురువుగారైన వీరయ్యగురువుగారి చేతికర్ర ఒకటి ఇప్పటికీ వారి పూజామందిరంలో పూజలందుకుంటోంది.

తాతగారి చేతికర్ర ఒకటి ఉండేదిగాని, ఎవరో కాషాయవస్త్రాలు ధరించిన సాధువు ఒకరు నాకా కర్ర కావాలని అడిగితే, తాతగారే ఆ రూపంలో వచ్చి అడిగారని భావించి ఆ కర్రను ఆ స్వామికి ఇచ్చివేశారు...తాతగారులాగే ఉండేది ఆ కర్ర సన్నగా....

తాతగారు వాడిన యోగదండం మాత్రం ఇప్పటికీ ఉంది...

* * *

వేంకటనరసయ్య, త్రిపుర వెండి పాదుకలు చేయించి, గురుపాదాలకు తొడిగి, పూజించి తమ ఇళ్లకు గురు జ్ఞాపికలుగా పట్టుకెళ్లారు...

పట్టెయ్య స్వయంగా గురువుగారే తమ గృహాన్ని పావనం చేసినప్పుడు పంచలోహాలతో పాదుకలను చేయించి గురుపాదాలకు తొడిగి, పూజించి, జ్ఞాపికగా తమ పూజామందిరంలో పెట్టుకుని పూజిస్తున్నారు.

* * *

ఓసారి హైదరాబాద్ నుంచి శ్రీకాంత్ గారు ఫోన్ చేసి అరుణాచలం వెళుతున్నాను...ఆ యాత్రకు జ్ఞాపికగా అరుణాచలం నుండి రాయి ఒకటి తెచ్చుకోనా? అని...

ప్రపంచంలో నలుదిశలు నుండి అరుణాచలానికి వస్తున్న భక్తులందరూ నీలా భావించి తలా ఓ రాయిని పట్టుకెళితే కొన్ని శతాబ్ధాలకు అరుణాచలం ఖాళీ అయిపోతుంది...అన్నాను నవ్వుతూ...

నిజమేనండీ....నేను తెచ్చుకోను....అన్నారు శ్రీకాంతు.

* * *

సద్గురు  చేతుల మీదుగా తీసుకున్న "జ్ఞానప్రసూనాలు" గ్రంథాలు ఎంతోమంది ఇళ్లలో జ్ఞాపికలుగా ఉన్నాయి.

అలా అనుకుంటే గురువుగారు బొట్టుపెడుతూ కొన్ని వేల మందిని వేలసార్లు స్పృశించి ఉంటారు...
మరి వారి స్పర్శ పొందిన మనమందరం కూడా గురు జ్ఞాపికలే కదా!

భగవంతునికి లేదా గురువుకు తానే ఒక జ్ఞాపికగా ఉండాలి.
అంతేగానీ ఇంటిని వివిధ జ్ఞాపికలతో(వస్తువులతో) నింపేసి,
వచ్చినవారందరికీ చూపిస్తూ ఉండడం కాదు.

గురువుగారు చాలాసార్లు నా భుజం మీద చెయ్యివేసి నడిచిన సందర్భాలున్నాయి....

మరి "నేనే" వారి చేతికర్రను...
"నేనే" సద్గురు జ్ఞాపికను...
అన్న జ్ఞాపకం ఒక్కటి చాలదూ ఈ జీవితానికి....

* * *

56. ఉండేది నేనొక్కణ్ణే

---

పద్మావతమ్మ గారు....
సాయిభక్తురాలు...

నాకు అమ్మ తర్వాత అమ్మ...
నారాయణ మహారాజ్ జీవితచరిత్రను పుస్తకంగా ముద్రించినప్పుడు
అమ్మగారు వ్రాసిన ముందుమాటలో
"బాబు నా ఆత్మపుత్రుడు" అని వ్రాశారు...
"బాబు నా బిడ్డ" అని అందరికీ చెప్పుకునేది...

నేను ఏ వేళప్పుడు అమ్మ దగ్గరకు వెళ్లినా సరే....
అన్ని పనులూ ప్రక్కనపెట్టి నా ముందు వచ్చి కూర్చుంటుంది...బాబూ!
ఏవైనా ఆధ్యాత్మిక విషయాలుంటే చెప్పు....అంటూ...
నేనేదో పిచ్చివాగుడు వాగుతుంటే గురువు వద్ద శిష్యురాల్లా శ్రద్ధగా వినేది...
బాబు భోజనప్రియుడు అని తెలిసి ప్లేట్ లో
ఆ సమయానికి అందుబాటులో ఉన్న చిరుతిండ్లు నా ముందు ఉంచేది...
అలా తింటూ గంటల తరబడి కబుర్లు చెప్పుకునేవాళ్లం...
చివర్లో ఫిల్టర్ కాఫీతో మా సత్సంగం ముగిసేది...

పాలు అమ్మే పాలవాడు,
కూరగాయలమ్మే పల్లె పడచులు,
బండి పై అరటిపండ్లు అమ్మే సాయిబు,
మిఠాయి బండి నడిపే శేఠ్జీ.
బట్టలుతికి ఇస్త్రీ చేయించుకొచ్చిన ధోబీ....
ఎవ్వరైనా సరే వారి ఇంటి గుమ్మం వైపు వచ్చిన ప్రతి ఒక్కరినీ పలుకరించి,
వారి వద్ద తనకు అవసరమైనవి కొని, వారికి తృప్తిగా భోజనం పెట్టి మరీ పంపేది.
వారు బేరసారాలు లేకుండా అసలు రేటుకే వస్తువులు ఇచ్చి వెళ్లేవారు...

గోవులైతే రోజులో ఎన్ని వస్తాయో లెక్క లేదు...
వారి ఇనుపగేటును కొమ్ములతో నెట్టుతాయి...
మేం వచ్చాం అని తెలియజేయడానికి...
వాటికి టమోటాలు, అరటిపండ్లు పెట్టేది...

మా రమణసత్సంగంలో జరిగే ఏ విశేష కార్యక్రమానికైనా విందులోకి స్వీట్స్ sponsored చేసేది...

మన రమణ సత్సంగం ఆ మహాతల్లికి ఎంతో ఋణపడి ఉంది...

"జ్ఞానప్రసూనాలు" అనే టైటిల్ బుక్ ను తొలిసారిగా ఇరవైవేల రూపాయిలు ఖర్చు పెట్టి ప్రచురించారు 2012 లో.

అంతేకాక విలువైన ఆధ్యాత్మిక గ్రంథాలను వేలాదిగా కొని మరీ జిజ్ఞాసువులకు పంచి ఆధ్యాత్మిక తాపాన్ని తీర్చేది.

'గురు చరిత్ర' పుస్తకాలను కొన్ని వేలమందికి ప్రసాదించి వారి యొక్క భౌతిక, లౌకిక, ఆధ్యాత్మిక సమస్యలనుండి తప్పించేది.

విమలాశర్మగారిని ఒప్పించి జ్ఞానేశ్వరీ భగవద్గీతను తెలుగులోకి అనువదింపజేశారు...

ఇటు భౌతికమైన ఆకలిని,<br>
అటు ఆధ్యాత్మికమైన ఆకలిని<br>
రెంటినీ తీర్చే మహాతల్లి పద్మావతమ్మ గారు.

* * *

వారితో కలిసి షిరిడీకి ఓ నాలుగైదుసార్లు వెళ్లాను...

షిరిడీ చూశాక, అది ఆధ్యాత్మిక క్షేత్రంగా నాకు అనిపించలేదు.

అక్కడ ఆధ్యాత్మికం కన్నా వ్యాపారం యెక్కువ కనబడింది.

"షాపింగ్ మెంటాలిటీ" ఉన్నవాళ్లు అధికంగా కనిపించారు...

షిరిడీయాత్ర అంటే సర్వస్యశరణాగతికి రంగం సిద్ధం చేయడం, అంతేగాని షిరిడీలోని బజారు సరుకును మనింటికి బదిలీ చేయడం కాదు.

నేనూ పద్మావతమ్మగారు క్రొత్త పుస్తకాల కోసం వెతికేవాళ్లం...

అన్నీ సాయి చరిత్రలే....<br>
కానీ రచయిత మారితే చాలు...<br>
మాకది క్రొత్త పుస్తకమే లెక్క...<br>
కొనేసేవాళ్లం....<br>
చదివి మరునాడు ఎవరికో కానుకగా ఇచ్చేసేవాళ్లం.

వారు ఈ రోజు(27-4-2021- చిత్రా పౌర్ణమి నాడు) బాబాలో ఐక్యం అయ్యారు....

హిందూధార్మిక ఉపన్యాసకులైన అక్బర్ భాషాగారు ఫోన్ చేసి చెప్పారు...

ఆ వార్త విని ఒక చుక్క కూడా కన్నీరు రాల్చని
జడత్వం ఇచ్చింది నాకీ అద్వైతం...

ఏడ్వడంలో ఉన్న సుఖాన్ని పోగొట్టింది నాకీ అద్వైతం.

* * *

ఈ ఉదయం(29-4-2021) నేనూ ప్రసాద్ వాకింగ్ పూర్తి చేసుకుని కేరళా అంగట్లో టీ త్రాగి గురుసన్నిధికి వెళ్లాం...
గురువుగారు TTD ఛానెల్ చూస్తున్నారు...

రాత్రి నాకొచ్చిన కల గుఱించి చెప్పాను...

నా కలలో మీరు-
బయట అధర్మం ఎక్కువగా ఉంది...
బయట యెక్కువగా తిరక్కండి...
అని చెప్పారు....అన్నాను.

అవునా.....అన్నారు....

బయట యెక్కువుగా తిరక్కండి...అనే మాటను "వ్యవహారం ఎక్కువగా పెట్టుకోకండి" అన్న అర్థాన్నే తీసుకున్నాను ఆ స్వప్నంలో కూడా.

వ్యవహారం యెంత తక్కువగా ఉంటే అధర్మం అనే వైరస్సు మనకు అంటుకునే ఛాన్స్ అంత తక్కువగా ఉంటుంది.

తరువాత పద్మావతమ్మ గారి మరణవార్త చెప్పాను గురువుగారికి...

గురువుగారు రవ్వంత కూడా ప్రతిస్పందించలేదు...
సిగరెట్ ను త్రాగడమూ ఆపలేదు...
T.V.వైపు చూడడమూ మానలేదు...

ఒక్క క్షణం...ఆ మహాత్ముడు "కఠినాత్ముడు"గా కనబడ్డాడు...

కాసేపాగి నా వైపు తిరిగి,
ఉండేది నేనొక్కణ్ణే అయినప్పుడు
పుట్టేది ఎవరు? గిట్టేది ఎవరు? అన్నారు నిమ్మళంగా....

ఆ మాటంటున్నప్పుడు...వారి ముఖం దివ్య తేజస్సుతో వెలిగిపోతోంది....

ఆ సమయం...ఆ వాతావరణం...
చాలా గంభీరంగానూ, ప్రశాంతంగానూ ఉండి
"వారు" "మేము" అనే బేధాన్ని తొలిగించేశాయి...
వారి ఏకాత్మనిష్ఠ అటువంటిది.
బహువచనం పోయి...ఏకవచనం మిగిలింది...

వారి సన్నిధిలో యెంతమంది ఉన్నా....
ఒకరే ఉన్నట్టు అనుభూతిని కలిగిస్తుంది.

చావు అనేది బ్రతికుండేవాడికేగానీ, మరణించినవాడికి కాదు...అన్నారు...

పుట్టుక గురించి
పుట్టక ముందు ఉన్నవాడు చెప్పాలి...
చావు గురించి
చచ్చిన తర్వాత ఉన్నవాడు చెప్పాలి...

వాడి అడ్రసు మనకు తెలియకపోయా...
ఆ మందల(వివరం) మనకు తెలియకపోయా...

మధ్యలో ఉన్న మనం ఆ రెంటిని గురించి...అనగా మన అనుభవంలో లేని చావు-పుట్టుకలను గురించి మాట్లాడుకుంటాము....అదే చిత్రం...! అన్నారు.

అనుభవములో లేవు...అంటే,
అవి ఉండి, మనకు తెలియకపోవడం కాదు,
అవి లేక, తెలియకపోవడమే...అన్నారు.

ఈ అధ్యాత్మికంలో అనుభవమే పరమప్రమాణం.
అనుభవంలో ఉంటేనే ఉన్నది.
అనుభవంలో లేదంటే లేనిదే.

పుట్టుక-చావు రెండూ మన అనుభవంలో లేవు కాబట్టి అవి అసలు లేనే లేవు అని తేల్చారు.

* * *

ప్రతి సంపుటనకూ కామా పెట్టుకుంటూపోతే అది జీవనయానం.
ఏ క్షణానికాక్షణం ఫుల్ స్టాప్ పెట్టేస్తుంటే అది అధ్యాత్మిక యానం.

కామాపెట్టడం వల్లనే ప్రతీది కార్య-కారణ సంబంధంతో ముడిపడిపోతోంది.

వాస్తవానికి సంపుటనలన్నీ విడి విడి భాగాలే.
వాటినన్నింటినీ కలిపి చూపిస్తుంది ఈ కామాలు.
ఈ కామాలే మాయాచిహ్నాలు.

ప్రతి క్షణానికి ఫుల్ స్టాప్ పెట్టేస్తే అదే సదావర్తమానం,అదే పరమార్థం.

కొనసాగింపులేని మనసును కలిగి ఉండడమే మోక్షం.

కామా - మెలకువ.
ఫుల్ స్టాప్ - నిద్ర.

సదా ఫుల్ స్టాప్ లో  ఉంటే
అదే నిజమైన మెలకువ.

కామాలు పెడితే
అదే స్వప్నము, అదే జీవితము.

సద్గురుదేవులవారు సదా ఫుల్ స్టాప్ లో సంస్థితమై ఉంటారు కాబట్టే....

దేనికీ ప్రతిస్పందించరు...
వారొక అచలం(పర్వతం)

వారి సన్నిధిలో ఉండే శాంతి,
పర్వత శిఖరాన ఉండే శాంతి లాంటిదే.

పర్వతమార్గమంతా  కామాలే.
పర్వత శిఖరం ఫుల్ స్టాప్.

అక్కడ ఉన్నదంతా ప్రశాంతమే.
అన్యం తోచని ఏకత్వమే.

నామరూపాలు లేని అనంతమే.
అదే "నేను".

* * *

57. తెలియదు

___________

సమాధానం ఉండే ప్రశ్న - ప్రశ్నే.

కానీ సమాధానం లేని కేవల ప్రశ్న, ప్రశ్న కాదు,
అది దైవస్వరూపమే.

ఆ సమాధానం లేని కేవల ప్రశ్న "నేనెవడను" అనేదే.

"నేనెవడను" అన్న ప్రశ్నే
బ్రహ్మావిష్ణువుల యెదుట శివజ్యోతి స్తంభంగా వెలసింది.

వెలసింది అంటే అప్పుడే వెలసింది అనికాదు,
బ్రహ్మావిష్ణువులకు అప్పుడే తెలిసింది అని.

దేశకాలములకు అతీతమైన పరమాత్ముడే
ఆ స్తంభం.

సృష్టి అనే అంతవంతమైన తీగకు ఆలంబన
ఆ అనంతమైన స్తంభం.

ఆ స్తంభం యొక్క అంతు(అంచు) కనుగొనాలని బ్రహ్మావిష్ణువులు చేసిన ప్రయత్నమే సైన్స్ లో తొలిప్రయోగం.

క్రిందకు తవ్వుతూ ఒకడు(విష్ణువు)
పైకి ఎగురుతూ ఒకడు(బ్రహ్మ)
అన్వేషణ ప్రారంభించారు.

ఉనికే లేని దేశకాలాలు వారి వ్యర్థప్రయత్నాన్ని చూసి ఎగతాళి చేశాయి.

విష్ణువు సిగ్గుపడి యథాస్థానం చేరుకున్నాడు.
"నాకు తెలియదు" అన్న పరమసత్యాన్ని ఆవిష్కరించాడు. శివుడు

సంతోషించాడు.

కాలాన్నే చక్రంగా శివుని చేత బహుమానంగా పొంది చక్రహస్తుడైనాడు.

"కనుగొన్నాను" అనే ఓ పెద్ద అబద్ధంతో
బ్రహ్మ అహాన్ని అలంకరించుకుని
దొంగసాక్ష్యాలతో తిరిగొచ్చాడు.
'గుడిలేని దేవుడు'గా శివుని చేత శాపం పొందాడు.
తన తలవ్రాతను తానే అలా వ్రాసుకున్నాడేమో!

కాబట్టి విజ్ఞానశాస్త్రంలో "తెలుసు" అనడం గొప్ప.
అధ్యాత్మికశాస్త్రంలో "తెలియదు" అనడం గొప్ప.
* * *
"నాకు తెలియదు" అని
సిగ్గుపడకుండా చెప్పేవాడు - జ్ఞాని.

"నాకు తెలుసు" అని
సిగ్గులేకుండా చెప్పేవాడు - అజ్ఞాని.
* * *
"నాకు తెలియదు" అన్నా
"భగవదిచ్ఛ" అన్నా
రెంటి అర్థం ఒక్కటే.
* * *
"నాకు తెలియదు" అన్న స్థాయికి శిష్యుణ్ణి ఎదగనిచ్చేవాడే నిజమైన గురువు.

"నాకు తెలుసు" అనే బరువును శిష్యుని బుర్రలో  పెట్టేవాడు కపటగురువు.

జ్ఞానం పెరిగేకొద్దీ మనం అజ్ఞానులమో తెలుస్తుంది...అంటారు వివేకానంద.
* * *
"అల్లా మాలిక్" అని బాబా అన్నా

"అప్పా! నీ ఆజ్ఞమేరకు వచ్చాను" అని రమణుడు అన్నా.

"అంతా జగజ్జనని ఇచ్ఛ" అని రామకృష్ణులు అన్నా

తమ అల్పత్వాన్ని, తెలియనితనాన్ని బాహాటంగా తెలియజేయడానికే...

అందుకే వారి బోధలన్నీ శరణాగతి వైపుకే దారి తీస్తాయి...

"నాకేమీ తెలియదు" అని ఉత్తినే మాట వరుసకు అంటే చాలదు,
త్రికరణశుద్ధిగా నాకేమీ తెలియదు అని ఉండాలి.

పైకి "అప్రయత్నంగా" కనిపిస్తే చాలదు.
త్రికరణశుద్ధిగా అప్రయత్నంగా ఉండాలి.

బరిణెలోకి ఏనుగును పట్టించలేం అని తెలిసి
అప్రయత్నంగా ఉండడమన్నమాట.

అంతేగాని పైకి చెప్పి...లోపల ప్రయత్నం చేయడం కాదు.

అప్పుడే అది నిజమైన శరణాగతి అవుతుంది.
అంతేగానీ భగవాన్ అన్నట్టు ప్రతిరోజా బోర్లాపడి లేస్తుండడం శరణాగతి కాదు...

పరిమితులను గుర్తించడం ఒక ప్రజ్ఞ.
ప్రకృతిలోని సహజ పరిమితుల నుండి నువ్వు విముక్తి పొందాలని ప్రయత్నిస్తున్నావ్. అదే నీ దుఃఖానికి, బాధకి కారణం....అంటారు UG.
* * *

84లక్షల జీవరాసుల్లో ఒక్క మనిషి తప్ప
మిగతా అన్ని జీవరాసులూ
ప్రకృతి శాసనాన్ని ఎదిరించక, ఏ సందేహమూ లేక
బ్రతికేస్తున్నాయి...చచ్చిపోతున్నాయి...

ఒక్క మనిషే ప్రకృతి శాసనాన్ని అధికమించడానికే ప్రయత్నిస్తుంటాడు.

బాహ్యంగా చేసే ప్రయత్నానికి సైన్స్ అని పేరు.
ఆంతరంగా చేసే ప్రయత్నానికి తపస్సు అని పేరు.

వైజ్ఞానికంగా మార్స్ పైకి రాకెట్ తో దూసుకెళుతున్నా సరే...

సౌకర్యవంతమైన వస్తువులు ఇంటి నిండా నింపేసుకున్నా సరే...

ఇంకా ఏదో అసంతృప్తి...ఏదో అస్పష్టత...
అంతరాంతరాలలో ఏ మూలో నలుగుతున్న సంశయం...గంభీరమైన విచారం...

ఇది మనిషికి అనాది నుంచి వస్తున్న స్వాభావ వారసత్వం కాబోలు...

ఈ తత్కాలిక ఐహిక సుఖాల నుంచి
ఈ మానసికవ్యధ నుంచి తప్పించుకుని 'శాశ్వతానందం' పొందే దిశగా మనిషి చేసే ప్రయాణమే ఆధ్యాత్మికం అయ్యింది.

* * *

పుట్టాలని పుట్టలేదుగాని, పుట్టాడు.
చావాలని చావడు గాని, చస్తాడు.

ఎందుకు పుట్టాలో, ఎందుకు చావాలో
చచ్చేలోపు కనుగొనే ప్రయత్నమే ఆధ్యాత్మికం అయ్యింది.

ఈ శరీరమే నేనని మోసుకు తిరుగుతుంటాడు... శరీరంలోపల ఏం జరుగుతుందో(అనాటమీ) తెలియదు.

ప్రతిదానికీ నేను-నేను అంటూ తెలిసినట్టే వ్యవహరిస్తుంటాడు.
కానీ నేను(ఆత్మ) గురించి ఏమీ తెలియదు.

తెలుసు-తెలియదు ఈ రెంటి మధ్య ఊగిసలాడుతుంటాడు మనిషి.

భౌతికత-ఆధ్యాత్మికత ఈ రెంటి మధ్య
ఊగిసలాడుతుంటాడు మనిషి.

* * *

ఈ ఊగిసలాటను పోగొట్టే ఉపాయాన్ని సద్గురుసన్నిధిలో
పొందవలసిందేగానీ ఇక వేరే మార్గం లేదు.

పరిపూర్ణానుభవాన్ని పొందే అటువంటి ఉపదేశాన్ని నేను సద్గురు సన్నిధిలో పొందాను...

అది మీకు పనికొస్తుందేమో చదవండి...

* * *

నాలుగు పావలాలు కలిస్తే రూపాయి అయినట్టు

ఒకటవ పావలా - వ్యక్తి(నేను)
రెండవ పావలా - సంసారం(నాది)
మూడవ పావలా - జగత్తు.
నాల్గవ పావలా - జగదీశ్వరుడు.

ఈ నాల్గింటిలో ఒకటవభాగమైన వ్యక్తిగా(ఒక పావలాగా) మాత్రమే
తానుండడం వల్లనే
అనగా వ్యష్టిభావనే తన అసంతృప్తికి కారణం.

* * *

1. నేను అంటే ఈ తనువు మాత్రమే తానని
ఉన్నవాడు - పావలా(బ్రహ్మచర్యాశ్రమం)

2. నేను అంటే 'తను, సంసారం'
నేనని ఉన్నవాడు - అర్థరూపాయి(గృహస్థాశ్రమం)

3.నేను అంటే 'తను, సంసార, ప్రపంచములు' కలిపి నేను అని ఉన్నవాడు -
ముప్పావురూపాయి
(వానప్రస్థాశ్రమం)

4. నేనుఅంటే 'తను, సంసార, ప్రపంచ, దైవములు' కలిపి నేను అని
ఉన్నవాడు-రూపాయి (సన్న్యాసాశ్రమం)

పూర్ణానుభవం అనేది 'రూపాయి'కి తప్ప
నాల్గు పావలాలలో ఏ ఒక్క పావలాకూ  కలుగదు.
ఏ ఒక్క పావలా పూర్ణం కాదు. మిగతా మూడుపావలాలతో కలిస్తేనే పూర్ణం.

కాబట్టి పావలాగా ఉన్న నీవు
రూపాయిగా విస్తరించడమే మోక్షం.

పావలాగా ఉన్నప్పుడూ 'తెలియదు' అని ఉంటాడు.
రూపాయిగా ఉన్నప్పుడూ 'తెలియదు' అని ఉంటాడు.

మొదటి 'తెలియదు' - జ్ఞానము లేక.
రెండవ 'తెలియదు' - అన్యము లేక.

* * *

58. లోకవత్ లీలా కైవల్యం

---

మా స్నేహితురాలు కిరణ్మయి సరదాగా అనిపించే
ప్రార్థన ఒకటి వ్రాసి పంపింది-

"మేము గిలగిలా కొట్టుకునేట్టు నీవు మమ్ము బాధపెట్టడం
మేము లబలబా అని నిన్ను శరణువేడడం
నీవు బిరబిరా వచ్చి మమ్ము కాపాడడం
ఏమిటి శివా! యుగాలపర్యంతం ఈ వింత నాటకం!
నీకు వేరే కాలక్షేపమే లేదా?
అమ్మా జ్ఞానాంబా...!
కాస్త మందలించు మీ ఆయన్ను.
కాస్త ఆలకించు మా ఆవేదన్ను."

* * *

భగవంతునిది బాల్యచేష్టలు కాకపోతే
ఈ సృష్టి చేయడమేమిటి?
ఈ అల్లరేమిటి?
మళ్లీ లయం చేయడమేమిటి? అనిపిస్తుంది.
పిల్లలు బొమ్మరిళ్లు కట్టి, ఆడి, మళ్లీ కూలద్రోసినట్లు.

కాకపోతే
పిల్లలది చిన్నబొమ్మరిల్లు.
దేవునిది పెద్దబొమ్మరిల్లు.
అంతే తేడా.

* * *

దేవుడు ఎందుకు సృష్టి చేశాడు?

సాటి మనిషినయితే "ఎందుకు చేశావు ఈ పని?"
అని అడగ్గలమేగాని,
భగవంతుణ్ణి తప్పుపట్టగలమా?
ఆయన స్వేచ్ఛావిహారాన్ని అడ్డగించేశక్తిగాని,
ఎందుకు? అని ప్రశ్నించే అధికారంగాని
ఈ సృష్టిలో ఎవరికీ లేదు.

ఇవన్నీ ఎందుకు జరగాలి? అని ప్రశ్నిస్తే
"ఎందుకు జరక్కూడదు?" అని యెదురు ప్రశ్న వేయడా భగవంతుడు?

అంతేకాదు "నేనేం చెయ్యాలో నువ్వు నాకు సలహాలివ్వాల్సిన అవసరం లేదు" అని అంటాడు కూడా.

భగవంతునికి సలహాలివ్వాలంటే-
భగవంతుని సృష్టికి మునుపే నువ్వు ఉండి ఉండాలి.

సృష్టిప్రయోజనం సృష్టికర్తదేగాని,
సృష్టిలో భాగమై ఉన్న ఎవ్వరిదీ కాదు.

కానీ ఆయన సృష్టి వలన మాకు ఇబ్బందిగా ఉందికదా! అంటారేమో!

ఎవరయ్యా మీరు?
ఆయన కాక వేరెవరున్నారు?
మీరు ఆయనకు వేరయితే ఆయనను నిందించవలసిందే.

కానీ అన్ని పాత్రలూ (వేషాలూ) ఆయనే స్వయంగా నటిస్తుంటే- ఆయన ఏ తప్పు చేసినట్టు?

దొంగా ఆయనే, పోలీసూ ఆయనే అయినప్పుడు ఆయన్ను ఎలా నిందించగలం?

"లోకవత్ లీలా కైవల్యం" అంటుంది బ్రహ్మసూత్రం.

* * *

ఆయన సత్తను - ఉనికిని అన్నిచోట్లా అనుభవిస్తేగాని ఈ లీల మనకు అర్థం కాదు.

అంతవరకు గోలగానే ఉంటుంది మనకు.

"ఉండేది భగవంతుడు ఒక్కడే" అని అనుభవమైతేగాని,
"ఎందుకు" అన్న ప్రశ్న తొలగదు.

భగవంతుడే అన్నిటిగాను అయ్యాడనే బుద్ధి కలిగితే,
అన్ని సమస్యలూ తీరిపోతాయి.
అల్లరి, అశాంతి తొలగిపోతుంది.

ఆయనే అన్నీ అన్నప్పుడు
ఆయన మంచీచెడూ ఎందుకు చేశాడనే ప్రశ్నేరాదు.

భగవంతుని లీల కొనసాగాలంటే మంచి-చెడులు రెండూ ఉండవలసిందే.

ఎవరికి మంచి? ఎవరికి చెడు?
మేలు చేసినా, కీడు చేసినా అన్నీ తనకే కదా!
అసలు అన్నీ తానే కదా!

తిరుగలిని త్రిప్పేదీ ఆయనే
తిరుగలిలో నలిగేది ఆయనే
అయినప్పుడు ఎవరు ఎవర్ని హింసిస్తున్నట్టు?

* * *

ఉండేది భగవంతుడొక్కడే...
మాటవరసకు కూడా రెండవదానిని
అంగీకరించవద్దు...అని గురువు గారు యెన్నోసార్లు చెప్పి మమ్మల్ని
ఏకత్వానుభవంలో నిలబెట్టారు.

ఎవడో శ్వాసిస్తుంటే నేను శ్వాసిస్తున్నానని అంటావు.
ఎవడో తలుస్తుంటే నేను తలుస్తున్నానని అంటావు.
ఎవడో జీవిస్తుంటే నేను జీవిస్తున్నానని అంటావు.

ఎవడి అనుభవాన్నో పట్టుకొని నా అనుభవం అంటావు.
ఎవడి ఉనికినో పట్టుకొని నా ఉనికి అంటావు.

అసలు నీవు లేవు.
ఇది తెలుసుకోవడమే శరణాగతి.

* * *

ఏకా ఏవ అహం జగతి అత్ర
ద్వితీయా కా మమ అవరా

- చండీ సప్తశతి 10-5

ఈ ప్రపంచంలో నేను మాత్రమే ఉన్నాను.
నేనుగాక రెండవవారు ఇంకెవరున్నారు?

* * *

ప్రతి క్షణం దైవాధీనమే.
ప్రతి అణువు దైవస్వరూపమే.
ప్రతి అనుభవం దైవానుభవమే.

* * *

భగవంతుడు"గా" - సదా ఏకంగానే ఉన్నాడు.
భగవంతుని"లో" - అంతులేని వైవిధ్యమున్నది.

అనంత విచిత్రాలతో కూడినది ఆయన స్వరూపం.
ఆయన ఇది మాత్రమే మరొకటి కాదు అనడానికి లేదు.
సర్వమున్నతని దివ్యకళామయమంచు
విష్ణునందుల్లము జేర్చి తారడవి నుండుట మేలు... అంటారు పోతన.

* * *

వూరుకున్న జీవునికి వొక్కొక్క స్వతంత్రమిచ్చి
కోరేటి యపరాధములు కొన్నివేసి
నేరకుంటే నరకము నేరిచితే స్వర్గమంటూ
దూరువేసేవింతే కాక దోషమెవ్వరిదయ్యా

మనసు చూడవలసిన మాయలు నీవే కప్పి
జనులకు విషయాలు చవులు చూపి

కనుగొంటే మోక్షమిచ్చి కానకుంటే కర్మమిచ్చి
ఘనము సేసేవిందు కర్తలెవ్వరయ్యా

వున్నారు ప్రాణులెల్లా నొక్క నీ గర్భములోనే
కన్న కన్న భ్రమతలే కల్పించి
యిన్నిటా శ్రీవేంకటేశ యేలితివి మమ్మునిట్టె
నిన్ను నన్ను నెంచకుంటే నీకే తెలియునయ్యా

సర్వాంతరాత్ముడవు నీవు శరణాగతుడ నేను
సర్వాపరాధినైతి చాలు జాలునయ్యా....
అంటారు అన్నమయ్య.

* * *

ఆత్మసంస్థం మనఃకృత్వా
న కించిదపి చింతయేత్
- భగవద్గీత 6-25

ఆత్మయే సర్వమూ.
దానికంటే భిన్నమైనది వేఱొకటి ఏదీలేదు.
అనే భావముతో మనస్సును ఆత్మలో లయపరచాలి.
ఇక దేన్ని గుఱించీ చింతన చేయకూడదు(ప్రాధాన్యత ఇవ్వకూడదు)
ఇదే గొప్ప అనుష్ఠానం.

* * *

శుద్ధచైతన్యస్థితిలో అసలేమీ(జరగడం)లేదు.
ఏమీ జరగకపోయినా ఏదో జరుగుతున్నట్టు
అనిపించడం, కనిపించడం అనేది
శుద్ధచైతన్యంలోనే అభిన్నంగా ఉన్న మాయాశక్తి యొక్క వైచిత్ర్యం.
రెండూ ఏకకాలంలో ఏకబిందువులో సంస్థితమై ఉన్నాయి.
నీ దృష్టిని ఎటువైపు ఉంచితే నీవది అవుతావు.
ఇదే ఈ జ్ఞానశిశువు యొక్క చివరిమాట.

* * *

విశ్వసృష్టికి కారణం లేదు.
ఇది కేవలం ఒక లీల.
విశ్వచైతన్యపు ప్రదర్శన.

ఎలాగైతే నాట్యము, నాట్యకారుడూ విడివిడిగా ఉండలేరో
అలాగే సృష్టి, సృష్టికర్త వేర్వేరు విషయాలు కావు.

ఈ తత్త్వానికి సూచనయే నటరాజస్వామి.
ఆయన ఆనందనాట్యమే ఈ విశ్వం.
ప్రపంచం ఆయన ఆనందోత్సవం.

ఉత్సవం అంటే ఒకటి గుర్తుకు వస్తోంది...

గతంలో గురువుగారి పుస్తకం కవర్ పేజీ కోసమని ఓ మేటరు
తయారుచేశాను...

అదిప్పుడు గుర్తుకు వస్తోంది...

అదే ఇది -

జ్ఞానశిశువులమైన మనమందరం ఈ ప్రపంచోత్సవానికి ఆహ్వానింపబడ్డాం...
నిజానికి ఈ ఉత్సవంలో (ప్రపంచంలో)
మనకు ఏ కర్తవ్యకర్మలూ లేవు.

ఈ ఉత్సవం మోజులో పడి,
మనమెవరిమో మరిచిపోయినప్పుడు,

మనమెవరిమో మనకు గుర్తుకు తెచ్చి
మనల్ని "స్వస్థానం" చేర్చే బాధ్యతను జ్ఞానాంబకు(గురువుకు)
అప్పగించాడు అనిలాచలశివుడు.

గుర్తుకు తెచ్చే ప్రక్రియే గురుబోధ.

ఈ జీవితంలోని కష్టసుఖాలన్నీ
ఆనందోత్సవంలో భాగమే.

స్వస్థానం చేరుకున్నాక ఈ కష్టనష్టాలన్నీ నవ్వులాటగా తోస్తాయి...
* * *

ఈ వ్యాసం వ్రాయడం పూర్తవగానే
అవధూత భీమశంకరయ్య దర్శనం అయ్యింది.
ఆ దర్శనం ఈ వ్యాసానికి "సంతకం" అయ్యింది.

బీడీకట్ట అగ్గిపెట్టె ఇచ్చాను...
వారు బీడి త్రాగే style చూడ ముచ్చటగా ఉంటుంది...భగవత్ సృష్టి వలె.

* * *

59. ద్వితీయాద్వై భయం భవతి

---

ఈరోజు రమణ ఆరాధన(9-5-2021)
ఉదయాన్నే నేనూ దేవీప్రసాద్ బజారులో ఛాయ్ త్రాగి
సద్గురు సన్నిధికి వెళ్లాం...
గురువుగారు T.V.లో తిరుమల ఛానెల్ చూస్తున్నారు...
రవి పూజాగదిని ఊడుస్తున్నాడు...
కాసేపు బయటే ఆగి, లోపలికెళ్లాం...
గురువుగారు బొట్టు పెట్టి, తీర్థం ఇచ్చారు...

సత్సంగం బోసిగా కనిపించింది...
కారణం... త్రిపుర, పిల్లలు రాత్రి విజయవాడకు వెళ్లిపోవడమే....
వారుంటే ఎంతో సందడిగా ఉండేది...

త్రిపురగారి పెద్దమ్మాయి అనామిక అయితే ప్రొద్దున్నే టీ పెట్టి
గురువుగారికివ్వడం కాడ నుంచి, వాకిలి ఊడ్వడం కాడ నుంచి,
గురువుగారు దగ్గినప్పుడు ఉమ్ము పాత్రను వారి నోటి వద్ద పట్టడం నుంచి,
వారు రాత్రి నిద్రపోయేవరకు అలా కనిపెట్టుకుంటూ తల్లిలా సేవ చేసేది.
ఎంతో బాధ్యతతో, నిబద్ధతతో గురుసేవ చేసేది.

తొలి నుంచి ఇప్పటివఱకు గురుసేవ చేసినవారిలో
ప్రథమస్థానం అనామికదే.

"అనామిక"(పేరులేనిది) అని గురువుగారే స్వయంగా పేరుపెట్టారు...

అన్ని నామాలూ తానై, ఏ నామమూ లేని "అనామకుడు" భగవంతుడు.

ఈమె అనామిక.
ఈమె బాలజ్ఞానాంబిక.

ఆ తల్లి చిన్నిపాదాలకు నా ముద్దులు.
అలాంటి చిట్టితల్లి నా వొళ్లో కూర్చుని సరదాకబుర్లు చెబుతుంది...
నా జన్మ ధన్యం.

* * *

నేను ఇంటి వద్ద ఉన్నప్పుడు ఒక దృశ్యం.
నేనూ ప్రసాద్ కలిసి టీకొట్లో ఉన్నప్పుడు ఒక దృశ్యం.
మేం గురుసన్నిధిలో ఉన్నప్పుడు ఒక దృశ్యం.

నేను ఇంటి వద్ద నుండి గురువు వద్దకు చేసిన ప్రయాణం, దృశ్యంలో నేను చేసిన ప్రయాణంగా అనిపిస్తుంది....కాదు.
అది దృశ్యమే చేసిన ప్రయాణం.

"నేను" ఉన్నచోటునే ఉంటాను.
"తెర" వలె.

తెరమీద దృశ్యం ఒకదాని తర్వాత ఒకటి మారుతున్నట్లు...
నా యెదుట దృశ్యం కదులుతుంది...
నేను కదలటం లేదు...
బాబు కూడా దృశ్యంలో భాగమే...

నేను ప్రయాణిస్తున్నాను...అంటాడు.
"నేను" ప్రయాణించదు...
బాబు(దృశ్యం) ప్రయాణిస్తుంటుంది(మారుతుంటుంది).

నిద్ర అన్నా, మరణం అన్నా దాని అర్థం-
దృశ్యం తనలోకి ఉపసంహరింపబడడమే.

"సమాప్తం" దృశ్యానికేగాని
తెరకు కాదు.

చావుపుట్టుకలు దృశ్యానికేగాని,
"నా"కు కాదు.

* * *

కరోనా భయం గుఱించి ప్రస్తావనకు వచ్చింది-
నిద్రపోతే ఏ భయమూ ఉండదు...అన్నాడు ప్రసాదు.

అవును నిద్రపుచ్చడానికే వచ్చింది ఈ కరోనా...
అన్నారు గురువుగారు.

నిద్ర నుండి లేస్తే - అది నిద్రే.
లేవకుంటే - అదే మరణం.

* * *

ఓ స్వామి ముఖానికి మాస్క్ వేసుకొని దత్తపూజ చేస్తున్న దృశ్యాన్నీ చూశాను...

భార్యకు కరోనా అని ఓ భర్త ఆమెను ఇంట్లోనే విడిచి తాను మరో సురక్షితప్రాంతంలో గడిపిన దృశ్యాన్నీ చూశాను...

అక్కడ భక్తికి తావేది?
ఇక్కడ ప్రేమకు తావేది?

నేను ఎప్పుడో చదివిన ఓ మినీ కవిత ఒకటి గుర్తుకువస్తోంది....

రాతిగుండుకు పూజలెందుకు?
రాతి గుండెకు ప్రేమలెందుకు?

అది చలించదు.
ఇది ఫలించదు.

* * *

భక్తి, ప్రేమ...ఇవన్నీ అర్థం లేనివిగా అయిపోయాయి ఈ కరోనా సీజన్ లో...
వీడి విశ్వాసాలను, విజ్ఞానాలను అపహాస్యం చేయటానికే ఈ కరోనాతల్లి కరాళనృత్యం చేస్తోందని అనిపిస్తోంది.

* * *

పంచేంద్రియఖలులు మదిలోన దూరుచో
మదిని నీ వుండవో యరుణాచలా

అంటారు రమణ భగవానులు...

వైరస్సు మన ముక్కులో దూరేటప్పుడు
మన ఇష్టదైవం ఆ మాత్రం మన ముక్కు వద్ద కాపాలా కాయలేదా?
ఆ మాత్రం మనకు దైవం మీద విశ్వాసం లేనప్పుడు ఈ భక్తి, ఈ
ఆధ్యాత్మికం అపహాస్యం కాలేదా?

* * *

మనం పీల్చే శ్వాసల కోటా
ముందుగానే నిర్ణయింపబడి ఉన్నవి.

మన చివరి శ్వాస పీల్వడం అవగానే
ఎన్ని ఆక్సిజన్ సిలండర్లు పెట్టినా
ఇంకొక్క శ్వాసను కూడా పీల్చుకోలేవు.

పైగా ప్రాణాయామం ద్వారా ప్రాణవాయువును బంధించే సంస్కృతి మనది.

అంతేగాని ప్రాణవాయువు కోసం దేబిరించే సంప్రదాయం కాదు మనది.

రోగం వచ్చాక నయం చేయడానికి అవసరమైన  పరికరాలను పెంచడంలో
అభివృద్ధి సాధించింది ఈ పాశ్చాత్య విజ్ఞానశాస్త్రం.

అసలు వ్యాధినే రాకుండా చేసే జీవనవిధానాన్ని మనకు ప్రసాదించింది
మన సనాతన ధర్మం.

* * *

వరదప్రవాహాన్ని దాటుతున్న తల్లికోతి కథ చెప్పారు
గురువుగారు....

బిడ్డను నెత్తినపెట్టుకుని నదిని దాటుతోంది ఆ తల్లికోతి....
ఒక చోట వీలుకాని పరిస్థితి  వచ్చింది....
పిల్లను కాళ్లక్రింద తొక్కి దానిపై నిలబడి ఊపిరి పీల్చుకోవడానికి
ప్రయత్నించింది...

మన ప్రేమలు, బంధాలు కూడా అంతే...
తన ప్రాణానికి ముప్పు రానంత వరకు అన్నీ బాగానే ఉంటాయి...

తన ప్రాణం మీదకు వచ్చినప్పుడు అవన్నీ ఉత్తుత్తివే అనేది తేలుతుంది.

తానే ముఖ్యం...దేవుడు కూడా secondary....
అన్నాను నేను.

"అవును" అని నొక్కి అన్నారు గురువుగారు.

* * *

ఓ పౌర్ణమి నాడు అరుణాచలప్రదక్షిణం చేస్తున్న లక్షలాది జనం వైపు చూస్తూ
అరుణాచలయోగి రాజారాం అన్నాడు....

ఇదంతా భక్తి అని అనుకునేవు....
ఇది భక్తికాదు,  భయం...అన్నాడు.

ఆ మాట నాకు చాలా అద్భుతంగా అనిపించింది.

భయమే లేకుంటే అరుణాచలమూ అవసరం లేదు,
అరుణాచలప్రదక్షిణమూ అవసరం లేదు.

ద్వితీయాద్వై భయం భవతి...
రెండవది ఉన్నదన్న మనోభావన వలననే భయం జనిస్తూంది...
దానివల్లనే మనిషి మరొక మనిషిని(లేదా జీవిని) తనకంటే వేరుగా చూచి భయం పొందుతున్నాడని శాస్త్రం పేర్కొంది.

* * *

తిరుమల ప్రాచీన కాలం నుండి ఇప్పటి వరకు ఎంతో మారింది....మారనిది ఒక్కటే...వేంకటేశ్వరస్వామి విగ్రహం...అన్నారు గురువుగారు.

అలానే ఈ దేహం, ఈ ప్రపంచం ఎంతగా మారుతున్నా
మారనిది ఒకటి తనలోనే ఉన్నది.
ఆ "ఒకటే" నిజంగా వేంకటేశ్వర స్వామి...అన్నారు.

ఆ "ఒకటి" తానే అని అనుభవమయ్యేవఱకు ఈ భయాలు పోవు.

నిద్రలో ఏకంగా ఉంటూ
మెలకువలో అనేకం అవుతోంది...

మెలకువలో బంధంగా ఉంటూ
నిద్రలో మోక్షంగా ఉంటోంది.

నిద్రలో సహజంగా ఉన్న ఆ ఏకాత్మస్థితిని
మెలకువలోకూడా నిలుపుకోవడానికి చేసే ప్రయత్నమే
'ఆత్మవిచారణ' అయ్యింది.

ఆత్మవిచారణ ఫలితం ఏకత్వానుభూతి.
ఏకత్వానుభూతి వలన కలిగేది నిర్భయత్వం.

ఇది తప్ప ఎన్ని ఎత్తులు వేసినా,
తాయెత్తులు వేసినా
భయం పోదు.

భయమే సకలరోగాలకు కారణం.
వైరస్సులు కావు.

భయం జ్ఞానం వలన తొలగుతుంది.
జ్ఞానం గురువు వలన కలుగుతుంది.
* * *

## 60. గురువు - బరువు

---

ఓరోజు సత్సంగంలో గురువుగారు ఓ నిర్ణయం చేశారు...

రేపటి నుంచి ఒక్కొక్కరు ఒక్కొక్క రోజు
నేను కూర్చునే కుర్చీలో కూర్చోవాలి...
నేను కూడా మిగతా అందరితో పాటు క్రిందే కూర్చుంటాను...అన్నారు.

అందరం అదిరిపోయాం.....

నేనైతే వెంటనే నిర్ణయించేసుకున్నాను....
నా వంతు వచ్చినప్పుడు ఆ రోజు సత్సంగానికి రాకుండా ఎగ్గొట్టేద్దామని...

ఆ "గురుస్థానాన్ని" మనం భరించగలమా?
మనకంత శక్తి ఉందా?

డ్రైవింగ్ రానివాడు తిరుమల బస్సును నడపడం లాంటిది....తనతో పాటు అందరినీ లోయలోకి త్రోసేస్తాడు...

గురుస్థానం అంటే అదొక కుర్చీ కాదు,
గురుస్థానం అంటే 'బరువు-బాధ్యత'.

గురువు కూర్చునే సోఫాలో కూర్చొని బాబు, త్రిపురలా సరదాగా ఓ ఫోటో తీసుకోవచ్చు...
కానీ గురువు కావడం కష్టం.

మా వేంకటముని మాష్టారులా కౌపీనం పెట్టుకుని సరదాగా ఓ ఫోటో తీసుకోవచ్చు...
కానీ రమణుడు కావడం కష్టం.

నానావలిలా బాబా కూర్చున్న రాతిబండపై కాసేపు సరదాగా కూర్చోవచ్చు...
కానీ బాబా కావడం కష్టం.

"గురువు కావడం ఎలా?" అని ప్రశ్నించకండి....

ఈ "ఎలా?" , "ఎందుకు?" ప్రశ్నలతో సాధించేదేమీ ఉండదు ఈ ఆధ్యాత్మిక ప్రయాణంలో.

మన రహదారిలో ఈ రెండు ప్రశ్నలే స్పీడ్ బ్రేకర్లు...

ఆ రెండు ప్రశ్నలు వదిలేస్తే, అసలు ప్రయాణమే ఉండదు.

ఉన్నచోటనే, ఉన్నరీతిగానే ఉన్నదేదో ఉన్నదిగానే
అనుభవంలోకి వస్తుంది.

పెళ్లి కూతురుకి ఏవి అలంకారాలో
శోభనానికి అవే ఆటంకాలు అన్నట్లు

పండితులు పలికే ఈ ఎందుకు-ఎలా అనే
ఈ తర్కపు మాటలన్నీ
సొగసైన ఆభరణాలు లాంటివి.
అనుభవానికి అవన్నీ ఆటంకాలే....

* * *

బాబా కూర్చున్న రాతిబండపై తాను కూర్చోవడానికి నానావలీ ఓ రోజు బాబాను తప్పుకోమని తాను కూర్చున్నారు....

ఓ ఐదు నిమిషాలు కూడా నానావలీ దానిపై కూర్చోలేకపోయారు....

గురుస్థానం అంటే విశ్వకేంద్రం.
గురుస్థానం అంటే  అదొక పెద్ద మోత.

మొత్తపువిశ్వపు బరువును తన నెత్తిన బెట్టినట్టే.
ఈశ్వరావతారుడైన గురువు తప్ప అన్యులు కూర్చోలేని స్థానం అది.
* * *

భక్తుల మానసిక, శారీరక రుగ్మతలను గురువు పుచ్చుకుని అనుభవించడం అనేది నిజమేనా? అని అడిగాను గురువుగారిని ఓ రోజు...

నేను ఆ ప్రశ్న వేసినప్పుడు గురువుగారి ఇంటి యెదురుగా ఉన్న ఒక షాప్ లో కూర్చుని ఉన్నారు....

అప్పుడే ఓ అమాయకబాలుడు ఉత్త చేతులతో వచ్చి ఏదో అడిగాడు షాప్ అతన్ని....డబ్బులు తీసుకురా ఇస్తాను...అన్నాడు ఆ షాపతను.

అప్పుడు గురువుగారు జోక్యం చేసుకొని-
డబ్బులు నేనిస్తాను...ఆ పిల్లాడికి ఏం కావాలో ఇచ్చి పంపండి...అన్నారు.

తరువాత నా వైపు తిరిగి ఇలా సమాధానమిచ్చారు-

డబ్బులు ఎవరో ఒకరు ఇవ్వనిదే అంగడివాడు సరుకులివ్వడు...

అంతే ఇది కూడా... భక్తుల కర్మలకు గురువు వకాలతు పుచ్చుకుంటాడు...అన్నారు.

ఎవడు చేసిన కర్మలను వాడే అనుభవించాలని రూల్ లేదు...మరొకరు వకాలతు పుచ్చుకుని అనుభవించే వెసులుబాటు ఉంది....

అలా లేకపోతే ఈ ప్రార్థనలకు, శరణాగతులకు, అనుగ్రహాలకు అవకాశం ఉండేది కాదు.

నా ఆయస్సు కూడా పోసుకుని బ్రతుకు నాయనా... అని పెద్దలు అంటుంటారు...

"నేనున్నానుగా భయమెందుకు?" అని సద్గురువు అభయానికి కూడా అదే అర్థం...

నేను సిగరెట్టు కాలుస్తున్నట్టు కనిపించినా
నిజానికి నేను కాల్చేది భక్తులు నాపై భారం వుంచిన కర్మలను...అన్నారు గురువుగారు.

ఋషులు యాగాగ్నిని ప్రజ్వలింపజేసినా,
బ్రాహ్మణులు నిత్యాగ్నిహోత్రాన్ని కొనసాగించినా,
బాబా యెడతెగక ధునిని రగిలించినా,
ఇంట్లో ఇల్లాలు దీపాన్ని వెలిగించినా,
అవధూతలు సిగరెట్టు ముట్టించినా....

అవన్నీ పాపకర్మలను దగ్ధం చేసే పవిత్రాగ్నులు...

భయం, రోగం, దుఃఖం....ఇవన్నీ  అజ్ఞాని యొక్క  వ్యక్త రూపాలు.

హాలాహలాన్ని మ్రింగిన శివుడిలా గురువు వాటిని తనలోకి స్వీకరించి జీర్ణం చేసేసుకుని భక్తులకు అమృతం లాంటి నిర్భయత్వాన్ని, ఆరోగ్యాన్ని, సుఖశాంతులను ప్రసాదిస్తాడు...

గురువుగారి సిగరెట్టు కాల్చే వ్యసనాన్ని కూడా ఈ బాబుగాడు భలేగా కవర్ చేస్తున్నాడ్రా...! అని భావించకండి....

వారు 60 ఏళ్లుగా సిగరెట్టు కాలుస్తున్నా సరే,
వారి ఊపిరితిత్తులను స్కానింగ్ చేసి చూసినప్పుడు  డాక్టరు ఆశ్చర్యపోయారు "అసలు మీకు సిగరెట్ అలవాటే లేదు" అన్నారు ఆ డాక్టరు.
అంత శుద్ధంగా ఉన్నాయి ఆ ఊపిరితిత్తులు...

మరి ఆ 60 ఏళ్ల పాటు కాల్చిన పొగంతా ఏమయ్యిందో!!!

గురువుగారు ఓ మాటనేవారు...
శరీరం లోపల అవయవాలున్నట్లు మీకేమైనా అనుభవం ఉందా? లేదుకదా!

కాబట్టి శరీరం లోపల ఏమీలేదు...అంతా శూన్యంగా ఉంది అని భావించండి...ఇక మీకు ఏ రోగమూ రాదు అని హామీ ఇచ్చారు....

గుండె ఉంది...అనుకుంటే గుండెనొప్పి వస్తుంది.
గుండె లేదు, లివరూ లేదు, కిడ్నీ లేదు...లోపల అంతా ఖాళీగా ఉంది...అనుకుంటే ఏ వ్యాధీ రాదు అంటారు.

కనుచూపు పారినంత మేరకే ఈ ప్రపంచం ఉన్నది.
ఆవల, ఈవల ప్రపంచం లేదు,

ఆవల అంతరిక్షమూ లేదు,
ఈవల అవయవములూ లేవు.

ఆవల, ఈవల ఉన్నది దైవమే.

* * *

మా స్నేహితురాలు రాధిక అంది-
బాబుగారూ...! భవిష్యత్తులో మా పిల్లలకు మీరే గురువులు...అని.

నాకు నవ్వొచ్చింది.

గురువుగా ఉండడం కాదు కదా...శిష్యుడిగా ఉండే కనీస అర్హత కూడా నాకు లేదు.
ఈ మాటను నేను నా వినయాన్ని ప్రకటించుకోవడానికి అంటున్న మాట కాదు,
ఇది అక్షరసత్యం...
అని ఎరిగి ఉన్నాను కాబట్టి...నేను హాయిగా ఉంటున్నాను...
రాధికతో నేనన్నాను-
ఈ బాబు సత్సంగంలో గడిపే చివరి క్షణం వరకు బాబు స్థానం సత్సంగంలో ఉన్న చాప మీదే...అని.

* * *

గురువుగారు ఓ మాటన్నారు-

లోపల రాముడుగా ఉండు.
వెలుపల హనుమంతుడిగా ఉండు.

లోపల గురువుగా ఉండు.
వెలుపల శిష్యుడిగా ఉండు.

లోపల "నాకన్నా అధికుడు మరొకడు లేడు"
అని ఉండు.

వెలుపల "నాకన్నా అధముడు మరొకడు లేడు"
అని ఉండు.

* * *

దైవజ్ఞులైన శివస్వామిగారు తన పూజామందిరంలో
నా చిత్రపటాన్ని ఉంచుకున్నా

విద్యాధికురాలైన  కృష్ణవేణిగారు నన్ను గురువుగా భావించుకున్నా

"వందమంది గురువుల వద్ద శిష్యుడిగా ఉండు...
ఒక్క శిష్యుడికి కూడా గురువుగా ఉండొద్దు..."
అన్న తాతగారి మాటే నాకు పరమప్రమాణం.

అందుకే నేను అహానికి లోనుకాక, హాయిగా ఉండగలుగుతున్నాను.

నేను తేనిటీగను....
తేనిటీగ మకరందాన్ని సేకరిస్తుందేగాని
మకరందాన్ని సృష్టించలేదు.

నేను గురువాక్యాలను సేకరించి ఆస్వాదించే తేనిటీగను.

జ్ఞానాంబ చనుబాలును తప్ప
ఇతర వ్యవ(ఆ)హారాలను జీర్ణం చేసుకోలేని జ్ఞానశిశువును.

* * *

గురువులు పుడతారు...తయారుకారు...
తయారయ్యే గురువులందరూ బాధ గురువులే.

* * *

గురువంటే బరువు.
టేబుల్ మీద ఉన్న కాగితాలు చెల్లాచెదురు కాకుండా వాటిపై ఉంచబడిన "బరువురాయి" గురువు.

శిష్యుని సంస్కారాలు లౌకికవిషయాలపై పోనీయకుండా ఆత్మవైపుకు ఏకీకృతం చేసే "బరువురాయి" గురువు.

* * *

జ్ఞానశిశువు
9533667918

61. అంతా ఉత్తదే...

---

ఉదయాన్నే 5 గంటలకు నారద పుష్కరిణీ వద్ద సైకిల్ పెట్టి, వాకింగ్ మొదలుపెట్టాను....

శివాలయానికి దగ్గర్లో నా స్నేహితుడు దేవీప్రసాద్ కలుసుకున్నాడు....

ఇద్దరమూ వాకింగ్ చేస్తూ, జలవినాయకుని గుడి వద్ద రిటర్న్ అయిపోయాం.
కేరళా టీ అంగట్లో ఓ ఛాయ్ బిగించి....గురువు వద్దకు బయలుదేరాం....

వాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా ఉంది...
శరీరానికి చల్లదనం ఎంతో హాయినిస్తోంది...

సద్గురు సన్నిధిలోకి వెళ్లగానే శరీరానికే కాకుండా మనసుకు కూడా అదొకరకమైన చల్లదనం...

గురువుగారంటారు-
ప్రతి ఒక్కనిలో సహజసిద్ధమైన "A/c" ఉంటుంది.
గురుసన్నిధిలోకి రాగానే  ఆ A/c స్టార్ట్ అవుతుంది, దానివల్లనే ఆ శాంతి, ఆ చల్లదనం... అది గురువు వలన వచ్చిందని భ్రమపడతారు అంతే.
ఆ ప్రశాంతం, ఆ చల్లదనం మీలోనిదే అంటారు.

* * *

సాక్షి దినపత్రికను చేతికి తీసుకుని-
పత్రిక "సాక్షి" కాదు, చదివేవాడే సాక్షి...అన్నారు.

తాను అన్నిటినీ చూస్తున్నాడు, అందరినీ చూస్తున్నాడు...తనను చూడడం లేదు...
తనను తాను చూడడమే నిజంగా  సాక్షిత్వం అన్నారు.

* * *

టీ త్రాగొచ్చామయ్యా...అని చెప్పినా కూడా వినకుండా, రవి రెండు కప్పుల్లో టీ తీసుకొచ్చాడు...

బిస్కట్లు కూడా ఇవ్వబోయాడు వద్దన్నాం...

టీ త్రాగి, గురుపాదాలకు దగ్గరగా జరిగాను...

గురువుగారు ఇలా చెప్పడం కొనసాగించారు...

ఉదయం మెలకువ కలిగినప్పటి నుంచి
తిరిగి రాత్రి నిద్రలోకి జారుకుని వరకు
మధ్యలో ఉన్నదంతా, జరిగేదంతా "ఉత్తదే"...
అన్నారు...

గురువునోట ఈ బోధ చాలాసార్లు విన్నప్పటికీ,
పాతమాటలే అయినప్పటికీ,
వారు చెప్పినప్పుడు ఫ్రెష్ గా... అప్పుడే ఉదయించిన సూరీడులా, అప్పుడే వికసించిన పూవులా  ఉంటుంది.

ఏదో అద్భుతాన్ని చూస్తున్న పిల్లాడిలా అద్భుతంగా చూస్తాను వారివైపు...
అవే మాటలు మళ్లీ వ్రాసుకుంటాను క్రొత్తగా డైరీలో...
నా దృష్టిలో అవి పునరుక్తులు కావు...
మనసుకు హాయినిచ్చే లాలిపాటలు ఆ మాటలు.

ఆ మాటను ఇలా కొనసాగించారు-
అంతా ఉత్తదే అన్నప్పుడు....
నా మాట కూడా నిజం కాదు కదా!
ఇది కూడా ఉత్తదే....అన్నారు.

అందరం నవ్వుకున్నాం....

అంతా ఉత్తదే అయినప్పుడు, మరి నిజం ఏదో???
అని సందేహం....

గురువుగారు ఇలా కొనసాగించారు...

ఒకే ఒక అబద్ధం ఉంది-
"ఒకే ఒక నిజం ఉంది" అనుకోవడమే.

ఒకే ఒక నిజం ఉంది-
"ఒకే ఒక అబద్ధం ఉంది" అనుకోవడమే.

ఈ రెంటిలో ఏ ఒక్కదానికి తీసుకున్నా చాలు...
సత్యం అనుభవంలోకి వస్తుంది...అన్నారు.

* * *

గురువుగారి వద్ద ఈ మధ్య సబ్జెక్టు బాగా జరుగుతోంది కదూ...! అంది త్రిపుర...

సద్గురు సన్నిధిలో  నిశ్శబ్దంగా కూర్చొని వారి ముఖం వైపు చూస్తూ
చకోరపక్షిలా అలా యెదురుచూస్తూ ఉంటే చాలు....
ఏ ప్రశ్నలూ వేయకున్నా సరే, సబ్జక్టు దానిపాటికి అదే వస్తుంది,
నేను పాటించే నియమం ఇదే....అన్నాను.

శిశువు స్పర్శ తగలగానే తల్లికి పాలు చేపినట్లు...
శిష్యుణ్ణి చూడగానే గురువుకు బోధ పొంగుతుంది.
పాలు ఇవ్వడం అనేది తల్లికి, బిడ్డకు ఇద్దరికీ సుఖం.
బోధించడం అనేది గురువుకు, శిష్యుడికి ఇద్దరికీ  సుఖం.

గురువు "చెప్పి" తనను తాను నింపేసుకుంటాడు.
శిష్యుడు "విని" తనను తాను నింపేసుకుంటాడు.

ప్రబోధం వలన ఇద్దరికీ నిండుతనం వచ్చేస్తుంది...
రెండు అర్ధరూపాయిలు కలిసి 'రూపాయి' అయినట్టుగా.

గురువు-శిష్యుడు-బోధ  మూడింటి సమిష్టి రూపమే సద్గురువు.

ఈ మూడింటిలో ఒకడిగా ఉన్న గురువు -
బోధగురువు.

సమిష్టిరూపమైన గురువు - మౌనగురువు

* * *

దేవుడు-జీవుడు-అనుగ్రహం మూడింటి సమిష్టి రూపమే పరమాత్ముడు.

మూడింటిలో ఒకడుగా ఉన్న దేవుడు - జగదీశ్వరుడు.

సమిష్టిరూపంగా ఉన్న దేవుడు - పరమేశ్వరుడు.

* * *

వారి శిష్యులుగా ఉండటానికి మన నుంచి ఏ అర్హతా అవసరం లేదు.
వారి నుంచి ఏ మంత్రదీక్షా తీసుకొని ఉండవలసిన అవసరం లేదు..

వారి గుమ్మం దాటి వారి సన్నిధిలో కూర్చున్న ప్రతిఒక్కరూ శిష్యులే, శిష్యురాలే....
ఇందులో ఏ సందేహం లేదు...

వారి సన్నిధిని అనుభవించిన ప్రతి ఒక్కరూ
"నా గురువు" అని ఎవరికి వారికి స్వంతం అనిపిస్తారు...

అందుకే సీనియర్, జూనియర్ గొడవలు ఉండవు మా సత్సంగంలో.

తొలి శిష్యులైన బాబు, దేవీప్రసాద్ నుంచి....
ఇప్పటి శిష్యులు చీరాల శివస్వామి, ఒంగోలు శ్రీను వరకు అందరినీ సమదృష్టితో చూస్తారు గురువుగారు.

వారి బోధ నిత్యనూతనమైనది...
అందుకే పాతశిష్యులు కూడా ఈరోజే క్రొత్తగా వింటున్నట్టు క్రొత్త శిష్యుల్లా గురువు దగ్గరకు జరిగి ఆసక్తిగా వింటుంటారు...

ఈ సందర్భంలో ఆసక్తికరమైన ఘట్టం ఒకటి గుర్తుకు వస్తోంది....

పట్టెయ్య అడిగారు ఓసారి-
ముక్తి పొందినందుకు గుర్తేమి? అని.

నేనన్నాను-
గురువుగారు ఆధ్యాత్మిక విషయాలను చెప్పడానికి సంసిద్ధం అవుతన్నప్పుడు....ఆసక్తిగా గురువు దగ్గరకు జరిగి కూర్చోవడం ఆగినప్పుడు నీకు ముక్తి కలిగినట్లు...అని సరదాగా చెప్పాను.

గురువుగారితో సహా అందరూ నవ్వుకున్నారు.
నిజమే కదా...పల్లం నిండినప్పుడే ప్రవాహం ఆగుతుంది...తరువాత చెప్పడం వినడం ఆగిపోతాయి...అన్నారు గురువుగారు.

* * *

గురువుగారంటారు-

ఐహిక, ఆముష్మిక బాధలు నెరవేరే అవకాశం ఉన్నవారిని మాత్రమే నా గడప దాటించి లోనికి రానివ్వు....అలా అవకాశం లేనివారిని నా గడప దాటి రానివ్వకు...అని నా గురువు(తాతగారు) వద్ద అలా మాట(వరం) తీసుకున్నాను...అన్నారు.

* * *

సద్గురు సన్నిధిలో -

ఎవరికి ఏది అవసరమో
వారికి అది దొరికి తీరుతుంది...

ఇక్కడ పొందలేనివాడు
ఎక్కడా పొందలేడు....

* * *

ఈ గజిబిజి వ్యాసంలో  మనం క్లారిటీగా పొందవలసిన చివరి అవగాహన ఏమంటే-

గాఢనిద్రలో ఉన్నది మాత్రమే సత్యం.
కల, మెలకువలో ఉన్నదంతా ఉత్తదే.
దానికి ఏ ప్రాధాన్యతా ఇవ్వొద్దు...అనేదే.

* * *

62. ప్రజ్ఞానం బ్రహ్మ

---

16-5-2021 శంకరజయంతి.

నేనూ దేవీప్రసాద్  ఉదయాన్నే 5.30 కు కేరళా టీ అంగడికి చేరుకున్నాం....

టీ సిప్ చేస్తూ...గాలిగోపురం వైపు చూస్తుంటే
ఆ ఆనందమే వేఱు.

కాళాస్తి  ప్రజలకు గాలిగోపురం చూడడం అనేది ఒక వ్యసనం.

ఇక్కడివారు వేరే ఊరెళ్లినప్పుడు, ఈ రాత్రికి ఉండి రేపొద్దున వెళ్లొచ్చు కదా! అని అక్కడివారు ఎవరైనా అంటే,

అమ్మో...నేనెళ్లిపోవాలి...
సాయంత్రానికి గాలిగోపురం చూడకపోతే
నాకు నిద్రపట్టదు...అనడం కద్దు.

అంతేకాదు, ఇక్కడ నాన్నలు కొడుకుల్ని తిట్టేటప్పుడు కూడా
"గాలిగోపురంలా పెరిగావు కదరా...." అనడం కద్దు.

ఊరికి పది కిలోమీటర్ల దూరం నుంచే గాలిగోపురం దర్శనమిస్తుంది.

మన ముఖానికి బొట్టు ఎలాగో
మా కాళాస్త్రికి గాలిగోపురం అలాగు.

మనింట్లో అమ్మ ఎలాగో
మా వూళ్లో జ్ఞానాంబ అలాగు.

జ్ఞానాంబ తన తెల్లటి తడి చీరను నేలపై ఆరివేసినట్లుండే సువర్ణముఖరీ నదీ ప్రవాహదృశ్యం...

నీటిని తాకుతూ వీచే చల్లటి మలయమారుతం....

ఆలయంలో నుంచి వినబడే మంగళవాయిద్యం...
స్వామివారిని మేలుకొలిపే సుప్రభాతం...
బ్రాహ్మణసమూహం  చేసే వేదనాదం...

ఉదయాన్నే వంతెనపై అటూ ఇటూ వాకింగ్ చేస్తున్న నాకు అవన్నీ ఉచితంగా దొరికే సౌఖ్యాలే...

* * *

5.45 కు గురుసన్నిధికి చేరుకున్నాం...

గురువుగారు బొట్టు బెట్టి తీర్థం ఇచ్చారు...
కమ్మరకట్ ప్యాకెట్ వారి స్టూల్ మీద పెట్టాను...
దేవీప్రసాద్ Apricots, చిక్కీలు ఇచ్చాడు.

రవి ట్రేలో మాకు టీ తెచ్చిచ్చాడు...

మనం ఏ వేళ పోయినా కూర్చోపెట్టి, టీ ఇచ్చి,
వేదాంతం బోధించి, ఆత్మసుఖాన్నిచ్చే గురువుండడం మన అదృష్టం.

గురువుగారు 'సండే ఫండే' నా చేతికిచ్చి అందులో గడి-నుడి నింపమన్నారు...పది నిమిషాల్లో పూర్తయ్యింది...ఒక్క గడి మాత్రం మిగిలిపోయింది...గురువుగారు నింపారు.
"హస్తిమశకాంతరము" అనే పదం....
దాని అర్థము- ఏనుగుకు, దోమకు మధ్య ఉన్న తేడా...

నిజమే...సద్గురువు ఏనుగు...
మనమందరం దోమలం.
అనిపించింది.

ఏంటి విశేషాలు? అని అడిగారు నవ్వుతూ....
అన్నీ కరోనా విశేషాలే ఉంటాయనే ఉద్దేశం వలన కావొచ్చు ఆ నవ్వు....

మా వీధిలో మాజీకౌన్సిలర్ గారి అబ్బాయి కరోనాతో చనిపోయాడు....అనే వార్త చెప్పాను...

'తెలిసింది' అన్నారు...

బహుశా రవి చెప్పి ఉంటాడు...
రవిది మా వీధే.
రవి నా బాల్యమిత్రుడే.
* * *

మనిషే పెద్ద వైరస్సు ఈ ప్రపంచానికి అన్నారు...

క్రూర జంతువు తనకు అవసరమై(ఆకలికై)మాత్రమే
హింస చేస్తుంది...

మనిషి తనకు అవసరం లేకపోయినా హింస చేస్తుంటాడు...

కాబట్టి మనిషే నిజంగా క్రూర జంతువు...అన్నారు.

అవకాశం దొరికినప్పుడల్లా....మనిషి(స్వభావం) పై
విరుచుకుపడుతుంటారు గురువుగారు.

ఇతర జీవుల పట్ల అపారమైన సానుభూతి,
దయ కలిగి ఉంటారు....

మనిషి రాక ముందు అన్ని జీవరాసులూ సుఖంగా, హాయిగా మనుగడ సాగిస్తున్నాయి...

మనిషి వచ్చాకే అన్నిటికీ ముప్పుగా పరిణమించి, తనకే ముప్పు తెచ్చుకున్న పరమ అజ్ఞాని ఈ మనిషి.

అన్నిటినీ నాశనం చేసి, తానొక్కడే సుఖించాలని చూస్తున్నాడు...

చివరికి జరగబోయేదేమంటే, మనిషొక్కడే నాశనం అయ్యి, మిగతా జీవరాశి అంతా సుభిక్షంగా ఉండే కాలం వస్తుంది...

మనిషి మధ్యలో వచ్చాడు...మధ్యలోనే పోతాడు...
అంటారు గురువుగారు.

స్వర్గసీమలా ఉండే భూగ్రహాన్ని పాడు చేసుకొని
అంగారక గ్రహానికై ప్రయాణం కడుతున్నాడు ఈ విచిత్రమానవుడు...

* * *

త్రిపుర, అనామిక, భవ్య, ఒంగోలు శ్రీను, పట్టెయ్య, గంగయ్య...వీరంతా వీడియో గ్రూప్ కాల్ లో గురుదర్శనం చేసుకుని నమస్కరించుకున్నారు....

ఒంగోలుశ్రీను గురుసందర్శనానికి అనుమతి కోరారు...
"మీరెప్పుడైనా రావొచ్చు" అని అన్నారు గురువుగారు.

వారి ఆనందానికి అవధులు లేవు...

ఈ చిన్ని సెల్ ఫోన్...
దూరాన్ని చెరిపేసింది...
అందరినీ కలిపేసింది...

* * *

నిన్న చీరాల నుండి దైవజ్ఞులు శివస్వామి వారు ఫోన్ లో మాట్లాడుతూ ఓ మాటన్నారు...

"మీ చిత్తంలో ప్రజ్ఞ తప్ప ఏమీలేదు.
'ప్రజ్ఞానం బ్రహ్మ' అయిపోయి ఉన్నారు మీరు..."
అని.

ప్రజ్ఞ అనే పదం అద్భుతమైన పదం....
ప్రజ్ఞ అంటే పరిపూర్ణమైన 'జ్ఞాత'త్వం.

"జ్ఞ" అనే అక్షరం 'జ్ఞాత'త్త్వాన్ని, సర్వసాక్షిత్వాన్ని సూచించే బీజాక్షరం అది.

అన్నిటినీ తెలుసుకుంటున్నవానిని తెలుసుకునే తెలివి - "జ్ఞ".

* * *

తెలుసుకోవడం - తెలివి.

తెలుసుకుంటున్నవాణ్ణి తెలుసుకొనేది - జ్ఞానం.

తెలివికి, జ్ఞానానికి ఇదే తేడా.

* * *

ఆ జ్ఞానం శక్తి(ప్రకటన)రూపంగా ఉన్నప్పుడు "జ్ఞానప్రసూనాంబిక" అని పేరు.

ప్రజ్ఞలో-
ప్ర - శివుడు.
జ్ఞ - జ్ఞానాంబ.
"జ్ఞానప్రసూనాంబ" పేరులోనే ప్ర, జ్ఞ అనే రెండు అక్షరాలూ ఉన్నాయి చూడండి...

కాబట్టి అమ్మని తలిస్తే అయ్యను కూడా తలచినట్లే.

* * *

అనంతనికేతన్ ఆశ్రమంలో గోపాలకృష్ణగారు,
వేల్పూరు ఆశ్రమంలో మురళీకృష్ణగారు
ఒకే ప్రశ్న అడిగారు...

గురువుగారు జ్ఞానప్రసూనాంబావతారం అని మీ పుస్తకాల్లో వ్రాశారేంటి? అని.

వారికిస్తున్న సమాధానం ఇది-

* * *

వొంట్లో కేంద్రబిందువు "హృదయం" అయినట్లు
ఇంట్లో కేంద్రబిందువు "యజమాని" అయినట్లు
మా ఊళ్లో కేంద్రబిందువు "జ్ఞానప్రసూనాంబ".

* * *

అవ్యక్తంగా, అచలంగా ఉన్నవాడు - శివుడు.
వ్యక్తంగా, చలనరూపంగా ఉండేది - పార్వతి.

ప్రపంచానికి వ్యక్తమైన మహనీయులందరూ పార్వతీ అవతారాలే.

అరుణాచలం - శివుడు.
రమణుడు - పార్వతి(అపీతకుచాంబిక)

అనిలాచలం - శివుడు.
సద్గురు సుబ్రహ్మణ్యుడు - పార్వతి(జ్ఞానప్రసూనాంబిక)

అక్కడ అరుణాచల అక్షరమణిమాల.
ఇక్కడ అనిలాచలశివమాల.
భక్తి గ్రంథములుగా ప్రాచుర్యం పొందాయి.

అగ్నికి(అరుణాచలతత్త్వానికి) వాయువు(అనిలాచలతత్త్వం) తోడై
జ్ఞానాగ్నిగా(జ్ఞానప్రసూనాలుగా) ప్రజ్వలిస్తూ
భక్తుల కర్తృత్వకర్మలను దగ్ధం చేస్తోంది.

నూతనంగా ఆవిష్కరింపబడే ఎంతటి గొప్ప తత్త్వమైనా పురాణనామాలతో, అనుసంధానం చేయకపోతే ఆ తత్త్వం భారతదేశంలో మనుగడ సాగించడం కష్టమే.

తద్విరుద్ధంగా బౌద్ధసిద్ధాంతం అలా ఉందికాబట్టే ఆ మతం ఇక్కడ ప్రాముఖ్యత లేకుండాపోయింది...బుద్ధుడు ఈ దేశంలోనే పుట్టినప్పటికి

కూడా.....

అంతగా పురాణ వాఙ్మయం, వేద ప్రామాణ్యం మన సంస్కృతిలో భాగమైపోయింది...

ఒక తండ్రికి 5 మంది సంతానం కలిగితే వారికి పంచపాండవుల పేర్లు పెట్టడం చూశాను.

ఆ తండ్రి మహాభారతంతో అంతగా మమేకం అయిపోయారు...

మన దేశంలో శివ, విష్ణు,  రాముడు, కృష్ణుడు పేర్లతో కొన్ని లక్షలమంది మగపిల్లలుంటారు...

మన ఆడపిల్లలకు దుర్గ, భవానీ, భ్రమరాంబ, త్రిపురాంబ....అంటూ అమ్మవారి పేర్లు పెట్టుకుంటాం...

తాను ఆరాధించే అమ్మవారే నా కూతురుగా వచ్చిందనే భావనతో ముద్దుమురిపాలతో తన ఉపాసనను మరింత బలోపేతం చేసుకుంటాడు ఉపాసకుడు.

నామములన్నీ ఉపాసనా సౌలభ్యములే....

"శివోహం" అంటూ తనను తానే శివుడిగా భావించుకుంటూ కొందరు శివైక్యం చెందుతారు.

అలాగే నా అన్ని భావనలకూ కేంద్రబిందువు - "జ్ఞానప్రసూనాంబ".

జ్ఞానాంబయే పలురూపాలతో పలువిధములుగా నన్ను అనుగమిస్తోందనేది నా ఉపాసన.

అందులో భాగమే గురువును జ్ఞానప్రసూనాంబికావతారం అనడం కూడా.

మరొకరు గురువును ఇంకేదో అవతారంగా భావించవచ్చు, కొలవవచ్చు....తప్పేముంది?

ఎవడి ఉపాసన వాడిదే,
ఒకేశక్తి పలు రూపములతో పలునామములతో వ్యక్తమయి ప్రకాశిస్తున్నది కాబట్టి, ఏ ఒక్క నామాన్ని, ఏ ఒక్క రూపాన్ని పట్టుకొని వెళ్లినా "మూలం"లో కలిసిపోతాం. "జ్ఞ" గా మిగిలిపోతాం.

మా సోదరి రాధిక కృష్ణోపాసకురాలు...
తనను తాను రాధగా భావించి, కృష్ణుని బిగి కౌగిలిలో మైమరిచి ఉంటుంది.

బాబు తనను తాను జ్ఞానశిశువుగా, గణపతిగా భావించి జ్ఞానాంబ ఒడిలో మైమరిచి ఉంటాడు.

కిరణ్మయి నన్ను గణపతీ! గణపతీ! అని సంబోధిస్తుంది...ఆ పిలుపు నా ఆత్మకు ఎంత సంతోషమో...! నేను జ్ఞానాంబ హృదయానికి మరింత హత్తుకున్నట్లుగా అనుభూతి కలుగుతుంది...

అటువంటి భావన, అటువంటి మైమరపు లేకుంటే,
ఈ భక్తికి, ఈ ఆధ్యాత్మికతకు అర్థమూ లేదు, ఫలమూ లేదు.

జడమైన ఒక కొండను శివుడుగా కొలుస్తున్నారు...
చైతన్యమైన ఒక మనిషిని దేవుడుగా కొలిస్తే తప్పేమి?

ఎవరైనా సరే ఒక మహనీయుణ్ణి  ఫలానా అవతారమని అన్నారంటే....
వెంటనే "అవును" అని అంగీకరించండి....పోయేదేముంది?

ఎలా? ఎందుకు? అని ప్రశ్నించడం
మన భారతీయ స్వభావం కాదు...

విశ్వాసమే మన ధర్మానికి జీవనాడి...

"అవును" అంటే అప్పుడే అనుభవం.
"ఎందుకు" అంటే వీడదు అనుమానం.

* * *

సంతోష్ రెడ్డి అన్నాడట....
బాబు జ్ఞానశిశువైతే
మేమంతా అజ్ఞాన శిశువులమా? అని...

అలా విపరీతార్థం తీసుకున్నవారికి మనం ఏం చెప్పగలం?

కృష్ణుణ్ణి తన భర్తగా భావించిన మీరాబాయిని పిచ్చిదానిలా చూసింది ఆ రాజకుటుంబం.

ఆధ్యాత్మికమంతా భావనాత్మకం...
భక్తిలో తర్కం కూడదు....

లెక్కలమాష్టారు సమాధానం రాబట్టడానికి
some 'X'  అనుకొనుము...అంటాడు.

ఎందుకనుకోవాలి? అని ప్రశ్నిస్తే ఏం చెప్పగలం?

* * *

జ్ఞానాంబకు-
ఎవరూ ముఖ్యం కాదు,
ఎవరూ దూరం కాదు.
మనమందరమూ జ్ఞానశిశువులమే...

ఒకరు కడుపులో బిడ్డ.
ఇంకొకరు చంకలో బిడ్డ.
మరొకరు చేతిలో బిడ్డ.

కడుపులో బిడ్డ - జ్ఞానయోగి.
చంకలో బిడ్డ - భక్తియోగి.
చేతిలో బిడ్డ - కర్మయోగి.

ఎవరు ఏ బిడ్డ అనేది ఎవరికివారు నిర్ణయించుకోవలసిన విషయం...అంతే.

* * *

63. గ్రంథం: నేను ఎవరినీ చూడలేదు.
ఎవరూ నన్ను చూడలేదు.

---

17-5-2021
ఈ ఉదయం 5.45 కు గురుసన్నిధికెళ్లాం...నేనూ దేవీప్రసాద్...

రవి ఇచ్చిన "టీ" సిప్ చేస్తూ...
సద్గురు సన్నిధిలో ఉచితంగా దొరికే దివ్యత్వాన్ని రీచార్జ్ చేసుకుంటూ ఉండిపోయాను...

టీ గుటకలు తప్ప మాటలు ఏవీలేవు...

వారి కళ్లనుండే ప్రసరించే తేజస్సులో
నన్ను నేను చూసుకోవడం తప్ప కదలికలు లేవు...

నాక్కూడా ఓ 'టీ' ఇవ్వండీ.... అన్నారు గురువుగారు.

ఆ సమయానికి రవి వాటర్ క్యాన్ తేవడానికెళ్లాడు...

దేవీప్రసాద్ వంటగదిలోకెళ్లి గురువుగారికి స్టీల్ కప్పులో టీ తెచ్చిచ్చాడు.

నాకు క్రొత్తగా అనిపించిన విషయాలను, కథనాలను,జోకులను
గురువుగారికి వినిపించి, వారు నవ్వుతుంటే, వారితో పాటు కలిసి నవ్వడం
అనేది నాకు ప్రియమైన విషయాల్లో ఒకటి.

అలాగే ఈరోజు ఓ హాస్యకథనాన్ని గురువుగారికి వినిపించాను-

ఒక నాస్తికుడికి కరోనా సోకింది...
తీసికెళ్ళి ఆస్పత్రిలో వేశారు...
సిలిండర్ తీసుకొచ్చి ఆక్సిజన్ పెట్టారు...
ఈ లోపల భార్య గుడికెళ్ళి భర్త  పేరు మీద
అర్చన చేయించి ఆస్పత్రికి వచ్చింది.
ఆమె నాస్తికురాలు కాదు!
ఆస్పత్రి కొచ్చి భర్తతో అన్నది-
"ఏమండీ...గుళ్లో మీ పేరు మీద అర్చన చేయించి
అమ్మవారి కుంకుమ తీసుకొచ్చాను...
పెట్టుకోండి... ఇది పెట్టుకుంటే మీరు త్వరగా కోలుకుంటారు...అంది.

ఆ నాస్తికుడు కోపంగా...
నీకేమన్నా పిచ్చా.. నా సంగతి తెల్సు కదా నీకు?
సరే...ఒక మాట అడుగుతాను నాకు జవాబు చెప్పు...
మీ దేవుడు సర్వత్రా వ్యాపించి ఉంటాడు కదా...
అలాంటప్పుడు ప్రత్యేకించి దేవుడి గుడికి వెళ్లటమెందుకు?

ఆ భార్య ఇలా జవాబిచ్చింది-
నాకూ మీలాగే ఓ చిన్న సందేహం...

ఆక్సిజన్ కూడా అంతటా వ్యాపించే ఉంటుంది కదా...?
మరి మీకు ఆక్సిజన్ ఇవ్వటానికి సిలెండరు ఎందుకు? అంది.

* * *

ఈ కథనం చెప్పగానే గురువుగారు పగలబడి నవ్వారు....

"అంతేకదూ...ఆవిడ్ని తన గురువుగా భావించి దండం పెట్టాలి ఆ భర్త అన్నారు...

* * *

T.V.లో 'హరహర మహాదేవ' సీరియల్ వస్తోంది...
గురువుగారు ఆసక్తిగా చూస్తున్నారు...

అప్పుడొస్తున్న ఘట్టం ఏమంటే-
భూ ప్రదక్షిణం చేసి వచ్చినవారికి 'తొలిపూజార్హత' దొరుకుతుంది అనే పోటీ పెట్టడం...గణపతికి, కార్తికేయునికి...
వెంటనే నెమలివాహనుడు బయలుదేరడం, గణపతి తల్లిదండ్రులకు ప్రదక్షిణ చేయడం
గణపతే ప్రథమపూజార్హుడు అని శివుడు ప్రకటించడం...
'రీజన్' అర్థం కాక కార్తికేయుడు ఆశ్చర్యపోవడం...
శివుడు కారణం వివరించడం...
ఇలా సాగుతోంది...

* * *

సూక్ష్మంలో మోక్షం పొందటం అంటే ఇదే...
గణపతి ఆ విషయాన్నే తెలియజేసినట్టయ్యింది.

చిన్నపిల్లాడు అమ్మ కొంగును పట్టుకుని
అమ్మ చుట్టూ తిరుగుతుంటాడు...
వాడికి అమ్మే సర్వస్వం...అమ్మే కేంద్రం.

అరుణాచలం అర్ధనారీశ్వరతత్వం కలిగిన పర్వతం.
అది భూ హృదయం.
అరుణగిరి ప్రదక్షిణం, అది భూప్రదక్షిణంతో సమానం.

* * *

నేతి-నేతి ఇది కాదు-ఇదికాదు అంటూ త్రోసివేస్తూ పోతే, ఇక త్రోయడానికి ఏమీలేనిప్పుడు ఉన్న స్థితియే "జ్ఞ".

జ్ఞానికి తానే( 'జ్ఞ') కేంద్రం.
'జ్ఞ' నుంచే సకలమూ పుట్టింది.
అందువల్ల అతడు ఉన్నచోటునే ఉంటాడు.
అలా ఉన్నప్పటికీ
అతడు సదా ఆత్మప్రదక్షిణం చేస్తున్నవాడే.

సామాన్యజనులు అనుకున్నట్లు,
ఆత్మప్రదక్షిణం అంటే తన చుట్టూ తాను తిరగడం కాదు,
ఆత్మప్రదక్షిణం అంటే "అచలం"గా ఉండటం.

* * *

ఉన్నదెల్లా "నేనే" అయినప్పుడు "నేను" కదలటానికి చోటేది? అంటారు భగవాన్.
కాబట్టి వారు ఎప్పుడూ కదలని అచలస్వరూపులు.
వారు ఏమీ పలుకని మౌనస్వరూపులు.

వారు కదిలినట్లుగా, పలికినట్లుగా మనమే భ్రాంతిపడ్డాం.
మబ్బులు కదులుతుంటే సూరీడు కదులుతున్నట్లుగా భ్రమపడినట్లు...

* * *

నేను ఇప్పటివరకు ఎవరినీ చూసింది లేదు...
నన్ను ఎవరూ చూసింది లేదు...
అని గతంలో గురువుగారు అనిన మాటలు గుర్తుకొస్తున్నాయి....

"నేను మాత్రమే ఉన్నాను" అన్న అనుభవంలో ఉన్న జ్ఞానికి కదలటానికి, పలకడానికి వారికి అన్యం ఎక్కడిది?

నన్ను ఎవరూ చూడలేదు....అని పలికారుగా...
అతనికి అన్యం లేనప్పుడు ఆ మాట ఎవరితో అన్నాడు? అని సందేహం రావొచ్చు...

అది "అనటం" కాదు, "ఉండటం"
ఆ ఉండటాన్ని మనం అనడంగా తీసుకున్నాం...
ఆ కేవలానుభవాన్ని కూడా మనం మాటల్లో చెప్పుకునే ప్రయత్నం అది.
* * *

"పరమపదం" లోని ఆ 12 వాక్యాలు కూడా....

నిశ్చలంగా ఉన్న మనిషిలో మనసు కదులాడుతున్నట్టు

అచలంగా ఉన్న పరమేశ్వరునిలో కదిలే మాయా విశేషాన్ని తెలియజేయడమే

ఆ "పరమపదం" యొక్క పరమార్థం.

అంతేగానీ ఆ పరమపదాన్ని జీవుడూ అనటం కాదు, దేవుడూ అనటం కాదు.

"నాతో సహా సర్వమూ నాలో ఉన్నట్లున్నది".
అని తెలియచేసే కేవలాత్మ యొక్క స్థితి అది.
* * *

అనామిక ఇప్పుడే వాట్సాప్  మెసేజ్ పెట్టింది-
"ఏం చేస్తున్నారు అంకుల్...?" అంటూ....

"ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాను...."
అని మెసేజ్ పెట్టా...
* * *

64. గురువు అంటే తత్త్వం, వ్యక్తి కాదు.

---

22-5-2021 ఈ రోజు  గురువుగారి శిష్యురాలు అనామిక జన్మదినం.

ఒంగోలు నుంచి శ్రీను వచ్చాడు ఉదయాన్నే.
నన్ను మా ఇంటివద్ద నుండి కారులో పికప్ చేసుకున్నాడు.

పూజామందిరంలోని పటాలను నేను, యుగ, త్రిపుర అందరం కలిసి పూలతో అలంకరించాం.

అనామిక చేత సద్గురుదేవులవారికి పాదపూజ చేయాలని చూస్తున్నారు....

ఉత్త పూలు వారి పాదాలపై ఉంచి నమస్కరించుకోమన్నాను....

నా మాట వినేవారెవరు?

దాము, త్రిపుర హడావుడి చేస్తున్నారు...ప్లేటు, నీళ్లచెంబు, పాలు, గంధము, కుంకుమ...అంటూ...

అవేవీ వద్దు...అని గురువుగారు కూడా వారిస్తూనే ఉన్నారు....

వారి మాట వినేవారెవరు?

వారి శరీరానికి ఎంత ఇబ్బంది కలిగిస్తే, అంత గొప్ప పూజ జరిగినట్లు భావించేవారికి మనమేం చెప్పగలం....

ఆ పాదాలను ఓ స్టీలు పేట్లో పెట్టి, కడిగి, పాలాభిషేకం చేసి, గంధం పూసి, కుంకుమబొట్లు పెట్టి, పూలు పరచి....
నాకైతే ఆ పరిశుద్ధమైనపాదాలను వారు పనిగట్టుకుని  ఖరాబు చేసినట్లనిపించింది...

అనామికకు ఓ తాతయ్యలా
త్రిపురకు ఓ తండ్రిలా
అందరికీ ఓ స్నేహితుడిలా
అత్యంత సహజంగా మనలో ఒకడిగా మెలిగే గురువుగారిని, ఈ తతంగం వలన  దూరం పెట్టడమే అవుతుంది.

నీ అహం ఎక్కడ లయిస్తోందో...
అదే నిజంగా గురుపాదం...
అన్నారు రమణ భగవానులు...
విన్నవారెవరు?
* * *

అందరూ గురుపాదాలను తాకి నమస్కరించుకున్నారు...

చాలాకాలం తర్వాత నేనూ గురుపాదాలను స్పర్శించి నమస్కరించుకున్నాను...

వారి శరీరానికి ఇబ్బంది కలిగేంతటి సేవ చేయడం అనేది సుతారము నాకు నచ్చదు.

అదంతా ప్రేమే, భక్తే.....కాదనను.
కానీ అందులో సున్నితత్వమే లేకుంటే
ఆ ప్రేమకు, ఆ భక్తికి అర్థం లేదు.

నారదాది మహాభక్తులను చంపడానికి కత్తిపట్టుకుని తిరిగిన ఓ సాధువు కథను రామకృష్ణులు చెప్పగా మనం చదివే వుంటాం...

మా స్వామి యోగనిద్రలో ఉంటే, చెవిలో జోరీగలా ఆ నారదుడు నారాయణా-నారాయణా అంటూ ఒకటే గోల....అనేది ఆ ఖడ్గధారి వాదన...
వాని భక్తి అంత సున్నితత్వం కలది.

మనమూ ఇతర ఆశ్రమాల్లో జరిపే తంతులాగే జరిపితే....ఇది అత్యాశ్రమం ఎలా అవుతుంది?

"మిగతా సత్సంగాల్లా మన సత్సంగం కూడా ఏదో ఒక సంప్రదాయాన్ని కొనసాగించాలని భావించకండి.
అన్ని సంప్రదాయాలను ధ్వంసం చేయడమే మన సత్సంగ సంప్రదాయం"
అని అన్నారు గురువుగారు....

తత్త్వం పెంచుకోవాలి...
తతంగం తగ్గించుకోవాలి.

ఉత్సాహం వేఱు, అత్యుత్సాహం వేఱు,
అత్యుత్సాహం మీద నీళ్లు చల్లవలసిందే.

అతి సర్వత్రా వర్జయేత్....

లౌకికవిషయాలకంటే, ఆధ్యాత్మిక విషయంలోనే బంక(gum) ఎక్కువగా తయారుచేసుకుంటున్నాం.

బంధమే వద్దు అన్నవాడితో(గురువుతో)
బంధం పెంచుకుంటున్నాం...

బంధం ఉండవలసిన(తల్లిదండ్రులు) చోట నిరామయంగా ఉంటున్నాం....

రెండూ ఆత్మవంచనే.

నీ తండ్రి వాడి పారేసిన పాత చెప్పుల కంటే,
దేశంలో ఏ బాబా పాదుకలూ గొప్పవి కావు.

"నీవు కొలిచే నీ ఇష్టదైవమే అమ్మగా, నాన్నగా, భార్యగా, భర్తగా,
కూతురిగా, కొడుకుగా, కోడలుగా ఉండి నిన్ను ఆనందింపచేస్తోంది..."
అని ప్రబోధించి కుటుంబవ్యవస్థను పటిష్టం చేశారు గురువుగారు...
సరూపభక్తికి క్రొత్తరూపం ఇచ్చారు.

నన్నే తలువు... నన్నే కొలువు...
అని పొరపాటున కూడా వారు చెప్పరు.

నీ  కులదైవమేదో దానినే ఆరాధించుకోమంటారు.

గురువంటే నీ స్వరూపాన్ని గుర్తుకు తెచ్చే ఓ తత్త్వం.అంతే.

ఆ తత్త్వాన్ని  మన నిత్యజీవితానికి ఆధారశ్రుతిగా పెట్టేసుకోవాలి.

ఇదొక్కటే నిజంగా గురుపూజ.

* * *

వేల్పూర్ ఆశ్రమం వెళ్లినప్పుడు చూశాంగా...
కొన్ని వందలమంది భక్తజనం, గురుదర్శనానికి రావడం...
మామూలుగా ఐతే గురువుగారే స్వయంగా భక్తులకు నుదుటన విబూధి
పెట్టి, తీర్థం ఇచ్చి, ప్రసాదం ఇచ్చేవారు...
గురువుగారికి ఇబ్బంది కలిగించకూడదని,
వచ్చిన భక్తజనానికంతా...
శ్రీను బొట్టుపెట్టడం, త్రిపుర తీర్థం ఇవ్వడం, సంతోష్ ప్రసాదం
ఇవ్వడం...చేశారు.
చివరిగా గురుపాదాలను తాకి నమస్కరించుకునేట్లు క్యూ ఏర్పాటు
చేశారు...
ఈ పాదనమస్కారాలకు కూడా ఇంకో మనిషిని ఏర్పాటు చేసేసుంటే

బాగుండేది...గురువుగారికి ఇబ్బంది లేకుండా...అన్నాను తమాషాగా...
"నిజమే" అని నవ్వారు గురువుగారు.

* * *

"భూమి ఆయన పాదపీఠం అంటుంది" బైబిల్.
వారి పాదస్పర్శతో పునీతమైన భూమి(భూగోళం) అంతా పవిత్రమైదే....

నీవెక్కడ ఉండి భూమిని తాకి నమస్కరించుకున్నా సరే, అది గురుపాదాలను తాకి నమస్కరించుకోవడమే అవుతుంది.

* * *

భారతీయసంప్రదాయం ప్రకారం పాదపూజ, కొబ్బరికాయ, ప్రసాదనైవేద్యం, కర్పూర హారతి...
ఇవన్నీ ముగిశాక...

ఇక పాశ్చాత్య పద్ధతిలో... ఓ కేజీ కేకు తెచ్చి అనామికతో ప్లాస్టిక్ కత్తితో కోయించారు ....
అందరూ చప్పట్లతో తమ హర్షాన్ని వ్యక్తం చేశారు...
అందరూ ఒకరినోటిలో ఒకరు ఆ కేకును పెట్టి తినిపించారు...

ఒంగోలు శ్రీనుగారు ఇంట్లో వండించి తెచ్చిన పులిహోరాను వడ్డించారు... అమృతమే....
అందరం కలిసి భోంచేశాం కుటుంబసభ్యుల్లా...

* * *

అమ్మ సమాధికెళ్లాం నేను, దేవీప్రసాద్, శ్రీను, త్రిపుర, అనామిక, భవ్య...

అమ్మసమాధికి పూజ చేస్తుండగా గంగయ్యగారు అనామికకు ఫోన్ చేసి, నా ఆయుస్సును కూడా పోసుకుని కలకాలం సంతోషంతో జీవించు తల్లీ...అని ఆశీర్వదించారు...

అనామిక తల్లిగారైన త్రిపురాంబగారితో సహా అందరమూ ఎంతగానో సంతోషించాము...

మేమందరం వాట్సప్ లో అందంగా పోస్టులు తయారుచేసి అనామికకు Wishes చెప్పామేగానీ,
ఆయుస్సు దారబోయాలనే ఆలోచనే రాలేదు.
మా ప్రేమలు, మాటలు అన్నీ కృత్రిమం అనిపించాయి...గంగయ్యగారి ఆశీర్వాద వచనాలు విన్నాక.

* * *

ఒంగోలు శ్రీను మాతో కలిసి కారులో-
వేంకటాచలం వెళదామని ప్రయత్నించాడు
వీలుకాలేదు.
అరుణాచలం వెళదామని ప్రయత్నించాడు
వీలుకాలేదు.
చివరికి అనిలాచలంలోనే నిద్రచేసి తిరిగివెళ్లిపోవాల్సివచ్చింది.

ఈ ఊరు అనిలాచలం.
ఈ గురువు అచలాచలం.
ఈ తత్త్వం మౌనస్వరూపం.

అవుననడు...కాదనడు...
రమ్మనడు...పొమ్మనడు...

వారిని వొదిలి ఎక్కడికీ కదలలేం.
వారి సన్నిధి ఎప్పటికీ వదలలేం.

ఇదేం మాయో...!
మన 'మాయ' రోగం పోగొట్టడానికి...

* * *

గురువు వద్దకు వచ్చేవారంతా ఏదో ఒక సమాధానం తనలో ఫిక్స్ చేసుకొని వస్తారు.
దానికి ట్యూన్ అయ్యేవిధంగానే గురు బోధ ఉండాలని ఆశిస్తారు...తమ సమాధానానికి 'Stamp' వేసుకెళ్లాలని తాపత్రయపడతారు...

ఇంకొందరు, గురువు వద్ద 'తుదిసమాధానాన్ని'
పొందాలని ప్రయత్నిస్తారు....

ఇంతకీ జరిగేదేమంటే,
వారు దేనికీ Stamp వేయరు...
వారు దేనినీ Final చేయరు...

వారు చేసే ఏకైక కార్యక్రమం-
ప్రశ్న-సమాధానం రెంటినీ "ఖాళీ" చేయించడం.

ప్రశ్న అంటే వ్యక్తి.
సమాధానం అంటే ముక్తి.

సద్గురు సన్నిధిలోకి ప్రవేశించాలంటే
ముఖ్య అర్హత ఏమంటే - "ఖాళీ"గా ప్రవేశించడం.

గురువు అనుగ్రహించాడు అనడానికి గుర్తు ఏమంటే - "ఖాళీ"గా
నిష్క్రమించడం.

ఇక్కడనుంచి అక్కడికి ఏమైనా తీసుకెళ్లినా
అక్కడనుంచి ఇక్కడకు ఏమైనా తీసుకొచ్చినా
గురు-శిష్య సంబంధం సఫలం కాలేదని అర్థం.

అంతా ఖాళీ చేస్తే "ఉన్నదేదో అది" ఉంటుంది.
అదే సమాధానం. అదే సాక్షాత్కారం.

నాకు సాక్షాత్కారం కలుగలేదు అని ఒకడు వాపోతున్నాడంటే, ఖాళీ
చేయవలసినవి
ఇంకా ఏవో అతనిలో ఉన్నట్టే.

"ఖాళీ" గా ఉండటమే "సాక్షాత్కారం".
ఏవో రూపాలు నీ ముందు వచ్చి నిలబడి వరాలు ఇవ్వడం కాదు.

'జ్ఞానప్రసూనాలు' లో 1-50 సూక్తిలో పరమాద్భుతమైన మూడు
వాక్యాలున్నాయి...

ప్రపంచ ఆధ్యాత్మిక వాఙ్మయంలోనే దానికి సరిసమానమైన వాక్యాలు వేటే ఎక్కడా కనబడవు.

ఆ వాక్యాలు ఫ్రేం చేయబడి, అత్యాశ్రమంలో గోడకు తగిలించి ఉన్నాయి...

మేము అందులోకి అడుగిడిన ప్రతిసారి ఆ దివ్యవాక్యాల వైపు చూసి స్మరించుకుంటాం.

మిగతావాక్యాలన్నీ మార్గాన్ని సూచించే బోర్డులు లాంటివి...

ఈ ఫ్రేం(లోని వాక్యాలు)  గమ్యాన్ని సూచించే బోర్డు లాంటిది.

పర్వతారోహకుడు శిఖరం చేరుకున్నాక పొందే రిలాక్స్ లాంటిది.

ఆ ఫ్రేం లో ఉండే దివ్యవాక్యాలివే...

---

ఎవరూ లేకపోవడమే దేవుడుండం.
ఏమీ తెలియకపోవడమే దేవుణ్ణి తెలియడం.
ఏ అనుభవమూ లేకపోవడమే దైవానుభవం.

---

ఈ వాక్యాలను సదాస్మరించండి...తరించండి...

* * *

65. భయమే భక్తిగా మారుకుంటుంది.

---

25-5-2021
ఈ రోజు నృసింహ జయంతి...
అన్నమయ్య జయంతి...
తరిగొండ వెంగమాంబ జయంతి...
మా చెల్లెలు రాధిక జన్మతిథి కూడా...

* * *

ఉదయాన్నే కన్నప్ప సేతువుపై వాకింగ్ చేస్తుండగా
దేవీప్రసాద్ కలిశాడు....

ఇద్దరమూ కలిసి గురువు వద్దకు వెళ్లాం...
గురువుగారు బొట్టుపెట్టి, తీర్థం ఇచ్చారు...

బాలజ్ఞానాంబిక అనామిక గురువుగారికి రాగిజావ కాచి ఇచ్చింది...మా ఇద్దరికీ  కప్పుల్లో టీ తీసుకొచ్చింది...

నేను టీ సిప్ చేస్తూ....గురువుగారితో అన్నాను...
ఈ రోజ నృసింహ జయంతి...అని.
గురువుగారు నవ్వుతూ-
నరసింహస్వామి ప్రహ్లాదుడి కంటే చిన్నోడే...!! అన్నారు.

ఈ క్రొత్త ఆలోచనకు మాకు నవ్వొచ్చింది...
అంతేగా-అంతేగా
ప్రహ్లాదుడి కంటే ఐదేళ్లు చిన్నోడు నృసింహుడు.
* * *

ఇంతలో ఎవరో ఫోన్ చేశారు గురువుగారికి...
ఏడాది నుంచి గురువుగారికి వచ్చే కాల్స్ అన్నీ
కరోనా భయం గురించే...
వారేదో భయపడుతూ అడగడం...
వీరేదో అభయం ఇవ్వడం...
అలా సాగుతున్నాయి...

కాల్ అయిపోయాక గురువుగారు మావైపు తిరిగి ఇలా అన్నారు-

కాయే పండుగా మారుకున్నట్లు
భయమే భక్తిగా మారుకుంటుంది...అన్నారు.
* * *

ఒకడు వ్యాధితో, మరణభయంతో డాక్టర్ వద్దకు వెళతాడు మొదట్లో...
ఆరోగ్యం పొందేక కూడా డాక్టరు వద్దకు వెళతాడు స్నేహంతో...

మొదట్లో ఉన్న భయమే నిదానంగా స్నేహంగా మారుకుంటుంది...
భగవంతునితో స్నేహమే భక్తి....అన్నారు.

ఆహా! యెంత గొప్ప మాటో...!
భగవంతునితో స్నేహమట....

కావలసింది-
భగవంతునితో బంధం.
ప్రపంచంతో మోక్షం(విడుదల).

* * *

సూరమాల అనే గ్రామంలో కృష్ణమందిరం ఉంది...
దానిని ఓ స్వామి నడుపుతూ ఉన్నారు...
ఆ స్వామికి ఆ ఊరుపేరే వచ్చేసింది..."సూరమాలస్వామి" అని.
నాకు బాగా ఆత్మీయుడు...
శెలవులప్పుడు ఉదయం వెళ్ళి సాయంత్రం వరకు ఉండి వచ్చేవాణ్ణి...
నేను ఎప్పుడు వెళ్ళినా హార్మోనియం పెట్టె తెరచి నా ముందు ఉంచేవాడు...
వారు 'విప్రనారాయణ' సినిమా పాటలు పాడుతుంటే, నేను హార్మోనియం వాయించేవాణ్ణి....ముఖ్యంగా అందులో యమన్ కళ్యాణీ రాగంలో ఉన్న "సావిరహే తవదీనా..." పాట తప్పనిసరి...

కృష్ణమందిరం గర్భగుడికి ఓ తెర ఉండేది....
స్వామి తెర తెరిచినప్పుడు, హాలులో ఉన్నవారందరూ లేచినిలబడతారు...

ఓ రోజు నేను ఏదో పుస్తకం చదువుకుంటూ అది గమనించక అలా కూర్చుండిపోయాను...

స్వామి అన్నారు-
కలెక్టర్ రాగానే కలెక్టరు కోసం వేచిఉన్నవారందరూ లేచి నిలబడతారు కదా!
మరి లౌకికమైన అధికారికే అంత గౌరవం ఇచ్చినప్పుడు, అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన కృష్ణభగవానుడు దర్శనం కాగానే లేచి గౌరవించాలి కదా! అని.

"నిజమే...కానీ ఆ కలెక్టరుకు ఓ చిన్న బాబు ఉన్నాడు...వాడు లేచి నిలబడతాడా?

ఆ చిన్ని బాలుడు లేచి నిలబడకుంటే ఆ కలెక్టరు అగౌరవంగా ఫీల్ అవుతాడా?" అని అడిగాను...

స్వామి అవాక్కయ్యారు నా సమాధానానికి.

* * *

తాను కొలిచే దైవాన్ని స్వంతం(own)
చేసేసుకోవాలి...

అలా గౌరవాలతో, తతంగాలతో నా దైవాన్ని నేను దూరం చేసుకోలేను.

"జ్ఞానప్రసూనాంబ మా అమ్మ" అంతే.

నా కన్నతల్లి దగ్గర ఎలా ఉండేవాడినో...సరదాగా మాట్లాడుతూ... జ్ఞానాంబ వద్ద కూడా అలానే ఉంటాను...

నా కన్నతల్లి భూమిలోకి వెళ్లిపోయింది.
ఇక నేనెవరితో మాట్లాడను?

అందుకే జ్ఞానాంబతో మాట్లాడుతూ ఉంటాను(నా లోపల).

జ్ఞానాంబతో మాట్లాడడం అంటే, నాతో నేను మాట్లాడుకోవడమే(రెండు పాత్రలూ నేనే అన్నమాట)

గురువుగారు చెప్పారు-
వెలుపలున్నదంతా లౌకికమే.
లోపలున్నదంతా ఆధ్యాత్మికమే అని.

అందుకే-
నాలో నేను ఉంటా...
నాతో నేను ఉంటా...

నాలో నేను
నాతో నేను
చెప్పుకున్న మాటల్నే అక్షరాల్లో పెడితే
అవే 'నా గురువు' వ్యాసాలుగా వ్యక్తమవుతున్నాయి....

జ్ఞానశిశువుచే వ్యక్తమయినదంతా
జ్ఞానాంబ అనుగ్రహ ప్రసారమే...
సందేహం లేదు...

నా గుండె స్పందిస్తున్నంతకాలం
నా 'వ్యాసం'గం ఇలా కొనసాగుతూనే ఉంటుది...

నా చివరిశ్వాస వరకు 'అక్షర' (నాశరహితమైన) ప్రసారం జరుగుతూనే ఉంటుంది...

* * *

T.V.చూడడం ఆపి, మా వైపు తలతిప్పి ఇలా అన్నారు-

నేను దేవుణ్ణి నమ్ముతున్నాను అంటే,
"నమ్మడం లేదు" అని ఆ స్టేట్ మెంటుకు అర్థం.

అనుభవంలో నమ్మకానికి తావులేదు.
నమ్మకంలో అనుభవానికి తావులేదు.

అన్నారు గురువుగారు.

* * *

"దిక్కులేని" చావు చచ్చాడు... అంటారు...
అదొక దౌర్భాగ్యపరిస్థితి అన్నట్లు...
కానీ అదే ముక్తస్థితి అన్నారు...

అతడు 'సర్వాంతర్యామి'గా మారిపోయిన ఉన్నతస్థితి అది అన్నారు...

హిమాలయశిఖరం ఎక్కేశాక...ఇక ఎక్కడానికి ఏమీ ఉండనట్లు...ప్రయాణం ముగిసిపోయిన మోక్షస్థితి అది అన్నారు...

* * *

T.V.లో ఏదో విషాదభరితమైన సన్నివేశం వస్తోంది....

BGM లో వచ్చే వైలెన్ స్వరాలు, ఆ సన్నివేశానికి మరింత బరువు పెంచింది.

గురువుగారు మా వైపు తిరిగి,
బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ ఉంటే అది సినిమా.
బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ లేకుంటే అది జీవితం.
అన్నారు.

అంతేగా-అంతేగా
మనకెన్ని బాధలు వచ్చి, చచ్చే చావు వచ్చి చచ్చినా
మనకు ఏ బ్రాక్ గ్రౌండు మ్యూజిక్కూ వినబడదు,
ఏ వైలెన్ స్వరాలూ పలకబడవు.

* * *

రాధిక నృసింహ జయంతి రోజున పుట్టారుట...
వారికి ఇంగ్లీష్ క్యాలెండరు ప్రకారం కంటే, మన పంచాంగం తిథి ప్రకారం జన్మదినాన్ని  చేసుకోవడమే ఇష్టమట...

రాధిక గారు ఇలా స్పందించారు ఈ రోజు...

నరసింహస్వామిని అడుగుతుంటాను...
నీ పుట్టినరోజున ఈ రాధికను పుట్టించుకున్నావు....
ఈ జీవితానికి ఓ అర్థం, ఓ పరమార్థం ఉండాలిగా...
ఈ రా'ధి'కలో వత్తు తీసేయ్... అని.

ఆహా! రాధిక ఎంత గొప్ప భావప్రకటన చేసిందో చూడండి....

దాని అర్థమేమంటే-
రాధిక....ఇక ఈ ప్రపంచానికి రాదిక...

అంటే ముక్తినిమ్మని నృసింహుణ్ణి ఎంత చమత్కారంగా కోరిందో....

'ఏ వరమడగని వరమివ్వు' అని ప్రహ్లాదుడు కోరినంత అందంగా అడిగింది...

రాధిక, కిరణ్మయి ....లాంటి భావుకత కలిగిన స్నేహితులు కలిగిన బాబు జన్మ ధన్యం....

* * *

66. అంతిమయాత్ర

---

30-5-2021 * ఆదివారం

ఈ ఉదయాన్నే 5.30 కు భిక్షాలగోపురం వద్ద 'జవ్వాది సుగంధం' సీసా కొంటుండగా వచ్చి కలిశాడు దేవీప్రసాద్...
ఇద్దరం కలిసి గురుసన్నిధికెళ్లాం...

రవి మౌనంగా మా ఇద్దరిచేతికి టీ అందించాడు...
మేమూ మౌనంగా  తీసుకొని ఆస్వాదించాము...

* * *

గురువుగారు స్నానం చేసి వచ్చి కాట్ మీద కూర్చున్నారు...

మాకు విబూధి పెట్టి తీర్థం ఇచ్చారు....

చెన్నై నుండి బులుసు యజ్ఞేశ్వరశర్మగారు వీడియోకాల్ లో గురువుగారిని దర్శించుకున్నారు...

గురువుగారూ! త్వరలోనే శ్రీకాళహస్తికి వచ్చి  తమ దర్శనం చేసుకుంటాం అన్నారు...

"మీ దర్శనం నాకు ఇచ్చి వెళ్లండి" అన్నారు నవ్వుతూ...

USA నుండి శ్రీను వీడియోకాల్ లో దర్శనం చేసుకున్నారు...

గురువుగారిని చూడగానే-
"పలకడానికి మాటలు రావడం లేదు..." అన్నారు...శ్రీను.

ఏమీ పలకకుండా "ఉండు"...అన్నారు గురువుగారు నవ్వుతూ...

* * *

ఈశ్వరుడు-
కన్ను తెరిస్తే సృష్టి.
కన్ను మూస్తే లయం.
అంటారు.

నువ్వు కన్ను తెరచినా, కన్ను మూసినా
జరిగేది కూడా అదే కదా!
నీకన్నా ఈశ్వరుడేం గొప్ప? అన్నారు.

శ్వాస పీలిస్తే జననం.
శ్వాస వదిలితే మరణం.
ప్రతి శ్వాసా ఓ జన్మే అన్నారు.

గతశ్వాసే గతజన్మ.
మరుశ్వాసే మరుజన్మ.

* * *

అసలు నీ Enjoyment కోసమే దేవుణ్ణి, జీవుణ్ణి సృష్టించుకున్నావు...
వారిద్దరి కంటే నీవు గొప్పవాడివి కావా? అని అన్నారు.

* * *

కవుల గురించి ప్రాస్తావన వచ్చింది-

కవి అంటే పచ్చి అబద్దాలకోరు...అన్నారు...

ఏ కవి చెప్పిన అబద్ధం నిజమైపోతుందో
ఆ కవియే ఈశ్వరుడు....అన్నారు గురువుగారు.

సినిమాహాళ్లు వేలువేలుగా ఉన్నప్పటికీ
సినిమా ఒకటే అయినట్లు
కవులు వేలువేలుగా ఉన్నప్పటికీ
వారిలోని కల్పనాత్మక తత్త్వం ఒకటే...అన్నారు.

కవీశ్వరుడు అంటారు...
కవి, ఈశ్వరుడు ఇద్దరూ ఒకటే...
ఇద్దరూ కల్పన చేస్తారు...

కవి కల్పన కల్పనగానే ఉంటుంది.
ఈశ్వరుని కల్పన అదే క్షణంలో వాస్తవమైపోతుంటుంది.

* * *

ఉన్నది ఉన్నట్టుగా, లేనిది లేనట్టుగా చెప్పేవాణ్ణి సత్యవంతుడు అంటాం.
రివర్స్ లో చూపేవాడు ఈశ్వరుడు.
అనగా ఉన్నది లేనట్టుగా, లేనిది ఉన్నట్టుగా...

* * *

ఈ సందర్భంలో తాతగారి మాట ఒకటి గుర్తుకు వస్తోంది... కవి అంటే కాకి....అన్నారు.
ఇద్దరూ కావుకావుమంటూ ఉంటారు...

కాకుల కావుకావులకు అర్థం లేదంటే
కవుల కవిత్వాలకు కూడా అర్థం లేదు.

కవుల కవిత్వాలకు అర్థాలే ఉంటే
కాకుల కావుకావులకు కూడా అర్థాలుంటాయి.

* * *

కుక్క ప్రత్యేకత
విశ్వాసం కలిగి ఉండడం అంటారుగానీ,
నిజానికి విశ్వాసంగా ఉండడం అనేది
దాని బలహీనత.

* * *

కుక్క ప్రత్యేకత ఏమంటే
తాను కదలకనే తోకను కదిలించగలగడం.

* * *

తాను అచలంగా ఉంటూనే
చలనరూపంగా ఉండగలిగే
అతిశయశక్తి పరమేశ్వరునిలో ఉంది.

* * *

వెనకా ముందు ఎవరూ లేనివాణ్ణి
మనం 'అయ్యో పాపం' అంటాం.
నిజానికి వెనకా ముందు లేనివాడు పరమేశ్వరుడు.

వెనకా ముందు ఉన్నవాణ్ణే మనం
"అయ్యో పాపం...!" అనాలి.

* * *

పొద్దున పూసి సాయంత్రానికి వాడిపోయే పూలులాగా యుగయుగాలే కాలగర్భంలో నిమజ్జనాలైపోతుంటే, ఇక ఈ జీవితమెంత? అంటాడు ఠాగూర్....

పీచుమిఠాయి చూడ్డానికి పెద్దదిలా కనిపిస్తుంది...
అదిమి అదిమి చూస్తే చిన్నదైపోతుంది...
ఈ జీవితమూ అంతే... అన్నారు గురువుగారు...
తరచి తరచి చూస్తే రెప్పపాటే జీవితం...

కన్ను తెరిస్తే ఉయ్యాల...
కన్ను మూస్తే మొయ్యాల...
అన్నారు జాలాది...

* * *

మా కొత్తపేట ఉండేది శ్మశానానికి వెళ్లే దారిలోనే...
ప్రతీరోజూ శవయాత్రలు చూస్తూనే ఉంటాము...

ప్రతిరోజూ సెల్ ఫోన్ చార్జింగ్ చేసుకున్నట్లు
నా మనసు వైరాగ్యాన్ని చార్జింగ్ చేసుకుంటుంది
ఆ అంతిమయాత్రల దృశ్యాలను చూసి...

గురువుగారిని ఒకరు అడిగారు-
మరణభీతిగా ఉంది...మార్గం చూపండీ...అని.

గురువుగారు ఇలా పరిష్కారం చూపారు...
ప్రతిరోజూ నీవు పడుకునే ముందు...నీవు
మరణించినట్టు...బంధుమిత్రులంతా వచ్చి రోధించినట్టు...పాడె కట్టి...నిన్ను శ్మశానానికి తీసుకుపోతున్నట్టు...గుంటతవ్వి అందులో పడేసి పూడ్చివేసినట్టు...ఊహించుకుంటూ నిద్రలోకి జారుకో...ఇలా కొద్ది కాలం

చేస్తూ ఉండు...మొదట్లో భయంగానే ఉంటుంది...కొంతకాలానికి మరణభీతి పోతుంది...అన్నారు.

నిజమే...
మరణభీతి ఉండేది, మరణంతో సహవాసం లేకనే.

మరణంతో సహవాసం చేసినప్పుడు
మరణమంటే భయం పోతుంది...

అలా సహవాసం ఉండాలనే... ఓ పుస్తకాన్ని యమధర్మరాజుకు అంకితం ఇచ్చాం...

మీ సత్సంగం వాళ్లు భలే తెలివైన వాళ్లు....
యమధర్మరాజునే బుట్టలో వేసుకున్నారు...
అన్నాడు మా పుస్తకాలు DTP వర్క్ చేసే గుణభూషణ్.

గుణభూషణ్ ఇలా అన్నాడని గురువుగారికి చెబితే పగలబడి నవ్వారు.

* * *

ఏలుమలై అనే నా చిన్ననాటి మిత్రుడొకడు-
కారులో ఎవరైనా వెళుతుంటే "ఒరే బాబూ! ఎప్పుడ్రా మనం ఆ విధంగా పోయేది...!" అనడం అతనికి అలవాటు....

ఒకరోజు మేమిద్దరం మాట్లాడుతుండగా....
పాడె మీద శవం పోతోంది....
ఒరే ఏలుమలై...! ఎప్పుడ్రా మనం ఆ విధంగా పోయేది...! అన్నా...
అంతే... నన్ను తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు సుత్తి వీరభద్రరావు టైప్ లో ...

మరణం అనే మాట వినగానే అపశకునంగా భావిస్తారు...

కానీ అది మంగళప్రదమైన పదం.
అందుకే రమణభగవానులు 'ఉన్నది నలుబది' గ్రంథం మంగళశ్లోకంలో 'మరణం' అనే పదాన్ని ఉపయోగించారు...

రమణుడు మరణానుభవం పొందేకే...మనిషి ఋషి అయ్యారు...
UG అనుభవించిన calamity కూడా అదే...
చచ్చి బ్రతకడం...అనే విపత్తు అది.

తల్లికి శిశువు సాక్షాత్కరించాలంటే
ప్రసవవేదన పడవలసిందే...

వ్యక్తికి స్వరూప సాక్షాత్కారం కలగాలంటే
మరణవేదన(calamity) పడవలసిందే.

కానీ ఆ వేదన సహజంగా దానికదే కలగాల్సిందే తప్ప, మన ప్రయత్నాలతో నిమిత్తం లేదు...

అనుకరించడం వలన కలుగదు....

రమణునికి మృత్యానుభవం కలిగిన గదిలో మనం పడుకుంటే రాదు.

UG కి పార్క్ లో బెంచి మీద కలిగిన 'సంవేదన', మనం అదే బెంచి మీద కూర్చుంటే రాదు.

"అది" కలుగుతుంది.అంతే.
ఎలా? అని మాత్రం అడక్కు.
ఎలా? అనేదానికి భగవంతుడు కూడా చెప్పలేడు.
అన్నారు గురువుగారు.
:
* * *

చావు అంటే ఎందుకింత భయం?

నేను పోయాక కూడా ఈ ప్రపంచం ఇలానే ఉంటుంది...మిగతావారంతా జీవించేవుంటారు అన్న ఒకే ఒక్క తప్పుడు భావనే కారణం.

నేను పుట్టక ముందు ఏదీ లేదు.
నేను గిట్టిన తర్వాత ఏదీ ఉండదు.

ఇది పరమసత్యం.
పై రెండువాక్యాలు స్ఫురణలో ఉంటే మృత్యుభీతి పోతుంది.

'నాది' అనుకోవడానికి నీ వద్ద ఏమీ లేదని తెలిసినప్పుడు మృత్యుభీతి పోతుంది.

భగవంతుణ్ణి స్మరించడం కంటే,
రోజులో ఒక్కసారైనా మృత్యువును స్మరిస్తే చాలు. మృత్యుభీతిపోతుంది.

'నేను' అని ఊరక ఉండిపో...
దానికి ఒక్క అక్షరం కూడా చేర్చకుంటే
మృత్యుభీతి పోతుంది.

మనసులో-
అది-ఇది
అక్కడ-ఇక్కడ
అప్పుడు-ఇప్పుడు
అతడు-ఇతడు
అనే భేదభావం పోయినప్పుడు మృత్యుభీతిపోతుంది.

మాటవరుసకు కూడా రెండవ వస్తువును అంగీకరించుకుంటే మృత్యుభీతి పోతుంది.

* * *

ప్రవహించే నదిలో క్షణక్షణానికి నీరు మారుతున్నట్టు
క్షణక్షణానికి ప్రపంచం మారిపోతోంది.
గత క్షణంలో ఉన్న బాబు, ప్రస్తుతక్షణంలో లేడు.
ప్రస్తుతక్షణంలో ఉన్న బాబు, మరుక్షణంలో లేడు.

ప్రతిక్షణం నీతో సహా ప్రతీది జారిపోతోంది...మారిపోతోంది...
అందుకే ప్రపంచం అశాశ్వతం అన్నారు...

నదిగట్టున ఉన్న చెట్టువలె కాలప్రవాహాన్ని సాక్షిగా ఉండి చూసేవాడివి 'నీవు'.

నామరూపచిత్రములకు ఆధారవస్త్రము 'నీవు'.

నీవే మహాద్రష్టవు.
నీవే మహాకర్తవు.

నీవే సర్వసాక్షివి.

"ఎందుకు" అన్న ప్రశ్నను నీకు నీవే వేసుకో.
ఇతరులకు వేయవద్దు.
ఇతరులు నీ నీడలు.
నీవు ఏకాత్మరూపుడవు...
IAM THAT IAM అని జ్ఞప్తికి తెచ్చుకో...
అదే జ్ఞానం...
అదే మోక్షం...

* * *

సాధన అంటేనే వాయిదా వేయడం అంటారు JK.
అంటే ఇప్పుడు ఇక్కడ పొందటం నీకిష్టం లేదన్నమాట...

మరోజన్మకు వాయిదా వేయకుండా
జన్మ-కర్మ అనే అనవస్థాదోషభూయిష్టమైన సిద్ధాంతాన్ని పట్టుకుని వ్రేళ్లాడకుండా

ఇప్పుడు-ఇక్కడ-ఇలా-నీలా ఉన్నట్లున్నాను...
కానీ లేనే లేను...
నేను "మాత్రమే" ఉన్నాను...

అనే పరమపద మకరందాన్ని జుర్రుకొని...భ్రమరంలా ఈ లోకంలో ఆనందవిహారం చేయి....

ఇదే తొలి-చివరి జన్మగా భావించి
శ్వాసించే ప్రతి శ్వాసా అంతిమ శ్వాసే...
జీవించే ప్రతిక్షణమూ అంతిమయాత్రే.....

* * *

67. వెలుపల ధర్మం - లోపల సత్యం

---

30-5-2021

రాత్రి ఉక్కపోత వలన మెలకువ వచ్చింది...
ఫ్యాన్ తిరుగుతూనే ఉంది...
చెమట పడుతూనే ఉంది...
టైం చూస్తే 12.01...
వాట్సప్ చూస్తే...రాధిక మెసేజ్...

ప్రపంచచిత్రాన్ని దేవుడు గీశారు అనొచ్చుకదా?
గీశాడు అని ఎందుకు భగవంతుణ్ణి మనం డు, డు అని వాడుతాము?
అనేది ఆమె సందేహం.

బహువచనంగా ఉన్నట్టు కనిపించే
సదా ఏకవచనం దేవుడు.
'డు'  వాడడం దోషం కాదు.

* * *

కృష్ణుడు  అంటాం
ఆ పదమే దగ్గర.
కృష్ణులుగారు అంటే దూరం.

గారు అంటే దూరం.
ఒరే అంటే దగ్గర.

ఓరి మాయలోడా....అని రాధిక దగ్గర అనిపించుకోవడమే కృష్ణుడికి ఇష్టం...

సత్యభామ చేత తన్నించుకోవడమంతగా
శృంగారాన్ని పండించాడు...
ఆ తర్వాత సత్యభామ సారీ చెప్పడం...
సత్యను తన గుండెలకు హత్తుకోవడం...
ఆ ఆనందం రసజ్ఞులకు తప్ప ఎవ్వడికీ అర్థం కాదు.

ఓసారి  గోకులంలో తన చిన్ననాటి స్నేహితుల్ని చూడ్డానికి
రాజలాంఛనాలతో వెళ్లాడట కృష్ణుడు.

ఒక్క స్నేహితుడూ దగ్గరకు రాలేదట...

సత్యభామ మూతి తిప్పింది....

పెద్ద గొప్పలు చెప్పావే....నీ స్నేహితుల గురించి....ఒక్కడు రాడేం...!! అని.

ఉండు సత్యా....! అంటూ....

అన్ని ఆభరణాలను, వైభవాలను వదిలి....
కాస్త ఆవుపేడ తన ఒంటికి పూసుకుని నిలబడగానే....

హోలోమని స్నేహితులంతా వచ్చి చుట్టిముట్టారు....మా కన్నయ్య
వచ్చాడు...అని.

* * *

జ్ఞానాంబ దేవత అంటే దూరం.
మా అమ్మ అంటే దగ్గర.

ఒరే శివా...అంటూ ప్రాణం విడిచింది గురువుగారి సతీమణి.

శివుణ్ణి అంతగా స్వంతం చేసేసుకుంది....

భగవంతుణ్ణి అంతగా స్వంతం చేసేసుకుంటేగానీ
భక్తి పండదు.

* * *

శృంగారంలో రుచి ఎఱిగినవాడే
భక్తిలో కూడా రుచిని ఎఱుగగలడు...
తత్వతః అవి రెండూ ఒక్కటే.

మూడొంతులు శృంగార కీర్తనలను రచించారు
అన్నమాచార్యులవారు.

జగడపు జనవుల జాజర
సగినల మంచపు జాజర

మొల్లలు దురుముల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెమున
జల్లన బుప్పొడి జాగర బతిపై
చల్లే రతివలు జాజర

భారపు కుచముల పైపైగడు సిం-
గారము నెరపెటి గంధవొడి
చేరువ పతిపై చిందగ బడతులు
సారెకు జల్లేరు జాజర

బింకపు గూటమి పెనగేటి చమటల
పంకపు పూతలపరిమళము
వేంకటపతిపై వెలదులు నించేరు
సంకుమదంబుల జాజర

* * *

బూతు వేఱు, శృంగారం వేఱు.
బూతు భౌతిక విషయం.
శృంగారం మానసిక విషయం.

* * *

ప్రేమకు మంచి నిర్వచనం చెప్పారు గురువుగారు-
మనమూ ప్రేమిస్తాము...దేవుడూ ప్రేమిస్తాడు...
మన ప్రేమలో బంధం ఉంటుంది.
దేవుని ప్రేమలో బంధం ఉండదు...అన్నారు.

ప్రేమ - బలం.
బంధం - బలహీనత.

దేనినయినా సరే వదలగలిగి వదలకుండా ఉండగలగడమే సరైనది.

ఎవరినో ప్రేమిస్తూ...
ఎవరి ప్రేమనో పొందుతూ...
ప్రేమ లేకుండా ఉండలేనన్న దౌర్బల్యము కలిగిన ఈ మనసును...
అశాశ్వతమైన ఈ వ్యక్తిప్రేమ నుంచి తప్పించి, శాశ్వతమైన ఆ దైవప్రేమ వైపుకు మళ్లించే ప్రయత్నమే భక్తి.

బయట ప్రేమమయంగా ఉండు.
లోపల నిరామయంగా ఉండు.

ఎప్పటికైనా నా నుంచి వారు,
వారి నుంచి నేను దూరమౌతాననే జ్ఞప్తి ఉంచుకొని
ప్రేమించు...వ్యవహరించు...

యుద్ధం రావచ్చు రాకపోవచ్చు...
కానీ యుద్ధానికి సిద్ధంగా ఉండే సైనికునిలా
అన్నిటికీ సిద్ధంగా ఉండు.
"అన్నిటికీ సిద్ధపడి ఉండడమే మహాసిద్ధి" అంటారు గురువుగారు.
* * *
వృద్ధులైన తల్లిదండ్రుల బాధ్యతలను పిల్లలు తీసుకోవడం లేదనే సమస్యను, TV చర్చావేదికలో ప్రస్తావనకు వచ్చిన కొన్ని అంశాలను ఏకరవుబెట్టాడు దేవీప్రసాద్... కేరళా షాప్ లో ఇద్దరం కలిసి టీ త్రాగుతుండగా...
* * *

తమ శరీరంలో ఓ భాగం సంతానం.
తల్లిదండ్రులు తమ సంతానాన్ని ప్రేమించి తీరుతారు...
* * *

తల్లిదండ్రుల శరీరాలకు, ఆశయాలకు
తాను కొనసాగింపు అనేది పిల్లలకు అర్థమయ్యేట్టుగా మన చదువులుండాలి...

అప్పుడే ఈ గందరగోళం పోతుంది.

రాముడు తాను ఏ తప్పూ చేయలేదు వనవాసం చేయడానికి.
పోనని ఎదురు తిరిగితే మనుషులు వ్రాసుకున్న చట్టం ఏమీ అనదు...సమర్థిస్తుంది.

కానీ రాముడు అంటే దశరథుని శరీరానికి, వంశానికి, ధర్మనిష్ఠకు కొనసాగింపు...

ధర్మం అంటే ఋషులు ఏర్పాటు చేసిన చట్టం.

ధర్మంలో అయోమయం ఉండదు,
గందరగోళం ఉండదు,
సంఘర్షణ ఉండదు.
సవరణలకు చోటు ఉండదు.
అంత పగడ్బంధీగా ఉంటుంది ధర్మం అనేది...

కానీ మనుషులు తయారుచేసిన చట్టాలు సవరణలకు గురి అవుతుంటాయి...

పాశ్చాత్యుల ప్రాభావానికి(కుట్రకు) లోనై -
రామాయణాన్ని దూరం చేసుకున్నాం...
వర్ణవ్యవస్థను అపార్థం చేసుకున్నాం...
అంతా సమానమనే పైత్యం పెంచుకున్నాం...
సమానహక్కుల పేరుతో స్త్రీసుఖాన్ని ధ్వంసం చేశాం...

టీవీ చర్చావేదికల్లో జరిగేది
మన భావదారిద్ర్యాన్ని మనం ప్రకటించుకోవడమే.

ఆ చర్చల వలన మనకు  క్లారిటీ రాదు.
మనమందరం క్లారిటీగా లేమని వెక్కిరిస్తాయి అవి.

ప్రతి ఒక్కరూ వాల్మీకి రామాయణం చదవాలి.
పాఠ్యాంశాలలో రామాయణగాధలుండాలి.
లౌకిక, ఆధ్యాత్మిక సమస్యలన్నిటికీ అదే ఏకైక పరిష్కారం.
అప్పుడు ఈ చర్చావేదికలతో అవసరం రాదు మనకు.

* * *

స్త్రీలో అమ్మతనమూ ఉంది, ఆడతనమూ ఉంది.
అమ్మతనం చూడడం సంస్కారం.
ఆడతనం చూడడం కుసంస్కారం.

కానీ మన దురదృష్టం...
మీడియా అటువంటి కుసంస్కారాన్నే పదే పదే ఎత్తి చూపిస్తోంది లోకానికి...

మనుషుల్లో Negetivity ని ఎక్కువుగా inject చేస్తోంది మీడియా....

ఈ వ్యతిరేక, విపరీత ధోరణులు మనుషుల్లో పోవాలంటే....

ప్రకృతివనం ప్రసాద్ చెప్పినట్టు, "టీవీ బ్రేకింగ్ డే" అని ఒకరోజు పెట్టుకుని, టీవీలను పగులగొట్టాలి...

"మంచి ఊరు" అంటే,
ఆ ఊళ్లో పోలీస్ స్టేషన్ ఉండకూడదు.

అలాంటి మంచి ఊళ్లు దేశంలో విరివిగా పెరగడమే
దేశాభివృద్ధి అంటే...

అంతేగాని,
వాడవాడలా ఆసుపత్రులు వెలియడం,
వైద్యపరికరాలు పెరగడం దేశాభివృద్ధి కాదు.

మనల్ని ఎల్లప్పుడూ ఆరోగ్యంగా ఉంచగలిగే జీవనవిధానాన్ని కలిగి ఉండడం దేశాభివృద్ధి.

* * *

రామాయణం అనేది కథకాదు, చరిత్రకాదు,
రామాయణం అంటే ధర్మం, విశ్వజనీనమైన చట్టం, సహృదయంతో కూడిన జీవన విధానం.
* * *

ఈ బాబు సనాతనధర్మాన్నీ సమర్థిస్తున్నాడు,
సంప్రదాయవ్యతిరేకి అయిన యూజీనీ సమర్థిస్తున్నాడు...
దేనిని తీసుకోవాలి? అని మీకు సందేహం రావొచ్చు...

ఏకకాలంలో రెంటినీ కలిగి ఉండాలంటాను నేను.

1. ప్రపంచంలో నేను ఉండడం(బాబుగా)
2. ప్రపంచం నాలో ఉండడం(ఆత్మగా)

ప్రపంచంలో నేను ఉన్నప్పుడు
రామాయణాన్ని అనుసరించాలి.

"నాలో ప్రపంచం ఉంది" అనే ఉన్న(త)స్థితిలో
UG తత్త్వమే ఉంటుంది.

ఒకటి చేయవలసింది.
మరొకటి ఉండవలసింది.

ఒకటి వెలుపలి విషయం.
మరొకటి లోపలి విషయం.

* * *

68. భక్తి - అనుగ్రహం

---

ఈ రోజు 4-6-2021 * హనుమజ్జయంతి...
ఉదయాన్నే కన్నప్ప సేతువుపై వాకింగ్ చేస్తున్నాను...

అక్కడే భీమశంకరయ్య అవధూత కనబడ్డారు...
హనుమ జయంతి రోజున అవధూత దర్శనం అయ్యిందని ఈ పిచ్చిమనసుకు అదో ఆనందం...

వెంటనే త్రిపురకు వీడియోకాల్ చేసి అవధూత దర్శనం కలిగించాను...
గురువుగారు కూడా చూశారు...

అష్టమూర్తిరూపుడైన పరమేశ్వరుడు అవధూతల రూపంలో తిరుగాడుతుంటారు...
మారువేషంలో తిరిగే CID ఆఫీసర్స్ లాంటివారు ఈ అవధూతలు....
శ్రీకాళహస్తి క్షేత్రంలో యెప్పుడూ 8 మంది అవధూతలు తిరుగాడుతూ ఉంటారని తాతగారు అనేవారు....వారిలో ఒకరు ఈ భీమశంకర అవధూత.

* * *

నారదపుష్కరిణి వద్ద దేవీప్రసాద్ కలిశాడు...
ఇద్దరమూ కలిసి గురుసన్నిధికి వెళ్లాం...
రవి మౌనంగా మాకు టీ అందించాడు...

వీడియోకాల్ లో చెన్నై నివాసి యజ్ఞేశ్వర శర్మగారికి గురుదర్శనం చేయించాను...

వారి దంపతులిరువురూ దర్శనం చేసుకుని ఆనందించారు...

త్రిపుర హైదరాబాద్ శ్రీనుకు వీడియోకాల్ లో మాట్లాడుతోంది...

* * *

శ్రీను: ఏం చేస్తున్నారు గురువుగారు?

త్రిపుర: TV లో హరహరమహదేవ సీరియల్ చూస్తున్నారు...

శ్రీను: వారే హరహర మహదేవుడు...
మళ్లీ సీరియల్ చూడడమెందుకు?

త్రిపుర(గురువుగారి వైపు తిరిగి):
గురువుగారూ....మీరే హరహరమహా దేవుడైనప్పుడు సీరియల్ ఎందుకు చూడడం...? అని శ్రీను అడుగుతున్నాడు.....

సద్గురు: ఉన్నదంతా తానే అయినప్పుడు
ఏదో ఒకటి చూసుకోవాలి కదా....!

* * *

ఈ మాటతో తాను పరమేశ్వరావతారులుగా ప్రకటించుకున్నట్లే...

అష్టమూర్తుల్లో వీరొకరుగా పరిగణించవలసిందే...

ఆ దివ్య సన్నిధిలో కూర్చున్న  త్రిపుర, బాబు, ప్రసాద్,
రవి...సనకసనందనాదులే...

* * *

త్రిపుర గురువు దగ్గరకు జరిగి వీడియో తీస్తోంది...
ఏదైనా చెప్పండీ...ఏదైనా చెప్పండీ...అంటూ
చాక్లెట్ కోసం మారాం చేసే చిన్నపిల్లలా అడుగుతోంది...

"ప్రపంచం తన కోసం భగవంతుణ్ణి వాడుకోవడం భక్తి.
భగవంతుడు తనను ప్రపంచం కోసం వాడడం అనుగ్రహం." అన్నారు...

ఆ అద్భుతమైన ఉపదేశాన్ని వీడియో తీసి అందరికీ పంపారు వాట్సప్ లో....

మొత్తానికి ఈ ఆధునికవస్తువు(టచ్ ఫోన్) వలన ప్రపంచం పాడైపోతోంది అన్న విపరీతపరిస్థితుల్లో త్రిపుర, బాబు, దేవీప్రసాద్, పట్టెయ్య, వేంకటనరసయ్య, నవ్య లాంటి వారి చేతుల్లో పడి ఇదొక "జ్ఞానపరికరం" గా తయారై ప్రపంచానికి సద్గురు సందేశాన్ని అప్ డేట్ గా అందిస్తోంది.

ఫేస్ బుక్, వాట్సప్, యూ ట్యూబ్ ల ద్వారా జ్ఞానప్రసూనాల్లోని మకరందాన్ని వేలాదిమంది ఆస్వాదిస్తున్నారు...

ఈ టెక్నాలజీ-
కాల-దేశములను తుడిపేసింది...
దూరం-దగ్గరలను కలిపేసింది...
జిజ్ఞాసువులను ఏరేసింది...
అజ్ఞానులను నలిపేసింది...
* * *

69. దేవుని లీల - జీవుని గోల

---

8-6-2021 * మంగళవారం

భవ్యబంగారం ఉదయం నుంచి ఒకటే వాట్సప్ మెసేజ్ లు ....రా...రమ్మని....

పైగా నిన్న సాయంత్రం....బాబూ,ప్రసాద్ ఎక్కడ? అని అడిగారట గురువుగారు...

సరేనని ఈరోజు నేనూ, దేవీప్రసాద్ 9.30 కు బయలుదేరివెళ్లాం.

గురువుగారికి fruit హల్వా ....
త్రిపుర పిల్లలకు kinder joy ...తీసుకెళ్లాం....

త్రిపుర టిఫన్ చేస్తోంది....
రండి రండి...అంటూ నాక్కూడా ప్రేమతో టిఫన్ పెట్టింది...

* * *

ఆయుర్వేద ఔషధం మగ్గే కొద్దీ, దాని విలువ పెరుగుతుందట...
అలా గురువుగారికి వయసు మీద పడే కొద్దీ...
వారిలోని ఆత్మతేజస్సు అంతకంతకు ముఖం ద్వారా వెలువడి
దివ్యతేజస్సుతో వెలిగిపోతున్నారు...

బాగా పండిన పండులా...
పరమేశ్వరుని చేతిలో జ్ఞానఫలంలా ఉన్నారు...

ఓ కొండలా...
మా గుండెగా..
మాకు అండగా... అలా కూర్చుని ఉన్నారు...

జిజ్ఞాసువులకు వడ్డించిన విస్తరిలా సిద్ధంగా ఉన్నారు...

నా శరీరము మీకు రొట్టె
నా రక్తము మీకు ద్రాక్షరసము అన్న క్రీస్తులా ఉన్నారు...

వారి తత్త్వమే జీవము, మార్గము, గమ్యము...

త్రిపురగారైతే వారి ముఖంలోకి గంటలతరబడి అలా చూస్తూనే ఉంటారు...

వారి సన్నిధిలోని చల్లదనం అక్కడున్న ఏసీ చల్లదనాన్ని కూడా అతిక్రమించి ఉంటుంది.

ఏసీ వలన కలిగే చల్లదనం వొంటికి.
వారి వలన కలిగే చల్లదనం ఆత్మకి.

అంతేకాదు, జన్మజన్మల నుంచి చేర్చిపెట్టుకున్న సంచితమనే సంచిని
కాల్చివేసే జ్ఞానాగ్ని కూడా...

మందహాసంతోనే మందలిస్తారు...
నిశ్శబ్దంగా తగులుతుంది వారి కొరడాదెబ్బ...

వారి కన్నులు ఎటో చూస్తుంటాయి...
కానీ ఒక కన్ను మనవైపు వేసే ఉంటారు...

అమ్మ కంటే(ప్రసవిస్తే) భూమ్మీద పడ్డాం.
గురువు కంటే(ప్రసరిస్తే) భూమ్మీదకు ఇక రాం.

నది సముద్రం చేరగానే ప్రవాహం ఆగిపోయినట్లు
సద్గురు సన్నిధి చేరగానే వ్యవహారం ఆగిపోతుంది.
ఏదో పోగొట్టుకోవాలనిగానీ,
ఏదో పొందాలనిగానీ రెండూ ఉండవు.

బ్రతకాడానికి ఉపాయాలు దొరుకుతాయేమోనని వస్తారు చాలామంది ఇక్కడకి.
ఒక్క ఉపాయం కూడా దొరకదు.

(అహం)చావడానికి చాలా ఉపాయాలు దొరుకుతాయి...

అందుకు ఇష్టపడే వాళ్లే నిలుస్తారు ఇక్కడ.

దీపం పురుగు దీపానికి ఆకర్షింపబడి అందులో పడి నాశనమైనట్టు

అలా గురుతత్త్వానికి ఆకర్షింపబడి, తనకు తానుగా కోల్పోవడానికి
ఇష్టపడేవాళ్లే నిలుస్తారు ఇక్కడ.
* * *

ప్రపంచం అనేది అజ్ఞానజాతర.
ఆ గోల నుండి తప్పించుకోవడానికే గురుదర్శనం.

గురువు గడప వద్ద విడిచే చెప్పులు వద్దనే నిలిచిపోతుంది మాయ.

సద్గురు సన్నిధిలో ఉన్నంతసేపు ఆత్మస్వరూపంగానే ఉంటాం...
అలా నిశ్చలమనస్సుతో ఉంటాం...
ఇంకేమీ అవసరం లేనిస్థితిలో ఉంటాం...

తిరిగి చెప్పులు తొడుక్కోగానే మళ్లీ తగులుకుంటుంది ఆ సంసారపిశాచం.

ప్రపంచానికి, పరమాత్మకు మధ్య వారధి
గురుదర్శనం...

వారధికి ఇవతల ఉండలేం...
వారధిపైనే ఉండలేం...
వారధిని దాటేసే సాహసమూ చేయలేకున్నాము...

మాయ - బ్రహ్మము ఇద్దరూ కలిసి ఆడే ఆటలో
"షటిల్ కార్క్" లా ఉన్నాము...

వారికి క్రీడ.
మనకు పీడ.

వారికి లీల.
మనకు గోల.

తల(బుద్ధి) ఉన్నంతవఱకు తలరాత తప్పదు.
తలరాత ఉన్నంతవఱకు నా ఈ రాతలు తప్పవు.

పరమేశ్వరా!
నా వద్ద నీవు మాట పడకూడదనుకుంటే-
గణేశుడికి లాగే...
తల(అజ్ఞానం) తీసి
తల(జ్ఞానం) పెట్టు...
నీకు తెలిసిన విద్యే కదా...!

* * *

70. అంతరిక్షంగా ఉండు...

---

10-6-2021 * అమావాస్య.

ఉదయాన్నే 5.30 కు కేరళా అంగట్లో టీ త్రాగుతున్నాం నేనూ దేవీప్రసాద్...

దేవీప్రసాద్ స్నేహితుడొకడు అన్నాడట...
మీ వేదాంతమంతా "పడక్కుర్చీ వేదాంతం" అని.

అంటే సుష్టుగా భోంచేసి వాలుకుర్చీలో అలా వెనక్కి వాలి కాలక్షేపానికి మాట్లాడే మాటలు...అని.

నాకు నవ్వొచ్చింది...

అప్పుడే క్రొత్తగా వచ్చిన సందర్శకుడికి అలానే కనబడతారు
రమణభగవానులు కూడా.

కానీ వారి "సోఫాసుఖం" వెనుక ఉన్న త్యాగం-తపస్సు ఆర్తి-భక్తి ఆ సందర్శకుడికి కనబడవు.
ఇప్పుడున్న frame మాత్రమే కనబడుతుంది.

* * *

5.45 కంతా సద్గురుసన్నిధికి చేరుకున్నాం...

రవి, హరి, భవ్యబంగారం...ఉన్నారు...
నెల్లూరు మురళి గురుచరిత్ర పారాయణం చేస్తున్నాడు...

గురువుగారు మాకు బొట్టుపెట్టి, తీర్థం ఇచ్చారు...

బజారులో అమ్మే విబూధే, గురువుగారి అమృత హస్తముతో మన నుదుటన "అభయముద్ర"గా పెట్టబడుతుంది.

ఇంట్లో ఉండే బిందెలో నీళ్లే, వారి కరస్పర్శతో పునీతమై మన అరచేతిలో తీర్థంగా పోయబడుతుంది...

సదా సద్గురు పాద, కర స్పర్శతో పునీతమైన చాపపై మేం కూర్చున్నాం...

మాకు టీ ఇమ్మని రవిని పురమాయించారు గురువుగారు...

రవి టీ కాచీ, ట్రేలో తీసుకొచ్చి అందరికీ తలా కప్పు ఇచ్చాడు...

* * *

ఆశ్చర్యం... మేం ఆ చాప మీద కూర్చోగానే...

దారిలో "పడక్కుర్చీ వేదాంతం" గురించి మేం మాట్లాడుకున్న మాటల్నే గురువుగారు ప్రస్తావించారు...

దేవీప్రసాద్ ఆశ్చర్యపోయాడు...

"నకిలీగా కనబడేది అసలుగా ఉంటుంది.
అసలు అన్నట్టుగా కనబడేది నకిలీగా ఉంటుంది."
అన్నారు గురువుగారు...

హరివైపు తిరిగి-
పందెంలో పదివేలు పెట్టి పోగొట్టుకుంటున్నావేగానీ,

ఆ పదివేలు దేవుని హుండీలో వేద్దామని అనిపించిందా నీకు యెప్పుడైనా? అని అడిగారు.

"లేదు" అన్నాడు.

పందెంలో పెట్టిన డబ్బులు  రావచ్చు, పోవచ్చు...
గ్యారెంటీ లేదు.
కానీ దేవునికి పెట్టిన డబ్బులు రెండింతలై తప్పక తిరిగి వస్తుంది.

కానీ మనం నమ్మం...జూదాన్ని నమ్ముతాం.
దేవుడికి దండం పెడతాం...ధనం పెట్టం...

మన స్వంతానికి చాలా ఖర్చు పెట్టుకుంటాం...
దేవుడికి అందులో సగం కూడా ఖర్చు పెట్టం...

నమ్మినట్టు కనబడే అపనమ్మకానికి భక్తి అని పేరు పెట్టుకుని మనల్ని మనమే మోసం చేసుకుంటాం.

భక్తికి తార్కాణం ఏమంటే-
మీ ఇంట్లో ముగ్గురున్నారనుకో...
నాలుగోవాడిగా భగవంతుణ్ణి చేర్చుకుని అంత ఖర్చుని భగవంతుడికి చేర్చేయాలి...ఏదో ఒక రూపంలో...

అప్పుడు భౌతిక-మానసిక-పారమార్థిక సుఖాలు సమకూడుతాయి...

అంతేగానీ నీ కొబ్బరి చిప్పలకు, కర్పూరం బిళ్లలకు, అరటిపండ్లకు మోసపోడు భగవంతుడు.

నీవు నటుడు అయితే, ఆయన మహానటుడు...
అన్నారు నవ్వుతూ...

* * *

నెల్లూరు మురళీ అడిగాడు-
తప్పా? ఒప్పా? అనే సందిగ్ధత వస్తుంది ఒక్కొక్కసారి...
ఎలా నిర్ణయించడం? అని అడిగాడు...

సందిగ్ధత వచ్చిందంటేనే అది తప్పనే అర్థం...
వేరే ప్రమాణం అవసరం లేదు...అన్నారు గురువుగారు.

గతంలో నన్ను పట్టెయ్య కూడా ఇలానే
నేను పొందానా? లేదా? చెప్పండీ...అని అడిగాడు.

"నీ ప్రశ్నే నీవు పొందలేదనేందుకు గుర్తు" అని చెప్పా...

గురువుగారికి ఈ పట్టం చెబితే పగలబడి నవ్వారు...
నిజమే కదా....నేను భోంచేశానా? లేదా? అని ప్రక్కనవాడిని అడిగితే ఎలా?
అన్నారు.

ఏది పుణ్యం? ఏది పాపం? అనే సందేహానికి
చక్కటి పరిష్కారం చూపారు గురువుగారు-

నీ లోపల జరిగేదంతా పుణ్యమే.
నీ వెలుపల జరిగేదంతా పాపమే.
అన్నారు.

ఇదొక అద్భుతమైన ఆధ్యాత్మిక సూత్రం...
లోపలున్న లౌకికం కూడా ఆధ్యాత్మికమే.
వెలుపలున్న ఆధ్యాత్మికం కూడా లౌకికమే.
* * *

"అంతరిక్షంగా ఉండు"

సకలమూ "నాలో ".....అని ఉండు అన్నారు...

"లోపల లేని బయట"గా ఉండు.
లేదా
"బయట లేని లోపల"గా ఉండు.
అన్నారు.
* * *

ఈ సృష్టి ఎవడైనా సృష్టించనీ నీ ఒక్కని కోసమే సృష్టించబడింది...అన్నారు.
"నేనే కేంద్రం" అన్నాను నేను...

"అవును...మెలకువ వచ్చినప్పటి నుంచి నిద్రలోకి పోయేముందు వఱకు ఉన్న ప్రపంచానికి నీవే కారణం, కేంద్రం...అన్నారు...

మెలకువ,  బాబు మెలకువ కాదు...
బాబు కూడా మెలకువ కలిగిన  తర్వాత కనబడేవాడు...అన్నారు.

నేనుంటేనే సకలమూ ఉంటోంది కాబట్టి "నేనే" సకలము..."నేనే" కేంద్రము.

* * *

గ్రహాలు(జ్యోతిషం), దిక్కులు(వాస్తు)...ప్రస్తావనకు వచ్చింది....
అవన్నీ మనం పెట్టుకున్న లెక్కలే...పనిచేస్తాయి...అన్నారు.

* * *

గుర్వనుగ్రహం గుఱించి ప్రస్తావన వచ్చింది...

కుజగ్రహం పట్టింది, శనిగ్రహం పట్టింది అంటుంటారు కదా...ఈ గురువు అనే గ్రహం కూడా అలాంటిదే...
పట్టి, వదులుతుంది...అన్నారు.

* * *

గురువుగారికి యవ్వనావస్థలో ఓ స్త్రీతో సంబంధం ఉన్నప్పుడు... తాతగారు అన్నారట-
స్వంత ఆకు పెట్టుకుని, ఎంగిలి ఆకులో ఎందుకు తింటారు స్వామీ...అని.

అది ప్రస్తావిస్తూ గురువుగారు ఇలా అన్నారు-
'ఇది తప్పు' అనేది అనుభవంలోకి వచ్చినంత మాత్రాన "పాపం" పోదు.
కానీ "నేను ఎంగిలి కూడు తినే గజ్జికుక్కనే" అనేది జ్ఞప్తిలో ఉంటుంది.
అందువల్ల నన్ను అందరూ ఆ అవతారం, ఈ అవతారం అని అన్నంతమాత్రాన...."నేను మహనీయుణ్ణి" అనే భ్రాంతికి నేను లోనుగాలేదు యెప్పుడూ.
ఆ జ్ఞాపకం స్పీడ్ బ్రేకర్ లా పనిచేస్తుంది... అన్నారు.

* * *

పాప పుణ్యాల ఫలితం....అనే ప్రస్తావన వచ్చింది...
దానికి సంబంధించి గురువుగారు ఓ కథ చెప్పారు-

ఇద్దరు స్నేహితులు...
ఒకడు గుడికెళ్లాడు...మరొకడు సానికొంపకెళ్లాడు...
గుడికెళ్లినవానికి ముల్లు గ్రుచ్చుకున్నది...
సానికొంపకెళ్లినవానికి కొన్ని నాణేలు దొరికాయి...

గుడికెళ్లినవాడు బాధపడ్డాడు...
సాని వద్దకెళ్లినవాడు సంతోషపడ్డాడు...

చేసిన పనులకు, కలిగిన ఫలాలకు పొంతన కుదరక ఓ స్వామిని కలిసి తమ సందేహం అడిగారు...

ఆ స్వామి ఇలా సమాధానమిచ్చాడు-
గుడికెళ్లినవాడు నిజానికి పాముకాటుకు గురవ్వాలి...దైవదర్శనం వలన పుణ్యం కూడి చిన్నముల్లుతో అది తీరింది...

సాని వద్దకు వెళ్లినవానికి నిజానికి లక్షలు విలువ చేసే వజ్రమే దొరికి ఉండాల్సింది...
సాని కొంపకు పోవడం వలన పుణ్యం హరించి కొద్ది కాసులు మాత్రమే దొరికాయి...

ఆ స్వామి సమాధానంతో -
దైవదర్శనానికెళ్లినవాడు సంతోషించాడు.
సానిదాని వద్దకు వెళ్లినవాడు దుఃఖించాడు.

రమణభగవానులు కూడా పుణ్యఫలం గురించి ప్రస్తావన వచ్చినప్పుడు-

తలకు తగలాల్సిన బాణం
తలపాగా కు తగులుతుంది...అన్నారు.

అలా పుణ్యఫలం వలన
పాపఫలం వలన కలిగే అలజడిని అది తగ్గిస్తుంది.

ఫ్యాన్ స్విచ్ ఆఫ్ చేశాక కూడా....
ఫ్యాన్ కాసేపు తిరుగుతుంది....

అలా రమణులు "అకర్మ"స్థితికి చేరుకున్నాక కూడా
కొంత కదలిక ఉండినది...ఆ కొంత కదలిక పేరే "ప్రారబ్ధం".

* * *

జ్ఞానశిశువు
9533667918

71. ఆత్మపుత్రిక త్రిపుర

---

17-6-2021 * గురువారం

ఉదయం 6.15 కు సద్గురు సన్నిధికి చేరుకున్నాం...
అనామిక, భవ్యబంగారానికి Bingos,
మా చెల్లెలు త్రిపురాంబకు kinder joy తీసుకెళ్లా...

త్రిపుర కూడా మా దృష్టిలో చిన్నపిల్లే.
యెంత చిన్నపిల్ల అంటే, సద్గురు పాదాలకు దగ్గరగా కూర్చుని సెల్ ఫోన్ లో candy crush ఆడుకునేంత చనువున్న చిన్నపిల్ల.

ఆమె అమాయకత్వం... మాకందరికీ ముచ్చటే...
అందుకే మేమందరం త్రిపురను "స్వంతం"గా ఫీల్ అవుతుంటారు.

గురువుగారికి కూతుళ్లు లేని లోటును త్రిపురాంబ తీరుస్తోంది...వారి కుటుంబంలో ఒకరుగా అయిపోయారంటే అది అతిశయోక్తి కాదు.

పద్మావతమ్మ-సుబ్రహ్మణ్యులకు ఆత్మపుత్రిక త్రిపురాంబ...

పద్మావతమ్మగారి పటానికి విలువైన, సొగసైన నగలతో మనిషిని అలంకరించినట్టే అలంకరించారు త్రిపురాంబ.

మా సత్సంగంలో  ఆ పటం స్పెషల్ గా కనిపిస్తుంది...
జీవంతో కళకళలాడుతుంటుంది...

త్రిపుర విజయవాడలో టీచర్ గా పనిచేస్తోంది.

ఖమ్మంవాసి, పాత్రికేయులు వేంకటనరసయ్యగారి ద్వారా త్రిపురగారు సద్గురుదర్శనానికి వచ్చారు...
"మీరు గతంలోనే ఇక్కడకు వచ్చి ఉన్నారు.
మీరు నాకు ఎప్పుడో తెలుసు...
కానీ ఆ విషయం మీకు తెలియదు..."
అన్నారు గురువుగారు త్రిపురతో....

ఏ జన్మలోనో వారికి బిడ్డగా ఉండి,
సేవ చేయక నిర్లక్ష్యం చేసి ఉంటారు...

అందుకే ఈ జన్మలో ఇలా దగ్గరకు చేరి,
సేవ చేసి ఋణం తీర్చుకుంటున్నారు త్రిపురగారు...

తన ఇద్దరు పిల్లలతో,
గురువునే తమ పరమతండ్రిగా భావించి,
ముగ్గురూ గురుపాదాలకు అంకితం అయిపోయారు...

రెండు రోజులు శెలవు దొరికితే చాలు...
బడి నుండి రాగానే బండెక్కేస్తుంది...
ఉదయం నాలుగింటికంతా గురువుగారి ముంగిట్లో ప్రత్యక్షమవుతుంది...

ఆహా! త్రిపురకు ఎంత ఓపిక...అనుకుంటాం అంతా...

ఊళ్లో ఉండి, ప్రసాద్ తన స్కూటర్ లో తీసుకెళితే తప్ప సద్గురు సన్నిధికి వెళ్లని బాబు ఎంత సోమరో...?

చిన్నపిల్ల భవ్యబంగారం ఇక్కడే "పెద్దమనిషి" అయినప్పుడు...
తొలి తాంబూలం బాబు తీసుకున్నప్పుడు...
"బాబు నీ మేనమామ " అని గురువుగారన్నారు భవ్యబంగారంతో.

నిన్న నవ్య వివాహం సద్గురు సన్నిధిలో జరిగినప్పుడు,
తన ఇద్దరి పిల్లల పెళ్లిళ్లు కూడా సద్గురు సన్నిధిలోనే జరుపుతానని
స్థిరసంకల్పం చేసుకున్నారు త్రిపురాంబగారు...

గురువుగారు కూడా సత్సంగంలో వేంకటనరసయ్య వాళ్లతో అన్నారట...
త్రిపురాంబ కుమార్తెలకు కూడా ఇక్కడే వివాహం జరుగుతుంది...అని.

త్రిపురగారి ఆనందానికి అవధులు లేవు...
గురువుగారు తన సంకల్పానికి స్టాంప్ వేశారని...

* * *

లక్ష్మి "టీ" తీసుకొచ్చి ఇచ్చింది అందరికీ...

హరి అన్నాడు-
దేహం నిశ్చలమైతే, ఆటోమేటిక్ గా మనసు కూడా నిశ్చలమౌతుంది...అని.

మనసొకటీ, తనువొకటీ కాదు...
ఆ రెండూ ఒకటే అన్నారు గురువుగారు.

* * *

చిన్నప్పుడు తోటి స్నేహితుల్ని ఓ చిలిపిప్రశ్న వేస్తుండేవాణ్ణి....
కిలో దూది బరువా? కిలో ఇనుము బరువా? అని.
ఇనుమే బరువు అని చెప్పేవారు చాలామంది పిల్లలు...
నవ్వి -
"రెండూ కిలోనే కదా! రెండూ సమానమైన బరువే" అని చెప్పి, గొప్ప మేధావిలా ఫీల్ అయ్యేవాణ్ణి అప్పట్లో.

* * *

ఉపాసనలో దైవానికి సంబంధించిన
రూపం - నామం కూడా అలాంటివే.
రెండూ సమానమైన బరువు(విలువ) కలిగినవే.

సిద్ధిలో జీవునికి సంబంధించిన
దేహము - మనసు కూడా అలాంటివే.
రెండూ సమానమైన విలువ కలిగినవే.

భౌతికము - ఆధ్యాత్మికము
అని రెండుగా తోచవు జ్ఞానికి.
ఒక్క సత్పదార్థమే ఉంటుంది జ్ఞాని దృష్టిలో.
అదే మనసుగా...తనువుగా...జగత్తుగా...ఉన్నది.

* * *

నేను అంటే ఈ తనువు మాత్రమే కాకుండా,
నేను(నా తనువు),
నేను కూర్చున్న ఈ మంచము,
మంచానికి ఆధారమైన భూమి,

భూమికి ఆధారమైన ఆకాశం
మొత్తం కలిపి "నేను" అని ఉండాలి...
అన్నారు గురువుగారు.

సబ్జక్టు ప్రస్తావనకు వచ్చినప్పుడు మాత్రమే కాకుండా... దైనందిన వ్యవహారంలో ఉన్నప్పుడు కూడా సదా ఆ జ్ఞప్తి ఉండాలి...అన్నారు.

* * *

"నేను ఆత్మను" అనుకుంటే చాలదు.
ఆత్మగా ఉండాల...

అనుకుంటే అయిపోయేటట్టు ఉంటే
అందరూ అయిపోరూ...? అన్నారు.

* * *

ఇప్పుడే రమణ ఫోన్ చేశాడు...
ప్రతిరోజూ ఫోన్ చేస్తాడు...
పిచ్చాపాటీ మాట్లాడుకుంటాము సరదాగా...

కొంతమంది ఏ ప్రశ్నా వేయకనే...ఏదైనా సబ్జక్టు చెప్పండి అని అడుగుతుంటారు...

సబ్జక్టు ఏం మాట్లాడతాం... అనిపిస్తుంది...చెప్పడానికి  ఏమీ తోచదు...

రమణ అన్నాడు-
నిజమే...నీవే సబ్జక్టు అయినప్పుడు,
సబ్జక్టు ఏం మాట్లాగలవు?

గురువుగారు ఓ అద్భుతమైన మాటన్నారు-

"చెప్పే నువ్వు లేవు.
ఉండే నువ్వు చెప్పలేవు".

పులకించిపోయాడు బాబు ఈ ప్రబోధానికి.

* * *

వివేకానంద రెండు మాటలన్నారు...

మొదటి మాట-
ఎప్పటికీ నీవు ఆత్మను పొందలేవు.

రెండవమాట-
యెందుకంటే నీవే ఆత్మవు కాబట్టి.

* * *

బయట నుండి దొరికే సత్యం సత్యం కాదు.
సత్యం అనేది నీ లోపలే నీటిబుగ్గ వలె ఉబుకుతుంది.

జగత్తే అబద్ధం.
జగత్తులో ఉండే ప్రవక్తలూ
ప్రవక్తల సమాధానాలు
సత్యం ఎట్లా అవుతాయి?
మాటలన్నీ "మాయ"మాటలే.

* * *

హరి:
నేను "మొత్తం"గా ఉన్నానా?
అసలు నేను లేనా?

సద్గురు:
రెండూ కరెక్టే.
రెండూ తప్పే.

రెండూ కరెక్టే ఎప్పుడంటే-
నీవు ఉన్నప్పుడు.

రెండూ తప్పే ఎప్పుడంటే
నీవు లేనప్పుడు.

* * *

వివేకానంద ఓ మాటన్నారు-
మరో 10 వేల సంవత్సరాల వరకు సరిపడా సబ్జక్టు చెప్పేశాను...అప్పటి వరకు మరో ప్రవక్త రావల్సిన అవసరం లేదు...అని.

నేనంటాను-
సృష్టి అంతం అయిపోయాక కూడా
మిగిలి ఉండే సత్యాన్ని ప్రబోధించారు మన గురువుగారు...అని.

ఇది దేశ-కాలములకు అతీతమైన సబ్జక్టు....
అనగా Object లేని Subject...

* * *

72. ప్రకృతి రసాస్వాదనమే తపస్సు

---

24-6-2021 * గురువారం * పౌర్ణమి

పట్టెయ్య ఓ మాటన్నాడు-
మీరు వ్రాస్తున్న 'నా గురువు' వ్యాసాలు బాగున్నాయిగానీ, నా మట్టుకు
నాకు కొన్ని అభ్యంతరవాక్యాలున్నాయి...అని.

నేనన్నాను-
ఆ అభ్యంతర వాక్యాలు మాత్రమే సత్యవాక్యాలు.
మిగతా అన్నీ అసత్యాలుగానే భావించండి... అని.

సత్యం యెప్పుడూ అభ్యంతరకరంగానే ఉంటుంది  ప్రపంచానికి.

ఆ అభ్యంతర వాక్యాల చుట్టే మనసు భ్రమరంలా ప్రదక్షిణం
చేయాలి....అప్పుడే అందులోని సత్యం గోచరమౌతుంది.

సత్యం అనేది మన ఆమోదంతో ఉనికి కలిగి ఉండదు.
దాని ఆమోదంతో మనం ఉనికి కలిగి ఉన్నాం...
అంటారు గురువుగారు.

వ్యాసాల్లో ఒక్క అక్షరం మార్చడానికి
బాబుకు కూడా స్వాతంత్ర్యం లేదు.
అవి జ్ఞానాంబ ప్రసాదితములు.

* * *

భూమికి గురుత్వాకర్షణ శక్తి ఉందనే విషయం న్యూటన్ కనిపెట్టక మునుపే గురుత్వాకర్షణ శక్తి ఉంది.

అలా మానవుడు దేవుణ్ణి కనిపెట్టాల్సిన(సాక్షాత్కరించుకోవలసిన) అవసరం ఏమీలేదు.
దైవం సదా సిద్ధంగా ఉంది.

ప్రకృతిరూపంగా సాక్షాత్కరించి ఉన్న దేవుణ్ణి రసాత్మకంగా అనుభవించడమే మానవుని జీవితలక్ష్యం.
అందులో భాగమే అరుణాచలగిరిప్రదక్షిణం.

ఆ ప్రకృతికి తాను అభిన్నుడు అయినప్పటికీ,
ప్రకృతిలో ఒకదానికొకటి ఆహారం(అనుభవం) అయి ఉంటుంది.

ప్రకృతిని ఆహారంగా తీసుకొని జీవిస్తాడు...
చివరికి మరణించి తిరిగి ప్రకృతికి ఆహారం అయిపోతాడు.

ప్రకృతి శాశ్వతం.
ప్రకృతిలో ఉన్న ప్రతీది నశ్వరం.

శరీరం - నశ్వరం.
శరీరధారి - శాశ్వతుడు.

చెట్టు యొక్క ఆకులు రాలి, భూమిలో కలిసి, తిరిగి ఆ చెట్టుకే సత్తువగా మారి చెట్టులో చేరినట్టు

శరీరం నశించాక
శరీరధారిగా(దేవుడిగా) పరిపుష్టం అవుతుంది.

ఒక్క అణువు కూడా నాశనం అవడం అంటూ ఏమీ ఉండదు...

హరిమయముగాని ద్రవ్యము పరమాణువు లేదు...
అన్నాడు ప్రహ్లాదుడు.

నాశనం అనేది లేదు...
రూపాంతరం చెందటం అనేది ఉంది...

ఉద్భవించడం-జీవించడం-మరణించడం-రూపాంతరం చెందడం... అనేది

భగవంతునిలో ఉన్న అదొక క్రీడానందం...

వ్యష్టి దేవుడే - ప్రకృతి.
సమిష్టి ప్రకృతే - దేవుడు.

నీవు వ్యష్టి వైపు దృష్టి పెడితే - దుఃఖం.
నీవు సమిష్టి వైపు దృష్టి పెడితే - సుఖం.
* * *

నా ప్రియ మిత్రుడు "రమణ" ఓ మంచి సబ్జక్టు పంపాడు వాట్సప్ లో...

అది పాశ్చాత్య తత్త్వవేత్త అయిన స్పినోజా గారు తన మాటల్ని దేవుని మాటలుగా వ్రాసిన పొడి పొడి వాక్యాలప్రోగు...

అది చదివితే దేవుడే తన మాటలను స్పినోజా ద్వారా పలికాడు అనిపిస్తుంది.

ముందుగా వారి జీవితచరిత్రను, వారి సిద్ధాంతాన్ని సంక్షిప్తంగా తెలుసుకుందాం...

స్పినోజా జన్మతః యూదుడు...
అతడు 24-11-1632 లో జన్మించాడు...
వృత్తి...అద్దాలు పాలిష్ చేయడం...

గురుపుత్రికను ప్రేమించాడు...
అతడు పేదవాడని ఆమె తిరస్కరించి,
ఓ ధనికుణ్ణి వివాహం చేసుకుంది.
స్పినోజా యావజ్జీవబ్రహ్మచారిగానే ఉండిపోయాడు.
ప్రేమతత్త్వాన్ని వదిలి, తత్త్వప్రేమలో పడ్డాడు.
* * *

స్పినోజా భావం ప్రకారం విశ్వం, దేవుడు ఒకటే.

విశ్వానికి అంతం లేదు.
అలాగే అది నిత్యం కూడా.

స్థలం, కాలం దృష్ట్యా దానికి అవధులు లేవు.
అయితే విశ్వంలోని వేరువేరు భాగాలకు ఆది, అంతం ఉన్నాయి. అవి నశ్వరాలు.

అందుచేత, విశ్వంలోని ప్రత్యేక వస్తువులను, ప్రత్యేక మనస్సులను దేవుడుగా అర్థం చేసుకోరాదు.

అవి దేవునిలో భాగాలు మాత్రమే.
మనం విశ్వంగా చూస్తున్నది దేవుని అనంతత్వంలో ఒక నలుసు మాత్రమే.

విశ్వంలో ప్రతి వేర్వేరు వస్తువులలోను,
ప్రతి మనస్సులోను వుండేది దేవుని అంశ మాత్రమే.
అలాంటి అనంతమైన అంశల సమాహారమే(totality) దేవుడు.

ఈ ప్రత్యేక వస్తువులు, మనస్సులు ఎప్పటికప్పుడు మారిపోతున్నా వాటిలో అంతర్భూతంగా ఉన్న "సత్" మార్పు చెందదు. మొత్తం విశ్వం మార్పు చెందదు.

గోడ గడియారాన్ని మనం ఉదాహరణగా తీసుకోవచ్చు...

గడియారంలో లోలకం నుంచి...ప్రతి భాగమూ కదులుతూనే ఉంటుంది.
కానీ గడియారం మొత్తంగా చూసినప్పుడు అది అక్కణ్ణుంచి ఎక్కడికీ కదలదు.

ఈ ప్రపంచమంతా దేవుని దేహం.
దానిలో మానవుడు ఒక కణం.

తాను ప్రత్యేక దేహిగా కొనసాగకపోయినా
దేవుని అనంతశరీరం కొనసాగుతుంది.
అది శాశ్వతం.

గంగానది, నదిగా శాశ్వతం...నీరుగా అశాశ్వతం.
పాతనీరు పోయి, క్రొత్తనీరు వస్తుంటుంది...
కానీ నదిగా అది శాశ్వతం.
ఈ విషయాన్ని గ్రహిస్తే మానవునికి దుఃఖం కలుగదు.

* * *

సత్ ను ఎలా నిర్వచించాలి?

ఏకమేవా ద్వితీయమ్...

అది కానిది ఏమీలేదు...

అదొక్కటే ఉన్నది...

ఏకం సత్...

దాని ఉనికికి మరొకటి ఏదీ ఆధారం కాదు.

ఏదీ కారణం కాదు.

కానీ అన్నిటికీ అదే ఆధారం.

అదే కారణం.

దాన్ని భావించడానికి ఏ ఇతర భావపు సహాయం అక్కర్లేదు.

కాని, అది లేకుండా దేన్నీ భావించలేము.

సత్ ఒక్కటే వుండేటట్టయితే, అది అనంతం అయి ఉండాలి.

అనంతం కాకపోతే, అది కానిది మరొకటి వుండవలసివస్తుంది.

అది నిత్యం అయివుండాలి. లేకపోతే దానికి ముందు, తర్వాత మరొకటి ఉండవలసివస్తుంది.

ఉన్నది అదొక్కటే కనుక, వేరే తత్వం వుండడానికి వీలులేదు.

అది స్వయం సిద్ధం, స్వయంభువం అయి వుండాలి.
లేకపోతే దాని సృష్టికి మరొకటి కారణం ఉండవలసి వస్తుంది. అది కానిది లేదు కనుక అదీ కుదరదు.

దానికి సంకల్పం(will) అనేది లేదు.
ఇలా చేయాలి, అలా చేయాలి అని సంకల్పించి,
ఏదో ప్రయోజనం ఆశించి ఏ పనీ చేయదు. అది దాని స్వభావానికి విరుద్ధం.
ఏదో ప్రయోజనాన్ని ఆశించి చేయడం అంటే దానికి కోర్కె వున్నదన్నమాట.
తనకు ఏదో కొరత వున్నప్పుడు మాత్రమే, తనకు లేనిదాని కోసమే, కోర్కె

కలుగుతుంది. కాని, తనకంటె వేరే ఏదీ లేనప్పుడు, తాను సర్వ సంపూర్ణం అయినప్పుడు- కోర్కెగాని, సంకల్పంగాని ఎందుకు కలుగుతుంది?

కనుక సత్ అనేది అనంతం, నిత్యం, స్వయంభువం, సంకల్పరహితం, సర్వ స్వతంత్రం, సర్వ సంపూర్ణం అయిన పరమతత్త్వం.

దాన్నే దేవుడని స్పినోజా వ్యవహరించాడు.

* * *

విశ్వ విఖ్యాత శాస్త్రవేత్త ఆల్బర్ట్ ఐన్-స్టీన్
పలు విశ్వవిద్యాలయాలకు వెళ్ళినప్పుడు
అక్కడి వాళ్ళు అతడిని
మీకు దేవుడి మీద నమ్మకం ఉందా ?
అని అడిగేవాళ్ళట.

ఉంది....
స్పినోజా చెప్పిన దేవుడి మీద నమ్మకం ఉంది. అనేవాడట ఐన్-స్టీన్.

* * *

దేవుడు మనిషికి చెప్పింది.... స్పినోజా మాటల్లో...
చదవండి...

* * *

ప్రార్థనలేవీ అక్కర్లేదు....
ప్రపంచం లోకి వెళ్లి జీవితాన్ని ఆస్వాదించండి...

సృష్టి సర్వం తో మమేకం కండి...
హాయిగా నవ్వండి...
భువనగానం లో భాగంకండి...

ప్రార్థనా మందిరాలకు వెళ్లడం దేనికి?
నేనక్కడ ఉంటానని ప్రకటిస్తూ
అవన్నీ మీ నిర్మాణాలేగా!

పర్వతాలూ, చొరలేని అరణ్యాలూ, నదులూ, సరోవరాలూ, సాగర తీరాలూ... ఇవీ నా నివాసాలు.

మీ దౌర్భాగ్యాలకు నన్ను నిందించడం వదిలెయ్యండి...

మీ తప్పటడుగులూ, మీ పాపాలతో నాకు ప్రమేయం లేదు...

మీ పవిత్ర గ్రంధాలతో నాకే సంబంధమూ లేదు...

ఒక పొద్దు పొడుపులో, ఒక నిర్జన మైదానంలో, ఒక ఆత్మీయ మిత్రుడి స్పర్శలో, మీ బిడ్డ కళ్ళలో ఉంటాను నేను...
ఏవో పుస్తకాల పుటల్లో కాదు.

అవధి లేని ప్రేమ నేను.
నేను ఏ తీర్మానాలు చెయ్యను..
నిన్ను విమర్శించను...
నువ్వంటే కోపాలూ, పట్టింపులూ ఉండవు.

క్షమాపణలేవీ నన్ను అడగకు...
క్షమించవలసినవేవీ ఉండవు నా దృష్టిలో...

నీ పరిధులూ, పరితాపాలూ, ఉద్వేగాలూ, సుఖాలూ, అవసరాలూ అన్నీ నేను నీలో నింపినవే. అలాంటప్పుడు నీ అతిక్రమణలకు నిన్నెలా శిక్షిస్తాను నేను?

నిన్ను కాల్చివేసే నరకమొకటి నేను సృష్టించి ఉంటే నేనేం దేవుణ్ణి ?

నిత్య జాగృతిలో బతుకు.
అదే నీ దిక్సూచి.
ఇతరులు నీకేది చేయకూడదని నువ్వు భావిస్తావో అది నువ్వు వాళ్లకు చెయ్యకు.

బతుకంటే అదేదో పరీక్ష కాదు...
ఒక రిహార్సల్ కాదు...
ఏ స్వర్గద్వారాలకో పీఠిక అస్సలు కాదు...

ఇక్కడ నడిచే, గడిచే వాస్తవం!!!
అంతమాత్రంగానే చూడు దాన్ని.

పరిపూర్ణ స్వేచ్ఛనిచ్చాను నీకు.
శిక్షలూ, పురస్కారాలూ, పాపాలూ, సద్గుణాలూ
నా నిఘంటువులో మాటలు కాదు.

ఏదో కలంతో వాటినెవ్వరూ నా దివాణంలో లెక్క కట్టరు.
స్వర్గం, నరకం నీకు నువ్వే నిర్మించుకోవాలి.
ఆ స్వేచ్ఛ నీదే.

ఈ బతుకు ముగిశాక ఇంకొకటేదైనా ఉందో, లేదో నేను చెప్పను.
కానీ దీని తరువాత ఇంకేదీ లేదన్నంత దీక్షగా బతుకు.
ఇంకొక బతుకు ఉంటే ఇంతకుముందు నువ్వు ఏం చేశావు, ఇంకేం
విస్మరించావు - అనే లెక్కలు నేను తిరగదోడను.

నన్ను నమ్మకు...
నమ్మడం అన్నది ఊహాత్మకం...
నిన్ను నువ్వు నమ్ముకో...

ఏ సాగర జలంలోనో ఈత కొడుతున్నప్పుడో,
ఒక శిశువును హత్తుకున్నప్పుడో,
పెంపుడు పశువును నిమిరేటప్పుడో
నేను గుర్తురావడమే నేను ఆశించేది.

నీ కీర్తనలు అన్నీ వదిలెయ్యి.
వాటికి ఉప్పొంగిపోతే నేనేం దైవాన్ని?

నీ ఆరోగ్యం, నీ సంబంధాలూ, సంతోషాలూ సరిచూసుకో...

అదే నాకు నువ్వు పఠించే స్తోత్ర పాఠం.

నా గురించి ఇప్పటికే నీ బుర్ర నిండా ఉన్న సరంజామా అంతటినీ
దులిపేసుకో...

అదంతా చిక్కుముడి .

అద్భుతాలూ, వాటికి అన్వేసి వివరణలూ దేనికి ?
నువ్వు ఇప్పుడు ఇక్కడ శ్వాసిస్తూ ఉన్నావ్...

అంతకు మించిన అద్భుతం ఇంకా ఏదో ఎందుకు...?

* * *

73. అదీ పూర్ణం - ఇదీ పూర్ణం

---

25-6-2021 * శుక్రవారం

ఈ ఉదయం 6 గంటలకంతా వాకింగ్ పూర్తి చేసుకుని, కేరళా టీ అంగడికి చేరుకున్నాను...
కాసేపటికి  దేవీప్రసాద్ వచ్చి కలిశాడు...
ఇద్దరం టీ త్రాగి, దారిలో U.G. గురించి చర్చించుకుంటూ గురుసన్నిధికి చేరుకున్నాం...

బెంగుళూరు నుండి వచ్చిన రవికుమార్ తో నమస్కార ప్రతినమస్కారాలు అయ్యాక...

గురువు వద్ద బొట్టు పెట్టుకుని, తీర్థం తీసుకున్నాం...

మాకు టీ ఇమ్మని రవిని పురమాయించారు గురువుగారు...

టీ సిప్ చేస్తుండగా గురువుగారు తన ప్రబోధాన్ని ప్రారంభించారు...

గురుసన్నిధిలోకి వెళ్లి కూర్చోగానే,  ఏ ప్రశ్నలూ వేయకనే, గురువునుంచి ప్రబోధాన్ని పొందే ఏకైక శిష్యుడు బాబు....

తప్పు.

గురువు అంటేనే సమాధానం.
శిష్యుడు అంటేనే ప్రశ్న.

ఏ ప్రశ్నా వేయక, గురువు ముందు ఊరికే కూర్చున్నా సరే,  నోరు తెరచి ప్రశ్నించినవానితో సమానమే.

ఆవు మౌనంగా వచ్చి మన వాకిట నిలబడుతుంది ప్రతిరోజూ...
"నాకు ఏదో ఒక ఆహారం పెట్టండి" అనే ఆ ఆవు మౌనానికి అర్థం.

అలాంటిదే బాబు మౌనం కూడా...
"నాకు ఏదో ఒక ప్రబోధాన్ని పడేయండి..." అని అడిగినట్లే.

అందువల్లనే ప్రబోధిస్తారు గురువుగారు...

బాబు "అడగకపోవడం"లో అడగడం అనేది ఉంది.
బాబు మౌనం నిజంగా అడగకపోవడమే అయితే,
గురువు నుంచి ఏ ప్రబోధమూ జాలువారదు. అదే గుర్తు బాబు నిజమైన మౌనానికి.
జాలువారింది అంటే ఇక్కడ పల్లం(ప్రశ్న) ఉన్నట్టే లెక్క.

* * *

ద్వారబంధం అనేది బయటకు సంబంధించినదా? లోపలికి సంబంధించినదా? అడిగారు గురువుగారు నా వైపు చూచి...

రెంటికీ సంబంధించినది...అన్నాను.

"ఆ ద్వారబంధమే బాబు" అన్నారు...

ఇహానికి, పరానికి మధ్య ఉన్న ద్వారబంధం బాబు. బాబుకు ఇహమూ తెలుసు, పరమూ తెలుసు...
కానీ బాబుకు బాబు గురించి తెలియదు...యెప్పటికీ తెలియదు...
బాబును తెలుసుకోవడానికి బాబే అడ్డం... అన్నారు.

* * *

రెండు ఉండే ఒకటి - ఒకటి.
రెండు లేని ఒకటి - ఒకటి.

"నేను బాబు" అన్నదాంట్లో
బాబు అనేది - రెండు ఉండే ఒకటి.
"నేను" అనేది - రెండు లేని ఒకటి.

* * *

1. నేను__________

2."నేను"__________

మొదటి నేను ప్రక్కన ఉన్న ఖాళీలో "బాబు" అని వ్రాస్తేనే సరిపోతుంది.
రెండవ "నేను" ప్రక్కన ఉన్న ఖాళీలో ఏమివ్రాసినా సరిపోతుంది.

మొదటి నేను, రెండవ "నేను" గా మారుకోవడమే మోక్షము.

అనగా బాబు అని వ్రాస్తే మాత్రమే సరిపోయే నేను,
ఏమి వ్రాసినా సరిపోయే "నేను"గా మారుకోవడమే
మోక్షము.

* * *

నేను పుట్టక మునుపు,
నేను మరణించాక
ఉన్న "నేను" యొక్క అడ్రసు ఎవ్వరికీ తెలియదు.
అనగా జనన-మరణ రహస్యం ఎప్పటికీ రహస్యమే.

* * *

ఐదో తరగతి వాడికి-
ఒకటో తరగతి వాడు అజ్ఞానిలా కనిపిస్తాడు.
పదో తరగతివాడు జ్ఞానిలా కనిపిస్తాడు.

ఇంతకీ తాను(ఐదవతరగతివాడు)
జ్ఞానియా? అజ్ఞానియా?

పోలిక వలన మాత్రమే జ్ఞానాజ్ఞానములకు ఉనికి.

ఏ పోలికా లేక కేవలుడుగా ఉన్నవాడు మాత్రమే
నిజమైన జ్ఞాని.

నిజానికి-

అజ్ఞాని అంటే, మారువేషంలో ఉంటూ ఎవరికీ తెలియబడక ఉన్న జ్ఞాని అని అర్థం...వీడు పాస్ అయినట్లు లెక్క...

జ్ఞాని అంటే మారువేషం బట్టబయలు చేసుకుని, అందరికీ జ్ఞానిగా తెలియబడినవాడు అని అర్థం... వీడు ఫెయిల్ అయినట్టు లెక్క.

ఇప్పుడు చెప్పు...ఎవడు గొప్ప?
పాస్ అయినవాడా? ఫెయిల్ అయినవాడా?
అని అడిగారు రవికుమార్ వైపు తిరిగి...

పాస్ అయినవాడే(అజ్ఞానే) గొప్ప అన్నాడు
రవికుమార్.

ఈ క్రొత్త క్రొత్త అర్థాలకు అందరికీ నవ్వొచ్చింది...

* * *

చెప్పేవాడు గురువు
వినేవాడు శిష్యుడు అనుకుంటే,

విద్యార్థి టీచర్ కు పాఠం అప్పజెప్పుతుంటాడు...

అప్పుడు చెబుతున్న విద్యార్థిని గురువు అనాలి.
వింటున్న టీచర్ ను శిష్యుడు అనాలి.

అవును...ఇదే వాస్తవం.

ప్రవచనం చెప్పే ప్రవచనకర్త టీచర్ కు పాఠం అప్పజెప్పే విద్యార్థి.

ఆ ప్రవచనం వినే శ్రోత టీచర్.

అంతేగాని వినేవాళ్లు తెలియనివాళ్లు అనుకుని ప్రవచిస్తే, ఆ ప్రవచనకర్త తప్పులో కాలువేసినట్లే.

* * *

శుద్ధోధన తనయుడు ఏ పరిస్థితులను చూచి చలించి, విరాగియై భార్యాబిడ్డలను వదిలి తపస్సు చేసి జ్ఞానం పొంది బుద్ధుడయ్యాడో ఆ తరువాత అవే పరిస్థితులు లోకంలో ఉన్నా కూడా విచలితుడు కాలేదు. మార్పు కలిగింది తనలోనేగానీ, లోకంలో కాదు.

కాబట్టి మార్పు రావలసింది తనలోనేగాని, లోకంలో కాదు...అన్నారు గురువుగారు.

లోకంలో మార్పు తేవడానికి ప్రయత్నించేవాడు - సంఘసంస్కర్త.

తనలో మార్పు తేవడానికి ప్రయత్నించేవాడు - ఆధ్యాత్మికుడు.

* * *

already బరువుతో నిండిపోయిన బుర్రను
మరో బరువు చేర్చేవాడు కాదు గురువంటే.

"బరువు తగ్గించుకోవడం ఎలా?" అనే టైటిల్ గల ఐదు కేజీల పుస్తకాన్ని నెత్తినబెట్టినట్టు ఈ గురువులు చేసే ప్రబోధాలు కూడా...

జ్ఞానమంటే-
విషయజ్ఞానంతో బుర్రను నింపేయడం కాదు.

జ్ఞానమంటే-
బుర్రను ఖాళీ చేసేయడం.

అదే పనిలో నిమగ్నమయి వుంటారు సద్గురువు... శిష్యుల విషయంలో...

మరి మీరు గురుప్రబోధాలను ఇన్ని వ్యాసాలుగా వ్రాస్తున్నారు కదా అంటారేమో...!!

అందుకు సమాధానంగా గురువు మాటల్నే చెప్పుకుందాం-

నేను ఇప్పటివరకు ఒక్క అక్షరం కూడా పలుకలేదు.
బాబు ఇప్పటివఱకు ఒక్క అక్షరం కూడా వ్రాయలేదు.

అదీ పూర్ణం.
ఇదీ పూర్ణం.

* * *

74. ఉన్నచోటనే ఉండండి...

---

27-6-2021 * భానువారం

ఈ ఉదయం ఆకాశం మబ్బు పట్టి, లోకానికి భానుదర్శనం లేకుండా చేసింది... చల్లగాలి వీస్తోంది...

6.15 కు గురుసన్నిధికి చేరుకున్నాం...

దక్షిణామూర్తి సన్నిధిలో పరివేష్ఠించి ఉన్న మునుల వలె, నేనూ, ప్రసాద్, రవి, అనామిక, నాగేష్, భీమవరం మురళీకృష్ణగారు, వారి అబ్బాయి రవీంద్రనాథ్ గారు...
సద్గురు సన్నిధిలో పరివేష్ఠించి ఉన్నాం...

ఏ మాటా లేక, చాలాసేపు నిశ్శబ్దం కూర్చున్నాం...
ఆ నిశ్శబ్దం కాస్త మౌనంగా మారుకుంది...

మాట ఆగితే - నిశ్శబ్దం.
మనసు ఆగితే - మౌనం.

మౌనమే స్వరూపంగా కలిగిన సద్గురువులో
ఉద్దేశపూర్వకమైన  ఓ స్పందం కలిగి,  అది మనసై, ఆ మనసు మాటై, ఆ మాట దివ్యోపదేశంగా మాకు అనుగ్రహించబడుతుంది.

ఆ భాషణం మళ్లీ మమ్మల్ని మౌనంలోకి తీసుకెళుతుంది...
యెందుకంటే ఆ భాషణం మౌనంలోనుంచే వచ్చిందిగనుక.

అందుకే అది మౌనభాషణం...
వారు మాట్లాడినా మాట్లాడనట్టే...

మనకు "ఏకం" అంటే ఏంటో తెలియక, అన్యంతో వేగులాడుతూ,
గందరగోళంలో ఉంటాం కనుక
మనం ఊరికే ఉన్నా కూడా మాట్లాడుతున్నట్టే...

* * *

ఉయ్యాలవాడ నుంచి నాగేష్ అనే జిజ్ఞాసి వచ్చాడు రాత్రి...

ఈరోజు ఉదయం కాసేపు సత్సంగంలో గడిపి, శివాలయం వెళ్లి, తిరుగుప్రయాణం కావడం...అనేది అతని ప్రోగ్రాం...

గుడికెళ్లడం అంటే, ఇది(గురుసన్నిధి) గుడి కాదనే కదా...! అన్నారు గురువుగారు...

గట్టిగా నవ్వాడు నాగేష్...

* * *

సద్గురు: నీవనుకునే పవిత్రమైన క్షేత్రాలు, తీర్థాలు ఉండేది భూమ్మీదే...వాటిని మోసే భూమి ఇంకెంత పవిత్రమైనది! నీవుండేది కూడా ఆ భూమ్మీదనే...

కాబట్టి నీవు ఉన్నచోటనే ఉంటే పోలా...!

మీ ఇంటి కిటికీ ద్వారా చూసే ఆకాశం కంటే
మా ఇంటి కిటికీ ద్వారా చూసే ఆకాశం పవిత్రమైనది అనుకోవడం లాంటిదే...ఒక చోటును పవిత్రక్షేత్రం అనుకోవడం కూడా.

అన్ని చోట్లా ఉండేది ఆ ఒక్క "చిదా"కాశమే...
కాబట్టి ఉన్న చోటనే ఉంటే పోలా...!

గిరిప్రదక్షిణం చేసి బయలుదేరిన చోటుకే చేరుకుంటావు...

అంత సంబడానికి బయలుదేరినచోటనే ఉంటే పోలా...!

"అన్ని క్షేత్రాలలో ఉండే దేవుడు ఒక్కడే"
అంటే దాని అర్థం అన్ని క్షేత్రాలకు వెళ్లి దర్శించిన నీవే ఆ ఒక్కడు అని అర్థం.

క్షేత్రాలు, దేవతామూర్తులు...అనేకం ఉంటాయి...
చూచేవాడు(ద్రష్ట) ఒకడే కదా!

దేవుడొక్కడే అనటంలో అంతరార్థం అదే.
"ద్రష్టే దేవుడు" అని.

నగేష్: దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్చేత్ ద్బ్రహ్మయమం జగత్సాదృష్టిః
......

సద్గురు: నిజమే...ఆ చదువేదో ఉన్నచోటనే ఉండి చదువుకుంటే పోలా..!

కానీ...మేమూ తిరిగి తెలుసుకుంటాం...అంటారు.
ఏం చేస్తాం? తిరగమంటాం...
తెలుసుకునే వరకు తిరగవలసిందే...తప్పదు.

* * *

ఉన్నచోటనే ఉండేవాడు - జ్ఞానయోగి.

గురువాక్యం నమ్మి ఉన్నచోటనే ఉండేవాడు - భక్తియోగి.

ప్రయత్నపూర్వకంగా శ్రమపడి తెలుసుకునేవాడు - కర్మయోగి.

* * *

సద్గురు: మాకు "రమణ" అని తెలిసినవారొకరున్నారు...
ఆకాశానికి నమస్కారం పెట్టు అంటే, ఆరుబయటకెళ్ళి, తలపైకెత్తి ఆకాశానికి నమస్కారం  పెట్టి వచ్చాడు...
ఇప్పుడు మన మధ్యన ఉండేది కూడా ఆకాశమే కదా...? ఇక్కడే నమస్కారం చేసివుండొచ్చు కదా! అంటే, అప్పుడు నాలిక్కరచుకున్నాడు...

నాగేష్: "ఇది కూడా గుడే అని తెలిశాక కూడా అక్కడకెళ్ళాలి, ఇక్కడకెళ్ళాలి...అని ఎందుకనిపిస్తుంది గురువుగారూ...?

సద్గురు: దాని పేరే "కర్మ"....

పైగా "తిరగడం"లో సదుద్దేశం ఏమీలేదు వీడికి...
వాడి(దేవుడి) సీటును తాను కొట్టేయాలన్నదే కడుపులో భావన.

(అందరూ నవ్వుకున్నారు)

నాగేష్: ఇప్పటివరకు మీరు 6 సిగరెట్లు కాల్చారు గురువుగారూ...!

సద్గురు: నీవు ఇక్కడకు ఎందుకొచ్చావో...!
దేనిని గమనిస్తున్నావో...!

నాగేష్: మీరెందుకు సిగరెట్టు కాలుస్తారు...? అని.

సద్గురు: ఒక్కొక్క సిగరెట్టు....ఏ మూలో ఉన్న ఒకరి కర్మను దగ్ధం చేస్తుంది...

నాగేష్: అయితే, నా కర్మను కూడా దగ్ధం చేయండి గురువుగారూ...!

సద్గురు: నీ కర్మ దగ్ధం అయ్యాకే, నీవిక్కడ అడుగు పెట్టగలిగావు...

* * *

"గతం"లోకి జారుకున్న ప్రతీవాక్కూ అది దైవవాక్కే.
ప్రతి సంపుటనా దైవేచ్ఛయే...అన్నారు గురువుగారు.

ఈరోజు దైవేచ్ఛ ఏమనేది రేపు తెలుస్తుంది.

ఈరోజు మనకు అర్థంకాని సంఘటనను
రేపు దానిని "దైవేచ్ఛ"గా మనం అర్థం చేసుకోవాలి.
"జరిగింది" కనుక.

* * *

నేను-నాది మొత్తం నాకిచ్చేయ్...
నేను-నాది మొత్తం నీకిచ్చేస్తాను...
అన్నారు గురువుగారు.

కాసేపాగి-
నీవు "నేను-నాది" మొత్తం నాకు ఇచ్చేశాక
నేను ఇచ్చే "నేను-నాది" మొత్తాన్ని నీవు తీసుకోవడమనేదే ఉండదు.
యెందుకంటే, అసలు నీవు లేవు కదా...!   అన్నారు.

నాగేష్: "నేను-నాది" మొత్తాన్ని మీకు ఇచ్చివేసినందుకు గుర్తేమి?

బాబు: ఇద్దరు ఉండరు....

శిష్యుడు-గురువు, జీవుడు-దేవుడు
ఇలా ఇద్దరుండరు...

(నా సమాధానాన్ని గురువు అంగీకార సూచకంగా చిరునవ్వుతో ఊరకున్నారు)

* * *

"నేను" అనేది తెర.

నేను ఫలానా అనే నామరూపాల వ్యవహారం, తెరపై కదలాడే దృశ్యం.

* * *

శివుడు లేకుండా శక్తి ఉండదు.

శక్తి "లేనట్లు" ఉంటాడు శివుడు.

కానీ శివుడు శక్తియుతుడే.

కళను ప్రదర్శించినప్పుడు మాత్రమే
తాను కళాకారుడు అనే విషయం ప్రకటనమౌతుంది.

ప్రకటన అనేది లేనప్పుడు,
కళా తెలియబడదు, కళాకారుడూ తెలియబడడు.

అలా శివుడు తన శక్తిని ప్రకటించే క్రమంలో సృష్టి ఏర్పడింది.

సృష్టే లేకుంటే....శక్తి విషయమూ తెలియదు, శివుని విషయమూ తెలియదు.

* * *

మేం గురువు వద్ద శెలవు తీసుకున్నాం...
రవీంద్రనాథ్ తన రూంకు తీసుకెళ్లి ఏవో మధుర పదార్థాలు కలిగిన సంచి నా చేతికిచ్చి,
"మా అన్నయ్య" అంటూ
ఆత్మీయకౌగిలిలో పరవశించారు....

* * *

75. జ్ఞానేశ్వర శర్మగా మారిన యజ్ఞేశ్వర శర్మ

---

30-6-2021 * బుధవారం

facebook లో పరిచయమై...
whatsapp లో మరింత దగ్గరై...

ఈ రోజు చెన్నై నుండి యజ్ఞేశ్వరశర్మ అనే ఓ సద్బ్రాహ్మణుడు, వారి తల్లిగారితో వచ్చారు సద్గురు దర్శనానికి.

వారి ముఖం బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తోంది...
ప్రాచీనుల తపఃప్రభావాన్ని తరాతరాలుగా అందించుకుంటూ ఈ ఆధునిక యుగానికి
'ప్రాచీన అవశేషంగా'...ఓ సాక్ష్యంగా ఉంది ఆ తేజస్సు.

* * *

శర్మగారు రమణభక్తులు...

ప్రతి సందర్భంలోనూ రమణుల సూక్తిని ఉదహరిస్తున్నారు...

గురువుగారు అన్నారు-
అది రమణుల డైరీ...
వారి డైరీ వారిదే...
మీ డైరీ మీదే...అన్నారు.

రమణుడు ఎదురుచూసేది కూడా అదే...
నా డైరీ నాకు వదిలేసి
వాడి డైరీని వాడు ఎప్పుడు పట్టుకుంటాడా? అని.

రమణుడు రమణుణ్ణి వదిలేశాడు...
మనమే రమణుణ్ణి వదలలేకున్నాం...

రమణుడికి మరణానుభవం జరిగినప్పుడు రమణుడు నిజంగానే మరణించాడు...
తరువాత వారి రూపంలో తత్త్వమే వ్యవహరించింది...
తత్త్వమే మాట్లాడింది...

ఇక్కడ(సత్సంగంలో) ఇంతమంది ఉంటే,
వీరిని రమణస్వరూపంగా చూడగలుగుతున్నామా?
ఆ ఆరడుగుల దేహాన్నే భగవాన్ గా చూస్తున్నాము.

రమణాశ్రమం గేట్ వఱకు ఉన్న ప్రాంతాన్నే పవిత్రమైన క్షేత్రంగా చూస్తున్నాము.

ఇక మనకు రమణతత్త్వం ఏం అర్థమైనట్టు?

అజ్ఞాని అనేవాడు జ్ఞానిగా ప్రకటింపబడక, గుట్టుగా ఉండేవాడు...

జ్ఞాని అనేవాడు తాను జ్ఞాని అనే విషయాన్ని గుట్టు రట్టు చేసుకున్నవాడు...

ఇద్దరిలో ఎవరు గొప్ప?

"అజ్ఞానే గొప్ప" అని శర్మ నోటి గుండా అనిపించారు గురువుగారు.

* * *

శర్మగారు రమణసూక్తులను ఉదహరించినప్పుడల్లా-

"జ్ఞానేశ్వరశర్మ  వచ్చిన తర్వాత వచ్చినవాడే రమణుడు"

అని పదేపదే గుర్తు చేస్తూ, ఇతరం నుండి మరలుస్తూ, "స్వ" లో నిలబెడుతున్నారు గురువుగారు.

మన బుర్రను అనేక మహనీయుల సూక్తులతో నింపేసుకున్నాం...
అదంతా ఖాళీ చేసే పనిలో నిమగ్నమయి ఉంటారు గురువుగారు...

నెత్తిన క్రొత్త బరువు పెట్టక, ఉన్న బరువును దించడానికే చూస్తారు గురువుగారు...

"జ్ఞానేశ్వరశర్మ"యే తొలి బరువు...అని
"జ్ఞానేశ్వరశర్మనే ఖాళీ చేయించే క్రమంలోనే ఉంటుంది  వారి ఉపదేశమంతా...

* * *

నేను శర్మగారిని యజ్ఞేశ్వరశర్మ అనే పరిచయం చేశాను గురువుగారికి...
కానీ మాటల్లో జ్ఞానేశ్వరశర్మ అనే వాడుతున్నారు  గురువుగారు.

* * *

యజ్ఞం అనేది కర్మకాండ.
జ్ఞానం అనేది కర్మరాహిత్యం.

* * *

బహుశా సద్గురు దర్శనం వలన శర్మగారి కర్మలన్నీ పోయి, కేవలజ్ఞానంలో నిలబడడం వలన యజ్ఞేశ్వరశర్మ కాస్త జ్ఞానేశ్వరశర్మగా మారిపోయి ఉండవచ్చు...

పైగా "ఇక్కడకు వచ్చి ముక్తి పొందడం కాదు,
ముక్తి పొందినవాడే నా గడప దాటి రాగలడు" అన్న గురువాక్యాన్ని బట్టి

శర్మగారు ఇక్కడకు క్రొత్తజన్మ తీసుకున్నట్లయ్యింది...
సద్గురువుచే నామకరణం చేయబడింది...
వారి తల్లి సమక్షంలోనే వారి జీవితం ధన్యమయ్యింది...

గుళ్ళో దేవత మీ తల్లిగా ఉండడం కాదు,
మీ తల్లియే గుళ్ళో దేవతగా ఉంది...అన్నారు గురువుగారు.

పారమార్థికంగా "నేను"కు పెద్దపీట వేస్తారు.
ఐహికంగా "అమ్మ"కు పెద్దపీట వేస్తారు.

* * *

ప్రపంచం ఉండబట్టే ఆకాశాన్ని ఓ భూతంగా గణించవలసి వస్తోందిగానీ, నిజానికి ప్రపంచం లేని ఆకాశమే చిదాకాశం(నేను)...అన్నారు గురువుగారు.

* * *

ఇంత గందరగోళం(బోధలు) కూడా అవసరం లేదు...
"ఇది ఒక కల" అని గుర్తుంచుకోండి చాలు.
అని చెప్పారు ...

కష్టం స్వామి...అయినా ప్రయత్నిస్తాను...సమయం పడుతుంది... అన్నారు శర్మగారు...

సముద్రంలోనుంచి కెరటం లేచి, పడేందుకు పట్టే సమయమే అది.

అక్కడ "జ్ఞప్తిగానే ఉంటావు వ్యక్తిగా కాదు." అన్నారు గురువుగారు...

కెరటం - వ్యక్తి.
సముద్రం - జ్ఞప్తి.

కెరటానికి సముద్రం ఉండడం కాదు,
సముద్రానికి కెరటం ఉంటుంది.

నీకు జ్ఞప్తి ఉండడం కాదు,
జ్ఞప్తికి నీవు ఉంటావు.

'ఇది ఒక కల' అని జ్ఞప్తి ఉన్నవాడు
మెలకువలో ఉన్నవాడే...
కాదు కాదు "మెలకువగా" ఉన్నవాడే.

* * *

మౌనం కూడా మాటే.
మాటకు మొదటి రూపం మౌనం.

TV ని mute లో పెడితే ఉండే మౌనం వేఱు,
కరెంట్ ఆఫ్ అయితే ఉండే మౌనం వేఱు.

తానుండి మౌనంగా ఉండడం వేఱు,

తానే(అహమిక) లేకపోవడం వలన ఉండే మౌనం  వేఱు.

రెండవదే అసలేన మౌనం.

* * *

ఏకంగా ఉన్న దేవుడు అనేకం అయినాడు అంటారు...
అనేకత్వం అంటే ఒకటి కన్నా ఎక్కువ అవడం అని కాదు...
అది ఒకటి కూడా కాకుండా ఉంది...
అనేదే దానికి అర్థం.

* * *

అంతర్దృష్టి  మీకుంటే మీరు బాహ్యంగా ఉంటారు.
బాహ్యదృష్టి  మీకుంటే మీరు ఆంతరంలో ఉంటారు

ఏ దృష్టికైనా శర్మ ఉండాలి....
శర్మ లేకపోతే ఏ దృష్టీ ఉండదు...
అన్నారు గురువుగారు.

* * *

దేవుణ్ణి మోక్షం అడగడం కాదు,
దేవుడికే మోక్షం ఇస్తాను నేను...అనే భక్తుడి కోసం యెదురుచూస్తున్నాడు భగవంతుడు...

* * *

కోరికల నుండి ఎలా బయటపడాలి?
అన్న ప్రశ్నకు సమాధానంగా-

కోరిక (సృష్టి) నుండి ఈశ్వరుడే ఇప్పటి వరకు బయటపడలేకున్నాడు...ఇక మనమెంత ? అన్నారు గురువుగారు...

* * *

ఎలా ఉండాలో అలానే ఉండు...
లోపల ఆత్మగా...
వెలుపల శర్మగా...

అని శర్మకు అత్యంత సారవంతమైన తత్త్వాన్ని ఉపదేశం చేశారు గురువుగారు.

* * *

ఆ దివ్యమైన సత్సంగం-
అనామిక ఇచ్చిన "తేనీరు" తో ప్రారంభమై,
త్రిపురాంబ ఇచ్చిన "ఫలం"తో ముగిసింది.

* * *

జ్ఞానేశ్వరశర్మ గారు శెలవు తీసుకున్నారు...
అందరం గేట్ వరకు వచ్చాం వారిని సాగనంపడానికి...
గురువుగారు కూడా గేట్ వఱకు వచ్చి,
వారి కారు మరుగయ్యేవరకు అలా చూస్తూ ఉండిపోయారు...

* * *

76. బాధ - బోధ

---

5-7-2021 * సోమవారం

ఈ ఉదయం నుంచి ఏదో ఒక విధమైన తపన...
ఏదో వ్రాయాలని...
ఇది ఒక రకమైన దురద(writers itching) అంటాన్నేను.

మన దురద మన వఱకే పెట్టుకుంటే పర్వాలేదు...
మరికొంతమందికి అంటించేదాక తీరదు ఈ దురద.

గురువుగారు అంటారు-
తాను తెలుసుకోవడానికి పడిన తపన కంటే,
తనకు తెలుసు అన్న విషయం ఇతరులు తెలుసుకోవాలన్న తపనే పెద్దది...అంటారు.

అందుకు ఏదేదో చేస్తాడు...
రాయడమో...పాడడమో...ఆడడమో...

"లోకహితం కొఱకు రచనలు" అనేమాట ఎంతటివాడు పలికినా సరే,
అదొక పచ్చి అబద్ధం.

ఇప్పుడే వైజాగ్ పావనీగారు "ముగింపు" వ్యాసం చదివి, "అద్భుతః"
అంటూ మెసెజ్ పెట్టారు...
కానీ 'వాట్సప్' సత్సంగానికి మాత్రం ముగింపు పలకకండి...అని అన్నారు.

"వ్రాసే వ్యాధి" నాకున్నంతవఱకు ముగింపునివ్వనులెండి...అని
బదులిచ్చాను...

వ్రాయడం, చెప్పడం, వినడం...ఇవన్నీ వ్యాధి లక్షణాలే...సందేహం లేదు...
కానీ మనం వాటిని గొప్పగా ఫీల్ అవుతాము...

సత్సంగం గురించి గురువుగారు తమాషాగా ఓ మాటన్నారు-

"దురద ఉన్నవాళ్లందరూ ఒకచోట చేరి, గుండ్రంగా కూర్చొని  ఒకరి వీపు
ఒకరు గోక్కోవడం లాంటిది" అన్నారు.

నిజమే కదా....

మన ఉపాసన నిశ్శబ్దం ఉండాలి...
వ్యక్తిగతంగా ఉండాలి...
గుట్టుగా ఉండాలి...
దాంపత్య సుఖము వలె.

* * *

ఆత్మను జీర్ణం చేసుకోలేక వాంతి చేసుకున్న ఋషియే
కళాకారుడు...అంటారు గురువుగారు.

'వ్రాయడం అనేది ఓ కళ ' అంతే.
వాంతి పూర్తయిన తర్వాత తాను రిలాక్స్ అయినట్లు,
అలాంటి రిలాక్స్ పొందినటానికి చేసిన ప్రయత్నాలే
ఈ కవిత్వాలు...ఈ ఉపన్యాసాలు...

కృష్ణశాస్త్రి తన బాధని అందరిలోనూ పలికిస్తాడు...
కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ...
అంటాడు చలం శ్రీశ్రీ మహాప్రస్థానం ముందుమాటలో.

* * *

ఓ సందర్భంలో JK అంటారు...
"మాటలు అవసరం లేదు...." అని.
"ఐతే మీరెందుకు మాట్లాడతారు?" అని అడిగాడు ఒకడు.
"ఇది నా స్వభావం" అంటారు JK.

ఇది నాకు నచ్చిన సమాధానం...
స్వభావం వలననే ప్రవర్తిస్తారుగానీ,
అవసరం ఉండి కాదు.

అంతేగానీ దేశం బాగు కోసం అంటే మాత్రం అది హాస్యాస్పదమైన విషయమే.

దేశాన్ని కాదు కదా... ఇంట్లో TV ఛానెల్ ను కూడా మార్చలేడు...అని ఓ జోక్.

దేశంలో కోట్ల గ్రంథాలున్నాయి...ఏం చేశాయి...?
వేలాదిమంది ప్రవక్తలు వచ్చి-పోయారు...ఏంచేశారు...?
లోకం ఇంకా వంకరగానే ఉంది...కుక్కతోక వలె.

వాస్తవమేమంటే, లోకమెప్పుడూ  వంకరగానే ఉండాలి.
తిన్నగా ఉండకూడదు.
తిన్నగా ఉంటే ప్రళయం వస్తుంది.

సమానత దైవ లక్షణం.
అసమానత జగత్ లక్షణం.

అది అంతే.
ఇది ఇంతే.

సమానత కోరుకోవడం అంటే
ప్రళయాన్ని కోరుకోవడమే...

* * *

మొన్న భీమవరం మురళీకృష్ణగారు గురుదర్శనానికి వచ్చినప్పుడు...నేను వారి విడిదిగృహంలో కలిసినప్పుడు... ఓ కవి గుఱించి ప్రస్తావిస్తూ ఓ మాటన్నారు...
ఆ కవిగారి కవిత్వంలో బోధ కంటే, రాజుల వలన పొందిన బాధ ఎక్కువగా కనిపిస్తోంది....అని.

నిజమే...వేరే గతి లేక శివుడికి శరణాగతి చెంది వ్రాసిన పద్యాలేగానీ, వారి సాహిత్యంలో "జ్ఞానబోధ" తక్కువే...అన్నాను.

ఆ సమాధానం వారికి తృప్తినిచ్చినట్లుంది...
వారు నా నుంచి అటువంటి సమాధానాన్నే ఆశించినట్లుంది.

సరే ఏదో కారణం చేతనైనా, ఆ కవి మనసు ఈశ్వరుని వైపుకు మళ్లింది...అది చాలు.
పడిన బాధలకు కూడా ప్రయోజనం ఉన్నట్టే కదా...

ఎవడో ఒక భక్తకవి అన్నాడు...
బాధలు బజారులో అమ్మేట్టయితే,
నేనిప్పుడే వెళ్లి కొంటాను...అని.

బాధలు భగవంతుని వద్దకు చేర్చే స్నేహితులు...
సుఖాలే నిజానికి మన శత్రువులు...
మనమెవరమో మనకు తెలియనీకుండా ముసుగు వేస్తాయి...

* * *

ఓ నాయకుడు పిచ్చాసుపత్రిని సందర్శించి,
ఎన్నికల్లో నన్ను గెలిపిస్తే ఊరికి ఒక పిచ్చాసుపత్రి కట్టిస్తానని వాగ్దానం చేశాడట...
అందులో సదుద్దేశం ఏమైనా ఉందా?
పిచ్చివాళ్లు యెక్కువమంది తయారవ్వాలని కోరుకోవడమేగా...

ఓ వైద్యుడు తన ఆసుపత్రి దినదినాభివృద్ధి కావాలని ప్రార్థిస్తాడు....ఊళ్లో రోగులు పెరగాలనా?

ఓ న్యాయవాది తన ప్రాక్టీసు బాగా జరగాలని ప్రార్థిస్తాడు...తగాదాలు పెరగాలనా?

ప్రతి ఊళ్లో ధ్యానకేంద్రాలు వెలవాలని ఓ పెద్దాయన కోరిక...
మనశ్శాంతి లేనివాళ్లు ఎక్కువ మంది తయారుకావాలనే కదా!

ప్రాచీనభారతంలో ధ్యానపరులు లేరు,
అప్పట్లో ఆధ్యాత్మికం అనేది ప్రత్యేకమైన సబ్జక్టుగా లేదు.

ఎవడి కుల(ధర్మాన్ని) వాడు పాటించడమే
సహజమైన ఆధ్యాత్మికతగా ఉండేది.

ఇప్పుడు అధ్యాత్మికతకు అర్థాలు మారాయి...
సమాజసేవ అంటున్నారు...
శ్వాస మీద ధ్యాస అంటున్నారు...
శాఖాహారం అంటున్నారు...
సత్సంగాలు అంటున్నారు...
ఉపన్యాసాలు అంటున్నారు...
అంతా సమానం అంటున్నారు...

వీళ్లేం చేసినా సత్యసాక్షాత్కారం పొందలేకున్నారు...
యెక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందాన పడి ఉన్నారు...

దానికదై కలుగుతుంది అని ఉపనిషత్ ఋషి చెప్పినా వినక
వ్యర్థప్రయత్నాలు చేస్తుంటారు...

మేం 'ఆధ్యాత్మికమార్గంలో ఉన్నాం' అని గొప్పలు చెప్పుకోవడం తప్పితే,
నిజానికి వీళ్లు సాధించింది ఏమీలేదు...

సుబ్బరాయుడు అనే అతను ఉండేవాడు...
ఎక్కడైనా సరే అనువైన చోటు, సమయం దొరికితే చాలు...కూర్చొని ధ్యానం చేసేవాడు...
అందరి ముందూ ఓ ప్రదర్శనగా ఉండేది అది...
నాకు ఎబ్బెట్టుగా తోచేది వారి ప్రవర్తన...

అతను ఈమధ్య ఓ ఆశ్రమానికెళ్లినప్పుడు, ఆ ఆశ్రమాధిపతితో ఈయన గొప్పగా "నేను 20 ఏళ్లుగా ధ్యానం చేస్తున్నాను స్వామీ...!" అన్నాడు.

ఆ స్వామి మన టైప్....

"అన్నేళ్లు చేసి ఏం పీకావ్...?" అన్నాడట...

అవాక్కయ్యాడు సుబ్బరాయుడు...

ఈ తమాషా పుట్టం స్వయంగా సుబ్బరాయుడే నాకు చెప్పాడు...

* * *

"అన్నీ వొదిలి నన్ను అనుసరించు" అన్న క్రీస్తువాక్యమే సరి. వేరే మార్గమే లేదు.

"త్యాగేనైక అమృతత్వ మానశుః"
త్యాగం ఒక్కదాని వలన మాత్రమే అమృతత్వం కలుగతుందట...

త్యాగం మినహా మిగతా ఏ మార్గమైనా సరే,
ఏ సాధనైనా సరే కాలక్షేపాలే....

ఇప్పటికిప్పుడే అన్నీ త్యాగం చేసేసి ఖాళీ అయిపొమ్మని నా ఉద్దేశం కాదు...

"త్యాగం అనేది మానసిక విషయం"
అన్న రమణుల వాక్యం గుర్తులో ఉంచుకొని,
కనీసం మానసికంగానైనా త్యాగానికి సంసిద్ధులమై ఉందాం...

"వదలగలిగి, వదలకుండా ఉండు"
అనే సద్గురు వాక్యాన్ని గుర్తులో ఉంచుకొని....
కనీసం మానసికంగానైనా "సన్న్యాసి" గా ఉందాం.

* * *

"నాది"ని వదిలేయడం - త్యాగం.
"నేను"ను వదిలేయడం - పరిత్యాగం.

* * *

హమ్మయ్య....వాంతి చేసుకోవడం పూర్తయిపోయింది...ఇప్పుడు నాకు సుఖంగా ఉంది....

* * *

అకారణం

---

8-7-2021 * గురువారం

ఏ పాయింట్ వద్ద విజ్ఞానం(సైన్స్) తన యొక్క వైఫల్యాన్ని గుర్తించి సిగ్గుతో తలవంచుకుంటుందో...

ఏ దివ్య సన్నిధిలో వేదం మూగబోయి...
ఆ మూగతనాన్నే "గౌరవం"గా స్వీకరించి మౌనం దాలుస్తుందో...

ఏ అవసరం కోసం భాష  ఏర్పడిందో...
ఎవని వద్ద ఆ భాష అవసరం లేకుండా పోతోందో...

ఎవని భాషణాన్ని  ప్రకటించడానికి భాష తికమకపడి,  క్రిందామీదా పడుతుందో...

ఎవని వలన ఈ గజిబిజి లోకాన్ని  క్రమసృష్టిగా
దర్శించగలుగుతున్నామో

"అంటే" అంటే ఏమని మనల్నే ప్రశ్నించి, ప్రశ్నలచిక్కుముడుల నుండి మనల్ని ఎవడు తప్పించాడో

ఆ రాశీభూతమైన జ్ఞానస్వరూపం వద్దకు
ఈ ఉదయాన్నే చేరుకున్నాం నేనూ, దేవీప్రసాద్...

నా చిన్ననాటి స్నేహితుడు, ప్రస్తుతం గురువుగారి ఆంతరంగిక సేవకుడూ అయిన రవి మా చేతికి "టీ" కప్పులు అందించాడు...

గురువుగారి నుండి వాక్ ప్రవాహం మొదలయ్యింది... అకారణంగా...

అకారణమైన సృష్టి...
అకారణమైన స్థితి...
అకారణమైన లయం...లాంటిదే...

ఈ అకారణమైన ఉపదేశం...
ఈ అకారణమైన శ్రోతవ్యం...

ఈ అకారణమైన అనుభవం...

ఇంతకంటే నేనేం చెప్పను?

ఉన్న సమస్తమూ అకారణమే....
ప్రతిదానికీ కారణం వెదకడమే అజ్ఞానం...

* * *

ఆహా! "ఎందుకు" అన్న ప్రశ్నకు నాకు సమాధానం దొరికేసింది....
"అకారణం" అన్నదే దానికి సమాధానం.

* * *

ఏ యుగంలోనైనా సరే, ఏ కాలంలోనైనాసరే
ప్రతీది ఎలా ఉండాలో అలానే ఉన్నది.
ప్రతీవ్యక్తి ఎలా ఉండాలో అలానే ఉన్నాడు...

"పొరపాటు" అనేది యెప్పుడూ, యెక్కడా లేనేలేదు...
అంతా సవ్యంగా ఉంది...అన్నారు గురువుగారు.

మరి  ధర్మం అనేది
కృతయుగంలో నాలుగు పాదాలతోనూ,
కృతయుగంలో మూడు పాదాలతోను,
ద్వాపరయుగంలో రెండుపాదాలతోను,
కలియుగంలో ఒంటి పాదంతోనూ
ఉంటుందంటారే...!అన్నాన్నేను.

సూర్యుడు ఉదయించేటప్పుడు చూస్తే, సగమే ఉన్నట్టు కనిపిస్తాడు
మనకు...కానీ సూర్యుడు సదా పూర్ణంగానే ఉంటాడు.

అలాగే ధర్మం అనేది నాలుగు యుగాల్లోనూ పూర్ణంగానే ఉంటుంది(నాలుగు పాదాలతో) కానీ మనమే సగంసగంగా చూస్తాం...అది మనలో ఉన్న లోపమేగానీ, ధర్మంలో ఉన్న లోపం కాదు.

సాత్త్వికం,  దుర్మార్గం ఈ రెండూ
నాలుగు యుగాల్లోనూ సమంగా ఉంటాయి...

అన్నారు గురువుగారు.

సత్యకాలం అని చెప్పే కృతయుగంలో కూడా హిరణ్యాక్షుడనే రాక్షసుడు భూమిని తన చేతిలోకి తీసుకుని గిరగిరా త్రిపాడు...అన్నాను నేను.

గురువుగారు నవ్వుతూ-
హిరణ్యాక్షుడు ఎక్కడ నిలబడి భూమిని తన చేతికి తీసుకున్నాడు?
భూమిపై ఉన్నవారు ఆ భూమిని తన చేతిలోకి తీసుకున్న హిరణ్యాక్షుణ్ణి ఎలా చూశారు? ఎక్కడ నిలబడి చూశారు? అని అడిగారు తమాషాగా...
అందరం నవ్వుకున్నాం....

* * *

దైవసాక్షాత్కారానికై చేసే ఏ ప్రయత్నమూ సఫలం కాదు.

ఎందుకంటే-
ఏకకాలంలో ఒకే ఒరలో రెండు కత్తులు ఇమడవు.
ఏకకాలంలో ఒకే సింహాసనం మీద ఇద్దరు రాజులు ఉండరు.

జీవుడుంటే దేవుడుండడు.
దేవుడుంటే జీవుడుండడు.

"నీవున్నావా? లేవా?"

"ఉన్నాను."

నీవుంటే నీవే ఉంటావు...దేవుడు ఉండడు.
దేవుడు ఉంటే దేవుడే ఉంటాడు...నీవుండవు.

* * *

కాలాన్ని ప్రవాహంతో పోలుస్తారుగానీ,
కాలం ప్రహహించదు...
అది స్థిరమైనది....
అది ఆకాశం వంటిది...
కాలంలోనే సమస్తమూ ఉన్నది...
కాలంలో ఉన్న ప్రతీది ప్రవహిస్తుంది....

నేను, నీవు, ఈ ప్రపంచము లేకుండా ఉన్న
ఉత్త "ఖాళీ"యే దైవం.
అదే "నేను".

పంచభూతాలు లేని కేవలాకాశమే చిదాకాశం(దైవం)....
అదే "నేను".

ఏదీ కాదు
ఎవరూ కాదు
అని తనతో సహా
సకలాన్నీ త్రోసివేశాక
మిగిలి ఉన్న నేనే "నేను".

* * *

ముందు పుట్టినవాడు చిన్నవాడు.
వెనక పుట్టివాడు పెద్దవాడు.
అన్నారు గురువుగారు.

" ఎలా? "  ఆశ్చర్యంగా అడిగాను...

90 ఏళ్లవాడికి ఇక 10 ఏళ్లే ఉంది.
10 ఏళ్లవాడికి 90 ఏళ్లు ఉంది.

90 ఏళ్లు ఉన్నవాడు పెద్దవాడు.
10 ఏళ్లు ఉన్నవాడు చిన్నవాడు.

అన్నారు గురువుగారు.

* * *

కంటి కన్నా  పెద్దది దృశ్యంలో ఏదీ ఉండదు.
కంటిలో నుంచే దృశ్యం ప్రసరిస్తుండేది...

తెర మీద కనబడే ఎంత పెద్ద పర్వతమైనా
ప్రొజెక్టర్ కు ఉండే చిన్ని లెన్స్ నుండే అది ప్రసారం అవుతుంది కదా!

* * *

ఈ వ్యాసం వ్రాస్తున్న సమయంలోనే మహేష్ బాబు అనే జర్నలిస్టు కాల్ చేసి మాట్లాడారు...

వారి మాటలన్నీ "సాధన అవసరం" అనే దిశగానే సాగాయి...
నా మాటలన్నీ...సాధన అవసరం లేదు...అనే దిశగానే సాగాయి...

నిజానికి "అది" ప్రయత్న, అప్రయత్నాలతో సంబంధం లేకుండా ఉన్నది...

ఎన్నో జన్మల నుంచి ప్రోగుచేసుకున్న వాసనలను పోగొట్టుకుంటేగాని ఆత్మసాక్షాత్కారం కలుగదు అనేది అతని వాదన.

ఇదెలా ఉందంటే-
చీకటినంతా తోడివేస్తేగాని వెలుగు రాదు అన్నట్టు.

సూర్యుడు ఉదయించగానే చీకటి అంతా పటాపంచలయిపోతుంది.

చీకటిని పోగొట్టుకోవాలనుకోవడం - ప్రయత్నం.
సూర్యుడు ఉదయించడం - అప్రయత్నం.

సాక్షాత్కారం దానికదే జరుగుతుంది...
మన ప్రయత్నాలతో నిమిత్తం లేదు.
* * *

ఆత్మీయులు గంగయ్య గారు ఫోన్ ద్వారా మాట్లాడారు...

ఏదైనా చెప్పండి బాబుగారూ....అన్నారు.

ఏంచెప్పాలి?

ఏమీ తోచదు...

నా మనసు నిశ్చల మానస సరోవరం వలె ఉంటుంది.

నిశ్చల సరోవరంలో ఎవడైనా కదిలిస్తేనేగాని తరంగాలు ఏర్పడనట్లు ఎవడైనా అడిగితేగాని సమాధానాలు ఏర్పడవు.

అడగండి ఇవ్వబడును అన్నారు క్రీస్తు...

అడిగినప్పుడే అడిగినవాని పాత్ర, పాత్రత తెలిసేది.
దాని బట్టే సమాధానం అప్పటికప్పుడే తయారయ్యేది...

నా వద్ద ప్రశ్నలూ లేవు...సమాధానాలూ లేవు...
నేనొక "ఖాళీ" ని.

* * *

78. దేవుని వాటా

---

9-7-2021 * అమావాస్య

ఈ రోజు ఉదయం రాజమండ్రి నుండి రాఘవరెడ్డి వచ్చాడు...

కైకాలవీధి సత్సంగంలో కూర్చొని ఓ అరగంట సత్సంగం చేసుకున్నాం...

లౌకిక-ఆధ్యాత్మిక విషయాలను ముచ్చటించుకున్నాం...

గురువుగారికి, నాకు క్రొత్తబట్టలు పెట్టాలని అన్నాడు-

నేనన్నాను-
పైకం రూపంలో ఇచ్చేయండి...
మేం ఏం కావాలో అది కొనుక్కుంటాం...అన్నాను.

అలాగే ఇచ్చాడు...

ఎలాగూ మీరు టీ షర్ట్ వేస్తారు కాబట్టి...నా కోసం  ఒక్క షర్ట్ కొని వేసుకోండి...అని కోరారు...

అలాగే...జులై 24 గురుపౌర్ణమి రోజున క్రొత్త షర్ట్ ధరిస్తానని మాటిచ్చాను...
* * *
నాకు పుట్టపర్తి నారాయణాచార్యులుగారి ఘట్టం ఒకటి గుర్తుకొస్తోంది...

అతను సంస్కృతాంధ్ర పండితులు...

అతను తన 13వ యేట వ్రాసిన సాహిత్యం ఒకటి అతను కాలేజీ వెళ్లేసరికి అది అతనికి   ఉపవాచకంగా వచ్చింది...అంత పండితుడాయన...

వారు ఎక్కడికెళ్లినా శాలువ కప్పి సన్మానం చేయడమేగానీ, పైకం రూపంలో పైసా కూడా ఇచ్చేవారు కారు...

"అయ్యా...! మా ఇంట్లో 3 బీరువాల నిండా శాలువలున్నాయి? అవన్నీ నేనేం చేసుకోను?

కప్పుకోలేను...అమ్ముకోలేను...
పైకం రూపంలో ఇస్తే నా కుటుంబ పోషణకు ఉపయోగించుకుంటాను..."
అన్నారు పాపం ఆ మహా పండితులు....

మన గురువుగారు కూడా అచ్చం అలానే
అంటుంటారు...డబ్బులిచ్చేయండీ...వాటిని దేనికైనా
ఖర్చుపెట్టుకుంటాం...అని.

కొందరు మన జ్ఞాపకంగా, వస్తురూపేణా ఒకటి సత్సంగంలో ఉండాలని
ఆశిస్తుంటారు...

గోడ గడియారం, డబుల్ కాట్, పరుపు, ఏసీ, సోఫా, కుర్చీలు, తివాచీలు,
కర్టెన్లు, టీ ఫ్లాస్కులు...
ఇలా సత్సంగాన్ని వస్తువులతో నింపేశారు...

అవన్నీ దులపడానికి, ఉతకడానికి, కడగడానికి... పని మనుషులు....

ఏమీ వద్దనుకుంటే, అన్నీ చేరుతాయి...
ఏమీ పట్టించుకోనివాణ్ణి, అందరూ పట్టించుకుంటారు....

మౌనమే శ్రేష్టం అని చెప్పడానికి
చాలా మాటలు తయారయినాయి...
చాలా గ్రంథాలు అచ్చయినాయి...

అత్యాశ్రమం కూడా పెద్ద సంసారం అయ్యింది.
అత్యాశ్రమి కూడా పెద్ద సంసారి అయ్యాడు.

ఇదంతా ఆ "బాబు" చేసిన పనే....అంటూంటారు...
ఏదో ఒకటి వ్రాసి లోకం మీద వదిలేస్తుంటాడు...

చదివివారంతా ఇక్కడేదో "ప్రత్యేకత" ఉందని ప్రయాణాలు కట్టేస్తుంటారు...

ఉన్నది ఏదో అంతటా ఉంది అంటారు గురువుగారు...

అయినా సరే వచ్చినవారంతా-
ఈ బోధ ఎవరూ చెప్పలేదంటారు...
ఈ హాయి ఎక్కడా లేదంటారు...

బాబూ..! నీ ఋణం మేం తీర్చుకోలేం అంటారు...
గొప్ప సద్గురువును మాకు ప్రసాదించావు అంటారు...

కొందరు డబ్బులిస్తారు...
కొందరు పండ్లు తెస్తారు...
కొందరు నన్ను గుండెలకు హత్తుకుంటారు...
పావనీగారు నా కుడిచేతిని ముద్దాడారు...
(బహుశా జ్ఞానప్రసూనాలు కుడిచేయి వ్రాసిందని కాబోలు)

దూరప్రాంతలో ఉండి చదువుకుంటన్న తమ బిడ్డకు నెలనెలా పైకం పంపుతున్నట్లు...
దైవజ్ఞులు శివస్వామిగారు, వారి శిష్యులు ఒంగోలు శ్రీనుగారు, ప్రవక్త రమణస్వామిగారు....
ఈ జ్ఞానశిశువుకు నెలనెలా డబ్బులు పంపుతుంటారు...
* * *

దక్షిణ గుఱించి తాతగారు ఓ మాట అన్నారు...
ఎంత దక్షిణ అయినా స్వీకరించు దోషం లేదు...
కానీ చీకటిపడేలోపు అదంతా ఖాళీ చేసేయాలి...
నిద్రకు ఉపక్రమించే ముందు నీ వద్ద ఒక్క రూపాయి కూడా ఉండకూడదు...
అప్పుడు ఆ దక్షిణ వలన ఇచ్చినవాడికి, తీసుకున్నవాడికి ఇద్దరికీ శ్రేయస్సును ఇస్తుంది...

నాకు తెలిసి ఈ విధానంలో మన తాతగారు, షిరిడీబాబాగారు తప్ప మరెవరూ లేరు...

తాతగారు రెండు టవళ్లు మాత్రమే వాడేవారు...
ఒకటి నడుముకు చుట్టుకునేవారు, మరొకటి భుజం మీద కప్పుకునేవారు...
ఏటి స్నానం...
నిరాహారం...
తేనీరు సేవనం...
గురువుగారు ప్రతిరోజూ తాతగారికి 5 రూపాయిలు ఇచ్చేవారు...

ఆ 5 రూపాయిలు  వారికి సరిపోయేవి...
తాతగారికిచ్చిన ఆ 5 రూపాయిలే ఇప్పుడు 500 రూపాయిలుగా నాకు తిరిగి వస్తోంది...అంటుంటారు గురువుగారు...

దక్షిణ ఇచ్చినవాడు ఇచ్చినట్టూ మరచిపోవాలి.
తీసుకున్నవాడు తీసుకున్నట్టూ మరచిపోవాలి.
అప్పుడే ఆ దక్షిణ వలన ఇరువురికీ ఫలం...అంటారు గురుదేవులు...

భౌతిక-మానసిక-పారమార్థిక సమస్యలన్నీ తీరడానికి గురువుగారు చక్కటి పరిష్కారం  చూపారు...అదేమంటే-

నీ సంపాదనలో 10% దేవుడికి ఖర్చు చేయి...
దేవుడికి ఎలా ఖర్చుచేయడం? అంటావేమో...
దేవాలయ హుండీలో వేసేయ్...! లేదా
పేదలకిచ్చేయ్...! లేదా
పారేనదిలో పారేయ్...! లేదా
రగిలే అగ్నిలో వేసేయ్...! లేదా
వీధిలోకి విసిరి పారేయ్...!

అది ఎవరు ఎత్తుకున్నారు?
అది ఏమైపోయింది?
అన్న సమస్య నీకొద్దు...

సర్వత్రా ఉన్న భగవంతుకి అది చేరుతుంది...
ఆయన అది స్వీకరిస్తాడు...

నీ నుంచి ఆ 10% పైకం నీ నుంచి దూరం అవ్వాలి అంతే...

ఆ 10% నీ వద్ద పెట్టుకోవడం వల్లనే జీవితం నీకు బరువైపోతోంది...

ఆ 10% దూరం చేసుకో...నీ అన్ని సమస్యలూ దూరమౌతాయి...

* * *

గురువుగారు ఇంకో ప్రాసెస్ కూడా చెప్పారు-
నీ కుటుంబసభ్యుల్లో ఒకరుగా దేవుణ్ణి చేర్చుకుని, ఆ దేవుని వాటాను నీ నుంచి దూరం చేసేయాలి.

ఉదాహరణకు- మా ఇంట్లో మేం భార్యాభర్తలం ఇద్దరం ఉన్నాం మూడో వ్యక్తిగా జ్ఞానాంబను చేర్చుకున్నాను...
నాకు వచ్చే ఆదాయాన్ని మూడుభాగాలు చేసేస్తాను...

అమ్మకు సంబంధించిన పైకాన్ని శ్రీరామ మందిరం కార్యాలకు, మా సత్సంగ నిర్వహణకు వినియోగిస్తాను...

ఆ జ్ఞానాంబ పైకాన్ని నా స్వంతానికి ఉపయోగించకూడదు...అంతే.

అంటే మిగతా రెండు భాగాలు జ్ఞానాంబది కాదా? అనేది కాదు ఇక్కడ పాయింటు...

అంతా ఆమెదే...
ఆమెదే ఆమెకు ఇస్తున్నాం...
ఆమెదే మేమూ అనుభవిస్తున్నాం...

కానీ మన మనసుకు ఆ తెంపు(ధారాళత్వం) ఉన్నదా లేదా అనేదానికి అదొక పరీక్ష...అంతే.

ఆ ధారాళాత్వం ఉన్న మనసే సుఖాన్ని పొందగలదు.

మనం దేవుడికిచ్చిన ఆ వాటా తిరిగి మనకే "సుఖరూపం"లో మనల్ని చేరుతుంది.

* * *

ఇక్కడ ఇంకొక్క విషయం చెప్పుకుని ఈ వ్యాసాన్ని ముగిద్దాం...

దేవునికి వాటా ఇవ్వనివాళ్ల పరిస్థితి ఏమి? అని.
"దేవుని వాటా" అనే పేరు ఉండదుగానీ, వాళ్లుకూడా ఇస్తారు...

ప్రకృతి వాళ్ల నుంచి బలవంతంగా వసూలు చేస్తుంది ఆ దేవునివాటాను.
ఆ "బలవంతపు వసూలు"నే వీడు "ఆపద" రూపంలో అనుభవించేది...

కాబట్టి దేవునివాటాను మర్యాదగా ఇచ్చేస్తే,
బలవంతపు వసూళ్లు(ఆపదలు) అనేవి ఉండవు.

మర్యాదగా ఇచ్చేయడమే దక్షిణ.
అదే మనకు రక్షణ.

* * *

79. ఆ'పాత మధురం...

________________

మా తాతగారిది వస్త్రతయారీ పరిశ్రమ...
శ్రీలంకతో  వ్యాపారాలు...

నేను భూమ్మీదకు రాక మునుపే అవన్నీ
ముగిసిపోయాయి(అన్నీపోయాయి...)

నేను కళ్లు తెరిచేసరికి గోడమీద పటంగా వ్రేలాడుతూ కనిపించారు మా తాతగారు.

మా నాన్నగారు టీచరు...
నా చిన్నప్పుడు మాకు గో సంపద ఉండేది...
మాకే కాదు మా వీధిలో చాలామందికి ఉండేది...
మా వీధి ఓ పల్లెటూరులా ఉండేది...
అన్నీ గుడిసెలే...

గడ్డీగాదం,
పురుగూపుట్ర
పేడాపిడకలు,
పొయ్యి నుయ్యి,
వరద బురద,
అవ్వాబువ్వా,
సద్దెకూడు కుండనీళ్లు...
అన్నీ చూశాం...

1991 ప్రాంతంలో మేముండే సందుకి ప్రక్క సందులో ఉండేవారు గురువుగారు...
వారి సందు ప్రశాంతంగా ఉండేది.

మా సందు సందడిగా ఉండేది...
పిల్లల ఆటలు...రామ మందిరంలో భజనలు...

ఇంట్లో TV లో రామాయణం సీరియల్ కోసం గుమికూడే జనాలు...
కొళాయిల వద్ద ఆడాళ్ల రచ్చలు...
చిన్న చిన్న గొడవలు...
పెద్ద పెద్దగా అరచుకోవడాలు....
గురువుగారు అప్పుడప్పుడు  మా ఇంటి అరుగుపైన వచ్చి కూర్చునేవారు...

ఆ అరుపులను, గొడవలను సాక్షిగా చూస్తుండేవాడు సిగరెట్ కాలుస్తూ...

బాబూ! మీ సందు చూడు...ఎంత సందడిగా, కళకళలాడుతూ ఉందో...!

మా సందులో ఒక్కడు కూడా గొడవపడడు...
ఒక్క రచ్చ కూడా జరుగదు...
చచ్చుగా ఉంటారు అంతా...అన్నారు సరదాగా...
* * *

నాకు చదువు అబ్బలేదు...
పాస్ అవడానికి ఎన్ని మార్కులు రావాలో అన్నే వచ్చేవి....
బహుశా టీచర్లు కరుణించి వేసిన మార్కులే అవి అనిపించేది.

దానికి గుర్తేమంటే- ఏడో క్లాసులో ఎన్ని మార్కులు వచ్చాయో...పదో క్లాసులో కూడా అన్నే మార్కులు వచ్చాయి...256.

ఏడో క్లాసు పాసైనావని...మా బలరామ్మూర్తి అయ్యవారు చెప్పినప్పుడు, అదొక చారిత్రక సత్యమని తెలుసుకోలేకపోయాను...
దాన్ని "నమ్మలేని నిజం"గా తీసుకున్నాను...

"సార్...నిజం చెప్పండిసార్...!" అంటూ పదే పదే అడిగాను...

నిజంరా బాబు...
నువ్వు పాసయ్యావు...ఇంటికెళ్లు...అన్నాడు.

ఎలాగోలా ఇంటర్మీడియట్ ఫస్ట్ ఇయర్ పాసయ్యాను...

ట్యూషన్ కు పోతున్నట్టు అబద్ధం చెప్పి, ఆ ట్యూషన్ ఫీజును సంగీతం మాష్టారుకు ఇచ్చి ఇంట్లో వాళ్లకు తెలియకుండా సంగీతసాధన చేసేవాణ్ణి...

మా సంగీతం మాష్టారు పేరు V.S. బాబూరావు.
ఆధ్యాత్మికంలో సుబ్రహ్మణ్యంగురువు ఎలాగో
సంగీతంలో బాబూరావుగారు అలాగు...
అంత గొప్ప విద్వాంసుడు...
చెడు అలవాట్లకు బానిసై జీవితాన్ని త్వరగా ముగించేసి వెళ్ళిపోయాడు...

సంగీతం-సాహిత్యం ఇవేవీ అభిరుచి లేని ఇంట్లో వాళ్లతో ఎంతకాలం నెట్టుకురాగలం?

తత్ఫలితంగా అరకొర చదువు, అరకొర సంగీతం
అయ్యింది.

చదువు ఆగిపోయాకే...
నిజమైన చదువు(అధ్యాత్మికం) ప్రారంభమైంది...

సద్గురువుతో ఎక్కువగా గడపడం....
చలం సాహిత్యాలు చదవడం...
ప్రతిరోజూ లైబ్రరీ కెళ్లడం...
రమణుడు తెలియబడడం...

చలం యశోదాగీతాలను అనుకరిస్తూ...
కృష్ణుడి మీద ని'వేదనా గీతాలు వ్రాయడం...
అప్పుడప్పుడు అవి పత్రికల్లో అచ్చు అవడం...

వాటిని గర్వంగా మా నాన్నకు చూపడం...
ఇవి కూటికా? గుడ్డకా? అని నన్ను తిట్టడం...

ఇలా సాగిపోయింది నా పెళ్లి వఱకు...

తెలుగు, ఇంగ్లీషు టైపింగులో ఫస్ట్ గ్రేడ్ లో పాసయ్యాను...

మా బావ పిచ్చాటూరు అనే ఊరిలో ఓ కంపెనీలో టైపిస్ట్ గా ఉద్యోగం చేర్పించాడు...

సరే జాగ్రత్తరా...! అంటూ నన్ను వదిలేసి కాళహస్తి బస్సు ఎక్కి వెళ్లిపోయాడు మా బావ...

ఆశ్చర్యం...! మా బావ కంటే ముందు కాళహస్తికి చేరుకున్నాను నేను ఆ ఉద్యోగం వదిలేసి...

"వీడు ఉద్యోగం చేయడు" అనే స్థిర నిశ్చయానికొచ్చేశారు అంతా...

నాన్న, పెదనాన్న ఉమ్మడి కుటుంబం...

పెదనాన్న ఇల్లు కట్టిచ్చాడు...
నాన్న అంగడి పెట్టిచ్చాడు...

ఉద్యోగం సద్యోగం లేకపోయినా
మామ పిల్లనిచ్చాడు...

మా అక్కకు కూతురు పుట్టి,
ఉయ్యాల్లో వేసినప్పుడే "బాబుగాడి పెళ్లాం" అనేశారంతా...

మా ఆవిడ, నేను ఒకే సంవత్సరంలో పుట్టాం...
అందుకే మా అక్క(అత్త) వద్ద మా రమతో పాటు నేను కూడా "పాలు" పంచుకున్నాను...

ఇద్దరమూ ఒకే స్కూలు...ఒకే ట్యూషను...
ట్యూషన్ మాష్టారు నాగభూషణంగారు
నన్ను 'రాజబాబు' అని, ఆమెను 'రమాప్రభ' అని పిలిచేవాడు.

ఇద్దరమూ ఒకే వీధిలో కలిసి మెలగడం, కలిసి పెరగడం వల్ల, మాపెళ్లి ముందు వఅకు నా భార్య నన్ను "ఒరే" అనే పిలిచేది....
మరదళ్లు, బావమరిది కూడా...

ఇక లాభం లేదని మా మామగారు నా పెళ్లికి ముందు సర్వసభ్యసమావేశం ఏర్పాటు చేసి, ఇక నుంచి బాబును ఒరే తరే అనకుండా, మామ అని పిలవాలి అని తీర్మానం చేశాడు....
వాళ్లు మరు రోజు నుంచి "బాబు మామా" అని పిలిచేసరికి, ఆ సంబోధన నాకే నచ్చలేదు...అదోలా ఉండేది....

కానీ తీర్మానం చేసిన మా మామ మాత్రం ఇప్పటికీ ఒరే అనే పిలుస్తాడు...
అయినా అదొక సంతోషం...నాకు 52 వచ్చినా నన్ను ఒరే అనే జీవి ఇంకా

ఈ భూమ్మీద బతికున్నందుకు...

నేను మాత్రం మా మామని అదిగో-ఇదిగో అని సంబోధించడమేగాని,
ఒక్కసారి కూడా "మామా" అని పిలిచింది లేదు...

ఒక్కసారైనా "మామా" అని పిలవొచ్చు కదా అని యెవరైనా అంటే,
వద్దులే...అసలే ఆయన గుండెజబ్బు మనిషి...
తట్టుకోలేడు...అన్నాను...

నా పెళ్లి అయ్యింది తిరుమల కొండ మీద...
పెళ్లి భోజనాల క్యూలైన్ లో నేను కూడా క్యూలైన్ లో వెళ్లి భోంచేసిన
అమాయకత్వం అప్పటికి...

ఆ రాత్రి పెళ్లిభోజనం చేసుకొని చెప్పాపెట్టకుండా నేను,
గురువుగారు...ఇంకొంతమంది మిత్రులు...కలిసి సర్వదర్శనం క్యూ లైన్ లో
దూరేశాం...ఎలాగోలా రాత్రి 11 కు బయటపడ్డాం...
క్యూలైన్ ఉదయం వదిలి ఉంటే మాత్రం, బయట వచ్చేసరికి పెళ్లి
ముహూర్తం దాటిపోయేది...
మా నాన్న తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు...పెళ్లికొడుకునని కూడా
చూడకుండా...

* * *

నా పెళ్లికి నెల ముందే మా దాయాదైన ఒకనికి పెళ్లి జరిగింది...
విందుకు వెళ్లాం నేను, గురువుగారు,
నా స్నేహితుడు కాళేశ్వరరావు...

విందు పూర్తయ్యి  బయటకు వచ్చేసరికి కాళేశ్వర్రావు చెప్పులు
కనబడలేదు...
అలాంటి జతే వేరే ఉన్నాయి అక్కడ...

నేనన్నాను...ఒకే రకంగా ఉండడం వలన నీ జోళ్లు తెలియక
తీసికెళ్లిపోయారు...కాబట్టి ప్రస్తుతం ఉన్న జోళ్లు నీవు తీసేసుకో...అని ఓ
ఉచితసలహా పారేశాను...
సరేనని అవే వేసుకున్నాడు పాపం కాళేశ్వర్రావు...

తిరిగి వచ్చి మా ఇంటిబయట అరుగు మీద కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నాం...

ఇంతలో మా నాన్నగారు వచ్చారు...
సుబ్రమణ్యం...! నా క్రొత్త  చెప్పులు పెళ్లిలో పోయాయి...అన్నాడు గురువుగారితో.

కాళేశ్వరరావు అరుగు ముందు విడిచి పెట్టి ఉన్న చెప్పులు చూపించి అన్నా! ఇవేనా చూడు...అన్నారు గురువుగారు...

అరె...ఇవే...ఇక్కడకెలా వచ్చాయి!! అన్నాడు ఆశ్యర్యంగా మా నాన్నగారు...

మీ పుత్రరత్నం ఇచ్చిన ఉచిత సలహా వలన...
అన్నారు గురువుగారు....జరిగింది చెప్పాడు...
అందరం నవ్వుకున్నాం...

* * *

మానాన్న పెదనాన్న లాగా నేనూ మా తమ్ముడు కలిసే ఉందామని అనుకున్నాను...
కానీ మా నాన్నగారు మా ఇద్దరి మధ్య అడ్డుగోడ కట్టాలని నిర్ణయించాడు...

అప్పుడు బాగా ఏడ్చాను మా అమ్మ ముందు...
ఏమీ మాట్లాడకనే...

నేను మా నాన్నగారికి ఏ సమాధానమూ ఇవ్వక, మౌనం వహించాను చాలా కాలం.

నా మౌనంతో ఒక నిర్ణయానికి రాలేక మా తండ్రిగారు కూడా ఏమీ తోచక గురువుగారి వద్ద ఈ విషయాన్ని ప్రస్తావించారు...

సుబ్రమణ్యం...!
బాబు విషయం నాకేమీ అర్థం కావడం లేదు....
అన్నారు...

"కన్న తండ్రి మీకే అర్థం కాకపోతే, నాకేం అర్థమవుతాడు?" అన్నారు గురువుగారు.

గురువుగారు నన్ను పర్సనల్ గా కలిసి ఓ మాటన్నారు-

బాబూ!
మౌనంగా ఉంటే ఎలా?
ఏదో ఒక నిర్ణయం చేసి చెప్పు మీ నాన్నకు...అన్నారు.
నా అభిప్రాయం ప్రకారం అయితే,
వేరు కాపురం పోవడమే మంచిది, అది అంత కానిపనేమీ కాదు...
వేర్లు పోవడం వలన మీ అన్నదమ్ముల అనుబంధం పెరుగుతుందే తప్ప తరగదు...అన్నారు...

గురువాక్కు బ్రహ్మవాక్కే....

మా అమ్మకు తెలియచేశాను...
కొద్దికాలానికే ఆ కార్యక్రమం పూర్తయిపోయింది...
* * *

మాకు సంతానం కలుగలేదు...

గురువుగారు అన్నారు-
మీకు ఏ అప్పులూ లేవు...
అప్పులోళ్లే సంతానంగా పుట్టేది.
కాబట్టి హాయిగా ఉండండి...అన్నారు.

అప్పులవాళ్లని అప్పులవాళ్లుగానే పుట్టిస్తే, పాపం వీరు బాధపడతారని కరుణామయుడైన భగవంతుడు
అప్పులవాళ్లను కొడుకులుగా, కూతుళ్లుగా పుట్టించి, తిను నాయనా! తిను అమ్మా! అంటూ అప్పును ఇష్టంగా తీర్చే ఏర్పాటు చేశాడు భగవంతుడు...అన్నారు.
* * *

షాపు, ఇల్లు, సత్సంగం ఈ మూడు వ్యాపకాలు తప్ప మరే వ్యాపకమూ లేదు...

నాలుగు పురవీధుల్లో నాలుగుసార్లు చుట్టివచ్చినా సరే, నన్ను "హాయ్"
అని పలకరించేవారు ఒక్కరు కూడా ఉండరు...
మనకు అదే హాయి...

వ్యవహారం ఎంత తక్కువగా ఉంటే అంత సుఖం ఒంటికి.
వస్తువులు ఎంత తక్కువగా ఉంటే అంత సుఖం ఇంటికి.

నా ఏకైక స్నేహితుడు - దేవీప్రసాద్.
నా ఏకైక గురువు - సుబ్రహ్మణ్యం.
నా ఏకైక సతీమణి - రమాదేవి.

బంధం లేని బంధం నాకు ఈ ముగ్గురితోనే....

* * *

80. Money + She = మనిషి

---

11-7-2021 * ఆదివారం

ఈ ఉదయాన్నే 5.45 కు సద్గురు సన్నిధికి చేరుకున్నాం నేనూ, దేవీప్రసాద్...

అప్పుడు ప్రారంభమైన సద్గురు వాక్ప్రవాహం
8.00 వరకు యెడతెగకుండా సాగింది...

ఒక కప్పు టీ తో ముగిసే సత్సంగం, ఈరోజు రెండవ విడత టీ వరకు
సాగింది...

మొదటి టీ రవి ఇచ్చాడు...
రెండవ టీ యుగ ఇచ్చాడు...

రెండవ టీ ని చెంగల్వరాయరెడ్డికి ఇవ్వబోతే
వద్దు రెండవసారి త్రాగితే నాకు అదో రకంగా ఉంటుంది...అన్నాడు.

ఎన్నిసార్లు త్రాగినా టీ, టీ లాగే ఉండాలిగానీ,
"అదో రకంగా" ఉండడం ఏమిటి?

ఒకవేళ "అదో రకంగా" ఉంటే,
ఆ క్రొత్తరకాన్ని చవి చూడడానికైనా మళ్లీ త్రాగాలి కదా...! అన్నారు

గురువుగారు తమాషాగా.

కాబట్టి పదార్థంలో మార్పులేదు...
మార్పు ఉండేది నీ స్థితిలోనే... అన్నారు.

* * *

"ఉన్నది దేవుడు మాత్రమే" అన్నాక
ప్రపంచమూ, వ్యవహారమూ యధావిధిగానే ఉంటుంది...కానీ దేవుడుగానే ఉంటుంది.
అప్పుడు జీవుడు కూడా దేవుడుగానే ఉంటాడు.

"ఉన్నది జీవుడు మాత్రమే" అన్నాక
ప్రపంచమూ, వ్యవహారమూ యధావిధిగానే ఉంటుంది...
అప్పుడు దేవుడు కూడా జీవుడుగానే ఉంటాడు.

దేవుడు నీవైతే సకలమూ దేవుడే...జీవుడు కూడా.
జీవుడు నీవైతే సకలమూ జీవుడే...దేవుడు కూడా.

స్వర్ణకారుడు రాగితో కైలాసం చేశాడు.
శివుడూ రాగే.
శివగణాలూ రాగే.

బంగారంతో కైలాసం చేస్తే-
శివుడూ బంగారమే.
శివగణాలూ బంగారమే.

ఏది అనుకున్నా, సకలమూ ఆ లెక్కలోనే ఉంటుంది.

"నేను" స్థానంలో ఏది ఉంటే,
సమస్తమూ అదే అవుతుంది.

అంటే, నేను ఏదిగా ఉంటే
సమస్తమూ అదే అవుతుంది...

అన్నారు గురువుగారు...

ఐతే "నేనే కేంద్రం" అన్నమాట...
అన్నాడు దేవీప్రసాద్.

అవును...నేను తప్ప ఏమీ ఉండకూడదు...
అప్పుడే "నేనే కేంద్రం" అవుతుంది.
అన్నారు గురువుగారు.

* * *

ఇటుకను బంగారంగా మార్చే శక్తి కలిగిన క్షణమే
బంగారాన్ని కూడా ఇటుకగా చూసే జ్ఞానం కలిగి
వేమన దిగంబరుడయ్యాడు...

ఇన్ని శోధనలు, ఇన్ని సాధనలు కూడా అవసరం లేదు...

ప్రతిరోజు ఓ 10 నిమిషాలు నిలువుటద్దంలో
నీ దిగంబరత్వాన్ని నీవుచూసుకో... నీవెవరివో...తత్త్వం బోధపడుతుంది...

అద్దంలో ఉన్న నీ ప్రతిబింబం కాదుగానీ,
నీలో ఉన్న నీ ప్రతిబింబం నీకు జ్ఞానాన్ని ప్రబోధిస్తుంది అన్నారు.

* * *

మనం ఎంత అమాయకులం అంటే,
వైకుంఠద్వారపాలకులైన జయవిజయులే శాపం పొంది, మూడు జన్మలలో
తిరిగి వైకుంఠానికి చేరడానికి ఉద్దేశపూర్వకంగానే శతృత్వాన్ని
స్వీకరించారని తెలిసి కూడా వాళ్లు రాక్షసులు అనీ, వీళ్లు దేవతలు అని
భ్రమలో ఉంటాం...
అదంతా ముందుగా నిర్ణయించబడిన ఓ నాటకం అనేది మరుస్తాం.

ఇదంతా నాటకమే...
జగన్నాటకమే...

ఇక్కడ నిజం అంటూ నిజంగా ఏమీలేదు...
ఇది నిజం...

* * *

కూడు-గుడ్డ-గూడు

యెంత "నాగరికత అభివృద్ధి" అని చెప్పినా, ఈ మూడింటికి సంబంధించిన వస్తు సంచయాన్ని పెంచుకోవడమేగాని, దానికి మించి ఏముంది చెప్పు?

నాగరికత పేరుతో వీడు అనుభవించే సుఖం కన్నా నాగరికత లేని ఇతర జీవులే ఎక్కువ సుఖాన్ని పొందుతున్నాయి...

కూడు, గుడ్డ, గూడులను మించి ఆశించడం మనోవైకల్యమే అంటారు యూజీ.

మనిషికి ఈరోజుటికీ అర్థం కానిది - మని,షి.
అంటే మని(డబ్బు) - షి(స్త్రీ).

వీడికి కావలసినదేదో
ఈ రెంటినీ వదిలితేగానీ దొరకదు.

రామాయణ భారతాలు నుంచి ఏ చరిత్ర చూచినా
ఈ రెంటి మీదనే సాగాయి...

* * *

కూడు-గూడు-స్త్రీ   ఈ మూడిటి మీద ఆసక్తి లేనివాడు -  ఋషి.

అవి ఉండొచ్చు...కానీ ఆసక్తి లేకుండా ఉండాలి...అంతే.

జనకమహారాజు అలా ఉన్నారు...
అందుకే వారిని రాజర్షి అన్నారు...

* * *

విప్రనారాయణ చిత్రములోని రేలంగి డైలాగును ఉదహరించారు-

చెప్పేవాడికి అర్థమై, వినేవాడికి అర్థం కాకుంటే
అది సిద్ధాంతం.
చెప్పేవాడికి, వినేవాడికి ఇద్దరికీ అర్థం కాకుంటే
అది వేదాంతం.

అందరం నవ్వుకున్నాం...

విప్రనారాయణ చిత్రానికి మాటలు వ్రాసింది సీనియర్ సముద్రాల...ఆ మొత్తం చిత్రకథను ఇప్పటికి పిల్లలకు పాఠ్యాంశంగా పెట్టవలసిన అవసరం

ఎంతైనా ఉంది....అన్నాను నేను.

అవునన్నారు...

దేవదాసు చిత్రములో  నాలుగు వేదాల సారాన్ని
నాలుగు మాటల్లో చెప్పేశారు సముద్రాలవారు-

జగమే మాయ
బ్రతుకే మాయ
వేదాలలో సారమింతేనయా
ఈ వింతేనయా

* * *

అదే పాటలో చరణంలో మరో అద్భుతమైన బోధ ఉంది...

బాధే సౌఖ్యమనే భావన రానివోయ్
ఆ యెరుకే నిశ్చలానందమోయ్ బ్రహ్మానందమోయ్

కాబట్టి మనం సుఖం అనుకునేది సుఖం కాదన్నమాట...

సుఖం అనే ముసుగులో ఉండేది బాధే.
బాధ-సుఖం రెండూ బాధలో ఉండే రెండు రకాలు.

బాధే సుఖమనే భావనే, ఆ యెఱుకే నిశ్చలానందమట...

ఆహా! ఇంకా వేరే వేదాంతమెందుకండీ...
ఈ చిన్ని చిన్ని మాటలు చాలవూ....

నదిని దాటడానికి పెద్ద స్టీమరు కావాలా?
చిన్న తెప్ప చాలదూ...!

మన సమస్య కంటే, మనం దాని నివారణకు చేసే ప్రయత్నమే పెద్ద సమస్యగా తయారవుతోంది...

వేరే వాళ్లతో(ప్రయత్నాలతో) పోల్చుకోవడం వచ్చిన బాధలే ఇవన్నీను...

వాళ్లెవరో "కష్టపడి" పొందారని, నీవూ "కష్టపడి" పొందవలసిన అవసరం లేదు...

అలాంటి "రూల్" ఏమీలేదు...
"మిలారేపా"తో పోల్చుకోనక్కర్లేదు...

నీవు గుర్వనుగ్రహం వలన సులభంగానే, హాయిగానే తరించవచ్చు...

యోగవాశిష్ఠంలో  పువ్వును త్రుంచడానికంటే సులభం అని చెప్పారు...

అత్యంత సులభం ఆత్మవిద్య... అని రమణులు పాట వ్రాశారు...

సరళమైన విషయాన్ని మనమే జటిలం చేసేసుకున్నాం...
సులభంగా పొందడం మనకే ఇష్టం లేనట్లుంది...

ఒకడు తపస్సుకు అలా కూర్చోగానే బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడట...

ఆ తాపసి పాపం చాలా నిరుత్సాహపడి,
బ్రహ్మగారూ! మరీ మీకంత తొందరెందుకు చెప్పండీ...?
రంభ రావాలి, ఊర్వశి రావాలి, మేనక రావాలి...ఆ తరువాతే మీరు రావాలి...
వారెవరూ రాకనే, ఏదో కొంపలు మునిగిపోతున్నట్టు పరిగెత్తుకొచ్చావే...!
అని చిరాకు పడ్డాడట.

* * *

అందరిలో తానుంటూ
అందరుగా తానుండడమే ఏకాంతం.

కల కనే ముందు ఒకడే ఉంటాడు.
కలలో అనేకం అయినట్టు వుంటాడు.
కల ముగిసాక  ఒకడే మిగులుతాడు.
నిజానికి కల కనేటప్పుడు కూడా ఉండేది ఒకడే.

అందరిలో తానొకడుగా ఉన్నట్టుగా ఉన్నా,
తనలో తానున్నవాడు జ్ఞాని.

* * *

దైవదర్శనం అవనే అవదు.
తాను కానిదానిని తాను చూడగలడేగాని,

తానే అయినదానిని తానెలా చూడగలడు?

దైవసాక్షాత్కారము అనుట
తానే దైవము అగుట.

* * *

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ।।

- భగవద్గీత 9-22

ఎల్లప్పుడూ నన్నే స్మరిస్తూ మరియు నా యందు అనన్య భక్తిలో నిమగ్నమైన వారుంటారు, అలా నా యందే సతతమూ మనస్సు నిలిపిన వారికి, వారికి లేనిదేదో అది సమకూర్చి పెడతాను మరియు వారికి ఉన్నదాన్ని సంరక్షిస్తాను.

గురువుగారు ఈ శ్లోకాన్ని ప్రస్తావిస్తూ కృష్ణభగవానుడు "నన్ను" అంటే....
నేను+ను  అని అర్థం.
అని చెప్పారు.

"నేను" లో సదా సంస్థితమై ఉన్నవానికి
యోగమేమి? క్షేమమేమి? అన్నారు...

* * *

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ |

ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ||

-భగవద్గీత 4-8

సజ్జనుల సంరక్షణార్థమూ, దుష్టజన శిక్షణకూ, ధర్మసంస్థాపన కోసం... ప్రతి యుగంలోనూ నేను అవతరిస్తూనే వుంటాను...

గురువుగారు ఈ శ్లోకాన్ని ప్రస్తావిస్తూ-

యుగము అంటే అది కాలగణనకు సంబంధించినది కాదని...
యుగము అంటే "రెండు" అని...
అవి ఉచ్ఛ్వాస-నిశ్వాసములని...

పీల్చడం ఆక్సిజన్ - శిష్టులని...
వదలడం కార్బన్ డై ఆక్సైడ్ - దుష్టులని...
ఈ రెంటి ప్రక్రియకు ఆటంకం జరగకుండా సదా జరుగుతుండడమే
ధర్మ(జీవ)సంస్థాపనమనీ...
చెప్పారు గురువుగారు.
* * *
నామరూపాలుండడమే ప్రాణానికి గుర్తు...

నామరూపాల్లో ఏ ఒక్కటి ఉన్నా సరే
ప్రాణం ఉన్నట్టే లెక్క.

సంతోషము,  ఆకలి ...వీటికి రూపం లేదు...
అయినా పేర్లున్నాయి...
కాబట్టి వాటికి ప్రాణం ఉన్నట్టే.

రాళ్లు రప్పలకు పేర్లు లేకపోయినా రూపం ఉంది...
కాబట్టి వాటికి కూడా ప్రాణం ఉన్నట్లే.

నామంగానైనా, రూపంగానైనా "ఉనికే" ప్రాణలక్షణం.
* * *
సద్గురు బోధామృత వర్షాన్ని
ఈ అల్పుడు పట్టుకోగలిగింది ఓ దోశెడు మాత్రమే...

కానీ ఆధ్యాత్మిక తాపాన్ని తీర్చడంలో కొరతేమీ ఉండదు...

అమృతం ఒక చుక్క చాలు... అమృతుడు కావాడానికి...గంగాళాలు అవసరం లేదు.

సముద్రుడికి ఆ నీటితోనే అర్ఘ్యమిచ్చినట్లు,
సూర్యుడికి ఓ చిన్ని దీపంతో హారతి ఇచ్చినట్లు
సద్గురు బోధల్నే పొడి పొడి మాటలుగా
పాఠకుల రూపంలో ఉన్న సద్గురువుకు తిరిగి అర్పిస్తున్నాను...

చెప్పడం వారి నైజం.
వ్రాయడం నా నైజం.

మా మిత్రుడు రమణస్వామి అన్నట్టు-
ఏ 'ఇజం' కాని 'ఇజం' మనది...
ఇది నిజం...

* * *

జ్ఞానశిశువు
9533667918

81. మౌనభాషణం

________________

15-7-2021 * గురువారం

ఈ ఉదయాన్నే 5.30కు నేనూ ప్రసాద్
విజ్ఞానగిరి వద్ద ఉన్న Tea Time షాప్ వద్ద కలిసి
tea త్రాగి గురువు వద్దకు బయలుదేరాం...

గేట్ వద్ద నుంచే గురువుగారి దర్శనం అవుతుంది...
కాంపౌండ్ లో ఉన్న మామిడి చెట్లపై పక్షులన్నీ గుమికూడి సత్సంగం చేసుకుంటున్నాయా అన్నట్టు
సందడి చేస్తున్నాయి...

అత్యాశ్రమ దృశ్యానికి సహజమైన నేపథ్యసంగీతంలా అమరింది ఆ కిలకిలారావాలు...

TV.సిగ్నల్ అందక నిశ్శబ్ధంగా ఉంది హాలంతా...
మౌనబోధకు అది తోట్పాటయ్యింది...

ఎంత అద్వైతం మాట్లాడుకున్నా సరే
సద్గురు సన్నిధిలో ఉన్న మౌనం
అన్ని వాదాలకు చిట్టచివరి సమాధానం అవుతుంది.

ఓ బొమ్మలా అయిపోతాం.

వారి భాషణం కంటే వారి మౌనమే
ఎక్కువగా ప్రబోధం చేస్తుంది,

వారి రూపసాన్నిధ్యం కంటే
వారి తత్త్వస్మరణే ఎక్కువగా ఆనందాన్నిస్తుంది.

గురువుగారు మాట్లాడుతూ మాట్లాడుతూ
ఇక మాటలకు అలవిగాని పరిస్థితికి చేరుకున్నప్పుడు....

కాసేపు మౌనం వహించి...

"అదే నేను" అని చివర్లో అందమైన ముగింపు ఇవ్వడం పరిపాటి.

* * *

ఓసారి ప్రముఖ రమణభక్తులు దోనెపూడి వెంకయ్యగారు గురువుగారికి ఫోన్ చేశారు...

నమస్కారమండీ గురువుగారు...! అన్నారు...
నమస్కారమండీ...! అన్నారు గురువుగారు...

వెంకయ్యగారు గట్టిగా ఓ నవ్వు నవ్వారు...
గురువుగారూ నవ్వారు...

అంతే వారి మధ్య సంభాషణ పూర్తయిపోయింది...

ఉంటాను గురువుగారు...అన్నారు వెంకయ్యగారు.

అలాగేనండీ...అన్నారు గురువుగారు.

ఇద్దరు జ్ఞానుల మధ్య సంభాషణం ఇలానే ఉంటుంది.

* * *

సద్గురు సన్నిధిలో  మన ప్రమేయం ఏమీ లేకుండా,

ఏదో ఒక ఎనర్జీ మనలో నిశ్శబ్దంగా రీచార్జ్ అవుతుంటుంది...

ఇది నేను బాగా గమనించిన విషయం...

108 వ్యాసాలు కాదు, 1008 వ్యాసాలు వ్రాయాలనే ఎనర్జీని నింపుకుంటాను నేను.

అందుకే సద్గురు సన్నిధికి వెళ్లివచ్చినప్పుడల్లా సబ్జక్టు ఏమీలేకపోయినా సరే, ఏదో ఒకటి వ్రాసేస్తుంటాను...

అకారణంగా...ఏదో అలజడి, ఏదో అశాంతి, ఏదో అసంతృప్తి...

ఈ ఆధ్యాత్మిక రచయితను కాసేపు కుదిపేస్తాయి...

తనను తాను తమాయించుకొని స్వస్థితిలో నిలవడానికి చేసే ప్రయత్నం "రచన"గా ప్రకటనమౌతుంది...

బహుశా ఈ "బాబు" అనే పరికరం అందుకై తయారుచేయబడిందేమో...

* * *

సద్గురు సన్నిధిలో "శాంతి" అనేది ఓ వస్తువులా తాకుతుంది మనల్ని...

వారి సన్నిధిలో గడపడం ఓ వ్యసనంలా తయారైంది...

పిచ్చి పిచ్చి కారణాలతో గురువుపై ఎన్నోసార్లు అలిగాను...
ఇంక గురువు వద్దకు వెళ్లనేకూడదు అనుకుంటాను...
వెళ్లకుండా ఉండలేకపోతాను...

అరుణాచలంలో ఉన్న కొండంత ఆకర్షణ ఉంటుంది
ఈ గురువులో...

చంచలస్వభావియైన బాబుకు
అచలరూపుడైన గురువు దొరకడం
రోగికి మంచి వైద్యుడు దొరకడం లాంటిదే.

బాబుగారూ! మీరు చాలా అదృష్టవంతులు...
సద్గురు సన్నిధిలో ఉండే భాగ్యం కలిగింది...అంటుంటారు ఫోన్ లో.

అవును...ఇది ఎమర్జెన్సీ కేసు...
సదా  డాక్టర్ పర్యవేక్షణలో ఉండాలి...

మీరుఆరోగ్యవంతులుకాబట్టి... డాక్టరుకు(గురువుకు) దూరంగా ఉంటున్నారు...
అంటాను.

నాకు మంచి వైద్యుడు దొరకడము నా అదృష్టం.
మీకు డాక్టర్ తో అవసరం రాకపోవడం మీ అదృష్టం...అంటాను.

* * *

నిన్న ఎవరో సోమశేఖర్ అనే అతను వచ్చాడట...
జ్ఞానప్రసూనాల్లో ఏవో సందేహాలున్నాయని...
పెద్ద లిస్ట్ ఒకటి తయారుచేసుకొచ్చాడట...
ఆ చిట్టాను బట్టబయలు చేయకనే సాయంత్రం వఱకు మౌనంగా గడిపి, తిరుగుప్రయాణం అయిపోయాడట...

"ప్రశ్నలకు సమాధానం కాదు...
అడిగేవాడే సమాధానం" అన్నాను నేను...

అవును... ఆ గోడ మీద ఉన్నవాక్యాలు అవే అన్నారు గురువుగారు...

గోడపై అంటించి ఉన్న పటంలో ఉన్న వాక్యాలివి-

"ప్రశ్నకు సమాధానం లేనప్పుడు
ప్రశ్నించువాడే సమాధానం.

ప్రయత్నంతో సాక్షాత్కారం కలుగనప్పుడు

ప్రయత్నించువాడే భగవంతుడు."

* * *

గురువుగారు ఇలా అన్నారు-

ప్రశ్న ఎప్పుడూ సమాధానంలోంచే పుడుతుంది.

సముద్రంలో అల పుట్టి, ఉండి, మళ్ళీ సముద్రంలోనే లయమయినట్లు...

ఏ ప్రశ్న అయినా తనలోనుంచే పుట్టి, ఉండి, తనలోనే లయమయిపోతుంది.

కాబట్టి ప్రశ్నించువాడే సమాధానం.

* * *

సముద్రం - గాఢనిద్ర.

అందులో నుంచి లేచే ఓ అల - కల,మెలకువ.

ఈ మెలకువ అనేది కూడా కల లాంటిదే.

కల నుంచి మేలుకోవడం అంటే-

ఒక కల విడిచి, మరో కలను కనడమే.

మరి ఈ మెలకువ అనే కలను కంటున్నాం కాబట్టి

మనం నిద్రలో ఉన్నట్టేగా!

మనం సదా నిద్రలో ఉన్నాం అన్న ఎఱుకే
"నిజమైన మెలకువ".

కల-మెలకువ-నిద్ర మూడూ ఓ పెద్ద కల
అన్న ఎఱుకే జ్ఞానం(తురీయం).

* * *

సముద్రం - ఆత్మ.
అందులో నుంచి లేచి పడే అల - మనస్సు.

మనస్సు ఆత్మ కాదు,
ఆత్మకు భిన్నమూ కాదు.

జ్ఞానప్రసూనాల్లో 1-81 వాక్యం చూడండి...

"తలంపులను అణచి ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవాలి" అని యెందుకు భావించడం?
ఇది చాలా శ్రమతో కూడిన సాధన.
తలంపుల రూపంలో ఉండేది ఆత్మయే అని తెలుసుకుంటే, తర్వాత తలంపులు కలిగినా నీవు తలవనివాడివే అవుతావు.

ఈ ఒక్క వాక్యం చదివి కడపజిల్లా టంగుటూరు నుండి వేంకటసుబ్బయ్య అనే రమణభక్తుడు పరిగెత్తుకువచ్చాడు సద్గురు సన్నిధికి....

గురువుగారూ...నాకు దొరకవలసింది దొరికింది...
నా రమణుణ్ణి ప్రత్యక్షంగా చూడగలిగాను...
అంటూ తృప్తితో తిరిగి వెళ్లిపోయాడు...

* * *

గురువుగారూ! ధ్యానంలో నా మనసు యెక్కడికెక్కడికో తిరుగుతోంది...నా మనసు నిశ్చలం పొందడం ఎట్లా? అని అడిగారు ఒకరు.

ఉన్నదెల్లా ఆత్మయే కదా!
ఎక్కడ తిరిగినా ఆత్మలోనే కదా!
తిరగనీ...అన్నారు గురువుగారు.

ఆశ్చర్యంగా...దీనిని సమర్థించే రెండు శ్లోకాలను పంపారు గురుభక్తురాలు విశాలాక్షి గారు...

ఈ సందర్భంలో దానిని మీతో పంచుకుంటున్నాను-

శ్లో ||యత్ర యత్ర మనోయాతి తత్ర తత్రైవ ధారయేత్ |
చలిత్వా పుత్రమిత్రాస్తి సర్వం శివమయంభవేత్ ||

- అభినవ గుప్తాచార్యులు(శివతంత్రసారం)

మనసు యొక్క ప్రధాన లక్షణం చలించటం.

మోక్షానికి బంధానికి కూడా కారణం మనసే.

కాసేపు ఈమనసును మోక్షం వైపుకు తిప్పుదామనుకున్నపుడే, ఇది అన్ని చోట్లకు పరుగెడుతుంది...

కానీ దానిని కట్టి పడేద్దామని అనుకోకు..
స్వేచ్ఛగా విహరించనీ...

ఈ ప్రపంచం సర్వం బ్రహ్మ మయం అని నమ్ముతున్నావు కదా...

భార్యాబిడ్డలతో సహా నీకు కనిపించేదంతా
బ్రహ్మమే కదా...

ఇంక ఆ మనసు ఎక్కడికి పోదలచుకుంటే అక్కడికే పోనీ...

సర్వం బ్రహ్మమయం భవేత్.....

ఆ విహరిస్తున్న మనసుతో నీవు మాట్లాడకు.
ఆ మనసు పెడుతున్న నామకరణాలు నీవు పట్టించుకోకు...
చూస్తున్నా చూడనట్లు ఉండు...అలా ఊరకే...

* * *

శ్లో|| యత్ర యత్ర మనోయాతి తత్ర తత్ర పరంపదమ్ |
తత్ర తత్ర పరంబ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్ ||

- సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్తు

మనసు ఎక్కడెక్కడికి ప్రయాణం చేస్తుందో అక్కడక్కడ పరమ పదం ఉన్నది.
అక్కడ ఉన్న ఆ పరబ్రహ్మం సర్వత్రా
వ్యాపించి ఉన్నది.

* * *

82.  నీ నామాన్నే నీవు స్మరించుకో...

---

20-7-2021 * తొలి ఏకాదశి

రాజులు యుద్ధభూమికి వెళ్లేముందు-
గురువుల వద్ద ఆశీర్వాదం తీసుకున్నట్లు,

దేవీప్రసాద్ కరోనా టీకా వేసుకోవడానికి ముందు-
గురువుగారి వద్ద ఆశీర్వాదం తీసుకోవాలని భావించాడు.

నన్ను తోడు రమ్మన్నాడు...

సరే గురుదర్శనం అవుతుంది కదా అని తోడు వెళ్లాను...
ఉదయం 7.30 కు గురుసన్నిధికి చేరుకున్నాం.

రవి లేడు.

హరి ఉన్నాడు.

గురువుగారి వద్ద విభూధి, తీర్థం అయ్యాక...

ఓ సంచిని గురువుగారి చేతిలో పెట్టా...

ఏమది...? అంటూ లోపలకు చూశారు...

దాని నిండా wills flake సిగరెట్ ప్యాకెట్స్...

మృత్యుంజయడు అనే భక్తుడు మీకు ఇమ్మని పంపాడు....అన్నాను.

గురువుగారు నవ్వి, అయితే ఈ సిగరెట్లు త్రాగితే, నేను మృత్యువును జయించవచ్చును అన్నమాట... అన్నారు.

అందరం నవ్వుకున్నాం.

"వారు నాకు ఆ హృదయంతోనే పంపారు"

అన్నారు మృత్యుంజయుని గుఱించి.

* * *

బాబుకు "టీ" పెట్టి ఇవ్వు...అని హరిని పురమాయించబోయారు....

ఇప్పుడే త్రాగొచ్చాం...వద్దన్నాం...

* * *

విజయవాడ నుంచి అనామిక  వీడియోకాల్ లో గురుదర్శనం చేసుకున్నది...

టీ త్రాగారా...? అని ప్రేమతో పలకరించింది...
"త్రాగానమ్మా..." అన్నారు గురువుగారు...

తెల్లవారుఝామున 3 గంటలకే  లేచి గురుపాదుకాపూజ చేసిందట అనామిక...

నేనెప్పుడు వీడియోకాల్ చేసినా....
అనామిక తాను పూజ చేసిన గురుపాదుకలను చూపెడుతుంది...

ఇంత చిన్న వయస్సులో
అంత గురుభక్తి కలగడం అనేది
జ్ఞానాంబ స్వాధీనంలో ఉన్న "శిశుగణం"లో
అనామిక ఒకరు అని చెప్పాలి.

ఈ మధ్య ఓరోజు అనామిక గురువుగారిని తనకు మంత్రోపదేశం చేయమని అడిగింది...

"ఇప్పుడేగా అప్లికేషన్ పెట్టావు...
పై నుంచి అనుమతి రానీ..."

అన్నారట.

అనామిక వేసవి సెలవులు ఇక్కడే గడిపి,
విజయవాడకు బయలుదేరేముందు-
గురువుగారు "అనామిక" అనే మంత్రాన్ని ఉపదేశించారట.
నీ నామాన్నే నీవు స్మరించుకో...అన్నారట.

* * *

ఈ పారాయణాలు  కంటే
ఈ భగవన్నామస్మరణ కంటే
నీ నామాన్నే  నీవు స్మరించుకో...
అన్ని మంత్రాలకు మించిన ఫలితం ఉంటుంది.
అన్నారు గురువుగారు.

భగవన్నామ స్మరణ చేస్తే ఎప్పుడో ప్రత్యక్షం.
నీ నామాన్ని నీవు స్మరిస్తే ఇప్పుడే ప్రత్యక్షం.

నిన్ను నీవు తెలుసుకో అనే బోధ కంటే
నిన్ను నీవు స్మరించుకో అనే బోధయే శ్రేష్టం.

ఓంకారంతో సహా సకల దేవతానామాలన్నీ ద్వితీయమే.
నీ నామం ఒక్కటే ప్రధానమైనది.

* * *

దైవనామాన్ని తాను స్మరించేటప్పుడు
తాను అనామికగానే ఉంటుంది.

అనామిక తన నామాన్ని స్మరిస్తే
తాను దైవంగానే ఉంటుంది.

ఇదే దైవానుభవం అంటే.

* * *

దైవనామాన్ని స్మరిస్తే దైవానుభవం కలుగదు.
నీ నామాన్నే నీవు స్మరిస్తే,
నీ నుంచి నీవు విడి పడి,
దైవానుభవం కలుగుతుంది.
ఇదే అత్యాశ్రమ సాధన; సిద్ధి రెండూ.

* * *

అల లేకుండా సముద్రం ఉంటుందిగానీ
సముద్రం లేకుండా అల ఉండదు.

ప్రశ్నలేని సమాధానం ఉంటుందిగానీ
సమాధానం లేని ప్రశ్న ఉండదు.

సమాధానంలో నుంచే ప్రశ్న పుడుతుంది.
ప్రశ్నలోనే సమాధానం ఉంటుంది.

నేనెవడను? అనే ప్రశ్నలోనే
నేను "ఎవడను" అనే సమాధానం ఉంది.

గమనించండి....క్వచ్చన్ మార్కులోనే
ఫుల్ స్టాప్ కూడా ఉంది.

* * *

నీవెవరివో తెలుసుకోమ్మని భగవాన్ అలలకు చెప్పాడు...

నేనెవడను? అని
అల అంతర్ముఖమైతే...
తాను సముద్రం అని తెలుసుకుంటుంది.

దీనినే "నేను లేని స్థితి సర్వసమ్మతము" అన్నారు భగవాను.

* * *

"నిన్ను నీవు తెలుసుకో" అని భగవాన్ ఎందుకన్నారంటే-

నీ లోపల రెండు నేనులు ఉన్నాయి...
నీవు ఏ నేనువో కనుక్కోమని చెప్పారన్నమాట...

"అసలు నేను"
"మిథ్యా నేను"

దేవాలయం వంతెన వద్ద ఓ కుక్క ఉంది...
దానికి తెల్లటి కారు కనబడితే చాలు తరుముకుంటూ వెళుతుంది వెనకే...

కారణం- కారు బాడీ మీద పడే తన ప్రతిబింబాన్ని తాను చూసుకుని, క్రొత్తకుక్క వచ్చిందేమోనని భ్రమపడి అది మొరుగుతూ కారు వెంట పరుగెడుతుంది...

మనమూ అంతే...
దాని కంటే గొప్పవాళ్లేమీ కాము...

"ఉన్నది ఒక్కటే...
దానికి అన్యంగా ఏమీలేదు..."
అని లక్షసార్లు చెప్పుకుని ఉంటాం.
భ్రమల వెంట పరుగెడుతూనే ఉంటాం.
సాధనలు చేస్తూనే ఉంటాం.

* * *

నేను యొక్క మూలాన్ని వెతకడమే ఏకైక మార్గం.
రెండు మూలాలు లేవు...
రెండు మార్గాలు లేవు...

అంటారు భగవాన్.

నేను యొక్క మూలాన్ని వెతికితే,
ఉన్నది ఒకే 'నేను' అనేది తెలుస్తుంది.

తనలో(ఆత్మలో) నుంచే అలలు(తలపులు) లేచి, పడుతున్నాయి అనే స్ఫురణ కలుగుతుంది.

* * *

గురువుగారు ప్రతిరోజూ ఇతరుల నుంచి ఎదుర్కొనే ప్రశ్నలు రెండు...
ఒకటి లౌకికం, రెండవది ఆధ్యాత్మికం.

1. ఆపద పోగొట్టుకోవడానికి
ఏ ప్రయత్నం చేయమంటారు?

2. ఆత్మను పొందటానికి
ఏ సాధన చేయమంటారు?

ఈ ప్రశ్నలను ఎవరో ఒకరు, ఎప్పుడో ఒకప్పుడు అడుగుతూనే ఉంటారు...

"ఇదొక కల" అనుకోమంటారు... లౌకికులకు.

"ఏ సాధనా చేయకపోవడమే గొప్ప సాధన" అంటారు...ఆధ్యాత్మికులకు.

ఆపద తొలగాలన్నా
ఆత్మను పొందాలన్నా
మన ప్రయత్నాలతో నిమిత్తం లేదంటారు...

ప్రయత్నమే ప్రధాన ఆటంకం సిద్ధికి.
అంటారు గురువుగారు.

ఏదీ...
వద్దన్నా ఆగదు.
కావాలంటే దొరకదు.

already అవన్నీ షూటింగ్ పూర్తి చేసుకుని
రిలీజ్ అయిపోయిన సీనీ సన్నివేశాలు లాంటివే...అంటారు.

చూస్తూ....ఉండడం తప్ప
మార్చడం చేర్చడం కుదరదు అంటారు.

బహుశా మనం చేసే పిచ్చి ప్రయత్నాలు కూడా
already షూటింగ్ పూర్తి చేసుకున్న సన్నివేశంలో భాగమేమో...? అని నేనంటే,

కావొచ్చు...ప్రయత్నం వద్దు అని కాదు నా భావం...
నీవు పొందేదేదో లేదా పోగొట్టుకునేదేదో అవి నీ ప్రయత్న-అప్రయత్నాలతో సంబంధం లేకుండా కలుగుతాయి, తొలగుతాయి అనేదే నేను చెప్పదలచుకున్నది.

ప్రయత్నం చేయమనీ చెప్పం.
చేసేవాళ్లని ఆపమనీ చెప్పం.

* * *

సత్యాన్ని లేదా వాస్తవాన్ని కనుక్కోవడానికి చేసే శోధన నీవెప్పుడూ ఉండే నీ యొక్క సొంత సహజస్థితి నుండి నిన్ను దూరంగా తీసుకొని పోతాయి. అది నీ కృషి వల్ల సంపాదించేది కాదు, పొందేది కాదు. అందువల్లనే నేను దానికి 'అకారణం' అనే పదం వాడుతాను. అది సంభవించడానికి కారణమేదీ లేదు...అంటారు UG.

* * *

మనం చేసే ప్రయత్నం "పిచ్చుక చేసే పిచ్చిప్రయత్నం" అంటారు గురువుగారు...

ఏమిటా పిచ్చుక? ఏమిటా పిచ్చిప్రయత్నం అంటారా?

నా చిన్నవయసులో జరిగిన ఓ సంఘటన...

ఓ రోజు రాత్రి గురువుగారు  ఆరుబయట నులకమంచం పై కూర్చుని సిగరెట్ కాలుస్తున్నారు.

మూడు నాలుగిళ్లు ఇవతల
మా ఇంటి ఆరుబయట నవారు మంచంపై నేను పడుకుని ఉన్నాను.

పైకి చూస్తే...కరెంట్ తీగలు...అమ్మో  అవి తెగి పడితే...? ఈ ఆలోచన రాగానే, వెంటనే మంచం మీద నుండి లేచి గురువుగారి వద్దకు వెళ్లి, వారి ప్రక్కనే కూర్చున్నాను...

ఏం...? అన్నట్టు చూశారు నా వైపు...

ఒకవేళ కరెంట్ తీగలు తెగి పడితే...?

అన్న ఆలోచన కలిగి లేచేశాను...అన్నాను.

గురువుగారు నవ్వి...ఓ కథ చెప్పారు...

ఓ పిచ్చుక కాళ్లు పైకెత్తి నిద్రపోతోందట...

ఆ దారిన పోతున్న నారదుడు, ఆ పిచ్చుక విచిత్రభంగిమ చూసి, ఆగి, ప్రశ్నించాడు-

అందుకు ఆ పిచ్చుక- ఏమో...నేను నిద్రలో ఉండగా ఆకాశం విరిగి పడిపోతే నా గతేం కాను? అందుకే అది నా మీద పడకుండా నా కాళ్లను అడ్డుపెట్టాను...అందట.

నారదుడు ఫక్కున నవ్వి-

ఒకవేళ ఆకాశమే విరిగి పడితే, నీ చిన్ని కాళ్లు దాన్ని ఆపగలవా? అన్నాడట.

పిచ్చుక చేసే పిచ్చిప్రయత్నాలే మనం చేసే ప్రయత్నాలు కూడా...

ఏ సమయానికి ఏది జరగాలో అది జరిగి తీరుతుంది.

మన ప్రయత్నాలతో ఏదీ ఆగదు, ఏదీ సాగదు.

అన్నారు గురువుగారు.

నా మంచం వద్దకు తిరిగొచ్చి హాయిగా నిద్రపోయాను ఆ కరెంటు తీగల క్రింద.

* * *

ఏ సాధనా చేయవద్దు అంటే,
ఈ మనుష్యులకు ఆ సమాధానం నచ్చదు.
ఏదో ఒక సాధన చెప్పమంటారు...

ఇప్పుడు మనం రెండు సాధనలను గుఱించి చెప్పుకున్నాం-

ఒకటి గురువు గారిది, మరొకటి రమణుల వారిది.

1. నీ నామాన్ని నీవు స్మరించు....

2. నీ మూలాన్ని నీవు అన్వేషించు....

నిజంగా సాధన అవసరం అనుకునేవారికి...
ఇంతకంటే గొప్ప సాధనలు లేవు...

కానీ చేయరు...
చేస్తున్నట్టు నటిస్తారు...

నేను perfect...
దేవుడే నిర్దయుడు...
అన్నట్లు మాట్లాడుతారు...

అందుకే గురువుగారు అంటుంటారు-
ప్రార్థనను బట్టి ఫలితాన్ని లెక్కవేయకూడదు.
ఫలితాన్ని బట్టి ప్రార్థనను లెక్కవేయాలి...అని.

* * *

తొలి అబద్ధం -
నేను తల్లి కడుపులోంచి వచ్చాను అనుకోవడం...

గొప్ప ఊహ -
ఫలానావాడు నా తండ్రి అనుకోవడం...

అన్నారు గురువుగారు.

* * *

మన పాదాలు భూమికి అంటివున్నాయి కాబట్టి భూమికి ఆకర్షణశక్తి ఉందనటం కాదు,
మన పాదాలకు ఆకర్షణ శక్తి ఉంది కాబట్టే
భూమికి నిశ్చలంగా ఉండే శక్తి కలిగింది.

అన్నారు గురువుగారు.

* * *

బాబు: కాలమనేది ఓ తలంపు అన్నారు భగవాన్...

సద్గురు:(నవ్వుతూ) బాబే తలంపు.

* * *

టెంకాయలో నీరుంటుంది...

టెంకాయను రెండుగా విభజించి,

తలా ఓ చిప్ప తీసుకొని అందులో నీరును వెతకడం లాంటిదే ఈ శాస్త్రాన్వేషణ అనేది.

శాస్త్రాలలో, సత్సంగాలలో, భజనలలో

ఆత్మ ఉండదు.

భజనలో విభజన ఉంది.

అవిభాజ్యమైన దృష్టియే జ్ఞానం.

అటువంటి దృష్టి కేవలం గురుకృప వలనే సాధ్యం.

అన్నారు గురువుగారు.

* * *

'మౌనభాషణం' వ్యాసం చదివి విశాలాక్షి గారు ఆనందంతో తబ్బిబ్బై ఫోన్ చేశారు నాకు....

నాయనా...! బాబూ...! నా ఆయుస్సు కూడా పోసుకుని జీవించు నాయనా...! అంటూ ఆశీర్వదించారు ఈ జ్ఞానశిశువును.

ఆయుస్సు ఇవ్వడం కన్నా గొప్ప కానుక మరేదీ లేదు లోకంలో.

ఏ జన్మలో నాకు తల్లిగా ఉండిందో ఆ మహాతల్లి...

మొదట్నుంచి "జ్ఞానాంబ" ఏదో రూపంలో
నాకు దగ్గరై మెలగుతూనే ఉంది....
'అమ్మప్రేమ'ను అందిస్తూనే ఉంది...

"మాంసం" పంచుకొని పుట్టిన బంధాలు వేఱు.
"ఆత్మ"ను పంచుకోవడానికి కలిసే బంధాలు వేఱు.

ఇవి ఆధ్యాత్మిక బంధాలు...
ఇవి మోక్షమంత సుఖాన్నిస్తాయి...

వారి నామరూపాలతో నిమిత్తం లేకుండా కేవలం తత్త్వసంబంధమైన పరిచయాలు కలిగించాయి...
ఈ మాధ్యమాలు...

మనం ఉపయోగించుకోవాలేగాని,
భారతీయ సనాతన ధర్మప్రచారానికి మంచి వేదికలు ఈ మాధ్యమాలు.

* * *

పిల్లవాడు ఏదైనా ఒక మంచి పని చేసినప్పుడు
తల్లి చాక్లెట్స్ కొనుక్కోమని పైసలు ఇచ్చినట్లు,
ఈ ఆర్టికల్ పూర్తవగానే మాతృమూర్తులు విశాలాక్షి, రమ గార్లు నాకు పైసలు పంపారు....

జ్ఞానప్రసూనాంబ నా మీద ఓ కన్ను వేసే ఉంచింది...
అనడానికి ఇంతకన్నా ప్రమాణం ఏం కావాలి?

* * *

83. "నేనే" కేంద్రం

______________

21-7-2021 * బుధవారం

ఈ ఉదయాన్నే 5.45 కు గురుసన్నిధికి వెళ్లాం...

"మాకు టీ ఇవ్వొద్దు...బజారులో త్రాగే వచ్చాం"
అని రవికి ముందే చెప్పాడు ప్రసాద్...
గురువుగారు కూడా విన్నారు...

కానీ రవి మౌనంగా వంటగదిలోకి వెళ్లి, టీ తీసుకొచ్చి మౌనంగా ఇచ్చాడు మా ఇద్దరికీ....

ప్రసాద్ అవాక్కయ్యాడు...
నాకు నవ్వొచ్చింది...

"పర్వాలేదు...త్రాగండి..." అన్నారు గురువుగారు.

ఇక తప్పలేదు...

ఆ స్థానంలో నీరు అయినా, తేనీరు అయినా గురుప్రసాదమే...

* * *

గురువుగారు బోధ మొదలుపెట్టారు...

నిద్రలో లేకుండా పోయేవాడు
మెలకువలో ఉన్నట్టున్నా లేనివాడే.

ఉన్నవాడే అయితే,
మూడవస్థల్లోనూ ఉండాలి.
ఒక అవస్థలో ఉండి, మరొక అవస్థలో లేడంటే,
వాడు ఎప్పుడూ లేనివాడే అనిఅర్థం.

ఉన్నవాడు మూడవస్థల్లోనూ ఉంటాడు.
వాణ్ణే మనం భగవంతుడు అనేది.

కాబట్టి ఉన్నవాడికి లేనివాడి గురించీ తెలియదు.
లేనివాడికి ఉన్నవాణ్ణి గురించీ తెలియదు.

తాను భగవంతుణ్ణి తెలుసుకోవడమూ లేదు,
పొందటమూ లేదు.
అని తాను తెలుసుకోవడమే సాక్షాత్కారం.

* * *

తన లోపలున్నది అసత్యంగా
తనకు వెలుపలున్నది సత్యంగా అనిపిస్తుంది.

నిజానికి,
వెలుపలున్నదంతా అసత్యం.
లోపలున్నదంతా సత్యం.

వెలుపలున్న ఆధ్యాత్మికం కూడా లౌకికమే.
లోపలున్న లౌకికం కూడా ఆధ్యాత్మికమే.

* * *

దుఃఖం అడుగున సుఖం ఉంటుంది.

సుఖం అడుగున దుఃఖం ఉంటుంది.

పైకి దుఃఖంగా ఇతరులకు అనిపిస్తుందేగానీ
లోపల సుఖస్పర్శ ఉండనే ఉంటుంది.

పైకి తాను సుఖంగా ఉన్నట్టు ఇతరులకు కనిపిస్తుందేగానీ లోపల
దుఃఖస్పర్శ ఉండనే ఉంటుంది.

సుఖస్పర్శ లేని దుఃఖం.
దుఃఖస్పర్శ లేని సుఖం
ఉండవు.

* * *

ఓ పిల్లాడు అల్లరి చిల్లరగా తిరుగుతుంటే,
తండ్రి  మందలిస్తూ - శ్రీరామచంద్రుణ్ణి చూసి నేర్చుకోరా...!  అన్నాడట.

"మా తండ్రి దశరధుడు లాంటివాడే అయితే,
మా గురువు వశిష్ఠుడు లాంటివాడే అయితే
నేను కూడా శ్రీరామచంద్రుణ్ణే" అన్నాడట
ఆ  పిల్లవాడు.

ఇక ఆ తండ్రి ఏం మాట్లాడగలడు?

ఆ పిల్లవాని వాదనను కాదనలేం.

ఆదర్శపురుషులుగా రాముణ్ణి, కృష్ణుణ్ణి చూపిస్తారు...

రాముడి తర్వాత రాముడు రాలేదు,
కృష్ణుడి తర్వాత కృష్ణుడు రాలేదు.
ఇక రారు కూడా...

నాలుగు యుగాల్లోనూ "బాబు" లాంటివాడు బాబు ఒక్కడే ఉంటాడు.

నాలుగు యుగాల్లోనూ...
ప్రసాద్ ఒక్కడే...
రవి ఒక్కడే...
పట్టెయ్య ఒక్కడే...

ప్రతి ఒక్కరూ తనదైన శైలీ వ్యవహారాలను, వైవిధ్యతను కలిగి ఉంటారు...
ప్రతి ఒక్కరూ వారి వారి విధానంలో గొప్పే.
ఒకరు మరొకరిలా  ఉండడం జరగదు.

అందరూ మహర్షుల్లా ఐపోతే,
లోకం ఎంత దరిద్రంగా ఉంటుందో ఊహించు...
అంటారు గురువుగారు.

వైవిధ్యతే ప్రపంచంలో సౌందర్యం.

మా బంధువు, గురువుగారి శిష్యుడు అయిన

కుమారస్వామి అని ఒకడుండేవాడు...

అతను అంటుండేవాడు-

కుమారస్వామి కుమారస్వామే...
బాబు బాబే...
భగవాన్ భగవానే...
అయ్యోరు అయ్యోరే... అని.

వినడానికి ఆ మాట సరదాగా అనిపించి,
గురువు వద్ద ప్రస్తావించాను...

అవును...కుమారస్వామి చెప్పింది సత్యమే...అన్నారు.

* * *

ఓ సన్న్యాసి యోగసూత్రాలను బోధిస్తున్నారు TVలో-
తన యెదుట వందలాది మంది కూర్చొని వింటున్నారు...

గురువుగారు నా వైపు తిరిగి అతనికి వివాహం అయ్యిందా? అని అడిగారు...

"లేదు" అన్నాను.

"అంతకన్నా దరిద్రపు బ్రతుకు లేదు" అన్నారు.

తన గురువు సన్న్యాసే అయినా,
సన్న్యాస జీవితాన్ని సమర్థించే బోధలు చేయరు గురువుగారు.

ఆధ్యాత్మిక పుస్తకాలు చదివి...
వైరాగ్యం పొంది...
అవివాహితులుగా ఉండి...
స్తబ్ధతగా జీవితాన్ని కొనసాగిస్తున్న చాలామంది యువకులకు వివాహం చేసుకోమని ప్రోత్సహించారు గురువుగారు.

సన్న్యాసమనేది మానసికమైనదేగానీ
అదొక చర్య కాదు అనేది వారి భావన.

మన వేదఋషులందరూ గృహస్థులే.

యోగం అనే నాణేనికి బొమ్మబొరుసు
భోగం-త్యాగం అనేవి.

సన్న్యాసం నువ్వు పుచ్చుకునేది కాదు,
సన్న్యాసమే నిన్ను పుచ్చుకుంటుంది.
అప్పుడే నీవు నిజమైన సన్న్యాసి కాగలవు అంటారు గురువుగారు.

అలాంటి సన్న్యాసి తాతగారు.
మొలకు ఓ టవలు, మెడకు ఓ టవలు...
ఏటిస్నానం, వీధి అరుగులపై నిద్ర...

నిత్య సంచారి, నిత్య ఉపవాసి,

వందేళ్లు ఆరోగ్యంగా బ్రతికారు...

నూటఒకటి వయసులో తనకు తానే ప్రాణం వదిలారు...

జీవితంలో ఎవడికీ తలవంచలేదు...

దేహీ...అంటూ ఎవరి ముందూ చేయి చాపలేదు...

ధనవంతులు, బలవంతులు వారి కంటికి చీమల్లా కనబడేవారు...

ఒకే ఒక శిష్యుడు(సుబ్రహ్మణ్యం)

అతడు జగద్విఖ్యాతుడయ్యాడు...

అక్టోబర్ 18 న తాతగారి ఆరాధన రోజున రెండు తెల్లటి టవళ్లు తెప్పించి, కావిరంగులో ముంచి,

ఆరబెట్టి, మడతబెట్టి పూజలో పెడతారు...

ఆశ్చర్యంగా ఓ వారం లోపునే తాతగారు ఓ సన్న్యాసి రూపంలో వచ్చి గుమ్మంలో నిలుచుంటారు...ఈ కాషాయవస్త్రాలు, దక్షిణ ఇచ్చి నమస్కరించుకుంటారు గురువుగారు.

* * *

ఒకనికే ఉనికి" అంతే.

రెండవదానిని అంగీకరించడమే బంధం.

రెండవదానిని అంగీకరించపోవడమే మోక్షం.

ఆధ్యాత్మికం అంటే-
ఒకే ఒక మాటలో చెప్పాలంటే-
"ఏకం" వైపుకు ప్రయాణం...

ఆ ఏకం "నేనే"

"నేను"కు తప్ప
ఇంకొకటికి, ఇంకొకరికి ఉనికి లేదు.

ఇంకొకటి, ఇంకొకరి ఉనికిని  అంగీకరిస్తున్నావంటే,
నీవు  తెలుసుకోవలసిన దానిని ఇంకా తెలుసుకోలేదనే అర్థం.

"నేనే" కేంద్రం.
"నేనే" విశ్వకేంద్రం.
ఆ వైపుకే పరిగెడుతోంది ప్రతి గ్రహం, ప్రతి నక్షత్రం...
ఆ వైపుకే పడుతోంది నీ ప్రతి అడుగు...
నీకు తెలిసినా, తెలియకపోయినా...

"నేనే కేంద్రం" అంటూ జపించు.
"నేనే కేంద్రం" అంటూ స్మరించు.
"నేనే కేంద్రం" అంటూ ధ్యానించు.

వీలైతే గిరిశిఖరం చేరుకుని
"నేనే కేంద్రం" అంటూ అరచి గీ పెట్టు.

ఇతరులను చంపడానికి కత్తులు, కఠారులు కావాలి...
తన్ను తాను చంపుకోవడానికి చిన్న సూది చాలు...అంటారు రామకృష్ణులు.

ఇతరులకు బోధించడానికే ఇన్ని సూక్తులు...
తనను తాను ఉద్ధరించుకోవడానికి ఒక్క సూక్తి చాలు...

ఆ సూది లాంటి సూక్ష్మమైన, సారమైన సూక్తియే
ఈ "నేనే కేంద్రం" అనే సూక్తి.

"నేనే కేంద్రం" అంటూ
సదా స్మరించండి...తరించండి....

* * *

84. ఉపాసన

---

నిశ్చలంగా ఉన్న నీటికొలనులో
గట్టు మీదున్న చెట్టు ఆకు నుండి
మంచుబిందువొకటి జారిపడింది...
అందులో వలయాలు ఏర్పడ్డాయి...

కేంద్రం నుండి తీరానికి
తీరంనుండి కేంద్రానికి
ఆ వలయాలు ప్రయాణిస్తున్నాయి...

కేంద్రము - పరము.
తీరము - ఇహము.

కేంద్రము నుండి బయలుదేరి తీరాన్ని తాకిన వలయానికి 'జీవుడు' అని పేరు.

తీరం నుండి బయలుదేరి కేంద్రం చేరిన వలయానికి 'దేవుడు' అని పేరు.

* * *

గురుభక్తులందరూ తీరాన్ని తాకి, తిరిగి స్వస్థానమైన కేంద్రం వైపుకు తిరుగు ప్రయాణం చేసే వలయాలు...

తీరం నుండి కేంద్రానికి చేసే ప్రయాణానికే
'ఉపాసన' అని పేరు.

ఇదొక ఆనందకరమైన ప్రయాణంగా మలుచుకునే జీవనవిధానమే ఆధ్యాత్మికం.

* * *

ఉపాసన పలు విధములు-

1. ఇష్టదైవ స్మరణం
2. గిరిప్రదక్షిణం
3. సద్గ్రంథపారాయణం
4. సద్గురు సత్సంగం

మొదలైనవి....

వీటి అన్నింటిలో 'స్వరగంగ' లో మునిగి తేలుతూ సాగే ఆనందకరమైన ఉపాసనే

"అనిలాచల శివమాల పారాయణం".

జ్ఞానప్రసూనాంబికా అవతారులైన సుబ్రహ్మణ్యమ్ గురుదేవులవారు తన సరసుడు అనిలాచలేశుడిపై అక్షరమాలను కూర్చి అలంకరించిన జ్ఞానప్రసూనాల సుమ మాలయే - అనిలాచల శివమాల.

* * *

ప్రక్క ఊళ్లో జరిగే ఉత్సవాలకు వెళ్లి
చీకటి పడేలోపు తిరిగి ఇంటికి చేరుకున్నట్లుగా

ఈ ప్రపంచమనే ఉత్సవానికి మనమందరం వచ్చాం...
తిరిగి స్వస్వరూపమైన పరమపదానికి చేరే ప్రయాణమే ఉపాసన.

* * *

ఉపాసన అంటే-

తనకు లేనిదానిని,

తాను కానిదానిని పొందటం కాదు.

తనకు ఉన్నదానినే,

తానే అయి ఉన్నదానినే

జ్ఞప్తికి తెచ్చుకోవడం...

అనగా సిద్ధిని నెమరువేసుకోవడమే ఉపాసన.

అంతేగాని సిద్ధి కొఱకు ఉపాసన కాదు.

* * *

ఎక్కణ్ణుంచి వచ్చామో తిరిగి అక్కడకు వెళ్లాలని అనిపించడమే - జ్ఞప్తి.

ఆ తిరుగుప్రయాణమే - ఉపాసన.

గమ్యం చేరటమే - సిద్ధి.

కాబట్టి జ్ఞప్తి నుండి అనుభవానికి చేసే ప్రయాణమే ఉపాసన.

* * *

సముద్రజలమే ఆవిరై మేఘమయ్యింది.

చల్లగాలి తగిలి మేఘం వానయ్యింది.

వాన- కొండల్లో కురిసి, వాగుల్లో పొంగి నది అయ్యింది.

నది సాగి సాగి సముద్రంలో కలిసిపోతుంది...

ఎక్కణ్ణుంచి బయలుదేరిందో
తిరిగి తిరిగి అక్కడకే చేరడం  అనేది
ప్రకృతి నియమం.

ఈ నియమమే లేకపోతే
ప్రపంచం చైతన్యహీనమైపోతుంది.

స్వస్థితి నుండి జారి తిరిగి స్వస్థితికి చేరాలనే
జీవుని తపనే ఉపాసన అయ్యింది.

ఉపాసనే లేకపోతే
జీవితం శవసదృశం అవుతుంది.

* * *

ప్రకృతిలో ఒక "నియతి" ఉందనే విషయం అందరూ అంగీకరిస్తారు.

ఆ మహానియతికి త్రిమూర్తులతో సహా
ప్రతి ఒక్కరూ బానిసలే అంటారు గురువుగారు...

ఆ నియతిని మనం అతిక్రమించే వీలు ఉన్నదా?
లేక  దానికి తల ఒగ్గి జీవించవలసిందేనా?
అనేది ఇదమిత్థంగా తేల్చలేని తాత్త్వికవిషయం.

నియతిని స్వప్రయత్నంతో(సాధనతో) అతిక్రమించగలం  అన్నవాళ్లు కర్మయోగులైనారు...

నియతికి తల ఒగ్గాల్సిందే(శరణాగతి) అన్నవాళ్లు
భక్తియోగులైనారు...

'ఆత్మవిచారణ' ను జ్ఞానయోగం అంటారేగానీ,
అది కూడా కర్మయోగమే.

"ఇది చేస్తే, అది దొరుకుతుంది" అన్న భావన ఉన్నవారందరూ కర్మయోగులే.

నిజానికి జ్ఞానం అనేది యోగమూ కాదు, మార్గమూ కాదు.
అదొక సిద్ధ్యావస్థ.

కర్మయోగానికి, భక్తియోగానికి గమ్యస్థానం జ్ఞానం.
జ్ఞానం అంటే స్వస్వరూపం.

* * *

ధ్యానం ఎలా చేయాలి?

సుఖాసనంలో కూర్చొని...
కళ్లు మూసుకుని...
నీ హృదయంలో నీ ఇష్టదైవరూపాన్ని ప్రతిష్ఠించుకొని,
లేదా

గురువు వద్ద పొందిన నామాన్ని(మంత్రాన్ని)
స్మరించుకుంటూ...

తదేకంగా ఆత్మనిష్ఠలో ఉండాలి.

ఇతర ఆలోచనలు కలగడం సహజం.

ఇతర ఆలోచనలు కలిగి, మనసు ఆత్మ నుండి
జారినప్పుడు...ప్రయత్నపూర్వకంగా తిరిగి మనసును ఆత్మవైపుకు
మళ్లించాలి...తప్పదు.

ఇలా చేయగా చేయగా తలపుల బలం తగ్గి

మనసుకు ఆత్మలో నిలకడగా ఉండే శక్తి అంతకంతకు కలుగుతుంది.

కొంతకాలానికి కేవలం తలపులు లేని మనస్సే శేషిస్తుంది.

ఆ తలపులు లేని మనస్సే ఆత్మ అనేది అనుభవమౌతుంది.

అదే ఆత్మసాక్షాత్కారం.

నీవు ఏ రూపాన్ని, ఏ నామాన్ని పట్టుకొని ఉన్నావు అనేదాని మీద కాదు నీ
ఉపాసనాబలం ఆధారపడి ఉండేది...

ఎంత "గాఢంగా" ధ్యానిస్తున్నావు అన్నదాని పైనే ఆధారపడి ఉండేది.

షిరిడిబాబాకు ఓ "ఇటుక" ధ్యానవస్తువుగా ఉండేది.

రమణులకు ఓ "కొండ" ధ్యానవస్తువుగా ఉండేది.

రామకృష్ణులకు ఓ "విగ్రహం" ధ్యానవస్తువుగా ఉండేది.

అవన్నీ ఈరోజుటికీ ఉన్నాయి...
కానీ పొందేవాళ్లే లేరు...

కాబట్టి ఉపాసనాబలం వలన మాత్రమే వారు తరించారు.
కేవలం ధ్యానవస్తువుల వలన మాత్రమే కాదు.

కాబట్టి మనం నివసించే గదిలోనే చక్కగా గురువుగారి చిత్రపటాన్ని పెట్టుకొని ధ్యానిస్తే చాలు...తరించిపోతాం.

సకల దేవతలు కేంద్రీకృతమై ఉన్న స్థానమే
"గురువు" అంటే.

గురువు కన్నా గొప్ప ధ్యానవస్తువు ఇంకేముంటుంది  లోకంలో...?

నదిని దాటడానికి పడవ ఎలా ఆలంబనో
జీవితాన్ని దాటడానికి గురువు అలాంటి ఆలంబనే.

ఓం సద్గురు - శ్రీ సద్గురు - శివ సద్గురు - జయ సద్గురు.

ఇది గురువుగారు శిష్యులందరికీ అనుగ్రహించిన సద్గురుమంత్రం.

* * *

వెతుకుతున్నాము...అంటే,

already మనకు తెలిసిన వస్తువును ఎక్కడో పెట్టి మరచిపోయామన్నమాట...

అస్సలు నీకు తెలియనివస్తువును,

దారబోని వస్తువును నీవు వెతకవు కదా...!

అలాగే ధ్యానం అనేది ఓ వెతుకులాట.

దారబోసుకున్న వస్తువు - ఆత్మ.

ఆత్మ అనేది గతంలో మనదే, మనమే.

మహామాయ చతురత వలన అజ్ఞానం ఆవహించి,

ఆత్మను మరగుపఅచి, నిజమైన ఆనందానికి మనల్ని దూరం చేసింది...

మనదే, మనమే అయిన ఆ ఆత్మవస్తువును జ్ఞప్తికి తెచ్చే ప్రక్రియే - ధ్యానం.

ధ్యానానికి అనుకూలమైనవి -

1. మిత ఆహారం.

2. మిత వ్యవహారం.

ఈ రెండూ పాటిస్తే

నీవు కళ్లు మూసినా, తెరచినా

ధ్యానం కొనసాగుతూనే ఉంటుంది...

అఖండ దీపం వెలుగుతున్నట్లు

అఖండ ధ్యానం జరగాలి...

అప్పుడే ఆ ధ్యానం వలన ప్రయోజనం.

నీవున్న చోటు శక్తి కేంద్రంగా మారుకుంటుంది.

నీ పరిధిలోకి ఎవడొచ్చినా సరే,

అకారణమైన శాంతిని పొందుతాడు...

అదే గుర్తు నీవు ధ్యానయోగివి అనడానికి.

సదా ఆత్మనిష్ఠలో ఉండడమే...

మనం మన గురువుకిచ్చే గొప్ప బహుమానం.

* * *

మనం బాహ్యంలో చేసే ఏ పారాయణమైనా

అది మనల్ని మన లో-లోపలికి తోసే విధంగా స్ఫూర్తినివ్వగలగాలి...

అటువంటి గొప్ప సామర్థ్యమున్న పారాయణ గ్రంథాలు రెండున్నాయి -

1.అనిలాచలశివమాల

2.జ్ఞానప్రసూనాలు

* * *

1.తాత్త్విక చింతన...

2.అంతర్ముఖత్వం...

అనే రెండు చక్రాల బండియే మన  సద్గురు సత్సంగం.
ఒక్కసారి ఎక్కితే చాలు... గమ్యం చేర్చేవరకు ఆగదు.

* * *

85. గురుపౌర్ణమి

---

24-7-2021 * గురుపౌర్ణమి

ఉదయాన్నే తలస్నానం చేసి క్రొత్తబట్టలు ధరించి
సద్గురు సన్నిధికి చేరుకున్నాను ఉదయం 6.45 కు.

దేవీప్రసాద్ స్త్రీ మనస్తత్వాన్ని, వారి విపరీత చర్యలను విమర్శిస్తూ కథలు వ్రాస్తున్నాడు...

"గృహహింస" చట్టం స్త్రీలకే కాదు, పురుషులకు కూడా
వర్తింపచేయాలి...అనేదే అతని వాదన.

"మీ ఇంటావిడ పెట్టే బాధల్ని కథల్లో చొప్పిస్తున్నావా ఏమిరా?' అని తన స్నేహితుడు మునిసురేష్ పిళ్లై కామెంట్ చేసేంతగా రచనలు సాగుతున్నాయి ఈ మధ్య...

నవ్వుకున్నాడు దేవీప్రసాద్...
ఆ విమర్శలో 99.9 % మాత్రమే నిజం ఉన్నందుకు.

కథకు సంబంధించిన మేటర్ ఏదైనా గురువు వద్ద దొరుకుందని "స్త్రీ" ప్రస్తావన తెచ్చాడు దేవీప్రసాద్...

గురువుగారు అద్భుతమైన మేటర్ ను ప్రసాదించారు...

కానీ అది అతని కథకు ఏ మాత్రమూ ఉపయోగపడదు. పైగా స్త్రీని విమర్శించే దిశగా కథలు వ్రాయడం పూర్తిగా మానుకోవలసిన పరిస్థితి కూడా దాపురించింది పాపం ఆ రచయితకు...

గురువుగారు ప్రసాదించిన ఆ దివ్య బోధను

ప్రతి పురుషుడు తలదాలిస్తే, కుటుంబాలన్నీ సుఖసంతోషాలతో వర్ధిల్లుతాయి... అనడం అతిశయోక్తి కాదు...

ఇదిగో ఇదే ఆ మేటరు....

* * *

స్త్రీ నడవడికతో సంబంధం లేకుండా

పురుషుడు స్త్రీని సదా గౌరవించాలి.

ముదిగారమే లేదు...

* * *

స్త్రీ నడవడిక సరి లేదంటే

అది పురుషుల తప్పిదమే.

వేరే మాటే లేదు...

* * *

స్త్రీని గౌరవించడం అంటే
పురుషుడు తనను తాను గౌరవించుకోవడమే

స్త్రీని అవమానించడం అంటే
పురుషుడు తనను తాను అవమానించుకోవడమే.

* * *

శివుడిలో అర్ధభాగం పార్వతి అంటారు.
నిజానికి పార్వతిలో అర్ధభాగం శివుడు.

* * *

ప్రపంచంలో ప్రత్యక్ష దైవం - స్త్రీ.
అందుకే మాతృదేవోభవ అని
స్త్రీకి ప్రధమస్థానం ఇచ్చి గౌరవించారు ఋషులు.

* * *

ఖమ్మం నరేష్ ford car కొన్నాడు క్రొత్తది...

పూజ చేసి, మొదటిసారిగా గురువును అందులో ఎక్కించి, సాయిబాబా గుడి వరకు వెళ్లిరావాలని బయలుదేరాం...నేను, గురువుగారు, నరేష్, వారి సతీమణి, పిల్లలు...

సాయిబాబా గుడి దాటి వెళ్లిపోయింది కారు...

నేనన్నాను...కైకాలవీధి సత్సంగం వఱకు పోనీయ్...అని.

సరే అన్నాడు...

అందరం కైకాలవీధి సత్సంగానికి చేరుకున్నాం...

గురువుగారు సత్సంగానికి వచ్చి ఉన్నారనే వార్త వీధి అంతా క్షణాల్లో తెలిసిపోయింది...

కారణం మా ఆవిడ రమాదేవి...

మా స్థానిక BBC మా ఆవిడ...

గురుపౌర్ణమి రోజున గురుదర్శనం...అని

అందరూ పరుగుల మీద వచ్చి గురుదర్శనం చేసుకుని ఆనందించారు...

మా భారతక్క కూడా పరుగున వచ్చి గురువుగారికి పండ్లు సమర్పించి, నమస్కరించుకుంది...

వారికి ప్రియమైన టీ, సిగరెట్ ఏర్పాటు చేశాము...

'పరమపదం' అధిష్ఠానదైవంగా ఉన్న మా సత్సంగానికి, పరమపదమే మానవరూపం దాల్చి వచ్చిందా...అన్నంత ఆనందపడ్డాడు మురళీ.

ఓ గంట గడిపి, తిరుగుముఖం పట్టాం...

* * *

గుత్తి నుండి భద్రయ్య తన స్నేహితులతో కలిసి వచ్చి గురువుగారిని పూలహారాలతో అలంకరించి పాదపూజ చేసుకుని పులకించిపోయారు...

ఖమ్మం వేంకటనరసయ్య గారు గంధపుచెక్కలతో పాదుకలు చేయించి, వెండి రేకు కప్పించి , అద్దపు పెట్టెలో పెట్టించి... పీఠంతో సహా తయారుచేయించి

గురు సన్నిధికి తెచ్చారు...

గురువుగారి పూజామందిరాన్ని పూలతో చాలా గొప్పగా అలంకరించాడు గురుపుత్రుడు యుగ.

పాదుకలను గురువుగారి పాదాలకు తొడిగి, పూజ చేశారు నరేష్ దంపతులు...

ఫోటోగ్రాఫర్ చురుగ్గా ఫోటోలు తీస్తున్నాడు...

చాలామంది తమకిష్టమైన వారికి వీడియోకాల్ లో ప్రత్యక్షప్రసారం చేస్తున్నారు...

రామమందిరం పెద్దలు మామిడి చెట్టు క్రింద కూర్చొని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు...

నరేష్ పిల్లలు సంతోషంతో ఆడుకుంటున్నారు...

అనామిక "రామపరివారం" హారాన్ని మెడలో ధరించి,
జనకుని సభలో స్వేచ్ఛగా తిరిగే సీతాదేవిలా,
సద్గురు సభలో శోభాయమానంగా అటూ, ఇటూ తిరుగుతోంది...

కానీ గురువుగారు మాత్రం ఏ మాత్రమూ స్పందించక...
ఇదొక దృశ్యం...ఇదొక స్వప్నం...అన్నట్టు నిరామయంగా చూస్తున్నారు...

వేరే ఎవరి పాదాలకో పూజ చేస్తుంటే, తాను చూస్తున్నట్టు సాక్షిగా చూస్తున్నారు...

రకరకాల స్పందనలతో ఉంటారు శిష్యులు...
ఏ స్పందనా లేకుండా ఉంటాడు గురువు...

కానీ శిష్యులు నేర్చుకోవాల్సింది, పొందవలసింది
"దేనికీ ప్రతిస్పందించకపోవడం" అనే విషయాన్నే.

కానీ నేర్చుకోరు...

ఆహా! గురువు స్థితప్రజ్ఞుడు...దేనికీ స్పందించరు...
అంటూ మళ్లీ స్పందిస్తారు శిష్యులు...

యజ్ఞేశ్వరశర్మ గారి సతీమణి మాధురి గారు గురుపాదాల చెంతకు చేరి-

"జ్ఞానమెట్లా కలుగుతుంది?" అని ప్రశ్నించారు...

జ్ఞానం కలుగుతుంది...
కానీ ఎట్లా కలుగుతుందనే విషయాన్ని
ఇంతవరకు ఎవరూ కనిపెట్టలేదు...
అన్నారు గురువుగారు నవ్వుతూ...

మరి మాధురీగారు ఏ భావుకతకు లోనైనారో...?
వారి కళ్ల వెంబటి నీరుకారటం చూశాం...

మనసులో బాధ ఉన్నప్పుడు కారే కన్నీరు వేడిగా ఉంటుంది...ఇది దుఃఖధార.

అసలు మనసే తొలగినప్పుడు కారే కన్నీరు చల్లగా ఉంటుంది....ఇది ఆత్మధార.

భగవన్నామం వినగానే ఎవని కంట కన్నీరు కారుతుందో....వారికి అదే చివరి జన్మ... అన్నారు రామకృష్ణులు.

"ఖం" అంటే ఆకాశం...

ఇతరుల కోసం, ఇతరం కోసం ఏడ్వడం
దుః"ఖం"(చెడ్డ ఆకాశం).

దేవుని కోసం మాత్రమే ఏడ్వడం
సు"ఖం"(మంచి ఆకాశం).

మంచి ఆకాశం అంటే "చిదాకాశం".

* * *

గురుపూజ అవగానే....
దేవుని పటాల ముందు నైవేద్యంగా పెట్టిన
మద్యం, మాంసం రెంటినీ ప్రసాదంగా ఇచ్చారు వేంకటనరసయ్యగారు గురువుగారికి...

సంతోషంతో వాటిని స్వీకరించారు గురువుగారు...

ఈ తతంగం తాతగారు ఉన్నప్పటి నుండి జరుగుతోంది...

అయ్యో...పండుగనాడు మాంసమా? అని  ఆక్షేపిస్తుంటారు కొందరు తెలియనివారు...

"నా దేవుడు తింటాడు..." అంటారు గురువుగారు.

శివుడు రుచీ పచీ లేని ప్రసాదాలు తినీ తినీ విసుగుపుట్టి, మన సత్సంగంలో పెట్టే నైవేద్యాన్ని స్వీకరించడానికే ఉత్సాహం చూపుతాడు...అంటారు సరదాగా.

శివుడికి పందిమాంసం నైవేద్యంగా పెట్టి శివానుగ్రహం పొందిన భక్తకన్నప్ప కథ అందరికీ విదితమే.

నేత్రములిచ్చి జ్ఞాననేత్రమును పొందిన భక్తాగ్రేసరుడు అతడు.

* * *

గురుదర్శనం చేసుకోవడానికి విచ్చేసిన భక్తులందరికీ భోజనాలు ఏర్పాటు చేశారు వేంకటనరసయ్యగారు.

అందరం కలిసి బయట మామిడి చెట్లక్రింద తృప్తిగా భోంచేశాం...

* * *

సాయంత్రం కైకాలవీధి సత్సంగానికి పూలు, స్వీట్సు తీసుకెళ్లాను...

ఇంతలో గుత్తిభక్తులు వచ్చి చాపల మీద కూర్చున్నారు...

ఏవో కొన్ని ఆధ్యాత్మిక సందేహాలను వెలిబుచ్చారు...

జన్మలు-కర్మలు గురించి...అడిగారొకరు...

నేనన్నాను-

జన్మ - కర్మ ఈ రెంటిలో ఏది ముందు?

జన్మ ముందు అయితే,
కర్మ లేకుండా జన్మ ఎలా కలుగుతుంది?

కర్మ ముందు అయితే జన్మ లేకుండా కర్మ ఎలా చేయగలవు? అన్నాను.

అవును...చెట్టు ముందా? విత్తు ముందా?  లాంటి ప్రశ్నే ఇది...అన్నాడతను.

అవును...ఇది అనవస్థాదోషమని చెప్పబడింది వాశిష్ఠంలో...

"జన్మలకు, కర్మలకు కారణం భగవదిచ్ఛ" అనే సమాధానమే చిట్టచివరి సమాధానం. అని చెప్పాను.

పురుష ప్రయత్నము-ప్రారబ్ధము-భగవదిచ్ఛ గురించి ఒకరు అడిగారు...

మన వశంలో లేని ఓ శక్తికి

మనమంతా వశమై ఉన్నాం...

ఆ శక్తి యొక్క ప్రకటనారూపాలకు ఉన్న మూడు పేర్లే -

1.పురుషకారం

2.ప్రారబ్ధం

3.భగవదిచ్ఛ

అందులో నాకిష్టమైన పేరు - భగవదిచ్ఛ.

భగవదిచ్ఛయే పురుషకారంగా, ప్రారబ్ధంగా ఉన్నది అని అంటాను.

మీరు ఆ శక్తిని "ప్రారబ్ధం" అనే పేరుతో పిలుచుకుంటామంటే నాకేమీ అభ్యంతరం లేదు...

అప్పుడు ప్రారబ్ధమే పురుషకారంగా, భగవదిచ్ఛగా ఉంటుంది...అన్నాను.

కర్త వారి వారి ప్రారబ్ధకర్మానుసారంగా జీవులను ఆడిస్తున్నాడు...అని భగవాన్ కూడా ప్రారబ్ధం అనే పదాన్ని వాడారు...అన్నారు ఒకరు...

ఆ భగవాన్ తొలి ఉపదేశానికి వివరణ ఇలా ఇచ్చాను-

కర్త(భగవంతుడు)- కుమ్మరి.

మట్టితో ఏ పాత్రను తయారుచేయాలన్నది ఆయన యొక్క ఇచ్ఛ.

ఆ భగవదిచ్ఛకు మరో పేరే ప్రారబ్ధం.

అంతేగాని ప్రారబ్ధం అనేది 'గత-జన్మ-కర్మ' విశేషం కాదు.

ఆ ప్రారబ్ధమే పాత్రల యొక్క స్వరూప, స్వభావాలను నిర్ణయిస్తుంది.

కర్త జీవులను ఆడిస్తున్నాడు అంటే,
ఆయా పాత్రల స్వరూప స్వభావాలను అనుసరించి భగవంతుడు వాటిని వాడుకోవడమన్నమాట.

జీవుడు కర్త కాదు కనుక,

జరిగే సకలము భగవదిచ్ఛ మేరకే జరుగుతోంది కనుక

జీవుని అసలు పాత్ర మౌనంగా ఉండటమే.

* * *

86. రమ - బాబు - గురువు

---

5-8-2021 * రమ-బాబు పెళ్లిరోజు...

5-8-1992 తిరుమల శంఖుమిట్ట సత్రంలో వివాహం అయ్యింది...

మా ఇద్దరికీ వయస్సు అప్పటికి - 23.

"నీ కొండ మీదే పెళ్లి చేసుకున్నాము...మాకు సంతానం ఇవ్వలేదు..." అని మా ఆవిడ వేంకశ్వరస్వామిని నిందిస్తుంటుంది ఇప్పటికీ...

కాళహస్తిలో పుట్టి పెరిగి, కాళహస్తిలో పెళ్లి చేసుకోలేదని శివయ్యకు కోపం వచ్చి సంతానం ఇవ్వలేదేమో...! అని ఆవిడకు వొళ్లు మండే జోక్ వేస్తుంటాను...

కానీ మా తమ్ముని కూతురు, మా మరదలి కూతుళ్లు ఆమెను "అమ్మా...!" అనే పిలుస్తారు...

కష్టపడకుండానే అమ్మ అయ్యింది....

అంతేకాదు...పెద్ద కూతురుకు పెళ్ళై ఆమె కూతురు ఇప్పుడు అమ్మమ్మా...అని పిలుస్తోంది...

అమ్మమ్మగా ప్రమోషన్ కూడా కొట్టేసింది....

మాకున్నవన్నీ -

బంధం లేని బంధాలు...

బాధ్యతలేని బాధ్యతలు...

* * *

ఈ ఉదయాన్నే 6 గంటలకు నేనూ, రమ శివాలయం వెళ్లాం...

అమ్మను, అయ్యను దర్శనం చేసుకున్నాం.

* * *

అమ్మచేతిలో పుష్పం జ్ఞానవికాసానికి చిహ్నం.

అయ్య సన్నిధిలో రెపరెపలాడే దీపం ప్రాణస్వరూపానికి చిహ్నం.

జ్ఞానాంబ తూర్పుముఖంగా
శివయ్య పడమటముఖంగా
దక్షిణామూర్తి దక్షిణముఖంగా
కొలువై ఉన్నారు.

దాని అర్థమేమంటే-

జ్ఞానాంబ సన్నిధిలో జ్ఞానం ఉదయిస్తుంది.
శివ సన్నిధిలో అహం అస్తమిస్తుంది.
దక్షిణామూర్తి సన్నిధిలో మౌనం ప్రాప్తిస్తుంది.

అందుకే మొదటగా జ్ఞానప్రసూనాంబ దర్శనం చేసుకున్నాకే,
శ్రీకాళహస్తీశ్వరుని దర్శనం చేసుకోవడం ఇక్కడ సంప్రదాయం.
చివరగా దక్షిణామూర్తి సన్నిధిలో కాసేపు మౌనంగా  ధ్యానభంగిమలో
భక్తులు కూర్చొని ఉండడం అనేది ఆ చోటులో నిత్యదృశ్యం.

* * *

ప్రాణం ఉన్న శివలింగం ప్రపంచంలో ఇదొక్కటే.
పంచభూత లింగాలలో ఈ వాయులింగం ఒకటి.

శ్రీ అంటే సాలీడు,
కాళము అంటే సర్పము,

హస్తి అంటే ఏనుగు.

ఈ మూగ జీవుల చేత పూజలందుకున్న కారణంగా ఈ క్షేత్రానికి శ్రీకాళహస్తి అని పేరు వచ్చింది.

ఈ క్షేత్రానికి దక్షిణ కైలాసం, సద్యోముక్తి క్షేత్రం అని కూడా పేర్లు.

భారతదేశంలోనే అత్యంత ప్రాచీనమైన,

పంచభూత లింగాలలో నాలుగవది అయిన

వాయులింగం ఇక్కడ పూజలందుకుంటోంది...

అద్భుతమైన భారతీయ వాస్తు కళకు

ఈ ఆలయ నిర్మాణ శైలి అద్దం పడుతుంది.

శ్రీ కృష్ణ దేవరాయల కాలంలో నిర్మించిన గాలిగోపురం, వెయ్యి కాళ్ల మండపాలు ఆలయంలో ప్రధాన ఆకర్షణలు.

శ్రీకృష్ణదేవరాయల తమ్ముడు అచ్యుతరాయులవారు శ్రీకాళహస్తి ఆలయంలోనే పట్టాభిషేకం చేసుకున్నారు.

పట్టాభిషేకం కోసం నిర్మించిన అచ్యుతరాయ మండపం నేటికీ చెక్కుచెదరక ఉంది.

శ్రీకాళహస్తిలో ఆలయం గర్భగుడిలో ఉండే అన్ని దీపాలు నిశ్చలంగా ఉన్నా శివలింగం ఎదురుగా ఉండే అఖండ జ్యోతి మాత్రం ఎప్పుడూ రెపరెపలాడుతూ ఉంటుంది. వాయులింగంగా కొలువైన స్వామి వారి ఉచ్ఛ్వాస నిశ్వాసముల గాలి కారణంగా దీపం ఎల్లప్పుడూ రెపరెపలాడుతుంది.

ఆంగ్లేయులు గర్భగుడిలోకి గాలి చొరబడకుండా చేసి పరీక్షించారు...

ఆ వాయు దీపాలు ఆరక అలా వెలుగుతూనే ఉన్నాయి...

అంతేకాకుండా ఈ శివలింగానికి మరో ప్రత్యేకత కూడా ఉంది. దేశంలోని అన్ని ప్రముఖ శైవ క్షేత్రాల్లో శివలింగాన్ని తాకి అర్చకులు అభిషేకాలు చేస్తుంటారు. కొన్ని చోట్ల భక్తులకు కూడా ఆ అవకాశం ఉంటుంది.

కానీ ఇక్కడ శివలింగాన్ని మాత్రం అర్చకులతో సహా ఎవరూ కూడా తాకరు. ఈ శివలింగాన్ని ప్రతిరోజూ పచ్చ కర్పూరం కలిపిన జలంతో అర్చకులు తాకకుండానే అభిషేకిస్తారు.

స్వామివారికి బంగారు నవగ్రహకవచం తొడుగుతారు.
అందుకే ఇక్కడ ప్రత్యేకంగా నవగ్రహాలకు గుడి ఉండదు.

స్వామివారిని దర్శించుకుంటే చాలు...
అన్ని గ్రహదోషాలూ నివారింపబడతాయి...

గ్రహబలమేమి? రామానుగ్రహముండగా...
అన్నారు త్యాగరాజు...

మన భక్తిని ఒకే కేంద్రం(విగ్రహం) వైపుకు మళ్ళించినప్పుడు
ఆ కేంద్రం శక్తి కేంద్రమౌతుంది.

సోమవారం శివుడు,
మంగళవారం ఆంజనేయస్వామి,

గురువారం బాబా,
శుక్రవారం అమ్మవారు,
శనివారం వేంకటేశ్వరస్వామి...అంటే...

"మంది యెక్కువ అయితే, మజ్జిగ పల్చన" అన్నట్లవుతుంది.
అటువంటి ఉపాసనలో బలం ఉండదు.

ఒకే బాణం ఒకే భార్య ఒకే దేవుడు...
అనేది నా సిద్ధాంతం.

జ్ఞానాంబయే-

కన్నతల్లి రూపంలో ఉన్నప్పుడు
నేను "శిశువు"గా ఉంటాను.

గురురూపంలో ఉన్నప్పుడు
నేను "శిష్యుడు"గా ఉంటాను.

భార్యరూపంలో ఉన్నప్పుడు
నేను "శివుడు"గా ఉంటాను.

ఇందులో ఘర్షణ పడవలసింది ఏమీలేదు.

నవరసాలుగా ఉండేది దైవమే.
దైవమంటూ ప్రత్యేక రసం ఏమీలేదు.

నవరసాత్మకమైన జీవితాన్ని అనుభవించడమే
జీవిత పరమార్థం.

జీవితానికి ఆవల ఏకరసంగా ఉన్న దైవమే
జీవితంలో నవరసాత్మకంగా ఉన్నది.

జీవించడం చేతగానివాడే పునర్జన్మ గుఱించి ఆలోచిస్తాడు...అంటారు J.K.

అంతేకాదు, మనం దోషాలుగా భావించే కామక్రోధాది అరిషడ్వర్గాలు కూడా
భగవద్విషయంగా అవి యజ్ఞాలుగా మారుకుంటాయి...

కామోత్కంఠత గోపికల్....పోతన పద్యమే ప్రమాణం.

* * *

కామోత్కంఠత గోపికల్
భయమునం గంసుండు
వైరక్రియాసామగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్
సంబంధులై వృష్ణులుం,
బ్రేమన్ మీరలు
భక్తి నేము
నిదె చక్రింగంటి
మెట్లైన నుద్ధామధ్యానగరిష్ఠుఁడైన
హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!

ధర్మరాజా!

కామంతో గోపికలు

ప్రాణభయంతో కంసుడు

విరోధంతో శిశుపాలుడు మొదలైన రాజులు

దాయాదులు అయ్యి యాదవులు

బంధుప్రీతితో మీరు

భక్తితో మేము

నిరంతర స్మరణలు చేసి విష్ణుసాయుజ్యం పొందాము కదా....

ఏ విధంగా అయినా సరే విడవకుండా

ధ్యానించి నారాయణుని పొందవచ్చును...

అంటారు నారద మహర్షులవారు.

* * *

దర్శనం ముగించుకుని దేవాలయం వెలుపలికి  రాగానే అయ్యోరి వద్దకు(గురువుగారి వద్దకు) వెళదాం....అంది రమ.

పెళ్లయి ఇన్నేళ్లలో  ఆమె అలా అనడం ఇదే తొలిసారి...

పూలు, ప్రసాదం తీసుకొని ఆటోలో వెళ్లాం...

ఇద్దరం కలిసి గురుసన్నిధిలో కూర్చోవడం అనేది కూడా ఇదే తొలిసారి.

ఈ గురువు, ఈ జ్ఞానాంబ, ఈ ఆధ్యాత్మికం అనే విషయాలను వ్యక్తిగతమైన విషయాలుగానే ఉంచుకున్నానేగానీ,  యేనాడూ ఆవిడతో

నేను పంచుకోలేదు.

ఆమెకు కేవలం "మంచి మొగుడు" గా కనబడితే చాలు....అనేది నా అభిప్రాయం.

షాప్ లో వ్యాపారస్థుడుగా ఎలా ఉంటానో
ఆమెకు తెలియదు...

గురువు వద్ద శిష్యుడిగా ఎలా ఉంటానో
ఆమెకు తెలియదు...

అంతెందుకు...నేను 26 ఆధ్యాత్మికగ్రంథాలు వ్రాశాననే విషయంగానీ, ఆధ్యాత్మికవ్యాసాలు వ్రాస్తున్నాననే విషయంగానీ ఆమెకు తెలియనే తెలియదు.

మొదటి పుస్తకం అచ్చయిన ఆనందంలో
ఒకే ఒకసారి ఆవిడకు చూపెట్టా...

"ఆఁ...ఎవడి పిచ్చి వాడికి ఆనందం" అంది...

ఆ కామెంట్ నాకు ఎంతో సంతోషాన్నిచ్చింది...
కారణం- అది సత్యవాక్కు కాబట్టి.

నిజంగా ఆధ్యాత్మికం-లౌకికం అనేదంతా పిచ్చే....
రామకృష్ణులు అన్నట్టు....ఇది "మంచి పిచ్చి" అంతే.

* * *

నిన్న ఒకరు అడిగారు-
ఆధ్యాత్మికసాధనల వలన మన లౌకిక సమస్యలు తొలుగుతాయా? అని.

"తొలగవు" అని కచ్చితంగా చెప్పా...
గొడుగు వర్షాన్ని ఆపలేదు, నిన్ను తడవకుండా చేస్తుంది...
అంతే ఈ ఆధ్యాత్మికం కూడా...
నిన్ను సుఖదుఃఖాలకు అంటకుండా చేస్తుంది... అంతే.

* * *

ఏ సమయానికి తటస్తించిన పరిస్థితిని
ఆ సమయానికి వాటిని భగవత్ప్రసాదంగా స్వీకరించడమే తప్ప
మానవుడు ప్రకృతిని యెదిరించి సాధించింది కూడా ఏమీలేదు...
మనశ్శాంతిని పోగొట్టుకోవడం తప్ప.
అన్నిటికీ సిద్ధపడి ఉండడమే  మహాసిద్ధి.

* * *

ధర్మంతో ముడిపడిన అర్థం,
ధర్మంతో ముడిపడిన కామం
సుఖప్రదములు...
మోక్షదాయికములు...

రామకృష్ణుల తండ్రిగారు కామినీని వదిలి ఉంటే
లోకంలోకి రామకృష్ణులు ఎలా అవతరించి ఉండేవారు?

రామకృష్ణమఠంవారు కాంచనం వదిలి ఉంటే ప్రపంచంలో ఇన్ని మఠాలు, ఇన్ని  సేవాకార్యక్రమాలు ఎలా సాధ్యమయ్యేది?

కామినీ అంటే స్త్రీ అని,
కాంచనం అంటే ధనం అని
అనుకుంటే పొరపాటే.

నేను అనే అహంకారం - కామిని.
నాది అనే మమకారం - కాంచనం.

అహంకార, మమకారాలను వదలటమే కామినీకాంచనములను వదలటం అంటే.

* * *

సూది రంధ్రంలో నుంచి ఒంటె అయినా దూరిపోతుందేమోగాని, ధనవంతుడు యెప్పటికీ పరలోకరాజ్యంలోకి ప్రవేశించలేడు...అని క్రీస్తు అంటే, దాని అర్థం- పేదవాళ్లు సులభంగా పరలోకరాజ్యంలోకి ప్రవేశిస్తారు అని కాదు.
ధనానికి ప్రాధాన్యత ఇచ్చేవాడు...అని అర్థం.

భగవంతునికి ప్రాధాన్యత ఇవ్వకుండా,

ధనానికి ప్రాధాన్యత ఇచ్చేవాడు ధనవంతుడు; వాడు పేదవాడైనా సరే.

ధనానికి ప్రాధాన్యత ఇవ్వకుండా,
భగవంతునికి ప్రాధాన్యత ఇచ్చేవాడు మాత్రమే
పరలోకరాజ్యంలోకి(మోక్షంలోకి) ప్రవేశిస్తాడు.

* * *

తల్లిదండ్రులను ఆదరించు...
భార్యను ప్రేమించు...
బిడ్డలను లాలించు... పాలించు...
ఇవన్నీ బంధాలు కావు...

దేనికీ, ఎవరికీ ప్రాధాన్యత ఇవ్వకుండా వ్యవహరించు.

వ్యవహారం వదలొద్దు...
ప్రాధాన్యత ఇవ్వొద్దు...

ప్రాధాన్యతే ఇవ్వడమే బంధం.
ప్రాధాన్యత ఇవ్వకుంటే మోక్షం.

దేనికీ ప్రాధాన్యత ఇవ్వకుండా వ్యవహరించినప్పుడు సుఖదుఃఖాలు నిన్ను అంటవు.

దేనికీ ప్రాధాన్యత ఇవ్వనప్పుడు

నిజంగా ఏది ప్రాధాన్యత కలిగిన వస్తువో
నీకు తెలియకుండానే
ఆవైపుకే నీ అడుగులు పడతాయి...

* * *

ఈరోజు గురువు వద్దకు వెళ్లారా...?
సబ్జక్టు ఏమైనా జరిగిందా...?
ఆర్టికల్ వ్రాశారా...?
అని అడుగుతూ ఉంటుంది మా అనామిక.

అనామికా...!
ఈ వ్యాసం నీకే అంకితం....

* * *

## 87. ఆత్మ - విచారం

---

6-8-2021 * గురువారం

నిన్న మధ్యాహ్నం నుంచి నన్ను "విచారం"
ఆవహించింది....అకారణంగా...

దానిని మరొకరితో పంచుకుందామంటే

అసలు దానికి 'కారణం' అనేది ఉంటేగా?
ఏమని చెప్పుకోవడం? ఏమని పంచుకోవడం?

పైగా ఈ ఆధ్యాత్మికంలో దాదాపుగా
నేను ఒంటరివాడిని...
ఈ ఆధ్యాత్మికంలో నా ఏకైక స్నేహితుడు
నా గురువే...

ఈ ఉదయం గురుసన్నిధికి వెళ్లి వారి పాదాల వద్ద మౌనంగా ఓ గంట కూర్చుని వచ్చాను...

ఈ అకారణమైన విచారం తొలగలేదు...
తొలగాలని కూడా నేను భావించలేదు...
నా నిత్యవ్యవహారానికేమీ భంగం లేదు...

మధ్యాహ్నం మా భారతక్క వద్దకు వెళ్లాను...
ఈరోజు మా అక్క పెళ్లిరోజు...
స్వీట్స్, సేవరీ తీసుకెళ్లా...

గిన్నెలో సాంబార్ అన్నం వేసి ఇచ్చింది...
తిన్నాను....
అవీ ఇవీ పిచ్చాపాటి మాట్లాడుకున్నాం...
మా బావ Rtd  Sub-Registrar Officer...
ఇంట్లో లేడు...

తిరుపతికెళ్లాడు ఏదో ఆఫీసు పనిగా...

ఓ గంట గడిపి, మాషాప్ కు వచ్చేశాను...

ఇంతలో... వాట్సప్ లో....ఓ మెసేజ్...

ఎవరా? అని చూస్తే మా అమ్మ లీలగారి మెసేజ్

ఇలా ఉంది -

"ప్రకృతిలోని ప్రతి వస్తువూ పరమాత్మ యొక్క దివ్యరూపమే...

కనుక, దుఃఖం కూడా పరమాత్మ  సుందర స్వరూపమే...

కాయ పక్వమై పండుగా మారినట్లు,

దుఃఖం పరిపక్వమై సుఖంగా మారుతుంది.

సుఖదుఃఖాలు రెండూ భగవంతుని పెదవుల నుండి

జాలువారిన ద్వంద్వాక్షర సుందర పదపారిజాతాలు."

అమ్మ సందేశం నా అకారణ విచారానికి ఇచ్చిన అద్భుతమైన సమాధానంలా అనిపించింది...

ఇంతలో అమ్మ నుంచి మరో మెసేజ్ -

"ఎందుకో మీరు  డల్ గా ఉన్నట్టు అనిపిస్తోంది...

నిజమేనా?"

ఈసారి మరీ ఆశ్చర్యపోయాను...

"మీకెలా తెలుసు?" అని అడిగాను...

"అమ్మను కదా...!" అంది.

ఆహా...! ఈసారి నేను "పర"వశం చెందాను...
ఆ తల్లి ప్రేమకు...

"అవునమ్మా! అకారణంగా ఏదో బాధకు లోనవుతుంటాను అప్పుడప్పుడు...
యెంత వెతకినా దానికి ఏ కారణమూ ఉండదు...అన్నాను.

"అది సహజం మనలాంటివాళ్లకి" అంటూ ఓదార్చింది అమ్మ.

"బహుశా ఆ విచారం నాకు అవసరమేమో...
అలాంటి సమయాల్లో గుహలో ఏకాంతంగా గడిపే ఋషిలా మౌనంగా ఉండిపోతాను..." అన్నాను.

"share చేసుకోవచ్చుగా..." అంది అమ్మ.

"షేర్ చేసుకోవడానికి అక్కడ  ఏమైనా ఉంటేగా...
నావన్నీ ఉత్తుత్తి బాధలే....ఉత్తుత్తి సుఖాలే..." అన్నాను.

అసలు జీవుని ఉనికే ఉత్తుత్తిది...
వాని సుఖదుఃఖాలు...బంధమోక్షాలు...
అన్నీ ఉత్తుత్తివే.

"అన్నీ ఉత్తుత్తివే" అని గ్రహించినవాడొక్కడే నిజం.
ఆ గ్రహించినవాడు  'బాబు' అయ్యే అవకాశం లేదు.
అది కేవలప్రజ్ఞ...అది కేవల గ్రహింపు...అంతే.

* * *

"ఆ అకారణ విచారంలోనే,
ఆ మౌనంలోనే ఏవేవో పిచ్చివ్రాతలు వ్రాసేస్తుంటాను....
అవే ఆర్టికల్స్ గా వస్తున్నాయి మీకు నా నుంచి..."
అన్నాను.

"అవి పిచ్చి వ్రాతలు కావు...
మంచి స్ఫూర్తినిచ్చే ఆర్టికల్స్..." అంది అమ్మ.

అంతే కాబోలు...ఈ వ్రాతలు ఎవరికో అవసరమై ఉండి, నన్ను విచారంలో నెట్టి వ్రాయిస్తున్నది జ్ఞానాంబ.

"ఏది జరిగినా మన ప్రమేయం ఉండదు.
అంతా భగవంతుని ఇచ్ఛ..."అంది అమ్మ.

"అవును ఈ అకారణ విచారం కూడా భగవదిచ్ఛే" అన్నాను.

* * *

ఇలాగే బ్రహ్మ కూడా తన ఇచ్ఛ మేరకు...

తన సంకల్పశక్తిచేత వశిష్ఠుణ్ణి పుట్టించాడు...
వశిష్ఠుడు పుట్టుకతోనే పూర్ణజ్ఞాని....
కానీ లోకుల కష్టసుఖాలు వశిష్ఠునికి తెలియాలనే అభిప్రాయంతో-
"నీ మనసు ఆవిరి తగిలిన అద్దము వలె ఒక ముహూర్తకాలము
అజ్ఞానమున ప్రవేశించుగాక...అని శాపం ఇస్తాడు...

ఆ శాపఫలితంగా అకారణంగా వశిష్ఠుడు విచారగ్రస్తుడౌతాడు...

అప్పుడు బ్రహ్మ తన కుమారుణ్ణి దగ్గరకు తీసుకుని... ఈ విచారము
తొలగడానికి ఉపాయమును నన్ను అడుగరాదా? అని అడిగి మరీ
బ్రహ్మజ్ఞానాన్ని బోధించి, వశిష్ఠుని విచారాన్ని పోగొడుతాడు బ్రహ్మ.

అదంతా ఉద్దేశపూర్వకంగానే జరిగింది
ఆ శాపం, ఆ విచారం, ఆ ప్రబోధం...

బ్రహ్మ తనకు బోధించిన ఆ ప్రబోధాన్నే
వశిష్ఠుడు తిరిగి శ్రీరాముడికి ప్రబోధిస్తాడు...
అదే "యోగవాశిష్ఠం".

వశిష్ఠుడు అంటే...
విశిష్ఠమైన వస్తువునెఱిగి,
బోధించగల సమర్థత కలిగినవాడు
అని అర్థం.

విశిష్ఠమైన వస్తువును ఎఱుగడానికి,

తిరిగి లోకానికి ప్రబోధించడానికి విచారం యొక్క రుచి తెలిసుండాలేమో...

ఆత్మవిషయమై దీనులైనవారు ధన్యులు.
పరలోకము రాజ్యము వారిదే...అన్నారు క్రీస్తు.

ఆత్మలబ్ధికి మార్గం ఆర్తి అన్నారు భగవాన్...
ఆర్తి అంటే విచారమే...

ఆ విచారమే అళగమ్మ బిడ్డను
మహర్షిగా మార్చేసింది...

ఆ విచారమే గౌతమీతనయుణ్ణి
బుద్ధుడుగా మార్చేసింది...

ఆ విచారమే అర్జునుణ్ణి
మోహవిముక్తుణ్ణి చేసింది...

విచారం, ఆత్మవిచారంగా మారుకోవడమే
విచారం యొక్క పరమప్రయోజనం.
విచారం అనేది శుభలక్షణమే ఈ ఆధ్యాత్మికంలో...

* * *

"జ్ఞానాంబ లీల"లో భాగం...మా లీలమ్మ పరిచయం.
అమ్మా...! ఈ వ్యాసం మీకు అంకితం...

* * *

88.  నీవు లేవు అని తెలుసుకో...

---

8-8-2021 * ఆదివారం

ఈ ఉదయాన్నే 5.30 కు  నేనూ దేవీప్రసాద్ శివాలయం వద్ద ఉన్న కేరళా అంగడి వద్దకు చేరుకుని వేడివేడిగా ఛాయ్ త్రాగి, గురువు వద్దకు బయలుదేరాం...

గురువుగారి వద్దకు వెళ్లడం అంటే, చాన్నాళ్లు బయటూరిలో ఉండి, ఈరోజే స్వంతూరికి వెళుతున్నంత ఉత్సాహంగా ఉంటుంది మాకు...

5.45కు సద్గురు సన్నిధికి చేరుకున్నాం...
హరి, వేణు ఉన్నారు...
వేణు టీ పెట్టిచ్చాడు అందరికీ...

* * *
గురుదర్శనానికి
నిన్న ఒంగోలు నుంచి శ్రీను వచ్చాడు కారులో...
నన్ను కూడా తీసుకెళ్లాడు దారిలో...

తాతగారు మన గురువుగారితో  పదే పదే చదివించుకుని విన్న బ్రహ్మంగారి పుస్తకం మా సత్సంగం నుండి తీసుకెళ్లాడు గతంలో శ్రీను.

తిరిగి ఇవ్వాలనే నిబంధన పెట్టానేగానీ,
ఆ నిబంధనలో 'బలం' లేదనిపించింది అప్పుడే.

మా "అత్యాశ్రమం" ప్రారంభోత్సవంలో గురువుగారు ఇంటినుండి ఆ బ్రహ్మంగారి పుస్తకాన్ని తెచ్చి ఇక్కడ ఉంచారు...గురుపరంపరకు సంబంధించిన ఓ జ్ఞాపిక ఒకటి ఇక్కడ ఉండాలనే ఉద్దేశంతో...

బాబుయే ఓ ప్రాచీన అవశేషం...
బాబు రచనే ఓ జ్ఞాపిక ఈ లోకానికి...
అని బాబుకు ఫీలింగు...

అందుకే ఈ జ్ఞాపికల మీద నాకు వ్యామోహం లేదు మొదట్నుంచి...

* * *

గురువు వద్దకు కారులో వెళుతుండగా చెప్పాడు శ్రీను...
"అమ్మమాల"తో దీక్ష తీసుకుంటున్నాను కార్తికమాసం వఱకు...అని.

ఇది శుభ సమయం అనిపించి -
"ఆ బ్రహ్మంగారి పుస్తకాన్ని మీ వద్దనే ఉంచేయండి"
అన్నాను...
శ్రీను సంతోషంతో కృతజ్ఞతలు తెలిపాడు...

"అది తాతగారి స్పర్శ పొందిన పుస్తకం...

కాబట్టి దానికి మంచి పెట్టె ఒకటి తయారుచేసి ఉంచండి పూజామందిరంలో..."అన్నాను.

"సరే" అన్నాడు...

* * *

గురుస్పర్శ పొందిన "జ్ఞాపికలు" ఇప్పుడు ఏడున్నాయి వివిధ ప్రాంతాలలో...

1. వీరయ్యగారి చేతికర్ర - శంభూప్రసాద్ ఇంట్లో(శ్రీకాళహస్తి)

2. సద్గురు చేతికర్ర - అత్యాశ్రమంలో(శ్రీకాళహస్తి)

3. సద్గురు పాదుకలు - సుబ్బులక్ష్మి ఇంట్లో(రాచపల్లి)

4.సద్గురు పాదుకలు - వేంకటనరసయ్య ఇంట్లో(ఖమ్మం)

5. సద్గురు పాదుకలు - త్రిపురాంబ ఇంట్లో(విజయవాడ)

6. సద్గురు పాదుకలు - పట్టెయ్య ఇంట్లో(తణుకు)

7. తాతగారి "బ్రహ్మంగారి జీవితచరిత్ర" పుస్తకం - శ్రీను(ఒంగోలు)

ఇప్పుడు ఈ ఏడు చోట్లు గురుభక్తులకు ఏడు పవిత్ర క్షేత్రాలు...సప్తజ్ఞానభూమికలు....

* * *

గురువుగారు టీ త్రాగుతూ -

శ్రీను ఆగస్టు 24 న వస్తానన్నాడు...
24 నే రావాలని ఏముంది?
ఎప్పుడైనా రావొచ్చు...అని అన్నానని...అన్నారు.

* * *

గురువుగారు తన ప్రబోధామృత వర్షాన్ని కురిపించడానికి సంసిద్ధమైనారు...

నా వైపు తిరిగి -

"టైం వేస్ట్ చేశాడు...అని అంటుంటారు కదా...!
నిజానికి టైం అనేదే వేస్టు...అన్నారు.

అద్భుతం అనిపించింది ఆ మాట...
కాలంలో కాలాతీతుడు ఈ గురువు...
కాబట్టే ఆ మాట అనగలిగారు.

నిజమేగా...
కాలమనేది గ్రహాలు, నక్షత్రాల ఆధారంగా సాపేక్షంగా మనం తయారుచేసుకొన్న ఒక ఊహాత్మకమైన వ్యవస్థే తప్ప కాలమనేదానికి అస్సలు ఉనికే లేదు కదా!

* * *

నేనెవడను? అని తెలుసుకో అని
భగవాన్ అంటే దాని అర్థం -

కుర్చీ 'ఉన్నది'
మంచం 'ఉన్నది'
శరీరం 'ఉన్నది'
ఇల్లు 'ఉన్నది'

'ఉన్నది' యే సకలంగా ఉన్నది.

లేకున్నది అంటే లేదని కాదు...
లేక "ఉన్నది" అని అర్థం.

ఉన్నది రెండురకాలుగా ఉన్నది -
1.ఉన్నట్లుగా
2.లేనట్లుగా

ఉన్నట్లుగా, లేనట్లుగా
ఉన్నది ఏదో "అదే నేను".

ఉండి లేనట్లు ఉండేది ఆకాశం
లేకనే ఉన్నట్లు ఉండేది ప్రపంచం.

గ్రహాలు, నక్షత్రాలు ఇవేవీ లేనప్పుడు
ఏముంటుందో "అదే నేను".

కాబట్టి నేనెవడను? అన్నదానికి సమాధానం -
ఉన్నది - ఏదో - అదే - నేనుగా - ఉన్నది.

* * *

నేనెవడను? అని భగవాన్ ప్రశ్నించలేదు...
అదొక పూర్ణమైన సమాధానంగానే అనుగ్రహించారు ఈ లోకానికి... "నేను - ఎవడను" అని.

"ఎవడు" కు
క్వచ్చన్ మార్క్ పెడితే ప్రశ్న.
ఫుల్ స్టాప్ పెడితే అదే సమాధానం.

వాక్కుకు, మనసుకు అందక ఉన్నవాడు "ఎవడో"
వాడి పేరు కూడా అదే  "ఎవడు" అనేదే.
కాబట్టి "ఎవడు" అనేది నామవాచకం.
"ఎవడు" అనేదే నేను.

* * *

Who Am I ?  అనే ప్రశ్నకు

Iam 'Who'. అనేదే సమాధానం.

* * *

అమ్మ ఒళ్లో నుంచి బ్రహ్మ బళ్లో చేర్పించాడు పరమేశ్వరుడు బాలసుబ్రహ్మణ్యణ్ణి.

ఓం...అంటూ చదువు చెప్పడం మొదలు పెట్టాడు గురుబ్రహ్మ.

ఆగు అక్కడే...
ముందు "ఓం" అంటే అర్థం చెప్పు అన్నాడు
ఆ జ్ఞానశిశువు.

మౌనం వహించాడు ఆ గురువు.

ఖైదు చేశాడు బ్రహ్మను ఆ తుంటరి.

శివుడు పరుగెత్తుకొచ్చాడు...
తప్పు నాన్నా...! గురువును అలా చేయకూడదు...అన్నాడు కుమారస్వామితో.

అయితే నువ్వు చెప్పు ఓం అంటే ఏంటో...అన్నాడు.

"నాకు తెలియదు...నీకు తెలిస్తే చెప్పు" అన్నాడు శివుడు.

చెప్పేవాడు పైనుండాలి,

వినేవాడు క్రింద ఉండాలి...

క్రింద కూర్చో చెబుతా... అన్నాడు సుబ్రహ్మణ్యుడు.

కుమారునిపై మితిమీరిన వాత్సల్యంతో శివుడు మోకాలిపై కూర్చొని, వొంగి చెవి ఒగ్గాడు...

శివుని చెవిలో ఓంకార రహస్యాన్ని ఉపదేశించాడు ఆ బాల మురుగడు.

ఆ రహస్యం ఏమనేది ఇప్పటి వఱకూ తెలియదు లోకానికి.

కానీ జ్ఞానప్రసూనాంబికావతారులైన మన గురుదేవులవారికి
శివకుమారుడు చెప్పిన

ఆ రహస్యాన్ని శివుడు చెప్పకుండా ఉంటాడా?

చెప్పాడు...

జ్ఞానాంబ ఆ రహస్యాన్ని

తిరిగి మాకు వెల్లడి చేసింది...

సద్గురు(వాక్)రూపంగా...

ఆ కార్తికేయుడు శివుని చెవిలో చెప్పిన

ఆ ఓంకారార్థ రహస్యమిదే -

లో-వెలి నిండి,

లో-వెలి లేక

ఉన్న ఓ సద్గురు స్వామి శివా!

నీలో నేనున్నాను.

నాలో నీవున్నావు.

* * *

భవబంధం అంటే ఏమి? అని ప్రశ్నించాడు దేవీప్రసాద్.

నేను పుట్టాను అనుకోవడం బంధం.

నేను పుట్టలేదనుకోవడం మోక్షం.

అన్నారు గురువుగారు.

మోక్షం కలదనుట - బంధం.

బంధం లేదనుట - మోక్షం.

గోధూళి వేళ గో-పొలం నుండి తిరిగొచ్చిన

గోవును కట్టేయడానికి సమయానికి పలుపు కనబడలేదు...

కానీ ఆ గొల్లవాడు దాని మెడను పలుపుతో చుట్టి, ఓ గుంజకు కట్టేసినట్టు నటించాడు.

ఆ పశువు తనను కట్టేశారనే భ్రాంతిలో

పొద్దున వరకు కదలక అక్కడే పడి ఉంది.

పొద్దున మళ్లీ అతడు పలుపు విప్పినట్టు యాక్షన్ చేశాడు...ఆవు మేతకు బయలుదేరింది...

అలాంటివే మనం అనుకునే బంధ-మోక్షాలు కూడా...

బంధం ఉండేది
నిజానికి ఉండి కాదు
ఉంది అనుకోవడం వల్ల.

బంధం ఉంది అని చెప్పేవాడూ అజ్ఞానే.
బంధం లేదు అని చెప్పేవాడూ అజ్ఞానే.
జ్ఞాని ఏమీ చెప్పడు.

* * *

గురువుగారు నా వైపు చిరునవ్వుతో చూస్తూ ఇలా ముఖ్యోపదేశం చేశారు -

బాబు తెలుసుకోవాల్సిన ముఖ్య విషయం ఏమంటే-
"బాబు అనేవాడే అసలు లేడు" అని...

బాబే లేడని బాబు తెలుసుకున్నాక
ఇక బాబు తెలుసుకునేది ఏముండాది? అన్నారు...

నేను ఉన్నాను అని ఉన్నవాడు - జీవుడు.
నేను లేను అని ఉన్నవాడు - దేవుడు.

ఉన్నవారిలో నేనొక్కణ్ణి అని ఉన్నవాడు - జీవుడు.

ఉన్నది నేనొక్కణ్ణే అని ఉన్నవాడు - దేవుడు.

గురువు ఉండాడు అనుకునేవాడు శిష్యుడు.

గురువు లేడు అనుకునేవాడు గురువు.

ఉంది అనుకునేవాడు - గురువు.

లేదు అనుకునేవాడు - శిష్యుడు.

లేనిదానిని ఇచ్చేవాడు - దాత.

ఉన్నదానినే ఇచ్చేవాడు - గురువు.

* * *

ఉన్నదంతా నా పైన ఉందనుకో లేదా

ఉన్నదంతా నా క్రింద ఉందనుకో...

ఉన్నదంతా నా వెనుక ఉందనుకో లేదా

ఉన్నదంతా నా ముందు ఉందనుకో...

సమస్య తీరుతుంది...అన్నారు.

* * *

ఇంతలో పనిమనిషి లక్ష్మి చీపుర  పట్టుకొచ్చి,

అందరూ బయటకెళ్ళండి...ఊడ్చేస్తాను...అంది.

విన్నదంతా వినేవానితో(బాబుతో) సహా ఊడ్చిపారేయండి...
అన్న బోధ నా అంతరాంతరాలలో వినబడింది...

లేచి, గురువు వద్ద శెలవు తీసుకున్నాం...

* * *

## 89.  నా స్వస్థానం - గాఢనిద్ర

---

నాకు సత్యం తెలియబడితే,
నా కుటుంబానికి ఏమైనా మేలు ఉంటుందా?
అని అడిగారు శ్రావణిగారు.

* * *

నా కల నుండి నేను మేలుకుంటే,
నా కలలో ఉన్నవారికి ఏదైనా మేలు ఉంటుందా? అని ప్రశ్నించడం లాంటిదే.
'మేలు' పొందటానికి అసలక్కడ ఎవరూ ఉండరు.

సత్యసాక్షాత్కారం అంటే-
"మెలకువ నుండి మెలకువ."
ఈ నిజమైన మెలకువలో 'నేను'కు తప్ప

ఎవరికీ, దేనికీ ఉనికి ఉండదు.

నేను అంటే శ్రావణీ అని కాదు.
శ్రావణీ కూడా కలలో భాగమే.

నిజానికి కల-మెలకువలు రెండూ - అసత్యమే(కలే).

గాఢనిద్ర ఒక్కటే - సత్యం(నిజమైన మెలకువ)

కల,మెలకువలో కలిగే సమస్యలకు
కల, మెలకువలోనే పరిష్కరించుకోవాలి.

సత్యసాక్షాత్కారం అనేది గాఢనిద్ర వంటిది.
అక్కడ "నేను" అన్న పరమానందకరమైన
ఎఱుక తప్ప మరే సమస్యా ఉండదు.

సత్యసాక్షాత్కారంలో(అనగా గాఢనిద్రలో)
ప్రపంచమూ ఉండదు, కుటుంబమూ ఉండదు.

* * *

అజ్ఞాని-
తన స్వస్థానం మెలకువ అని,
అప్పుడప్పుడు నిద్రలోకి వెళ్లి వస్తుంటానని
అనుకుంటాడు.

జ్ఞాని-
తన స్వస్థానం గాఢనిద్ర అని,
అప్పుడప్పుడు కల,మెలకువలోకి వచ్చిపోతుంటాను అని ఉంటాడు.

* * *

అజ్ఞాని -
ఎఱుక లేకుండా మెలకువలోకి(ప్రపంచంలోకి) జారుతాడు.
తిరిగి ఎఱుక లేకుండా గాఢనిద్రలోకి(స్వరూపంలోకి)వెళతాడు.

జ్ఞాని-
సంపూర్ణ ఎఱుకతోనే మెలకువలోకి(ప్రపంచంలోకి) జారుతాడు.
తిరిగి ఎఱుకతోనే గాఢనిద్రలోకి(స్వరూపంలోకి) వెళతాడు.

అందువల్లనే -

అజ్ఞాని మెలకువను "ఇల" అన్నారు.
జ్ఞాని మెలకువను "కల" అన్నారు.

అజ్ఞాని నిద్రను - మైమరపు అన్నారు.
జ్ఞాని నిద్రను - మెలకువ అన్నారు.

అజ్ఞాని రాకడను - జన్మించడం అన్నారు.
జ్ఞాని రాకడను - అవతరించడం అన్నారు.

అజ్ఞాని పోకడను - నిర్యాణం అన్నారు.
జ్ఞాని పోకడను - నిర్వాణం అన్నారు.

నిద్ర-మెలకువ
రాకడ-పోకడ
ఇద్దరికీ సమమే.
"ఎఱుక" ఒక్కటే తేడా.

* * *

కలలు మెలకువలు కలయని ఎరిగిన
మెలకువ తానే అనిలాచలా!
అన్నారు మన గురువుగారు.

ఇది మెలకువలో ఉండవలసిన ఎరుక.
ఇది సాధన.

"ఎఱుక మరచు చోట ఎఱుగుట బ్రహ్మంబు" అన్నాడు మనవేమన.

ఎఱుక మరచు చోటు - నిద్ర.
నిద్రలో నేనున్నాను అన్న ఏఱుక తోడైతే అదే బ్రహ్మము.

ఇది నిద్రలో ఉండవలసిన ఎరుక.
ఇది సిద్ధి.

* * *

ఎరుక లేని నిద్ర - మామూలు నిద్ర - జడం.
ఎరుకతో కూడిన నిద్ర - గాఢనిద్ర - చైతన్యం.

ఈ ఎరుకతో కూడిన నిద్రకే తురీయం అని శాస్త్రీయనామం.

* * *

జ్ఞానికి ఈ కల, మెలకువలు విహారస్థానాలు.
విహారం పూర్తయ్యాక,
తన తనువుతో సహా అన్నిటినీ విడిచిపెట్టి
తన స్వస్థానమైన గాఢనిద్రలోకి(స్వరూపంలోకి) వెళ్లిపోతాడు.

అక్కడ "రెండు" లేని "ఒకటి"గా ఉంటాడు.
ప్రశ్న లేని "సమాధానం"గా ఉంటాడు.
లో-వెలి లేని "బట్టబయలు"గా ఉంటాడు.

* * *

జ్ఞానికి-
"కల-మెలకువ-నిద్ర" అనేది - విహారం.
గాఢనిద్ర అనేది - స్వరూపం.

రండి...అందరం గాఢనిద్రలో  "ఏకం" అవుదాం...

* * *

90.   1  (ఒకటి)

---

20-8-2021 * శ్రావణశుక్రవారం

ఈ ఉదయాన్నే 5.45 కు గురుసన్నిధికి చేరుకున్నాం నేనూ, దేవీప్రసాద్.

గురువుగారి ఆంతరంగిక సేవకుడు వేణుగారు
"టీ"  ఇచ్చాడు అందరికీ....

గురువుగారు టీ సిప్ చేస్తూ ఉన్నారు-

నేను UG గారి మాటనొకటి  గురువుగారికి చూపించాను నా ఫోన్ లో...
అదేమంటే-
"సద్గురువనేవాడు నిజంగా ఉంటే
ముందు తన నుంచి ముక్తుణ్ణి చేస్తాడు."

గురువుగారు చదివి... ఇలా సవరించారు-
"సద్గురువనేవాడు నిజంగా ఉంటే
ముందు తన నుంచి తనను ముక్తుణ్ణి చేస్తాడు."

UG గారు చెప్పిన ఘాటైన మాటొకటి చెప్పా...గురువుగారేమంటారో అనే ఉత్సుకతతో...

అవును...రెండూ ఒకటే...రెండూ మత్తు కలిగించేవే...అన్నారు గురువుగారు.

* * *

నీవు వ్రాస్తున్న ఏ వాక్యానికైనా సరే,
క్రింద సైన్(పేరు) ఉండకుండా చూడు...

సద్గురు అనిగాని, బాబు అనిగాని చేర్చకు.
వాక్యం మాత్రమే ఉండాలి.

వాక్యం ఎవరిదీ కాకుండా ఉన్నప్పుడే
అది సత్యవాక్కు అవుతుంది.

"బాబు"నే అసత్యం అయినప్పుడు
బాబు చెప్పే వాక్యం ఎట్లా సత్యం అవుతుంది?

బాబు అని సైన్ చేయకుండా ఉంటే ప్రపంచంలో ఉన్న అన్ని వాక్యాలూ నీవే అవుతాయి.

సైన్ పెడితే ఇదొక్కటే నీదవుతుంది.

బాబుగా  ఉండకుండా  "ఉన్నాను"గా ఉండు.
అప్పుడు అన్ని ఉనికులూ నీవే అవుతావు.

* * *

మన ప్రాచీన ఋషులు ఎన్నో తాత్విక చర్చలు జరిపేవారు...
చివర్లో నేతి-నేతి(ఇదికాదు-ఇదికాదు) అంటూ ముగించేవారు...

ఇది కాదు అని చెప్పుకోవడానికి చర్చలెందుకు?
మొదట్లోనే "ఇది ఏదీ అది కాదు" అనుకుంటే పోలా...!

* * *

మేలుకొంటే కలలోకి జారినట్టు లెక్క.
నిద్రపోతే మేలుకున్నట్టు లెక్క.

* * *

గురువు జ్ఞానే అయితే
శిష్యుడు కూడా జ్ఞానే.

శిష్యుడు అజ్ఞానే అయితే
గురువు కూడా అజ్ఞానే.

ఏదైనా సరే ఒక లెక్కలోనే ఉండాలి.

"నేను" అనే శరీరానికి -
కుడిచేయి గురువు.
యెడమచేయి శిష్యుడు.

* * *

రామాయణం వ్రాసింది రామాయణంలో ఉన్న వాల్మీకి కాదు.

రాముడూ తానే,
రావణుడూ తానే,
అందులోని అన్నిపాత్రలూ
తానై వున్న "తానే" రామాయణం వ్రాసింది.

* * *

అళగమ్మ తనయుడు వేంకటరామన్ తన 16 వ యేట
నిజంగానే చనిపోయాడు(ఖాళీ అయిపోయాడు).

తరువాత ఆ ఖాళీలో ఉన్నవాడు భగవంతుడే...
అందుకే అప్పట్నుంచి "భగవాన్" అని పిలిచారు.

ఆ తరువాత ఉన్న చరిత్రను
వేంకటరామన్ కు సంబంధించినది కాదు.

వేంకటరామన్ చరిత్ర
భగవాన్ కు సంబంధించినది కాదు.

వర్తమానం అనేది కాలానికి సంబంధించినదే.
కానీ భగవాన్ చెప్పిన -
"వర్తమానంగా ఉండు" అనే స్థితి,
అది కాలానికి సంబంధించిన వర్తమానం కాదు.
ఆ వర్తమానం "నేను" కు పర్యాయపదం.

* * *

చిరంజీవి అంటే -
పుట్టి మరణించనివాడు అనికాదు.

చిరంజీవి అంటే జీవి కానివాడు...
చిరంజీవి అంటే పుట్టనివాడు...

* * *

గురువుగారి పూజామందిరంలో
ఖమ్మం వేంకనరసయ్య గారు ఫ్రేం చేసి పెట్టిన
ఓ సూక్తిని చదివి వినిపించారు గురువుగారు-

"మౌనమే సద్గురు స్వరూపం.
సద్గురు సన్నిధిని అనుభవించాలంటే

మౌనంగా ఉండు సరిపోతుంది."

అందులో చివరి లైన్ ను ఇలా సవరించారు-
"మౌనమే నీవుగా ఉండు"

* * *

1 (ఒకటి) అనే అంకె గల చిత్రమును పటం కట్టి గోడకు తగిలించి దానివైపు చూస్తూ ఉండండి...

అది వేదాంతం చెప్పినట్టు ఇంకెవరూ చెప్పలేరు.
దానికి మించిన దైవం లేదు, దానికి మించిన గురువూ లేదు.

ఏకంగా ఉన్న తాను కలలో అనేకం అయినట్టు
ఏకమే అనేకమయ్యింది.
కానీ ఏకం ఏకంగానే ఉంది.

మెలకువలో కూడా -
వ్యవహారంలో అనేకంగా ఉంటూ
అనుభవంలో ఏకంగా ఉండాలి.

జీవునిది బూటకం.
దేవునిది నాటకం.

* * *

తన యధార్థస్వరూపం
జ్ఞప్తిలో ఉన్నప్పుడు జ్ఞానాంబగా ఉంటాడు.
జ్ఞప్తిలో లేనప్పుడు జ్ఞానశిశువుగా ఉంటాడు.
మునిగిపోయేదేముంది?

తాను జ్ఞానశిశువుగా ఉన్నప్పుడు
శరణమనే "భక్తి" ఉంటుంది.

తాను జ్ఞానాంబగా ఉన్నప్పుడు
అనుగ్రహించే "శక్తి" ఉంటుంది.

ఇదీ తానే.
అదీ తానే.

* * *

జ్ఞానశిశువు
9533667918

91. పిచ్చివాని ప్రేలాపనలు

___________________

ఓ రోజు నేను  గురువు వద్దకు వెళ్లినప్పుడు-
బాబూ! ఎవరో TV వాళ్లు వస్తారట ఇంటర్వ్యూ  కోసం...అదేదో నువ్వే మాట్లాడేసేయి...! అన్నారు.

నేను అదిరిపోయా...అయ్యబాబోయ్! నేనేం మాట్లాడను...? ఈ రాతలేవో వ్రాసుకోవడం తప్ప మనకు మాట్లాడ్డం అస్సలు చేతగాదు...

ఏ సమాధానం ఇవ్వకుండా మౌనం వహించాను...

తరువాత గురువుగారు నా వద్ద మళ్లీ ఆ ప్రస్తావన తీసుకురాలేదు.

* * *

మా రమణ సత్సంగం తరపున అచ్చు అయ్యే పుస్తకాలన్నిటికీ టైటిల్స్ నేనే పెట్టడం జరిగింది...
ఓ రోజు గురువుగారు అన్నారు- "బాబూ! ఈసారి వచ్చే పుస్తకానికి "పిచ్చివాని ప్రేలాపనలు" అని టైటిల్ పెట్టు అన్నారు....

ఎవరేమి అనుకున్నా...నవ్వుకున్నా...
నాకైతే ఆ టైటిల్ తెగ నచ్చేసింది...

జ్ఞాని దృష్టిలో జ్ఞానం తప్ప ప్రపంచం లేదు.
ప్రపంచం దృష్టిలో జ్ఞాని పిచ్చివాడు.

జ్ఞాని మాటలన్ని పిచ్చివానిప్రేలాపనలుగానే ఉంటాయి ప్రపంచానికి.

* * *

ఇంటర్వ్యూ అంటే ఇద్దరు ఉండాలి.
ఇన్నర్వ్యూ కి తానొక్కడు ఉంటే చాలు.

జ్ఞాని ఇతరులతో మాట్లాడుతున్నట్టు ఉన్నా సరే
తనలో తాను, తనతో తాను మాట్లాడుకోవడమే అన్నట్టుగా ఉంటాడు.

"తాను" తప్ప జ్ఞానికి ఇతరంలేదు,
ఇతరుడు లేడు.

కాబట్టి.

తనతో తాను మాట్లాడుకోవడం
ఇతరులతో తాను మాట్లాడడం
రెండూ ఒకటే జ్ఞానికి.

సత్సంగంలో
తాను ఇతరులకు చెప్పడం అని కాకుండా
తనకు తాను చెప్పుకుంటున్నట్టు ఉంటారు గురువుగారు.

కాబట్టే

ఘర్షణ అనేదిగాని,
స్వవచో విఘాతాలుగాని
వారి సంభాషణల్లో ఉండనే ఉండదు.

చెప్పేవాడూ నేనే.
వినేవాడూ నేనే.
అని ఉంటారు గురువు.

శిష్యుని దృష్టిలోనే గురువు, శిష్యుడు ఇద్దరూ ఉంటారు.
సద్గురువుదృష్టిలో శిష్యుడూ ఉండడు, గురువూ ఉండడు.

కేవలం - ఒకటి - మాత్రమే - ఉన్నది - అది - నేను.

అని ఉంటాడు సద్గురువు.

గమనించండి...ఆ ఆరు పదాలకు అర్థం ఒకటే.

* * *

ఎట్టకేలకు గురువుగారి ఆత్మపుత్రిక త్రిపురగారు మరియు PMC ఛానెల్ రవిశాస్త్రిగారు కలిసి గురువుగారి నుండి ఓ అద్భుతమైన ఇంటర్వ్యూను రాబట్టుకోగలిగారు...

అది ఎంత గొప్పగా వచ్చిందంటే,
ఆత్మస్థితిలో నిలబడడానికి ఇక ఏ గ్రంథమూ అవసరం లేదు, ఈ ఒక్క ఇంటర్వ్యూ చదివితే చాలు అనిపిస్తుంది.

ప్రతిసారీ youbtube లో వినలేంగా...
చదువుకోవడానికి అనుకూలంగా ఆ ఇంటర్వ్యూను అక్షరరూపంగా మాకు వ్రాసివ్వండి  అని కొందరు భక్తులు కోరగా వ్రాసి ఉంచాను.

గురువుగారు కోరిన టైటిలే దీనికి పెట్టాను "పిచ్చివాని ప్రేలాపనలు" అని.

ఈ ఇంటర్వ్యూ చదివి "బాగుంది" అంటే,
టైటిల్ ఫెయిల్ అయినట్టు.

ఇవన్నీ "పిచ్చివానిప్రేలాపనలు" అని అంటే,
ఈ టైటిల్ సక్సెస్ అయినట్టు.

సత్యానికి ప్రమాణం అంగీకారం కాదు,
అనంగీకారమే...

* * *

1.రవిశాస్త్రి: నమస్కారం గురువుగారూ....!

సద్గురు: నమస్కారం....

2.రవిశాస్త్రి: మీరు ఈ ఆధ్యాత్మిక మార్గంలోకి రావడం ఎలా జరిగింది?

సద్గురు: గాఢనిద్రలో నుండి మెలకువలోకి వచ్చినట్లు జరిగింది.

3.రవిశాస్త్రి: ఏ వయస్సులో మీకు జరిగింది?

సద్గురు: 'వయస్సు' అనేది అనుభవంలోంచి తప్పి పోయింది.

4.రవిశాస్త్రి: 'నేను' ఎట్లా వేఱు, సుబ్రహ్మణ్యం ఎట్లా వేఱు?

సద్గురు: గాఢనిద్రలో 'నేనున్నాను' అనేది తెలుస్తోంది.
అక్కడ సుబ్రహ్మణ్యం అనే అనుభవం ఏమీ ఉండదు.
మనం దేనినయితే గాఢనిద్ర అంటున్నామో అదే నిజానికి మెలకువ. అదే జ్ఞానము, అదే దైవము.
అక్కడ నుండి తనకు తానై కలిగిందే  మెలకువ అనేది.
నేను అనుకుని మేలుకోవడం కాదుగా!
తనకు తానై మెలకువ అనేది కలిగిన తరువాత వ్యక్తిగా శరీరము, ప్రపంచము...ఇవన్నీ అప్పుడు వచ్చాయన్నమాట.

కాబట్టి 'నేనున్నాను' అనేదే నా నామము, నా రూపము, నా శక్తి ...అన్నీ.
అది గాఢనిద్రస్థితి అంటామేగాని, నిజానికది 'మెలకువ'.
మనం ఆ స్థితులకు తారుమారుగా పేర్లు పెట్టుకుని అవస్థ పడుతున్నాం.

కానీ గాఢనిద్ర అనే ఆ మెలకువలో  ఏమీ తెలియడం లేదే! అనే మాట వస్తుంది...
ఉంటే తెలిసుండేదే....అప్పుడు ఏమీ లేదు...'నేను' తప్ప.
'నేనున్నాను' అనేదే మెలకువ.
ఆ మెలకువే నేను.
అది ఎవరి మెలకువా కాదు, దేనికి సంబంధించిన మెలకువా కాదు.
అది స్వయం మెలకువ.
అదే నా నామము, అదే నా రూపము, అదే నా శక్తి, అదే నా అనుభవము.

5.రవిశాస్త్రి: మెలకువలోకి వచ్చినప్పుడు 'మనస్సు' అనేది ఒకటి వస్తోంది కదా...! ఈ మనస్సును ఎలా అర్థం చేసుకోవడం?

సద్గురు: మనస్సు అనేది నాకు భిన్నమైనదేమీ కాదు.
గాఢనిద్రలో ఉన్న నేను మెలకువ అనే స్థితిలోకి జారినప్పుడు అది మనకు గాఢనిద్ర నుండి మేలుకున్నట్టు కనిపించినా కూడా అది ఒక విధమైన స్వప్నంలోకి జారుకోవడమే.
మెలకువకు నిజమైన అర్థం గాఢనిద్రే.
ఆ మెలకువ ఎవరిదీ కాదు, దేనికి సంబంధించినదీ కాదు.

6.రవిశాస్త్రి: జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురియావస్థలు అంటారు కదా...!

సద్గురు: ఇవన్నీ సుబ్రహ్మణ్యం వచ్చిన తర్వాత వచ్చిన వ్యవహారాలే.
సుబ్రహ్మణ్యానికి ముందున్నవి కావు.
సుబ్రహ్మణ్యం ఏర్పడిన తరువాత సుబ్రహ్మణ్యానికి కలిగే మూడు రకములైన స్థితులు ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తులు.
'నేను' కు కలిగేటివి కావు.
'నేనే' మెలకువ...సదా మెలకువ...

7.రవిశాస్త్రి: అందరిలో ఉన్న 'నేను' పరబ్రహ్మస్వరూపం అంటారా?

సద్గురు: 'అందరూ' లేరు....ఉన్నది 'నేనే'.
'నాలో నేను' అని చెప్పవచ్చు దానిని.
నాలో ఉన్న నేనుకు కలిగే స్థితులు ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తులు.

8.రవిశాస్త్రి: మనిషికి భౌతిక జీవితము, ఆధ్యాత్మిక జీవితము అని రెండు ఉన్నాయి కదా?
అవి రెండూ వేఱు వేఱా?

సద్గురు: రెండు లేవు.
ఒక స్థితి వరకు రెండుగా అగుపడతాయి.
ఒక నాణేనికి బొమ్మ, బొరుసు లాగా అవి.

9.రవిశాస్త్రి: ఐతే ఇప్పుడు మనం ఆధ్యాత్మికంగా ప్రయాణం చేయాలంటే దేనిని సాధనగా తీసుకోవాలి?

సద్గురు: ఏమీ అవసరం లేదు.
మేలుకోవడంలో మీ ప్రయత్నం ఏమైనా ఉంటే
మెలకువలో మీ ప్రయత్నం అంటూ ఒకటి ఏర్పడగలదు.
ఆ మెలకువ అనేదే మీ ప్రయత్నంతో సంబంధం లేకుండా తనకు తానై కలిగినప్పుడు, తరువాత జరిగేటివన్నీ కూడా తనకు తానై కలిగేటివే.

10.రవిశాస్త్రి: గాఢనిద్రలో 'నేను' తప్ప ఏమీ లేకపోవచ్చు కానీ మెలకువ కలిగాక మనలాగే అన్ని శరీరాలు అనేకం ఉన్నాయి కదా...!
వారు కూడా మేలుకొంటే(జ్ఞానం పొందితే) ఆధ్యాత్మికాభివృద్ధి జరుగుతుంది కదా!

సద్గురు: అలా ఏమీలేదు...
నీ కలలో తోచే శరీరాలు లాగే ఈ శరీరాలు కూడా.
నిజానికి వారికి ఉనికి లేదు.
కలను కనే నీ ఉనికి మీదే కలలో ఉన్నవారందరి ఉనికీ ఆధారపడి ఉంది.

"ఉన్నది-నేను-ఒక్కటి"

* * *

నేను అని వ్రాసి ప్రక్కనే ఖాళీ (డ్యాష్) పెట్టి,
అందులో ఏమి వ్రాసినా సరిపోతుంది.

ఆ ఖాళీలో లో ప్రస్తుతం రవిశాస్త్రి అని వ్రాసుకుని ఉన్నావు.

చెరిపేసి ఆ ఖాళీలో ఇంకేదైనా వ్రాసుకో.

నేను రవిశాస్త్రి అనేది ఎంత సత్యమో
ఆ ఖాళీలో వ్రాసింది కూడా అంత సత్యం.

11.రవిశాస్త్రి: ఈ 'నేను' అనే భావనను అర్థం చేసుకోవడం ఎలా?

సద్గురు: 'నేను' అనేది భావన కాదు, సు
సుబ్రహ్మణ్యం అనేది భావన.

12.రవిశాస్త్రి: 'నేను' తత్త్వాన్ని ఎలా తెలుసుకోవడం?

సద్గురు: అదే సకలాన్ని తెలుసుకుంటోంది.

మనం తెలుసుకునే ప్రశ్నే లేదు.

13.రవిశాస్త్రి: అది ఆధ్యాత్మిక చింతన ద్వారా కలుగుతుందా?
లేకపోతే ఏదైనా జ్ఞానం వలన కలుగుతుందా?

సద్గురు: తీగలో పూవు పూసినట్లు అది కలుగుతుంది.

14.రవిశాస్త్రి: అయితే అందరిలో కలగాలి కదా!

సద్గురు: మీకు మెలకువ వచ్చి, మీరు వ్యక్తిగా, రవిశాస్త్రిగా వచ్చిన తర్వాత కదా 'అందరూ' వచ్చేది.
రవిశాస్త్రే రాకపోతే 'అందరూ' ఎక్కణ్ణుంచి వస్తారు?

రవిశాస్త్రితో పాటు సకలమూ వచ్చింది, అందరూ వస్తారు.
ఏకకాలంలో జరుగుతుంది.

15.రవిశాస్త్రి: నేను మేలుకున్నప్పుడు, నా ప్రపంచం మేలుకున్నట్టు నేను గుర్తిస్తాను...

సద్గురు: మేలుకున్న తర్వాతే మిమ్మల్ని మీరు గుర్తించడం కూడా.
అప్పుడే సకలాన్ని గుర్తించడం జరుగుతుంది.

16.రవిశాస్త్రి: అయితే మేలుకోక ముందు ఏం జరుగుతోందంటారు?

సద్గురు: ఈ మాటలు కూడా మెలకువ అనే స్వప్నంలోకి జారుకున్నాక జరిగేవే.

నిజమైన  మెలకువ - గాఢనిద్రే.

17.రవిశాస్త్రి: నిజమైన మెలకువ గాఢనిద్ర అయినప్పుడు,
ఆ గాఢనిద్రలో ఏం జరుగుతోంది?

సద్గురు: ఆ గాఢనిద్ర నుండే మెలకువ అనేది జరుగుతోంది.
నిజానికి మెలకువ అని చెప్పకూడదు...స్వప్నంలోకి జారటం...అని చెబితే బాగుంటుంది.

అయితే అది సుబ్రహ్మణ్యంగారి స్వప్నం కాదు.
ఆ 'నిజమైన మెలకువ'(గాఢనిద్ర)లో ఉన్న ఒక అతిశయమైన శక్తి అది.

ఆ మెలకువా స్వయం.
ఆ శక్తి కూడా స్వయం.

18.రవిశాస్త్రి: అయితే మనసు, బుద్ధి, చిత్తం, అహంకారం అనేది వ్యక్తికి చెందినవా?

సద్గురు: ఇవన్నీ రవిశాస్త్రి వచ్చిన తర్వాత వచ్చిన వ్యవహారాలే.
మనం అక్కణ్ణుంచి ఇవతలకు వచ్చినామంటే మొత్తం 'అది' కాకుండా ఐపోతుంది.
మనం 'అక్కణ్ణే' ఉండాలి.
'అది'గానే ఉండాలి.
దేనిని మనం గాఢనిద్ర అంటున్నామో 'అది' గానే ఉండాలి.
గాఢనిద్ర కాదు, మెలకువ 'అది'.

19.రవిశాస్త్రి: మీరు ఈ విషయాలన్నీ చదివి చెబుతున్నారా?
లేక సాధనల ఫలితంగా చెబుతున్నారా?

సద్గురు: 'నేను' ఏమీ చెప్పడం లేదు.
నేను, నీవు కాక మూడోవాడుగా ఉన్నాను.

ఇద్దరిలో ఒకడుగా ఉన్నాను.
ఇద్దరుగాను ఉన్నాను.

20. రవిశాస్త్రి: మీకు ఇద్దరు గురువులున్నారు కదా!
వారి గురించి చెప్పండీ....

సద్గురు: వారు కూడా సుబ్రహ్మణ్యం వచ్చిన తర్వాత వచ్చినవారే.

ఆ గురువులు సుబ్రహ్మణ్యానికే గాని 'నాకు'('నేను')కు కాదు.

21.రవిశాస్త్రి: ఈ సుబ్రహ్మణ్యంలో 'నేను' అనే దానిని మేల్కొలిపిన
గురువుల యొక్క గొప్పతనం లేదా?

సద్గురు: దానిని మేల్కొల్పవలసిన అవసరం లేదు.
అదే మెలకువ.

22.రవిశాస్త్రి: ఇక గురువు దేనికి?

సద్గురు: గురువు దేనికి మరి....
గురువును చూశాను అనుకోవడమే...
ఎవరూ గురువును చూడలేదు.

గురువుకు అన్యంగా ఎవరైనా ఉంటే ఏదైనా ఉంటే గురువు ఎట్లా
అవుతాడు?
రెండవదాని ప్రసక్తే లేదు.

అందరమూ అనుకుంటున్నాము కదా గురువని అంటే,
ఒకే శరీరంలో అనేక అవయవములు అనేక పనులు చేస్తున్నట్టే....
కన్ను చూస్తుంది, చెవి వింటుంది.
నేను చూస్తున్నాను, నేను వింటున్నాను అని ఎలా చెబుతున్నారు...
అలా ఒకరు చేసే పనిని నేను చేస్తున్నాను అనుకోవడమే ఇక్కడ ఇబ్బంది.

నేను సుబ్రహ్మణ్యం అనుకుంటే ఇబ్బందిగాని
నేనే సుబ్రహ్మణ్యం అనుకుంటే ఇబ్బంది లేదు.

23.రవిశాస్త్రి: 'నేనే' ఆత్మ అంటారా?

సద్గురు: కాదు కాదు.
రెండు నేనులు ఉన్నాయి అక్కడ-

1.నేను రవిశాస్త్రి అని నేను అంటుంది.
2.రవిశాస్త్రి నేను అని రవిశాస్త్రి అంటాడు.

ఒకటి సర్వగతమైన నేను.
మరొకటి వ్యక్తిగతమైన నేను.

మొదటి నేను అహంస్వరూపం.
రెండవ నేను అహంకారరూపం.

మొదటి 'నేను'కు ఎవరి ఆధారమూ, దేని ఆధారమూ అవసరం లేదు.
రెండవ నేను రవిశాస్త్రి ఉంటేనే ఉంటుంది.
రవిశాస్త్రి లేకపోతే ఉండదు.

24.రవిశాస్త్రి: ఆత్మ అంటే?

సద్గురు: మొదటి నేను.

25.రవిశాస్త్రి: రెండవ నేను?

సద్గురు: అహంకారం.

26.రవిశాస్త్రి: మరి మనస్సు అనేది ఎక్కణ్ణుంచి వచ్చింది ఈ రెండిటి మధ్యలో...

సద్గురు: అది మధ్యలో రాలేదు...మనస్సే అహంకారంగా ఉండేది.

27.రవిశాస్త్రి: అయితే ప్రపంచంలో  ఇన్ని గ్రంథాలు, ఇన్ని మార్గాలు ఇన్ని సాధనలు,  ఇన్ని ధ్యానాలు....దేనికంటారు?

సద్గురు: దేనికి? ఎందుకు? అన్న ప్రశ్నలకు సమాధానాలు ఇంతవరకు ఎవరూ చెప్పలేదు.

"అది అంతే".

28.రవిశాస్త్రి: మనకు కర్మయోగమని, భక్తియోగమని, క్రియాయోగమని, ధ్యానయోగమని...ఇన్ని పద్ధతులున్నాయి కదా!

సద్గురు: అవన్నీ కర్మయోగంలో భాగాలే.

29.రవిశాస్త్రి: ధ్యానమంటే ఏమిటి?

సద్గురు: ధ్యానము అనేది గాఢనిద్రకు ఉన్న ఇంకొక పేరు.

గాఢనిద్రలో నుంచి మెలకువ వచ్చి
ఆ మెలకువలో ఉన్న రవిశాస్త్రి చేసే ధ్యానం కాదు అది.

'స్వయం ధ్యానం' అది.

ఆ స్వయం ధ్యానాన్నే గాఢనిద్ర పేరుతో మనం అనుభవిస్తుండేది.
అదే దైవం, అదే ఆత్మ.

'అది' గా ఉండడమే ఇక్కడ ఆత్మధ్యానం, దైవస్మరణ...
ఇలాంటి పేర్లతో పిలువబడుతోంది.

30.రవిశాస్త్రి: అన్నీ తెలిసినవాడు గురువు...

సద్గురు: ఏమీ తెలియనివాడు కూడా....
అన్యము లేనప్పుడు దేనిని తెలుసుకుంటాడు?

గురువు అంటే 'ఉన్నది' అని చెప్పగలం.
ఆ 'ఉన్నది'కి ఇంకొక పేరు 'నేను'.

31.రవిశాస్త్రి: 'నేను' అనేది మాత్రమే ఉన్నప్పుడు
మరి ఈ పుట్టుక, ఈ సంసారం, ఈ మరణం...ఇవన్నీ దేనికంటారూ...?

సద్గురు: ఇవన్నీ ఎక్కడ జరుగుతున్నాయండీ...
రవిశాస్త్రి వచ్చాకే అన్నీ వచ్చాయి, అన్ని వ్యవహారాలూ ఉంటాయి,
మీరే లేనప్పుడు మీ ప్రశ్నలెట్లా వస్తాయి?
కాబట్టి రవిశాస్త్రి వచ్చాక ఏమైనా రావొచ్చు.

32.రవిశాస్త్రి: రమణమహర్షి 'నేనెవరో' తెలుసుకోమన్నారు....

సద్గురు: ఆయన కూడా మీరు మేలుకున్న తర్వాత వచ్చేది సీన్ మీదకు.
గాఢనిద్రలో రమణమహర్షి ఎక్కడున్నాడు?

33.రవిశాస్త్రి: గాఢనిద్రలో మనం కొన్ని అనుభూతులు చెందుతూ ఉంటాం కదా...

సద్గురు: లేదు లేదు.
అక్కడ ఏ అనుభూతీ లేదు.
అక్కడ ఉండేది కేవలం 'నేనున్నాను' అనేదే.

'నేనున్నాను' అనేది కూడా రవిశాస్త్రి కాదు.
'నేను' మాత్రమే 'ఉన్నాను' అని ఉండేది.

'నేను' అన్నా ఒకటే.
'నేను ఉన్నాను' అన్నా ఒకటే.
'ఉన్నది నేను' అన్నా ఒకటే.

34.రవిశాస్త్రి: 'అహంబ్రహ్మాస్మి' అంటారు కదా...
'నేను' అనేదే బ్రహ్మమా?

సద్గురు: గాఢనిద్రగా ఉన్న నేనే
రవిశాస్త్రిగా ఉన్న నేను.

35.రవిశాస్త్రి: నేను, మీరు, ప్రపంచం నిద్రలోకి జారుకున్నప్పుడు.....

సద్గురు: నిద్రలోకి జారుకోవడం కాదు,
స్వప్నంలోకి జారుకోవడం అనండి.

స్వప్నమే మూడు స్థితులుగా ఉంటుంది.
జాగ్రత్-స్వప్న-సుషుప్తులుగా.
మూడూ కలిపి స్వప్నంగా చెప్పాలి.
ఆ స్వప్నం ఎవరిదీ కాదు, దేనిదీ కాదు.
అది గాఢనిద్ర అని చెప్పబడే 'మెలకువ'లో ఉండే ఒక అతిశయశక్తి అని చెప్పవచ్చు.

36.రవిశాస్త్రి: ఐతే ఇంతమంది గురువుల పేర్లు వింటున్నాం, ఇన్ని గుళ్లు వచ్చాయి.....

సద్గురు: ఇవన్నీ మీకు మెలకువకు కలిగాక వచ్చినవే.

37.రవిశాస్త్రి: మెలకువ వచ్చిన తర్వాత అయినా ఈ సాంసారిక జీవితమనేది ఒకటి వచ్చింది కదా....!

సద్గురు: మీరు నిద్రపోయి కనే స్వప్నంలో కూడా ఇదే మాదిరి ప్రపంచం ఉంటుంది కదా!
ఆ స్వప్నప్రపంచం లేకపోయినప్పుడు కదా 'మెలకువ' అంటున్నారు.
అదేవిధంగా ఈ జాగ్రదవస్త నుండి కూడా ఓ మెలకువ అనేది కలుగుతుంది.
ఆ 'మెలకువ' ఎవరి వల్లా, దేనివల్లా ఏ ప్రయత్నం వల్లా రాదు.
ఆ గాఢనిద్ర అనే మెలకువలో
జాగ్రత్-స్వప్న-సుషుప్తులు మూడూ స్వప్నమే అంతే.

38.రవిశాస్త్రి: ఈ 'నేను' అనే ఉనికి 'ఉన్నది'.
నేను నేనై ఉన్నది.
ఈ ప్రపంచమంతా ఉన్నది కదా!

సద్గురు: దానిని మూడవదానిగా చెప్పుకుంటున్నాము.
నీవు గాఢనిద్రలో ఉన్నప్పుడు నేను కనిపించి అక్కడ ఈ ప్రస్తావన తెస్తే, అక్కడ నేను సమాధానమిస్తాను. లేదా నేను గాఢనిద్రలో ఉన్నప్పుడు మీరు వచ్చి అడిగినా చెబుతాను.
ఇద్దరమూ స్వప్నంలో కూర్చొని స్వప్నాన్ని గుఱించి ఎంత వివరంగా మాట్లాడుకున్నా దానివల్ల ఏమీ లాభం లేదు.
'మెలకువ' వస్తే ఇద్దరమూ ఉండము.
మెలకువ రాకుండా ఎంతకాలం స్వప్నాన్ని గురించి మాట్లాడినా లాభం లేదు.
యుగాలపర్యంతం, కోట్లాదిమంది చెబుతూనే ఉన్నారు...కాని ప్రశ్న ఎక్కడ ఉందో అక్కడే ఉంది.

39.రవిశాస్త్రి: ఈ ప్రపంచం మాయ అని,
నేను నేనై ఉన్నాను అని,
నేను గాఢనిద్రాస్వరూపంగా ఉన్నాను అని మీకు
ఏ వయసులో కలిగింది ఆ అనుభూతి?

సద్గురు: మీ వయస్సు ఎంత?

40.రవిశాస్త్రి: 30...

సద్గురు: 28 ఏళ్ల క్రితం ఈ ప్రశ్నలు మీకు కలిగాయా?

41.రవిశాస్త్రి: అప్పుడు ఇంత తెలియదు కాబట్టి....

సద్గురు: ఇప్పుడు కూడా  తెలియలేదు...
'తెలియలేదు' అంటున్నారే....అప్పుడున్నదే నిజంగా తెలివి. అదే జ్ఞానం.
ఇప్పుడున్న స్థితి కాదు.
ఆ బాల్యస్థితినే మానవాళ్లు 'బ్రహ్మం' అన్నారు.

42.రవిశాస్త్రి: యోగి బాలుడిలా ఉండాలి అంటారా?

సద్గురు: 'ఉండాలి' అనుకుని ఎవడూ ఉండలేడు.

43.రవిశాస్త్రి: ఉంటేనే ఉండగలడు...

సద్గురు: ఒక మాట వినో, ఏదో సాధన చేసో పొందే స్థితి కాదు అది.
పుట్టుకలోనే యోగిగా ఉంటాడు.

44.రవిశాస్త్రి: ఐతే మెలకువతో పాటు అన్నీ వచ్చి ఉన్నాయి కదా ఈ సంసారం...ప్రపంచం....

సద్గురు: స్వప్నంలో మెలకువ ఉంది కదా...అలాంటి మెలకువే ఇది. ఇదంతా స్వప్నమే.

'ఇదంతా జరుగుతోంది' అని ఉండడమే స్వప్నస్థితి.
'ఏమీ జరగడం లేదు' అని ఉంటే అది మెలకువ.

45.రవిశాస్త్రి: మీకు భార్య, పిల్లలు, కుటుంబం ఉందికదా! అదంతా స్వప్నమే అంటారా?

సద్గురు: నాకు('నేను'కు) కాదు.
సుబ్రహ్మణ్యం అనుభవాల్ని మీరు చెబుతుండేది.

46.రవిశాస్త్రి: సుబ్రహ్మణ్యం ఈ 'నేను'ను ఎప్పుడు తెలుసుకున్నాడు?

సద్గురు: 'నేను' ఉంటేనే సుబ్రహ్మణ్యానికి ఉనికి.
సుబ్రహ్మణ్యం మీద ఆధారపడి ఉండదు 'నేను'.

'నేను' మీద ఆధారపడి ఉన్న సుబ్రహ్మణ్యం...
ఆ సుబ్రహ్మణ్యం అనే నేను....
ఇవన్నీ కూడా వస్తూ ఉన్నాయి....పోతూ ఉన్నాయి...

నేను నేనుగానే ఉన్నాను.

47.రవిశాస్త్రి: ఐతే 'నేను' యొక్క స్వరూపం ఏంటి?
ఉనికి ఏంటి? దాని తత్త్వమేమిటి?

సద్గురు: నేను అంటే నేను.
ఇక ఏం చెప్పినా అది కాదు.

48.రవిశాస్త్రి: ఈ నేను శరీరాన్ని ఎందుకు పొందుతుంది?

సద్గురు: పొందిందని ఎవరు చెప్పారు?
మీరు చెబుతున్నారు....నేను చెప్పానా...?

49.రవిశాస్త్రి: ఈ పుట్టుక ఎందుకు?

సద్గురు: అని మీరంటున్నారు.
నాకు లేదు కదా!
సుబ్రహ్మణ్యానికి ఉంది.

50.రవిశాస్త్రి: సుబ్రహ్మణ్యం అనే పుట్టుక ఎందుకు వచ్చింది?
సుబ్రహ్మణ్యానికి సంసారమెందుకు వచ్చింది?
ఇందులో సుబ్రహ్మణ్యం పాత్ర ఏమిటి?
'నేను' యొక్క పాత్ర ఏమిటి?

సద్గురు: కలలో ఉన్న మీరు
కల కనే మిమ్మల్ని ఎలా తెలుసుకుంటారు?

51.రవిశాస్త్రి: మీరు చెప్పేది ఎట్లా ఉందంటే-
సినిమా థియేటర్ లో సినిమా చూస్తుంటాం...కాని సినిమాకు తెలియదు
చూసేవాడు ఎవడు అని.

సద్గురు: అవును.
తనను తాను మరచిపోయి సినిమాకథలో లీనమయి సుఖదుఃఖాలు అనుభవిస్తుంటాడు.
మైమరపే కారణం...

52.రవిశాస్త్రి: ఈ సుబ్రహ్మణ్యం తన్ను తాను ఎప్పుడు మరుస్తాడు? తన్ను తాను ఎప్పుడు తెలుసుకుంటాడు?

సద్గురు: సుబ్రహ్మణ్యం ఉన్నా 'నేను' ఉంటుంది.
'నేను' లేకపోతే సుబ్రహ్మణ్యం ఉండడు.

53.రవిశాస్త్రి: ఆ 'నేను' ను ప్రాణం అనొచ్చా?

సద్గురు: ఆ నేనును నేను అని మాత్రమే అనొచ్చు.
ఇంకేమన్నా తప్పే అవుతుంది.

54.రవిశాస్త్రి: ప్రాణం అంటే ఏమిటి?

సద్గురు: ఆ 'నేనే' ప్రాణం.

సర్వనామంగా ఉన్న నేనుకు ఆధారమై ఉన్నది
ఆ నామవాచకంగా ఉన్న 'నేను'.

ఆ 'నేను' సుబ్రహ్మణ్యం ఉన్నా ఉంటుంది.
రవిశాస్త్రి ఉన్నా ఉంటుంది.
వీళ్లిద్దరు లేకపోయినా కూడా అది ఉంటుంది.

వీళ్లిద్దరు లేకపోతే అది ఉండే ఉనికిని అనుభవించే స్థితినే మనం గాఢనిద్ర అంటున్నాం.

గాఢనిద్రలో సుబ్రహ్మణ్యంగా ఉన్నావా? రవిశాస్త్రిగా ఉన్నావా? అని అడిగితే, 'నేనున్నాను' అని మాత్రమే అనగలం.

55.రవిశాస్త్రి: ఈ ప్రపంచము, ఈ సృష్టి, ఈ ఖగోళము భౌతికంగా ఇవి కనిపిస్తున్నాయి....గాఢనిద్రలో ఇవి లేవు....

సద్గురు: గాఢనిద్రలో  ఉన్నప్పుడు నాకు చెప్పండి.... నేను ఒప్పుకుంటాను....

56.రవిశాస్త్రి: గాఢనిద్రలో నేను చెప్పలేను కదా....!

సద్గురు: రవిశాస్త్రి ఉంటే కదా చెప్పడానికి ....
అది కేవలం 'మెలకువ'. గాఢనిద్ర కాదు.

అక్కడ 'నేను' అనే మెలకువ మాత్రమే ఉంటుంది.

అందుకే గాఢనిద్రలో నీవు లేవా? అని అడిగితే 'నేనున్నాను' అంటావు.

రవిశాస్త్రిగా ఉన్నావా? అంటే, లేదు అంటావు.

57.రవిశాస్త్రి: ఐతే, మనిషి పుట్టుక, పెరగటం, మరణం...ఇవి ఉన్నాయి కదా భౌతికంగా....!
ఇదొక కలే అనుకుందాం...మరి ఈ కష్టాల నుంచి, ఈ ఇబ్బందుల నుంచి బయటపడడానికి ఆధ్యాత్మిక సాధనలు అవసరం కాదా?

సద్గురు: రెండు లేవు...

ఆధ్యాత్మికసాధన అనేది కూడా ప్రాపంచికమే.

58.రవిశాస్త్రి: ఎలా హ్యాండిల్ చేయాలంటారు?

సద్గురు: ఈ ప్రశ్నలన్నీ ఒక్క మానిషికే వస్తున్నాయి...
ఎందువల్ల? ఇక ఏ జీవీ ఈ ప్రశ్నలతో అవస్థపడడం లేదు.

59.రవిశాస్త్రి: మరి ఒక్క మనిషికే ఎందుకొస్తున్నాయి?

సద్గురు: మనసు, బుద్ధి...అనే పేర్లను గొప్పతనంగా తీసుకోవడం వల్ల.

60.రవిశాస్త్రి: మాయ అంటే ఏమిటి?

సద్గురు: తెలిసినవారికి లేనిది.
తెలియనివారికి ఉన్నది.

61.రవిశాస్త్రి: ఈ మాయలో మనిషి చేసే నాటకం ఏమిటి?

సద్గురు: ఇప్పుడు మనం మాయ గుఱించి ప్రస్తావన చేస్తున్నామంటే,
ఇద్దరమూ మాయలో ఉన్నట్టే.

62.రవిశాస్త్రి: మెలకువగా ఉంటూ దీనిని ఎట్లా చూడడం?

సద్గురు: మేలుకోవాలి.

మేలుకొంటే తెలుస్తుంది.
ప్రశ్న వేస్తే ఎలా తెలుస్తుంది?

మేలుకొంటే ప్రశ్న ఉండదు.

63.రవిశాస్త్రి: మేలుకోవాలంటే ఏదో ప్రయత్నం చేయాలి కదా?

సద్గురు: గాఢనిద్ర అనే స్థితిని గురించి మనం స్వప్నంలో కూర్చొని మాట్లాడితే ఎట్లా వీలుపడుతుంది?

తీగలో పూవు విచ్చుకున్నంత సహజంగా, అప్రయత్నంగా జరుగుతుంది అది.

64.రవిశాస్త్రి: మరి ఇంత సులభంగా ఈ జనాలు ఎందుకు తెలుసుకోలేకపోతున్నారు?

సద్గురు: జనాలు అందరూ ఎవరూ లేరు.
మీరు మేలుకొన్నాక వచ్చినవాళ్లే వీళ్లు.
మెలకువ రాక ముందు జనాలు అగుపడితే చెప్పు.

65.రవిశాస్త్రి: నాకు మెలకువ వచ్చిన తర్వాతైనా ఈ భూమ్మీద మనుషులు అనేవారున్నారు కదా!

సద్గురు: మీకు మెలకువ వచ్చిన తరువాత నేను, ప్రపంచము, భూమి, చంద్రుడు...అన్నీ అగుపడుతున్నాయి....

అందుకే నేను చెప్పేది-
గాఢనిద్రలో ఆ ప్రశ్న వేయండి, నేను సమాధానం చెబుతాను.

గాఢనిద్ర యొక్క స్థితిని గురించి మనం స్వప్నంలో కూర్చొని మాట్లాడితే ఎట్లా వీలుపడుతుంది?

66.రవిశాస్త్రి: మీరు మేలుకొని ఉన్నప్పుడు గాఢనిద్దాస్థితిని అనుభూతి చెందారా?

సద్గురు: అది అనుభూతి చెందటం కాదు,
'అదే' నేను.

67.రవిశాస్త్రి: అదే నేను అని తెలుసుకున్నారు కదా?

సద్గురు: తెలుసుకోలేదు...
అదే నేనుగా ఉన్నానిప్పుడు.
నాకు అన్యంగా ఏదైనా ఉంటే కదా తెలుసుకోవడం అనేది ఉంటుంది...

68.రవిశాస్త్రి: తెలుకోక మునుపు సుబ్రహ్మణ్యానికి,
తెలుసుకున్నాక ఉన్న సుబ్రహ్మణ్యానికి తేడా లేదంటారా?

సద్గురు: తెలియకుంటే సుబ్రహ్మణ్యంగా ఉంటాడు.
తెలిసుకుంటే సుబ్రహ్మణ్యం ఉండడు, ఎవరూ ఉండరు...'నేను' తప్ప.

69.రవిశాస్త్రి: సుబ్రహ్మణ్యం అనే వ్యక్తి తెలుసుకున్నాడు కాబట్టి ఇలా మాట్లాడగలుగుతున్నాడు...

తెలుసుకోనివారు యెంతోమంది ఉన్నారు కదా?
వారు తెలుసుకోవాలంటే ఏం చేయాలి?

సద్గురు: ఏమీ చేయనక్కర్లేదు....
పడుకుని హాయిగా నిద్రపొండి....

70.రవిశాస్త్రి: నిద్రే వరమంటారా మనిషికి?

సద్గురు: అదే 'మెలకువ' అంటాను.

71.రవిశాస్త్రి: 8 గంటలు పైగా నిద్ర పోకూడదంటారు కదా శాస్త్రవేత్తలు....

సద్గురు: నేను సదా నిద్రలోనూ ఉంటాను.
సదా మెలకువలోనూ ఉంటాను.

24 గంటలూ నిద్రే.
24 గంటలూ మెలకువే.

72.రవిశాస్త్రి: మీతో ఇలా ఇంటర్వ్యూ చేయడం నాకు చాలా ఆనందంగా ఉంది...ఏదో క్రొత్త అనుభూతి కలిగింది.

సద్గురు: ఇంటర్వ్యూ అంటే-
నాలో నేను మాట్లాడుకోవడమే.

73.రవిశాస్త్రి: లోకంలో గురువులందరూ ఏదో ఒక సాధన చేయమని చెప్పేవారే....ఏ సాధనా అవసరం లేదని చెప్పిన ఏకైక మహనీయులు మీరు.

'స్వ'లో సుప్రతిష్ఠితమై ఉండడమే స్వానుభవమని,
కాబట్టి ప్రేక్షకులందరూ ఆ స్థితిలో ఉండాలని  కోరుచున్నాను.

సద్గురు: ఇంతసేపు విని,  మళ్ళీ మెదటికి వచ్చేశారు.
'అందరూ' ఎక్కడున్నారు?

74.రవిశాస్త్రి:(నవ్వుతూ) నాకు అర్థమైంది స్వామి....
T.V.ప్రేక్షకులకు అర్థంకావడానికి అలా చెప్పాల్సివచ్చింది....మీతో పెద్ద తిప్పలే వచ్చేసినాయ్....వామ్మో.....

ఒకటి మాత్రం నిజం స్వామీ.....
మీ దగ్గర ఉన్నవాళ్లు గొప్పవాళ్లు అన్నా అవుతారు,
పిచ్చివాళ్లు అన్నా అవుతారు.

సద్గురు: పిచ్చివాళ్లు అన్నదే కరెక్ట్.

యెందుకంటే నేనే మొదటి పిచ్చివాణ్ణి.
కాబట్టి నా చుట్టూ ఉన్నవాళ్లు కూడా పిచ్చివాళ్లే.

75.రవిశాస్త్రి: నమస్కారం స్వామి....

సద్గురు: నమస్కారం.

* * *

92. ఇష్టమైన కష్టం

---

22-8-2021 * ఆదివారం

ఈ ఉదయాన్నే 5.45 కు నేనూ ప్రసాదు గురుసన్నిధికి చేరుకున్నాము...

గురుజయంతికి ఖమ్మం నుండి
వేంకట నరసయ్యగారి కుటుంబం
మూడ్రోజులు ముందే ఇక్కడకు చేరుకుంది.

గురుసేవకుడు వేణు అందరికీ టీ అందించాడు...

TV లో నుంచి  ఆహ్లాదకరమైన సంకీర్తన ఒకటి వినిపిస్తోంది...

సర్వాధారుడవు నీవు....అంటూ...

గురువుగారు మా వైపు తిరిగి, దానినే ఉత్తమపురుషంలో చెప్పుకుంటే -
సర్వాధారము "నేను" అని చెప్పుకోవాలి...అని అన్నారు.

* * *

కల తొలగాలంటే ఏంచేయాలి? ప్రశ్నించాడు దేవీప్రసాద్.

ఏం చేసినా అది కలలో భాగమే...అన్నారు గురువుగారు నవ్వుతూ.

కలలో నుంచి మనం అప్రయత్నంగా మేలుకుంటాం కదా...
మరి ఈ "జాగ్రదవస్త" అనే కల నుండి అప్రయత్నంగా ఎందుకు మెలకువ రాకూడదు?
అని అడిగా నేను.

వస్తుంది...

ఆ మెలకువలో మెలకువే ఉంటుంది...
బాబు ఉండడు...

ఆ "నిజమైన మెలకువ" బాబుది కాదు.
బాబుకు ఉనికి కలలో, మెలకువలో మాత్రమే.

"నిజమైన మెలకువలో " ఇది నా మెలకువ అని చెప్పడానికి అక్కడ బాబు ఉండడు.
కేవలం మెలకువే ఉంటుంది....
అన్నారు గురువుగారు.

* * *

మనో వాక్కాయ కర్మములకు అందదు అంటే,
అసలక్కడ వాటికి ఉనికే ఉండదు...అని అర్థం అన్నారు.

* * *

ఈరోజు షిరిడీలో గురుపాదుకలు ప్రతిష్ఠింపబడినరోజు అని లీలగారు మెసేజ్ పెట్టారు...అదే చెప్పాను గురువుగారితో...

"రోడ్డు ప్రక్కన యాచించే భిక్షుకుని చెప్పులుకూడా సద్గురు పాదుకలుగానే నీకు  కనిపించాలి...

అప్పుడే  గురుతత్త్వం నీకు అర్థమైనట్టు అన్నారు గురువుగారు.

* * *

శిష్యులు గురువుతో ఆడుకుంటారు.
గురువు శిష్యులతో ఆడుకుంటాడు.
బోధలు, పూజలు...ఇవన్నీ ఆటలే... అన్నారు.

ఎన్నడు తీరవు యీ పనులు
పన్నిన నీ మాయ బహుళంబాయ...

వేదము దీర్చదు వేరే శాస్త్రములు
యేదియు దీర్చదు యిది నీ మాయ...

అంటాడు అన్నమయ్య.

అంతా మాయే...
అంతా ఆటే...

* * *

సత్యం అనేది రంగు రుచి వాసన లేని
distilled water లాంటిది.

పరమసత్యంలో -
ద్వంద్వాలు ఉండవు.
కేవలం "నేనున్నాను" అన్న ప్రజ్ఞ మాత్రమే ఉంటుంది పరిశుద్ధజలం వలె.

నాకు దుఃఖమూ వద్దు, సుఖమూ వద్దు
అని ఉన్నవాడే సత్యసాక్షాత్కారానికి అర్హుడు.

* * *

"ముగిసిపోయిన మనిషి UG" అన్నారు టెర్రీన్యూలండ్.

మనిషిగా ముగిస్తేనే ఋషి అవుతాడు.
ఋషి అయ్యాక మానవత్వం ఉండదా? అంటే

పావలాలో రూపాయి ఉండదుగాని,
రూపాయిలో పావలా ఉంటుంది.

మనిషిలో ఋషి ఉండడుగాని,
ఋషిలో మనిషి ఉంటాడు...
ఆ ఋషిత్వంలో మానవత్వమూ ఉంటుంది.

* * *

ఒకడు ప్రతిరోజూ గుడికెళ్లి దైవదర్శనం చేసుకుంటాడు...అతని జీవితంలో ఒక ఆపద వచ్చి పడింది. అదేమంటే- తన ఏకైక కుమారుడు ప్రమాదంలో చనిపోయాడు.
ఇట్లా చేయడం ఈశ్వరునికి తగునా? అని ప్రశ్నించాడు మన గురువుగారిని.

గురువుగారు అన్నారు-
గుడి గడప దాటి లోపలకు అడుగు పెట్టగానే
"నా భవబంధాలు త్రెంపుము" అని నీవు కోరకపోయినా కోరినట్లే లెక్క.

మంట వద్దకు వెళ్లి చల్లదనం కోరుకుంటే ఎలా?
నీతో సహా 'నాది' అనుకున్న నీ సర్వాన్ని కాల్చి బూడిద చేస్తాడు ఈశ్వరుడు. అందుకు సిద్ధపడే ఈశ్వరునితో సహవాసం చేయి...అన్నారు.

శ్రీకాళహస్తీశ్వర శతకంలో దూర్జటి ఇలా అంటారు-

నిను సేవింపగ నాపదల్ వొడమనీ నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రం డననీ మహాత్ము డననీ  సంసారమోహంబు పై
కొననీ జ్ఞానము కల్గనీ గ్రహగతుల్ గుందింపనీ మేలు వ
చ్చిన రానీ యవి నాకు భూషణములే శ్రీకాళహస్తీశ్వరా!

* * *

అప్పుడెప్పుడో ఠాగూర్ కథ ఒకటి చదివాను...

ఒకడు సదా భగవదన్వేషణలో గడుపుతుంటాడు.
కనబడినవారందరినీ అడుగుతుంటాడు...
మీరు భగవంతుణ్ణి చూశారా?
భగవంతుణ్ణి చేరడానికి మార్గం చూపగలరా? అని.

తెలిసో తెలియకో ఒకరోజు అతను భగవంతుని గుమ్మం వద్దకు చేరుకుంటాడు.

తలుపు తడితే భగవంతుడు తలుపు తెరుస్తాడు.

ఆ పరిస్థితిలో ఉన్నాడు తానిప్పుడు.

తలుపు తట్ట బోయి, చేయి వెనక్కి లాగేసుకుంటాడు.

"ఆ తర్వాత నా పరిస్థితి ఏమి?" అనే ఆలోచన కలిగి, భయమేసి...

తన కాళ్లకున్న బూట్లశబ్దం విని, ఎక్కడ తలుపు తెరుస్తాడో అని
నెమ్మదిగా బూట్లు విప్పి చేతిలో పట్టుకొని,
నిశ్శబ్దంగా తిరిగి అక్కణ్ణుంచి జారుకుని ఇంటికి చేరుకుంటాడు...

మరునాడు నుంచి మళ్లీ మామూలే... భగవదన్వేషణ సాగిస్తూ ఉంటాడు...కనబడిన సాధువులనంతా అడుగుతుంటాడు...మీరు భగవంతుణ్ణి దర్శించారా? నాకు మార్గం చూపగలరా? అని.

* * *

విషయమేమంటే-
అన్వేషించే ప్రతి ఒక్కడికీ తెలుసు
భగవంతుని చిరునామా.

లోపల వీడికి నిజంగా భగవంతుణ్ణి చేరుకోవాలని ఉండదు.

ఎందుకంటే అదొక పులిగుహ అని తనకు తెలుసు.
వ్యక్తిత్వాన్ని కోల్పోతామేమోనని తనకు వణుకు.

తెలిసి తెలిసి ఎవడు కరెంటుతీగను ముట్టుకుంటాడు?

దేవుడు అవసరమైనట్టు,
దేవుణ్ణి అన్వేషిస్తున్నట్టు
పైకి నటిస్తాడు అంతే.

లోపల అంత తీవ్రత ఏమీ ఉండదు.
అంటే అంత అవసరమేమీ ఉండదు.

ఇప్పటికిప్పుడే
ఇక్కడికిక్కడే

భగవంతుడు సాక్షాత్కరించే అవకాశం ఉంది
ప్రతి ఒక్కరికి.

కానీ తానే అడ్డు.
తనకిష్టం లేదు.

తాను తిరిగే  ప్రతి సందులోనూ తనకు భగవంతుడు ఎదురుపడుతూనే ఉంటాడు...

భగవంతుడు ఎదురుపడ్డప్పుడల్లా
తాను మరో సందులో దూరి తప్పించుకుంటూ వుంటాడు...

చూసేవారికి మాత్రం తాను దేవుణ్ణి వెతుకుతున్నట్టు
దేవునికే ఇంకా అతనిపై కనికరం కలుగలేదన్నట్టు
ఇతరులకు అనిపిస్తుంది.

నిజానికి భగవంతుడంటే తనకు అవసరం లేదు.
ఆ అవసరంలేనితనాన్ని కనబడనీయకుండా తన శరీరాన్ని
సంప్రదాయవేషాలతో కప్పివేస్తాడు...
ముఖాన్ని ఏవేవో చిహ్నాలతో నింపేస్తాడు...
కోలాహలంగా ఉత్సవాలు చేస్తాడు...
వ్రతాలు చేస్తాడు...
జపాలు చేస్తాడు...

ఒక కన్ను భగవంతునివైపు వేసే ఉంటాడు...
ఎక్కడ నా మీద పడి పెద్దపులిలా స్వాహా చేస్తాడో అని
భయపడుతుంటాడు.

ఆ భయమే పైకి "భక్తి" గా  ప్రకటనమౌతుంటుంది.
ఆ భక్తి లోపలంతా "భయం" తో నిండిపోయింటుంది.

తనకు తెలియకుండానే భగవంతునితో
ఓ distance మెయింటైన్  చేస్తుంటాడు.
ఆ విషయం తనకు మాత్రమే తెలుసు.

ఒకరు గురువుగారిని అడిగారు-
నేనెందుకు ఆత్మస్థితిని పొందలేకపోతున్నాను? అని.

"నిర్ద్వంద్వంగా చెప్పాలంటే....
పొందడం నీకిష్టం లేదు" అన్నారు గురువుగారు.

* * *

నిజంగా వీడికి కావలసింది దేవుడు కాదు.
దేవుని ద్వారా మరేదో కావాలి.
ఆ "మరేదో " వదిలేస్తే భగవంతుడు
ఉన్నపళంగా దొరికిపోతాడు.

కాబట్టి దేవుడు దొరకంది దొరక్క కాదు.
మనకు ఇష్టం లేక.

గురువుగారు అంటారు-
దేవుడు కావాలంటే దేవుణ్ణి ధ్యానించు.
ధనం కావాలంటే ధనాన్ని ధ్యానించు.
కానీ ధనం కొఱకు దేవుణ్ణి ధ్యానించకు...అంటారు.

లోపల ఒకటి, బయట ఒకటిగా ఉంటాం...
లోపలేదో బయట కూడా అదిగానే(transparent)గా ఉంటే అదే శీలం.
శీలమే ముప్పాతిక మతం అంటారు వివేకానందులు.

దేవుని కోసమని చేసేదంతా దేవునికోసం కాదు,
తన కోసమే.
రోగి ఔషదం పుచ్చుకునేది వైద్యుని కోసమా?
తన కోసమే కదా...!

కానీ దేవుని కోసమే నీవు దేవుణ్ణి తలచిననాడు,
నీ ఇంటి పై కప్పు పగులగొట్టుకుని మరీ నీ ముందు సాక్షాత్కరిస్తాడు
భగవంతుడు.

అట్లానే వచ్చాడు నరసింహస్వామి స్తంభం
పగులగొట్టుకుని...నారాయణా...! అని ప్రహ్లాదుడు పిలువగానే...

మనమూ నారాయణా-నారాయణా అంటూనే ఉన్నాం...మనకు నరసింహస్వామి కాదుకదా కనీసం కలుగులోంచి చిన్న ఎలుకపిల్ల కూడా రావడం లేదు...అని తమాషా అన్నారు గురువుగారు.

* * *

తనకు తానై కల్పించుకున్న బంధాల ఫలితంగా కలిగిన కష్టాలే ఇవన్నీను...

నిజానికి ఈ కష్టాలన్నీ కష్టమైన కష్టాలుగా కనిపించే "ఇష్టమైన కష్టాలు".

ప్రియంగా బంధాలు పెంచేసుకున్నాడు...
భగవద్దర్శనంతో అవన్నీ తెగిపోతాయని ఇప్పుడు భయపడుతున్నాడు.

బంధాలు అనేవి నిజంగా దుఃఖాలే అయితే,
పుటుక్కున త్రెంపడానికి ఒక రెప్పపాటు సమయం కూడా పట్టదు.

కానీ త్రెంపడు.
యెందుకంటే అవి -
ఇష్టమైన బంధాలు...
ఇష్టమైన కష్టాలు...

మహనీయులనేవారు పడ్డ కష్టాలు కూడా
ఇష్టమైన కష్టాలే...

కానీ తేడా ఉంది.
వారు భగవద్దర్శనం కోసం పడ్డ కష్టాలు...

మన ఇష్టమైన కష్టం కష్టాల్ని పెంచుతుంది.
వారి ఇష్టమైన కష్టం కష్టాల్ని తొలగిస్తుంది.

మనది పెట్రోలుతో మంటల్ని ఆర్పాలనే ప్రయత్నం.
వారిది నీళ్లతో మంటల్ని ఆర్పాలనే ప్రయత్నం.

రమణులు పరమేశ్వరుని కొరకు
బంధాన్ని, జంధ్యాన్ని త్రెంపేశాడు.

రామకృష్ణులు పరమేశ్వరి కొరకు
కామిని, కాంచనాన్ని వదిలేశాడు.

మనం భగవంతుడి కోసం కనీసం
వక్కపొడి కూడా వదలం.

అన్నీ ఉండాలి, దేవుడు కూడా ఉండాలి
అంటాడు జీవుడు.

నేను తప్ప ఎదీ ఎవరూ ఉండటానికి వీల్లేదు అంటాడు దేవుడు.

అవ్వా కావాలి బువ్వా కావాలి అంటాం మనం.

భగవంతుని కోసం జీవితాల్ని త్యాగం చేసిన మహనీయులు వారు.

తన సీట్ ఖాళీ చేయకనే...
భగవంతుణ్ణి ఆహ్వానిస్తాడు.

నిజానికి భగవంతుణ్ణి ఆహ్వానించనక్కర్లేదు...
తన సీట్(వ్యక్తిత్వాన్ని) తాను ఖాళీ చేస్తే చాలు...
ఆ ఖాళీలో భగవంతుడే నిండిపోతాడు.

వీడు భయపడ్డట్టు భగవద్దర్శనంలో వ్యక్తిత్వనష్టం అయినట్టు
అనిపిస్తుందేగాని,

నిజానికి పరిపూర్ణ మానవుడుగా మారుకుంటాడు...

పావలా పోగొట్టుకుని రూపాయి పొందినట్టుగా...

ఆ రూపాయిలో తాను పోగొట్టుకున్న పావలా కూడా ఉంటుందని తెలిస్తే
ఎవడు త్యాగం చేయకుండా ఉంటాడు?

ఆ టెక్నిక్కే చెబుతాడు గురువనేవాడు-
నా సర్వమూ నీదే అని నీవు భగవంతునితో అంటే
నా సర్వమూ నీదే అని నీతో భగవంతుడు అంటాడు.

నీ సర్వము - పరిమితము.
ఆయన సర్వము - అనంతము.

తనను తాను పొందటానికి పెట్టుబడి తానే.
తనను(పావలాను) "తన"లో(రూపాయిలో) కలిపేయడమే శరణాగతి.

పూర్ణానుభవంలో వ్యక్తి ఉంటాడు...
పట్టపగలు చంద్రుడి వలె...
ఉండీ లేనట్లుగా...

* * *

93. నిర్యాణోత్సవము

---

24 - 8 - 2021 * సద్గురు జయంతి

సద్గురు జయంతి వ్యాసానికి "నిర్యాణోత్సవం" అని పేరు పెట్టాడు బాబు...

ఏమిటా? అని పాఠకులు కించిత్ ఆశ్చర్యపోవచ్చు...

* * *

ఒకడు గురువుగారికి ఫోన్ చేసి-
గురువుగారూ...!
మీకు 80 వ జన్మదిన శుభాకాంక్షలు అండీ...
అని అన్నాడు.

గురువుగారు సమాధానం ఇచ్చేలోపు ఫోన్ కట్ అయ్యింది...

గురువుగారి అద్భుతమైన సమాధానం వినలేకపోయాడు అవతలివాడు.

తన చుట్టూ పరివేష్టించి ఉన్న శిష్యగణంతో ఇలా అన్నారు గురువుగారు -

జయంతి అంటే 79 వరకు ఉన్నవాడు నిర్యాణం అయినట్టే కదా లెక్క...
నిన్నటి వఱకు ఉన్న వ్యక్తి ఈరోజు లేడు కదా!

ఆ వైపు నుండి లెక్క పెడితే - నిర్యాణదినం.
ఈ వైపు నుండి లెక్క పెడితే - జన్మదినం.

కాబట్టి దీనిని
నిర్వాణోత్సవం అనాలా?
జయంత్యోత్సవం అనాలా?
అన్నారు.

* * *

గురువు దృష్టిలో నిర్యాణోత్సవమే.
సదా అతడు "ప్రస్తుత క్షణం" లో సంస్థితమై ఉంటాడు కాబట్టి.

శిష్యుని దృష్టిలో జయంత్యోత్సవం.
ఇతనికి నిన్న-నేడు-రేపు అనే కాలవిభజన
ఉంటుంది కాబట్టి.

గురువు - ఫుల్ స్టాప్ లాంటివాడు.
శిష్యుడు - కామా లాంటివాడు.

గురువు అంటే - ఆగడం.
శిష్యుడు అంటే - కొనసాగడం....
* * *

గురుజయంతి సందర్భంగా దూరప్రాంతాల నుండి వచ్చిన భక్తజనంతో హాలు కిక్కిరిసింది.
అందులో వేంకటనరసయ్యగారు కానుకగా ఇచ్చిన సోఫా అడ్డంగా తోచింది హరికి...

జయంత్యోత్సవం పూర్తయ్యేవరకు ఆ సోఫాను లోపల పెడితే బాగుండును ....
అని గొణిగాడు హరి నా చెవిలో...
నేను పైకి అన్నాను గురువుతో...

గురువుగారు నవ్వి, "అంటే ఆ సోఫా ఖాళీగా ఉందనుకుంటున్నారా?" అన్నారు గురువుగారు.

తాతగారు ఆ సోఫాలో ఆశీనులై ఉన్నారనేది వాస్తవం.

అందుకే కాబోలు ఒంగోలుశ్రీను పటాలను పూలహారాలతో అలంకరించినట్టు ఆ సోఫాను కూడా పూలతో అలంకరించాడు...

బాబు నిజంగా సిగ్గుపడ్డాడు...
ఒంగోలుశ్రీనుకు ఉన్న స్పృహ తనకు లేనందుకు.
* * *

ఒంగోలు శ్రీను అరకేజీ వెండితో ఓ పళ్లేన్ని తయారు చేయించి తీసుకొచ్చాడు...
పళ్లెంలో గురుపాదాలను ఉంచి పాదపూజ చేసుకున్నాడు ఉదయాన్నే.
ఆ పవిత్రజలంతో నిండిన ఆ వెండిపళ్లేన్ని పటాల ముందు ఉంచారు...
ఆలస్యంగా వచ్చినవాళ్లు శిరస్సున చల్లుకోవటానికి...

నేను వెళ్లేసరికే ఆ తతంగం అంతా పూర్తయిపోయి...
అందరూ స్వీట్స్ తింటున్నారు...

నేను గురువు వద్ద బొట్టుపెట్టుకుని, నేరుగా వంటగదిలోకెళ్లా...

వేణుగారు టీ కప్పు చేతికందించారు...
సిప్ చేస్తుండగా...
అనామిక ఆ పవిత్ర జలాన్ని తీసుకొచ్చి
నా శిరస్సున చల్లింది...

తతంగాలకు నేను దూరమని
అనామికకు తెలుసు.

సద్గురు పాదాలవద్ద కూర్చుని వారిబోధామృతజలను మాత్రమే తలదాలుస్తానని
అనామికకు తెలుసు.

* * *

అనంతుడైన గురువుకు పాదాలెక్కడున్నాయి పాదపూజ చేయడానికి?
అంటారు గురువుగారు...

బ్రహ్మ విష్ణువులే ఆ పరమగురువైన పరమేశ్వరుని శిరస్సు ఎక్కడో,
పాదాలెక్కడో కనిపెట్టలేక తిరిగొచ్చి "తెలియదు" అని అంగీకరించారు...

విషయసేకరణే జ్ఞానమని భావించే వెర్రివాళ్లం మనం...
మనం "తెలుసు" అనడం ఎంత తెలివితక్కువ మాటో చూడండి.

"తెలుసు" అని అనడం అజ్ఞానమునం.
"తెలియదు" అని ఉండడం ప్రజ్ఞానమునం.

* * *

గురువుగారు నాకు అనుగ్రహించిన "మేనకోడలు" భవ్యబంగారం...
ఆమెకు కానుకగా రిస్ట్ వాచ్ తెచ్చాను.
దాని విలువ కేవలం - 320.
భవ్య కళ్లలో నాకు కనబడిన ఆనందం విలువ
మూడుకోట్ల ఇరవైలక్షలు...

* * *

ఆ మధ్యాహ్నం అతిధిగృహంలో కూర్చొని కబుర్లు చెప్పుకున్నాం...నేనూ పట్టెయ్య, ఒంగోలు శ్రీను, ప్రసాద్, రాజారాం...

ఎవరికి సాక్షాత్కరించాలో...ఆత్మే ఎన్నుకుంటుంది....అన్న కఠోపనిషత్తు వాక్యం గుఱించి ప్రస్తావనకు వచ్చింది.

కుమ్మరివాడు పాత్రలను ఒక్కొక్క పాత్రను ఒక్కొక్క ప్రయోజనాన్ని ఆశించే పాత్రల తయారీ ప్రారంభిస్తాడు.

అన్నీ మట్టే అయినప్పటికీ,
పాత్ర తయారయ్యాక, ఆయా ప్రయోజనానికి మాత్రమే వాడుకోవడం జరుగుతుంది.

కుండ ప్రయోజనం వేరే.
మూకుడు ప్రయోజనం వేరే.
కుంపటి ప్రయోజనం వేరే.
అన్నీ మట్టే.

అట్లా ఆత్మ ఎన్నుకుంటుంది ఎవరికి సాక్షాత్కరించాలో అనేది.

అది మనల్ని ఎన్నుకోవాలంటే మనమేం చేయాలి? అన్న ప్రశ్నే తప్పు.

నీకు ఇష్టమున్నా లేకున్నా నీ పుట్టుక ప్రయోజనం పూర్తయ్యే తీరుతుంది అంటారు భగవాన్.

భగవాన్ పాత్ర అటువంటి అనుకూలమైంది కాబట్టే ఆత్మ దానికై అది అతణ్ణి ఆవహించింది.

అట్లాని మనల్ని మనం తక్కువ చేసుకోనక్కర్లేదు.

మన ప్రయోజనం ఏదో అది ఉండనే ఉంటుంది.
అది తయారుచేసినవాడి ఇచ్ఛమేరకు ఉంటుంది.

కుండను కుంపటిగా వాడుకోలేం.
కుంపటిని కుండగా వాడుకోలేం.

అంతా మట్టే.
అంతా ఆత్మే.

అనే అవగాహనకే జ్ఞానం అని పేరు.

నీ పుట్టుక ప్రయోజనం పూర్తవగానే
నీవు ఇంకొక్క శ్వాస కూడా తీసుకోలేవు.

దేవుని దృష్టిలో ప్రత్యేకత అనేది లేదు.
ఆయనకు దోమ యెంతో భగవానూ అంతే.

* * *

ఆ సాయంత్రం కొందరు భక్తులు పాశ్చాత్య పద్ధతిలో కేకులు తెచ్చి, దీపాలు ఆర్పి, చప్పట్లు కొట్టి, గోలగోల చేశారు...

అందరూ ఆ దృశ్యాల్ని తమ తమ సెల్ ఫోన్లలో
బంధించివేశారు...

ఆ కేకు వివిధరంగులచే అద్దబడి,
అందంగా ముస్తాబు చేయబడి ఉంది.

ప్లాస్టిక్ కత్తితో కోసి అందరికీ ముక్కలు పంచారు.

ప్రకృతివనం ప్రసాద్ చెప్పినట్టు -
ఈ కేక్ కటింగ్ కాకుండా,
"ఫ్రూట్ కటింగ్" చేస్తే బాగుండును.

* * *

తనకు అవసరం లేకపోయినా
మన అవసరం కోసం అవతరించిన దినం

ఆ మహనీయుని జన్మదినం.

ఈ వేడుక మనకేగాని...వారికి కాదు.

* * *

ఆ మధ్యాహ్నం ఆ రాత్రి వచ్చినవారందరికీ భోజన ఏర్పాట్లు చేశాడు గురుభక్తుడు కిలారు నరేష్...

శాఖాహారం, మాంసాహారం రెండూ ఏర్పాటు చేశారు...

ఎన్నుకోవడం మీ ఇష్టం....అన్నట్టు.

నేనైతే అలాంటిచోట్ల  శాఖాహారం వైపుకు వెళ్లకుండా జాగ్రత్తపడతాను...

బఫె లైన్ లో నిలబడ్డాను...
ఇంతలో భవ్యబంగారం ఒక ప్లేట్ లో అన్నీ వడ్డించుకుని తెచ్చి నా చేతిలో పెట్టి తినమంది...

కొద్దిగా బిరియానీ అన్నం...
కొద్దిగా సాంబార్ అన్నం...
కొద్దిగా చికెన్ ఫ్రై...
నా విందు పూర్తి చేశాను...

అత్తిలి సతీష్ ఆశ్చర్యంగా అడిగాడు -
మీరు చికెన్ తింటారా? అని.

మాంసం తింటే పోయే జ్ఞానం జ్ఞానమే కాదు.
అలాంటి జ్ఞానం మనకొద్దు.

జ్ఞానం అనేది
ఒకదానితో రాదు, ఒకదానితో పోదు...
అన్నాను...

గతంలో గురువుగారు నాకు చెప్పిన బోధనే
పునశ్చరణ చేశాను...

* * *

మరుసటిరోజు ఉదయాన్నే నేనూ దేవీప్రసాద్ సద్గురు సన్నిధికెళ్లాం...

గురువుగారి వద్ద బొట్టు పెట్టుకుని,
చాపమీద కూర్చున్నాం...

పట్టెయ్య నా ప్రక్కనే వచ్చి కూర్చున్నాడు...

రాజారాంయోగి తానే స్వయం టీ పెట్టి ఇచ్చారు...

నిజంగా మూడు యోగాలున్నాయా బాబూ?
అని ప్రశ్నించారు చిన్నగా పట్టెయ్య.

"ఉన్నాయి..." అన్నాను.

నది(సాధకుడు) ప్రారంభదశలో ఉన్నప్పుడు
దానికి సముద్రం(దైవం) కనబడదు.
అయినా తన ప్రయాణాన్ని ఆగనివ్వదు.
ఇది కర్మయోగం.

సంగమం వద్దకు వచ్చేసరికి సముద్రం కనబడుతుంది(ఇదే దైవసాక్షాత్కారం)
సముద్రంలో కలిసిపోతాం అన్న నిశ్చయజ్ఞానం కలుగుతుంది.
ఇటు జీవ స్పర్శ, అటు దైవ స్పర్శ రెండూ ఉంటాయి ఆ సంగమసమయంలో.
ఇది భక్తియోగం.

పూర్తిగా సముద్రంలో కలిసిపోయి
సముద్రం ఒక్కటే శేషించడం పరమపదం.
ఇది జ్ఞానయోగం.

మొదటి రెండు యోగాల్లో "వ్యక్తి" ఉంటాడు.
జ్ఞానయోగంలో వ్యక్తి ఉండడు.
అంటే వ్యక్తిగా ఉండడు, దైవంగా ఉంటాడు.

* * *

ప్రశ్నావతారమైన పట్టెయ్యగారు...
సమాధానమే స్వరూపంగా ఉన్న సద్గురువు...
ఎదురెదురుగా కూర్చున్నారు...

ఈ గురు-శిష్యుల మధ్య సంవాదం(సంగ్రామం) మొదలయ్యింది...

శిష్యుడైన పట్టెయ్య తన సందేహాస్త్రాలను
గురువు పైకి యధేచ్ఛగా వదులుతున్నాడు...

"బహుశా ఇది పట్టెయ్యకు అనవసరమేమో...."
అంటున్నాడు పట్టెయ్య....
తనను తాను సమర్థించుకుంటున్నట్లుగా...

పట్టెయ్యకు అవసరాలు-అనవసరాలు ఉండడం కాదు, అసలు "పట్టెయ్యే అనవసరం"
అని హఠాత్తుగా పట్టెయ్య పైకి బ్రహ్మాస్త్రం వదిలారు గురువుగారు.

పట్టెయ్య "చచ్చి" ఊరుకున్నాడు.

అంతటితో మాటల యుద్ధం(సత్సంగం)ముగిసింది.

* * *

స్వప్నంలో -
కొంత సత్యం,
కొంత అసత్యం ఉంటుందా?
మొత్తం అసత్యమే కదా?

ఇల అంతా కల అన్నాక
ఇందులో మనం చేసే సత్యాసత్యవిచారణ అంతా కూడా కలలో భాగమే కదా అవుతుంది...

పట్టెయ్య ను మినహాయించి అంతా మిధ్య అంటాడు.
ముందు పట్టెయ్యే మిధ్య అని తెలిస్తే
మొత్తం సమస్య పోతుంది.

* * *

గతంలో కూడా ఇలాగే పట్టెయ్య -
"ఈ విపరీతపరిస్థితుల్లో  జీవించడం కష్టమైపోతోంది స్వామీ...!"అన్నాడు.

"ఎవడు జీవించమన్నాడు?" అని పిడుగు లాంటి సమాధానం ఇచ్చారు గురువుగారు.

* * *

పట్టెయ్య: సద్గురు బోధలు విన్న తర్వాత
ఇక వేరే శాస్త్రాలతో
పనిలేదనిపిస్తోందండీ....

బాబు: బల్లి పడితే శాస్త్రంగాని,
పిడుగు పడితే ఇక శాస్త్రంతో పనేముంది?
(తానే ఉండడు కదా!)

* * *

తెలిసో తెలియకో పట్టెయ్య ప్రశ్నలు అడగడం వల్లనే కదా....గురు బోధామృతాన్ని మనం జుర్రుకోగలుతున్నాము...

శిష్యుడే లేకుంటే గురువెక్కడ?
ప్రశ్నే లేకుంటే సమాధానమెక్కడ?
జీవుడే లేకుంటే దేవుడెక్కడ?

"నీ నొక్కడ లేకుండితే నీ కృపకు బాత్రమేది?
పూని నావల్లనే కీర్తి బొందేవు నీవు."
అని తన స్వామిని దబాయిస్తారు అన్నమయ్య.

* * *

నిజంగా అత్యాశ్రమమే అయితే,
ప్రవేశద్వారం వద్ద "ఇదంతా ఒట్టిదే" అనే బోర్డు పెట్టించాలి.

లోపల కూర్చొని ఎంత లోతైన వేదాంతవిషయాలైనా
మాట్లాడుకోవచ్చు...తప్పులేదు.

ఇదంతా ఒట్టిదే అనేది గుర్తులో ఉంటే చాలు.

* * *

ఒక క్లబ్ ఉంది-
అందులోకి ప్రవేశించాలంటే గేట్ వద్ద 100 రూ డిపాజిట్ చేసి లోపలికెళ్లాలి.
లోపల ఆటలు ఆడి, వేలు లక్షలు సంపాదించవచ్చు,
తిరిగి బయటకు రావాలంటే, లోపల సంపాదించినదంతా ఆ గేట్ వద్ద ఇచ్చివేయాలి. నీవు డిపాజిట్ చేసిన 100 రూ నీకు తిరిగి ఇచ్చివేస్తాడు...
అప్పుడే గేట్ దాటి బయటకు రాగలవు.

ఈ ప్రపంచం కూడా ఓ పెద్ద క్లబ్ లాంటిదే.
తల్లియోనియే ప్రవేశద్వారం ఈ ప్రపంచానికి.

ఏమైనా సంపాదించు, ఎంతైనా సంపాదించు.
అన్నీ ఇక్కడే వదిలేసి తిరుగుప్రయాణం అవ్వాలి.

శ్మశానమే ఆ నిర్గమద్వారం...దేహాన్ని కూడా అక్కడ వదిలేసి వెళ్లాలి.

అక్కడ కట్టెల్లో కాలనిది...మిగిలేది...
నీవు Deposit చేసిన 'అహం' ఒక్కటే.

అహం ఆడే ఆటలే ఈ జన్మ-కర్మలు.

ఆట అని మరచి ఆడే వాడు - కర్మయోగి.
ఆట అని తెలిసి ఆడేవాడు - రాజయోగి.
ఆటా వద్దు, అలసటా వద్దు అనుకునేవాడు - జ్ఞానయోగి.

కర్మయోగి - బుద్ధుడు.
రాజయోగి - జనకుడు.
జ్ఞానయోగి - రమణుడు.

ఆట వద్దనుకున్నవాడు రమణుడు.
అందుకే ఆయన ఊరక ఉన్నాడు.
వచ్చినవాళ్లకు కూడా ఊరక ఉండు అని చెప్పారు.

లేదు మేము సాధనలు, ప్రయత్నాలు చేస్తాం...అంటే,

"అలాగే చేసుకోండీ....కర్మలను, కర్మఫలాలను గేట్ వద్ద వదిలి వెళ్లాలి అనే విషయం జ్ఞప్తిలో ఉంచుకుని ఏమైనా చేసుకోండి..."అంటారు గురువుగారు.

* * *
ఏదో ఒక విషయం ప్రస్తావన వచ్చినప్పుడు -
ప్రస్తుతం అవసరం అనో... లేదా
ప్రస్తుతం అవసరం లేదు అనో... సాధారణంగా అంటుంటాం.
నిజానికి "ప్రస్తుతం" (వర్తమానం) అనేదే అవసరం
అన్నారు గురువుగారు.
* * *
సద్గురు: ఒకే నాణేనికి ఉన్న బొమ్మ-బొరుసు
ఈ  జ్ఞానం-అజ్ఞానం.
బాబు  : శుద్ధజ్ఞానంలో వ్యవహారం ఉండదు.
వ్యవహారం ఉండాలంటే
కొంత అజ్ఞానం మిక్స్ అవ్వాలి...
సద్గురు: కొంత కాదు, అంతా...
వ్యవహారమే అజ్ఞానం.
* * *
బస్సు ఎక్కాక టికెట్ తీసుకొని తీరాలి...
నేను అద్వైతిని...నాకు అన్యంగా ఎవరూ లేరు...అంతా నేనే...అంటే,
ఆ కండక్టర్ మెడపట్టి బయటకు తోస్తాడు.
ఆచరణయందు అద్వైతము కూడదు.
అద్వైతము కేవలము అనుభవైకవిషయం.
* * *
లోపల-బయట అని రెండుగా నీకు తోస్తున్నంతకాలం సమస్య తెగదు.
ఉంటే లో లేని వెలి మాత్రమే ఉందను.
లేదంటే వెలి లేని లో మాత్రమే ఉందను.
సమస్య తీరిపోతుంది...అన్నారు గురువుగారు.
* * *
గురువు వద్ద శెలవు తీసుకుని బయటకురాగానే,

అత్తిలి సతీష్ అన్నాడు-
శ్రీకాళహస్తిలో కాపురం పెట్టాలని ఉంది....అని.

"దూరపు కొండలు నునుపు" అన్నాన్నేను.
మీరు ఉన్నచోటనే ఉంటూ...
అక్కడే ఏదో ఒక పనిచేసుకుంటూ...
భార్యాబిడ్డలతో హాయిగా బ్రతుకును వెళ్లదీయడం కంటే గొప్ప ఆధ్యాత్మికత ఏదీలేదు...
అంటూ దేవీప్రసాద్ బండివెనుక కూర్చొని  బయలుదేరాను....

సత్సంగం నుండి వ్యాపారం వైపుకు...
జ్ఞానయోగం నుండి కర్మయోగం వైపుకు...
* * *

94.  "నాది" అనేది ఏదీ "నేను" కాదు

---

27-8-2021 * శ్రావణ శుక్రవారం

ఈ ఉదయం 5.45 కు సద్గురు సన్నిధికెళ్లాం...
వంటగదిలో పట్టెయ్య అల్లంటీ పెడుతున్నాడు...
నేనూ కాస్త సహాయంగా ఉండి...అందరికీ టీ కప్పులు అందించాను...
* * *

తీటగల భాగ్యశాలికి
నీటుగలుగు గోళ్ళు - వేడినీళ్ళు లభింపన్
తాటించి బఱుకసాగిన
తీటయె దేవేంద్ర పదవి తిరముగ జగతిన్!

దురద ఉన్నవాడు, ఎవరున్నా సరే జంకకుండా
గోళ్ళతో గీకి రక్తం వస్తున్నా సరే వదలకుండా
బరుకుతాడు.
దురద ఉన్న చోట వేడినీళ్లు పోస్తే
అదొక సుఖంగా ఉంటుంది.

అందుకే ఓ కవి ఈ దురదను దేవేంద్ర పదవి అంతటిదిగా
హాస్యపూరితంగా చమత్కరించాడు.

* * *

నిన్న గురువుగారికి వీపు దురద పుడితే
పట్టెయ్యగారు గోకారట...

ఈ సందర్భంలో గురువుగారు పై పద్యం చెప్పి నవ్వించారట...

గురువుగారికి కాళ్లు నొప్పులు పుడితే
సంతోష్ భార్య మసాజ్ చేశారట...

గురువుగారు అన్నారట-
గురువుకు కలిగిన దురదలే, నొప్పులే
శిష్యులకు సేవచేయడానికి అవకాశమైంది...అని.

అంతేగా...అంతేగా...

శివా...!
నేను పసువునైతేనే కదా
నీవు పసుపతి అయ్యేది...

నాకు ఆపద కలిగితే కదా
నీకు ఆపద్బాంధవుడనే పేరొచ్చేది...

నాకు దయనీయమైన పరిస్థితి వస్తేనే కదా
నీకు దయామయుడు అని బిరుదొచ్చేది...

* * *

అన్నీ సుఖాలే ఉంటే నాటకం రక్తి కట్టదు.
సుఖదుఃఖాలు రెండు కలగోపుగా ఉంటేనే
ఈ జగన్నాటకం రసవత్తరంగా ఉండేది.

భగవంతుడు సుఖాల్ని  అందరికీ ఇస్తాడు...
కష్టాల్ని మాత్రం భరించగలిగే శక్తి ఉన్నవానికే ఇస్తాడు.

సుఖాల్ని అనుభవించేవాని కంటే
కష్టాల్ని అనుభవించేవాడే
భగవంతుని బాధ్యతల్ని యెక్కువ మోస్తున్నట్టు లెక్క.

ఇంటి బాధ్యతను ఇంటి యజమాని తీసుకొని భరించినట్టు.

అమృతానికి అందరూ ఎగబడ్డారు.
హాలాహలాన్ని శివుడొక్కడే భరించాడు.

కష్టాలను దిగమ్రింగి జీవించేవాడు
శివస్వరూపుడు.

భగవంతునికి ఏకైక ఆత్మీయుడు - దుఃఖితుడు.
ఆత్మవిషయమై దీనులైనవారు ధన్యులు...
పరలోకరాజ్యం వారిదే...అంటారు క్రీస్తు.

* * *

బ్రహ్మానందం, విషయానందం అని రెండు లేవు.
విషయానందంగా ఉండేది కూడా బ్రహ్మానందమే.

ఏనుగు తినే ఆహారం, చీమ తినే ఆహారం వేఱువేఱుగా కనబడ్డా
"తృప్తి" ఒక్కటే.

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటునిద్రదియు నొకటే
అంటారు అన్నమయ్య.

తల్పం మీద రాజు పడుకోవచ్చు
తన చేయినే తలగడగా బంటు పడుకోవచ్చు
ఆదమరచి నిద్రించే "నిద్ర" ఒక్కటే.

* * *

బ్రహ్మానందం అనేది విషయానందానికి వేఱే అని,
ఆ బ్రహ్మానందాన్ని  పొందటానికి గురుసేవ, సాధనలు చేయాలని
కపటగురువులు తమ పబ్బం గడుపుకోవడానికి చేసే ప్రబోధాలవి...

ఈ కపట వ్యవస్థను "గురుదుకాణం" అన్నారు UG.

అదొక అంగడి అన్నమాట...

ఆధ్యాత్మిక వ్యవస్థ అంతా
పైకి తాజాగా చూపించి, పాత సరుకు అమ్ముకునే వ్యాపారసంస్థ.

ఆ పాతమాటల్నే, ఆ ఎంగిలి మాటల్నే
ఈ గురువులందరూ గొప్పగా బోధిస్తారు...
ప్రవచనకర్తలందరూ అబ్బా అనిపిస్తారు...

వాటి వల్ల -

మరో బుద్ధుడు రాలేదు.
మరో కృష్ణుడు రాలేదు.
మరో శంకరుడు రాలేదు.
మరో రమణుడు రాలేదు.

తీగలో పూవు పుట్టినట్టు పుడతాడు జ్ఞాని.

ప్రబోధాలతో, ప్రయత్నాలతో జ్ఞానిని తయారు చేయలేం.

* * *

గురుభక్తుడు సంతోష్ అన్నాడు -
మీరేమో ఆత్మస్థితిలో ఉండి మాట్లాడుతున్నారు...
మేమేమో దేహస్థితిలో ఉండి వింటున్నాము...
మన మధ్య దూరం చాలా ఉంది... అని.

గురువుగారు చిరునవ్వుతో -
నేను ఏ స్థితిలోనూ లేను.
అన్ని స్థితులూ "నాలో" ఉన్నాయి.
* * *
కలకు, కలకనేవాడికి మధ్య యెంతదూరం ఉంది?
అంతే దూరం నీకూ నాకు మధ్య ఉండే దూరం కూడా...అని అన్నారు.

* * *

ఒకరు అడిగారు -
రహస్యం అంటారు కదా!
రహస్యం అంటే ఏమిటి స్వామీ...? అని.

"రహస్యం ఏమీ లేదు...
రహస్యం ఏమీ లేకపోవడమే రహస్యం."
అని బహు చమత్కారంగా సెలవిచ్చారు సత్యాన్ని గురువుగారు.

చిదంబరంలో తెర వెనుక ఉండే రహస్యం అదే.
తెర తీస్తే ఏమీ ఉండదు.
ఆ "ఏమీలేనితనాన్ని"(అంబరాన్ని) గుర్తించే తానే
చిదంబరేశ్వరుడు.

"ఏమీలేదు" అని ఉండడమే పరమార్థం.
"ఏదో ఉంది" అనుకోవడమే అవివేకం.

* * *

మాకు తెలిసిన ఓ బౌద్ధభిక్షువు అన్నాడు -

కరోనా వైరస్ ద్వారా చనిపోయినవారు
మహా పుణ్యం చేసుకున్న వారు...
ఉన్నత లోకంలో ఉంటారు....అని.

"అసలు బ్రతికున్నవాడే లేడు అంటుంటే
ఇంక చనిపోయినవాడు ఎక్కడ ఉంటాడు?
అన్నారు గురువుగారు.

వీడు అసలు పుట్టనేలేదంటారా...!
ఆశ్చర్యపోతూ అడిగాడు పట్టెయ్య.

యెందుకంటే తత్త్వం మరీ కూసు అయిపోయి,
తానే లేకుండా ఐపోతానేమోనని తోస్తోంది పట్టెయ్యకు.

ఆ "అంతిమదశ"కు చేరుకునేశామని పట్టెయ్యకు అవగతం అవుతోంది...

గురువుగారు ఇలా కొనసాగించారు-

"నేను ఉన్నాను" అన్న తరువాతే పట్టెయ్య ఉన్నాడు.

"నేను ఉన్నాను" అన్న తరువాత సుబ్రహ్మణ్యం ఉన్నాడు.

"నేను ఉన్నాను" అని అనకపోతే...
పట్టెయ్యా లేడు....
సుబ్రహ్మణ్యమూ లేడు...

* * *

గురువుగారు ఇలా  ముగింపు పలికారు -

"దానికి ఇంత వేదాంతం కూడా తెలియవలసిన అవసరం లేదు...

కొండ గుర్తు ఏమంటే-

"నాది" అని చెప్పబడే ఏదీ "నేను" కాదు.
అని తెలిస్తే సరిపోతుంది.
అన్నారు.

దాన్నే అజాతమంటారా? అని కొన ఊపిరితో ఉన్న ప్రాణిలా గొణిగాడు పట్టెయ్య ...
"అదికూడా కాదు..." అంటూ తులసితీర్థం లాంటి మాట అన్నారు గురువుగారు.

నిశ్శబ్దం....
ఆ తర్వాత మౌనం...

"తెలిసింది" అనడానికి అక్కడ పట్టెయ్య ఉంటేగా...?

అక్కడ గురు-శిష్యులు లేని "ఖాళీ" మిగిలింది.

అదే నిర్వాణం...

అదే పరమపదం...

* * *

95.  అభావమే మోక్షం

---

28-8-2021 * శనివారం

ఈ ఉదయాన్నే 5.45 కు సద్గురు సన్నిధికి చేరుకున్నాం...

గురుపుత్రుడు యుగంధర్ అందరికీ టీ పెట్టి ఇచ్చాడు...

యుగంధర్, మా తమ్ముడు మునిరాజ ఒకేరోజు ఒకేసారి ఒకటో తరగతిలో చేరడం నాకు ఇప్పటికీ స్పష్టంగా గుర్తుంది...

* * *

రాత్రి వర్షం పడడం వల్ల, గాలి చల్లగా వొంటిని తాకడం...

ఎదురుగా గురువుగారు మనసుకు ఆహ్లాదం కలిగించే బోధలు చేస్తుండడం...

ఈ భౌతిక-ఆధ్యాత్మిక సుఖాలను అందించే
ఈ దృశ్యానికి నేపథ్యసంగీతంలా TTD ఛానెల్ లో వస్తున్న అన్నమయ్య సంకీర్తనం...

ఇలాంటి సమయంలో ఆత్మీయులు దేవీప్రసాద్, పట్టెయ్య గార్లతో కలిసి వేడి వేడి ఛాయ్ సిప్ చేస్తూ ఉండడం...

నిజంగా ఈ ఉదయాలన్నీ నా జీవితంలో ధన్యత పొందిన ఉదయాలు...

* * *

గురువుగారు పట్టెయ్య వైపు చూస్తూ -

ఎవరు మాట్లాడినా నీవు మాట్లాడినట్లుగానే ఉండాల...
ఎవర్ని చూసినా నిన్ను చూస్తున్నట్టే ఉండాల...
అన్నారు.

ఇదే కదా అద్వైతస్థితి...
"నేను" తప్ప మరేదీ లేని స్థితియే అద్వైతం.

ఓసారి శంకరుల వెనుక ఏదో అలికిడి అయ్యింది...

ఎవరక్కడ? అన్నారు శంకరులు...

"నేను" అన్నాడు పద్మపాదుడు.

"నేను అనేది నీకు అంత ప్రియమైతే
అనంతంగా పెంచుకో....

లేదంటే "నేను" అనేదాన్ని పూర్తిగా తీసేవేసేయ్...
అన్నాలు శంకరులు...

నిజానికి రెంటి స్థితి ఒక్కటే.
వ్యష్టిత్వం కోల్పోవడం.

మొదటిది - సోహం(అద్వైతం)
రెండవది - దాసోహం(విశిష్టాద్వైతం)

వ్యష్టిత్వం పోవడమే నిజంగా ధ్యానం.
తానుండి ధ్యానం చేయడం కాదు,
తాను లేకపోవడమే ధ్యానం.

పెట్టవలసింది శ్వాస మీద ధ్యాస కాదు,
పెట్టవలసింది ధ్యాస మీద ధ్యాస...
అంటారు గురువుగారు.

నేను అన్న తొలి తలంపుకు(కాండమునకు)
కలిగిన తలంపులే(శాఖలే) మిగిలినవన్నీ...

ఆ తొలి తలంపే(ధ్యాసే) - పార్వతి.
ఆ ధ్యాస మీద ధ్యాసే - శివుడు.

* * *

శివాలయం క్యూ లైన్ లో వేచి ఉన్న భక్తులలో
మొదటి భక్తుడు - విష్ణువు.

విష్ణ్వాలయం క్యూ లైన్ లో వేచి ఉన్న భక్తులలో
మొదటి భక్తుడు - శివుడు.

* * *

బట్ట కట్టకుండా బయటకు రాలేకున్నావు...
ఇది చాలదా నీకు దేహాభిమానం ఉందో లేదో తెలియడానికి?

దిగంబరుడుగా ఉండాలని నా ఉద్దేశం కాదు,
నలుగురిలో ఉన్నప్పుడు నీ మొలకు కట్టుకున్న బట్ట జారినప్పుడు, ఏ మాత్రమూ కంగారు పడకుండా తీసి కట్టుకోగలిగే స్థితి నీకు ఉన్నప్పుడు, నీవు బట్ట ధరించినా ధరించనివాడివే...దిగంబరుడవే.

* * *

TV లో వక్త మనవైపే చూస్తూ ఆధ్యాత్మిక ప్రవచనం చేస్తూ ఉన్నట్లుంది...

మనం చూస్తున్నట్టు ఆ వక్తకు తెలియదు.

అలాగే మన మాటలు(బోధలు),
చేతలు(సాధనలు)
ఏవీ భగవద్దృష్టిలో లేవు.

* * *

సత్యాన్ని గురించి చెప్పినవాళ్లంతా
అది తన గురించి తాను చెప్పుకున్నదేగాని,
సత్యాన్ని గుఱించి చెప్పడం కాదు.

చెప్పబడిందంతా అసత్యమే.
అసత్యానికి మాటే ప్రమాణం.

సత్యానికి మౌనమే ప్రమాణం.
మాట లోపల ఉండవచ్చు.
"లోపలి మాట" సత్యంగానే ఉంటుంది.

లోపలిమాట బయటకు వస్తే అసత్యమైపోతుంది.
లోపల్నే ఉంటే సత్యంగానే ఉంటుంది.

దేవీప్రసాద్ తన వ్యాససంపుటికి "లోపలి మాట" అని పేరు పెట్టాడు...అదే చెప్పాడు గురువుతో...

లోపలి మాట....అని నీవు చెప్పగానే బయటి మాటైపోయింది కదా...!
అన్నారు గురువుగారు.
అందరం నవ్వుకున్నాం.

తాను ఎవరి గుఱించి చెప్పినా, దేని గుఱించి చెప్పినా అది తన గురించి తాను చెప్పుకోవడమే అవుతుంది. తన డైరీనే అవుతుంది.

రామాయణం వాల్మీకీ డైరీ.
మహాభారతం వ్యాసుని డైరీ.
ప్రపంచం ఈశ్వరుని డైరీ.
అన్నారు గురువుగారు.

"నా గురువు" అనే బాబు వ్రాసిన వ్యాససంపుటి కూడా బాబు డైరీనే అన్నాడు దేవీప్రసాద్.

పట్టెయ్య క్షణకాలం అవాక్కై ప్రసాద్ వైపు చూశాడు...

ప్రసాద్ అన్నది నిజమే...

"నా గురువు" వ్యాసాలన్నీ బాబు తత్త్వమే...
గురుతత్త్వం కాదు.

వాల్మీకి తత్త్వాన్నే రామతత్త్వంగా చదువుకుంటున్నాం.

వ్యాసతత్త్వాన్నే భగవద్గీతగా చదువుకుంటున్నాం.

* * *

శివుడు అద్దంలో చూసుకుంటే ప్రపంచం కనబడుతుంది.

ప్రపంచం అద్దంలో చూసుకుంటే శివుడు కనబడతాడు.

అద్దం - మాయ.

* * *

తనను తాను మరచి శివుడు జీవుడైనాడు.
తనను తాను మరచి జీవుడు శివుడవ్వాలి.

శివుడు తనను తాను మరవడం - సృష్టి.
జీవుడు తనను తాను మరవడం - ముక్తి.

* * *

ఏ ఆలోచనా లేకుండా ఉండాలి...
అని అనుకోవడమే పెద్ద ఆలోచన.

* * *

"అప్పురేపు" అని తన అంగడి ముందు బోర్డు పెట్టాడు ఓ వ్యాపారి.

"అప్పురేపు" అంటే
"అప్పులేదు" అని దానికి అర్థం.

దేవుడు దొరకడానికి గురువు చెప్పే ఉపాయాలన్నీ(సాధనలన్నీ) అలాంటివే.

వాటి సారాంశం - "దేవుడు దొరకడు" అనే.

అప్పురేపు అన్నాడని మళ్లీ రేపు వెళ్లడం ఎంత మూర్ఖత్వమో

"ఆత్మను పొందలేం" అని గురువు కరాఖండితంగా చెప్పాక కూడా
సాధనలు చేయడం కూడా అంతే మూర్ఖత్వం.

* * *

దరిద్రుడు ఎవడు అంటే
నేను దరిద్రుణ్ణి అని అనుకునేవాడు.

సంపన్నుడు ఎవడు అంటే
నేను సంపన్నుణ్ణి అని అనుకునేవాడు.

బంధం ఉంది అనుకునేవాడు బంధితుడే.
నేను ముక్తుణ్ణి అనుకునేవాడు ముక్తుడే.

యద్భావం తద్భవతి...
నీవు ఏది భావిస్తే అదే అయిపోతావ్...

ఏకంగా ఉన్న దేవుడు
అనేకం అవ్వాలని భావించాడు.
అదే ప్రపంచం.

తిరిగి ఏకం వైపుకు
తాను చేసే భావం - ధ్యానం.
అదే పరమపదం.

భావపరంపరయే ప్రపంచం.
భావపరంపరయే ఆధ్యాత్మికం.

నేను బాబు అనుకోవడమూ ఓ భావమే.
శివోహం అనుకోవడమూ ఓ భావమే.

* * *

ఓ ఖైదీ కారాగారము నుండి విడుదలై బయటకు రావడం అంటే,
చిన్నజైలు నుండి పెద్దజైలుకు రావడమే.

స్వేచ్ఛ ఎక్కడా లేదు...ఎప్పుడూ లేదు....

ముక్తి అన్నా , మోక్షం అన్నా "విడుదల" అనే కదా అర్థం...

మళ్లీ ఈ ప్రపంచమనే జైలుకు రాకుండా చేసే ప్రయత్నాలే కదా ఆధ్యాత్మికం అంటే...

ఒక జైలు(ప్రపంచం) నుండి
మరో జైలుకు(మరో ప్రపంచానికి) మారే
మధ్య వ్యవధి - మరణం.

కాబట్టి పునర్జన్మలో క్రొత్త శరీరమే కాదు,
క్రొత్త ప్రపంచమే ఏర్పడుతుంది.

నేను దేహం అనే భావమే - పాపం.
శివోహం అనే భావనే - పుణ్యం.
అభావమే - మోక్షం.

* * *

ఈ వ్యాసం పూర్తవగానే...
లీలమ్మగారు వాట్సప్ లో కంచికామకోటి పీఠాధిపతి చంద్రశేఖర
పరమాచార్యులవారి వీడియో క్లిప్ పెట్టారు...
అదే ఈ వ్యాసానికి ఆశీర్వాద సూచిక.
స్వామివారి దివ్యపాదారవిందములకు
ఈ వ్యాసం అంకితం....

* * *

96. ఆఖరి మజిలీ

---

29-8-2021 * ఆదివారం

ఈ ఉదయాన్నే 5.45 కు సద్గురు సన్నిధికి చేరుకున్నాం నేనూ దేవీప్రసాద్.

పట్టెయ్య అందరికీ టీ పెట్టి ఇచ్చాడు...

'బోధిహీన్' అనే సన్న్యాసనామం కలిగిన బౌద్ధభిక్షువు వచ్చారు
గురుదర్శనానికి...

గురుపాదాలపై ముమ్మారు పడిలేచి నమస్కరించుకున్నారు...

వారి నమస్కారాలు పూర్తవగానే, గురువుగారు లేచి ఆ బౌద్ధబిక్షువు
పాదాలను తాకి నమస్కరించికున్నారు...

అందరూ ఆశ్చర్యపోయారుగానీ
నేనేమీ ఆశ్చర్యపోలేదు ఆ పట్టానికి.

తన గురువు కాషాయాంబరధారి కాబట్టి
కాషాయాంబరం అంటే పరమగౌరవం వారికి.
అలాంటివారిలో తన గురువునే దర్శించుకుని
నమస్కరించుకుంటారు.
గతంలో నేను  చాలాసార్లు చూశాను...

పట్టెయ్య గారన్నారు-
మీరు ఆ బౌద్ధబిక్షువుతో ఏమీ మాట్లాడలేదే! అని.

"ఏముంది మాట్లాడ్డానికి?
వారు లక్ష్యం ఉన్నవారు...
మనం లక్ష్యం లేనివారం...అన్నాను.

కర్తవ్యాన్ని బోధించేది బౌద్ధం - కర్మయోగం.
కర్తవ్యాన్ని తొలగించేది వేదాంతం - జ్ఞానయోగం.
* * *

కళ్లెదుట ఉన్న ప్రపంచాన్ని వొదిలి
దీనికి ఆధారంగా ఏదో ఉందనడానికి

మీకేం హక్కు ఉంది అని ఆక్షేపిస్తుంది బౌద్ధం.
ఇంద్రియగోచరమైన జగత్తు తప్ప బౌద్ధమతానికి మరేమీ అక్కర్లేదు.

ఉంటే త్రాడు ఉంటుంది, లేదంటే పాము ఉంటుంది.
అంతేగాని ఒకే వస్తువు ఏకకాలంలో త్రాడుగాను, పాముగాను ఎలా ఉండగలదు?

అలాగే ప్రపంచం ఒకటి,
దానికి ఆధారమైనది మరొకటి అంటూ
రెండు లేవు...ఉన్నదంతా ఒక్కటే.

"య స్సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ"  అంటుంది బృహదారణ్యకోపనిషత్తు.

ఎప్పుడూ మరుగే లేదు దానికి...
నేను పామును చూస్తున్నాను అని అనుకునేటప్పుడు కూడా
నీవు చూసేది త్రాడునే.

బట్టబయలుగా ఉండేది త్రాడే.
పాము అనేది నీ భ్రాంతి మాత్రమే.

నేను - అనేది బ్రహ్మము.
నామరూపములు - అనేవి వ్యవహారము.

పాము-పాము అంటుంటాడు శిష్యుడు...
త్రాడు-త్రాడు అని గుర్తుచేస్తుంటాడు గురువు.

ఇదే సద్గురు సత్సంగం వలన ప్రయోజనం.

* * *

నిన్న ఉదయం గురువు వద్దకు వెళ్లినప్పుడే అన్నారు గురువుగారు...

బాబూ...!  ఓ సన్న్యాసి వచ్చి హాలులో తిరుగుతున్నట్టు....రాత్రి కల వచ్చింది...అని.

ఈరోజు ఉత్తరభారతం నుండి ఓ బౌద్ధబిక్షువు ఇక్కడకు వస్తున్నారని...ఫోన్ చేశారని...చెప్పారు.

అనుకున్నట్టుగానే ఆ బౌద్ధబిక్షువు నిన్న సాయంత్రం చేరారిక్కడకు.

మా రామమందిరంలో ప్రతి శనివారం భజన కార్యక్రమంలో నేను తప్పనిసరిగా ఉండవలసిన బాధ్యత నాకు ఉండడం వలన మా కైకాలవీధి సత్సంగానికి ప్రతిశనివారం శెలవుదినం...

అందుకే దేవీప్రసాద్ కు ఈరోజు గురువు వద్ద గడుపుదాం అనిపించి ఒక్కడే వెళ్లాడు...

అక్కడప్పుడున్న  సన్నివేశాన్ని దేవీప్రసాద్ మాటల్లోనే విందాం -

నేను గురుసన్నిధిలోకి అడుగుపెట్టగానే
గురువుకు ఎదురుగా బౌద్ధ బిక్షువు ఒకరు కూర్చుని కనిపించారు...

గురువుగారి వద్ద బొట్టు, తీర్థం తీసుకొని
చాప మీద కూర్చున్నాను...

"తెలిసినవానికి మౌనమే స్వరూపం" అన్నట్లు
గురువుగారు...

"తెలియనివానికి మౌనమే రక్షణ" అన్నట్లు
బౌద్ధ బిక్షువు...

మౌనంగా కూర్చొని ఉన్నారు...

చాలా సమయం వరకు వారి మధ్య నిశ్శబ్ధమే రాజ్యమేలింది...

ఆ నిశ్శబ్ధాన్ని ఛేదిస్తూ -
"ఏదైనా చెప్పండి స్వామీ..." అన్నారు గురువుగారు ఆ బౌద్ధభిక్షువుతో.

"నేను నేర్చుకోవడానికి వచ్చాను స్వామి...!"
అన్నారు ఆ బౌద్ధ భిక్షువు వినమ్రతతో.

"అయితే చెప్పడానికి ఏమీలేదా" అన్నారు గురువుగారు నవ్వుతూ...

"నేను స్వామివారి వద్ద కొన్నాళ్ళు శిక్షణపొంది, కొంత అధ్యయనం చేసి వెళ్ళాలనుకుంటున్నాను...
నేను మీ శిష్యుల అందరి యొక్క పాదదూళినే తప్ప, నేనేమీ గ్రహించినగురువును కానేకాను...

నేనిక్కడకు రాకమునుపే నేనిక్కడ తిరుగాడుతున్నట్టు మీకు స్వప్నం రావడం...
మీరు చెప్పడం...అదొక అద్భుతమైన అనుభవంగా అనిపించింది...
అన్నారు ఎంతో అణకువతో.

గురువుగారు అతనివైపు చూసి -

"రాత్రి మీరు కనిపించింది కలలోనే.
ఇప్పుడు కనిపిస్తుండేది కూడా కలలోనే"
అంటూ పకపక నవ్వడంతో అందరూ నవ్వేశారు.

మళ్ళీ గురువుగారే అన్నారు -
"ఇదే మీకు ఆఖరి మజిలీ...
ఇంకెక్కడా మజిలీ చేయవలసిన అవసరంలేదు" అని చెప్పడంతో ఆ బౌద్ధ బిక్షువు ముఖంలో ఆనందం వెల్లివిరిసింది.

మీ పూర్వాశ్రమం...? అడిగారు గురువుగారు.

"నేను పూర్వాశ్రమం గురించి అందరి ముందూ వెల్లడించలేను స్వామీ...
అన్నారు బౌద్ధబిక్షువు.

దానికి గురువుగారు ఇలా సమాధానమిచ్చారు -

"పూర్వాశ్రమం గురించి వెల్లడించక పోవడానికి కారణం ప్రస్తుత ఆశ్రమమే.
మీరున్న ఆశ్రమమే దానికి కారణం.
దానికి నియమ నిబంధనలు ఉన్నాయని చెప్పారు మీరు.

అసలు నియమ నిబంధనలు ఎందుకు చెప్పారంటే సన్న్యాసికి ఉద్దేశించి చెప్పినవి కావవి.  ఇతరులను ఉద్దేశించి చెప్పినవి అవి.

సన్న్యాసికి అసలు ఆశ్రమమే లేదు.
ఆశ్రమం ఉంది, నేను సన్న్యాసిని అని చెబితే సన్న్యాసాశ్రమానికి అది తగదు అని అర్థం దానికి.

అసలు 'నియమ నిబంధనలు' సన్న్యాసికి లేవు అని చెప్పడానికే చెప్పారు నియమాలు.

1. సన్న్యాసికి నియమ నిబంధనలు లేవని సన్యాసికి చెప్పారు.

2. సన్న్యాసి యొక్క పూర్వాశ్రమం గురించి ఆలోచించవద్దని ఇతరులకు చెప్పారు"

అని గురువుగారు చెప్పడంతో
గురువుగారివైపు నిశ్చేష్టుడై చూస్తున్నాడు బౌద్ధ బిక్షువు.

కాసేపు మౌనం తర్వాత గురువుగారే మళ్ళీ మొదలెట్టారు...

"మామూలుగా కుటుంబంలో ఎంతమంది ఉంటారు? అంటే ఐదుమందో, ఆరుమందో ఉండారు అని అంటాం. కనీసం ముగ్గురైనా ఉంటారు కదా...

నిజానికి, ఏ కుటుంబం ఎత్తుకున్నా "ఒక్కడే" ఉండేది. ఒక్కరికి మించి ఏ కుటుంబంలోనూ ఉండరు.

ఎలా? అంటారేమో...

వాళ్ళందరూ తమ గురించి ఏమంటారు?
"నేను-నేను" అనే కదా మాట్లాడుకుంటారు...
అన్ని కుటుంబాలలో మాట్లాడేది ఆ "నేను" అనేదే కదా!

కాబట్టి ఉన్నది 'నేను' ఒక్కటే.

మన కుటుంబంలోనే కాదు, : కూడా ఉండేది "నేను" ఒక్కటే.

ఈ హాల్ లో ఎంతమంది ఉన్నామంటే?
లెక్క వేసి 12 మంది ఉన్నారంటాం...
కానీ, ఎంతమంది ఉన్నా , ప్రతిఒక్కరూ "నేను-నేను" అనే మాట్లాడుతున్నారు కాబట్టి 'నేను' అనేవాడు ఒక్కడే ఉన్నట్టు లెక్క.

ఒక్కడున్నా ఒక్కడే. లక్షమంది ఉన్నా ఒక్కడే.

ప్రపంచమంతా తిరిగి తిరిగి చెప్పిన వివేకానందుడు చిట్టచివరలో - "ఇంత చెత్త మాట్లాడానా ఇన్నేళ్ళు?" అని బాధపడ్డాడట...చిట్టచివరలో ఆ విషయం గుర్తించాడు ఆయన.

* * *

"ఈ లోకం కుక్కతోక వంటిది అని...
అది అలానే ఉండడం దాని స్వభావం అని...
నిర్ణయానికొచ్చారు వివేకానంద.

వారు చివరకు అన్ని వ్యవహారాలూ వదిలి,
"అమ్మ" కు శరణాగతి పొందారు.
వారి Encyclopedia లో చివరి పుస్తకంలో చివరి మాటలు నన్ను బాగా ఆకర్షించాయి....

వారు చివరగా పలికిన పలుకులు,
అంతకు ముందు వారు పలికిన పలుకులకు పూర్తిగా విభిన్నమైనది...

చివర్లో మనకు క్రొత్త వివేకానంద కనబడతారు...

విచిత్రమేమంటే-
వివేకానంద ఎక్కడ ఆపారో,
రమణులు అక్కడ నుండి ప్రారంభం చేశారు.

ఇవే వివేకానంద చివరిమాటలు -

నా వెనుక ఆశ ఉండింది.
నా ప్రేమ వెనుక వ్యక్తిత్వమున్నది.
నా పవిత్రత వెనుక భయమున్నది.
నా నేతృత్వము వెనుక అధికార దాహమున్నది.

ఇప్పుడు అవన్నీ అదృశ్యమైపోతున్నవి...
నేను కొట్టుకుపోతున్నాను...
వస్తున్నాను జననీ! వస్తున్నాను...
నీ వెచ్చటి ఒడిలో లోకాతీతమైన లోకములో
నీ ఇష్టం వచ్చిన ఏ చోటికి నీవు నన్ను తీసుకెళ్లినా
అక్కడకి వస్తాను...
నేనిక కర్తను కాను...సాక్షిని మాత్రమే.

* * *

మాట్లాడబడేదంతా చెత్తే....
వేదాలకాడ నుంచి అన్నీ...
మన మాటలతో సహా...

"అహం బ్రహ్మాస్మి"
"నేను బ్రహ్మమై ఉన్నాను" అని చెప్పింది బ్రహ్మంకాదు,
"నేను" అనేదే బ్రహ్మము.

"నేను" అని ఎవరు చెప్తున్నారో
వారినే బ్రహ్మము అని పిలవాలి...

ఏమీ తెలియని చిన్న బిడ్డలు కూడా
"నేను-నేను" అంటున్నారు కదా!

అందువల్ల పసివాణ్ణి "బాల బ్రహ్మము" అన్నారు.

కాబట్టి...
"నేను" ఎవరని తెలుసుకోవాలంటే -
ఇప్పుడు ప్రసాద్ అని చెప్పబడే "నేను"ను
అంటకుండా
ప్రసాద్ కు వెనుకవైపు ఉండు అని దాని అర్థం.

అస్పృశ్యుడు అంటే అవమానించినట్లు ఫీలవుతాం...
ముట్టుకోవడానికి కూడా పనికిరానివాడు అని.

నిన్ను నీవు తాకకుండా నిన్ను నీవు చూడగలిగితే నీవు అస్పృశ్యుడివి అని లెక్క.

"నేను ప్రసాద్" అనేదాంట్లో -

"నేను" అనేది - తాకలేనిది.
"ప్రసాద్" అనేది - తాకరానిది.

అందుకే నీకు నీవు ఒక్క అడుగు ఎడంగా ఉండు...
అని చెప్పింది.

నీవు ప్రసాద్ ను స్పృశిస్తే ప్రసాదే నీవైపోతావు...
ప్రసాద్ ను స్పృశించకుండా ఉంటే నీవు ఏదిగా ఉండాలో అదిగా ఉంటావు...

నేను, ప్రసాద్ ఇద్దరూ ఉంటారుగాని, ఒకరినొకరు తాకరు. తాకకుండా ఉండే నువ్వే నువ్వు. ప్రసాద్ కాదు అని చెప్పింది. అస్పృశ్యుడు అంటే ఇదే.

ఇది ఎవడికివాడు తన పట్ల ఉండవలసిన 'పవిత్రమైన అస్పృశ్యత' ఇది .

కాసేపు నిశ్శబ్దం...

గురువుగారు తల ఎత్తి గడియారం వైపు చూసి... "టైం అయిపోయిందే..." అంటూ
తన పడకను సిద్దంచేయడానికి శిష్యులను పురమాయించారు...

మనం -
ఎన్ని తలచినా...
ఎన్ని మాట్లాడినా...
ఎన్ని చేసినా...
చివరకు నిద్రపోవల్సిందే కదా!

* * *

"దినం"లో ఆఖరి మజిలీ నిద్ర.
"జీవితం"లో ఆఖరి మజిలీ మరణం.
"జన్మపరంపర"లో ఆఖరి మజిలీ సద్గురువు.

* * *

ఈ వ్యాసం పూర్తవగానే, రమణభక్తులు దోనెపూడి వెంకయ్యగారు రమణ గ్రంథాలను రెండు పంపారు... ఈ అల్పజీవిని గుర్తుపెట్టుకుని మరీ పంపారు ఎంతో ప్రేమతో....

ఈ వ్యాసానికి రమణభగవాన్ ఆమోదముద్ర లభించినట్లైంది...

శ్రీరమణపాదారవిందములకు ఈ వ్యాసం అంకితం...

* * *

97. గురువుకు మించిన శిష్యుడు

---

2-9-2021 * గురువారం

ఈరోజు మధ్యాహ్నం 12 గంటలకు రమణభక్తులు, రాచపల్లి రమణసేవాశ్రమ ప్రధానసేవకులు అయిన రామస్వామిగారు ఫోన్ చేశారు.

వారిని ఎవరో అడిగారట-
స్వామీ! "గురువుకు మించిన శిష్యుడు" అంటారే! ఆ మాట ఎలా వచ్చింది? అని .

అందుకు రామస్వామివారు-
అయ్యా...ఆ ప్రశ్నకు సమాధానం ఏమోగాని
శ్రీకాళహస్తిలో "బాబు" అనేవారున్నారు...
నాకు తెలిసి అతనే గురువుకు మించిన శిష్యుడు...అని చెప్పారట...

* * *

సరే, దానిని అలా ప్రక్కన పెడదాం....

నిజానికి నాకూ సందేహమే..."గురువుకు మించిన శిష్యుడు" అనే మాట ఎలా వచ్చింది? అనేది.

ఎందుకంటే -
ఉన్నది సద్వస్తువు ఒక్కటే.
దానికి ఇతరం లేదు.

అనే బోధను ఉపనిషత్ కాలం నుంచి
సద్గురు సుబ్రహ్మణ్యుని వరకు
చెబుతూనే వస్తున్నారు...

అలాంటప్పుడు గురువుకు "మించిన" అనేమాట ఎలా వస్తుంది....

మించడానికి ఏముంది?

ఆకాశానికి మించి(ఆవల) అంటూ ఏమైనా ఉంటుందా?

సప్తస్వరాలు కాకుండా అష్టమ స్వరం ఉంటుందా?

"ఏకం సత్ విప్రా బహుదా వదన్తి" అని ఆర్యోక్తి.
ఒకే సత్యాన్ని జ్ఞానులు రకరకాలుగా ప్రబోధిస్తారు.

సత్యంలో వైవిధ్యత ఉండదు,
సత్యప్రకటనంలో వైవిధ్యత ఉంటుంది.

అలా గురువుకన్నా శిష్యుడు వైవిధ్యభరితంగా update గా చెప్పడంలో 'గురువుకు మించిన శిష్యుడు' అన్నారేమోగానీ, సత్యంలో, తత్త్వంలో హెచ్చుతగ్గులుండవు.

భూమ్మీద ఎత్తుపల్లాలుంటాయేగానీ
ఆకాశంలో ఎత్తుపల్లాలు ఎలా ఉంటాయి...!

లేదా ఆకాశం ఒకచోట చిక్కగానూ, మరొకచోట పలుచగానూ ఉందని చెప్పగలమా?

అలా ఏమీలేదుకదా!

* * *

ఈ జగత్తు మిథ్య అని చెప్పడానికి....
స్వప్నాన్ని ఉపమానంగా చెప్పేవారు ఉపనిషత్ ఋషులు...
ఉపనిషత్ కాలానికి దర్పణం కనిపెట్టబడలేదు...

మన ఆండాళ్ తల్లి కూడా స్వామివారికోసమని అల్లిన పూదండలను తన మెడలో ధరించి, నీటిలో తన ప్రతిబింబాన్ని చూసుకొని
మురిసిపోయినట్లుగా ఉంది....
అప్పటికి దర్పణాలు లేవు.

శంకరులకాలానికి దర్పణం వచ్చింది.
శంకరులు దర్పణాన్ని ఉపమానంగా చెప్పేవారు.

రమణుల కాలానికి సినిమా వచ్చింది.
వారు ఎక్కువగా సినిమాను ఉపమానంగా చెప్పేవారు.

నామరూపచిత్రములు-ఆధారవస్త్రము-వెలిగించు వెలుగు....అని.

ఇప్పుడు కంప్యూటర్లు, మెమొరీకార్డులు, చిప్పులు, మౌసులు...వచ్చాయి

వాటిని ఉపమానంగా చెప్పడం వలన
ఈ తరం వారు సులభంగా అవగాహన చేసుకునే వీలుంటుంది.

పాతవాళ్లకంటే కొత్తవాళ్లు అలా అప్-డేట్ అయి ఉండడం వలన అలా గురువుకు మించిన శిష్యులు అన్నారేమోగాని, "మించిన" అనేదానికి అర్థమేలేదు తత్త్వంలో.

గురువు వద్ద ఈ విషయం ప్రస్తావిస్తే-

గురువుకు మించిన శిష్యుడు అంటే,
గురుస్థాయికి తాను ఎదిగే వరకు
'గురువు తనకు మించినవాడు' అనే
భావనతోనే కదా ఉండేది...
సమస్థితికి తాను చేరుకున్నప్పుడు
ఆ "మించిన" అనే భావనకు మించిపోతాడు.
అదే గురువుకు మించిన శిష్యుడు అంటే...అన్నారు.

ఆధ్యాత్మికం అంటే గురువే.అంతే.
ఇంకొక్క మాటే లేదు.
శిష్యుడు లేని గురువే ఆధ్యాత్మికం అంటే.
అని కరాఖండితంగా చెప్పారు గురువుగారు.

* * *

మహాభక్తవిజయంలో పండరీపుర భక్తుల జీవితకథలు చదివితే....'ఒకరికి మించి ఒకరు' ఉన్నట్టు.... అన్నట్టు మనకు కనబడతారుగానీ

నిజానికి ఒకే "పరమతత్త్వం" గురు-శిష్య పరంపరగా అలా జీవనదిలా సాగుతోందని మనకు అర్థమౌతుంది...

మత్స్యేంద్రనాథులు - గోరక్షనాథుడు - గహినీనాథుడు - నివృత్తినాథుడు - జ్ఞానేశ్వరులు - ముక్తాబాయి - విశోభాదేవుడు - నామదేవుడు....
ఇలా....సాగింది ఆ గురు-శిష్య పరంపర...

పండరీపురనాథుడైన పాండురంగణ్ణి కేంద్రంగా చేసుకుని ఆ గురు-శిష్య ప్రవాహం చంద్రభాగానదిలా అలా ప్రవహించింది...

వారి జీవితగాధలను సంక్షిప్తంగా చెప్పుకుందాం-

* * *

కూరగాయలమ్మా....కూరగాయలూ....అంటూ వీధిలో కూరగాయలు అమ్మేవాడిని చూశామేగానీ,

రెండుపోళీలిస్తే బ్రహ్మాన్నిస్తానోయ్....అని అరుచుకుంటూ వీధిలో తిరిగినవానిని చూశామా?

* వారే మత్స్యేంద్రనాథులు... *

ఊళ్లో వాళ్లంతా పిచ్చివాడని నవ్వుకున్నారేగానీ
అడిగింది రెండుపోళీలే కదా ... ఇచ్చేద్దాం... అన్న ఆలోచన ఒక్కడికి కూడా రాలేదు.

పైగా మోక్షమనేది వేల సంవత్సరాలపాటు తపస్సు చేసిన ఋషులకే అది అసాధ్యమైన విషయంగా ఉంది...అలాంటిది రెండు పోళీలకే ఎక్కడైనా మోక్షం వస్తుందా? అని ఎవడూ దానిని పట్టించుకోలేదు...

కానీ ఒకడు మాత్రం అతడు పిచ్చివాడు కాడని,
మన పిచ్చిని పోగొట్టడానికి విచ్చేసిన మహనీయుడని గుర్తించాడు...

* అతడే గోరక్షనాథుడు... *

మరి ఆ రెండు పోళీలను తానెక్కడనుండి తేగలడు...?
తాను నాలుగిళ్లు భిక్షాటన చేసుకుని జీవించే తనకు పోళీలు యెక్కడనుండి వస్తాయి...?

ఈ జనాలను ఆకర్షించే దిశగా తాను ఆ పోళీలను సేకరించాలి...అని వెంటనే తన శిష్యుణ్ణి వెంటపెట్టుకుని, ఊరి చివర ఉన్న ఒకచెట్టుకొమ్మకు తలక్రిందులుగా వ్రేలాడుతూ తలక్రింద మంటను రగిలించమన్నారు.

ఊరు ఊరంతా అక్కడకు చేరుకుంది మన ఊరికి ఎవరో మహనీయులు వచ్చారని...

అక్కడ  దృశ్యాన్ని చూసి అంతా ఆశ్చర్యచకితులయ్యారు....

ఆ స్వామివారికి మేం ఏం చేస్తే సంతోషం కలుగుతుందో చెప్పగలరా? అని శిష్యులను అడిగారు ఆ ఊరిజనమంతా.

పెద్ద గంగాళానికి పోళీలు చేసి పెట్టండి...అదే వారికి తృప్తి...అన్నారు శిష్యులు...

ఇంకేం...అపమేఘాలమీద పోళీలు తయారు చేసి గంగాళంతో నింపి తెచ్చారు...

గోరక్షనాథుడు అందులో రెండు పోళీలు తీసుకొని పరుగెత్తుకెళ్లి మత్స్యేంద్రనాథులవారికి ఇచ్చి సాష్ఠాంగపడతాడు...

మత్స్యేంద్రనాథులు ఆ రెండు పోళీలను తీసుకుని, చిన్నముక్కలుగా కొరికి పక్షులకు, కుక్కలకు వేసి మిగిలినది ఏటిలోకి వేయగానే ఇద్దరూ అదృశ్యమయ్యారు...

జనం మహిమలకే తప్ప జ్ఞానానికి విలువివ్వరు.
ఇంద్రజాలికుడికి ఇచ్చినంత విలువ కూడా జ్ఞానికి ఇవ్వరు.

అలా ఎందరో జ్ఞానులు మనకళ్ల ముందే తిరుగాడుతూ కూడా మనం గుర్తించకనే మరుగైనవారు ఎంతోమంది ఉండి ఉంటారు...

"నేను జ్ఞానిని" అని వాళ్లు మెడలో బోర్డు వేసుకొని తిరగరుగా...

"జ్ఞానిని జ్ఞానే గుర్తించగలడు" అంటారు భగవాన్.

వారికి కీర్తితో, గుంపుతో  అవసరం ఉండదు.

ఉదాహరణకు మన గురువుగారినే తీసుకోండి...
శ్రీకాళహస్తిలో...LIC కాలనీలో...కొడుకింట్లో...
ఓ దివాన్ కాట్ మీద కూర్చొని...సిగరెట్ కాలుస్తూ...Tea త్రాగుతూ... TV చూస్తూ... జీవితాన్ని అలా నిమ్మళంగా గడిపేస్తున్నారు...

అడవిగాచిన వెన్నెల్లా అనిపిస్తుంది...క్రొత్తగా వచ్చి చూచేవారికి...

ఈ మూల ఓ మహాజ్ఞాని ఇలా ఎవరికీ తెలియబడకుండా సాధారణంగా గడిపేస్తున్నారే! అని ఆశ్చర్యపడతారు...

కానీ అడవిలో గాచిన వెన్నెల వృధా అవుతోందని ఎందుకు అనుకోవాలి?

జ్ఞాని ఒక్కరి దృష్టిలో కూడా పడకుండా ఓ కొండగుహలో కూర్చొని తన జీవితాన్ని ముగించేయవచ్చుగాక, కాని అతని ఉనికి లోకానికంతా శ్రేయస్సును చేకూరుస్తుంది.

అందుకునేవాళ్లు అందుకుని తరిస్తారు.
అందుకోలేనివాళ్లు అందుకోసం మళ్లీ జన్మిస్తారు.
మునిగిపోయేదేముంది?
లోకవత్ లీలాకైవల్యం...
అంతా లీల...క్రీడ...అని అన్నారుగా.

* * *

నేపాల్ లో రాజు, ప్రజలు గోరక్షనాథుణ్ణి ఎంతగానో గౌరవిస్తారు...
నాణేల మీద కూడా వారి బొమ్మని ముద్రించారు.

ఓరోజు నేపాల్ రాజు గోరక్షనాథుని దర్శనానికెళతాడు...

రాజు తన సన్నిధిలోకి రాగానే రాజుపై ఉమ్మివేస్తాడు...

అది కిరీటం మీద పడుతుందేమోనని అలా వెనక్కి వాలుతారు...

అప్పుడా ఎంగిలి రాజు పాదాలపై పడుతుంది...

"నా ఎంగిలి నీ తలపై పడి ఉంటే నీవు గొప్ప సామ్రాజ్యపతివి అయ్యేవాడివి. నీ కాళ్ల మీద పడింది కాబట్టి ఒక చిన్నరాజ్యానికే రాజుగా ఉండగలవు..." అంటారు గోరక్షనాథుడు.

* ఈ గోరక్షనాథుని శిష్యుడు గహినీనాథుడు... *

గహినీనాథుడు ఓ అరణ్యంలో ఓ గుహలో తపస్సు చేసుకుంటూ ఉంటారు...

అతనికి తెలుసు-
పులిచేత తరుమబడుతూ తన సన్నిధిలోకి తనకు కాబోయే శిష్యుడు రాబోతున్నాడని...

* ఆ శిష్యుడే నివృత్తినాథుడు. *

* * *

విఠల్ పంత్ అను పేరుగల తీవ్రవైరాగ్యము గల గృహస్థుడొకడు ఇల్లును, ఇల్లాలిని వొదిలి కాశికెళ్లి రామానందస్వామి అనే గురువు వద్ద చేరి తానొక ఏకాకినని అబద్ధం చెప్పి మరీ మంత్రదీక్ష పొందుతాడు.

ఓసారి రామానందస్వామి రామేశ్వరయాత్ర చేస్తూ
ఆళంది చేరుకుంటారు...
ఆళంది విఠల్ పంతు మామగారి ఊరు.

విఠల్ పంతు భార్య రుక్మిణీ తమ గ్రామానికి రామానందస్వామి అనే గొప్ప మహనీయుడు వచ్చాడని దర్శనానికి వెళుతుంది.

ఆ స్వామి "పుత్రవతీ భవ" అని ఆశీర్వదిస్తారు. రుక్మిణి నవ్వుకుంటుంది. నవ్వడానికి కారణమేమని ప్రశ్నిస్తారు స్వామి...

విషయమంతా పూస గ్రుచ్చినట్టు చెబుతుంది.
ఆ విఠల్ పంత్ తన శిష్యుడేనని గ్రహించి
రామేశ్వరయాత్రను విరమించుకుని,
తిరిగి కాశీకెళ్లి విఠల్ పంత్ ను కాషాయవస్త్రాలను తొలగింపజేసి
తక్షణం ఆళంది వెళ్లి గృహస్థాశ్రమాన్ని స్వీకరించమని ఆజ్ఞాపిస్తాడు.

విఠల్ పంతుకు గుర్వాజ్ఞను శిరసావహించక తప్పలేదు.
మళ్లీ సన్న్యాసాశ్రమం వదిలి గృహస్థాశ్రమం స్వీకరిస్తాడు.

నలుగురు రత్నాల్లాంటి బిడ్డలకు తండ్రి అవుతాడు...

1. నివృత్తినాథుడు
2. జ్ఞానేశ్వరులు
3. సోపాను
4. ముక్తాబాయి.

ఇటు గృహస్థాశ్రమానికి, అటు సన్న్యాసాశ్రమానికి కళంకం తెచ్చిన వ్యక్తిగా విఠల్ పంతును ఊరు వెలివేస్తుంది...

విఠల్ పంతు తన ఊరిని వదిలి కుటుంబ సమేతంగా త్ర్యంబకేశ్వరం వెళ్లిపోయి అక్కడున్న బ్రహ్మగిరికి ప్రదక్షిణలు చేస్తూ ఉండగా ఒక పులి

తరుముకుంటుంది...భయంతో అందరూ తలా దిక్కు పరుగెడతారు...అందులో పెద్దకుమారుడు నివృత్తినాథుడు ఒక గుహలో వెళ్లి దాక్కుంటాడు.

ఆ గుహలో గోరక్షనాథుడునాథుని శిష్యుడు గహినీనాథుడు తపస్సు చేసుకుంటూ ఉంటారు...

నివృత్తినాథుని జన్మ ధన్యమయ్యింది.
వారిని తన గురువుగా భావించి వారి సేవలో నిమగ్నమవుతారు...

నివృత్తినాథుడికి 'రామకృష్ణహరి' మంత్రాన్ని ఉపదేశిస్తారు గహినీనాథుడు.

ఆ తరువాతి కాలంలో నివృత్తినాథుని వద్ద తమ్ముడు జ్ఞానేశ్వరులు మంత్రోపదేశం పొంతుతాడు.

* నివృత్తినాథుని శిష్యుడు - జ్ఞానేశ్వరులు. *

జ్ఞానేశ్వరులు-
15 వ ఏటనే "జ్ఞానేశ్వరీ" భగవద్గీతను వ్రాశారు.
21 వ ఏటనే(క్రీ.శ.1296) ఆళందిలో జీవసమాధి పొందారు.

జ్ఞానేశ్వరుని వద్ద తమ్ముడైన సోపాను,
చెల్లెలైన ముక్తాబాయి మంత్రదీక్ష పొందుతారు...

* జ్ఞానేశ్వరుని శిష్యురాలు - ముక్తాబాయి *

ఆ నాలుగురూ మహాయోగులే...

అష్టసిద్ధులను వశం చేసుకున్నవారే...

ముక్తాబాయి ఓరోజు రొట్టెలు కాల్చుకోవడానికి పెనం  కొనడానికి సంతకెళుతుంది.

అక్కడ పాత్రలు అమ్మే విశోభా ఆమెకు పాత్ర ఇవ్వక అవమానిస్తాడు...

ముక్తాబాయి ఏడుస్తూ తన అన్నగారైన జ్ఞానేశ్వరుల వద్దకు వచ్చి చెప్పుకుంటుంది...

జ్ఞానేశ్వరులు తన వీపునే నిప్పులు గ్రక్కే పెనంగా మార్చివేసి, ముక్తా! నీవు నా వీపు మీద రొట్టెలు కాల్చుకోవచ్చు...అంటారు...

ఆ దృశ్యాన్ని చూచిన విశోభా భయంతో వణుకుతూ జ్ఞానేశ్వరుల పాదాలపై పడుతాడు.

నీవు పడవలసింది ముక్తాబాయి పాదాలమీద...
ఆమెకు శిష్యుడవై తరించు...అని చెబుతారు జ్ఞానేశ్వరులు.

ముక్తాబాయి పాదాలకు అంకితమైపోయాడు విశోభా.

* ముక్తాబాయి శిష్యుడు - విశోభాదేవుడు. *

* ఈ విశోభా శిష్యుడు - నామదేవుడు.*

నామదేవుడు విశోభాకు ఎలా శిష్యుడయ్యాడో
ఆ  కథ చూద్దాం...

నామదేవుడు పండరీపురంలోని పాండురంగస్వామితో ముఖాముఖిగా, చనువుగా మాట్లాడగలిగేంత  మహాభక్తుడు.

స్వామి నాతో తప్ప ఎవరితోనూ అంత చనువుగా ఉండరని కించిత్ గర్వం కూడా ఉంది నామదేవునికి.

ఈ గర్వాన్ని పోగొట్టడానికి పాండురంగడు, జ్ఞానేశ్వరులు కలిసి ఆడిన నాటకం చమత్కారంగా ఉంటుంది.

* * *

జ్ఞానేశ్వరులు, నామదేవులు, మిగతా భక్తబృందం కలిసి తీర్థయాత్రలకు వెళతారు...
తిరిగొచ్చి అన్నసమారాధన చేస్తారు...

భోజనాలు జరుగుతూ ఉన్న సమయంలో...
జ్ఞానేశ్వరులు, కుమ్మరి అయిన గోరాకుంభార్ ను పిలిచి, గోరా! నీవు కుండలను తయారుచేసేప్పుడు...కుండలు బాగా కాలాయా? లేదా? అని పరీక్షించడానికి చిన్న కర్రతో కొట్టి పరీక్షిస్తావుగా....

ఇదిగో (భక్తులవైపు చూపించి)  ఇవన్నీ బ్రహ్మ తయారుచేసిన కుండలు...వీటిల్లో ఏవి గట్టివో, ఒట్టివో పరీక్షించి నాకు చెప్పు...అని పురమాయిస్తారు.

గోరాకుంభార్ పని ప్రారంభిస్తాడు...
ఒక్కొక్కరి తలపై కొడుతూ వెళుతుంటాడు...
అందరూ నిమ్మకుంటారు...
నామదేవుని వద్దకు వచ్చేసరికి నామదేవుడు హూంకరిస్తాడు...
నేనెవరనుకున్నావ్...సాక్షాత్తు పాండురంగనితోనే ముఖాముఖి మాట్లాడేవాడిని...
అలాంటిది నన్నే పరీక్షిస్తావా? అని అంటారు...

స్వామీ...! ఈ కుండ సరిగా కాలలేదు...అని బిగ్గరగా అంటాడు గోరాకుంభార్...

అందరూ నవ్వుకుంటారు...

అది అవమానంగా భావించి వడివడిగా పాండురంగస్వామివద్దకెళ్లి జరిగిన అవమానం గురించి వాపోతాడు...

గోరాకుంభార్ పరీక్షించేటప్పుడు అందరూ ఊరకున్నారు కదా... మరి నీవు కూడా ఊరకుండవలసింది అంటారు స్వామి...

పుండు మీద కారంలా అనిపించింది నామదేవునికి స్వామి మాటలు...

స్వామీ...మీరుకూడానా నన్ను అవహేళన చేస్తున్నారు...? అని బాధపడతాడు నామదేవుడు.

"నేనేం చెప్పను? మన మధ్య ఉన్న సఖ్యత వలన నీకే సమాధానమూ చెప్పలేకున్నాను...

నా అంతటివాడు అయిన విశోభా అనేవాడొకడున్నాడు...
ఫలానా శివాలయంలో ఉంటారు...
వెళ్లి వారిని కలువు...
నీకు సమాధానం దొరుకుతుంది...
అంటారు స్వామి.

స్వామి చెప్పారు కదా అని బిరబిరా ఆ శివాలయం వెళతాడు...

అక్కడ అతనికి కనబడిన దృశ్యాన్ని చూసి అవాక్కవుతాడు....

విశోభాదేవుడు శివలింగం మీద తన రెండుకాళ్లు పెట్టి పడుకుని ఉంటాడు...

తన స్వామి "నా అంతటివాడు" అని అన్నారుగా...

ఇక చేసేదేమీలేక విశోభా దగ్గరగా వెళ్లి, స్వామీ! ఇది మీకు తగునా?
శివలింగం మీద కాళ్లుపెట్టుకుని పడుకున్నారేమి? అని ప్రశ్నిస్తాడు...

"అయ్యో...అవునా...!! నేను
వృద్ధుడనైపోయాను...కంటిచూపుతగ్గిపోయింది...
కాస్త నా పాదాలను పట్టుకొని శివలింగం లేని చోటులో పెట్టు నాయనా! అని కోరుతాడు విశోభా.

ఆ పాదాలను తన చేతులతో పట్టుకొని ప్రక్కన బెడతాడు...
వెంటనే అక్కడొక శివలింగం పుడుతుంది.
ఆ పాదాలను ఎటువైపు పెట్టినా అక్కడొక శివలింగం పుట్టుకొస్తుంది...
ఆశ్చర్యానికి లోనవుతాడు నామదేవుడు...
భగవంతుడు లేని చోటంటూ లేదని తెలుసుకుంటాడు...
చివరకు నామదేవుడు ఆ విశోభాపాదాలను తన శిరస్సు పైనే పెట్టుకుంటాడు...
తానే శివస్వరూపంగా మారుకుంటాడు....

అప్పట్నుంచి నామదేవుడు పాండురంగని ఆలయానికెళ్లడం మానేశాడు...

పాండురంగడే స్వయంగా నామదేవుని ఇంటికొస్తాడు....

నామదేవా! నిన్ను చూసి ఎన్నాళ్లయ్యింది...!
నా సన్నిధికి రావడం లేదేమి? అని ప్రేమతో నామదేవుని చేతులు పట్టుకుని మరీ అడుగుతారు...

"స్వామీ...! నన్ను ఇంకా మోసం చేయవద్దు....
నీవు లేని చోటు ఎక్కడుంది? చెప్పు" అని అంటాడు నామదేవుడు.

స్వామి ఎంతగానో సంతోషిస్తారు...
తన ప్రియభక్తుడైన నామదేవుడు అద్వైతస్థితికి చేరుకున్నాడని...

ఇప్పుడే ఇక్కడే ఉన్న "చిదంబరం"లో అంతర్థానమౌతారు స్వామి.

* * *

గురువుగారు ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నప్పుడు, ఓ విద్యార్థి అడిగాడట-

డ-ఢ లో "ఢ"కు వత్తు ఇచ్చినట్లు,

ట-ఠ లో "ట"క యెందుకు వత్తు ఇవ్వకూడదు?

"ఠ" అనే అక్షరం అవసరం ఉండదు కదా? అని.

అందుకు గురువుగారు సమాధానం చెప్పలేకపోయారట...

నాకు తెలిసి వాడే "గురువుకు మించిన శిష్యుడు" అని నా అభిప్రాయం.

* * *

'గురువుకు మించిన శిష్యుడు' అనే ప్రస్తావన రామస్వామివారు తేవడం వలన ఈ వ్యాసం వ్రాయాలనే స్ఫూర్తి కలిగింది...

పరమవిరాగియైన శ్రీరామస్వామివారి దివ్యపాదారవిందములకు ఈ దాసుడు ఈ వ్యాసపుష్పాన్ని అంకితమిస్తున్నాడు...

* * *

## 98. Un-Limited

---

4-9-2021 * శనివారం

ఈ ఉదయాన్నే 6 గంటలకు నేనూ దేవీప్రసాద్
సద్గురు సన్నిధికి వెళ్లాం....

గురువుగారు ప్లేట్ లో కొన్ని ఖర్జూరాలు పెట్టుకుని తింటున్నారు...

చెంగల్వరాయరెడ్డి న్యూస్ పేపర్ చదువుతున్నాడు...

వంటగదిలో యుగంధర్ "టీ" పెడుతున్నాడు...

ఇంతలో బౌద్ధభిక్షువు వచ్చారు...
గురువుగారితో నమస్కార ప్రతినమస్కారాలు అయ్యాయి...

బౌద్ధబిక్షువు తనకు కేటాయించబడిన చైర్ లో కూర్చున్నారు...

మనుషుల వైపు, పరిసరాల వైపు చూడకుండా తదేకంగా నేల వైపే చూస్తూ యెంతో అణకువగా చాలాసేపు అలా కూర్చునే ఉన్నారు...

బహుశా బౌద్ధసాధకులకు అదొక నియమమేమో...
లేక అది వారి స్వభావమేమో...
నాకు తెలియదు.

* * *

నిన్న గురువుగారు నెల్లూర్ హాస్పిటల్ కు వెళ్లొచ్చారు... జనరల్ చెకప్ కోసం...

ఏం చెప్పారు డాక్టర్లు? అడిగాను...

అంతా బాగుంది...పాదాలవాపు తగ్గడానికి వాకింగ్
చేయమన్నారు...అంతే...అన్నారు.

కొడుకుల్లో, శిష్యుల్లో కనబడ్డ ఆదుర్దా వారిలో రవ్వంతైనా కనబడలేదు...

వారు కేవలం "ఉనికి" గా ఉంటారు...అంతే.
ఉనికే జ్ఞానలక్షణం.

ఆ ఉనికి అనే కొక్కేనికి తగిలించబడ్డ ఓ చొక్కాలా తోస్తుంది వారి శరీరం.

శరీరంతో సంబంధం లేకుండా వారు ఉన్నట్టు తోస్తారు మనకు...

అందుకే వారు నిత్యనూతనంగా కనిపిస్తారు...

అందువల్ల వారికి వయసైపోయినట్టు మనకు అస్సలు అనిపించరు...

గురువుకు దూరంగా ఉన్నవారు సైతం
గురువు తమ వెంట ఉన్నట్టే అనుభూతి చెందుతుంటారు.
సదా వారి presence ను అనుభవిస్తుంటారు...

వారికి తనువొక భావన.
ఉనికి వారి స్వరూపం.

"నేనూ ఉన్నాను...నన్ను కూడా కాస్త గమనించు..."
అని ఆ శరీరం వారితో మొరపెట్టుకోవడమే వ్యాధిగా ప్రకటనం కావడం...

"అలాగే-అలాగే" అంటూ  దానిని గుర్తించి ఆశీర్వదించే ప్రక్రియే ఔషధసేవనం...

తప్పితే, శరీరమే లేనివాడికి వ్యాధి ఎక్కడిది? వైద్యుడెవడు? ఔషధమేమిటి?

ఇదంతా శరీరం వఱకే పరిమితమైపోయిన వాళ్ల లెక్కలే తప్పితే,

తాను లేక తాను వెలిగేవానికి
తాను తప్ప ఏమీ లేనివానికి
ఏ లెక్కా లేదు.
ఏ చిక్కూ లేదు.
* * *

రాత్రి పడుకోబోయే ముందు ఉప్పు కలిపిన వేడినీళ్లలో పాదాలను కాసేపు పెడితే వాపులు తగ్గుతాయి...అన్నాను నేను.

గురువుగారు గట్టిగా నవ్వి-
ఇదే(దేహమే) ఉత్తది... అంటుంటే, వేడినీళ్లలో కాళ్లు పెట్టడడం ఏమిటి? అన్నారు...

అందరూ నవ్వారు...
* * *

ప్రశ్న వేసినవాడు వేసినట్టే ఉండాల...
సమాధానం పొందాల...
అంటే కుదరదు...

ప్రశ్న- సమాధానం రెంటిలో
ఏదైనా ఒకటే ఉంటుంది.

"ఉనికి ఉండేది ఒక్కదానికే".

నేనెవడను? అనే  ప్రశ్నకు సమాధానం
నేను ఉన్నంతవరకు దొరకనే దొరకదు.

సమాధానంలో సమాధానమే ఉంటుంది.
ప్రశ్న-ప్రశ్నించేవాడు ఉండరు.
* * *

నేనెవడను? అనే ప్రశ్నలోనే
నేను అనే సమాధానం ఉంది ...
అన్నాను నేను.

అవును...ఆ నేను అనేది -
"ప్రశ్నించేవాడు"గా కాకుండా
"సమాధానం"గా మారుకోవడమే
ఆత్మవిచారఫలం...అన్నారు గురువుగారు.
* * *

సమాధానం దొరకాలంటే ఒకటే మార్గం-
నీవు ఏ సమాధానాన్ని విన్నా సరే
"ఇది కాదు-ఇదికాదు" అంటూ త్రోసేయడమే...
అప్పుడు సమాధానం అక్కడే ఉంటుంది.
"నేను"గానే ఉంటుంది.

ప్రశ్నకు సమాధానం అంటూ ఏమీలేదు.
ప్రశ్నించేవాడు లేకపోవడమే సమాధానం.
* * *

ప్రపంచానికి బుద్ధుడున్నాడు.
బుద్ధునికి బుద్ధుడే లేడు.

బాబు-బాబు  అని అందరూ అంటుంటే
బాబు కూడా ఓహో 'నేను బాబు' అనుకుంటున్నాడేగాని,
నిజానికి బాబుకు బాబు లేడు.
అన్నారు గురువుగారు.
* * *

ఇంతలో ఎవరో ఫోన్ చేశారు గురువుగారికి...
కాకి తలమీద తన్నింది...
ఏమైనా ప్రమాదమా? అని అడిగారు ఫోన్లో.

అవును... ప్రమాదం కాకికి...అన్నారు గురువుగారు నవ్వుతూ...

గతంలో కూడా ఇలాగే మా మిత్రుడు పొన్నారావును కాకి తలతన్నింది...

గురువుగారికి వచ్చి చెప్పాడు-
కాకి తలదన్నిందంటే మరణం అంటారు కదా....అని.

"అవును మరణం కాకికి" అన్నారు.

బల్లిపడేశాస్త్రం బల్లికి, మనక్కాదు...
అని మనిషి భయాలను అలా తటాలున తీసి అవతల పడేస్తుంటారు గురువుగారు.

"ఈశ్వరుణ్ణి తలచేవారికి గ్రహదోషాలుండవు" అంటూ భరోసా ఇస్తారు...

భయంతో లోపలికి వచ్చినవాడు,
ధైర్యంతో బయటకు వెళతాడు.

అదే సద్గురువు చేసే "మాట"సాయం.

వారి మాటే మంత్రము...
మంత్రాలకు చింతకాయలు రాలవుగానీ,
చింతలు మాత్రం రాలిపోతాయి...

గురువు -
దుఃఖాన్ని తొలగించడు.
సుఖాన్నీ కలిగించడు.
"అనుభవి"ని తొలగిస్తాడు...అంతే.
"అనుభవి" లేకపోవడమే పరమసుఖం.

* * *

సృష్ట్యాది నుండి
నరుడు నారాయణుణ్ణి వెతుకుతున్నాడు...

నారాయణుడు నరుణ్ణి వెతుకుతున్నాడు...
ఇప్పటివఱకు నరుడికి నారాయణుడు కనబడింది లేదు,
నారాయణుడికి నరుడు కనబడిందీ లేదు.

నరుడూ లేడు, నారాయణుడూ లేడు.
ఉండేది ఒక్కడే.
ఆ ఒక్కడు "నేనే".
"నేనే" నరుడూ, నారాయణుడూ.

* * *

మనకు కనబడేంత వరకు ఉన్నదానిని ఆకాశం అంటాం.

మనకు కనబడని విశ్వాన్ని అంతరిక్షం అంటాం.

న్యూస్ పేపర్ ను సీరియస్ చదువుతున్న
చెంగల్వరాయరెడ్డిని చూపించి-

చెంగల్వరాయరెడ్డి అక్షరాలను చూస్తున్నా, అక్షరాలకు ఆధారంగా ఉన్న
పేపర్ నే చూస్తుండేది.

తెల్లకాగితంలోనే అక్షరాలు ఉండేది.
అంతరిక్షంలోనే ఆకాశం ఉండేది.
అహంస్వరూపంలోనే అహంకారరూపం ఉండేది.
'ఉన్నది'లోనే 'ఉన్నట్లున్నది' ఉండేది.
పరంలోనే ఇహం ఉండేది.

పరం - నేను.

ఇహం - బాబు.

బాబులో నేను ఉండడం కాదు.
నేనులో(నాలో) బాబు ఉన్నాడు.

వ్యక్తిగతమైన నేను - ఆకాశం.
సర్వగతమైన నేను - అంతరిక్షం.

తెలిసిన ఆకాశం - ఈ నేను.
తెలియని ఆకాశం - ఆ నేను.

Un-Limited గా ఉన్న ఆ నేనులోనే
Limited గా ఉన్న ఈ నేను ఉండేది.

Limited గా ఉన్నదానికే కర్త-కర్మ-క్రియ ఉండేది.

Unlimited ఉన్నదానికి కర్త-కర్మ-క్రియ అనేవి ఉండవు...

దేశకాలాలూ ఉండవు లేవు...

అది అనిర్వచనీయం...

అంటే దానిని నిర్వచించడానికి
అక్కడ ఎవడూ ఉండడు.

అనిర్వచనీయం అంటే
చెప్పేవాడు ఉండి చెప్పలేకపోవడం కాదు,
చెప్పేవాడు లేక చెప్పలేకపోవడం.

* * *

విద్యార్థి ఏదో ఒక తరగతికి చెంది ఉంటాడు.
ఉపాధ్యాయుణ్ణి ఏ తరగతికి చెందినవాడని చెప్పగలం?

అన్ని తరగతులనూ తనలో కలిగి, ఏ తరగతికీ చెందనివాడు
ఉపాధ్యాయుడు.

అన్నీ తానై
ఏదీ తాను కానివాడు
భగవంతుడు.

* * *

ఆకాశాన్ని అంతరిక్షం యొక్క జన్యం అనిగాని, భాగం అనిగాని
చెప్పగలమా?
"ఉండేది అంతరిక్షం మాత్రమే" అని చెప్పాలి.

ఈ సృష్టి అంతే.
భగవంతుని నుంచి పుట్టింది అని గాని,
భగవంతునిలో భాగం అనిగానీ చెప్పకూడదు.
"ఉండేది భగవంతుడు మాత్రమే" అని చెప్పాలి.

బంగారంలో నుంచి ఆభరణం పుట్టింది అనిగాని,
బంగారంలో ఆభరణం భాగం అనిగాని చెప్పగలమా?
"ఉండేది బంగారం మాత్రమే" అని చెప్పాలి.

* * *

వేంకటరామన్ తన 16వ యేట నిజంగానే మరణించాడని....

"భగవాన్" అనదగింది ఏదో అది
ఆ శరీరంలో పూరించుకున్నదని...

చెప్పారు.

* * *

రమణుల మౌనం -
తెలిసి మౌనంగా ఉండడం కాదు,
'అది తెలియదు' అని మౌనంగా ఉండడం.
అన్నారు గురువుగారు.

ఈ బోధను ఎన్నోసార్లు గురువునోట విన్నప్పటికీ,
మాకు నిత్యనూతనంగా వినిపిస్తుంది.

ఒక జ్ఞాని, మరొక జ్ఞానిని గురించి చెప్పడమంటే,
అదొక అనుభూతి...వినేవారికి.

వాస్తవానికి అది తన గురించి తాను చెప్పుకోవడమేగా...

అరుణాచలంలో సుబ్రహ్మణ్యుడు రమణుడుగా ఉన్నాడు.

అనిలాచలంలో రమణుడు సుబ్రహ్మణ్యుడుగా ఉన్నాడు.

అది అగ్ని లింగం.
ఇది వాయులింగం.

ఇప్పుడు అగ్నికి వాయువు తోడయ్యింది...
మన అహాన్ని దగ్ధం చేసే అగ్ని మరింతగా రగులుకున్నది...

* * *

తెలియజేయాలి...అనే ప్రయత్నం ఉన్నంతవరకు
తనకు తెలియదనే దాని అర్థం...
అన్నారు గురువుగారు.

నాకు నవ్వొచ్చింది...

పాపం ప్రవచనకర్తలు ఈ మాట వింటే ఏడుస్తారు...అన్నాను.

"ప్రవచనం" అంటే-
ఎవరి వచనమూ కానిది.

'నేను చెప్పాను' అంటే అది - వచనం.
నా "ద్వారా" చెప్పబడింది అంటే అది - ప్రవచనం.

అన్నారు గురువుగారు.

* * *

నీవు ఏమి అయి ఉన్నావో...
అది తప్ప నీకు ఏమీ తెలియదో...
అప్పుడు నీవు ఏం మాట్లాడగలవు?
ఎవరితో మాట్లాడగలవు?

నీవు బ్రహ్మము కానప్పుడు ఆ ప్రవచనం వల్ల ప్రయోజనం ఉండదు.

నీవే బ్రహ్మము అయినప్పుడు ప్రవచనం చేసే
అవసరం ఉండదు.

మరి ప్రవచనాలు ఎందుకు? ఎవరికి?

ఆధ్యాత్మికం అనేది లాభనష్టములు లేని వ్యాపారం అని గతంలో మనం చెప్పుకున్నదే కదా...! అన్నాను నేను.

లాభం ఉంది అనుకోవడం నష్టం.
నష్టం లేదు అనుకోవడం లాభం.

అన్నారు గురువుగారు...

కాబట్టి ఆధ్యాత్మికం అనేది లాభనష్టములు లేని వ్యాపారం...అని తెలిసి ఏమైనా చేసుకో....

పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే...

కలుపుకో...లేదా
తీసివేయ్....నీ ఇష్టం.
పూర్ణం పూర్ణంగానే ఉంటుంది.

సాధన చేస్తావో...లేదా
ఊరక ఉంటావో...నీ ఇష్టం.
పూర్ణం పూర్ణంగానే ఉంటుంది.

అచలుడవై దక్షిణామూర్తిలా ఉంటావో....లేదా
సచలుడవై నటరాజమూర్తిలా ఉంటావో...నీ ఇష్టం.
పూర్ణం పూర్ణంగానే ఉంటుంది.

* * *

99. కర్మ - ఖర్మ

---

5-9-2021 * ఉపాధ్యాయ దినోత్సవం

ఈరోజు ఒంగోలు శ్రీను ఓ ప్రశ్న అడిగాడు-

స్వామీ...!
"నీవు పుట్టినప్పుడే నీవు ఏమి చేయాలి అనేది design అయిపోయివుంటుంది" అని గురువుగారు చెప్పారు గదా...!
మనం గతజన్మలో చేసిన కర్మేనా design అంటే?

* * *

ముందు సంకల్పం చేస్తాం.
తర్వాతే కార్యం చేస్తాం.
* * *
అలానే ముందు కర్మ(design) జరుగుతుంది.
తర్వాతే జన్మ (కార్యం) కలుగుతుంది.
* * *
జన్మకు కారణం కర్మే.
కానీ కర్మకు కారణం జన్మ కాదు.
* * *
వచ్చే జన్మకు design
ప్రస్తుత జన్మలో జరుగదు.
* * *
రంగస్థలం మీద నాటకం జరుగుతుంటే
రేపు వేయబోయే నాటకం script ఆ స్టేజీ మీదనే వ్రాసుకుంటాడా?
* * *
జన్మకు-జన్మకు మధ్య వ్యవధిలో
design చేసుకుంటాడు.
* * *
జన్మకు-జన్మకు మధ్య వ్యవధిలో
జీవుని(దేవుని)కున్న ఇచ్ఛాశక్తి అనంతం.
* * *
ఆ ఇచ్ఛాశక్తి మూలంగానే
ప్రస్తుత జన్మ ఇలా ఉంది.
* * *
సుఖదుఃఖాలకు కారణం ఏ విధీ కాదు,
నీకు నీవే (సంబంధం)కల్పించుకున్న బంధనాలే ఇవి.

* * *

దుఃఖం, సుఖం రెండూ నీ స్వేచ్ఛానుసారంగా కలిగినవే.
బంధం, మోక్షం రెండూ నీ ఇచ్ఛాశక్తిలో భాగమే.

* * *

ఇప్పుడు నీవున్న స్థితిని
స్వయంగా నీవు కోరి design చేసుకున్నదే.

* * *

జరిగేదాన్ని చూస్తూ ఉండడం తప్ప
ఇప్పుడు మార్చడం కూర్చడం వీలుకాదు.

* * *

జన్మకు-జన్మకు మధ్య వ్యవధిలో
తనకున్న ఇచ్ఛాశక్తిని అనుసరించే...

తాను ఏకంగా(దేవుడుగా) ఉండాలో లేక
అనేకంగా(జీవ-జగత్-జగదీశ్వరులుగా) అవ్వాలో
నిర్ణయించుకునేశక్తి ఉంటుంది... ఇప్పుడు కాదు.

ఇప్పుడు తలక్రిందులుగా తపస్సు చేసినా సరే
గతంలో తాను వ్రాసుకొచ్చిన script మారదు.

ఇది తెలిసే రమణులు "సుమ్మా ఇరు" ఊరికే ఉండు అన్నారు...ఉన్నారు...

* * *

కర్మసిద్ధాంతం ఎప్పుడూ గందరగోళమే(confuse...)

* * *

1. నేనే స్వతఃగా కర్మ చేస్తున్నానా?

లేదా

2. నా 'ద్వారా' కర్మలు చేయబడుతున్నాయా?

అన్న ఈ ఒక్క విషయాన్ని పరిశీలించి
రెండింట్లో ఏదో ఒకటే తేలిస్తే confuse పోతుంది.

ఒకసారి అది, ఒకసారి ఇది అంటే కుదరదు.
ఏదో ఒకదాంట్లో స్థిరంగా నిలబడు...అంతే.

ఒకసారి "నేను చేస్తున్నానని"
మరొకసారి "దేవుడే  చేయించాడని"

ఇలా రెండుపడవల్లో కాళ్లు పెట్టి ప్రయాణించడం
ప్రమాదం.

* * *

ఉంటే త్రాడైనా ఉండాలి.
లేదంటే పామైనా ఉండాలి.

ఒకే వస్తువును ఏకకాలంలో  రెండు రకాలుగా చూడం.

ఉండేది పాము అనుకుంటేనే
భయమూ, దానిని చంపే ప్రయత్నమూ, కర్ర అనే సాధనమూ, దీపం అనే సహాయము, అది త్రాడే అని తెలిసి నవ్వుకోవడమూ...అన్ని ఉంటాయి.

ఉండేది త్రాడు అని తెలిస్తే
ఏ సామస్యా లేదు...తన త్రోవన తానుపోతాడు.

* * *

పాము అని భ్రమసినది మొదలు,
అది త్రాడు అని తెలుసుకునేవరకు
చేసే ప్రయత్నాలకు పెట్టబడిన పేరే - కర్మయోగం.

మొదట్నుంచి అది త్రాడే అని తెలిసి,
తన త్రోవన తాను పోవడం - జ్ఞానయోగం.

* * *

ఇది జగత్తు అని ఉండేవాడు - కర్మయోగి.
ఇది బ్రహ్మము అని ఉన్నవాడు - జ్ఞానయోగి.

* * *

కర్మయోగి భగవంతుణ్ణి పరోక్షం విషయంగా
treat చేస్తాడు.

జ్ఞానయోగికి భగవంతుడు ప్రత్యక్షవిషయం.
కనబడుతున్నదల్లా భగవంతుడే అని ఉంటాడు.

పట్టపగటి వెలుగు పరమాత్ముడు.
ఎట్టఎదుటనే ఉన్నాడు పరమాత్ముడు.
అంటారు అన్నమయ్య.

* * *

"పొందాలి" అనేవాడు కర్మయోగి.

"పొందడానికిగాని, పోగొట్టుకోవడానికిగాని
వీలులేనిది అని ఉండేవాడు - జ్ఞానయోగి.

* * *

ఓ ఇంటి తలుపుకు ఓ పెద్ద తాళంకప్ప వేసి ఉంది.
రకరకాల తాళంచెవులతో దానిని తెరచే ప్రయత్నం చేశాడొకడు.
తీరా చూస్తే, ఆ ఇంటికి అసలు గోడలే లేవు.
* * *
అట్లే ఉంటుంది ఈ ఆధ్యాత్మిక సాధనలనేవి...
ఒక్కొక్క సాధన ఒక్కొక్క తాళంచెవి లాంటిది.
తాళంచెవితో(సాధనతో) చేసే ప్రతిప్రయత్నమూ హాస్యాస్పదమే.
ఎందుకంటే అది గోడలు లేని ఇల్లు.
J.K. అన్నట్టు Truth is Pathless Land.

ఏట్లైనా లోపలికెళ్లే వీలున్న శూన్యభవనమే సత్యం అనేది.

కానీ మనమే అనంతసత్యంలో ఓ భవనం నిర్మించుకొని, తలుపులు బిగించుకొని, తాళంకప్ప వేసుకొని, మళ్లీ రకరకాల తాళం చెవులను తయారుచేసుకొని అవస్థపడుతున్నాం.

ద్వారంతో, తాళంతో పనిలేకుండా
ఏ క్షణమైనా, ఎటుప్రక్కనుంచైనా సత్యాన్ని చేరుకోవచ్చు...

అంత సులభంగా చేరుకోవడం మనకే ఇష్టం లేక
మనమే కావాలని విషయాన్ని జటిలం చేసేసుకున్నాం.

బంధం అనే భ్రమను
సాధన అనే మరో భ్రమతో
పోగొట్టే ప్రయత్నానికే
"కర్మయోగం" అని పేరు.

జీవితాన్ని design చేసిందీ తానే.
దానిని అనుభవించేదీ తానే.
మొదటి తాను కూడా తానేనని
మర్చిపోవడం వలన వచ్చిన తిప్పలే ఇవన్నీను...
ఆ నేనే  ఈ నేనని(Iam That Iam) గుర్తుకుతెచ్చుకునే
ప్రయత్నానికే 'ఆధ్యాత్మికం' అని పేరు.

ప్రతి కదలికా భగవంతునిదే
నేను కదులుతున్నానని నీవు భ్రమపడుతున్నావు...

దేవుని కదలికే తన కదలిక అని ఉండడం - కర్మ.
తానే కదులుతున్నానని అనుకోవడం - ఖర్మ.

(గమనిక: ఖర్మ  అనే పదం ఏ భాషలోనూ లేదు)

* * *

పలనాటి శ్రీను అమ్మమాలను ధరించి దీక్షలో ఉన్నాడు...

"ఆ జగదాంబే నీతో అత్యంత దగ్గరగా గడపాలని తల్లిగా చెల్లిగా భార్యగా వచ్చి నీ ఇంట్లో చేరింది...
వారిని సంతోషపెట్టు చాలు....ఇక ఏ దీక్షానియమాలూ అవసరం లేదు" అనే సద్గురు ప్రబోధం నా హృదయంలో గాఢంగా నాటుకుని ఉండడం వలన ఈ దీక్షానియమాల పట్ల పెద్ద పట్టింపులేదు నాకు....

నా ఆత్మీయమిత్రుడు పొన్నారావు మాలాధారణ చేసినప్పుడు కూడా "ఒరే పొన్నారావ్" అని పిలిచేవాణ్ణేగాని, స్వామీ....అని మాత్రం పిలిచేవాణ్ణి

కాను...

మా వీధిలో ఒక త్రాగుబోతు స్వామిమాల వేసి, అప్పటివఱకు భార్యపిల్లలను నీచంగా చూసే అతను ఆ రోజు నుంచి - భార్యస్వామీ...! తమ్ముడుస్వామీ...! అని పిలుస్తుంటే నాకు పరమవెగటుగా తోచేది.

సహజంగా జీవించాలనేదే నా concept...
స్వామీ అని పిలవడం, స్వామీ అని పిలిపించుకోవడం రెండూ నాకిష్టం ఉండదు.
భక్తునికి-భగవంతునికి మధ్య అడ్డు ఈ దీక్షలు, ఈ నియమాలే.

కానీ పలనాటి శ్రీనూ  నన్నెప్పుడూ స్వామీ-స్వామీ అని సంబోధిస్తుంటాడు...

"స్వా"మి అంటే
తనను(అహమికను) 'స్వా'హా చేసినవాడు.

"స్వా"మి అంటే
తనను(ఆత్మను) తానెఱిగినవాడు.

స్వామి అయినవానికి
అందరూ స్వాములుగానే కనబడతారు.

కాబట్టి శ్రీనుయే నిజంగా స్వామి....

నిత్యనైమిత్తిక కర్మలలో మునిగి ఉన్నప్పటికీ
అతని దైవోపాసనకు ఏ ఆటంకం కలుగకుండా
ఉండేటట్లు చూసుకుంటూ,
వ్యవహారాన్ని, ఆధ్యాత్మికాన్ని సమపాళ్లలో రంగరించి,
జీవితాన్ని అందంగా, ఆనందంగా మలుచుకుని
గడుపుతున్నాడు...

గురుభక్తుడైన  "శ్రీనుస్వామి"కి
వాత్సల్యపూర్వకంగా ఈ వ్యాసం అంకితం...

* * *

100. "ఇచ్చట సద్గురువు ఉన్నాడు జాగ్రత్త"

---

11-9-2021 * శనివారం

ఈ ఉదయం 10 గంటలకు సద్గురు సన్నిధికెళ్లాం...నేనూ, దేవీప్రసాద్.

వేణు వేడివేడిగా టీ అందించాడు...

నాకు టీ అలవాటు లేకపోయినా....
సత్సంగంలో గురువుగారితో కలిసి టీ త్రాగడం అనేది అదొక భోగం...అదొక యోగం...

అప్పుడెప్పుడో ఒకసారి ఆడికృత్తికరోజున అయ్యవారమ్మ కాఫీ పెట్టి తీసుకొచ్చింది...
గురువుగారు తీసుకున్నారు...
నేను వద్దన్నాను...
"తీసుకో బాబూ...! మళ్లీ అటువంటి కాఫీ కావాలంటే మళ్లీ ఆడికృత్తిక వచ్చేవరకు దొరకదు...
అన్నారు గురువుగారు...

తీసుకుని త్రాగాను...

వారు అన్నమాటకు అర్థం మాత్రం నాకు తెలియదుగాని,

ఓ 'జ్ఞాపకం'గా చెబుతున్నాను...అంతే.

* * *

గురువుగారు మౌనంగా కూర్చొని వున్నారు...
అక్కడున్న నిశ్శబ్ధాన్ని భగ్నం చేస్తూ,
సరదా ఐన సంఘటన ఒకటి గురువుగారికి చెప్పాను-

పిచ్చాసుపత్రిలో ఉండే డాక్టరును
తన స్నేహితుడొకడు అడిగాడట- మీ ఆసుపత్రిలో ఇతడు పిచ్చివాడు అని ఎలా నిర్థారణ చేస్తారు? అని.

ఆ డాక్టరు అన్నాడు-
తొట్టె నిండా ఉన్న నీటిని ఖాళీ చేయడానికి అతనికి ఓ చెంచా, ఓ గ్లాసు, ఓ చెంబు, ఓ బకెట్ ఇచ్చి నీటిని ఖాళీ చేయమంటాము...

వాడు ఎన్నుకునే సాధనాన్ని బట్టి వాడి పిచ్చిస్థాయిని
లెక్కగడతాము...అని.

"ఐతే నువ్వు దేన్ని సాధనం తీసుకుంటావు?" అని అడిగాడు ఆ మిత్రుడు డాక్టరును.

"నేనైతే నీటిని త్వరగా ఖాళీ చేయడానికి బకెట్ వాడుతాను..." అన్నాడు ఆ డాక్టరు.

"ఐతే నీకు కూడా పిచ్చివాడివే...అన్నాడు
ఆ మిత్రుడు.

"ఎలా?" ఆశ్చర్యంగా అడిగాడు డాక్టరు.

"ఆ తొట్టెకున్న బిరడా తీసివేస్తే చాలు కదా!
త్వరగా ఖాళీ అవడానికి..."
అన్నాడు ఆ మిత్రుడు నవ్వుతూ...
* * *

గురువుగారు నవ్వుతూ-
నిజమే కదా...
నిజానికి అందరమూ పిచ్చివాళ్లమే....

సాధారణంగా ప్రవర్తించేవాళ్లు ఎక్కువ శాతం
ఉండడం వల్ల మనకు పిచ్చి లేదని,

అసాధరణంగా ప్రవర్తించేవాళ్లు తక్కువ శాతం
ఉండడం వల్ల వారికి పిచ్చి అని

percentage ను బట్టి అలా మనకు మనమే నిర్ణయించుకునేశాంగానీ,
నిజానికి అందరమూ పిచ్చివాళ్లమే...

ఒకడికి డబ్బు పిచ్చి
ఇంకొకడికి కామ పిచ్చి
మరొకడికి భూమి పిచ్చి
ఒకడికి పదవి పిచ్చి
ఇంకొకడికి నాటకాల పిచ్చి
మరొకడికి సంగీతం పిచ్చి
ఒకడికి పుస్తకాల పిచ్చి
ఇంకొకడికి కీర్తి పిచ్చి
మరొకడికి దేవుడి పిచ్చి.

నాకు ఏ పిచ్చీ లేదబ్బా...!
అని చెప్పుకుని తిరిగే వానిది కూడా ఒకరకమైన పిచ్చే.

ఇలా పిచ్చిలేనివాడు ఎవడూ లేడు.
అందరూ మానసికరోగులే.
మనసున్న ప్రతి ఒక్కడూ మానసికరోగియే.

"పిచ్చి లేదు అంటే, అసలు ఉనికే ఉండదు...
ఉనికి ఉందంటేనే పిచ్చి ఉందనే దానికి అర్థం."
అన్నారు గురువుగారు.
* * *

ఉండేది ఒక్కటే, అది నేనే...నేనే కేంద్రం" అంటూ
నేనుఇన్ని అద్వైతవ్యాసాలు వ్రాసి అందరికీ పంచానంటే దాని అర్థం-
"నేనుగాక ఇతరం, ఇతరులు కూడా ఉన్నారు" అనే
ద్వైతభావం నాకు ఉన్నట్టే కదా!
"నాకు తెలుసు, మీకు తెలియదు" అనే కదా...!
ఇదొక రకమైన పిచ్చే కదా!

అందరూ భగవత్స్వరూపులే...అని
వేదికలెక్కి బోధించే ప్రవచనకర్తలందరూ ఎవరికి బోధిస్తున్నట్టు...?

భగవంతుడికేనా?
ఎంత పిచ్చితనం?

ఒక్కొకరి ప్రవర్తనను విశ్లేషిస్తూ ఒక్కొక్క ప్రవర్తనకు ఒక్కొక్క పేరుపెట్టే సైక్రియాటిస్టుది కూడా ఒక రకమైన ప్రవర్తనే కదా! అతనిదీ మానసికరోగమే కదా!

అందుకే నేనంటాను-
పిచ్చివాళ్లలో
మొదటి పిచ్చివాడు - Philosopher.
రెండవ పిచ్చివాడు - Psychiatrist.
అని.

* * *

పిచ్చివాళ్ల పిచ్చిని తొలగించడానికి సద్గురువులుగా అవతరించే పెద్ద పిచ్చివాడు ఈశ్వరుడు.

"లోకవత్ లీలా కైవల్యం"
ఈశ్వరుని పిచ్చి పేరు - లీల.

కాకపోతే దేవుడికి, జీవుడికి చిన్న తేడా ఉంది-
పిచ్చి అని తెలిసి ఉండే పిచ్చి దేవునిది.
పిచ్చి అని తెలియక ఉండే పిచ్చి మనది.

చిన్న పిచ్చివాడు - శిష్యుడు.
పెద్ద పిచ్చివాడు - గురువు.

"ఎవరు దేవుని కోసం పిచ్చివాళ్లు అవుతారో
వారికి ఏ కర్తవ్యమూ ఉండదు.
పిచ్చివాళ్ల మీద ఏ చట్టమూ పని చేయదు.
అందుచేత ఎవరు దేవునికోసం పిచ్చివాళ్లయ్యారో
వారి మీద శాస్త్రాలలోని నియమాలేవీ పని చేయవు" అంటారు శ్రీరామకృష్ణులు...

* * *

అందుకే మా అత్యాశ్రమంలో బుద్ధిమంతులకు, పవిత్రులకు ప్రవేశం లేదు.
వారికి మా ఆశ్రమం అవసరం లేదు.

బుద్ధిలేనివాళ్లకు అపవిత్రులకు, పిచ్చివాళ్లకు స్వాగతం...

ఇక్కడ జరిగే చిత్రమైన చికిత్స ఏమంటే-
చిన్న పిచ్చి(నేను వ్యక్తిని అనే భావం) తొలగించి
పెద్ద పిచ్చి(శివోహం అనే భావం) కలిగించడం.
దీనినే "మంచిపిచ్చి" అన్నారు శ్రీరామకృష్ణులు.

* * *

"అనారోగ్యవంతులకు ప్రవేశం లేదు" అని
ఆసుపత్రి ముందు బోర్డు పెడితే ఎంత హాస్యాస్పదమో,

"అపవిత్రులకు ప్రవేశం లేదు" అని
ఆశ్రమం ముందు బోర్డు పెట్టడం కూడా అంతే హాస్యాస్పదము.

అనారోగ్యవంతుల కొరకే ఆసుపత్రి నిర్మిస్తారు.
అపవిత్రుల కొరకే అవతారమూర్తులు అవతరిస్తారు.

ఆరోగ్యవంతులకు డాక్టరూ అవసరం లేదు, వైద్యుడూ అవసరం లేదు.

పవిత్రులకు దేవుడూ అవసరం లేదు, గురువూ అవసరం లేదు, ఆశ్రమమూ అవసరం లేదు.

"ఒక్క పెద్ద మనిషైనా రాకున్నా పర్వాలేదు...
ఓ వ్యభిచారిణులారా రండి!
ఓ తాగుబోతులారా రండి!
ఓ చోరులారా రండి!
మీరంతా రండి!
శ్రీరామకృష్ణుని వాకిలి మీ అందరికీ తెరువబడి ఉంది...
ప్రత్యేకంగా పాపాత్ముల కోసమే భగవంతుడు అవతరిస్తాడు, అంతగా
పుణ్యాత్ముల కోసం కాదు
అంటారు వివేకానందులు...

* * *

ఎవడు మంచివాడు?అనే ప్రశ్నకు తమాషా అయిన సమాధానం ఇచ్చాడు మా మిత్రుడు కైలాసం-

"మంచివాడు ఎవడంటే?
పుట్టనివాడు, గిట్టినవాడు."

(మొత్తానికి 'మంచివాడు' అనేవాడు ప్రపంచంలో ఉండడు అని దానికి అర్థం)

* * *

ఏ పిచ్చీ లేనివాడు ఒక్కడే -
వాడి ఉనికిని ప్రపంచంలో మనం ఎఱుగం.

మనకు పరిచయం లేనివాడు...
యెప్పటికీ పరిచయం కానివాడు...
వాడు సదా అపరిచితుడే.

వాణ్ణే మనం భగవంతుడు అనేది.

పరిచితులకు అపరిచితుడతడు...
అపరిచితులకు పరిచితుడతడు...
అంటారు గురువుగారు.

అంటే-
'నాకు తెలుసు' అన్నవాళ్లకు తెలియనివాడు.
'నాకు తెలియదు' అన్నవాళ్లకు తెలిసినవాడు.

* * *

ప్రపంచానికి అతీతమైనవాణ్ణి
ప్రపంచంలో ఎలా చూడడం?

ప్రపంచంలో పిచ్చిలేనివాడు ఎవడో
చూపించండి ప్లీజ్....అంటారేమో....

ప్రపంచం అనేది ఒకటి ఉందనే విషయమే
ఎఱుకలో లేకుండా ఎవడైనా జీవిస్తున్నాడంటే
వాడు పిచ్చివాడుగా కనబడ్డా సరే
వాడికి సాష్టాంగపడండి...అంటాను.

సద్గురువు ఈశ్వరునికభిన్నం.
సద్గురువు వ్యక్తిమాత్రుడు కాడు.
ఈశ్వరతేజస్సులో ఓ కాంతి కిరణం.

అలాంటివాడిని మీరెన్నడైనా చూశారా?
చెప్పండి ప్లీజ్...అంటారేమో...

శ్రీకాళహస్తిలో సద్గురు సుబ్రహ్మణ్యం ఉన్నారు.

ప్రపంచంలో ఉంటూ ప్రపంచానికి తటస్థంగా ఉండడం కాదు,

ప్రపంచాన్ని మ్రింగేసి,
తనతో సహా సర్వాన్ని తనలో కలిగిన "తటస్థం" అది.

మన తటస్థం కపటం.
వారి తటస్థం అచలం.

ఆయన కంట పడితే చాలు...
నీతో సహా నీ సర్వాన్ని మ్రింగేస్తాడు...

దానికి సిద్ధపడితే సద్గురు వాకిట అడుగు పెట్టు...

నీవు క్షేమంగా ఉండదలిస్తే,
ఆధ్యాత్మికం వదిలేయ్...!

'సర్వ' నాశనం అవదలిస్తే
సద్గురు వాకిట అడుగు పెట్టు...

అదొక పులిగుహ.
పులైనా ఎముకలు మిగిలిస్తుంది...
ఈ గురువు మ్రింగేస్తే ఆనవాలే కనబడదు.

నిన్ను నీవు పోగొట్టుకోవడానికి సిద్ధపడితే
వారి వాకిట అడుగు పెట్టు.

ఒక్కోసారి అనిపిస్తుంది - వారి వాకిట ఉన్న గేట్ కు ఓ బోర్డు తగిలిస్తే
బాగుండును...

"ఇచ్చట సద్గురువు ఉన్నాడు...జాగ్రత్త" అని.

* * *

నీవుగాక దైవమనేది
ఎక్కడా లేదు - ఎప్పుడూ లేదు - ఏదీలేదు.
ఈ జగత్ స్వప్నం నుండి
మేలుకో - మేలుకో - మేలుకో
నీవే దేవుడవు...నీవే జీవుడవు...
జపాలతో తపాలతో నీకేం పని?
అహంబ్రహ్మాస్మి అని గొంతెత్తి పలుకు.
నీవెప్పుడూ ముక్తుడువే...
ఇది ప్రధాన బోధ.

కానీ నేనెవరికి చెబుతున్నాను...
ఉండేది నేనొక్కణ్ణే కదా!
నాకు నేనే చెప్పుకుంటున్నానా?
నాకు నేను చెప్పుకోవలసిన అవసరం ఏముంది?
ఆహా! నేను యెంత పిచ్చివాణ్ణి...!

పిచ్చివాడికి తాను పిచ్చివాణ్ణని తెలియదుగా...!

"నేను పిచ్చివాణ్ణి" అని నాకు తెలిసిపోయింది
కాబట్టి నాకు పిచ్చి పోయినట్లే...

నాకు పిచ్చి పోయిందోచ్...
నాకు పిచ్చి పోయిందోచ్...

నాకు పిచ్చి పోయింది...
నా తలకు రోకలి చుట్టండి...

## 101. అన్నిటికీ సిద్ధపడి ఉండడమే మహాసిద్ధి

---

ఏం చేయాలి? ఏం చేయాలి? ఏం చేయాలి?

ఈ ప్రశ్నను ప్రతిరోజూ ఏదో ఒక సందర్భంలో ఎవరి వద్దనో ఒకరి వద్ద ఎదుర్కొంటూనే ఉంటారు గురువుగారు...

నా కుటుంబ పరిస్థితులు బాగాలేవు ఏం చేయాలి?
నా ఆరోగ్యం బాగుండడం లేదు ఏం చేయాలి?
నా మనసేమీ బాగాలేదు ఏంచేయాలి?
సాక్షాత్కారం పొందాలంటే ఏం చేయాలి?
దైవానుగ్రహం కలగాలంటే ఏం చేయాలి?
ఇలా ఎవరో ఒకరు అడుగుతూనే ఉంటారు....

లౌకిక సమస్యలకు గురువుగారు ఏదో ఒక పరిష్కారం చూపుతారుగాని,
ఆధ్యాత్మికసమస్యలకు మాత్రం వారు సూచించే
ఏకైక మార్గం- "ఊరికే ఉండు" అనేదే.

ఈ ఆధ్యాత్మికవిషయంలో-
ఏదో చేయడం - చుట్టు మార్గం.
ఏమీ చేయకపోవడం - దగ్గరి మార్గం.

'ఏమీ చేయకపోవడం' అనేదే బాబా చెప్పిన
'సర్వశ్య శరణాగతి'కి నిజమైన అర్థం.

ఊరికే ఉండలేకపోతున్నాను స్వామీ...!
ఊరికే ఉండడం ఎలా? అని మళ్లీ ప్రశ్నిస్తారు...

ఎలా అనే ప్రశ్నే అడ్డు.
ఆ "ఎలా" అనే ప్రశ్నను వదిలేస్తే
అదే 'ఊరికే ఉండడం' అంటే.

'ఎలా' అనే ప్రశ్నను వదలడం ఎలా?
అని మళ్లీ అడగొద్దు...ప్లీజ్...!

ఈ శబ్ధాలతో...ఈ పదాలతో...
గురువు యెంతని చెప్పగలడు?
ఏంత కాలమని చెప్పగలడు?

వాగ్రూపంగా ఉన్న సమాధానాలేవీ సమాధానాలు కావని
దక్షిణామూర్తి మౌనాన్నే అంతిమసమాధానంగా
ఈ లోకానికి ప్రసాదించారు.

మళ్లీ ఆ మౌనానికి వ్యాఖ్యానాలు వ్రాస్తున్నారు
ఈ పండితులు...

తక్షణం ఈ అక్షరాలని వొదిలి,
ఏకాక్షర స్వరూపుడైన "నే"నులో నిలవండి.

ఆ "నే" అనే ఏకాక్షరమే "జ్ఞ".
అదే జ్ఞాత. అదే జ్ఞానప్రసూనాంబ.
* * *

ఈ ప్రశ్నలతో, ఈ సందేహాలతో
ఈ శిష్యులంతా(బాబుతో సహా)
గురువు రక్తమంతా త్రాగేసి,
వారి ఎముకల్లోని మజ్జతో కూడా తినేసి
"ఖాళీ" చేసేశారు...

ఇంకేముంది వారి వద్ద మనకివ్వడానికి?
నిజానికి వారే లేరు అక్కడ.

శిష్యులకు సర్వస్వం దారబోసి ఖాళీ అయిపోయారు.
నిజం చెప్పాలంటే-
ఇప్పుడు గురువు "శిష్యుల"రూపంలో ఉన్నారు.
* * *

కళ్లు తెరచే ఉన్నా సరే
ధ్యాననిష్ఠలో ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

మాట్లాడుతున్నా సరే
మౌనంగా ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

వ్యవహారంలో మునిగి ఉన్నా సరే
ఆత్మనిష్ఠలో ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

కరచరణాదులతో పని చేస్తున్నా సరే
అచలంగా ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

అన్నీ ఉన్నా సరే
'ఖాళీ'గా ఉండగలిగే స్థితిని ప్రసాదించారు గురువుగారు.

ఇంకా ఏమివ్వాలి గురువుగారు...?

* * *

"ఊరికే ఉండు" అన్నారు గురువుగారు...
ఆ మాత్రం మనం ఉండలేమా?

జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములు...అంటూ
ద్వైత-అద్వైత-విశిష్టాద్వైతములు...అంటూ
ఈ పదాలను ముందురేసుకుని 'సత్సంగాలు' పేరుతో హైరానా పడడం దేనికి?

తన విద్వత్తును అందరూ గుర్తించాలనే దుగ్ధ తప్ప
'నాకేమీ తెలియదు' అని ఉండడం ఎంత హాయి...!

'నాకు తెలుసు' అంటే ఈ తల్లి సంతోషిస్తుంది.
'నాకు తెలియదు' అంటే ఆ తల్లి సంతోషిస్తుంది.

నేను జ్ఞానశిశువునే కాదు,
అజ్ఞానశిశువును కూడా...

జ్ఞానశిశువు అన్నా, అజ్ఞానశిశువు అన్నా
రెంటి అర్థం ఒక్కటే.
'నాకు ఏమీ తెలియదు' అనే.

'నా గురువు' వ్యాసాలన్నీ వ్రాసింది నా గురువే.
వారి చేతిలో నేను 'జ్ఞానశిశువు' అనే బ్రాండెడ్ పెన్.
సద్గురు వాక్ప్రవాహాన్ని లోకానికి అందించడానికి
నేనొక వాహికను మాత్రమే.

* * *

కర్మ చేయడం అనేది - ఈశ్వరనియతి.
అంటే కర్మ నువ్వు చేసేది కాదు,
నీ చేత చేయబడేది.
చేసి తీరుతావు అంతే.
కర్మ - కర్మఫలము  రెండూ భగవంతునివే.

భగవంతుని చేతిలో వీడొక పనిముట్టు అంతే.
పాయసంలో ఉండే గరిటె వలె.
గరిటె, పాయసపాత్రలో స్వయంగా తానై తిరగదు, తినదు.

ఊరక ఉండడం(అకర్మిష్ఠిగా ఉండడం)
అనేది - పురుషకారం.

అంటే నీ స్వప్రయత్నంతో కర్మను  అంటకుండా 'అకర్మస్థితి'లో ఉండగలిగే శక్తి మాత్రం నీకుంది.

కర్మను అంటకుండా ఉండడం అంటే,
కర్తృత్వభావన లేకుండా ఉండడం.
'పాయసం తయారు చేసింది నేనుకాదు' అని గరిటె  అనుకున్నట్టుగా...

పై విషయాన్నంతా రెండు మాటల్లో గుర్తు పెట్టుకుందాం-

కర్మ - అనేది నీ చేతిలో లేదు(ఈశ్వరనియతి)
అకర్మ - అనేది నీ చేతిలో ఉంది(పురుషప్రయత్నం)

ఈ దేహంతో తాదాత్మ్యం చెందకుండా ఉండే స్వేచ్ఛ ఎప్పుడూ ఉంది నీకు...అంటారు భగవాన్.

* * *

కర్మ నీ స్వాధీనంలో ఉండదు.

అకర్మ(ఊరికే ఉండడం) ఒక్కటే
నీ స్వాధీనంలో ఉంది...
కాబట్టి...."ఉండు..." అంతే.

మొదట్లో ఊరికే ఉండడం కూడా సాధనలాగే అనిపిస్తుంది.

చివరకు అదే సిద్ధి అని తెలుస్తుంది.

* * *

పిగలడానికి గ్రుడ్డులోని పిల్ల ఏ సాధనా చేయదు.
తల్లిరెక్కలమాటున వెచ్చగా ఉండడం తప్ప.

మొలకెత్తడానికి విత్తనం ఏ సాధనా చేయదు.
భూగర్భంలో దాగి ఉండడం తప్ప.

పుట్టడానికి శిశువు ఏ సాధనా చేయదు.
తల్లిగర్భంలో నిశ్చింతగా ఉండడం తప్ప.

తరించడానికి శ్రద్ధాళువు ఏ సాధనా చేయడు.
సద్గురు సన్నిధిలో మౌనంగా ఉండడం తప్ప.

* * *

అకర్మిష్ఠిగా నీవున్నప్పుడు
నీవొక్కని కర్మలే కాదు, సృష్టిలోని ప్రతి చలనమూ
నిన్ను ఆధారం చేసుకునే కదులుతున్నట్టు అనుభూతమౌతుంది.

చక్రం - కర్మ.
ఇరుసు - అకర్మ.

నీవు చక్రం కాదు, ఇరుసువి...అని సకల శాస్త్రాలూ ఘోషిస్తున్నాయి...

"నేను" - ఇరుసు.
నాతో(బాబుతో)సహా సకలసృష్టి - చక్రం.

* * *

కర్మయోగం అంటే నిష్కామ్యకర్మము కాదు.
అకర్మయే కర్మయోగ రహస్యం.
నేను కర్తను కానని తెలుసుకోవడమే కర్మయోగ రహస్యం.

* * *

ప్రపంచంలో ఉన్న బోధలన్నీ కంటి తుడుపుచర్యలే.
కన్నీళ్లను తుడుపుతున్నారేగాని,
దుఃఖాన్ని ఎవడూ రూపుమాపడం లేదు.
దుఃఖాన్ని సంపూర్ణంగా రూపుమాపడం సాధ్యమా? కాదా?

"కాదు" అనేదే నిర్ద్వంద్వమైన సమాధానం.

దుఃఖం అనేదే లేకపోతే, అసమానత అనేదే లేకపోతే
ఈ ప్రపంచం పరమదరిద్రంగా ఉంటుంది.
ఒక్కరోజు కూడా జీవించలేవు.
ఆత్మహత్య చేసుకుంటావ్...!
అన్నారు గురువుగారు.

ఏడుపొస్తే ఏడువు...
నవ్వొస్తే నవ్వు...

ఏ క్షణానికాక్షణం...
ఏ పరిస్థితికాపరిస్థితి...

ఇలా ఉండడమే స్థితప్రజ్ఞత.

అన్నిటికీ సిద్ధపడి ఉండడమే మహాసిద్ధి.

* * *

దేవతావస్త్రాల పేరుతో రాజును నగ్నంగా ఊరిగేంపు చేసిన మోసగాళ్ల కథ
అందరూ చదివే ఉంటారు.

ఊరిజనమంతా ఆ వస్త్రాలు కనబడకపోయినా సరే
ఆహో ఓహో అంటుంటారు.

ఓ చిన్నబాలుడు మాత్రం రాజుకు బట్టలు లేని సంగతిని బట్టబయలు చేస్తాడు.

మోక్షం కావాలంటే అది చేయండి-ఇది చేయండి అని ప్రబోధించినవారంతా అలాంటి మోసగాళ్లే.
ఇంతకీ వాళ్లు చేసేది ఏమీ ఉండదు.

"సాధన అవసరం" అని బోధించేవాళ్లంతా-
తనను తాను మోసం చేసుకోవడం
ఇతరులను మోసం చేయడం...
అంతే.

సత్యాన్ని బట్టబయలు చేసిన ఆ చిన్న బాలుడు - UG కృష్ణమూర్తి.

నిర్ద్వంద్వంగా తేల్చి చెప్పాడు-
అది నీవు పొందేది కాదు...అని.
అదే నిన్ను పొందుతుంది...అని.

కఠోపనిషత్తు కూడా అదే ప్రబోధించింది-

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన|
యమే వైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం||

ఈ ఆత్మ శాస్త్రాధ్యయనంద్వారా కాని
తెలివితేటలచే కాని
వినికిడి వలన కాని దొరకదు.
అది ఎవణ్ణి వరిస్తుందో అతడికే లభ్యమౌతుంది.
అతడికి ఆత్మ స్వయంగా ఆవిష్కృతమవుతుంది.

* * *

"పొందినవారు" అని లోకంలో గుర్తింపు పొందినవారంతా "అది పొందలేం" అని తెలిసి
స్థిమితంగా ఉండిపోయినవారే.

అలా అన్ని ప్రయత్నాల నుంచి
సంపూర్ణంగా విరమించుకుని హాయిగా కాలం గడిపిన మహనీయులు
శ్రీరమణులు, U.G.కృష్ణమూర్తి , సద్గురు సుబ్రహ్మణ్యులు...
వీళ్లు బోధించని బోధకులు.

* * *

వివేకానందులు రెండు వాక్యాలు చెప్పారు-

1. ఆత్మను నీవెప్పటికీ పొందలేవు.
2. 'అది నీవే' కనుక.

మొదటి వాక్యం నిరాశావాదంతో మొదలై
రెండవ వాక్యం ఆశావాదంతో ముగుస్తుంది.

'అది నేనే' అని నాకెందుకు తెలియడం లేదు?
అని మళ్లీ ప్రశ్న....

"అది నీవే కాబట్టి తెలియడం లేదు"
అన్నదే సమాధానం.

నీవు తెలుసుకోవాలంటే అది నీకు విడిగా ఉండాలి.
అది నీవై అయినప్పుడు నిన్ను నీవెలా తెలుసుకోగలవు?

"నిన్ను నీవు తెలుసుకో" అని భగవానులు విచారణ చేయమంది,
"నిన్ను నీవు తెలుసుకోలేవు" అని తెలుసుకోమ్మనే.

బాబులో 'నేను' ను వెతకడం కాదు,
నేనులో బాబును వెతుకు...
ఇదే ఆత్మాన్వేషణ.

పరమాత్మకు, జీవాత్మకు 'ఆత్మ' శబ్ధం చెల్లుతుంది.
పరమాత్ముడు అనంతుడు....
పరమాత్ముణ్ణి అన్వేషించనవసరం లేదు.

అన్వేషించవలసింది జీవాత్మను.
ఇంతకీ జీవాత్మకు ప్రత్యేకమైన ఉనికి ఉందా?

అని విచారణ చేయడమే ఆత్మవిచారణ.

* * *

## 102. తన మూలానికి ప్రయాణం

---

నేను ఏదైనా ఆధ్యాత్మికగ్రంథం చదివేటప్పుడు
ముఖ్యమైన పాయింట్లకు అండర్ లైన్ చేయడం నాకు అలవాటు...

అలాగే చేశాను జ్ఞానవాశిష్ఠమనే గ్రంథంలో కూడా.

ఓరోజు గురువుగారు ఆ గ్రంథాన్ని తన చేతికి తీసుకొని అలా పేజీలు తిరగేస్తున్నారు...

'జ్ఞానవాశిష్ఠహృదయం' అనదగిన ఓ పాయింట్ ను తన చూపుడువ్రేలితో చూపించి-

"దేనిదేనికో అండర్ లైన్ చేశావుగాని,
ముఖ్యమైనదానికి అండర్ లైన్ చేయలేదు..."
అన్నారు.

ఆ గ్రంథాన్ని అటూ ఇటూ ఎన్నో సార్లు చదివి ఉంటాను...

ఆ వాక్యం నా కంటబడలేదు(అంటే నాకు ముఖ్యంగా తోచక)

అంతేగా... అంతేగా...

మన చూపు, మన అవగాహనను పరిపూర్ణం చేసే
వాక్యం కొరకు వెతుకుతుంటుంది.

గురువుగారి చూపు, తన అనుభవానికి శ్రుతికలిసే
వాక్యం కొరకు వెతుకుతుంటుంది.

అవగాహన బుద్ధికి సంబంధించినది.
అనుభవం ఆత్మకు సంబంధించినది.

అవగాహన వలన అనుభవం కలుగదు.
అనుభవం వలన అవగాహన కలుగుతుంది.

గురువుగారు చూపించిన వాక్యాలకు అండర్ లైన్ చేశాను...

అదే నా చివరి అండర్ లైన్...

అది భారతీయతత్త్వశాస్త్రానికంతటికీ కేంద్రబిందువులా అనిపించింది, గురువుగారు తన చూపుడు వ్రేలు పెట్టి మరీ చూపించడం వలన...

అదే ఇది -

ఇతరపదార్థములను తెలిసికొనుచున్నాను
అను విషయము అనుభవసిద్ధములో నుండ
జ్ఞాతను(ఆ  పదార్థములను దెలిసికొనువానిని)
దెలిసికొనలేమనుట అతి విరుద్ధము కదా!

* * *

గురువుగారు సదా "జ్ఞాత"గా ఉండటం వల్లనే
అది వారి కంటబడినది.

అందుకే వారిని "జ్ఞా"నాంబవతారులుగా
చెప్పడం జరిగింది.

జ్ఞానాంబ అంటే పురాణనామమైన పార్వతి కాదు;
శుద్ధపరబ్రహ్మమే.

త్రిమూర్తులకు తల్లి - జ్ఞానాంబ.

జ్ఞానాంబ అంశయే సద్గురు సుబ్రహ్మణ్యుల రూపంగా శ్రీకాళహస్తిలో నడయాడుతున్నది.

* * *

జ్ఞానవాశిష్ఠంలోని వాక్యమును పోలిన వాక్యమే మరొకటి
రమణసాహిత్యంలో తటస్తపడినది...

1991 ప్రాంతంలో ఓ రోజు గురువుగారు శ్రీరామ మందిరం వరండాలో గొంతుక్కూర్చుని ప్రశాంతంగా తనలో తాను రమిస్తూ ఉన్నారు...

గురువుగారితో నేను శ్రీరామమందిరం వద్ద గడిపిన సాయంత్రాలు యెన్నో...

ఆ రోజు నాకు శ్రీరమణాశ్రమం నుండి పోస్టులో తెలుగు బుక్స్ కేటలాగు వచ్చింది... తీసుకెళ్ళి,

వారిచేతిలో పెట్టి మంచి బుక్స్ ఏవైనా ఉంటే టిక్ మార్క్ పెట్టి ఇవ్వండి తెప్పిస్తాను...అన్నాను.

గురువుగారు లిస్ట్ అంతా చదివి, ఓ మూడు పుస్తకాలకు టిక్ పెట్టారు...
1.ఉన్నది-నలుబది
2.రమణభాషణములు
3.సూరినాగమ్మ రమణాశ్రమలేఖలు.

ఆర్డర్ పెట్టాను...వారంలోపే నా చేతికందాయి...

అందులో "ఉన్నది-నలుబది" పుస్తకం నాకు అద్భుతంగా అనిపించింది.

గురువుగారు చిన్న నోట్ బుక్ ఒకటి తీసుకుని అందులో ఉన్నది-నలుబదిని పూర్తిగా స్వదస్తూరీతో వ్రాసుకుని, కంఠస్థం చేశారు.

దాంతో ఆ గ్రంథంపై నాకు మరింతగా శ్రద్ధ పెరిగింది...

"రమణ హృదయం" అనదగ్గ గ్రంథం అది.

నేనూ ఆ 42 పద్యాలను 42 రోజులు ఒంటిపూట ఉపవాసం ఉంటూ రోజుకు ఒక పద్యం కంఠస్తం చేశాను 1999లో.

ముఖ్యంగా అందులో 11వ పద్యం మరీ అద్భుతం అనిపించింది...దానిని పదే పదే మననం చేసుకుంటూ ఎంతో ఆనందం పొందేవాణ్ణి ఆ రోజుల్లో....

గురువుగారు జ్ఞానవాశిష్ఠంలో అండర్ లైన్ చేయమన్న వాక్యానికి సరిపోలిన పద్యం అది.

నేను చాలా మందికి చెప్పాను- ఆ 11వ పద్యం
నా కంట పడకుండా ఉండి ఉంటే,
నేను పరమనాస్తికుణ్ణై ఉండేవాణ్ణి...అని.

మన ఆధ్యాత్మికాన్వేషణలో దిశానిర్దేశం చేసే పద్యం అది.

అదే ఇది -

* * *

ఎఱిఁగెడు తనను ఎఱుఁగక యితరము నెఱుఁగుట యజ్ఞానమే గాని జ్ఞానమగునా? జ్ఞాన, ఇతరములకాధారమైన తనను ఎఱిగినచో

జ్ఞానాజ్ఞానములు నశించును.

* * *

అన్నింటినీ తెలుసుకుంటూ ఉండడం జ్ఞానం అని  అనుకునేవాణ్ణి.

విషయసేకరణే జ్ఞానమని
డైరీల్లో చేర్చిపెట్టుకున్నాను...
అల్మారాలో పేర్చిపెట్టుకున్నాను...

ఒకరోజు ఆ డైరీలన్నీ పొయ్యిలో వేసి వేడినీళ్లు కాచుకుని,
తలస్నానం చేసి గురువు వద్దకు వెళ్లి చెప్పాను...
"మంచిపని చేశావ్" అన్నారు.

తాను తెలుసుకునేదంతా - విజ్ఞానం.
తనను తెలుసుకునేది - జ్ఞానం.

అన్నింటినీ తెలుసుకునే "తనను" తెలుసుకోవడమే జ్ఞానం అని తెలిసింది ఉన్నది-నలుబది చదివాక.

అప్పుడే మిగతా ఆధ్యాత్మిక గ్రంథాలపై ఆసక్తి తగ్గి,
హృదయగ్రంథులను విప్పే హృదయగ్రంథాన్ని చదవడం మొదలుపెట్టాను.

* * *

వెలిగా అలా అన్వేషిస్తూ అనంతంగా ప్రయాణించి అలసిపోతుంది విజ్ఞానం.

లోన మునిగి 'నేను' మూలాన్ని(ఆత్మను) కనుగొని
అందులో హాయిగా విశ్రమిస్తుంది జ్ఞానం.

పరమేశ్వరుడు తేజోలింగంగా సాక్షాత్కరించినప్పుడు
దాని ఆద్యంతాలు కనిపెట్టడానికి బ్రహ్మ విష్ణువులు ప్రయత్నించారంటే అర్థం ఇదే.

బ్రహ్మ బహిర్ముఖ ప్రయాణం చేశాడు.
విష్ణువు అంతర్ముఖ ప్రయాణం చేశాడు.

నేను కనుగొన్నానని అబద్ధం చెప్పి శివుని శాపానికి గురయ్యాడు బ్రహ్మ.

కనుగొనలేమని నిజం చెప్పి శివుని నుండి (విష్ణు)చక్రాన్ని బహుమానంగా పొందాడు విష్ణువు.

* * *

ఆత్మస్థానంలో సాపేక్షకాలైన జ్ఞానా-జ్ఞానములు రెండూ నశించి "కేవలజ్ఞానం" శేషిస్తుంది.

ఆ కేవలజ్ఞానమే "నేను".

"నేను" అనేదే శాస్త్రవేత్తలు వెతికే ఆ దైవకణం.

అది పరికరాలకు అందే భౌతిక పదార్థం కాదు.

* * *

గురువు ద్వారా గానీ, పుస్తకాల ద్వారాగానీ, లేదా బుద్ధి ద్వారాగానీ తాను పొందే జ్ఞానం జ్ఞానం కాదు.

"ఎఱుగునది యదార్థ జ్ఞానము కాదు"
(objective knowledge is not true knowledge)
అని స్పష్టంగా చెప్పేశారు భగవాను.

జ్ఞానాజ్ఞానములనేవి సాపేక్షములు.

సాపేక్షజ్ఞానం యెప్పుడూ యదార్థజ్ఞానం కానేకాదు.

నిజమైన జ్ఞానంలో -
తెలుసుకునేవాడు, తెలియబడేది
అని రెండు ఉండవు.

నేనెవడను? అనే ఆత్మవిచారణ వలన
ఈ రెండూలేని, ఏకమై వెలిగే జ్ఞానమే తాను అని తెలుస్తుంది.

సూర్యకాంతిలో ప్రతి వస్తువు యొక్క నీడ భూమ్మీద పడుతుంది.
కానీ సూర్యుని నీడ భూమ్మీద పడుతుందా?

అలా తాను అనంతమై, ఏకమై వెలిగే జ్ఞానప్రకాశంలో
అజ్ఞానమనే నీడ తనకు ఉండదు.

తెలుసుకునే తాను లేని స్థితిని శూన్యమని అనుకోరాదు.
అక్కడ పరిపూర్ణమైన శుద్ధజ్ఞానం ప్రకాశిస్తూ ఉంటుంది.

శూన్యమంటే - బౌద్ధం.
పూర్ణమంటే - శైవం.

శైవమంటే శుద్ధ అద్వైత తత్త్వం.
మాట వరుసకు కూడా రెండవ వస్తువును అంగీకరించని ఏకాత్మ తత్త్వం.

* * *

## 103. "అది" ఎన్నుకొంటుంది

---

దానిని రమణుడు ఎన్నుకోలేదు...
"అది" రమణుణ్ణి ఎన్నుకుంది.

* * *

ఎన్నిక ఈ వైపు నుంచి ఉంటుందనే ఒకే ఒక తప్పుడు భావనే అన్ని సాధనలకూ కారణమౌతోంది.

"అది" ఏన్నుకోవడంలో మన అర్హతానర్హతలతో నిమిత్తం లేదు అనే విషయాన్ని కూడా బాగా గుర్తులో ఉంచుకోవాలి.

"నైతిక విలువతో దీనికి ఏ సంబంధం లేదు"
అంటారు UG.

* * *

యెన్నో ప్రళయాలు వచ్చిపోయినా సరే
చావులేక స్వరూపమై వెలిగే చిరంజీవి భుసుండుడు...

కారణమేమి? అని ప్రశ్నిస్తాడు వశిష్ఠుడు.

"ఈశ్వర నియతి" అని సూటిగా, క్లుప్తంగా సమాధానమిస్తాడు భుసుండుడు.

* * *

రెప్పపాటు కాలంలో ఇలాంటి వివేకానందులను వేలమందిని సృష్టించగలిగే శక్తిమంతుడు నా గురువు...అంటారు వివేకానంద.

అలాంటి రామకృష్ణుల నోట ప్రతి నిమిషం "భగవదిచ్ఛ" అనే మాట నానుతూ ఉంటుంది.

భగవదిచ్ఛను స్వాగతించడమే భక్తియోగం.
భగవదిచ్ఛను ఎదిరించడమే కర్మయోగం.

ఒకడు ముందుగానే లొంగిపోతాడు.
మరొకడు ఎదిరించి చివర్లో లొంగిపోతాడు.

ఏ యోగమైనా, ఏ మార్గమైనా చివర్లో లొంగిపోవడమే(శరణాగతి) పరమావధి.

ఓటమిని అంగీకరించడం,
పూర్తిగా నిస్సహాయంగా ఉండిపోవడం
అప్పుడు దాని నుండి వెలువడేదే వివేకం(wisdom).
నీవు చేయగలిగింది ఏమీలేదని అర్థం.
అదే సంపూర్ణ ఆత్మసమర్పణం...అంటారు UG.

పల్లంలోకి నీరే వచ్చి నిండిపోతుంది.
లొంగిపోతే దైవమే వచ్చి నీలో ఉండిపోతుంది.

* * *

"ఏ సాధనా చేయకపోవడమే మా సాధన"
అంటుంటారు గురువుగారు...

నిజానికి ఇదే అతి కష్టమైన సాధన అనిపిస్తుంది.

ఏదో ఒకటి చేస్తుండడం సులభం.
ఏమీ చేయకుండా ఉండడమే కష్టం.

కష్టపడి సాధిస్తేగాని మనకు తృప్తి ఉండదు.
సులభంగా దొరికేస్తే ఏ విలువా ఉండదు.

ఊరికే ఉండడం వలన సిద్ధి కలగడం కాదు,
ఊరికే ఉండడమే సిద్ధి.

నీవు నీవుగా ఉండటానికి నువ్వేమీ చేయనక్కర్లేదు.
కానీ నీవు నీవులా కాకుండా మరోలా ఉండటానికి నీవు
చాలా(సాధనలు)చేయాలి...అంటారు UG.

"అది" ఇప్పటికే పరిపూర్ణం.
దానిని మనం కష్టపడి పరిపూర్ణం చేయనక్కర్లేదు.

"మీ పరలోకపు తండ్రి పరిపూర్ణుడు గనుక మీరును పరిపూర్ణులుగా ఉండెదరు" అంటారు క్రీస్తు.

రూపాయిలో ఉన్న  ఓ "పైసా", రూపాయితో దబాయించి చెప్పవచ్చు- నేను లేకపోతే నీ పరిపూర్ణత్వానికే భంగం అని.

ఉన్నది సద్వస్తువు ఒక్కటే. దానికి విడిగా ఏమీలేదు....అనుకున్నాక మనం సత్యం కాకుండా ఎలా ఉంటాం.

ఈతరానివాడైనా సరే, అమృతసరస్సులో మునిగిపోయి ఎవడైనా మరణించగలడా?

"అది ఉన్నరీతిన ఉన్నది" అంతే.
పొందటమో, పోగొట్టుకోవడమో రెండూ చేయలేం.

సత్యం అనేదానిని-
నీవు పట్టుకోలేవు.
నీలో ఇముడ్చుకోలేవు.
నీవు వ్యక్తం చేయలేవు.
అంటారు UG.

* * *

అమాయకులైన పరమానంద శిష్యులు పదిమంది కలిసి ఓ నదిని దాటాక, అందరూ గట్టుకు చేరారా లేదా అని అనుమానమొచ్చి, అందులో ఒకడు తనను మినహాయించి లెక్కపెట్టేసరికి తొమ్మిదిమందే లెక్కతేలుతారు. ఒకడు నదిలో కొట్టుకుపోయాడని అందరూ ఘొల్లుమంటారు.

ఆ దారిన పోతున్న బుద్ధిమంతుడైన బాటసారి ఇది గమనించి,
లెక్కించేవాడినుంచి లెక్క మొదలుపెట్టి పదిమందిని లెక్కించి, మీలో
ఎవరూ కొట్టుకుపోలేదని, అందరూ క్షేమంగా ఉన్నారని తెలియజేస్తాడు.

* * *

అలా తాను స్వతఃగా ముక్తస్వరూపుడు.
తాను పోగొట్టుకున్నదిగానీ,
క్రొత్తగా పొందవలసినదిగానీ
సాధన చేయవలసిన అగత్యంగానీ
తనకు అస్సలు లేనేలేదు.

ఆ అమాయక బాలుని వలె లెక్క(సాధన) చేస్తున్నాడు.
ఆ పదియవ వాడివి నీవే అని గుర్తుచేసేవాడు గురువు.

వెదికేవాడే.....చివరికి దొరికేవాడు కూడా.

* * *

పొరపాటున అద్దాలమహల్ లోనికి వెళ్లిన కుక్కకు
అనేక కుక్కలు ఉన్నట్టు భ్రమపడి ప్రతిబింబాల వైపుకు దాడి చేయడానికి
ప్రయత్నించినట్టు

ఉండేది తానొక్కడే అయినా
తననే అజ్ఞానంతో అనేకంగా చూస్తూ
ద్వైతభావనతో ఘర్షణపడుతున్నాడు.

అద్వైతసిద్ధికై గురువును ఆశ్రయించి
సాధన చేస్తున్నాడు.

నిజానికి సాధనలోనూ, సాధ్యములోనూ
ఉండేది "తాను" ఒక్కడే.

ముల్లును మరో ముల్లుతో తొలగించునట్లు
భ్రమను మరో భ్రమతోనే తొలగించాలని
గురువు నిశ్చయించి, శిష్యునికి ఒక సాధనను నిర్దేశించి ఉన్న ముక్తినే
ఇస్తాడు అంతే.

నిజానికి-
తనకు లేనిదానిని, తాను కానిదానిని
ఎవడూ ఇవ్వలేడు.
ఇవ్వబడినదంతా తనకున్న దానినే,
తానే అయి ఉన్నదానినే.

ఇతరులకు తాను క్రొత్తగా ఏదో పొందినట్టు
అనిపిస్తుందేగాని

సాధన ద్వారా తానెప్పుడూ ముక్తుడేనని,
పొగొట్టుకున్నది స్వరూపాన్ని కాదు,
జ్ఞప్తినే అని తెలుసుకుంటాడు.

మరపే - బంధం.
జ్ఞప్తియే - మోక్షం.

* * *

కథలోని ఓ పాత్ర ఆ కథారచయితకు తెలియకుండా కథలో నుంచి విరమించుకోగలదా?

కలలోని ఓ వ్యక్తి ఆ కలను కనేవానిలోంచి బయటకు దుముకగలడా?

నిజానికి 'నేను కర్తను కాను' అనడానికి కూడా
నీవు కర్తవు కావు.

ఈ మాటయినా నీ వెనక ఉండి
నిన్ను నడిపించేవాడు అంటేనే నీవు అనగలవు.

నీ ప్రతి పలుకూ భగవంతునిదే.
నీ ప్రతి కదలికా భగవంతునిదే.

* * *

ఈ జగత్కథలో పాత్రలే జీవులందరూ.
ఆ మహా కర్తే(రచయితే) పరమేశ్వరుడు.

ఆ కర్త తన వినోదము కొరకు రకరకాలుగా
పాత్రలను(జీవులను) సృష్టించి ఆడిస్తున్నాడు.

వినోదార్థం జరుగుతున్న ఈ ఆనందక్రీడలో "యెందుకు" అన్న ప్రశ్నకు అర్థం లేదు.

"ఈశ్వరుడు కర్త" అనేది నిజంగా తెలిసిననాడు
ఆ క్రీడలో నీవూ భాగస్వామ్యం అవుతావేగాని,
"ఎందుకు" అన్న ప్రశ్న వేయవు.
ఏ అయోమయానికీ లోను కావు.
ఏ సుఖదుఃఖాలకూ లోను కావు.

"కర్త"గా నీవెప్పుడైతే తప్పుకున్నావో
(ప్రారబ్ధ-ఆగామి-సంచిత)కర్మలు మూడూ నీ నుంచి తప్పుకుంటాయి.

నీవు "అకర్త"వు అవుతావు.

"అకర్త" తోలుబొమ్మలాంటివాడు.
తోలుబొమ్మకు సుఖదుఃఖాలు ఉండవు.

ఆడించేవాడు - చైతన్యస్వరూపుడు.
ఆటవస్తువులు - జడరూపాలు.

ఆడించేవాడు ఆడిస్తే ఆడుతాయి.
పెట్టెలో పడేస్తే ఊరికే ఉంటాయి.

అలా ఈ ఆత్మ అనే తెరపై ఆడే బొమ్మలు జీవులు.
అనే తెలివి కూడా దైవమే ఇస్తుంది జీవులకు.

జ్ఞానమూ దైవప్రసాదమే.
అజ్ఞానమూ దైవప్రసాదమే.

బంధమూ క్రీడే.
మోక్షమూ క్రీడే.

* * *

104. కనేదంతా కలవరింత
పలికేదంతా పలవరింత

---

1993 ప్రాంతంలో మా కైకాలవీధిలో ఉండే శ్రీరామమందిరంలో సాధుసుబ్రహ్మణ్యం అనే అతను సాలిపేట నుండి వచ్చి ప్రతి సాయంత్రం మైక్ లో పురాణం చదివి వినిపించేవాడు...

అతనికి నేను పెట్టిన నిక్ నేమ్ "మైకాసురుడు".
మైకు పట్టుకుంటే వదలడు.
మైకు చేతికి ఇస్తే చాలు మైమరచిపోయి మాట్లాడుతాడు ఏ సభలో అయినా...

మందిరంలో వారికి ఏకైక శ్రోతను నేనే. యెందుకంటే వారి ముందు మైక్ సెట్ పెట్టే డ్యూటీ నాదే కాబట్టి.

వారి కార్యక్రమం పూర్తయ్యాక, మైక్ సెట్ లోపల పెట్టి, ఇద్దరమూ బయట వరండాలో కూర్చొని ఆధ్యాత్మిక సంభాణలతో కాసేపు గడిపేవాళ్లం.

నాకు అప్పట్నుంచి "చివరి మాటలు" తప్ప,
దిగువస్థాయి మాటలు నాకు నచ్చేవికావు...

అతనేదో చెప్పడం...
నేను దానిని ఖండించి నేనేదో చెప్పడం...
అతను ఏమీ తోచక మౌనం వహించడం...
ఇలా జరుగుతుండేది...

ఓరోజు నేను అతనితో అలా వాదిస్తుంటే, గురువుగారు మందిరం గోడ చాటున ఉండి
అంతా విని, నిశ్శబ్దంగా వెళ్లిపోయారు.

వారు ఉన్న సంగతి, విన్న సంగతి నాకు తెలియదు.

గురుసన్నిధికి వెళ్లినప్పుడు "ఏం బాబూ! ఆ పెద్దాయనకు షాక్ ట్రీట్ మెంట్ ఇస్తున్నావు...!" అన్నారు.

నేను లజ్జపడ్డాను...
గురువుగారు నా మాటలు వినేశారని...

"చివర్లో చెప్పాల్సినవి మొదట్లోనే చెప్పేస్తే ఎలా?
వచ్చిన పని మొదటిరోజే అయిపోతే, ఇక వారు మన దగ్గరకు
రారు...అన్నారు తమాషాగా...నర్మగర్భంగా...

అంతేగా... అంతేగా...

వచ్చినవాడికి వచ్చినరోజే చివరి రోజైతే ఇక ఆశ్రమం నడిచేదెట్లా?

వచ్చినవాడు మళ్లీ మళ్లీ ఆశ్రమానికి వస్తూ ఉండాలి...

మళ్లీ మళ్లీ రావడానికి అవసరమైన పరిస్థితుల్ని
కల్పిస్తూ ఉండాలి...

కాస్త అజ్ఞానాన్ని తన బోధల్లో మిక్స్ చేస్తూ ఉండాలి.
శుద్ధజ్ఞానాన్నే బోధిస్తున్నట్టు అనిపిస్తుండాలి...

సమాధానం ఇచ్చినట్టే ఉండాలి...
కానీ ఇవ్వకూడదు.

మళ్లీ మళ్లీ మనల్ని ప్రశ్నిస్తూనే ఉండాలి...
మనం సమాధానం ఇస్తూనే ఉండాలి...

వాడు శాశ్వత అజ్ఞానిగానే ఉండిపోవాలి...
స్వామికి మాత్రం జ్ఞాని అనే కీర్తి నలుదిశలా వెళ్లిపోవాలి.

కపట గురువులకు దొరికే శిష్యులు కూడా కపట శిష్యులే...సందేహం లేదు.

సత్ శిష్యులకు సత్ గురువు దొరుకుతాడు...
అది ఏ కాలమైనా సరే.

మన గురువు వద్దకు వచ్చిన ఆగంతుకుడు ఏ స్థాయి వాడైనా సరే, వారి బోధలను ప్రత్యక్షంగా విన్నాక, ఆకలి ఉన్నవాడు కడుపునిండా భోంచేసిన తృప్తి కలుగుతుంది.

చాలు బాబూ చాలు...
ఆ తత్త్వాన్ని సంపూర్ణంగా ఆరగించాను...

ఇక అరిగించుకోవడానికి తన జీవితకాలం సరిపోతుంది...
అన్న ఆనందంతో సొంతూరికి తిరిగి వెళ్లిపోతాడు...

ఒకవేళ ఆ ఆగంతకుడు మళ్లీ వచ్చినా,
అవసరంతో రాడు...స్నేహంతో వస్తాడు...

అలా స్నేహంతో వస్తున్నవారే ఈ పట్టెయ్య, వేంకటనరసయ్య, పలనాటి శ్రీను, భద్రయ్య...మొదలైనవారు....

* * *

ఆ తరువాత పురాణం చెప్పే అతనితో నేను మళ్లి  ఎప్పుడూ వాదించలేదు...

ఓ రోజు...
నేను అతను వచ్చే సమయానికి ముందే మైక్ ను సెట్ చేసి బయట వరండాలో కూర్చొని ఉన్నాను...
అతను నేరుగా వచ్చి దాని ముందు కూర్చున్నాడు...
మైకు కాస్త దూరంగా ఉన్నట్టు అనిపించి,
ఆ మైక్ స్టాండ్ ను పట్టుకుని తన  ముందుకు జరపబోయాడు
గాబోలు...అంతే...ఏం జరిగిందో ఏమో...!!

మామూలుగా అయితే అతను మైకును వదలడు.
ఇప్పుడు మైకు అతన్ని వదలడంలేదు.

దభేల్మని ఏదో పడ్డట్టు శబ్ధం వచ్చింది...
బయట వరండాలో ఉన్న నేను లోపలకు తొంగి చూశాను...
ఆ మైకు, మైకాసురుడు క్రింద పడిపోయి ఉన్నారు.
నేను గబగబా వెళ్లి మెయిన్ స్విచ్ ఆఫ్ చేశాను.

అతను బాగా వణికిపోతున్నాడు...
బహుశా ఈరోజే చివరిరోజు అనుకుని ఉంటాడు...

బయటకు వచ్చి గాలి పీల్చుకున్నాడు...
ఆ ప్రక్కనే కాపురముంటున్న పద్మమ్మ అనే ఆవిడ చక్కెర తెచ్చిచ్చింది...ఆవురావుమని రెండు పిడికిళ్లు తిన్నాడు...

కాసేపటికి స్వస్థతపడ్డాడు...

"బాబూ! ఆ మైక్ ను రిపేరు చేయించు నాయనా!"
అని చెప్పి వెళ్లిపోయాడు...అంతే మళ్లి రాలేదు.

ఆ తరువాత అతను తటస్తపడ్డప్పుడల్లా-
"ఏం బాబూ! మైక్ రిపేర్ చేయించావా?" అని అడగడం అతనికి అలవాటైపోయింది...
రిపేర్ చేశానని చెప్పినా కూడా...అతను అలా అడగడం మానలేదు...

మళ్లి అతను మా మందిరానికి ఎప్పుటికీ రాలేదు...
పురాణం చెప్పడానికి.

పురాణం కంటే ప్రాణమే ముఖ్యమని తేలిందిగా.
రాముడే షాక్ ట్రీట్ మెంట్ ఇచ్చి దూరం చేశాడు.

* * *

అంతా భగవన్మయమే అని బోధిస్తాడు ఓ భక్తుడు.
అంతా భగవంతుడే అయినప్పుడు
యెవరికి బోధిస్తున్నట్టు? భగవంతుడికేనా?
యెంత హాస్యాస్పదమైన పరిస్థితి అది!

"ఉన్నది ఒక్కటే; అది నేనే" అని అంటాడు తాత్వికుడు...
రెండవ వస్తువు, రెండవ వ్యక్తి లేనప్పుడు నీవు ఎవరికి చెబుతున్నట్టు?
యెంత హాస్యాస్పదమైన పరిస్థితి అది!

జగన్మిథ్య అంటాడు ఓ బోధకుడు.
జగన్మిథ్య అనే ఆ బోధకుడూ మిథ్యే...
వినే శ్రోతా మిథ్యే...
బోధా మిథ్యే...

అలాంటప్పుడు
వక్త సత్యమే చెప్పాడని అనగలమా?
శ్రోత సత్యమే విన్నాడని అనగలమా?

ఆ బోధను సత్యబోధ అని అనగలమా?
యెంత హాస్యాస్పదమైన పరిస్థితి అది!

ఒకానొక దశలో ఈ ఆధ్యాత్మిక రచయితలకు, బోధకులకు ఏం చెబుతున్నామో...ఎందుకు చెబుతున్నామో...అర్థంకాని పరిస్థితికి చేరుకుంటారు....

self contradictionకు(స్వవచో విఘాతానికి) గురి అవుతుంటారు...

అవన్నీ చివరికి పొంతన లేని మాటలప్రోగుగా మిగిలిపోతాయి.

అవే గ్రంథాలుగా రూపుదాలుస్తాయి...
జిజ్ఞాసువులు వాటిని ముందరేసుకుని తలమునకలవుతుంటారు...

అవన్నీ ఉత్త మోతే తప్ప
వాటిలో సారమేమీ ఉండదు.

చెప్పేవాడికి, వినేవాడికి ఇద్దరికీ అర్థంకానిదే వేదాంతం...అని ఓ కవి అన్నాడు.

చెప్పేవాడు, వినేవాడు ఇద్దరూ
అయోమయంలో ఉన్నవారే...

* * *

మా ఊళ్లో అందరూ అబద్దాలు చెప్పేవాళ్లే అన్నాడట ఒకడు...

ఇంతకీ అతను అబద్ధం చెప్పినట్టా? నిజం చెప్పినట్టా?

ఊళ్లోవాళ్లు అబద్దాలు చెప్పేవాళ్లా? నిజం చెప్పేవాళ్లా?

ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టం...
ఏ సమాధానం ఇచ్చినా, అది మరో ప్రశ్నకు దారితీస్తుంది.

* * *

ఎవడికీ ఏమీ అర్థమైంది ఏమీలేదు....
అని అర్థమైనవాడే జ్ఞాని...

నాకు తెలిసిందల్లా 'నాకేమీ తెలియదు' అనేదే...
అన్న సోక్రటీసు మనకు ఆదర్శం.

జీవితలక్ష్యం - ఏమీలేదు...అన్న వివేకానందులే మనకు ఆదర్శం.

గ్రహించడానికి ఏమీలేదని గ్రహించడమే జ్ఞానోదయం...అన్న UG మనకు ఆదర్శం.

'ఏమీ తెలియకపోవడమే దేవుణ్ణి తెలియడం'
అన్న సద్గురువు మనకు ఆదర్శం.

'తెలుసుకోవాలి' అనేవాడు - విజ్ఞాని.
'తెలుసు' అనేవాడు - అజ్ఞాని.
'తెలియదు' అనేవాడు - జ్ఞాని.

మన బుద్ధి పరిమితం.
మన భాష పరిమితం.

ఈ పరిమితులతో అపరిమితమైనదానిని తెలుసుకోవాలని ప్రయత్నిస్తాం.

దోషముండే స్కేల్ తో నీవెంతగా కొలిచినా
లెక్క తేలదు.

ఈ పరిమితబుద్ధితో నీవెంతగా తర్కించినా
ఆత్మ దొరకదు.

* * *

"పొందలేం"అని చెప్పేవాడే
నీకు చాలా మేలు కూర్చేవాడు.

పొందాలి-పొందగలం అని చెప్పే
ప్రతివాడూ మోసగాడే.

పొందినవాడు చెప్పడు.
చెప్పినవాడు పొందలేదు.

* * *

అంతా మిథ్య....అని తెలిసినా
లేక
అంతా బ్రహ్మమే...అని తెలిసినా

ఊరికే ఉంటాడు...
ఏమీ మాట్లాడడు...
ఎవరికీ బోధించడు...

మరి నేనేం చెప్పినట్టు?
ఎందుకు చెప్పినట్టు?
ఎవరికీ చెప్పినట్టు?

'నేను' తప్ప ఏమీ లేదు కదా?
నాకు నేనే చెప్పుకుంటున్నానా?

అయ్యా...!
నేను గాక ఇంకెవరైనా ఉన్నారా ఇక్కడ...?
దయచేసి చెప్పండి...
ఉంటే, నా మాటలేవీ పట్టించుకోకండి...

ఇవి నా కోసం నాలో నేను చెప్పుకున్న మాటలే...
ఇవన్నీ నా కలవరింతలే... నా పలవరింతలే...

* * *

105. చూస్తా ఉండాల.....

---

30-9-2021 * గురువారం

ఈరోజు ఉదయం 6.00 నేనూ దేవీప్రసాద్ సద్గురు సన్నిధికి వెళ్లాం...

బాబూ!  నీకు తెలుసా? చిలకమ్మ వచ్చి రవి ఇంట్లో మూడురోజులు ఉండి వెళ్లిందట....అన్నారు గురువుగారు.

అవునా! నాకు తెలియదే...! అన్నాను.

"నా వద్దకూ రాలేదు.... సుజాతమ్మను కూడా కలవకుండానే తిరిగి వెళ్లిపోయిందట అరుణాచలానికి..." అన్నారు.

నాకు ఆశ్చర్యమేసింది....

కైకాలవీధికి వచ్చి, నన్ను కలవకుండా, నాతో మాట్లాడకుండా చిలకమ్మ వెళ్లదు...అందులో తన ప్రియస్నేహితురాలైన సుజాతమ్మను కూడా కలవకుండా వెళ్లడం...ఆశ్చర్యమనిపించింది...

"ఎందుకో మరి అలా చేసింది...!" అన్నాను...

"చూస్తా ఉండాల...." అంటూ శూన్యంలోకి చూస్తూ మౌనం వహించారు గురువుగారు...

* * *

సద్గురు నోట "చూస్తా ఉండాల" అనే చిన్న మాట
నాకది గొప్ప ఆధ్యాత్మికోపదేశంగా అనిపించింది.

చూస్తా ఉండాల....(సాక్షిగా)

దేనినీ ఖండించడంగానీ,
దేనినీ సమర్థించడంగానీ
దేనికీ ఆశ్చర్యపోవడంగానీ
దేనికీ విచారించడంగానీ
చేయకూడదు...
ఉన్నదానిని ఉన్నట్లుగా(యధాతథంగా) చూడగలిగితే అదే స్థితప్రజ్ఞత.

ఏది ఎలా ఉండాలో అది అలానే ఉంటుంది....
ఇలా ఉండాలి, అలా ఉండాలి అనుకోవడమే
అన్ని ఘర్షణలకు మూలం.

సృష్టిలో ప్రతీది సహజంగా, పూర్ణంగా ఉన్నది.
మార్పు తేవలసిన అవసరం ఎప్పుడూ ఎక్కడా లేదు. అంతా సహజంగా ఉంది...అంటారు గురువుగారు.

తీర్పుతీర్చకుడి...అన్న క్రీస్తు వాక్యం నాకు చాలా ఇష్టం...

అనవసరమైన విషయాల్లో involve అయిపోవడం...

యెదుటవాడు అడక్కపోయినా ఉచిత సలహాలిచ్చేయడం...

ఇతరుల గొడవల్లో తలదూర్చి తీర్పు చెప్పడం...

వాడు అలాంటివాడు, వీడు ఇలాంటివాడు అంటూ తటాలున statements ఇచ్చేయడం...

ఇవన్నీ బ్యాటరీని(ఆత్మశక్తిని) Waste చేసుకునే పనులే...

అనవసరమైన తలంపు కలిగినా,
అనవసరమైన మాట పలికినా...

వెంటనే బ్యాటరీ వేస్ట్ చేసుకోకు, బ్యాటరీ వేస్ట్ చేసుకోకు...అనుకుంటూ తనను తాను తమాయించుకోవాలి(control చేసుకోవాలి).

ఇలా అనుకుంటూ ఉంటే,
అవసరమైనప్పుడు తప్ప అనవసర విషయాలకంతా మనసు, వాక్కు వ్యక్తం కావు...
స్వస్థానంలో అవి హాయిగా ఉంటాయి...

అలా వాక్కు, మనసులను వీలైనంతవరకు వాటి స్వస్థానంలో ఉంచగలిగేటట్లు జీవించగలిగే
టెక్నిక్ నే "కర్మసుకౌశలం" అన్నారు గీతలో కృష్ణభగవానులు.

నీళ్లలో పడవ ఉండొచ్చు పడవలో నీళ్లు ఉండకూడదు...అన్నారు రామకృష్ణులు.

మనం విషయాల్లో ఉన్నా
మనలో విషయాలు ఉండకూడదు.

లోపల "ఖాళీ"గా ఉండాలి...

* * *

లోపల విషయాలే  కాదు,
అవయవాలు కూడా లేవని అనుకోమంటారు
గురువుగారు...

లోపల హార్టు, కిడ్నీ, లివరు ఉన్నాయనుకుంటే,
అవి పని చేయడం, చేయకపోవడం రెండూ ఉంటాయి.

తన లోపల అంతా "ఖాళీ"గా ఉందని భావించు ముందు...

తరువాత నీవు యెంత ఆరోగ్యంగా ఉంటావో చూడు...

తన లోపల విషయాలు లేకుంటే -
మనసు ఆరోగ్యంగా ఉంటుంది.

తన లోపల అవయవాలు లేవనుకుంటే-
శరీరం ఆరోగ్యంగా ఉంటుంది.

"ఈ శరీరాన్ని గురించి ఎంత తక్కువగా ఆలోచిస్తే అంత మంచిది" అంటారు వివేకానందులు.

శరీరచింతనే అనారోగ్యానికి మూలకారణం.
బ్రతకాలనే ఆశే ప్రధానరోగం.

మరణించే ఉన్నాం...
మరణించడానికి క్రొత్తగా ఏమీలేదిక్కడ...
అన్న ఎఱుకే ఆత్మజ్ఞానం.
* * *

"ఏమీ లేదు" అని అనేవాడు తప్ప ఏమీలేదు.

(పై వాక్యాన్ని నేను చాలా కాలం నుంచి మననం చేసుకుంటూ ఉన్నాను)

ముందు ఉండి, తర్వాత నీవు ఉందనుకోవడం కాదు.
నీవు ముందు "ఉంది" అన్నాకే ఏదైనా ఉంటుంది.
అంటారు గురువుగారు.

ఇది చాలా కీలకమైన పాయింటు....

నీకున్న కష్టమైనా, సుఖమైనా...నీ అంగీకారంతో ఉంది అనేదే సారాంశం.

ఇప్పుడున్న నీ పరిస్థితికి అచ్చంగా నీవే కారణం.

ప్రారబ్ధం మీదకో...విధి మీదకో...దేవుని మీదకో త్రోసేయకు...

నా జీవితానికి డిజైనర్ నేనే.
నేనే కర్త కర్మ క్రియ.
నేనే కేంద్రం.
అంటూ మననం చేసుకుంటూ ఉండు.

* * *

మా మామగారు గురప్పగారు...
హైస్కూల్ ప్రధానోపాధ్యాయులుగా రిటైర్డ్ అయ్యారు..
మా కైకాలవీధిలో ఉండే శ్రీరామమందిరానికి చాలాకాలంపాటు
ప్రధానసేవకులుగా ఉన్నారు.
ఇప్పుడు వారి వయసు 80.
ఇప్పుడు కూడా రామసేవలో ఉత్సాహంగా పాల్గొంటూనే ఉన్నారు...

ఈ మధ్య సద్గురు సన్నిధిలో  ఏదో సందర్భంలో వారి గురించి ప్రస్తావనకు వస్తే-

"బాబూ! రాముణ్ణి వదలందే మీ మామకు మోక్షం లేదు" అన్నారు తటాలున.

ఒక్క క్షణం అవాక్కయ్యాను...

చిరునవ్వుతో అలా మౌనంగా సిగరెట్ త్రాగుతూ ఉండిపోయారు గురువుగారు...

తరువాత ఏమీ చెప్పలేదు...

మిగతా అంతా బాబుయే పూరించుకుంటాడని వారికి తెలుసు.

పూరించుకోవాలి కూడా...

వారు చెప్పిన ప్రతిదానికీ ఎందుకు-ఏమిటి-ఎలా
అని ప్రశ్నించి విసిగించకూడదు...

ఓ ఆగంతకుడు ఓ ప్రశ్న వేసినప్పుడు-
"ఆ ప్రశ్ననే కొంతకాలం ధ్యానం చేయండి" అని చెప్పారు గురువుగారు.

మరొక ఆగంతకునికి సమాధానం చెప్పినప్పుడు
"అర్థంకాలేదు స్వామీ..." అన్నాడు అతను...
"ఇప్పుడేగా సమాధానం వచ్చింది....
కొంతకాలం ఆ సమాధానాన్నే ధ్యానం చేయండి..."
అని చెప్పారు గురువుగారు.

కాబట్టి ప్రశ్న సమాధానంగా మారాలన్నా,
సమాధానం స్వరూపంగా మారాలన్నా
కొంతకాలం యెదురుచూడాలి...తప్పదు.

గుడ్డు పెట్టగానే అందులోంచి పిల్ల రావాలంటే ఎలా?
గింజ పాతగానే అందులోంచి మొక్క రావాలంటే ఎలా?
సంయోగం అవగానే  శిశువు కావాలంటే ఎలా?

కొంతకాలం యెదురు చూడాలి...

* * *

గురువు నుంచి మాట అసంపూర్ణంగా బయలుదేరి
శిష్యుణ్ణి చేరేసరికి పూర్ణంగా మారుకుంటుంది.

గురువు నుంచి ప్రశ్నగా బయలుదేరి
శిష్యుణ్ణి చేరేసరికి సమాధానంగా మారుకుంటుంది.

నిజమైన గురువు శిష్యుడికి సమాధానం ఇవ్వడు.
ప్రశ్ననే ఇస్తాడు.

నీవెవరు? అని ప్రశ్ననే ఇచ్చారు భగవాను ఈ లోకానికి.

లెక్కలమాష్టారు సమస్యనే ఇస్తాడు.
విద్యార్థి solution కనుక్కుంటాడు.

* * *

గురువైనా దేవుడైనా తాను ఎదగాడినికి
ఓ ఆలంబన మాత్రమే...మొక్క ఎదగడానికి ఆలంబనగా ఉండే కర్ర వలె.

పసివాడు నడక నేర్చుకోవడానికి ఉపయోగపడే మూడుచక్రాల తోపుడు బండి లాంటివారే గురువు, దేవుడు...

నడక నేర్చుకోవడానికి బండిని ఉపయోగిస్తున్నప్పుడు, తల్లిదండ్రులు ఎంతో సంతోషిస్తుంటారు...

వాడు ఎదిగాక కూడా ఆ తోపుడుబండి అవసరమైంది అనుకో...అప్పుడు ఆ తల్లిదండ్రులు దుఃఖిస్తారు...తమ బిడ్డ అవిటివాడని...

గురువు, దేవుడు అనే ఊతకర్రలతో అవసరం తీరడమే
గురువు, దేవుడు వలన ప్రయోజనం.

కర్మము మార్గమే, కాని అదే పరమార్థం కాదు.
కర్మమే పరమార్థమని బోధించినందువల్లనే
భారతదేశంలో బౌద్ధమతక్షీణతకు మూలకారణమయ్యింది...

ఇంటికి స్లాబ్ వేసేటప్పుడు 21 రోజులు పోటీలు(కొయ్యస్తంభాలు) పెట్టి ఉంచుతారు...
21 రోజులు తరువాత స్లాబ్ గట్టిపడుతుంది.
పోటీలు తీసివేసి గృహప్రవేశం చేస్తారు...
అంతేగానీ చివరి వరకు ఆ పోటీలు అలానే ఉండాలి అంటే ఎలా?

గురువు, దేవుడు ఆ పోటీలు లాంటివారు...
కొంతకాలమే వారి అవసరం.
చివరి వరకూ కాదు.

పోటీలు లేకుండా స్లాబ్ ఉండలేదు అంటే,
అది మంచి స్లాబ్ కాదు అనే అర్థం.

ఊతకర్రలు లేకుండా నేను నడవలేను అంటే
నీవు కుంటివాడవనే అర్థం.

నీవు దేవుడు కావాలంటే తక్షణం దేవుణ్ణి వొదులు.
నీవు గురువు కావాలంటే తక్షణం గురువుని వొదులు.

ఇది దైవద్రోహం, గురుద్రోహం ఏ మాత్రమూ కాదు.
ఇది వారి యెడల నీవు చూపించే నిజమైన కృతజ్ఞత.

వదిలేయడం అంటే వదిలేయడం కాదు.
వారు ఊతకర్రలు మాత్రమే అని తెలిసి ఉండడం.
నీవు స్వతంత్రంగా నడవగలగడం.
అంతే.

* * *

ఇప్పుడే మా సోదరి పావనీగారు నాకు కొన్ని అంకెలు పంపారు....

నేను వారికి అంకితంగా ఈ కొన్ని అక్షరాలు పంపుతున్నాను....

"జ్ఞానప్రసూనాలు" రచించిన జ్ఞానశిశువు యొక్క చేతిని ముద్దాడిన మా సోదరి పావనీకి ఈ వ్యాసం అంకితం...

* * *

106. త్రికోణం

---

8-10-2021 * శుక్రవారం *

సాయంత్రం 6 గంటలకు మా ఆవిడ రమాదేవి శివాలయం వెళ్లింది...

ప్రతి శుక్రవారం జ్ఞానప్రసూనాంబకు బంగారు చీరను అలంకరింప చేస్తారు.

ఇక్కడి స్త్రీలు బంగారుచీరలో ఉన్న
అమ్మవారిని దర్శించడానికి ఉత్సాహపడతారు.

ఆ బంగారు చీరలో మరింత తేజోమంతమై విరాజిల్లుతుంటుంది అమ్మవారు.

అందువల్ల స్థానికులు శుక్రవారం తప్పక శివాలయం వెళ్లి
జ్ఞానప్రసూనాంబను కనులారా దర్శించి తన్మయులవుతుంటారు.

* * *

ఒకప్పుడు శ్రీకాళహస్తి రాజు మీదకు పొరుగు దేశపురాజు పెద్ద సైన్యంతో హఠాత్తుగా దండెత్తి వచ్చాడు. కాళహస్తి రాజు మొదట్లో కలవరపడినా తరువాత తమ కులదైవమైన "జ్ఞానప్రసూనాంబ"ను తలుచుకొని కొద్ది సైన్యంతోనే శత్రువులను ఎదిరించాడు.

శత్రురాజు ఈ యుద్ధంలో మొట్టమొదటి సారిగా తుపాకులను ఉపయోగించాడు. అందరూ కాళహస్తి రాజు ఓడిపోతున్నాడు అనుకున్నారు. తుపాకుల ముందు మామూలు ఆయుధాలు నిలుస్తాయా?

ఆశ్చర్యంగా కాళహస్తి రాజు విజయం పొందాడు.

ఆ రోజు రాత్రి కాళహస్తి రాజు కలలో జ్ఞానప్రసూనాంబ కనబడి తనకు ఒక చీర పెట్టమని అడిగింది.

రాజు ఆశ్చర్యపడుతూ -
'అమ్మా! నీకు చీరలు లేకపోవడం ఏమిటి?" అని అడిగాడు.

దేవీ తుళ్లిపడినా తన పమిటి చెంగును చూపుతూ, బిడ్డా! తుపాకీ గుళ్ల వల్ల ఇట్లా అయ్యింది...తుపాకీ గుళ్లు నీకు, నీ సైన్యానికి తగలకుండా నా చెంగు అడ్డం పెట్టాను... అని అన్నది.

కాళహస్తి రాజు ఉలిక్కిపడి లేచాడు...
ఆనందభాష్పాలు చెక్కిళ్లపై రాలుతున్నాయి. తన విజయరహస్యంలోని రహస్యం అవగతం అయ్యింది. తన తల్లి జగజ్జనని జ్ఞానప్రసూనాంబ తుపాకీగుళ్ళను తనపై తీసుకొని విజయాన్ని అనుగ్రహించింది.
ఎంత కరుణ...!! అని పొంగిపోయాడు.

మర్నాడు రాజు జ్ఞానప్రసూనాంబను బంగారు చీరతో అలంకరింపజేశాడు.

(ఈ కథ శ్రీకాళహస్తి ఆలయంలో ఒక శాసనంలో భద్రపరిచి ఉంది)

* * *

సాయంత్రం 7 గంటలకు సత్సంగంలో నేనూ, మురళీ  కూర్చొని ఉన్నాం...

అంతలో దేవీప్రసాద్ వచ్చాడు...
చాప మీద మా ప్రక్కనే కూర్చుంటూ...
"పోళీ తింటే బాగుండును..."అన్నాడు.

నిమిషం కూడా పూర్తి కాలేదు...

ఇంతలో మా ఆవిడ రమాదేవి శివాలయం నుండి నేరుగా సత్సంగానికి వచ్చి, పోళీ ఇచ్చింది...

శివాలయంలో ఎవరో వెయ్యి పోళీలు స్వామికి నైవేద్యంగా పెట్టి, అందరికీ ప్రసాదంగా పంచారట...

మేం ఎంతో సంతోషించాం...

గురువుగారు గతంలో ఓ మాటన్నారు-
ఇక్కడ(సత్సంగంలో) ఎవరు ఏది కోరితే, అది నెరవేరి తీరుతుంది...అని.

1.దైవనియతి
2.వ్యక్తిసంకల్పం
3.ప్రకృతిసాక్ష్యం

ఈ మూడూ త్రికోణంలా కలిసిన క్షణం "మహిమ" ఆవిష్కరింపబడుతుంది.

అటువంటి "త్రికోణములు"(మహిమలు)
మహనీయుల సమక్షంలోనూ, దివ్యప్రదేశాల్లోనూ అత్యంత సహజంగా సంభవిస్తుంటాయి...

అందువల్లనే లోకంలో అటువంటి ప్రత్యేక వ్యక్తులను, ప్రత్యేక ప్రదేశాలను దర్శించడం, పూజించడం అనేది మన భారతీయసంప్రదాయం.

మహిమ వలన "భగవంతుని ఉనికి"
అనుభవంలో రావడం అనేదే ప్రయోజనం.

అంతేగాని, "నేను అనుకున్నది జరిగింది"
అని నీవు గర్వపడడానికి కాదు.

* * *

నీకు సుఖం సంభవించినా
"భగవదిచ్ఛ" అనాలి.
నీకు దుఃఖం సంభవించినా
"భగవదిచ్ఛ" అనాలి.

అప్పుడు రెండూ సుఖమే అవుతాయి....

దేనికైనా సంసిద్ధంగా ఉండడమే త్యాగం.
అంతేగాని త్యాగం అంటే, ఎవరికో ఏదో ఇచ్చేయడం కాదు.

త్యాగేనైక అమృతత్వ మానశుః

* * *

మా స్నేహితుడు సుధాకర్- ఎవరో ఒక యోగి గుఱించి గురువు వద్ద ప్రస్తావనకు తెచ్చాడు...
ఆ యోగి ధ్యానంలో ఆరడుగులు భూమి నుంచి పైకి లేస్తారట...!

గురువుగారన్నారు నవ్వుతూ-
ఎంత ఎత్తు లేచినా, ఎప్పటికైనా క్రిందికి దిగాలి కదా! అని చమత్కరించారు.

ఇంకొకడు యంత్రసహాయంతో(విమానంతో)
పైకి లేస్తాడు...

అందులో గొప్పేముంది?

సిద్ధులేవీ తన్ను తాను తెలుసుకోవడానికి ఉపయోగపడవు.

మన దుఃఖాన్ని పోగొట్టగలిగేదే నిజమైన సిద్ధి.
అదే జ్ఞానసిద్ధి.

జ్ఞానసిద్ధి అంటే మాటలప్రోగు కాదు,
ప్రత్యక్ష గురుసన్నిధి వలన కలిగే అద్వైతానుభూతి.

* * *

కుండలినీ గుఱించి ప్రస్తావించాడు నా స్నేహితుడు రమణ...

భూతత్త్వం(మూలాధారం) నుండి,
బ్రహ్మతత్త్వం(సహస్రారం) వఱకు చేసే
భావనాత్మకమైన ప్రయాణానికే
హఠయోగం అని పేరు.

ఆ ప్రయాణాన్ని శాస్త్రబద్ధం చేసిన  మహనీయుడు
పతంజలి మహర్షి.

పరమపదం చేరుకోవడానికి
ఉన్న యోగాలలో హఠయోగం ఒకటి.

ఏ గూటి పక్షులు ఆ గూటికే చేరుకుంటాయి అన్నట్లు,
ఎవరెవరి సంస్కారాన్ని బట్టి ఆయా గురువుల వద్దకు చేరి తరిస్తారు.

రమణుడు, సద్గురు సుబ్రహ్మణ్యం లాంటి జ్ఞానయోగులు ఇవేవీ
బోధించలేదు.

తల ఉంటే తలనొప్పి ఉంటుంది, తలే లేనివాడికి.. తలనొప్పి ఎలా
ఉంటుంది?

అసలు ఉనికే లేనివానికి యోగం అనేది ఏముంది?
అని ప్రశ్నించారు సద్గురు సుబ్రహ్మణ్యులు...

సూరినాగమ్మ అమృతనాడి గురించి భగవాన్ను అడిగితే,
శరీరమే ఓ భావన...అందులో అమృతనాడి భావన కాదా ఏమి...? అని
ప్రశ్నించారు రమణభగవానులు...

ఆధ్యాత్మికం అనే పాఠశాలలో-
ఒకటోతరగతి పిల్లలు హఠయోగులు.
డిగ్రీ పూర్తయ్యి పట్టా పుచ్చుకొన్నవారు జ్ఞానయోగులు.

వాడే వీడు - వీడే వాడు.

ఎవరికి అవసరమైన గురువు వారికి దొరుకుతారు.
పోలిక అవసరం లేదు...ఘర్షణ అవసరం లేదు.

ఏ గూటి పక్షి ఆ గూటి పలుకే పలుకుతుంది.
మా గూటి(అత్యాశ్రమం) పలుకు- "ఇది ఒక కల".

* * *

పవహారిబాబా తనలోనే యోగాగ్నిని పుట్టించుకుని
కాలి బూడిదైపోయారు.

సాధారణ వ్యక్తి మరణిస్తే బంధువులు పేర్చిన కట్టెల్లో కాలి బూడిదైపోతాడు.

రెండూ ఒకటే.

ఏ వస్తువుకూ నాశనం(మరణం) అనేది లేదు.
అది ధరించిన మరో రూపాన్ని చూసే శక్తిలేక "నాశనమయ్యింది"
అంటున్నాం...అంతే.
రూపాంతరం చెందింది...అనాలి.

"జీవించయినా మరణించయినా నేనుంటాను అని ఉన్నవాడు
మృత్యుంజయుడు." అంటారు గురుదేవులు.

* * *

ధ్యానం అంటే అంతర్ముఖ ప్రయాణం.
స్థూలం నుండి సూక్ష్మం వైపుకు చేసే ప్రయాణం.
కార్యం నుండి కారణానికి చేసే ప్రయాణం.
దేహం నుండి ఆత్మవైపుకు చేసే ప్రయాణం.

సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మను చేరుకున్నాక...
అదే మనసుగాను, దేహంగాను, విశ్వంగాను ఉన్నదని తెలుస్తుంది.
అప్పటివరకు ఈ దేహాత్మభావాన్ని నిరసించవలసిందే.
ఆత్మసాక్షాత్కారము కలిగిన వాని దేహం కూడా పూజనీయమే.
అప్పటివఱకు ఈ శరీరం బ్రతికున్న శవమే.

* * *

ఆధ్యాత్మికం అంటే మాటల కూర్పు కాదు,
ఆధ్యాత్మికం అంటే అనుభవపురాశి.

* * *

షిరిడీబాబా "అల్లా మాలిక్"(భగవంతుడే యజమాని) అని అల్లాను ప్రస్తుతిస్తే,
లోకం బాబాను ప్రస్తుతిస్తోంది.

రమణుడు అరుణాచలేశ్వరుణ్ణి ప్రస్తుతిస్తే
లోకం రమణుణ్ణి ప్రస్తుతిస్తోంది.

క్రీస్తు "పరమతండ్రి" ని ప్రస్తుతిస్తే,
లోకం క్రీస్తును ప్రస్తుతిస్తోంది.

విగ్రహారాధనను నిరసించిన బుద్ధుణ్ణి
లోకం బుద్ధుణ్ణే విగ్రహం చేసి ఆరాధిస్తోంది.

సత్యాన్ని తలక్రిందులు చేసి అనుభవిస్తుంది లోకం.
సవరించి సరియైన మార్గంలో పెడతాడు గురువు.

అన్ని మతాలకు ఎక్కాలపుస్తకం ఒక్కటే.
అన్ని మతాలకు మూలతత్త్వం ఒక్కటే.
నిన్ను ఆ మూలంలోకి నెట్టేవాడే ఋషి , ప్రవక్త , గురువు...

* * *

107. గ్రంథ పరిత్యాగం
   గురు పరిత్యాగం
   దేహ పరిత్యాగం

---

18-10-2021 * తాతగారి ఆరాధన

ఉదయాన్నే 6 గంటలకు సద్గురు సన్నిధికెళ్లాం నేనూ, దేవీప్రసాద్.

వైజాగ్ నుంచి శ్యాంసుందర్,
అతని మిత్రుడు గణేష్ వచ్చి ఉన్నారు....

శ్యామ్ సుందర్ సద్గురు దివ్యపాదాలను పట్టుకొని ఇలా ప్రార్థన చేశారు-

ఓ ప్రభూ! నేను అజ్ఞానిని.
నాకు మీ నుంచి ఏం కోరుకోవాలో తెలియనివాణ్ణి.
ఏది నా యెడల శ్రేయోదాయకమని మీకనిపిస్తుందో...
అట్టి దానిని నాకు ప్రసాదించండి...
సుగుణశీలత, భక్తిభావము బొత్తిగా లేదు...
అజ్ఞానాంధకారంలో నేనొర్చిన కార్యములన్నియూ
పాపముతో కూడుకున్నవే.
ఓ ప్రభూ! నాకు నీ దివ్యపాదారవిందములు తప్ప
నాకు వేరే మార్గం లేదు.
నేనే నీవై నీవే నేనై నన్ను మీలో ఐక్యం చేసుకోండీ....
* * *

శ్యాంసుందర్: మీ అనుగ్రహం ఎప్పుడూ ఉండాలి గురువుగారూ...!

సద్గురు: అది ఉండబట్టే మీరు ఇక్కడకు వచ్చారు...

శ్యాంసుందర్: మీ పాదాలు ఎప్పటికీ వదలను గురువుగారు...

సద్గురు: నా పాదాలు నాకే కనిపించలేదిప్పటికి...
మీరు ఎట్లా పట్టుకుంటారు...?

శ్యాంసుందర్: చాలా భారంగా ఉంది స్వామి...!
మీరే ధైర్యం ఇవ్వాలి...

సద్గురు: అలాగే...అలాగే...(అంటూ అభయం ఇచ్చారు గురువుగారు)

* * *

ఆ వైజాగ్ అతిథులకు భీమవరం మురళీకృష్ణగారు చెప్పారట-
శ్రీకాళహస్తిలో కైకాలవీధిలో ఉన్న "అత్యాశ్రమం" తప్పక వెళ్లండని...

పట్టెయ్యగారిని తోడు తీసుకొని, ఆటో పెట్టుకొని మరీ వచ్చారు.

ముందు మా ఇంటికి తీసుకెళ్లాను....
మా ఇంటి ప్రక్కనే ఉన్న గతంలో గురువుగారు ఉన్న పాత ఇంటిని కూడా దర్శించారు...

శ్యాంసుందర్ ప్రతిదానినీ ఫోటో తీస్తున్నారు ఆసక్తిగా...

మా అత్యాశ్రమంలో ఉన్న గ్రంథాలయం నుండి ఏవైనా బుక్స్ కావాలంటే తీసుకోండి...అని చెప్పాను వారితో.

శ్యాం సుందర్ గారు రమణుల ఉపదేశసారం తీసుకున్నారు...
గణేశ్ గారు రాబర్ట్ ఆడమ్స్ గారి పుస్తకం తీసుకున్నారు...

* * *

ఎందుకో ఈ ఉదయం నుంచి "యోగవాశిష్ఠగ్రంథాన్ని నీ నుంచి దూరం చేయ్! దూరం చేయ్!...." అంటూ నా లోపల నుండి ఒకటే అలజడి...

దానిని జలానికో, అగ్నికో సమర్పించడం నాకు మనస్కరించలేదు.
అంతగా ప్రేమించాను ఆ గ్రంథాన్ని.
అంతగా ఉపాసించాను ఆ గ్రంథాన్ని.

ఈజీ చైర్ లో కూర్చొని
నా చుట్టూ శిష్యులను కూర్చోపెట్టుకొని
యోగవాశిష్ఠపాఠాలు చెప్పాలని నా లోలోపల తీవ్రమైన కాంక్ష ఉంటుండేది నా ఇరవై వయస్సు నుంచే...

ఏమో గతం(జన్మ)లో అలా పాఠాలు చెప్పానేమో!!
ఈ జన్మలో అలాంటి అవకాశం రాక ఇలా వ్యాస రూపంగా పాఠాలు చెబుతున్నానేమో!!

ఆ యోగవాశిష్ఠ గ్రంథం నా నుండి వెళ్లిపోతే,
సర్వగ్రంథాలు నా నుండి వెళ్లిపోయినట్టే.
అంటే "గ్రంథపరిత్యాగం" చేసినట్టే.

చివరికి ఆ గ్రంథాన్ని యెవరికో ఒకరికి "జ్ఞాపిక" గా ఇద్దామనిపించింది...

అలా సంకల్పించగానే గుర్తుకు వచ్చిన మొదటి వ్యక్తి-
ఒంగోలు వాస్తవ్యులు పలనాటి శ్రీనివాసులు.
గొప్ప వినయవిధేతలు కలిగినవారు.
గొప్ప గురుభక్తులు.

వారికి ఆ యోగవాశిష్ఠగ్రంథాన్ని ఇవ్వాలని మానసికంగా నిర్ణయం చేసేసుకున్నాను...
అత్యాశ్రమం వద్దకు రమ్మని, "పరమపదం" సమక్షంలో వారి చేతిల్లో ఆ గ్రంథం పెట్టాను...
కళ్లకద్దుకుని తీసుకెళ్లి, అమ్మవారి సమాధి అరుగుపై పెట్టి పూజ చేసి, దానికి సద్గురు స్పర్శను కూడా పూరించి తీసుకెళ్లారు ఒంగోలుకు.

శ్రీనూతో  నేను అన్నాను ఆ రాత్రి డిన్నర్ లో-
నీకు అర్థమైనా, అవకపోయినా ఒకసారి పూర్తిగా ఆ గ్రంథాన్ని చదివేశేయ్!
అన్నాను.

అలాగే స్వామీ...! అన్నాడు శ్రీను.

ఆశ్చర్యంగా - ఈ రాత్రి...
ఈజీ చైర్ లో కూర్చుని నా శిష్యులకు యోగవాశిష్ఠపాఠాలు చెబుతున్నట్టు స్వప్నం వచ్చింది...

స్వప్నావస్థో...జాగ్రదవస్థో...నా కోరిక నెరవేరినట్టే కదా!
కలలు, మెలకువలు కల అని ఎరిగిన మెలకువ తానే అని చెబుతోంది కదా మన గురుతత్త్వం...!

* * *

సాయంత్రం 6 కు నేనూ, మిత్రులు రమణతో కలిసి ఆటోలో వెళ్లాం సద్గురు సన్నిధికి...

పూజ అయ్యింది.

మాంసాహార, శాఖాహార భోజనాలు ఏర్పాటు చేశారు...

మా మేనకోడలు 'బంగారం' ఒక ప్లేట్ లో ఆహారపదార్థాలన్నీ పెట్టించుకునివచ్చి నా చేతికిచ్చింది...

అందరం కలిసి మామిడిచెట్ల క్రింద కూర్చొని తిన్నాం...

అంత హడావుడి సమయంలోనూ గురుపుత్రుడు యుగ అన్నాడు నాతో -

ఇక్కడ ఇక ఇటువంటి కార్యక్రమాలు జరగవు...ఇదే చివరి కార్యక్రమము... అని నాయన చెప్పాడు... అన్నాడు.

అది నాయన మాటో? లేదా
తన మాటను నాయనమాటగా చెప్పాడో?
నాకు తెలియదు.

మొత్తానికి ఈ భక్తులంతా చేరి, తన నాయన్ను ఇబ్బంది పెడుతున్నట్టు అతనికి అనిపిస్తోంది.

యుగ పట్టెయ్యగారితో-
మీరు చేసే పోస్టుల్లో గురువుగారి నెంబరు పెట్టవద్దని అన్నాడు...

దూరప్రాంతలవారు ఫోన్లు చేసి తమ వ్యక్తిగతసమస్యలకు పరిష్కారాలు అడుగుతుంటారు...

దానివలన ఒక్కోసారి గురువుగారికి నిద్రాభంగం కలుగుతోంది...

ఈ భక్తుల తాకిడికి ఈ వృద్ధాప్యదశలో ఉన్న తన తండ్రి ఇబ్బంది పడుతున్నారని భావించాడు కాబోలు.

అందుకే ఇక నుంచి అన్ని కార్యక్రమాలను రద్దు చేశాడు యుగ.

ప్రసాద్ కు ఎప్పుడు వీలైతే అప్పుడు కలిసి వెళ్లేవాళ్లం ఇద్దరం...
ఇక నుంచి ఆదివారం మాత్రమే గురుసన్నిధికి వెళదామనుకున్నాం.

మొత్తానికి గురువుగారు కైకాలవీధి నుండి LIC కాలనీకి మారినప్పటి నుండి పరిస్థితులు చాలా మారిపోయాయి...

గురుశిష్యుల మధ్య అప్పుడున్న Chemistry లేదిప్పుడు...

తొలిరోజుల్లో మానసికంగా నలిగారు గురువుగారు.
ఒకరోజు అన్నారు నాతోనే- బాబూ! నాకిక్కడ జైలులాగా ఉంది...అని.

దూరం అవడం వల్ల, దేవీప్రసాద్ వచ్చి నన్ను స్కూటర్ లో తీసుకెళితే తప్ప నేను అక్కడికి వెళ్లలేని పరిస్థితి...

గురువుగారన్నారు-
బాబూ!
నీ దగ్గర తప్ప ఇంకెవరి దగ్గరా సబ్జక్టు రావడం లేదు...

అగ్గిపెట్టె ఒక చోట, అగ్గిపుల్ల ఒకచోట
ఉంటే మంట ఎలా పుడుతుంది? అన్నారు నిర్లిప్తంగా...

* * *

బహుశా ఆ "కాంబినేషన్" యొక్క అవసరం తీరిపోయిందేమో!
అందుకే మా మధ్య "దూరం" పెట్టాడు దేవుడు.

పడవ నది దాటించిందని ఎవడూ పడవను నెత్తిన పెట్టుకోని పోడు కదా...
పడవను వదిలి వెళ్లాల్సిందే...

అలా మానసికంగా గురువును వదిలి వచ్చేశాను ఈరోజు ఇంటికి.
అలా "గురు పరిత్యాగం" చేసినట్లయ్యింది...

* * *

2012 లో నాకు అనారోగ్యం ఏర్పడింది...
మరణభయం కలిగేంతగా...

అప్పటికి నా వద్ద డైరీల్లో  సద్గురు బోధలు "జ్ఞానప్రసూనాలు" పేరుతో చాలా దాచి ఉంచాను.

నేను మరణిస్తే, అవన్నీ గాలిలో కలిసిపోతాయేమో...అనుకున్నాను...

కానీ అవి గొప్ప శక్తివంతమైన సూక్తులు...
నేను లేకపోయినా అవి ఎప్పటికైనా ముద్రింపబడతాయి...
అనే నమ్మకమూ ఒ ప్రక్క ఉండేది...

నా వద్ద జ్ఞానప్రసూనాలు ఉన్నాయని గురువుకు తెలియదు,
వాటిని అచ్చువేయించే ఆర్థికస్తోమతా నాకు లేదు.

కానీ వాటిని ఎలాగైనా అచ్చు వేయించాలనే తపన రోజురోజుకి పెరుగుతుండేది.

ఆ అనారోగ్య సమయంలో  జ్ఞానాంబతో ఓ మాట చెప్పుకున్నాను-
అమ్మా...! నన్ను ఆరోగ్యవంతుణ్ణి చేయి...
జ్ఞానప్రసూనాలు చివరివాక్యం అచ్చు అవగానే, నన్ను ఈ భూమ్మీద ఉంచకు...అని.

ఆ ప్రార్థన చేయగానే-
ఆరోగ్యం కుదుటపడ్డది...
వరుసగా ఎనిమిదేళ్లలో ఇరవైకు పైగా పుస్తకాలు అచ్చు అయ్యాయి...

మొదటి పుస్తకం - అనిలాచలశివమాల.
చివరి పుస్తకం - అది అంతే ఇది ఇంతే.

ఒక ప్రక్క నాకు భయంగానే ఉండేది...
జ్ఞానప్రసూనాలు ఖాళీ అయిపోతే,
నేనూ ఖాళీ అయిపోతానని...

2020 సంవత్సరం నాటికి దాదాపుగా జ్ఞానప్రసూనాలన్నీ అచ్చు అయిపోయినట్టే...
నా ప్రార్థన అనుసరించి,నేను ఈ భూమ్మీద ఖాళీ అయ్యే సమయం ఆసన్నమయినట్టే...

అప్పటికి నాకు 50 నిండింది...

అప్పట్నుండి నేను అనుభవించే లైఫ్ ను
"బోనస్ లైఫ్"గానే భావిస్తున్నాను.

ఉదయం నిద్రలేవగానే-
"ఇంకొక్క రోజు నీవు బ్రతకడానికి అవకాశం ఇస్తున్నాను...బ్రతుకు
పో....అని జ్ఞానాంబ అన్నట్టు అంతరంగంలో ధ్వనిస్తుంది...

కాబట్టి మానసికంగా దేహ పరిత్యాగానికి సంసిద్ధంగా ఉన్నాను కాబట్టి....
"దేహపరిత్యాగం" కూడా అయినట్టే.

* * *

ఈరోజుటితో నేను -
గ్రంథ పరిత్యాగం
గురు పరిత్యాగం
దేహపరిత్యాగం
చేసినట్లైంది.

* * *

గ్రంథాలను వదిలేస్తే జ్ఞానం కలిగినట్టు.
గురువును వదిలేస్తే తత్త్వం తెలిసినట్టు.
దేవుణ్ణి వదిలేస్తే బంధం పోయినట్టు.
తనను వదిలేస్తే మోక్షం వచ్చినట్టు.

అనే ఈ సూక్తిని ఓ వారం ముందే అందరికీ పంపాను వాట్సప్ లో.

అది ఇప్పుడు నిజమైంది.

* * *

చిట్టచివరి బంధం - తానే(అహం)
అహం పరిత్యాగమే సర్వపరిత్యాగం.

* * *

తనకు బంధం ఉండడం కాదు,
తానే బంధం అని తెలియడం - జ్ఞానం.

తనకు మోక్షం కలగడం కాదు,
తనకు తాను లేకపోవడం - మోక్షం.

* * *

19-10-2021 మధ్యాహ్నం 12 గంటలకు
తాతగారి ఆరాధనకు అతిథిగా వచ్చిన
నా మిత్రుడు రమణగారు తిరుగు ప్రయాణం అయ్యారు...

నా పాదాలకు నమస్కరించుకున్నారు...
దక్షిణ ఇచ్చారు...

నిజానికి నేను అతని పాదాలకు నమస్కరించేంతటి విద్యావంతులు...

వారు నమస్కరించింది బాబు పాదాలకు కాదు,
సద్గురు జీవితచరిత్రలోని చాలా పుటలను తన స్వంతం చేసుకున్న ఓ ప్రాణి పాదాలకు.

నా ఆత్మీయమిత్రుడు రమణగారికి ఈ వ్యాసం అంకితం.

* * *

108. పరమపదం

---

1. నేను
2. నేను ఉన్నాను
3. నేను నేనే అయి ఉన్నాను.
4. నా నామము నేను
5. నా రూపము నేను
6. నా అనుభవము నేను
7. నా శక్తి నేను
8. నా శక్తే మహామాయ
9. ఆ మహామాయ వలన
   నాలో ఈ ప్రపంచం ఉన్నట్లు ఉన్నది.

కానీ లేనే లేదు.

10.అట్టి ఈ ప్రపంచంలో
నేను ఇప్పుడు ఇక్కడ ఇలా నీలా
ఉన్నట్లు ఉన్నాను
కానీ లేనే లేను

11. నేను నేనే అయి ఉన్నాను

12. నేను ఉన్నాను

13. నేను

* * *

పై వాక్యాలను నీవు పలకడంగా కాకుండా,
నీ లోపల పరమాత్ముడు అంటూ వున్నట్లుగా
నీవు వింటూ ఉండాలి...అన్నారు గురువుగారు.

* * *

ఇవి సాక్షాత్తు పరమేశ్వరుడే తన ఉనికిని
"సద్గురు ద్వారా" తెలియబరచిన వాక్యములు.

ఇది వేదాంతసారము అనదగినది.
సద్గురు హృదయము అనదగినది.
అక్షరరూపంలో ఉన్న దైవం అనదగినది.

ఈ వాక్యాలకు మా ఆత్మీయమిత్రుడు పట్టెయ్య గారు వ్యవహారం కోసం
"పరమపదం" అని నామకరణం చేశారు.
భగవంతునికే నామకరణం చేసిన పట్టెయ్య జన్మ ధన్యము.

ఈ పరమపదాన్ని ముఖచిత్రంగా వేసి,
ఓ పుస్తకాన్ని కూడా ముద్రించాం
మా సత్సంగం తరపున.

అంతేకాదు మా కైకాలవీధిలో ఉన్న సద్గురు సత్సంగంలో కూడా
"అధిష్ఠానదైవం"గా ఉంది
ఈ పరమపదం.

ఈ పరమపదానికి వ్యాఖ్యానం వ్రాయమని
మిత్రుడు కాశీరెడ్డిగారు కోరగా
జ్ఞానాంబ  అనుగ్రహించిన మేరకు వ్రాశాను...
* * *

పరమేశ్వరునికి ఈ ప్రపంచం తనలోనే పుట్టి, వుండి, తనలోనే నశించే ఓ కల లాంటిదే.

కలలోని వారిని అనుగ్రహించాలంటే
ఆ కలను కనేవాడు ఏం చేయాలి?

తాను మేలుకోవాలి...లేదా
'ఇది కలే' అన్న జ్ఞప్తిని కలిగించాలి.

మొదటిది - ప్రళయం అవుతుంది.
రెండవది - ప్రబోధం అవుతుంది.

అట్టి ప్రబోధాన్ని సాక్షాత్తు పరమేశ్వరుడే
శ్రీకాళహస్తిలో "సద్గురు సుబ్రహ్మణ్యులు"గా అవతరించి,
అనుగ్రహించిన దివ్యోపదేశమే ఈ - పరమపదం.

పదము, అర్థము, నామము, రూపము, ఉనికి, జ్ఞానము, అనుభవము,
అన్నిటి లక్ష్యమై వున్న ఏకైక స్ఫురణయే "నేను".
ఆ "నేను"కు వ్యాఖ్యానమే ఈ - పరమపదం.
* * *

సాపేక్షకమైన సుఖదుఃఖాల పరంపర నుండి విడివడి శాశ్వత ఆత్మసుఖమును పొందాలనే తీవ్రకాంక్ష ఉన్న ప్రతి ఒక్కరూ, ఎవరికి వారు తమలో తాము ఈ క్రింది రీతిలో విచారణ చేసి ఆత్మసిద్ధిని పొందగలరు.
* * *

"నేను" అని నేను అనలేదు...
అనుకోలేదు కూడా...
కానీ "నేను" అని నాలో నాకు వినబడింది...

నేను ఆశ్చర్యపోయాను...
నేను ఆ "నేను"తో ఇలా విచారణ జరిపాను...

* * *

* నీవు ఎవరు

1. నేను

* నేను కాక మరో "నేను" నాలో ఉందా?

2. అవును....నేనున్నాను.

కానీ నీవనుకున్నట్లు,
నీలో నేనుండడంకాదు, నాలో నీవున్నావు.
అలలో సముద్రం ఉండదు, సముద్రంలో అల ఉంటుంది.

* నీవెలా ఉన్నావు.

3. నేను నేనే అయి ఉన్నాను.

ఆకాశాన్ని దేనితోనూ సరిపోల్చలేవు.
అనంతమైన "నేను"ను దేనితోనూ సరిపోల్చలేవు.

* నిన్నెట్లా పిచిచేది? నీ నామమేమి?

4. నేను-నేను అంటూ నీలో ఉండి పలికేది నేనే.
కానీ నీవు "నేను"ను నేనని భ్రమపడుతున్నావు.

నా నామము నేను.

* నిన్నెట్లా కొలిచేది? నీ రూపమేమి?

5. నేను-నేను అంటూ  తలంపురూపంగా ఉండేది నేనే.
కానీ నీవు నేను తలుస్తున్నానని భ్రమపడుతున్నావు.

నా రూపము నేను.

* నీ అనుభవమేమి?

నీవు 'నేను' అని, నీ మొత్తపు వ్యవహారానికి
ఏ నేను కారణమో, ఆ నేనే "నేను".

సంగీతానికి ఆధారశ్రుతి వలె.
"నేనున్నాను" ఎడతెగని అహంస్ఫురణయే నా అనుభవం.

నా అనుభవం నేను.

* మరి నీ శక్తి ఏమి?

7. నేను-నేను అంటూ సముద్రంలో కెరటంలా లేచే
అహంకార(మనస్సు) రూపంగా ఉన్నది నా శక్తియే.

నా శక్తి నేను.

* ఆ శక్తి ఎట్టిది?

8. అదే మహామాయ.
నాలోని మహామాయే మనస్సు.
నా శక్తే మహామాయ.

* దాని ప్రకటనరూపమేమి?

9. అది ఎప్పుడూ ప్రకటన కాలేదు, కాదు.
ప్రకటన అయినట్టు కనిపించడం అనేది
దానికున్న అతిశయశక్తి అంతే.

ఇంద్రజాలికుడు శూన్యం నుండి వస్తుజాలాన్ని సృష్టించి చూపినట్లు

నాలో అభిన్నంగా ఉన్న ఆ అతిశయశక్తి వలన
నాలో ఈ ప్రపంచం ఉన్నట్లు ఉన్నది.
కానీ లేనేలేదు.

* మరి ప్రపంచమే లేనప్పుడు అట్టి ప్రపంచంలో ఉన్న
నా పరిస్థితి ఏమి?
నేను ఉన్నట్టా? లేనట్టా?

10. కలే ఓ అబద్ధం....అందులో నిజాన్ని వెతికినట్టు
ఆకాశపుష్పమే కల్పన...అది వికసించింది అన్నట్లు
బొత్తిగా అస్సలు ఉనికే లేని ఈ ప్రపంచంలో

నేను ఇప్పుడు, ఇక్కడ,ఇలా,నీలా ఉన్నట్లు ఉన్నాను.
కానీ లేనే లేను.

* అయితే నీవు ఎలా ఉన్నావు?

11. వివిధములైన ఆభరణములుగా ఉన్నా
బంగారం బంగారంగానే ఉన్నది.

కెరటములు ఎన్ని లేచి పడినా సముద్రం సముద్రంగానే ఉన్నది.

వ్యక్తిగతమైన నేనులుగా "నేను" ఈ జగత్తులో క్రీడిస్తున్నా సరే,
నేను నేనే అయి ఉన్నాను.

* మరి నీవున్నట్టే కదా?

12. అవును... నేను (మాత్రమే) ఉన్నాను.

* ఇంతకీ నీవెవరు?

13. "నేను"

* * *

నీటిలోనే పుట్టి, తేలి, నీటిలోనే కరిగిపోయే
మంచుశిలవలె అహంకార రూపమైన నేను,
అహంస్వరూపమైన "నేను" లో కరిగి మాయం(మౌనం) అయ్యింది.

---

## పరమపద వైశిష్ట్యం

---

పరమపదం
దేహాత్మభావానికి
బ్రహ్మాస్త్రం.

* * *

పరమపదం
భవరోగానికి
దివ్యౌషధం.

* * *

పరమపదం
అజ్ఞానాంధకారానికి
చిరుదీపం.

* * *

పరమపదం
వేదాంతవనంలో
జ్ఞానప్రసూనం.

* * *

పరమపదం
రమణమార్గానికి
గమ్యస్థానం.

* * *

పరమపదం
ఎందుకు? అన్న ప్రశ్నకు
సమాధానం.

* * *

పరమపదం
సకలదేవతలకు
అమృతపానం.

* * *

పరమపదం
సప్తర్షులకు
దివ్యసత్సంగం.

* * *

పరమపదం
సద్గురు సత్సంగానికి

అధిష్ఠానదైవం.

* * *

పరమపదం
హృదయగుహయందు
అహంస్ఫురణం.

* * *

పరమపదం
జగత్ చిత్రమునకు
ఆధారవస్త్రం.

* * *

పరమపదం
మరణభయం గలవారికి
అభయహస్తం.

* * *

పరమపదం
జీవ జగత్ జగదీశ్వరులకు
ఆధారతత్త్వం.

* * *

పరమపదం
జీవన సంగీతానికి
ఆధారస్వరం.

* * *

పరమపదం
దక్షిణామూర్తి మౌనానికి
తిరుగులేని భాష్యం.

* * *

పరమపదం
వైజ్ఞానికులకు అంతుబట్టని
చిదంబర రహస్యం.

* * *

పరమపదం
గురుభక్తులకు
హస్తామలకం

* * *

పరమపదం
సంసారానికి
చరమదినం.

* * *

పరమపదం
సన్న్యాసానికి
ప్రకాశమానం.

* * *

పరమపదం
ఉపాసకులకు
తారకమంత్రం.

* * *

ఉపాసనాగ్నిలో అహమిక కాలి బూడిదయ్యాక
మిగిలి ఉన్నదేదో అదే - పరమపదం.

* * *

అంతరిక్షానికి అవకాశంగా ఉన్నదేదో "అది"
అంతరిక్షాన్ని ఉద్దేశించి చెప్పిన ఉపదేశమే
పరమపదం.

* * *

మౌనానికి పరమభాష్యమే - పరమపదం.

* * *

కోటియజ్ఞాల ఫలం
ఒక్క సద్గురు సన్నిధి నివాసం

కోటిజన్మల తపం
ఒక్క పరమపద స్మరణం.

కోటి గ్రంథాల సారం
ఈ ఒక్క పరమపద శ్రవణం.

ఆధ్యాత్మిక సాధకులకు
అంతిమ సందేశం - పరమపదం.

* * *

అన్యమేదీ గోచరించని ఏక శుద్ధస్థితిలో
ఆత్మని "సాక్షి" అనడం కూడా తప్పే.
చెప్పబడిన వాక్యాలన్నీ అనునయవాక్యాలే తప్ప
నిజం కావు. ఒక్క 'పరమపదం' తప్ప.

* * *

ఎవరికైనా 'పరమపదం' ఒక్కటి ఇస్తే చాలు.
కోటి గ్రంథాలను ఇచ్చినట్టు లెక్క.
కాదు కాదు సాక్షాత్తు భగవంతుణ్ణే ఇచ్చినట్టు లెక్క.

* * *

'పరమపదం'లోని 13 వాక్యాలకు వ్యాఖ్యానమే
భారతీయ వేదాంతవాఙ్మయమంతా.

* * *

ఎప్పుడో-ఎక్కడో-ఎలాగో అని తలిచేవారికి
ఇప్పుడు-ఇక్కడ-ఇలాగు అని తత్త్వదర్శనం
చేయించేది  - పరమపదం.

* * *

ఏమీ తెలియనివాడైనా సరే పరమపదాన్ని
తలగడగా పెట్టుకొని నిద్రించినా చాలు.
వాడు సమాధినిష్ఠలో ఉన్నవాడే.

అర్థం చేసుకొని అనుభవంలోకి తెచ్చుకున్నవాడు
సాక్షాత్తు దక్షిణామూర్తియే.

* * *

పరమపదమే స్వయంగా పరబ్రహ్మం.
అదే సద్గురువు.
అదే ప్రబోధం.
అదే మార్గం.
అదే గమ్యం.

* * *

ఆధ్యాత్మికంలో ఉన్న సవాలక్ష సందేహాలకు
ఏకైక సమాధానం - పరమపదం.

* * *

వ్యక్తిత్వాన్ని పూర్తిగా ధ్వంసం చేసే అణుబాంబు
ఏదైనా ఉంది అంటే అది ఒక్క - పరమపదమే.

* * *

జ్ఞానం యొక్క స్థూలరూపం - సద్గురు సుబ్రహ్మణ్యం.
మౌనం యొక్క స్థూలరూపం - పరమపదం.

* * *

అమ్మ నాట్యవిలాసం - సకల జగం.
అయ్య నాదవినోదం - పరమపదం.

* * *

జీవుడికైనా దేవుడికైనా స్వస్వరూపాన్ని
చూపే  అద్దం - పరమపదం.

* * *

శ్రీరమణుల 'నేనెవడను?' ప్రశ్నకు
సమాధానం - పరమపదం.

* * *

నేను-నాది అనే వికారాలను తొలగించే
ఆత్మఫలరసాయనం - పరమపదం.

* * *

పరమపదాన్ని ప్రసాదించిన సద్గురుదేవులవారికి
మనమేమిచ్చి ఋణం తీర్చుకోగలం?
మనం "ఖాళీ" అయిపోవడం తప్ప.

* * *

పరమపదాన్ని వినడం ఒక్కటే వినికిడి.
దాని ముందు గంధర్వగానం కూడా కర్ణకఠోరమే.

పరమపదాన్ని చదవడం ఒక్కటే చదువు.
దాని ముందు వేదాలు కూడా వానాకాలం చదువులే.

పరమపదాన్ని పలకడం ఒక్కటే పలుకు.
దాని ముందు బీజాక్షరాలు కూడా చిలకపలుకులే.

పరమపదాన్ని చూడడం ఒక్కటే చూపు.
దాని ముందు భగవద్దర్శనం కూడా భ్రాంతిరూపమే.

పరమపదాన్ని అనుభవించడం ఒక్కటే అనుభవం.
దాని ముందు ఆత్మానుభవం అనేది కూడా మనో వికారమే.

* * *

ఆత్మఫలం దేవతలకు సైతం అందని పరమఫలం.
ఇప్పుడది పామరులకు సైతం అందే పరమపదం.

* * *

జ్ఞానాంబ యొక్క కారుణ్యమంతా ఘనీభవిస్తే
అదే - పరమపదం.

శివజ్ఞానమంతా కాచివడబోస్తే
ఆ దివ్యసారమే - పరమపదం.

* * *

ముముక్షువులకు ముక్తపథం - పరమపదం.
ముక్తులకు నిత్యానందకారకం - పరమపదం.
పామరులకు కోర్కెలను ఈడేర్చే కల్పవృక్షం - పరమపదం.

సాధకులకు మంత్రం - పరమపదం.
సిద్ధులకు స్వరూపం - పరమపదం.

* * *

వేదాల సారమే ఉపనిషత్తులు.
ఉపనిషత్తుల సారమే భగవద్గీత.
భగవద్గీతాసారమే ఉన్నది నలుబది.
ఉన్నది నలుబది సారమే - పరమపదం.

* * *

ప్రాణం నిలవడానికి శ్వాస ఎంత ముఖ్యమో
ఆకలి తీరడానికి అన్నం ఎంత ముఖ్యమో
బ్రతుకు నడవడానికి  ధనం ఎంత ముఖ్యమో
సద్బుద్ధి కలగడానికి సత్సంగం ఎంత ముఖ్యమో
జీవన్ముక్తి పొందటానికి 'పరమపదం' అంత ముఖ్యం.

* * *

జ్ఞానాంబ దర్శన భాగ్యవిశేషమే పరమపదప్రాప్తి.
అనిలాచలశివమాల నిత్యపారాయణ ఫలితమే పరమపదప్రాప్తి.
దక్షిణకైలాసగిరి ప్రదక్షిణ ఆనందఫలమే పరమపదప్రాప్తి.
సద్గురు సత్సంగ దివ్యఫలమే పరమపదప్రాప్తి.

* * *

రచయిత లేని రచయిత - పరమపదం.

* * *

జ్ఞానప్రసూనాలు సిద్ధులకు...సాధకులకు కాదు.
జ్ఞానులకు పట్టా కాగితం - పరమపదం.

* * *

సృష్టి అంతం అయ్యేవఱకు
సరిపడా సబ్జక్టు - పరమపదం.

* * *

'ఇక్కడ' అనేదే కైలాసం.
'ఇక్కడ'  అనేదే వైకుంఠం.
'ఇక్కడ' అనేదే పరమపదం.

* * *

సృష్ట్యాది నుండి ఇప్పటివఱకు చెప్పబడినవన్నీ
సింహాసనం మీద కూర్చున్నవాడు ఇచ్చిన  స్టేట్ మెంట్స్.
ఒక్క 'పరమపదం' మాత్రం సింహాసనమే ఇచ్చిన స్టేట్ మెంటు.

* * *

అహంస్వరూపం యొక్క వ్యక్తీకరణమే - పరమపదం.

* * *

చిన్న మర్రి విత్తనంలో మహావృక్షం దాగి ఉన్నట్లు
పరమపదంలో వేదవాఙ్మయమంతా దాగి ఉంది.

* * *

అక్షరుడైన దేవుడు అక్షరరూపం దాలిస్తే
అదే పరమపదం.

ఆ పరమపదం మానవరూపం దాలిస్తే
అదే సద్గురు దివ్యమంగళరూపం.

* * *

కర్మయోగం - సరాసరి.
భక్తియోగం - అనిలాచలశివమాల.
జ్ఞానయోగం - పరమపదం.
* * *

నా సాకారమే - ప్రపంచం.
నా నిరాకారమే - పరమపదం.

* * *

కేవలం మానవులే కాదు,
(త్రిమూర్తులతో సహా) సకలదేవతలు సైతం నిత్యం
స్మరించవలసిన దివ్యపదం - పరమపదం.
* * *

ఇహపరాలకు సంబంధించిన సమస్యలన్నింటికీ
ఏకైక పరిష్కారం - పరమపదం.
* * *

ప-రతత్త్వమే
ర-మణీయము
మ-ధురమూ అయిన
ప-దజాలంతో
ద-క్షిణ కైలాసంలో
ము-ముక్షువులందరికీ ముక్తిని ప్రసాదిస్తోంది.

రండి - వినండి - అనండి - అనుభవించండి - తరించండి.

* * *

వేదాంతంలో పెను విప్లవం - పరమపదం.
అన్ని వాదాలను ఎగురగొట్టే పెను తుఫాను - పరమపదం.
* * *

'భగవద్వాణి' అన్నదానికి ఏకైక అర్థం - పరమపదం.

* * *

ఏ సమస్యను పరిష్కరించడం కోసంగా
ఈ వేదాంతశాస్త్రం ఏర్పడిందో,
ఆ ప్రధానసమస్యకు దొరికిన ఏకైక పరిష్కారమే
ఈ పరమపదం.

* * *

దేవుణ్ణి చూపించగలవా? అని నిన్నెవడైనా అడిగితే
పరమపదం చూపించు.

* * *

పరమపదాన్ని సదా ధ్యానిస్తుండడం వల్లనే
శివుడికి సదాశివుడు అనే పేరొచ్చింది.

* * *

దేవుళ్లకే  దేవుడు పరమపదం.

* * *

వేదాల నుండి జ్ఞానప్రసూనాల వఱకు చెప్పబడినదంతా
పరమపదానికి ఉపోద్ఘాతం మాత్రమే.

* * *

వేదాంతవాఙ్మయంలో యోగవాశిష్ఠం లాంటి గ్రంథం మరొకటి లేనేలేదు.
యోగవాశిష్ఠాన్ని 13 వాక్యాల్లో చెప్పాలంటే అదే పరమపదం.

* * *

ఆ పరబ్రహ్మతత్త్వాన్ని గుఱించి వేదాలు వాగి వాగి
ఇక వాగడానికి ఏమీ తోచక మౌనం దాల్చాయి.
ఆ మౌనం రూపం దాల్చి 'పరమపదం' అయ్యింది.

* * *

ఆదిభిక్షువు(అనిలాచలశివుడు)
లోకానికి ప్రసాదించిన భిక్ష - పరమపదం.

* * *

ఈ పరమపదం అందరికీ సరిపోయే చొక్కా.

* * *

ఏ మెలకువలో జీవ-జగత్-జగదీశ్వరులు ఉండరో
ఆ మెలకువ కలగడానికి జ్ఞానాంబ పాడిన
సుప్రభాతమే - పరమపదం.

ఏ నిద్రకు కల-మెలకువలు లేక కేవలం "ప్రజ్ఞ" మాత్రమే ఉంటుందో
ఆ నిద్ర కలగడానికి జ్ఞానాంబ పాడిన లాలిపాటే - పరమపదం.

* * *

'పరమపదం' ఏ భాషలో ప్రకటించబడితే
ఆ భాష ధన్యత పొందుతుంది.
ఏ ఉద్దేశం కోసం భాష ఏర్పడిందో
అది నిశ్చయంగా నెరవేరబడుతుంది.

* * *

దేనినయినా సరే అన్నా, అనుకున్నా, విన్నా
ఆ అనేది, అనుకునేది, వినేది 'బాబు'యే.

కానీ ఒక్క పరమపదం మాత్రం
బాబుయే అన్నట్టు,అనుకున్నట్టు,విన్నట్టు ఉన్నా సరే
ఆ అనేది, అనుకునేది, వినేది బాబు కాదు.
సాక్షాత్తు పరమేశ్వరుడే.

* * *

'పరమపదం' విశ్వవ్యాప్తం కావాలి.
వీరూ వారూ అనే తేడా లేకుండా
ప్రతి ఒక్కరికీ అది నిత్యపారాయణం కావాలి.
అందరినీ పరమపదం చేర్చే పరమపదం కావాలి.

* * *

పరమపదాన్ని చేరటానికి ఉపయోగపడే 'సంప్రదాయం' అనే నిచ్చెనకున్న
మెట్లు ఈ గురుశిష్యులు.

క్రింది మెట్టు - గురువు.
పై మెట్టు - శిష్యుడు.

ఆ నిచ్చెనను ఎక్కుతూ దిగుతూ ఉండేవాడే పరమాత్ముడు.

ఇదొక లీల.
ఇదొక క్రీడ.

ఇది గుర్తుంటే జీవితం వేదాంతమయం.
ఇది మరిస్తే జీవితం వేదనామయం.

* * *

కర్మ-జన్మ సిద్ధాంతం అనే పెద్ద అబద్ధం మీద
నిలబడి ఉన్నాయి ఈ శాస్త్రాలన్నీ...

వేదకాలం సత్యాన్వేషణకు తొలిమెట్టు.
'పరమపదం' ఆవిర్భవించిన ఈ ఆధునిక కాలమే సత్యాన్వేషణకు
చివరిమెట్టు.

* * *

దేవునికీ ఓ దండం పెట్టి
జీవుడికీ ఓ దండం పెట్టి
ఈ రెంటినీ అంటక దూరంగా నిలబడు.
అదే పరమపదం.

* * *

చెప్పబడిన సమాధానాలన్నీ
ప్రశ్నలకు ఇవ్వబడిన సమాధానాలు.
ఒక్క పరమపదం మాత్రం
(ప్రశ్నలేని) కేవల సమాధానం.

* * *

సద్గురువు యొక్క శాశ్వత చిరునామా - పరమపదం.

* * *

ఏ చోటులో మాట్లాడ్డం కూడా
మాట్లాడకపోవడం అవుతుందో

ఏ చోటులో తెలియడం కూడా
తెలియకపోవడం అవుతుందో

ఏ చోటులో పొందటం కూడా
పొందకపోవడం అవుతుందో

ఏ చోటులో అనుభవం కూడా
అనుభవం కాకుండా పోతుందో

ఆ చోటే - పరమపదం.

* * *

ఏ చోటులో బంధ-మోక్షములు రెండూ
సహజీవనం చేస్తుంటాయో
ఆ చోటే 'పరమపదం'.

* * *

జ్ఞానాంబ దయామయీ...!
ఈ అంతరిక్షంలో
ఈ కటికచీకట్లో
ఈ గ్రహాల్లో
ఈ లోకాల్లో
గమ్యం తెలియక గిరగిరమని తిరుగుతున్న నన్ను
నిశ్చలపఱచి, స్వస్థతపఱచడానికి
అంతరిక్షానికి ఆవల కాపురమున్న నీవు
అపారమైన దయతో
"నా గురువు"గా అవతరించి
'పరమపదం' ప్రసాదించావు.
మాటవరుసకు నిన్ను 'అమ్మా...!' అన్నందుకు
మళ్లీ అమ్మ కడుపులో పుట్టకుండా చేశావు తల్లీ...!

* * *

109. స్వరూపమే స్వదేశము

---

3-10-2021 * ఆదివారం

ఈ ఉదయం 10 గంటలకు నేనూ ప్రసాదు కేరళా అంగట్లో టీ త్రాగి, గురువుగారికి సమోసాలు పార్సిల్ చేసుకుని తీసుకెళ్లాం.

వేణుగారి అమ్మాయి కాఫీ పెట్టి తీసుకొచ్చింది అందరికీ...

గురువుగారితో  కలిసి అందరం సమోసా తిని, కాఫీ త్రాగాం.

* * *

వీడియోకాల్ లో  మురుగానంద, శివస్వామి, పలనాటి శ్రీను, యజ్ఞేశ్వర శర్మ, లీలమ్మ...గురుదర్శనం చేసుకున్నారు.

లీలమ్మ ఓ ప్రశ్న అడిగారు...
మనోనాశం, మనోలయం అంటే ఏమి? అని

నాశనమైతే తిరిగి పూర్వస్థితిని పొందే అవకాశం ఉంటుంది.
లయమైతే ఎప్పటికీ పూర్వస్థితిని పొందే అవకాశం ఉండదు.

మరణంలో జరిగేది - మనోనాశం.
మోక్షంలో జరిగేది - మనోలయం.

మరణంలో నాశనమైన మనసు తిరిగి మొలకెత్తుంది...జన్మకారణం.

భగవంతునిలో లయమైన మనసు తిరిగి మొలకెత్తదు...జన్మరాహిత్యం.

అజ్ఞాని మనసు సంసారమనే తడినేలలో వేసిన విత్తనం లాంటిది.
అది మొలకెత్తుతుంది.

జ్ఞాని మనసు జ్ఞానాగ్నిలో వేగిన విత్తనం లాంటిది.
అది మొలకెత్తదు.

సముద్రంలో కలిసిన నది వలె నామరూపాలు లేకుండా సముద్రమే(దైవమే) అయిపోవడమే
మనోలయం.

* * *

మా వాడు స్టేట్స్ లో ఉన్నాడు...అని చెప్పుకు తిరిగే అమాయకపు తండ్రులంతా పార్కుల బెంచీలమీద, ఆశ్రమకుటీరాల్లో "ఏకాంతం" పేరుతో "ఒంటరితనాన్ని" అనుభవిస్తున్నారు.

పైగా ఆ వలస జీవులు స్టేట్స్ లో ఉండి క్రొత్తగా అనుభవించేది ఏమీలేదు...వీకెండ్ డేస్ లో అస్థిమిత భోగాలు తప్ప.

ఇల్లు, కారు, ఉద్యోగం...అన్నీ తత్కాలికమే...
అని గ్రహించేలోపే గ్రీన్ కార్డు వచ్చేస్తుంది...

భారతదేశ సంస్కృతికి వారసులు కావలసినవారు  విదేశీ బానిసత్వానికి శాశ్వత సభ్యత్వత్వం వచ్చినందుకు...ఇక్కడ ఏం చేయాలో దిక్కు తోచని దిక్కుమాలిన తండ్రి వేడుక చేసుకుంటాడు.

కొడుకు కొన్న కారును,
కొడుకు కన్న కొడుకును
వీడియోకాల్ లో చూసి తృప్తి పడవలసిందేగాని,
ఆ కారులో తిరగలేడు.
ఆ మనవణ్ణి ఎత్తుకోలేడు.

బాగున్నావా నాన్నా! అనగలడేగాని,
నాన్న ఎలా ఉన్నాడో జీవితాంతం
తెలుసుకోని కొడుకు కొన్న కారును వాట్సప్ లో గర్వంగా అందరికీ షేర్ చేసుకుంటాడు.

ముద్దాడలేని మనవడి ఫోటోను అందరికీ చూపించి, మా వంశోద్ధారకుడు అని మురిసిపోతాడు.

మనవళ్ల ముడ్డి కడగడానికి నానమ్మలకు
విదేశీప్రయాణ యోగమేగానీ, తాతయ్యలతో అక్కడ అవసరమే లేదు.

రిటైర్డ్ అయ్యాక వచ్చే ఫించను కూడా
కొడుకును స్టేట్స్ పంపడానికి చేసిన అప్పును  తీర్చడానికే తన శేషజీవితాన్ని గడిపేస్తుంటాడు.

మనం చేస్తున్న ఘనకార్యమేమి?
స్వదేశీ బిడ్డలను ఎగుమతి చేస్తున్నాం.
విదేశీ వస్తువులను దిగుమతి చేసుకుంటున్నాం.

మన భారతీయ చైతన్యాన్ని విదేశీయులకు ఎగుమతి చేస్తున్నాం.

అక్కడి జడవస్తువులను దిగుమతి చేసుకుంటున్నాం.

మహానుభావుడు సర్వేపల్లి రాధాకృష్ణ మాటలు గుర్తుకొస్తున్నాయి-

విదేశాలకు చదువు చెప్పడానికే వెళతానుగానీ,
చదువుకోవడానికి వెళ్లను...అన్నారు.

* * *

T.V. లో అన్ని రకాల ఛానళ్లూ ఉంటాయి.
మనం ఏ ఛానల్ పెట్టుకుంటే ఆ ఛానెల్ ప్రదర్శితమౌతుంది.

మన హృదయపేటిక కూడా అలాంటిదే.
అన్ని జన్మలూ అందులోనే ఉన్నాయి.
మనం ఏది ఎన్నుకుంటే, పైకి ఆ జన్మ ప్రదర్శితమౌతుంది. మిగతా అన్ని జన్మలూ సూక్ష్మరూపంగా ఉంటాయి.

మరణించేముందు సద్భావనతో ఉండమన్నారంటే,
మరో మంచి ఛానెల్ ను, అనగా మరో మంచిజన్మను తీసుకునే దిశగా వెళతాడు...అని.

* * *

జన్మ పరంపర అంటే
ఒక జన్మ తర్వాత మరొక జన్మ అని కాదు.

అన్ని జన్మలయొక్క సమిష్టిరూపంగా నీవున్నావు T.V. వలె.

ఇప్పుడే మానవ జన్మగా ఉండేది నీవే.
ఇప్పుడే చెట్టుజన్మగా ఉండేది నీవే.
ఇప్పుడే పిట్ట జన్మగా ఉండేది నీవే.

ఇప్పుడే సకలజన్మల రూపంలో ఉండేది నీవొక్కడివే.

జన్మపరంపర ఉండేది అడ్డానికి(Horizontal).
నిలువుకి(vertical)కాదు.

* * *

జీవించడం చేతగానివాడే పునర్జన్మ గురించి, జన్మరాహిత్యం గుఱించి ఆలోచిస్తాడు...

రసజ్ఞత లేని మనసే మోక్షాన్ని కోరుకుంటుంది.

మోక్షం అంటే ఏమి?
మరుజన్మ లేకపోవడమా?
నిజంగా అదే అయితే అలాంటి మోక్షం నాకొద్దు అంటాను.
ప్రకృతి రసాస్వాదనమే తపస్సు...అన్నారు చలం.

భగవంతుడు మనకు పంచేంద్రియాలను ఇచ్చింది
వాటిని మూసి పెట్టడానికీ కాదు,
అణగద్రొక్కడానికి కాదు,
జయించడానికీ కాదు.

భగవంతుణ్ణి అయిదు విధాలుగా అనుభవించడానికి ప్రకృతి చేసిన ఏర్పాటే ఈ పంచేంద్రియాలు.

ఇంద్రియసుఖం ఆత్మసుఖానికి భిన్నమైనదేమీ కాదు. వీటి ద్వారా మనం అనుభవించేది ఆత్మనే.

ఇది కాదు, ఇది కాదు అని అనడం వేద విధానం.

ఇది కూడా, ఇది కూడా అని ఉండడం మన గురు విధానం.

సుఖం అనేది ఇంద్రియాలకు సంబంధించినది.
సంతోషం అనేది మనసుకు సంబంధించినది.
ఆనందం అనేది ఆత్మకు సంబంధించినది.

ఒకటి బావినీరు.
ఇంకొకటి నది నీరు.
ఇంకొకటి సముద్రపు నీరు.

నీరుగా అంతా ఒకటే.
ఆత్మగా అంతా ఒకటే.

అన్ని అనుభవాలూ ఆత్మానుభవాలే.
అన్ని సుఖాలూ ఆత్మసుఖాలే.
అన్ని శక్తులూ ఆత్మశక్తులే.

మోక్షం అంటే జడత్వం కాదు, చైతన్యం.
మోక్షం అంటే నిరాశావాదం కాదు, ఆశావాదం.
మోక్షం అంటే వైరాగ్యం కాదు, వైభోగం.

మోక్షం అంటే మరుజన్మ లేకుండా చేసుకోవడం కాదు,
ఎన్ని జన్మలైనా సరే ఈ జీవన మాధుర్యాన్ని చవి చూడ్డానికి ఉవ్విళ్లూరటం.
* * *

ఈ భూ గ్రహాన్ని పాడు చేసుకుని, అంగారక గ్రహానికి ప్రయాణం చేయడం గొప్ప సైన్స్ అని చంకలు గుద్దుకుంటోంది మానవసమాజం.

ఈ లోకంలో సుఖపడడం చేతగానివాడు, స్వర్గలోకసుఖాలను అభిలషిస్తూ కర్మలు చేసేవాడు వెర్రివాడు.

ఈ దేశంలో గోచీ పెట్టుకొని వ్యవసాయం చేయడంలో ఉన్న స్వేచ్ఛ,
విదేశాల్లో కోటు బూటు వేసుకుని ఉన్నా సరే అతడు ఓ బానిస.

ఏదయినా సరే-
ఈ లోకంలోనే సాధించండి.
ఈ గ్రహంలోనే సాధించండి.
ఈ దేశంలోనే సాధించండి.
ఈ దేహంలోనే సాధించండి.

అదే గురువుగారు చెప్పిన ఇప్పుడు-ఇక్కడ-ఇలా.

ఎప్పుడో-ఎక్కడో-ఎలాగో అనేదే మాయ.
ఇప్పుడు-ఇక్కడ-ఇలాగు అనేదే సత్యం.

* * *

ఉన్నచోటనే హాయిగా జీవించగలిగే పరిస్థితులను దూరం చేసుకొని, మరో దేశంలో, మరో గ్రహంలో, మరో జన్మలో, మరో లోకంలో సుఖపడదామనే ఆలోచనే ఇన్ని పరుగులకు, ఇన్ని వ్యధలకు కారణమైంది.

పరుగెత్తే కుందేలు పదేళ్లే బ్రతుకుతుంది.
నిదానంగా సాగే తాబేలు వందేళ్లు జీవిస్తుంది.
అని సామెత.

పరుగు - దుఃఖం.
నెమ్మది - సుఖం.

పరుగెత్తి పాలు త్రాగడం కంటే
నిలబడి నీళ్లుత్రాగడం మేలు.

మన ఋషులు తపస్సులు చేసి
ఉన్నచోటునే ఉంటూ దేవుణ్ణి తమ వద్దకు తీసుకురాగలిగారు.

ఆది శంకరులు తామున్న చోటుకే నదిని
రప్పించుకోగలిగారు.

ఎండమావుల వెంట పరుగులు  మానండి.
ఉన్నచోటనే ఉంటూ సుఖంగా జీవించగలిగే
జీవనవిధానాన్ని ప్రసాదించిన సంస్కృతి మనది.

స్వరూపమే స్వదేశము.
స్వరూపనిష్ఠయే పరమసుఖము.
* * *

## 110. గురు చిరునామా

---

చదువనివాడజ్ఞుండగు
చదివిన సదసద్వివేక చతురత కలుగున్
చదువగ వలయును జనులకు
చదివించెదనార్యులొద్ద చదువుము తండ్రీ!

రాక్షసరాజైన హిరణ్యకశిపుడు తన కుమారుడైన ప్రహ్లాదునితో చదువు యొక్క విశిష్టతను గురించి చెప్పిన మాటలివి-

నాయనా ప్రహ్లాదా!
చదువుకోనివాడు అజ్ఞాని అవుతాడు.
బాగా చదువుకుంటే సత్, అసత్ అంటే ఏది మంచి, ఏది చెడు అనే విషయాలు బాగా అర్థమవుతాయి.
అందుకే అందరూ శ్రద్ధగా చదువుకోవాలి.
అది కూడా గురువుల దగ్గరకు వెళ్లి మాత్రమే చదువుకోవాలి.
కాబట్టి మన కులగురువులైనవారి దగ్గర
నిన్ను చదివిస్తాను...
* * *

చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థ ముఖ్య శాస్త్రంబుల్ నే
చదివినవి కలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!

తండ్రీ! గురువులు నన్ను బాగా చదివించారు.
ధర్మానికి, అర్థానికి సంబంధించిన ముఖ్యశాస్త్రాలన్నీ చదివాను.
అంతేకాదు ఇంకా చాలా విషయాలు కూడా చదివాను.
చదువులలో దాగి ఉన్న మర్మాన్ని తెలుసుకున్నాను.
ఈ పద్యంలో ప్రహ్లాదుడు 'చదువులలో మర్మమెల్ల' అన్న మాటను... అన్ని విద్యలలోనూ దాగి ఉన్నది "భగవంతుడు" మాత్రమే అనే ఉద్దేశాన్ని దృష్టిలో ఉంచుకునే పలుకుతాడు.

చాలా సంతోషించాడు తండ్రి...

అందరూ ఉత్త చదువులే చదువుతారు...
నా కుమారుడు చదువులలో "మర్మం" కూడా చదివాడు అని మురిసిపోతాడు.

* * *

ఇంతకీ ఆ చదువేమి?

చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు.
అంటాడు ప్రహ్లాదుడు.

భగవంతుణ్ణి తెలియజేసే చదువే చదువు.
అటువంటి చదువు చెప్పే గురువే గురువు.

ఇంతకీ ఆ చదువులలో మర్మమేమి?

ఎల్లశరీరధారులకు నిల్లను చీకటినూతిలోపలన్ ద్రెళ్లక వీరునేమను
మతిభ్రమణంబున భిన్నులైప్రవ ర్తిల్లక సర్వమున్నతని
దివ్యకళామయమంచు విష్ణునం దుల్లముజేర్చితా రడవినుండుటమేలు
నిశాచరాగ్రణీ!

జనులు అజ్ఞానంతో, ఇల్లు అనే చీకటిగోతిలో పడి
తల్లడిల్లుతూ ఉంటారు.
“నేను వేఱు, మీరు వేఱు” అనే చిత్త భ్రమతో,
భేద భావంతో ఉంటారు.
అట్టి భేద భావంతో మెలగకుండా,
విశ్వం అంతా విష్ణుమయమే అని గ్రహించాలి.
అలాంటి ఆ విష్ణుదేవుణ్ణి మనసులో నిలుపుకొని,
తాము అడవులలో నివసించినా మేలే.

* * *

ఇరవై ఆరు సద్గురు గ్రంథాల ప్రచురణకు సంబంధించిన పని నా చేతుల
మీదుగానే జరిగింది...

తిరుపతిలో శ్రీవారి గ్రాఫిక్స్ లో అవన్నీ తయారయ్యాయి...

మొత్తం ఆరేళ్ల వ్యవధిలో జరిగిపోయాయి.

మొదటి పుస్తకం - అనిలాచలశివమాల.
చివరి పుస్తకం - అది అంతే ఇది ఇంతే.

పుస్తకం వెనుక అట్టమీద (4th Cover Page)
గురువుగారి గురించి పరిచయవాక్యాలుగా
ఓ నాలుగు మాటలు వ్రాస్తే బాగుండునని అనిపించి, సద్గురు నివాసమే పుణ్యక్షేత్రం... అంటూ మొదటి పుస్తకానికి ఓ తొమ్మిది వాక్యాలు వ్రాయడం జరిగింది.
ఫ్రేం చేసుకుని ఇంట్లో పెట్టుకునేంతగా అది అందరికీ నచ్చేసింది...

ఇక అప్పట్నుంచి ప్రతి పుస్తకానికీ వెనుక అట్ట కోసం వాక్యాలు తయారు చేసి పెట్టడం జరిగింది.

దాదాపుగా ఆ పుస్తకాలన్నీ ఖర్చు అయిపోయాయి...

ఆ పుస్తకాలన్నింటినీ గురుభక్తుడు వేంకటనరసయ్య గారు అత్యాశ్రమి అనే వెబ్ సైట్ లో పెట్టడం జరిగింది.... https://www.athyashrami.com/

ఆ పుస్తకాలు కావలసినవారు, వాటిని printout చేసుకుని మీ స్వంతం చేసుకోవచ్చు...

* * *

ఆ కవర్ పేజీల్లో మేటర్లన్నీ ఒక చోట చేరిస్తే
అదే గురువుగారి చిరునామా అవుతుందని భావించి ఈ వ్యాసం తయారు చేశాను.

ఇవన్నీ సారవంతమైన వాక్యములు.
గురువు అంటే వ్యక్తి కాదు; తత్త్వం.

తత్త్వమే తనను తాను శిష్యుడికి పరిచయం చేసుకునే ప్రక్రియకే 'గురూపదేశం' అని పేరు.

శిష్యుడు ఏకత్వానుభూతిని పొందటమే
ఆ గురూపదేశం యొక్క ఏకైక లక్ష్యం.

మనల్ని గురుతత్త్వానికి తీసుకెళ్లే ఈ వ్యాసానికి
"గురు చిరునామా" అని పేరు పెట్టడం జరిగింది.

ఇవి చదివాక వ్యక్తి ఆరాధనను వదిలి,
తత్త్వ ఆరాధన చేసినప్పుడే
నేను వ్రాసిన ఈ వ్యాసాలు యొక్క ప్రయోజనం
సఫలం అయినట్లుగా భావిస్తాను.

ఒక దీపం మరొక దీపాన్ని వెలిగిస్తుంది.
కానీ వెలుగు అఖండంగా ఉంటుంది.

మొదటి దీపం గురువు.
రెండవ దీపం శిష్యుడు.
తత్త్వవిచారణలో గురు-శిష్యులు మాయమై,
అఖండతత్త్వమే ప్రకాశిస్తుంది.

ఈ వాక్యాలు మీకు అతిశయోక్తులుగా అనిపించాయంటే,
మీకు ఇంకా గురుతత్త్వం అవగాహన కానట్టు.

అవి మీకు వాస్తవాలుగా అనిపించినప్పుడు
మీకు గురుతత్త్వం అవగాహన అయినట్టు.

"నా గురువు" అన్న భావన పోయి,
"నేనే గురువు" అన్న అనుభవం కలగడమే

"నా గురువు" వ్యాసాలు వలన కలిగే  పరమప్రయోజనం.

"నా గురువు" అని వ్యవహారంలో ఉండాలి.
"నేనే గురువు" అని అనుభవంలో ఉండాలి.
ఇదే విశిష్టమైన అద్వైతం.

* * *

1. సద్గురు నివాసమే దివ్యక్షేత్రం.
సద్గురు దర్శనమే సర్వదేవతాదర్శనం.
సద్గురు పాదస్పర్శయే సకలతీర్థస్నానం.
సద్గురు సన్నిధే సర్వసంశయనివారణం.
సద్గురు చూపే సర్వపాపహరణం.
సద్గురు వాక్కే సకలశాస్త్రసారం.

సద్గురు నామస్మరణే మధురాతి మధురం.
సద్గురు సత్సంగమే మోక్షప్రదాయికం.
సద్గురు ఉనికే లోకానికి ఆశీర్వాదం.
* * *

2. వేదయుగమునందు "తత్వమసి" అని లోకానికి తొలి సందేశమిచ్చిన వేదఋషివి
ఓ సద్గురూ నీవే...!

కృతయుగమునందు ప్రహ్లాదునికి చదువుల మర్మాన్ని(నారాయణ మంత్రాన్ని) ఉపదేశించిన నారదమహర్షివి
ఓ సద్గురూ నీవే...!

త్రేతాయుగమునందు శ్రీరామచంద్రునికి 'బాహ్యంలో సంగం, అంతరంలో నిస్సంగం' అన్న జ్ఞానసారాన్ని ప్రబోధించిన వశిష్ఠమహర్షివి
ఓ సద్గురూ నీవే...!

ద్వాపరయుగమునందు గొల్లకన్నయ్యను 'అహమాత్మా గుడాకేశ' అన్న జగద్గురువుగా తీర్చిదిద్దిన సాందీపనీమహర్షివి
ఓ సద్గురూ నీవే...!

కలియుగమునందు ప్రతి విషయానికీ 'రీజన్' వెదకే వైజ్ఞానికులకు 'నిన్ను నీవు తెలుసుకో' అన్న సరళమార్గాన్ని చూపించిన రమణమహర్షివి
ఓ సద్గురూ నీవే...!

ఈ ఆధునిక యుగమునందు తన శిష్యులైన జ్ఞానశిశువులకు 'ఏ అనుభవమూ లేకపోవడమే దైవానుభవం' అన్న పరమరహస్యాన్ని బట్టబయలు చేసిన సుబ్రహ్మణ్యమహర్షివి
ఓ సద్గురూ నీవే...!
* * *

3. దైవమే -
జీవ-జగత్-జగదీశ్వరులుగా
వ్యక్తమయ్యింది.

మౌనమే -
దక్షిణామూర్తి-రమణులు-సుబ్రహ్మణ్యులుగా
అవతరించింది.

* * *

4. ప్రపంచానికి హృదయం అరుణాచలం.
జ్ఞానానికి హృదయం అనిలాచలం.

అరుణాచలంలో-
సుబ్రహ్మణ్యుడు రమణుడుగా ఉన్నాడు.
అనిలాచలంలో-
రమణుడు సుబ్రహ్మణ్యుడుగా ఉన్నాడు.

* * *

5. పార్వతమ్మ ముద్దుల తనయుడు మురుగడు
రమణుడుగా అవతరించి నడయాడిన
పవిత్రభూమి ఆ అరుణాచలం.

పార్వతమ్మ జ్ఞానప్రసూనాంబికయై
సద్గురువుగా అవతరించి నడయాడిన
పవిత్రభూమి ఈ అనిలాచలం.

అది యోగభూమి.
ఇది జ్ఞానభూమి.

* * *

6. అరుణాచలంలో జ్ఞానజ్యోతివై
అనిలాచలంలో వాయుదీపమై
జ్ఞానాంబచేతిలో జ్ఞానప్రసూనమై
అత్యాశ్రమానికి అధిష్ఠానదైవమై
మమ్ములను అనుగ్రహించడానికి అవతరించిన
జ్ఞానస్వరూపా! ఓ సద్గురూ! శరణం శరణం.

దేశకాలాలకతీతమైన తత్త్వాన్ని
దేశంలో కాలంలో వెతికి వేసారిపోయాము.
నీ పుత్రులమైన మమ్ములను తరింపచేయటానికి
మిక్కిలి వాత్సల్యముతో మానవరూపంగా
అవతరించిన ప్రేమమయీ!
ఓ సద్గురూ! శరణం శరణం.

ఎప్పుడూ ఎక్కడా లేని విధంగా
ఎప్పుడో ఎక్కడో ఎలాగో అని చెప్పకుండా
ఇప్పుడు ఇక్కడ ఇలాగు అని
నీ స్వరూపాన్ని బట్టబయలు చేసి
మమ్ములను కృతార్థులను చేసిన
దయామయీ! ఓ సద్గురూ! శరణం శరణం.

అనుగ్రహాన్నే తనువుగా కలిగి
శివమాలనే మనసుగా కలిగి
పరమపదాన్నే హృదయముగా కలిగి
మా అహంకారాన్నే గురుదక్షిణగా స్వీకరించి
మమ్ములను అహంస్వరూపులుగా మార్చివేసిన
మహామాంత్రికుడా! ఓ సద్గురూ? శరణం శరణం.

ఏ అర్హతా లేకపోవడమే ముఖ్య అర్హతగా
మమ్ములను నీ అక్కున చేర్చుకుని
'జ్ఞానాంబ దయామయి' అన్న బిరుదును
సార్థకం చేసుకున్న దయాసాగరా!
ఓ సద్గురూ! శరణం శరణం.

దేవతలెల్లరు శిశువులుగా వచ్చి
నీ స్పర్శను పొందుతుంటారు.
సిద్ధులెల్లరు నీ సన్నిధి చేరి
శిష్యులుగా సేవిస్తుంటారు.
త్రిమూర్తులు సైతం నీ వాకిట చేరి

నీ మాటకై వేచి ఉంటారు.
అభయప్రదాతా! ఓ సద్గురూ! శరణం శరణం.

* * *

7. వర్తమానమే నిజమైన గురు చిరునామా.
మౌనమే నిజమైన గురుస్వరూపం.
ఆత్మసంస్థియే నిజమైన గురుసన్నిధి.
అహంకార సమర్పణమే నిజమైన గురుదక్షిణ.
ఆర్తియే నిజమైన గురుస్తోత్రము.
శరణాగతియే గురువుకు నిజమైన నమస్కారము.
ప్రయత్న విరమణే నిజమైన గురుపూజ.
ఊరక ఉండడమే గురువుకు నిజమైన ఘనసన్మానము.

* * *

8. సద్గురు దర్శనం తక్షణమే ఆధ్యాత్మిక తాపాన్ని
నివారించగలిగే పరమశాంతిని ప్రసాదిస్తుంది.

సద్గురు భాషణం తక్షణమే ఎందుకు
అన్న జటిలమైన ప్రశ్నను తొలగిస్తుంది.

సద్గురు ఆశీర్వాదం తక్షణమే జీవనభ్రాంతులను
తొలగించి ముక్తినొసగుతుంది.

* * *

9. బంగారమే ఆభరణంగా ఉండేది.
పరమాత్ముడే ప్రపంచంగా ఉండేది.
పరబ్రహ్మమే మాయగా ఉండేది.
పరమే ఇహంగా ఉండేది.
నిరాకారమే సాకారంగా ఉండేది.
నిర్గుణమే సగుణంగా ఉండేది.
చైతన్యమే జడంగా ఉండేది.
సిద్ధియే సాధనగా ఉండేది.

మౌనమే భాషిస్తూ ఉండేది.
జ్ఞానాంబయే సద్గురువుగా ఉండేది.
* * *

10. జన్మలో ఒక్కసారైనా దర్శించదగ్గ
జ్ఞానక్షేత్రం - శ్రీకాళహస్తి.

జన్మలో ఒక్కసారైనా చదువదగ్గ
జ్ఞానగ్రంథం - జ్ఞానప్రసూనాలు.

జన్మలో ఒక్కసారైనా దర్శించదగ్గ
జ్ఞానస్వరూపం - సద్గురు సుబ్రహ్మణ్యం.
* * *

11. ఎవని సన్నిధిలో పరమశాంతి వెల్లివిరుస్తుందో
ఎవని సన్నిధిలో మరణభీతి తొలగుతుందో
ఎవని సన్నిధిలో అస్సలు ప్రశ్న కలుగదో
ఎవని సన్నిధిలో కేవలం జ్ఞానులే కొలువై ఉంటారో
ఎవని సన్నిధిలో తర్కం మూగదవుతుందో
ఎవని సన్నిధిలో దేవతలు మోకరిల్లు ఉంటారో
ఎవని సన్నిధిలో శివుడు శిశువై ప్రాకుతుంటాడో
ఎవని సన్నిధిలో కాలం శిలలా నిలిచి ఉంటుందో
అతడే నా గురువు, నా దైవము.

* * *

12. వేద మంత్రాలు తెలిస్తేనే ఋషి అయితే
మా గురువు ఋషి కాడు.

సంస్కృతం తెలిస్తేనే పండితుడు అయితే
మా గురువు పండితుడు కాడు.

దిగంబరంగా ఉంటేనే అవధూత అయితే
మా గురువు అవధూత కాడు.

కాషాయం ధరిస్తేనే సన్న్యాసి అయితే
మా గురువు సన్న్యాసి కాడు.

ఆశ్రమం ఉంటేనే స్వామి అయితే
మా గురువు స్వామి కాడు.

ప్రబోధిస్తేనే ప్రవక్త అయితే
మా గురువు ప్రవక్త కాడు.

మౌనంగా ఉండేవాడే ముని అయితే
మా గురువు ముని కాడు.

శిష్యులు ఉంటేనే గురువు అయితే
మా గురువు గురువు కాడు.

ఏదీ కాక, ఎవరూ కాక
ఏదో ఒకటి, ఎవరో ఒకరు
అయి ఉన్నదే అయి ఉన్నవారే
మా గురువు.

* * *

13.సద్గురు సత్సంగంలో అడుగు పెట్టాక తెలిసింది
ముక్తి పొందనివాడెవడూ ఇక్కడికి రాలేదని.

సద్గురు కళ్లలో కాంతిని చూశాక తెలిసింది
ఇంతకాలం నేను చీకట్లో ఉన్నానని.

సద్గురు పాదాలను ముట్టుకున్నాక తెలిసింది
అసలు ఆయనకు రూపమే లేదని.

సద్గురు భాషణం విన్నాక తెలిసింది
అసలు ఆయన ఎప్పుడూ మాట్లడనే లేదని.

సద్గురు సన్నిధిలో గడిపాక తెలిసింది
అంతకంటే గొప్ప ఉద్యోగం వేటే లేదని.

జ్ఞానప్రసూనాలు చదివాక తెలిసింది
నేను చదివిన చదువులు చదువులే కావని.

సద్గురు అనుగ్రహం పొందేక తెలిసింది
వారు జ్ఞానప్రసూనాంబిక అవతారులేనని.

* * *

14.ఓ సద్గురూ!
దేవతలు కూడా ఇవ్వలేని పరమపదాన్ని ప్రసాదించావు.
గురుఋణం తీర్చుకోవడానికి నలుదిశలా వెదికినా
నీది కానిది, నీవు లేనిది అంటూ
ఏదీ గోచరించడం లేదు నాకు.
నీ స్వరూపమే అయిన మౌననిష్ఠలో
సదా సంస్థితమై ఉండడం కన్నా
మార్గం మరొకటి కనబడడం లేదు నాకు.

* * *

15. నాలుగు యుగాల్లోనూ-
శ్రీకాళహస్తి కంటే క్షేత్రం లేదు.
జ్ఞానప్రసూనాంబ కంటే దైవం లేదు.
రమణుని కంటే ముని లేడు.
ఆత్మవిచారణ కంటే సాధన లేదు.
యోగవాశిష్ఠం కంటే గ్రంథం లేదు.
జ్ఞానప్రసూనాలు కంటే తత్త్వం లేదు.
రమణసత్సంగం కంటే సత్సంగం లేదు.
సుబ్రహ్మణ్యుని కంటే గురువు లేడు.

* * *

16. నీవు మేల్కొలిపితేగాని మేలుకోలేని జడుడను.
నీకు నేనెలా సుప్రభాతం పాడగలను?

తెలివిలేని నా తలపై జ్ఞానామృతాన్ని కురిపిస్తున్న జ్ఞానభాండం నీవు.
నీకు నేనెలా అభిషేకం చేయగలను?

నీవు పంచుతున్న ప్రసాదాన్ని ఆశించి నీ పంచన చేరిన యాచకుడను.
నీకు నేను ఏ నైవేద్యాన్ని సమర్పించగలను?

నేను-నేను అన్న అహంస్ఫురణ అఖండదీపమై ప్రకాశించే నీ సన్నిధిలో
ఏ దీపాన్ని నేను వెలిగించగలను?

నీ శిరస్సు ఎక్కడో, నీ పాదం ఎక్కడో అంతు తెలియక బ్రహ్మవిష్ణువులే
తికమక పడుతుంటే
నీకు సరిపడా వస్త్రాలను నేనెలా పెట్టగలను?

లక్ష్మీదేవినే వక్షస్థలంలో నిలుపుకున్న నీకు
నేను ఎంతని దక్షిణ ఇవ్వగలను?

ఉన్నదంతా నీవే అయి ఉన్న అనంతుడివి నీవు.
నేను ఏ వైపుకు తిరిగి నీకు సాష్టాంగపడగలను?

ఏదీ చేతకాక,
ఎటూ వీలుకాక,
ఏమీ పాలుపోక
నిశ్చేష్టుడనై ఉన్న నన్ను అనుగ్రహించు గురుదేవా!
* * *

17. జ్ఞానాంబ దయామయీ!
గురురూపంగా అవతరించి
అనిలాచలుని కీర్తించి
శిష్యులకు సేవ చేసే గురువుగా
బోధించడమే దినచర్యగా కలిగిన తత్త్వవేత్తగా
అనుగ్రహించడమే బలహీనతగా కలిగిన దైవంగా
దీనజనుల మొరాలించి
తావీదులో శక్తినాపాదించి
లోకక్షేమమే తన లక్ష్యంగా

ఈ భువిపై నడయాడే దైవమా!
నీ ప్రతి అడుగూ ధర్మస్థలమే.
నీ ప్రతి పలుకూ జ్ఞానసారమే.
నీ ప్రతి కదలికా ఓ లీలా విశేషమే.
నీ తనువు కర్మయోగం.
నీ మనసు భక్తియోగం.
నీ హృదయం జ్ఞానయోగం.
నీ దివ్య గుణగణములన్నీ ఆకాశంలో నక్షత్రాలై వెలుగుతున్నాయి.
పరమపద స్మరణమే నీకు అభిషేకం.
శివమాల పారాయణమే నీకు అష్టోత్తరం.
జ్ఞానప్రసూనాలే నీకు పుష్పకైంకర్యం.
మౌనభాషణమే నీకు దివ్యస్తోత్రం.
మా అహంకారమే నీకు నైవేద్యం.
శివానీ! శరణం శరణం.

* * *

18. శిష్యుల యొక్క యధార్థమైన స్థితి
దేశకాలములకు అందని గురుతత్త్వమే.
కాని ఆ స్వస్థితిని విలాసముగా మరచి
దేశకాలములకు లోబడి ఘర్షణపడుతున్నారు.
ఆ ఘర్షణ యొక్క తీవ్రత వలన
క్షీరసాగరము నుండి లక్ష్మీదేవి పుట్టినట్లు
జ్ఞానప్రసూనాంబికాదేవి ఈ భువిపై అవతరించి
శ్రీసద్గురు సుబ్రహ్మణ్యుల రూపంలో
ఆ పరతత్త్వాన్ని తన ప్రతిరూపాలైన శిష్యులకు
మిక్కుటమైన వాత్సల్యముతో ప్రబోధిస్తున్నది(గుర్తుకు తెస్తున్నది)
ఇది సత్యము.

* * *

19. సద్గురువు అంటే -
బ్రహ్మను సృష్టించినవాడు.
విష్ణువును పరిపాలించువాడు.
శివుణ్ణి లయింపచేసేవాడు.
సరస్వతికి చదువు చెప్పినవాడు.
లక్ష్మీదేవికి సంపదనిచ్చినవాడు.
పార్వతీదేవికి సౌభాగ్యాన్నిచ్చినవాడు.
నారదుడికి సంగీతం నేర్పినవాడు.
ఆదిశేషునికి ఆధారమై ఉన్నవాడు.
పరబ్రహ్మనికి నామకరణం చేసినవాడు.
వేదాలకు మాటలు నేర్పినవాడు.
యముడికి మృత్యుభీతిని కలిగించినవాడు.
సూర్యదీపాన్ని వెలిగించినవాడు.
గ్రహాల్ని బొంగరాల్లా త్రిప్పేవాడు.
ఆకాశానికి అవకాశమై ఉన్నవాడు.
అంతరిక్షాన్నే అంతర్ముఖంగా ఉన్నవాడు.
ఆది అంతము లేనివాడు.
నేను నీవు లేనివాడు.
గురువు శిష్యుడు లేనివాడు.

* * *

20. గురుసన్నిధిలో మనసు అప్రయత్నంగా
తాను పుట్టుచోటుకి వెళ్లిపోతుంది.

గురుసన్నిధిలో మౌనం కూడా
ప్రవక్తలా ప్రవచిస్తుంది.

గురుసన్నిధిలో దైవం కూడా
శిష్యునిలా మెలగుతుంది.

* * *

22. దేనిని చూస్తే ఇక దేనినీ చూడాలని అనిపించదో
అదే సద్గురు రూపం.

దేనిని వింటే ఇక ఏదీ వినాలనిపించదో
అదే పరమపదం.

దేనిని రుచి చూస్తే ఇక ఏదీ రుచించదో
అదే సాక్షీభూతం.

దేనిని స్పర్శిస్తే ఇక దేనినీ స్పర్శించే అవసరం ఉండదో
అదే సద్గురు పాదం.

దేనిని స్మరిస్తే ఇక మరోదానిని స్మరించే అవసరం ఉండదో
అదే అనిలాచలం.

దేనిని జపిస్తే ఇక జపించడం అనే క్రియ ముగుస్తుందో
అదే అహం మంత్రం.

23. అది చేయి, ఇది చేయి అని భారం వేయరు గురువు.
ఏ సాధనా చెప్పక ఊరికే ఉండడం నేర్పుతారు గురువు.
"నేనున్నాను కదా! భయమెందుకు?" అని అభయం ఇస్తారు గురువు.
శిష్యుణ్ణి సంపూర్ణశరణాగతికి రంగం సిద్ధం చేస్తారు గురువు.
"నేనే నీవు, నీవే నేను" అన్న అద్వైతం బోధిస్తారు గురువు.
అప్పనంగా ఆత్మను పొందే మార్గం చూపుతారు గురువు.

24. సద్గురువు ఆనందస్వరూపుడు.
వారి ఆనందానికి ఓ ఆలంబన అవసరం లేదు.
ఓ కారణం అవసరం లేదు.
ఇతరులు, ఇతరం ఉండవలసిన అవసరం లేదు.
స్వయంగా తానే ఆనందస్వరూపుడు.
అది స్వయంభూ ఆనందం.
తన ఉనికే తన ఆనందం.
అది కాలానికి, దేశానికి, నిమిత్తానికి నిబద్ధమై ఉండదు.
అది సదా ఆనందం.

యెడతెగని ఆనందం.
ఆ ఆనందసాగరంలో -
జననమూ ఓ వేడుకే...
జీవితమూ ఓ ఉత్సవమే...
మరణమూ ఓ పండుగే...
సద్గురు కాపురం 'ఒకటి'తోనే...
సద్గురు ప్రయాణం 'ఒకటి'లోనే...
ఆ 'ఒకటి' ఆనందపునం.

* * *

జ్ఞానశిశువు
9533667918

111. ఎవ్వనిచే

___________

ఎవ్వనిచే జనించు? జగమెవ్వని లోపల నుండు? లీనమై
ఎవ్వనియందు డిందు పరమేశ్వరుడెవ్వడు? మూలకారణం
బెవ్వడ? నాది మధ్యలయు డెవ్వడు? సర్వము తానైన వా
డెవ్వడు? వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్.

* * *

శిష్యుడు:
ఎవ్వనిచే మనస్సు చరిస్తోంది?
ఎవ్వనిచే ప్రాణం సంచరిస్తోంది?
ఎవ్వనిచే వాక్కు పలుకుతోంది?
ఎవ్వనిచే కళ్లు చూస్తున్నాయి?
ఎవ్వనిచే చెవులు వింటున్నాయి?

గురువు: 'అది' దైవం.
మనసుకు మనస్సుగా
ప్రాణానికి ప్రాణంగా
వాక్కుకు వాక్కుగా
కన్నుకు కన్నుగా
ఉన్నది.

కాబట్టి ఇంద్రియాల వెనుక ఉండి
ఇంద్రియాలను నడిపే శక్తియే ఆత్మ.

కన్నుకు దేని వలన చూచే శక్తి కలిగిందో
దానిని కన్ను చూడలేదు.

మనసుకు దేనివలన తలచే శక్తి కలిగిందో
దానిని మనసు తలవలేదు.

అందువల్ల 'అది'(ఆత్మ) ఎలాంటిదో
దాని గుఱించిన వివరమేమీ మాకు తెలియదు.

కేవలం అనుభవానికి మాత్రమే సంబంధించిన
ఆ పరతత్త్వాన్ని ఎలా ఇతరులకు అవగతం అయ్యేలా చెప్పాలో
మాకు తెలియడం లేదు.

తెలుసు అనడానికి
తెలియదు అనడానికి
'అది' అతీతంగా ఉన్నది.
అని మా పెద్దలు చెప్పగా విన్నాం.

* * *

దేని వలన వాక్కు ప్రకటనం అవుతుందో
దేనిని వాక్కు తెలుపలేదో
అదే దైవం.
ఇక్కడ లోకులు చేత ఆరాధింపబడేది
దైవం కాదని తెలుసుకో.

దేని వలన మనసుకు తలచేశక్తి కలుగుతుందో
దేనిని మనసు తలవలేదో
అదే దైవం.
ఇక్కడ లోకులు చేత ఆరాధింపబడేది
దైవం కాదని తెలుసుకో.

దేని మూలంగా కళ్లు చూస్తున్నాయో
దేనిని కళ్లు చూడలేవో
అదే దైవం.
ఇక్కడ లోకులు చేత ఆరాధింపబడేది
దైవం కాదని తెలుసుకో.

ఏది చెవుల ద్వారా వినబడదో
దేని వలన చెవులు వినగలుగుతున్నాయో
అదే దైవం.

ఇక్కడ లోకులు చేత ఆరాధింపబడేది
దైవం కాదని తెలుసుకో.

దేని వలన ముక్కుకు వాసన చూసే శక్తి కలిగిందో
దేనిని ముక్కు వాసన చూడలేదో
అదే దైవం.
ఇక్కడ లోకులు చేత ఆరాధింపబడేది
దైవం కాదని తెలుసుకో.

* * *

శిష్యుడు:
గురువుగారూ!
నేను ఆత్మను బాగా తెలుసుకున్నాను.

గురువు:
నేను ఆత్మను బాగా తెలుసుకున్నాను
అని నీవు అంటున్నావంటే,
నీకు ఆత్మ గుఱించి తెలియలేదు అని అర్థం.

నాకు తెలుసు అనటానికి
నాకు తెలియదు అనటానికి
ఏ తెలివైతే ఆధారంగా ఉన్నదో
ఆ  తెలివే తాను.

ఈ తత్త్వంలో ఉన్న విచిత్రమేమంటే-
తెలుసు అన్నవాడు తెలియనివాడు.
తెలియదు అన్నవాడు తెలిసినవాడు.

నిజానికి 'నాకు తెలియదు' అన్నవాడే
అమరత్వాన్ని పొందుతాడు.

ఇప్పుడే ఇక్కడే ఆత్మను పొందడం గొప్ప లాభం.
లేకపోతే అదే గొప్ప నష్టం.

ఆత్మని పొందనివాడు జగత్తులో భేదాన్ని చూస్తాడు కాబట్టి
అతడు మృత్యువుకు బలి అవుతాడు.

ఆత్మను పొందినవాడు సర్వత్రా అభేదాన్ని దర్శిస్తాడు కాబట్టి
అతడు అమరుడవుతాడు.

* * *

ఒకసారి దేవతలకు, రాక్షసులకు జరిగిన యుద్ధంలో దేవతలు గెలిచారు.
దేవతలు విజయగర్వంతో మిడిసిపడతారు.

ప్రకృతిలోని ప్రతిశక్తి దేనికదే స్వతంత్రంగా ఉండగలదు అన్నట్టు కనబడినా,
అన్ని శక్తులూ ఒకే ప్రాణశక్తి యొక్క వివిధరూపాలు.

దేవతలకైనా, రాక్షసులకైనా మూలశక్తి ఒక్కటే.
ఆ మూలశక్తే గర్వంతో ఉన్న దేవతలకు గుణపాఠం చెప్పాలని భావించింది.
తక్షణం యక్షుడిగా ప్రత్యక్షమైంది.

హఠాత్తుగా ప్రత్యక్షమైన ఈ యక్షుడువరో దేవతలకు అర్థం కాక
కలవరపడ్డారు.

దేవతలు అగ్నిదేవుణ్ణి ఆ యక్షుని వద్దకు పంపారు
ఆ యక్షుడెవరో తెలిసికుని రమ్మని.

యక్షుడు: ఎవడవు నీవు?

అగ్నిదేవుడు: నేను అగ్నిదేవుడను...

యక్షుడు: నీ గొప్పతనం ఏమి?

అగ్నిదేవుడు: దేన్నయినా సరే క్షణంలో దహించవేయగలను.

యక్షుడు: అయితే ఈ గడ్డిపరకను దహించు చూద్దాం...

(అగ్నిదేవుడు ఎంతగా ప్రయత్నించినా, ఆ గడ్డిపరకను దహించలేక
వెనుతిరిగి ఆ యక్షుడెవరో నేను తెలుసుకోలేకపోయానని దేవతలకు
చెబుతాడు...ఈ సారి వాయుదేవుణ్ణి పంపారు.)

యక్షుడు: నీవెవడవు?

వాయుదేవుడు: నేను వాయుదేవుడను...

యక్షుడు: నీకున్న శక్తి ఏమి?

వాయుదేవుడు: దేన్నయినా సరే క్షణంలో ఎగురగొట్టగలను...

యక్షుడు: అయితే ఈ గడ్డిపరకను కదిలించు చూద్దాం...

(వాయుదేవుడు తన శాయశక్తులా ప్రయత్నించినా ఇంచుకైనను గడ్డిపరకను కదల్చలేక వెనుతిరిగి ఆ యక్షుడెవరో తెలుసుకోలేకపోయానని దేవతలకు చెబుతాడు. ఇక చివరి ప్రయత్నంగా దేవతలు తమ నాయుకుడైన ఇంద్రుణ్ణి పంపారు. )

ఇంద్రుడు ఆ యక్షుని వద్దకు చేరగానే యక్షుడు అంతర్ధానమై, ఆ స్థానంలో 'జ్ఞానప్రసూనాంబిక' ప్రత్యక్షమవుతుంది.

(ఈ అద్భుతమైన ఘట్టం జరిగింది శ్రీకాళహస్తి దక్షిణకైలాస పర్వతసానువుల్లో ఉన్న వేయిలింగాల{ఇంద్రలింగం} కోన ప్రాంతంలో)

ఇంద్రుడు: జగన్మాత! ఆ యక్షుడెవరు?

జ్ఞానప్రసూనాంబిక: అతడే పరమేశ్వరుడు.
ఆయన విజయాన్నే మీ విజయంగా భావించి గర్వపడుతున్నారు.

సకలానికి కర్త-భోక్త-హర్త పరమేశ్వరుడే.

మెరుపు మెరిసేది ఆయన వల్లే.
మనం రెప్పలు ఆర్చడం ఆయన వల్లే.
ఆయన సర్వశక్తిమంతుడు.

ఇతర దేవతల కంటే అగ్ని, వాయుదేవుళ్లు గొప్పవారు.

వారిద్దరి కంటే ఇంద్రుడు గొప్పవాడు.

యెందుకంటే, యక్షుని రూపంలో ఉన్న పరమేశ్వరుణ్ణి అత్యంత దగ్గరగా ఉండి చూశారు కనుక.

* * *

శిష్యుడు: గురువుగారూ!
నాకు అతి రహస్యమైన ఆత్మజ్ఞానాన్ని బోధించండి.

గురువు: మనస్సు-శరీరం
ఈ రెంటికీ ఆధారంగా ఉన్నది ఆత్మయే.

సకల జీవరాశుల్లో 'అహం'స్వరూపంగా ప్రకాశిస్తోంది ఆ సద్వస్తువు.

అని ఎవడు గ్రహిస్తాడో
వాణ్ణి సకల జీవరాశులూ ప్రేమిస్తాయి.

ఎవడు ఈ సత్యాన్ని రూఢిగా తెలుసుకుంటాడో
అతని పాపాలు పటాపంచలవుతాయి.

సదా అతడు ఆత్మనిష్ఠలో స్థిరమై ఉంటాడు.

* * *

112. అమ్మా...చెప్పవూ...!

---

1. జ్ఞానశిశువు : అమ్మా నేనెవరు?
జ్ఞానప్రసూన: "నేనే"

2. జ్ఞానశిశువు: దైవమంటే?
జ్ఞానప్రసూన: "నేను"కు పర్యాయపదం.

3. జ్ఞానశిశువు: శివుడెవరు?
జ్ఞానప్రసూన: నాకు మాత్రమే తెలిసిన "సత్యం".

4. జ్ఞానశిశువు: శివదర్శనం నాకు కలుగదా?
జ్ఞానప్రసూన: కలుగనే కలుగదు.

5. జ్ఞానశిశువు: మరి శివుడున్నాడనుటకు సాక్ష్యమేమి?
జ్ఞానప్రసూన: నీవుండుటయే శివుడుండుటకు సాక్ష్యం.

6. జ్ఞానశిశువు: శివుణ్ణి నేను పొందలేనా?
జ్ఞానప్రసూన: శివుడే నిన్ను పొందాడు.

7. జ్ఞానశిశువు: అయితే శివుడు నాకు ఎడమా?
జ్ఞానప్రసూన: కెరటం సముద్రానికి ఎడమా?

8. జ్ఞానశిశువు: నేనెందుకు కెరటమయ్యాను?
జ్ఞానప్రసూన: అయినా నీ స్వస్వరూపం సముద్రమే.

9. జ్ఞానశిశువు: దైవం, శివుడు వేరా?
జ్ఞానప్రసూన: అవి సమానార్థకములు.

10. జ్ఞానశిశువు: ఆత్మానుభవం అంటే?
జ్ఞానప్రసూన: ఆత్మ యొక్క అనుభవం.

11. జ్ఞానశిశువు: దేవుడు ఎలా ఉంటాడు?
జ్ఞానప్రసూన: అచ్చం నీ వలె ఉంటాడు, నీవెవరో విచారిస్తే.

12. జ్ఞానశిశువు: దేవుడంటే?
జ్ఞానప్రసూన: అన్యం లేనివాడు.

13. జ్ఞానశిశువు: దైవాన్ని చూడగలనా?
జ్ఞానప్రసూన: జగద్రూపంగా ఉన్నది అదే.

14. జ్ఞానశిశువు: దైవం అవసరమా?
జ్ఞానప్రసూన: శ్వాస అవసరం అనుకుంటే.

15. జ్ఞానశిశువు: దేవుని స్వరూపమేమి?
జ్ఞానప్రసూన: జ్ఞానము, శక్తి.

16. జ్ఞానశిశువు: దైవోపాసన అంటే?
జ్ఞానప్రసూన: తానెవరో విచారించడం.

17. జ్ఞానశిశువు: కర్మిష్ఠి ఎవడు?
జ్ఞానప్రసూన: భగవంతుని చేతిలో తానొక ఉపకరణంగా ఉన్నవాడు.

18. జ్ఞానశిశువు: భక్తుడెవడు?
జ్ఞానప్రసూన: భగవంతుని ఒడిలో శిశువుగా ఉన్నవాడు.

19. జ్ఞానశిశువు: జ్ఞాని యెవడు?
జ్ఞానప్రసూన: భగవంతుడే.

20. జ్ఞానశిశువు: సన్న్యాసి ఎవడు?
జ్ఞానప్రసూన: మరణించి జీవించువాడు.

21. జ్ఞానశిశువు: మాయ అంటే?
జ్ఞానప్రసూన: 'ఒకటి'ని 'అనేకం'గా చూపేది.

22. జ్ఞానశిశువు: జీవిత లక్ష్యమేమి?
జ్ఞానప్రసూన: జీవించడమే.

23. జ్ఞానశిశువు: లక్ష్యం ఎవనిది?
జ్ఞానప్రసూన: నిన్ను సృష్టించినవానిది.

24. జ్ఞానశిశువు: లక్ష్యం నెరవేరినందుకు గుర్తేమి?
జ్ఞానప్రసూన: ఇంకొక్క శ్వాసను కూడా పీల్చుకోలేవు.

25. జ్ఞానశిశువు: మరణమంటే?
జ్ఞానప్రసూన: గుప్తంగా "ఉండడం".

26. జ్ఞానశిశువు: మోక్షమంటే?
జ్ఞానప్రసూన: లీనమై "ఉండడం".

27. జ్ఞానశిశువు: జననమంటే?
జ్ఞానప్రసూన: కార్యంగా ఉండడం.

28. జ్ఞానశిశువు: మరణమంటే?
జ్ఞానప్రసూన: కర్తగా ఉండడం.

29. జ్ఞానశిశువు: ముక్తి అంటే?
జ్ఞానప్రసూన: కార్య-కారణాల సంకెళ్లు తెగడం.

30. జ్ఞానశిశువు: అజ్ఞానం అంటే?
జ్ఞానప్రసూన: నీకు తెలియంది.

31. జ్ఞానశిశువు: విజ్ఞానం అంటే?
జ్ఞానప్రసూన: నీకు తెలిసింది.

32. జ్ఞానశిశువు: జ్ఞానం అంటే?
జ్ఞానప్రసూన: నీకు తెలియంది.

33. జ్ఞానశిశువు: విజ్ఞానం అంటే?
జ్ఞానప్రసూన: నీవు తెలుసుకునేది.

34. జ్ఞానశిశువు: సుజ్ఞానం అంటే?
జ్ఞానప్రసూన: నిన్ను తెలుసుకునేది.

35. జ్ఞానశిశువు: అజ్ఞానం అంటే?
జ్ఞానప్రసూన: వాక్కుకు మనసుకు అందని జ్ఞానం.

36. జ్ఞానశిశువు: విజ్ఞానం అంటే?
జ్ఞానప్రసూన: వాక్కుకు మనసుకు అందే జ్ఞానం.

37. జ్ఞానశిశువు: పురుషోత్తముడెవడు?
జ్ఞానప్రసూన: "నేను" అనే ఉత్తమపురుషము యొక్క తత్త్వమును ఎఱిగినవాడు.

38. జ్ఞానశిశువు: శరణాగతి ఫలమేమి?
జ్ఞానప్రసూన: తన పూర్వ పూర్ణస్థితిని పొందటం.

39. జ్ఞానశిశువు: ఎవడు దిగంబరుడు?
జ్ఞానప్రసూన: దేహము-మనసు అనే పై-లో దుస్తులను వదిలినవాడు.

40. జ్ఞానశిశువు: కర్మయోగం అంటే?
జ్ఞానప్రసూన: కర్త నేను కాదు అనటం.

41. జ్ఞానశిశువు: భక్తియోగం అంటే?
జ్ఞానప్రసూన: భగవంతుడు కర్త అనటం.

42. జ్ఞానశిశువు: జ్ఞానయోగం అంటే?
జ్ఞానప్రసూన: "నేనే" కర్త అనటం.

43. జ్ఞానశిశువు: విశ్వపరిమాణం ఎంత?
జ్ఞానప్రసూన: కనుచూపు పారినంత.

44. జ్ఞానశిశువు: దానం అంటే?
జ్ఞానప్రసూన: నీవు ఇవ్వడం.

45. జ్ఞానశిశువు: త్యాగం అంటే?
జ్ఞానప్రసూన: నిన్నే ఇవ్వడం.

46. జ్ఞానశిశువు: కానుక అంటే?
జ్ఞానప్రసూన: ఇష్టంగా ఇవ్వడం.

47. జ్ఞానశిశువు: దక్షిణ అంటే?
జ్ఞానప్రసూన: ఇష్టాన్నే ఇవ్వడం.

48. జ్ఞానశిశువు: దేవుడు ఉండటం అంటే?
జ్ఞానప్రసూన: ఎవరూ లేకుండుట.

49. జ్ఞానశిశువు: దేవుడు తెలియటం అంటే?
జ్ఞానప్రసూన: ఏమీ తెలియకుండుట.

50. జ్ఞానశిశువు: దైవానుభవం అంటే?
జ్ఞానప్రసూన: ఏ అనుభవమూ లేకుండుట.

51. జ్ఞానశిశువు: దేవుణ్ణి ఏం కోరాలి?
జ్ఞానప్రసూన: కోరికలు లేని స్థితిని.

52. జ్ఞానశిశువు: ఏది సమాధానం?
జ్ఞానప్రసూన: ప్రశ్నే పుట్టని స్థితి.

53. జ్ఞానశిశువు: ఎవడు ఋషి?
జ్ఞానప్రసూన: దైవుణ్ణి మ్రింగేసినవాడు.

54. జ్ఞానశిశువు: ఎవడు కళాకారుడు?
జ్ఞానప్రసూన: దేవుడు జీర్ణం కాక వమనం చేసుకునేవాడు.

55. జ్ఞానశిశువు: బంధం అంటే?
జ్ఞానప్రసూన: తానెవరో మరచిపోవడం.

56. జ్ఞానశిశువు: సాధన అంటే?
జ్ఞానప్రసూన: తానెవరో జ్ఞప్తికి తెచ్చుకొనే ప్రయత్నం.

57. జ్ఞానశిశువు: సిద్ధి అంటే?
జ్ఞానప్రసూన: తానెవరో జ్ఞప్తికి రావడం.

58. జ్ఞానశిశువు: తలంపుకు కారణమేది?
జ్ఞానప్రసూన: తలంపబడేది కూడా తానే అని జ్ఞప్తి లేకపోవడం.

59. జ్ఞానశిశువు: కోరికకు కారణమేమి?
జ్ఞానప్రసూన: కోరబడేది కూడా తానే అని జ్ఞప్తి లేకపోవడం.

60. జ్ఞానశిశువు: శీలం అంటే?
జ్ఞానప్రసూన: అందరిలో దేవుణ్ణి చూడడం.

61. జ్ఞానశిశువు: జ్ఞానం అంటే?
జ్ఞానప్రసూన: దేవుడిలో అందరినీ చూడడం.

62. జ్ఞానశిశువు: బంధం అంటే?
జ్ఞానప్రసూన: మోక్షము కలదు అని ఉండుట.

63. జ్ఞానశిశువు: మోక్షం అంటే?
జ్ఞానప్రసూన: బంధము లేదు అని ఉండుట.

64. జ్ఞానశిశువు: సంపూర్ణ శరణాగతికి గుర్తేమి?
జ్ఞానప్రసూన: నిశ్చింత.

65. జ్ఞానశిశువు: ఆత్మజ్ఞాని అంటే?
జ్ఞానప్రసూన: ఆత్మ ఒక్కటే జ్ఞాని అని ఎఱిగినవాడు.

66. జ్ఞానశిశువు: ఆనందం కావాలంటే ఏం చేయాలి?
జ్ఞానప్రసూన: ఏమీ చేయొద్దు.

67. జ్ఞానశిశువు: సుఖి ఎవడు?
జ్ఞానప్రసూన: సుఖదుఃఖాలు రెండూ లేనివాడు.

68. జ్ఞానశిశువు: మౌనం అంటే?
జ్ఞానప్రసూన: నామరూపాలు లేక "ఉండటం".

69. జ్ఞానశిశువు: అమృతుడు అంటే?
జ్ఞానప్రసూన:పుట్టుక లేనివాడు.

70. జ్ఞానశిశువు: ఆదర్శం అంటే?
జ్ఞానప్రసూన: ఉన్నట్లు కనిపించే 'లేనిది'.

71. జ్ఞానశిశువు: పరమాత్మ ఎలా ఉంటుంది?
జ్ఞానప్రసూన: నిస్తరంగ జలధి వలె.

72. జ్ఞానశిశువు: అంతరాత్మ ఎలా ఉంటుంది?
జ్ఞానప్రసూన: నివాత దీప కళిక వలె.

73. జ్ఞానశిశువు: పరమశాంతికి కారకమైనది ఏది?
జ్ఞానప్రసూన: 'నాకేమీ తెలియదు' అని ఉండడం.

74. జ్ఞానశిశువు: ఋషి ఎవడు?
జ్ఞానప్రసూన: అఖండదృష్టి కలవాడు.

75. జ్ఞానశిశువు : సాధకుడు ఎవడు?
జ్ఞానప్రసూన: దేవుడు ఉండే చోటును వెతికేవాడు.

76. జ్ఞానశిశువు: సిద్ధుడు ఎవడు?
జ్ఞానప్రసూన: దేవుడు లేని చోటును వెతికేవాడు.

77. జ్ఞానశిశువు: సుఖదుఃఖాలకు కారణమేమి?
జ్ఞానప్రసూన: తనకు అన్యం తోయడం.

78. జ్ఞానశిశువు: సర్వజ్ఞుడు అంటే?
జ్ఞానప్రసూన: 'సర్వము' లేనివాడు.

79. జ్ఞానశిశువు: దైవానుగ్రహం అంటే?
జ్ఞానప్రసూన: దైవము అనే 'గ్రహము'.

80. జ్ఞానశిశువు: గుర్వనుగ్రహము అంటే?
జ్ఞానప్రసూన: గురువు అనే 'గ్రహము'.

81. జ్ఞానశిశువు: ఒంటరితనం అంటే?
జ్ఞానప్రసూన: తనను ఎవరూ పట్టించుకోకపోవడం.

82. జ్ఞానశిశువు: ఏకాంతం అంటే?
జ్ఞానప్రసూన: తాను ఎవర్నీ పట్టించుకోకపోవడం.

83. జ్ఞానశిశువు: మాయ అంటే?
జ్ఞానప్రసూన: నామరూపాలు.

84. జ్ఞానశిశువు: ఏది సత్యం?
జ్ఞానప్రసూన: సత్యమే సత్యం.

85. జ్ఞానశిశువు: సృష్టికారణమేమి?
జ్ఞానప్రసూన: అకారణం.

86. జ్ఞానశిశువు: ఏది బంధం?
జ్ఞానప్రసూన: జ్ఞాపకం.

87.జ్ఞానశిశువు: ఏది మోక్షం?
జ్ఞానప్రసూన: మరపు.

88. జ్ఞానశిశువు: మాయ అంటే?
జ్ఞానప్రసూన: కారణం లేని కార్యం.

జ్ఞానశిశువు: బ్రహ్మము అంటే?
కార్యం లేని కారణం.

89. జ్ఞానశిశువు: బంధాన్ని కలిగించేది ఏది?
జ్ఞానప్రసూన: ఆసక్తి.

90. జ్ఞానశిశువు: బ్రహ్మానందం అంటే?
జ్ఞానప్రసూన: కారణం లేని ఆనందం.

91. జ్ఞానశిశువు: వేదం అంటే?
జ్ఞానప్రసూన: వాద ప్రతివాదాలకు వీలుకాని స్ఫురణ.

92. జ్ఞానశిశువు: జీవన్ముక్తుడు ఎవడు?
జ్ఞానప్రసూన: ఇతరులకు తానుండి, తనకు తాను లేనివాడు.

93. జ్ఞానశిశువు: ఏది కల?
జ్ఞానప్రసూన: మెలకువ.

94. జ్ఞానశిశువు: ఏది మెలకువ?
జ్ఞానప్రసూన: నిద్ర.

95. జ్ఞానశిశువు: సద్గురువు అంటే?
జ్ఞానప్రసూన: గురువు, శిష్యుడు లేనివాడు.

96. జ్ఞానశిశువు: ఎవడు భగవానుడు?
జ్ఞానప్రసూన: భక్తుడై ఉన్నవాడు.

97. జ్ఞానశిశువు: ఎవడు భక్తుడు?
జ్ఞానప్రసూన: భగవానుడై ఉన్నవాడు.

98. జ్ఞానశిశువు: నిరాకారుడు అంటే?
జ్ఞానప్రసూన: ఆకారముల చేత బాధింపబడనివాడు.

99. జ్ఞానశిశువు: నిర్గుణుడు అంటే?
జ్ఞానప్రసూన: గుణముల చేత బాధింపబడనివాడు.

100. జ్ఞానశిశువు: గురువు అంటే?
జ్ఞానప్రసూన: అన్నిటి కన్నా పెద్దది.

101. జ్ఞానశిశువు: ఏది ధర్మం?
జ్ఞానప్రసూన: గెలిచిందంతా.

102. జ్ఞానశిశువు: ఏది అధర్మం?
జ్ఞానప్రసూన: ఓడిందంతా.

103. జ్ఞానశిశువు: ఎవడు బద్ధుడు?
జ్ఞానప్రసూన: తనువులో తానున్నవాడు.

104. జ్ఞానశిశువు: ఎవడు ముక్తుడు?
జ్ఞానప్రసూన: తనలో తనువున్నవాడు.

105.జ్ఞానశిశువు: వేదం అంటే?
జ్ఞానప్రసూన: దేవుని పలవరింత.

106. జ్ఞానశిశువు: ప్రపంచం అంటే?
జ్ఞానప్రసూన: దేవుని కలవరింత.

107. జ్ఞానశిశువు: ప్రధాన బోధ ఏమి?
జ్ఞానప్రసూన: "ఇది ఒక కల".

108 జ్ఞానశిశువు: కర్తవ్యమేమి?
జ్ఞానప్రసూన: ఏమీలేదు.

* * *

సృష్టి ప్రారంభం నుండి వానలు కురుస్తూనే ఉన్నాయి...
నదులు ప్రవహిస్తూనే ఉన్నాయి...
సముద్రం నిండుగానే ఉన్నది....

అలాగే ఆదిగురు దక్షిణామూర్తి నుంచి
సద్గురు బోధామృతవర్షం కురుస్తూనే ఉన్నది.
వేదనది జీవనది ప్రవహిస్తూనే ఉన్నది.
దైవం పూర్ణంగానే ఉన్నది.

* * *

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క నది ఒక్కొక్క పేరుతో, ఒక్కొక్క విశిష్టతను కలిగి ప్రవహిస్తున్నట్లు...

మహనీయులు ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క పేరుతో ఒక్కొక్క జీవనశైలిలో కనిపిస్తూ తత్త్వవైభవాన్ని ప్రకటిస్తుంటారు.

లోకాన్ని ఉద్ధరించాలనే ప్రత్యేక సంకల్పమేమీ వారికుండదుగాని, వారి ఉనికే లోకానికి శ్రేయస్సును చేకూరుస్తుంది.

* * *

ఆయా ప్రాంత ప్రజల శరీరోగ్యానికి  అనుగుణమైన ఔషధ గుణాలు కలిగిన ఫలాలు, మూలికలు ఆయా ప్రాంతాల్లోనే విశేషంగా పండుతాయి.

అదేవిధంగా ఆయా ప్రాంతప్రజల స్వభావ, సంస్కారాలకు తగినట్లు మహనీయులు ఆయా ప్రాంతాల్లో అవతరిస్తుంటారు.

ఓ ప్రాంతంలో అవతరించిన మహనీయుడు
ఆ ప్రాంతప్రజల యొక్క ఆధ్యాత్మిక పరిణితికి ప్రతిరూపంగానే
భావించవలసి ఉంటుంది.

షిరిడీలో బాబా మహిమలను ప్రకటించారు.
అక్కడ అది అవసరం.

అరుణాచలంలో రమణుడు మహిమలేవీ చూపలేదు..."నిన్ను నీవు తెలుసుకో" అన్న జ్ఞానసూత్రాన్ని మాత్రమే నొక్కి వక్కాణించారు.
ఇక్కడ ఇది అవసరం.

ఈ ఇద్దరి "మహనీయత"లో తేడా ఏమీ లేదు.

ఆయా ప్రాంత ప్రజల ఆధ్యాత్మిక పరిణితిని బట్టి వారు ఆ విధంగా ఉండవలసి వస్తుంది.

* * *

కాబట్టి గురువును వెతుక్కుంటూ ఏ సుదూర ప్రాంతాలకో వెళ్లవలసిన అవసరం లేదు.

ఏ కాలంలోనో ఏ గురువులో బోధించిన ఉపదేశాలూ అవసరం లేదు.

నీ ఆర్తి నిజమైనప్పుడు
నీ ప్రశ్న నిజమైనప్పుడు
'గురువు' నీ పరిధిలోకే వచ్చి నిన్ను తప్పక అనుగ్రహిస్తాడు,
సమాధానపరుస్తాడు.

* * *

అటువంటి ఆర్తి, జిజ్ఞాస కలిగిన ముముక్షువులను అనుగ్రహించడానికి "జ్ఞానప్రసూనాంబ" సద్గురు సుబ్రహ్మణ్యులుగా అవతరించి శ్రీకాళహస్తి ప్రాంతములో నడయాడుచున్నది.

* * *

బెల్లం చుట్టూ చీమలు చేరినట్లు
ఆ జ్ఞానరుచిని ఎరిగిన కొంతమంది జ్ఞానశిశువులు వారి చుట్టూ చేరి
"సత్సంగం" ఏర్పాటుచేసుకున్నారు.

అది 1990 నుండి నిరంతరాయంగా ఆ జ్ఞానప్రవాహం ప్రవహిస్తూనే ఉన్నది.

నేను ఆ ఒడ్డున చేరి నా దోసిళ్లతో పట్టుకున్న ఆ కొద్ది పవిత్రజలమే ఈ "జ్ఞానప్రసూనాలు".

* * *

జ్ఞాని సన్నిధిని మీరు ప్రత్యక్షంగా అనుభవించాలనుకుంటే,

మానవరూపంలో ఉన్న దైవాన్ని మీరు కనులారా దర్శించాలనుకుంటే,

భగవద్వాణిని చెవులారా వినాలనుకుంటే

తక్షణం శ్రీకాళహస్తిలో అత్యాశ్రమి అయిన సద్గురు సుబ్రహ్మణ్యుని
దర్శించండి, తరించండి.

* * *

సద్గురు వైభవం
చరిత్రలో నిలిచిపోతుంది.

జ్ఞానప్రసూనాల సుగంధం
లోకమంతా వ్యాపిస్తుంది.

అత్యాశ్రమం యొక్క కీర్తి
కాలాన్ని దాటి అనంతదూరం ప్రవహిస్తుంది.

ఇది సత్యం.

* * *

113. నేను అనామకుడను; అరూపుడను.

---

నిన్న ఒకరు బాబా పుస్తకం ఒకటి ఇచ్చారు....
అలా పేజీలు తిరగేస్తూ విహంగ వీక్షణం చేశాను...
కాసేపటికి వెగటు పుట్టింది...
బాబాను కర్త చేసి, చెప్పిన సంఘటనలతో నిండిపోయింది
ఆ పుస్తకమంతా....

ఏ బాబా చరిత్ర అయినా,
ఏ స్వామి చరిత్ర అయినా,
ఏ గురువుల చరిత్ర అయినా అంతే.
దాని నిండా వారిని "కర్త"గా అభివర్ణించే ఘట్టాలతోనే
నిండిపోయివుంటుంది.

వేదాంతమేమో "కర్త ఒకడే" అంటుంది.
ఆ కర్త ప్రపంచంలో ఉండే అవకాశమే లేదు.

మరి ఇక్కడ ఇంతమంది కర్తలు,
ఇన్ని రకాల జీవితచరిత్రలు
ఎలా పుట్టుకొచ్చాయి?
వీరి జీవితచరిత్రలు నేనెందుకు చదవాలి?

నిజానికి ఆ "ఏకైకకర్త"కు చరిత్ర ఉండదు.
తనకంటూ ఓ చరిత్ర లేక,
అందరి చరిత్రలూ తనవే అయివున్నవాడే భగవంతుడు.
అలాంటప్పుడు నా చరిత్ర కూడా మరో మహనీయుని చరిత్రంత విలువైనదే.
అప్పుడూ నేను ఇంకొకరి చరిత్ర చదువ వలసిన అవసరం లేదు.

గురువుగారు అన్నారు నాతో ఓసారి-
క్రీస్తు మహిమలుండే దేవుడైతే,
నీవు మహిమలు లేని దేవుణ్ణని అనుకో...
దేవుడు అనేది అందరికీ common గా ఉండాల...అన్నారు.

* * *

అరుణాచలం వెళితే భగవాన్ కేంద్రం అవుతున్నాడు.
సత్సంగం వెళితే గురువు కేంద్రం అవుతున్నాడు.
శివాలయం వెళితే శివుడు కేంద్రం అవుతున్నాడు.
రామాయణం తెరిస్తే రాముడు కేంద్రం అవుతున్నాడు.
భాగవతం తెరిస్తే కృష్ణుడు కేంద్రం అవుతున్నాడు.
నేనున్నచోటే నేనుంటే "నేనే" కేంద్రం అవుతాను.

* * *

"అది నీవే" అని వేదములు ఘోషిస్తుంటే

నేనది-నేనిదికాదు అనుకోవడం
మనకు మనో బలం లేనందువల్లనే.

"అది" (పరబ్రహ్మము)
నేను-నేను అంటూ ఆ జ్ఞాన దీపం
స్వరూపంగా మన హృదయంలో
సదా వెలుగుతోంది కదా!

1. నేను ఎవరూ కాదు, ఏదీ కాదు - ఇది భక్తునిస్థితి.
2. అందరూ నేనే, అన్నీ నేనే - ఇది భగవంతునిస్థితి.

రెండూ పరిపూర్ణస్థితులే.
ఈ రెంటిలో నేను ఏ స్థితిలో ఉన్నా సరే
నాకు నామరూపాలుండే అవకాశం లేదు.

ఈ రెండూ కానివానికే నామరూపాలుండేది.
వాడినే మనం "సంసారి" అనేది.

పరిమితభావమే - సంసారం.
అనంతభావమే - ఆధ్యాత్మికం.

నాది లో నేను ఉంటే - అది  కారాగారం.
నేను లో నాది ఉంటే - అది మోక్షానందం.

* * *

'నేను' అనేది ఏకవస్తువు.

'నేను'కు-
ఈ వైపు భాగానికి మనస్సు అని పేరు.
ఆ వైపు భాగానికి ఆత్మ అని పేరు.

మనసు అంతర్ముఖమైతే
అదే ఆత్మగా విరాజిల్లుతుంది.

ఆత్మ బహిర్ముఖమైతే
అదే మనసుగా ప్రవర్తిల్లుతుంది.

"ఆ సద్వస్తువు ఒక్కటే. అది నీవే."

అని వేదఋషుల నుండి రమణమహర్షి వఱకు
అందరూ చెబుతూనే ఉన్నారు....

మనం వింటేగా....
అందులో స్థిరంగా ఉంటేగా....

ఎప్పుడూ ప్రశ్నలే...

అందుకే భగవాన్ "ప్రశ్నించేవాణ్ణి ప్రశ్నించు" అని
మనల్ని మూలానికి తీసుకెళ్లే మార్గాన్ని బోధించారు.

"నేనెవడను?" అనేదానికి సమాధానం దొరికితే
మిగతా అన్ని ప్రశ్నలకూ అదే సమాధానం అవుతుంది.

* * *

అహంమూలాన్వేషణ కూడా చేయనక్కర్లేదు....

"నిరంతరం నేను-నేను అంటూ జపం చేయండి చాలు...అదే మిమ్మల్ని
మూలానీకి తీసుకెళుతుంది...
అని ఇంకా సులభమైన మార్గాన్ని ప్రబోధించారు గురువుగారు...

భక్తుడు రామ-రామ అంటూ జపిస్తాడు.
జ్ఞాని నేను-నేను అంటూ జపిస్తాడు.

రామ అన్నా,
నేను అన్నా ఒకటే.

ఒకే సద్వస్తువుకున్న రెండు పేర్లవి.

* * *

అనిలాచలశివమాల లో ఇలా వ్రాశారు గురుదేవులవారు....

"అహమహమని అన్నిటి లోగుహలలో
అలరుచునుంటివె అనిలాచలా!"

తనలోనే ఆ సద్వస్తువు ఉందని తెలియడం - భక్తియోగం.

ఆ సద్వస్తువే తానని ఉండడం - జ్ఞానయోగం.

* * *

114. "లెక్క" లేనితనమే స్థితప్రజ్ఞత

---

2020 దసరా .....నేను, దేవీప్రసాదు గురుసన్నిధికి వెళ్లాం...

గురువుగారి మనవరాలు పద్మావతి వేడివేడి టీ ఇచ్చారు....

గురువుగారు సిగరెట్ త్రాగుతున్నారు...

వారి సన్నిధిలో సహజ సుందరంగా ఉండే మౌనాన్ని ఆస్వాదిస్తూ టీని సిప్ చేస్తూ ఎంజాయ్ చేశాం...

ఆ తరువాత గురువుగారు తలా ఒక ఆపిల్ ఇచ్చారు....

దసరా రోజున జ్ఞానాంబ ప్రసాదం...

షాప్ లో తిందామని సంచిలో వేసుకున్నా....

గురుసన్నిధి నుండి మా షాప్ వద్దకు రాగానే....

జడలు కట్టిన అమ్మవారు(అవధూత) పడుకుని ఉన్నారు....

గురువుగారు ఇచ్చిన ఆపిల్ ఆ అమ్మకు ఇచ్చాను....

చేతికి తీసుకున్న వెంటనే నోట్లో పెట్లో పెట్టుకుని ఆవురావుమని తిన్నారు.....

నా మిత్రుడు  దేవీప్రసాద్ కూడా తన ఆపిల్ ఆమెకు ఇచ్చేశాడు....

మా వైపు కన్నెత్తి కూడా చూడకుండా అక్కణ్ణుంచి లేచి వెళ్లిపోయారు....

కృతజ్ఞత, గుర్తింపు చూపకుండా అలా వెళ్లిపోవడం అవధూత  లక్షణాలలో ఒకటి....

గురువుగారు అంటుంటారు....

దక్షిణ ఇచ్చిన సంగతి ఇచ్చినవాడు ఇచ్చినట్టూ మరచిపోవాలి....
తీసుకున్నవాడు తీసుకున్నట్టూ మరచిపోవాలి...
అప్పుడే ఆ దక్షిణ వలన ఫలం...అని అంటారు.

ఎవరైనా గురువుగారి చేతికి డబ్బు ఇవ్వబోతే....చేతికి తీసుకోరు....

అక్కడ పటాల వద్ద పెట్టండి....అంటారు....

వారు దక్షిణగా ఎంత ఇచ్చారు? అనేది అస్సలు చూడరు...

తీసి అలాగే జేబులో పెట్టుకుంటారు....
అలాగే తీసి ఖర్చు పెట్టేస్తుంటారు....

నాలా రోజూ  జమాఖర్చులు వ్రాసుకోరు....

నీవు లెక్క వ్రాసుకుంటే దేవుడు కూడా లెక్క వ్రాసుకుంటాడు...

లెక్క వ్రాయకుంటే దేవుడు కూడా లెక్క వ్రాసుకోడు...

నీ లెక్కే దేవుని లెక్క.

దేవుడికంటూ ఓ లెక్క ఉండదు....అంటారు గురువుగారు...

నిజంగా "లెక్కలేనితనమే" స్థితప్రజ్ఞత.

* * *

సాధన అవసరం అని అన్నప్పుడు ఎంతమంది సాధన చేస్తున్నారో

సాధన అవసరం లేదు అని మేం(గురువుగారు) అన్నప్పుడు కూడా

అంతమందే ఆ స్థితిలో ఉండగలుగుతారు.

ఏ బోధా అందరికీ కాదు.....

విత్తనాలు చల్లినప్పుడు భూమిలో పడినవి ఫలిస్తాయి,
రాతిమీద పడినవి ఫలించవు.

సామాన్యులు, మహనీయులు  ఇద్దరున్నారని ఉపనిషత్ ఋషులు వారిని అనుసరించి రెండు బోధలు చేయలేదు.

తాము అనుభవించినదానిని పలవరించారు అంతే.

రమణులు కూడా తానై చెప్పిన ప్రతి మాటా సాధనకు అతీతమైనదిగానే ఉండినది.

కానీ ప్రశ్న అడిగినవాని మనఃస్థితిని బట్టి కూడా రకరకాల మార్గాలనూ సమర్థించారు...

మూలం ఒకటే...మార్గం ఒకటే...
ఆత్మవిచారణే ఏకైక మార్గం అనీ చెప్పారు.

రామనామం జపించుకుంటున్నాను స్వామీ....అంటే
జపించుకో అనీ చెప్పారు.

అన్నింటినీ ఆమోదించడం మహనీయులకు ఉండే సహజసిద్ధమైన లక్షణం.

యెందుకంటే,

అన్ని నదులూ సముద్రం వైపుకే...
అన్ని దారులూ కేంద్రం వైపుకే...
అని వారికి తెలుసు.

* * *

ఆ పరమపదంలో స్థిరమై ఉన్న గురువులకు
సామాన్యుడు కనబడడు.
సాధన అన్నమాట అనడు.
అది అంతే.

నీవెవరినైతే సామాన్యుడు అంటున్నావో
వీడు మన బోధలకు లొంగడు.
వీణ్ణి సాధన ఆపమన్నా ఆపడు.
ఇది ఇంతే.

సాధనలతో బ్రహ్మర్షిత్వాన్ని సాధించినవాడు విశ్వామిత్రుడు.

ఏ సాధనా చేయక ఋషిత్వాన్ని పొందినవాడు
తిరుచ్చిళి రమణుడు.

* * *

మనం విశ్వామిత్రుడిలా తపస్సూ చేయలేము.
రమణుడిలా ఊరకా ఉండలేము.

మనకు అన్ని సంసారిక బంధాలూ ఉంటూనే
ఆత్మసాక్షాత్కారం పొందే చిట్కాల కోసం పుస్తకాల్లో వెతుకుతాం,
గురువులను ఆశ్రయిస్తాం.

చిట్కాలు చిట్కాలుగానే ఉన్నాయి...
మన చింతలు చింతలుగానే ఉన్నాయి...

ఈ ఆధునిక సౌకర్యాల మధ్య ఆ ప్రాచీనమైన ఋషులకథలు చదువుతాం....

ఈ సౌకర్యాలూ వదులుకోలేము
తపస్సులు చేయడానికి అడవులకూ వెళ్లలేము.
కానీ ఋషుల పొందిన ఆత్మానుభవాన్ని మాత్రం సులభంగా కొట్టేయాలి....

మనం ఏ సాధన చేసినా 'షో' యెక్కువ,
సత్తా తక్కువ.

6 నుండి 7 వరకు ధ్యానం అనే టైంటేబుల్ సాధనల వలన ఒరిగేదేమీ ఉండదు.
ఆ కాసేపు రిలాక్స్ మనం బ్రహ్మపదం పొందేశామన్న ఫీలింగుతో ప్రపంచాన్ని చూస్తాం.

ప్రపంచమేమో మనల్ని గుర్తించదు...అదో పెద్ద సమస్య...

ధ్యానం చేయండి....అంటూ ప్రచారాలు...
ఈ ప్రచారం యొక్క ముఖ్య ఉద్దేశం ఏమంటే నేను గొప్ప ధ్యానపరుణ్ణి అని లోకానికి చాటి చెప్పడమన్నమాట...

నీవు పొందడం నిజమైతే
పొందనివాడంటూ నీకు కనబడడు.
అంటారు గురువుగారు.

పొందనివాడే, అందరూ పొందాలి...అంటూ ప్రచారం చేస్తుంటాడు....

పొందినవాడు ఊరక ఉంటాడు.
అడిగినవాడికి కూడా 'ఊరకే ఉండు' అని బోధిస్తాడు.

* * *

జీవుల్లో భేదాలను చూడడానికి చూసేవాడి సంకల్పమే కారణం.
కుండలు, మూకుడు లాంటివి భూమిలో నుంచి మొలుస్తాయా? అని

అడుగుతారు జ్ఞానేశ్వరులు...
కుమ్మరి బుద్ధితోనే అవన్నీ తయారవుతాయి...
* * *
-జ్ఞానశిశువు
9533667918

---

మాటల్లో కాఠిన్యం.
మనసులో కారుణ్యం.

అవధూత చేష్టలు.
అమ్మతనపు ఛాయలు.

అలిగితే అమ్మ పోలిక.
కరగడంలో అయ్య పోలిక.

పాల్ బ్రంటన్ ను మరువదు.
రమణ సమాజం.
జ్ఞానశిశువును మరువదు
రమణసత్సంగం.

ఎవరు ఆ పేరు పెట్టారో తెలియదు
జ్ఞానశిశువని...
అందుకే నిలువెల్లా శిశు లక్షణాలే.

ఈ పాడులోకపు వాసనలు ఇంకా పూర్తిగా
వంటబట్టించుకోని భోళాశంకరుడు.

సద్గురు సుబ్రహ్మణ్యుల పాదాలను
జ్ఞానప్రసూనాలతో పూజించే పూజారికి
ఏమిచ్చి ఋణం తీర్చుకోగలం?

మూడు దశాబ్దాల తన జీవితకాలాన్ని
సద్గురు సమక్షంలో గడిపిన ఈ ధన్యజీవిని చూసి
దేవతలు సైతం ఈర్ష్యపడవలసిందే...

ఈ జ్ఞానశిశువు యొక్క కేరింతలు విశ్వమంతా వ్యాపించాలని...
జ్ఞానశిశువు పంచే జ్ఞానామృతం మాలో కల్మషాలను కడిగి
ఎటువంటి అరమరికలు లేకుండా
మన రమణసత్సంగ వైభవం దశదిశలా వ్యాపించాలని ఆశిస్తూ...

- ఇంజం వేంకటనరసయ్య
ఖమ్మం.

* * *

ఆహా! ఏమి!! 'నా గురువు' గ్రంథం!!
ఇది భగవంతుడు జగత్తుకు ప్రసాదించిన మరో సచ్ఛరిత్ర.

ఎన్ని సార్లు చదివినా... చదివిన ప్రతిసారీ నిత్యనూతనంగా, మధురంగా వుంటుంది.
చివరకు మౌనంలోకి తీసుకువెళ్తుంది.
సాయిసచ్ఛరిత్ర పారాయణము చేస్తున్నట్లు భవిష్యత్ లో 'నా గురువు' వ్యాసాలను పారాయణం చేస్తారు.
11సార్లు పారాయణం చేయగానే-
మనసు జ్ఞాన కర్మేంద్రియాలు భగవంతుని పరమై
సత్యంగా నిలిచిపోతారు సందేహం లేదు.

- రాధిక, వైజాగ్

* * *

115. నేనే ప్రశ్న - నేనే సమాధానం

---

1. బాబు: నేనే ప్రశ్న - నేనే సమాధానం గ్రంథం చదవడానికి అర్హత ఏమి?

సద్గురు: ఆర్తి(నిజమైన అవసరం)

2. బాబు: నేనే ప్రశ్న - నేనే సమాధానం అంటే అర్థమేమి?

సద్గురు: ప్రశ్నించేవాడే సమాధానం.

3. దేవీప్రసాద్: ప్రశ్నే పుట్టని స్థితిని సాధించడం ఎలా?

సద్గురు: 'నేను' పుట్టు చోటుకు చేరుకుంటే సరి.

4. బాబు: తలంపులను అణచి ఆత్మను తెలుసుకోవాలని అంటారు...

సద్గురు: ఇది చాలా శ్రమతో కూడిన సాధన.
"తలంపురూపంగా ఉన్నది ఆత్మయే" అని తెలుసుకుంటే, తరువాత తలంపులున్నా నీవు తలవనివాడివే అవుతావు.

5. బాబు: భగవత్సాక్షాత్కారం అంటే?

సద్గురు: మనం ఇక్కడ పదిమంది ఉన్నాం...
పదకొండవవాడు కాడు భగవంతుడు.
మన పదిమంది రూపాల్లో ఉండేది భగవంతుడే అని తెలుసుకుంటే అదే భగవత్సాక్షాత్కారం.

6. బాబు: ప్రత్యేకించి సాధన అవసరం లేదంటారా?

సద్గురు: అవసరం లేదు...
"అతడే నేను" అన్న జ్ఞప్తి ఉంటే చాలు.

7. బాబు: మరి దేశంలో ఇన్ని ధ్యానకేంద్రాలు ఇబ్బడిముబ్బడిగా వెలిశాయి...

సద్గురు: (నవ్వుతూ) ఈ ధ్యాన కేంద్రాలలో సాధన చేయడం కంటే శ్మశానంలో ఏదయినా సమాధి అరుగుమీద కాసేపు కూర్చొని గడపడం మంచిది.
అంతకు మించిన సాధనే లేదు.
ఆ సమయం నీకు ఎన్నో జీవితసత్యాలను ప్రబోధిస్తుంది.

8. బాబు: సన్న్యాసం తీసుకునే ముందు తల్లి లేదా భార్య అనుమతి తప్పనిసరి అంటారే...

సద్గురు: పొందవలసినదానిని పొందిన తరువాత సన్న్యాసం తీసుకున్నవారికి ఎవరి అనుమతీ అవసరం లేదు.
ఉదా. శ్రీరమణమహర్షి

సన్న్యాసం తీసుకొని పొందాలనుకునేవారు తప్పనిసరిగా తల్లి లేదా భార్య అనుమతి తప్పనిసరి.
ఉదా. శ్రీఆదిశంకరులు

9. చిలకమ్మ: ఇక ఈ జన్మ చాలు అనుకుంటున్నాను స్వామీ....

సద్గురు: కథలోని ఓ పాత్ర, ఇక నాకు ఈ పాత్ర చాలు...అనుకుని రచయితకు తెలియకుండా కథలోంచి విరమించుకునే వీలు ఆ పాత్రకు ఉంటుందా?

ఏ పాత్ర ఎప్పుడు ప్రవేశపెట్టాలో,
ఎప్పుడు నిష్క్రమింపచేయాలో
విశ్వకథారచయిత అయిన భగవంతుని ఇచ్ఛానుసారంగానే జరుగుతుంది.

10. శశిరేఖ: లోకాన్ని ఉద్ధరించడం కాదు,
ముందు నిన్ను నీవు ఉద్ధరించుకో అని రమణభగవానులు అన్నారు...

లోకోద్ధరణే మోక్షదాయకమన్నట్లు వివేకానందులు ప్రబోధించారు...

ఏది సరి?

సద్గురు: అంతర్ముఖంలో తనను తాను చూసుకునే ఉపాయాన్ని బోధించినవారు - శ్రీరమణులు.

బహిర్ముఖంలో తనను తాను చూసుకునే ఉపాయాన్ని బోధించినవారు - వివేకానందులు.

11. పట్టెయ్య: ఈ ఆధ్యాత్మిక జ్ఞానం వలన దేనికీ అంటని స్థితి నాకు కలిగిందండీ....

సద్గురు: మంచిది...ఇక పట్టెయ్యను కూడా అంటనిస్థితిని సాధించు...

12. గురప్ప: రమణభగవానులు తాను అవతారపురుషుడనని ఎక్కడైనా చెప్పి వున్నారా?

సద్గురు: చెప్పి ఉండేవాడే, కాని చెప్పడానికి ఆయనకు ఇతరం కనిపించలేదు.

13. బాబు: గురుదక్షిణ గురించి చెప్పండీ...

సద్గురు: నీవు ఎవరికి ఏమి ఇచ్చినా, తనకు తాను ఇచ్చుకున్నట్టుగా నీకు అనిపిస్తే అదే గురుదక్షిణ.

14. హరి: మోక్షం అంటే ఏమిటి?

సద్గురు: దైవం కంటే భిన్నంగా ఏమీ లేదు...
నేను కూడా దైవమే అన్న అనుభవమే మోక్షం.

15. సద్గురు: బాబూ! ఈరోజు నీవు ఒక్కసారైనా "ఈ జాగ్రదవస్థ స్వప్నం లాంటిదే" అన్న జ్ఞప్తి కలిగిందా?

బాబు: లేదండీ...

సద్గురు: అయితే ఈ రోజు నీవు ఒక్కసారి కూడా భగవంతుణ్ణి తలవనట్లే.

"ఈ జాగ్రదవస్థ స్వప్నం లాంటిదే" అన్న జ్ఞానం ఒక్కటుంటే చాలు...అన్ని జ్ఞానాలూ నీకున్నట్లే. సదా భగవంతుణ్ణి నీవు తలుస్తున్నట్లే.

16. బాబు: ఆత్మ అంటే?

సద్గురు: ఒక వస్తువు వుండాలంటే, కొంత అవకాశం ఉండాలి కదా! అలాగే సకలసృష్టికి ఆధారమైన విశ్వాంతరాళము ఉండటానికి అవకాశంగా ఉన్నదేదో అదే ఆత్మ.

17. బాబు: పురుషోత్తముడు అంటే?

సద్గురు: ఉత్తమపురుషము(నేను) యొక్క తత్త్వాన్ని ఎఱిగినవాడు.

18. చిలకమ్మ: ఎందుకు నేను ఈ బాధలు పడాలి?

సద్గురు : ఎందుకు పడకూడదు?

19. చిలకమ్మ: జ్ఞానులు పొందిన స్థితిని నేనెందుకు పొందలేకపోతున్నాను?

సద్గురు: అలా చెప్పిన జ్ఞాని యెవరు?

20. చిలకమ్మ: ఆలస్యాన్ని భరించలేకున్నాను...
త్వరగా ముక్తిని పొందటానికి మార్గం చూపండీ...

సద్గురు: మీరు మీ ఇంటికి(స్వస్థానానికి) చేరడానికి మార్గం ఎవరు చూపగలరు?

21. బాబు: బ్రహ్మము అంటే?

సద్గురు: ఏ మనస్సయితే తనతో సహా సకలాన్ని త్రోసివేస్తుందో...
ఏ మనస్సయితే తనతో సహా సకలాన్ని తనలో ఇముడ్చుకుంటుందో
ఆ మనస్సే బ్రహ్మము.

22. బాబు: భగవద్గీత సారమేమి?

సద్గురు: Don't Expect...

23. బాబు: ఆత్మానుభవం అంటే?

సద్గురు: ఉన్నది ఉన్నట్లుగా, ఒకటిని ఒకటిగా, దానినే అదిగా, తననే తానుగా అనుభవించడమే ఆత్మానుభవము.

24. సద్గురు: జ్ఞానాన్ని మనం సంపాదించేది కాదు.
జ్ఞానం ఎవరిని ఎన్నుకుంటుందో వారే జ్ఞానులవుతారు.

చిన్నా:  అది కొంతమందినే ఎందుకు ఎన్నుకుంటుంది?

సద్గురు: దాని గురించి ఇదమిత్థంగా ఏమీ చెప్పలేం.

25. అన్నాజీరావు: రమణభగవానులు ఆధ్యాత్మికంలో ఎవరెస్ట్ శిఖరానికి చేరుకున్నవారు.
కానీ క్రిందనున్నవాళ్లకి ఓ త్రాడు వేసి పైకి ఎక్కించాలి కదా...!

సద్గురు: త్రాడు వేసి పైకి లాగాలనే ఉంది భగవానుకు. కానీ అక్కడ (తనకు విడిగా) ఎవరూ కనిపించలేదే!

26. హరి: సాధన అవసరమా? కాదా?

సద్గురు: అవసరమైనట్టు అనిపిస్తుంది...
కానీ అవసరం లేదు.

27. వరలక్ష్మి: నాకు మంచి ఉపాసన చెప్పండీ...

సద్గురు: అందరూ "ఒక్కడి"లో ఉన్నారు.
ఆ ఒక్కడే అందరిలో ఉన్నాడు.
అని సదా స్మరించుకోండి....

28. బాబు: తనకు ఓ గురువు వుండి, మరో గురువు చేసిన ఉపదేశాన్ని స్వీకరించవచ్చా?

సద్గురు: ఈశ్వరుడే దిగివచ్చి చెప్పినా సరే స్వీకరించవద్దు.
నీ గురువాక్కే నీకు పరమప్రమాణం.

29. శైలజ: గురువుగారూ! మీ ఆశీర్వాదం కావాలండీ...

సద్గురు: అది ఎప్పుడు లేదో చెప్పండీ...

30. బాబు: పొందటంలో శాస్త్రప్రయోజనం ఉన్నదా?

సద్గురు: శాస్త్రం వలన పొందటం జరుగదు.
పొందవలసినదానిని పొందిన తరువాత శాస్త్రం రూఢి పరుస్తుంది.
అంతవఱకే శాస్త్రప్రయోజనం.

31. చెంచురామయ్య: చూడండి స్వామీ...!
ఆ కొట్టువాడి మోసం...
రూపాయికి ఎంత కొద్ది కర్పూరం ఇచ్చాడో...

సద్గురు: ఎంత కర్పూరం వెలిగించావో అన్నది ముఖ్యం కాదు...
ఎంత ఖర్చు పెట్టావో అన్నదే ముఖ్యం.

వాడు చేసింది వాడి ఖాతాలోకి పోతుంది.
నువ్వు చేసింది నీ ఖాతాలోకి పోతుంది.

32. బాబు: ప్రాణానికి, చైతన్యానికి తేడా ఏమిటి?

సద్గురు: ప్రాణం లబ్-డబ్ అంటుంది.
చైతన్యం నేను-నేను అంటుంది.

33. సుబ్బు: ఆనందంగా ఉంటాలంటే ఏంచేయాలి?

సద్గురు: ఏమీ చేయొద్దు...
నీవు ఏంచేసినా సరే
అది నిశ్చలంగా ఉన్న నీటిలో రాయి వేయడమే.

34. పట్టెయ్య: గురువుగారూ! మీతో కలిసి అరుణాచల ప్రదక్షిణం చేయాలని ఉంది...

సద్గురు: అరుణాచలమే నా చుట్టూ ప్రదక్షిణం చేస్తోంది...

35. కుమారస్వామి: గురువుగారూ! మా మిత్రుడు బత్తెయ్య చనిపోయాడు...

సద్గురు: మనం మాత్రం బ్రతికన్నామా కుమారస్వామీ...

36. వీరబాబు: గురువుగారూ! అరుణాచలప్రదక్షిణం చేయడానికి పౌర్ణమి ఘడియలు ఎప్పుడున్నాయో చెబుతారా?

సద్గురు: నీవెప్పుడు గిరిప్రదక్షిణ చేస్తావో, అప్పుడే పౌర్ణమి.

37. విజయమ్మ: న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైక అమృతత్వ మానశుః అని శ్రుతివాక్యం...
త్యాగం చేయడమెట్లా?

సద్గురు: నీదంటూ ఏదన్నా ఉన్నదా? ముందు తేల్చు....తర్వాత దానిని ఎట్లా త్యాగం చేయాలనేది తర్వాత ఆలోచిద్దాం...

38. బాబు: జీవిత లక్ష్యమేమి?

సద్గురు: జీవించడమే.

39. పట్టెయ్య: అన్నింటిలో చైతన్యం ఉంది కదా?

సద్గురు: చైతన్యంలో అన్నీ ఉన్నాయి.

40. బాబు: ఆత్మప్రదక్షిణ అంటే?

సద్గురు: అచలంగా ఉండడం.

41. మునెయ్య: అందరూ రమణమహర్షుల్లా అయిపోతే లోకం జరిగేదెట్లా?

సద్గురు: అందరి సంగతి వదిలేయ్! ముందు నువ్వు అవ్వు చూద్దాం...

42. బాబు: యెవడు నమస్కార యోగ్యుడు?

సద్గురు: "నాకు బాధలే లేవు" అని యెవడైనా అంటే, వాడే నమస్కార యోగ్యుడు.

43. ప్రశ్న: దేవుడెక్కడున్నాడు?

సద్గురు: నీలోనే ఉన్నాడు.
నీవుగానే ఉన్నాడు.

44. ప్రశ్న: సన్న్యాసి ధనరూపేణా దక్షిణ స్వీకరించవచ్చా?

సద్గురు: స్వీకరించవచ్చు....కానీ చీకటి పడేలోపు మొత్తం ఖర్చు చేసేయాలి. అప్పుడే ఆ దక్షిణ వలన దోషం ఉండదు.

45. డాక్టర్ మురుగేశన్: స్వామీ! నా ప్రాక్టీసు బాగా జరిగేటట్టు ఆశీర్వదించండీ...

సద్గురు: అంటే లోకంలో రోగులు పెరగాలనా నీ ఉద్దేశం? ఈ విధమైన ప్రార్థన సరికాదు. రోగి రోగం ఉండి నీ వద్దకు రాడు. నిన్ను అనుగ్రహించడానికిగాను భగవంతుడే రోగి రూపంలో వస్తాడని ఎఱుక కలిగి వైద్యం చేయి...

46. ఒకరు: ఇల్లు ఈశాన్యం వైపుకు తిరిగి ఉంటే మంచిదని అంటారు...

సద్గురు: బుద్ధి ఈశాన్యం(అధిపతి ఈశ్వరుడు)వైపుకు తిరిగి ఉంటే మంచిది.

47. ఒకరు: ఓ మంచి ఆధ్యాత్మిక సాధన ఏదయినా చెప్పండి...

సద్గురు: ఎప్పుడూ ఎక్కడా నీ సంతకం చేయొద్దు...

48. బాబు: శ్రీరమణాశ్రమంలో పాశ్చాత్య భక్తుల నడవడికలను చూస్తుంటే, మన కల్చర్ ను మన కంటే వాళ్లే బాగా కాపాడుతున్నట్టు అనిపిస్తోంది...

సద్గురు: అవునవును...వాళ్ల కల్చర్ ను మనం కాపాడుతున్నాం కదా...

49. చిలకమ్మ: ఎవర్ని నమ్మాలో, ఎవర్ని నమ్మకూడదో తెలియడం లేదు స్వామీ...

సద్గురు: ముందు చిలకమ్మను నమ్మొద్దు...

50. బాబు: మాయ నిత్యమైనదా? అనిత్యమైనదా?

సద్గురు: "ప్రపంచంలో నేనున్నాను" అన్న వర్గదృష్టిలో మాయ నిత్యమైనది. "నాలో ప్రపంచం ఉన్నది" అన్న వ్యక్తిగతదృష్టిలో మాయ అనిత్యమైనది.

51. ఒకడు: అరుణగిరి ప్రదక్షిణం యొక్క ఫలమేమి?

సద్గురు: "ఇప్పటివఱకు ఎవరూ అరుణగిరి ప్రదక్షిణం చేసిందే లేదు" అని మనసుకు తోయడమే ఫలం.

52. ప్రశ్న: ఈ సృష్టి ఎలా జరిగింది?

సద్గురు: అచలస్వరూపుడైన పరమాత్మునిలో స్వాభావికంగా ఉన్న సంకల్పవైభవమే ఈ మహాసృష్టి.

53. ఒకరు: కామికానివాడు మోక్షగామి కాడు అన్నారు వేమన...

సద్గురు: దాని అర్థం మోక్షాన్ని పొందాలంటే ముందుగా కాముకులుగా ఉండాలనేది ఆయన భావం కాదు. కామి కాకపోతే మోక్షాన్ని కూడా కామించడు(కోరడు)అని భావము.

54. ఒకరు: ధ్యానంలో నా మనసు ఎక్కడెక్కడో తిరుగుతుంటుంది స్వామీ...!

సద్గురు: తిరగనీ... ఆత్మ అనంతము, సర్వవ్యాపకము కదా! మనసు ఎక్కడెక్కడ తిరిగినా అంతా ఆత్మలోనే కదా! తిరగనీ....

55. ప్రశ్న: సహజసమాధి అంటే?

సద్గురు: "అంతా సహజంగా ఉంది" అని ఉండడం.

56. ప్రశ్న: మహామాయ అంటే?

సద్గురు: కారణం వేఱు, కార్యం వేఱు.
ఈ రెంటినీ కలిపి చూపేది ఏదో అదే మాయ.

57. ప్రశ్న: ఏది సత్యం?

సద్గురు: సత్యమే సత్యం.

58. బాబు: దేవుడున్నాడని నమ్ముతాను...
కానీ ఆయన జగత్తును నడిపించే విషయంలో ఓ క్రమత్వం ఉన్నట్టు కనబడదు...

సద్గురు: ఇది క్రమం, అది అక్రమం అని నీవెట్లా నిర్ణయిస్తావు? పరిస్థితులు నీకు అనుకూలంగా ఉంటే, అంతా క్రమంగా ఉందని, ప్రతికూలంగా ఉంటే క్రమం లేదని వాదిస్తావు...అంతేనా?

క్రమం ఉంది...అయితే నీ అభిప్రాయాలతో, నీ అనుభవాలతో దానిని సరి చూడవద్దు...

తెలియనివాడు కంప్యూటర్ విప్పి చూస్తే అంతా గందరగోళంగా కనిపిస్తుంది.
తెలిసినవాడు చూస్తే అందులో ఓ క్రమం కనిపిస్తుంది.

ఇదీ అంతే....

59. బాబు: ప్రతి ఒక్కడు తానే గొప్పని భావిస్తుంటాడు....

సద్గురు: నిజమే...ప్రతి ఒక్కడూ గొప్పవాడే, ప్రతి ఒక్కడూ ఆత్మస్వరూపుడే.

60. బాబు: మహనీయుల జీవితచరిత్రలను పారాయణం చేయడం వలన ముఖ్యప్రయోజనమేమి?

సద్గురు: "ఏ చేయి అయితే ఆ మహనీయులను సృష్టించిందో, ఆ చేయే నన్నూ సృష్టించింది." అన్న జ్ఞానం కలుగుతుంది.

61. ఒకరు: సృష్ట్యాది నుండి ఇప్పటివరకు ఈ భూమ్మీద అవతరించిన మహనీయులందరూ ఇప్పుడెక్కడ వున్నారు?

సద్గురు: నీ గురు రూపంలో ఉన్నారు...

62. ఒకరు: భగవంతుడు ఈ జగత్తును ఎందుకు సృష్టించాడు?

సద్గురు: భగవంతుణ్ణే అడుగు.

63. మధు: దేవుడు యోస్ లెస్ ఫెలో....

సద్గురు: నిజమే అతడు use కావడానికి అతనికి ఇతరం ఎక్కడిది? భగవంతుడు అనంతుడు.

64. వర్మ: నాన్నగారూ! మిమ్మల్ని ఏదైనా అడగొచ్చా?

సద్గురు: ఎప్పుడూ ఎవరినీ ఏమీ అడగని స్థితిని ప్రసాదించమని అడగండి...

65. వర్మ: ఎక్కడైనా అన్యాయం జరుగుతుంటే సహించలేను...రియాక్ట్ అవుతుంటాను...

సద్గురు: డస్ట్ అలెర్జీ లాగా...ఇదొక అలెర్జీ...అంతే.

66. మురుగానంద: స్వామీ...జ్ఞానమార్గమేమో తెలియడంలేదు...

సద్గురు: నీవు పుట్టినప్పటి నుండి ఇప్పటివరకు నడిచిందంతా జ్ఞానమార్గమే...
ఉన్నది అదొక్కటే మార్గం...రెండవది లేదు.

67. బాబు: జన్మ సార్థకం అవ్వాలంటే ఏం చేయాలి?

సద్గురు: ఏమీ చేయొద్దు.
జన్మ ఎత్తేక సార్థక్యం సాధించడం కాదు,
సార్థకం అయ్యాకే జన్మ ఎత్తడం జరుగుతుంది.

68. మురుగానంద: స్వామీ...! మీరు సదా నా వెన్నంటే ఉండి నన్ను రక్షించండి...

సద్గురు: నా వెన్నంటే ఉండి నన్ను రక్షిస్తున్నవాడే నిన్నూ, సకలాన్నీ రక్షిస్తున్నాడు...

69. చిలకమ్మ: నాకు ఈశ్వరుడు ఒక్కడు చాలు...
నాకు ఇంకెవరూ వద్దు...

సద్గురు: ఉండేది ఈశ్వరుడు ఒక్కడే.
ఇంకెవరూ లేరు.

70. బాబు: మఠాలకు, ఆశ్రమాలకు వారసులు అవుతున్నారేగాని, తత్త్వానికి ఎవరూ వారసులు కావడం లేదు...!

సద్గురు: అది వీలుకాదు...

71. బాబు: మీరు టచ్ చేసిన సబ్జక్టు రమణులు కూడా టచ్ చేయలేదు...

సద్గురు: రమణులే ఇక్కడ టచ్ చేస్తున్నారు...

72. ఒకరు: ఇంతకీ మన కర్తవ్యమేమి?

సద్గురు: ఏ కర్తవ్యమూ లేకపోవడమే మన కర్తవ్యం.

73. బాబు: దేవుడు అవసరమా?

సద్గురు: అవసరమే దేవుడు.

74. వర్మ: "బాబు" అనే గొప్ప శిల్పాన్ని చెక్కిన గొప్ప శిల్పి మీరు...

సద్గురు: కాదు కాదు..."సద్గురు" అనే గొప్ప శిల్పాన్ని చెక్కిన గొప్ప శిల్పి బాబు.

75. నాగేశ్వర్: నేను గురువు కోసం వెతుకుతున్నాను....

సద్గురు: నేను శిష్యుని కోసం వెతుకుతున్నాను...
(అందరూ గురువులుగానే కనబడుతున్నారని భావము)

76. కైలాసం(క్షురకుడు): గురువుగారూ! తమరికి ముండనం చేసేటప్పుడు మీ శిరస్సును శివలింగంగా భావిస్తుంటాను...

సద్గురు: మంచిది...ఇది కళ్లుండే శివలింగం.

77. గోవిందరాజులు: నీచం అంటే ఏమి?

సద్గురు: సకలానికి ఆధారమై ఉన్నది. తామరలకు ఆధారమై ఉన్న బురదవలె.

78. బాబు: జ్ఞానిని జ్ఞానే గుర్తించగలడు...

సద్గురు: జ్ఞాని జ్ఞానే అయితే, తాను గుర్తించడానికి తాను తప్ప అన్యమేమీ గోచరించదు.

79. ప్రశ్న: భగవంతుడు పతితపావనుడు అంటారు...దాని అర్థమేమి?

సద్గురు: పతితుడూ అతడే, పావనుడూ అతడే అని అర్థం.

80. పట్టెయ్య: బాబుగారి హస్తాక్షరాలు పేర్చిన ముత్యాల్లా ఉంటాయి స్వామీ....

సద్గురు: పెళ్లికూతుర్ని కాకుండా, పెళ్లికూతురు కట్టుకున్న చీరన మెచ్చుకున్నట్లుంది...అందులో తత్త్వాని వదిలి, అక్షరాల్ని మెచ్చుకోవడం కూడా...

81. బాబు: అరుణాచలంలో ప్లేగు మహమ్మారి వ్యాపించి ఉన్నప్పటికీ రమణుడు అరుణాచలాన్ని వదలలేదు...

సద్గురు: అలాకాదు చెప్పాల్సింది...
అరుణాచలం రమణుణ్ణి వదలలేదు...

82. మురళి: అజ్ఞానం ఎందుకు ఉంది?

సద్గురు: "ఉంది" అనుకుంటున్నావు కాబట్టి...

83. బాబు: శరణాగతి అంటే?

సద్గురు: జీవితమనేది Already షూటింగ్ పూర్తయిపోయి, రిలీజ్ అయిపోయిన సినిమా లాంటిది.

సినిమా పూర్తయ్యే వరకు ఇక నీవు చేయగలిగేది, మార్చగలిగేది ఏమీలేదు. సాక్షిగా ప్రేక్షకుడుగా చూస్తూ ఉండడం తప్ప.

సుఖమైనా, దుఃఖమైనా Face చేయి, Taste చేయి.

అన్నిటికీ సిద్ధపడి ఉండడమే మహాసిద్ధి.
అదే శరణాగతి.

84. రవివర్మ: ఆత్మలో నిలకడగా ఉండలేకపోతున్నాను స్వామీ...రామకృష్ణులు, రమణులు మొదలైనవారు సదా ఆత్మనిష్ఠలో ఉండేవారు కదా...! అలా ఉండాలని నా కోరిక.

సద్గురు: వారు ఉండలేదు...ఉంచబడ్డారు.

85. మురుగానంద: పూర్వమీమాంస, ఉత్తరమీమాంస అంటే ఏమి?

సద్గురు: నీవు పుట్టక ముందు ఉన్న స్థితి - పూర్వమీమాంస.

నీవు గిట్టిన తర్వాత ఉన్న స్థితి - ఉత్తరమీమాంస.

86. ఒకరు: స్వామీ! నేను రుద్రాక్షను ధరించవచ్చా?

సద్గురు: ధరించవచ్చు..."నన్ను రుద్రాక్ష ధరించి ఉంది" అన్న ఎఱుకలో.

87. ప్రసాద్: పీడకలలు అంటారే...!

సద్గురు: మంచి  కలలు, పీడ కలలు అని రెండు లేవు.
కలే పీడ.

88. ప్రశ్న: నేనెవడను?

సద్గురు: ఎవడు అనేదే నేను.

89. రామాంజనేయులు: గురువుగారూ! ఈరోజు 400 మంది శ్రోతలు హాజరయ్యే ఆధ్యాత్మిక సభకు వక్తగా వెళుతున్నాను...

సద్గురు: అంటే 400 మందిని మోసం చేయడానికి వెళుతున్నావన్నమాట...

90. పట్టెయ్య : అంతా భగవదిచ్ఛ అన్నాక, ఇక దేంట్లోనూ వ్రేలు పెట్టకూడదన్నమాట....

సద్గురు: వ్రేలు పెట్టడం కూడా భగవదిచ్ఛే...

91. ఒకరు: మాయను గుఱించి ఒక్కమాటలో చెప్పండీ....

సద్గురు: కల.

92. ప్రశ్న: సద్గురువు అంటే?

సద్గురు: సత్ అంటే ఉన్నది.
గురువు అంటే పెద్దది.

93. చంద్ర రాజు:
ఎప్పుడూ జ్ఞాన నిష్ఠలో ఉండేటట్లు
అనుగ్రహించండి స్వామి...

సద్గురు:
జ్ఞాన నిష్ఠలో ఉండాలనుకోవడమే
పెద్ద అవరోధం.

94. చంద్రరాజు:
స్వర్గ నరకాలు ఉన్నాయా స్వామి...?

సద్గురు:
స్వర్గము ఉంది అనుకోవడమే నరకం.
నరకం లేదు అనుకోవడమే స్వర్గము.

95. బాబు: అరుణాచలం వెళదామని అనుకుంటున్నాను...

సద్గురు: ఆకాశం నుండి వాయువు
వాయువు నుండి అగ్ని
అగ్ని నుండి జలము
జలము నుండి పృథివి వచ్చాయి.

పృథివీ లింగం - కంచి.
జల లింగం - జంబుకేశ్వరం.
అగ్ని లింగం - అరుణాచలం.
వాయు లింగం - శ్రీకాళహస్తి.
ఆకాశ లింగం - చిదంబరం.

ఇవి వరుసగా ఒకదానికంటే మరొకటి గొప్ప క్షేత్రాలు...

కాబట్టి అరుణాచలం కంటే శ్రీకాళహస్తి గొప్ప క్షేత్రం.

శ్రీకాళహస్తి నుండి అరుణాచలానికి ప్రయాణించవలసిన అవసరం లేదు.

అలా ప్రయాణిస్తే ఎదగడం కాదు, దిగడం అవుతుంది.

శ్రీకాళహస్తి నుండి ప్రయాణించి దర్శించవలసిన ఏకైక క్షేత్రం చిదంబరం.

చిదంబర(ఆత్మ)వాసులు ఇంకెక్కడికీ ప్రయాణించవలసిన అవసరం లేదు.

96. ఒకరు: కొన్ని బోధలు మాకు నచ్చలేదు స్వామీ...

సద్గురు: మాక్కూడా నచ్చలేదు.
సత్యానికి మన ఇష్టాయిష్టాలతో పనిలేదు.

97. ఒకరు: సైన్సుకు, ఆధ్యాత్మికానికి తేడా ఏమి?

సద్గురు: సైన్సు అనేది విడువబడిన బాణం యొక్క శక్తిని గుఱించి చెబుతుంది.

ఆధ్యాత్మికం అనేది బాణం విడిచినవాని యొక్క శక్తిని గుఱించి చెబుతుంది.

98. ఒకరు: నా జన్మ తరించడం ఎలా?

సద్గురు: తరించడం సంగతి అలా ఉంచు...
తరించిన తర్వాత నీ ప్రోగ్రాం ఏమి? ఆలోచించు.

99. చిలకమ్మ: ఎందుకు పుట్టామో? ఎందుకు జీవిస్తున్నామో తెలియటం లేదుస్వామీ...!

సద్గురు: మనల్ని భూమ్మీదకు పంపినవానికొక్కనికి మాత్రమే ఆ రహస్యం తెలుసును. భూమ్మీద ఉన్న ఎవ్వడికీ తెలియదు.

100. ఒకరు: ఒక వ్యక్తిని దేవుడని పూజిస్తున్నారు... అది సరియేనా?

సద్గురు: చెట్లని-పుట్లని, నందిని-పందిని దేవుడని కొలిచే సంప్రదాయం మనది. మనిషిని దేవుడని కొలవడం తప్పేముంది?

101. భూపతి: భగవంతుడు జీవుల్ని ఎందుకిట్లా ఆడిస్తున్నాడు?

సద్గురు: వచ్చిన కలను తప్ప
నచ్చిన కలను చూడడం కుదరదు.

102. సొరీస్: సాధన చేశాం, ఇది చేశాం, అది చేశాం అంటారు...ఇదంతా ఏమిటి? ఎప్పుడూ తెరచి ఉన్న తలుపును తట్టడం...

సద్గురు: అసలు దానికి తలుపులూ లేవు, తట్టడమూ లేదు.

103. ఒకరు: స్వామీ...తమరి ఆశ్రమం ఉందా?

సద్గురు: ఆశ్రమం అయితే ఉందిగానీ, అడ్రసు లేదు.

104. ప్రసాద్: నేను స్థిమితంగా
ఉండలేకపోతున్నాను...కారణమేమంటారు?

సద్గురు: నీకున్నది "వద్దు" అనుకోవడం.
నీకు లేనిది "కావాలి" అనుకోవడం.

105. ప్రశ్న: ఏది సత్యం? ఏది అసత్యం?
సద్గురు: బ్రతికేవాడు సత్యం, బ్రతుకంతా అసత్యం.

106. ఒకరు: నేను అనుకున్నట్టు జరగడం లేదు స్వామీ....

సద్గురు: అనుకోవడం అనేది అసహజమైనది.
జరగడం అనేది సహజమైనది.

107. ఒకరు: నేను బాబాను కొలుస్తున్నాను...
అయినా కష్టాలు తొలగడం లేదు...

సద్గురు: అదేమైనా అగ్రిమెంటా?

108. ఒకరు: వేదాంతసారాన్ని ఒక్క ముక్కలో చెప్పండీ...

సద్గురు: ఇది ఒక కల.

* * *

116. నేనే ప్రశ్న - నేనే సమాధానం

---

1. పట్టెయ్య: చలం-అచలం అంటే ఏమి స్వామీ...

సద్గురు  : వాచీ తిరుగుతోందా?

2.పట్టెయ్య: తిరుగుతోంది స్వామీ...

సద్గురు  : మరి 12 క్రిందకు, 6 పైకి వెళ్లాలి కదా?

3.పట్టెయ్య: గడియారం మొత్తంగా చూస్తే కదలదు.

అందులో కొన్ని భాగాలు మాత్రమే కదులుతాయి.

సద్గురు: అలాగే "మొత్తపు తత్త్వం" అచలం.

అందులో కదిలే భాగం ఈ దేహం.

* * *

చేయటంలో చేయకపోవడమూ ఉంది.

చేయకపోవడంలో చేయటమూ ఉంది.

* * *

ఉన్నదంతా నేనే అని నీవుంటే

నీవేమీ చేయనట్టు.

నేను పట్టెయ్యను అని నీవుంటే

నీవు కదులుతున్నట్టు.

* * *

'నేను పట్టెయ్య' అనేది రాంగ్ అడ్రసు.

'నేను మొత్తం' అనేది కరెక్ట్ అడ్రసు.

4. ఒకరు: కడుపే కైలాసం అంటారే! దాని అర్థమేమి స్వామి?

సద్గురు: కడుపే కైలాసం కాదు

గడపే కైలాసం.
నా శరీరమే కైలాసం.

గడపకు ఇవతలున్నది ప్రపంచం.
గడపకు అవతలున్నది పరమపదం.

5. స్వప్న: నాలో సంఘర్షణ ఉంది స్వామీ...అది ఎలా పోవాలి?

సద్గురు: సంఘర్షణ-ప్రశాంతతత రెండూ ఒకటే స్థితి
అని తెలిస్తే సంఘర్షణ ఉండదు.
రెండూ నాలోనివే
అని ఉండడమే పరమశాంతి.

6.స్వప్న: ఏ సాధన చేయాలి స్వామీ...?

సద్గురు: ఏ సాధన చేయాలి?
అని ఆలోచించడం కంటే
ఏ సాధనా చేయకుండా ఉండడం ఎలా?
అని ఆలోచించండి.

7.స్వప్న: ఊరక ఉండడం అంటే?

సద్గురు: 'ఉండుట' అనేదానికి ఏ ప్రయత్నమూ అవసరం లేదు అని అర్థం.
ఏ ప్రయత్నమూ లేకుండా ఉండడమే 'ఉండుట' అనేదానికి అర్థం.

8. భాను: అరుణాచలం అంటే పిచ్చి అండీ మాకు...

సద్గురు: అరుణాచలేశునికి మీరంటే పిచ్చి.

9.సాంబశివరావు: మీ సన్నిధిలో ఉన్నంత శాంతి
మా ఊరెళ్లాక లేదు గురువుగారూ....
మళ్లీ లౌకిక వ్యవహారాలలో మునిగి పోతున్నాను...

సద్గురు: లౌకికం కూడా ఆధ్యాత్మికమే.
ఆధ్యాత్మికం కూడా లౌకికమే.

ఒకే నాణేనికి ఉన్న బొమ్మ-బొరుసు లాంటివి
లౌకికము-ఆధ్యాత్మికము.

లౌకికము-బొమ్మ.
ఆధ్యాత్మికము-బొరుసు.

నాణేనికి రెండూ అవసరమే.
రెంటిలో ఏ ఒక్కటి లేకపోయినా ఆ నాణెం చెల్లదు.

ఏ సమయానికి ఏ విధంగా ఉండడం సంభవిస్తుందో
దానిని అలానే  Accept చేయండి.
ఇదే నిజమైన ఆధ్యాత్మికం.

ఈ రెంటినీ ఏది తెలుసుకుంటున్నదో
అదే తాను అని తెలుసుకోవడమే
నిజమైన ఆధ్యాత్మికం.

నేనే రెండూ అయ్యి, రెండూ కాకనూ
సాక్షిగా ఉన్న తానే "నేను" అని ఉండడమే
నిజమైన ఆధ్యాత్మికం.
* * *

10.ఒకరు: ఆత్మానుభవం ఎలా కలుగుతుంది?

సద్గురు: నీవు లేకపోతే ఉండేది అదే.
ఆ అనుభవం లేకపోవడానికి కారణం నీవే.

నీవుంటే అనుభవం ఉండదు.
అనుభవం ఉంటే నీవుండవు.

నీవే తేల్చుకో...
నీవుండాలో, అనుభవం ఉండాలో.

11.ఒకరు(ఫోన్ ద్వారా): గురువుగారూ! మీరు జ్ఞానప్రసూనాంబ అవతారమని బాబుగారు బుక్స్ లో వ్రాశారు...

సద్గురు: అవునయ్యా...
ఈ ఊరి గ్రామదేవత జ్ఞానాంబ.
ఇక్కడున్న సమస్తమూ ఆమె ఆధీనంలోనిదే.
ప్రతి ఉనికీ, ప్రతి పలుకూ, ప్రతి కదలికా జ్ఞానాంబయే.

12.రామారావు(ఫోన్ లో): త్వరలో మీ పాదాల దగ్గర వాలాలని చూస్తున్నాను స్వామీ....

సద్గురు: ఆ పాదాలు నాకే అగుపడలేదు.
ఇక మీరేం చూస్తారు?

13.స్వప్న: అన్ని సందర్భాల్లో మారని సత్యం ఏది?

సద్గురు: "నేను".

14. స్వప్న: అసలు సత్యం ఏది?

సద్గురు: 'అసలు సత్యం' ఎవరి చేతా గుర్తించబడదు.
'అసలు సత్యమే' నేను-నేను అని అంటుండేది నీలో.
* * *
15.ప్రశ్న: ఇంతకీ నేను కలలో ఉన్నట్టా? మెలకువలో ఉన్నట్టా?

సద్గురు: ఓ నటుడు రాముడుగానూ నటిస్తాడు.
రావణుడుగానూ నటిస్తాడు.
ఇంతకీ ఆ నటుడు రాముడా? రావణుడా?

* * *
రెండూ తానే అనైనా ఉండాలి,
రెండూ తాను కాదు అనైనా ఉండాలి.
* * *
ఒకటి నేను, మరొకటి నేను కాదు
అని ఉన్నప్పుడు నీవు కలలో ఉన్నట్టే.
* * *
రెండూ నేనే అన్నా
రెండూ నేను కాదు అన్నా
నీవు మెలకువలో ఉన్నట్టే.
* * *
బాబు నేను అని ఉన్నప్పుడు
బాబా నేనే రమణుడూ నేనే అని ఉండాలి.
* * *
బాబా, రమణుడు నేను కాదు అన్నప్పుడు
బాబు కూడా నేను కాదని ఉండాలి.
అప్పుడే నీవు మెలకువలో ఉన్నట్టు.
* * *
ఈ ఒక్క బాబు మాత్రమే నేను,
మిగతా నేను కాదు అన్నప్పుడు
నీవు కలలో ఉన్నట్టు.

16. ప్రశ్న: చిజ్జడగ్రంథి అంటే?

సద్గురు: నేను - అనేది చిత్తు.
నాది - అనేది జడము.
ఈ రెండూ కలిస్తేనే వ్యవహారం ఉండేది.
ఇదే చిజ్జడగ్రంథి.
ఈ గ్రంథి(ముడి) వీడినవానికి
కర్తవ్యమూ ఉండదు, వ్యవహారమూ ఉండదు.

17.బాబు: నా కష్టం యెవరికీ రాకూడదు...అంటుంటారు...
సుఖదుఃఖాలనేవి అందరికీ సరాసరిన, సమంగా పంచబడుతుంది...అనే విషయం తెలియకక అలా అంటుంటారు....

సద్గురు: "అందరూ" ఎక్కణ్ణుంచి వచ్చారు?
ఉండేది నీవొక్కడివే.

18.సంతోష్: అనుభవం లేనప్పుడు, మాటలు వలన ప్రయోజనమేమి?

సద్గురు: మాటలు కూడా అనుభవమే.
అనుభవంలో నుంచే మాటలు వస్తాయి.

19.సంతోష్: మీ దృష్టి మాకు కలగడం లేదు...

సద్గురు: "దృష్టి" నిన్నూ, నన్నూ చూస్తోంది.
ఆ "దృష్టి" ఎవరిదీ కాదు, దేనిదీ కాదు.
అది స్వయం.

20.సంతోష్: రమణుడు లాంటి మౌనస్థితి మాకు కలగడం లేదు....

సద్గురు: వారు పొంది మౌనంగా ఉండడం కాదు,
"అది" పొందలేం అని తెలిసి మౌనంగా ఉండడం.

21.సంతోష్: వారికి ఆ స్పష్టతైనా ఉంది కదా...

సద్గురు: "స్పష్టత"లోనే సకలమూ ఉంది.
ఒకరికి కలిగేది కాదు స్పష్టత అనేది.

22. సాంబశివరావు: దుఃఖనివారణలో గురువుల పాత్ర ఏమీ ఉండదా?

సద్గురు: ఏమీ ఉండదండీ...

23.సద్గురు:
కాశిరెడ్డి 20 ఏళ్ల పాటు సత్సంగానికి సేవ చేశారు...
వారి మరణవార్త విన్నప్పుడు కించిత్తు కూడా బాధ కలుగలేదు...
అసలు నేను మనిషినేనా?

శ్రీను: అవును...
నిజమే మీరు మనిషి కాదు...దేవుడు...

మీరు ద్వంద్వాతీతులు...

24.ప్రశ్న: యదార్థజాగ్రత్తు(నిజమైన మెలకువ) అంటారే...అదేమి?

సద్గురు: గాఢనిద్రలో తానున్నాడు అనేది మాత్రమే తెలుస్తున్నది.

అంతకు మించి వివరమేమీ తెలియదు.

ఏ భేదాలు లేని ఆ గాఢనిద్రే నిజమైన మెలకువ.

ఆ మెలకువ ఎవరిదీ కాదు, దేనిదీ కాదు...
అది స్వయం.

ఆ గాఢనిద్రే దైవము, జ్ఞానము, మోక్షము...

* * *

మనం అనుకునే ఈ మెలకువ
నిజానికి ఇదొక కల.

ఇందులో అన్ని భేదాలూ ఉంటాయి.

భేదాలు ఉండడమే 'ఇది కల' అనడానికి ప్రధానమైన గుర్తు.

ఏ భేదమూ తోచకపోవడమే నీవు నిజమైన మెలకువలో(జ్ఞానములో) ఉన్నావని గుర్తు.

* * *

గాఢనిద్రలో ఏకంగా ఉన్న తాను
అనేకం కావాలనే ప్రయత్నమే
ఇప్పుడు మనం అనుభవించే మెలకువ అనేది.

* * *

గాఢనిద్రలోని ఆ ఏకత్వానుభవాన్ని పొందటానికి
మెలకువలో ప్రయత్నించడమే "జీవితం" అయ్యింది.

ఈ జీవితంలో గాఢనిద్రలోని ఏకత్వానుభవాన్ని పొందటానికి ఒకే మార్గం-

రూపాయి చిల్లరలో రూపాయి నాణేన్ని వెతుకుతున్నాం...
అలా కాకుండా రూపాయి చిల్లర మొత్తం కలిపేస్తే "రూపాయి" అయినట్టు

అలా ప్రపంచంలో దైవాన్ని వెతకడం మాని,
వ్యక్తి, ప్రపంచం, నీవు కొలిచే దైవం మొత్తం కలిపేస్తే దైవం అవుతుంది.

25. అస్కలిత బ్రహ్మచర్యం గురించి ప్రస్తావన వచ్చినప్పుడు....
గురువుగారు ఇలా అన్నారు-

వీర్యస్కలనంతో పోయే జ్ఞానం జ్ఞానమేనా?
అలాంటి జ్ఞానం మనకొద్దు. పోతేపోనీ.

జ్ఞానం అనేది ఒకదానితో రాదు,
ఒకదానితో పోదు.

26.దొరబాబు: దొరబాబును అనుకునే నేనును (అహంకారాన్ని)
తీసేసుకోండి స్వామి...

సద్గురు: అసలు నీ దగ్గర ఏముంది తీసుకోడానికి ?

27.దొరబాబు: అయితే మీ దగ్గర ఉన్నది నాకు ఇవ్వండి .

సద్గురు: నీవు కలిసిన తొలి చూపులోనే
నీ దగ్గర ఉన్నది నేను తీసుకోవడం
నా దగ్గర ఉన్నది నీకు ఇవ్వడం
జరిగిపోయింది.

28.బాబు:
వెంకటసుబ్బయ్యగారు జ్ఞానప్రసూనాలు చదివి,
చిక్కనివాని గురించి ఇన్ని పుస్తకాలు వ్రాశారే? అని అన్నారు ఆశ్చర్యంగా....

సద్గురు:
నిజమే కదా!
నిజంగా చిక్కితే వ్రాసేపని ఏముంది?
ఎదురుగా ఉన్న వ్యక్తికి ఎవడైనా ఉత్తరం వ్రాస్తాడా?

* * *

ప్రియుడు దూరంగా వేరే దేశంలో ఉంటే
ఉత్తరం వ్రాయాలేగాని,

అతడు నా శరీరంలో, నా కళ్లలో ఉన్నప్పుడు
సందేశం పంపించాల్సిన అవసరం ఏముంది?
అంటాడు కబీర్.

29. ఒకరు: అవాస్తవాలన్నింటినీ వాస్తవాలనే భ్రమతోనే మనిషి జీవిస్తుంటాడు....

సద్గురు: వాస్తవమేమంటే అవాస్తవాలన్నీ వాస్తవానికే దారి తీస్తాయి.

30. శ్రీనివాసులు: గురువుగారూ...."పరమపదం" గురించి వివరించండి...

సద్గురు: నాకు సాధ్యం కాదు...

31. రఘు: 'ఇది ఒక కల' అన్నారు మీరు....
ఎవరి కల?

సద్గురు: అది తేలకనే ఇది కల అన్నారు...

32.ఒకరు: అంతా దైవస్వరూపమే అయినప్పుడు....
ప్రపంచంలో  హెచ్చుతగ్గులు ఎందుకున్నాయి?

సద్గురు:
గంగాళాన్ని సముద్రపునీటితో నింపినప్పుడు...

సముద్రపునీరు, గంగాళంలో ఉన్న నీరు
రెండూ ఒకటే అయినప్పటికీ

సముద్రంలో ఉన్నరీతిగా
గంగాళంలో ఉండే నీటికి ఆటుపోట్లు ఉండడంగానీ,
తిమింగలాలు మొదలైన జలచరాలు ఉండడంగానీ,
ఓడలు,నౌకలు ఉండడంగానీ
ఉండవు.

రమణులు, రామకృష్ణాది మహనీయులనేవారు కూడా
సముద్రపునీటితో నిండివున్న  పాత్రలే తప్ప సముద్రం కాదు.

సాధారణులు, మహనీయులు అనే తేడాలనేవి
పాత్రల పరిమాణాల్లో తేడాలు తప్పితే

పాత్రలలో ఉన్న 'నీరు' గా అంతా సమమే.

అన్ని పాత్రలలో ఉండేది సముద్రమేగాని
సముద్రం కాదు.

సముద్రంలో ఉన్న పాత్రల లోపలా బయటా
సముద్రమే ఉన్నట్లు

దైవంలోనే సకలమూ ఉందని ఉండడమే పరిపూర్ణత్వం.

సముద్రం(దైవం) సదా ఏకవచనం.

* * *

నామారూపాలకు ప్రాధాన్యత ఇస్తే పాత్రలుగా ఉంటాం.
నామరూపాలకు ప్రాధాన్యత ఇవ్వకుంటే సముద్రంగా ఉంటాం.

33. ఒకరు: "అది" అసాధ్యమండీ....
సద్గురు: అసాధ్యంగానే ఉండనివ్వండి...

34. సంతోష్:
మెలకువలో 'అది దొరకదు' అని నిశ్చయంగా తెలిసినప్పుడు ఉన్న ఆనందం
గాఢనిద్రలో ఉన్నప్పుడు ఉన్న ఆనందం
రెండూ ఒకటేనా?

సద్గురు:
రెండూ ఒక్కటే.

35. సంతోష్:
తరుణోపాయం చెప్పండి....
భోగి అవమంటారా?
యోగి అవమంటారా?

సద్గురు:
ఏదో ఒకటి అవ్వండి.
తక్షణం అవ్వండి.

36.ఓ అత్త:
నేను మంచి అత్తను అండీ....

సద్గురు:
అని నీవు చెప్పుకుంటే ఎలా?
ఆ విషయం నీ కోడలు చెప్పాలి...

37. సాంబశివరావు:
గురువు గారరూ...!
ఫలానా వ్యక్తి ఇబ్బంది పెడుతున్నారండీ...
సదరు వ్యక్తి దుర్మార్గంగా ప్రవర్తిస్తున్నాడండి...

సద్గురు:
ఆ వ్యక్తి సంగతి అటుంచండి.
ఆ వ్యక్తి ఉండటానికి కారణం అసలు సాంబశివరావుయే.

38.మాధవ:
మా అబ్బాయికి ఏదో వ్యాధి వచ్చిందని
ఫీలింగ్ అండీ...
టెస్టులు చేసి ఏమీ లేదన్నారు డాక్టర్లు...

సద్గురు:
మెలకువ కలిగింది మొదలు
తిరిగి నిద్రలోకి జారుకునేవఱకు
మధ్యలో ఉన్నదంతా ఫీలింగ్సే...

39. యజ్ఞేశ్వరి: జ్ఞానమెట్లా కలుగుతుంది?

సద్గురు: జ్ఞానమెట్లా కలుగుతుందని
ఇంతవరకు ఎవరూ కనిపెట్టలేదు.

40. సాంబశివరావు: జాగ్రత్-స్వప్న-సుషుప్తులు మూడవస్థలున్నాయి...
జాగ్రదవస్థను కల అనుకోవాలి...
నిద్రావస్థను మెలకువ అనుకోవాలి...
అంతేకదా గురువుగారూ...!

సద్గురు: సాంబశివరావునే 'కల' అనుకుంటే పోలా...!

సాంబశివరావుకు కల కాదు,
సాంబశివరావే కల.

సాంబశివరావుకు నిద్ర కాదు,
నిద్రలో అసలు సాంబశివరావే ఉండడు.
ఇక దానిని సాంబశివరావు నిద్ర అని ఎలా అనగలం?

నిద్రలో కలిగే కదలికే జాగ్రత్-స్వప్నాలు...
ఈ రెంటినే అవస్థలు అనాలి...
అవస్థ పడుతున్నాం కాబట్టి.

నిద్ర అనేది అవస్థ కాదు.
నిద్ర అనేది స్వయం.
నిద్ర అనేది స్వరూపం.
నిద్ర అనేది ఆనందం.

నిద్రలో...
సాంబశివరావు ఉండి తెలియకపోవడం కాదు,
సాంబశివరావు లేక తెలియకపోవడం

41.సాంబశివరావు: ఈ సాంబశివరావుకు ఇంకొక కల వస్తోంది కదా...

సద్గురు: అవి కలలో కలలు...
అవి ఎన్ని వచ్చినా లెక్క లేదు...
మొదటి లెక్కే కావలసింది.

42.సాంబశివరావు: మరి నిద్రనే మెలకువ అనుకోమన్నారు తమరు...

సద్గురు: అనుకుని చూడండి...
తర్కానికి అది అందదు.

43.సాంబశివరావు: ఇంత తెలిసినా, కృష్ణుడు ఎందుకు భారతయుద్ధానికి ప్రేరేపించాడు?

సద్గురు: ఒక అబద్ధాన్ని అబద్ధం అని అంగీకరించాక, ఇక అందులోని అబద్ధాలు, నిజాలు అన్నీ కూడా అబద్ధాలే...

44. శ్రీను: ఏదైనా ఒక వాక్యం చెప్పండి గురువుగారూ...!

సద్గురు: ఏముంది నాయనా...
ఉన్నదంతా కలిపితే ఉండేది ఒక వాక్యమే.
అదే "నేను".

45. లీల: గురువారం ఇలా కలిశాం గురువుగారు...

సద్గురు: అసలు మనమెప్పుడు విడిపోయాము కలవడానికి?

46. లీల: మాటలు రావడం లేదు...

సద్గురు: మాటలు అవసరం లేదు...

47. సంతోష్:
మీరేమో ఆత్మస్థితిలో ఉండి మాట్లాడుతున్నారు...
మేమేమో దేహస్థితిలో ఉండి వింటున్నాము...
మన మధ్య దూరం చాలా ఉంది...

సద్గురు:
నేను ఏ స్థితిలోనూ లేను.
అన్ని స్థితులూ "నాలో" ఉన్నాయి.
* * *
కలకు, కలకనేవాడికి మధ్య యెంతదూరం ఉంది?
అంతే దూరం నీకూ నాకు.

48. దొరబాబు: ప్రపంచం శివుణ్ణి ధ్యానిస్తుంటే
శివుడు ఎవర్ని ధ్యానిస్తున్నాడు?

సద్గురు: ప్రపంచరూపంగా ఉన్న పార్వతిని.

49. మన నుంచి ఒక మాట వచ్చింది అంటే, అది జ్ఞానాంబ పలుకే.
పొరపాటు పలుకు రాదు.
మొదట్లో మనకే ఆ మాట చిత్రంగానూ

నమ్మశక్యం కాని విధంగానూ ఉండవచ్చును గాక
కాని అది తిరుగులేని సత్యం.
ఒక్క అక్షరం కూడా సరి చేయడానికి అవకాశం లేని సూత్రం.

50. స్వరూపనిష్ఠయే సర్వశాస్త్రసారము.
స్వరూపనిష్ఠ నుండి జారుతూ ఉంటుంది మనసు.
తిరిగి దానిని స్వరూపంలో స్థాపిస్తూ ఉండాలి.

తప్పదు మొదట్లో.

అలా చేయగా చేయగా అది బయటకు రావడం మాని
స్వరూపంలో స్వరూపంగానే నిలిచిపోతుంది.

"సాధన" అవసరం అనేవారికి ఇంతకు మించిన సాధన
భూప్రపంచంలోనే లేదు.

స్వరూపనిష్ఠయే గొప్ప సాధన
అదే సిద్ధి.

51. "ప్రత్యేకత" అనేది ఎప్పుడూ ఎక్కడా లేదు.

* * *

52.శ్రీనివాస్: నమస్కారం గురువుగారూ....!

సద్గురు: నమస్కారం.

53.శ్రీనివాస్: ఒక సందేహం గురువుగారూ....

సద్గురు: అడగండీ...

54.శ్రీనివాస్: కలలో ఉన్న నాకు మెలకువ గుఱించి తెలియదు.
మెలకువలో ఉన్న నాకు కల గురించి కూడా తెలియదు అనే అనాలి.
మరి 'కల-మెలకువలు రెండూ కల' అని తమరు అంటున్నారు....
మరి నేనెట్లా  కల లాంటి ఈ మెలకువలో నుంచి మేలుకోవడం?

సద్గురు: మేలుకోవడమే...
ఎట్లా అన్న ప్రశ్న లేదక్కడ.

55.శ్రీనివాస్: అదెలా కుదురుతుంది గురువుగారూ?

సద్గురు: కల ఆగిపోవడమే మెలకువ.

56 .శ్రీనివాస్: నేను పూర్తిగా కలలో ఉన్నాను కాబట్టి
'మేలుకోవాలి' అని నాకెట్లా అనిపిస్తుంది?

సద్గురు: కలలో ఉన్నాను అని అంటున్నారు కాబట్టి
మీరు మెలకువలో ఉన్నట్టే.

మీరు మెలకువలో ఉండబట్టే...కలలో ఉన్నాననే స్పృహ ఉంటుంది.

ప్రత్యేకించి 'మెలకువ' అంటూ ఏమీ లేదు.
'ఇది కల' అన్న జ్ఞప్తి ఉంటే చాలు...అదే మెలకువ.

57.శ్రీనివాస్: అంటే ఒకసారి మెలకువ కలిగితే
కల అనేది పోతుంది కదా!

సద్గురు: పోదు. కల నడుస్తూనే ఉంటుంది.

ఎండమావిని చూసి నీటికై పరుగెత్తే వాడొకడు.
ఎండమావిలో నీరుండదు అని తెలిసి ఊరక ఉండే వాడొకడు.
ఇద్దరికీ ఎండమావి కనిపించడం సమమే.

కానీ ఒకడికి సత్యంగా గోచరిస్తుంది.
మరొకడికి భ్రాంతిగా గోచరిస్తుంది.

58.శ్రీనివాస్: ఇక్కడ కూడా అంతేనంటారా?

సద్గురు: అదే ఇది.

59.శ్రీనివాస్: 'ఇది కల' అని అంటే సరిపోతుందా?

సద్గురు: అంటే లాభం లేదు.
'ఇది కల' అని అనుభవంగా ఉంటేనే.

60.శ్రీనివాస్: ఎంతవిన్నా ఇంకా  కన్ఫ్యూజన్ గానే ఉంటోంది
గురువుగారూ....

సద్గురు: కన్ఫ్యూజన్ ఏమీలేదు.

కలలోని తనకు కల కంటున్న తన విషయం తెలియదు.

కల కనే తనకు కలలో ఉన్న తన గుఱించి తెలిసింటుంది.

మామూలుగా కల నుంచి మెలకువ వస్తే
కలకనే తానే ఉంటాడు.

కానీ ఈ 'జాగ్రదవస్త' అనే కల నుండి మేలుకుంటే
(అంటే మెలకువ నుండి మెలకువ అన్నమాట)
తానుండడు.

'మెలకువే' ఉంటుంది అక్కడ.

ఆ 'మెలకువే' తాను.

తానొక్కడే ఉంటాడు.

కలలో ఉన్నవారెవరూ మెలకువలో ఉన్నవాడికి ఉండరు.
ఉన్నా లేనట్టే లెక్క... ఎండమావి నీరు వలె.

61.శ్రీనివాస్: అది మీకు అనుభవంగా ఉంది కాబట్టి మీకు సులభంగా ఉంది స్వామీ....
మా విషయానికి వచ్చేసరికి కష్టమైపోతోంది....

సద్గురు: కాదు కాదు.
అది ఎవరి అనుభవమూ కాదు.
దేనికి సంబంధించిన అనుభవమూ కాదు.
అది స్వయంగానే అనుభవం.

స్వయంగా ఉన్న అనుభవాన్నే మనం 'స్వానుభవం' అంటున్నాం.

అన్ని అనుభవాలు కలిగేది ఆ 'స్వానుభవం' నుంచే.

ఆ స్వానుభవమే దైవమన్నమాట.

మనం గాఢనిద్రలో ఉన్న స్థితి అదే.

గాఢనిద్రలో ఉన్న స్థితే స్వానుభవము.
అదే మెలకువ.

మనం దానిని నిద్ర అనుకుంటాం.
అక్కడ ఎవరూ లేరు, ఏమీ తెలియదు అని అంటే...
లేరు కాబట్టే తెలియదు.
ఉంటే ఎందుకు తెలియదు?

గాఢనిద్రలో 'నేనున్నాను' అని మాత్రం తెలుస్తోంది.

ఇంకేమీ తెలియదు అంటే ఇంకేమీ లేదు అనే దాని అర్థం.

62.శ్రీనివాస్: 'ఇతరం' లేని స్థితే ఒరిజినల్ అన్నమాట...

సద్గురు: అవును. అన్యం లేని స్థితియే నిజమైన మెలకువ.

ఆ స్థితి ఎవరిదీ కాదు, దేనిదీ కాదు.
ఆ స్థితి 'స్వయం'.

63.శ్రీనివాస్: మరి కొందరికి అనుభవంలో ఉండడం,
మరికొందరికి అనుభవంలో లేకపోవడం అనేది ఉంది కదా!

సద్గురు: ఆ 'కొందరు' అనేవారు ఎప్పుడు వస్తారు?
మీరు గాఢనిద్రలో నుంచి మెలకువ వచ్చిన తర్వాత వస్తారు అందరూ....
గాఢనిద్రలో ఎవరూ లేరు కదా!

64.శ్రీనివాస్: మనం మెలకువ అనేది మెలకువ కాదు....
స్వప్నం నుండి మరో స్వప్నంలోకి జారుకోవడమే....

సద్గురు: అవును.
ఈ వైపు నుంచి చూస్తే ఇది మెలకువ.
ఆ వైపు నుంచి చూస్తే ఇది స్వప్నము.

గాఢనిద్ర నుంచి మేలుకున్నాను....అంటాడు.
నిజానికి మెలకువ నుండి కలలోకి జారుకున్నాడు అనాలి.

'నేను' అనేదానికి అసలైన అర్థం - మెలకువ.

'నేను', మెలకువ ఈ రెండూ వేఱు వేఱు కాదు.

కానీ ఇప్పుడు మనం వ్యవహరించే నేను కాదు ఆ నేను.

ఈ నేను వ్యక్తితో కలిసి పరిమితమై ఉంది.

65.శ్రీనివాస్: ఆ 'నేను'కు అంత శక్తి ఎక్కణ్ణుంచి వచ్చింది?

సద్గురు: అదే శక్తి.
శక్తి ఎక్కణ్ణుంచో రాదు.

'మెలకువ'లో ఉండే ఒక అతిశయమైన శక్తి వలనే
ఈ కల, ఈ ఇల ఏర్పడేది.

66.శ్రీనివాస్: దానిని నిర్మూలించే మార్గాలేమైనా ఉన్నాయా?

సద్గురు: నిర్మూలించిన అవసరమేమి?
అది ఉంటుంది.

శక్తిని ప్రదర్శించకపోయినా శక్తుడు ఉంటాడు.
ప్రదర్శిస్తే శక్తి ఉంటుంది.
* * *
ఇది కన్ఫ్యూజన్ గా ఉందని మీరు అంటున్నారు కదా!
మీరు కన్ఫ్యూజన్ లో లేనిస్థితిలో ఉంటేనే కన్ఫ్యూజన్ గా ఉందన్న
విషయాన్ని గుర్తించగలిగారు.

'ఇది కల' అని గుర్తిస్తున్నావు కాబట్టి
నీవు మెలకువలో ఉన్నట్టే.

67.శ్రీనివాస్: గుర్తిస్తున్నాంగానీ....పూర్తి స్థాయిలో కాదు...

సద్గురు: 'పూర్తిస్థాయి కాదు' అని గుర్తించావు కాబట్టి
నీవు 'పూర్తిస్థాయి'లో ఉన్నట్టే.

68.శ్రీనివాస్: అంతేనంటారా?

సద్గురు: అంతే.

69.శ్రీనివాస్: ఈ కరోనా సమస్య తగ్గదా స్వామీ...

సద్గురు: సమస్య అంటూ వస్తే పరిష్కారం కూడా ఉంటుంది.

70.శ్రీనివాస్: ఇంతమందిని ఇది పీడిస్తోంది...

సద్గురు: 'ఇంతమంది' లేరు. ఉండేది నీవొక్కడివే.

71.శ్రీనివాస్: జ్ఞాని అంటే అందరిపై కరుణచూపేవాడు అని కదా!

సద్గురు: కాదు కాదు.
జ్ఞాని అంటే వ్యక్తి అని కాదు.
'జ్ఞానము'నే మనం జ్ఞాని అని సంబోధిస్తున్నాం.

72.శ్రీనివాస్: ప్రపంచంలో ఇంతమంది బాధపడుతుంటే, మీకు బాధగా అనిపించడం లేదా?

సద్గురు: ఇది నిజం అనిపిస్తే బాధ అనిపిస్తుంది.
'ఇది కల' అని ఉంటే నటన అనిపిస్తుంది.

'జగన్నాటకం' అని అందుకే అనేది.

గాఢనిద్రలో జనాలూ లేరు, బాధలూ లేవు.
అసలు మీరే లేరు.
'నేనున్నాను' అనే మెలకువ మాత్రమే ఉంటుంది.

ఆ మెలకువలో నుంచే పుడుతుంది ఒక కదలిక.
ఆ కదలిక వలన వ్యక్తి, వ్యక్తితో పాటు  ప్రపంచము,
అన్నీ ఈ సృష్టి అంతా కూడా అప్పుడే వస్తోంది.

నీవు గాఢనిద్రలో నుంచి మేలుకునే స్థితిలోనే మొత్తం సృష్టి అంతా కూడా అప్పుడే వస్తోంది.

మళ్లీ సృష్టి అంతా నీలోకి(గాఢనిద్రలోకి) వెళ్లిపోతుంది.

అందువల్ల తనకు అన్యంగా దేనికీ ఉనికి లేదు.
తన ఉనికే తనకు అన్యంగా గోచరిస్తోంది.

73.శ్రీనివాస్: బాధల్లో ఉన్నవారిని  చూచినప్పుడు బాధగా అనిపిస్తోంది.... మరి తప్పు నాదేనంటారా?

సద్గురు: మీది కూడా కాదు....
ఒక సినిమా చూస్తున్నాం...
అందరికీ తెలుసు....అది నిజం కాదు అని.

అయినా అందులో ఓ పాత్ర దుఃఖపడుతుంటే
తానూ దుఃఖపడతాడు.
సంతోషపడితే, తానూ సంతోషపడతాడు.
అందులో తెలియనితనం ఏముంది?
తనకు తెలుసు కదా అది సినిమా అని, నిజం కాదు అని.
తనను తాను మరచినప్పుడే కథలో లీనం అవడం జరుగుతుంది.
సినిమా అనే ఎఱుకలో ఉన్నప్పుడు ఆ దృశ్యాలేవీ తనను ఎఫెక్ట్ చేయలేవు.

74.శ్రీనివాస్: వ్యక్తి బాధపడుతున్నాడు అంటే తనను తాను మరిచాడు అని అంటారా?

సద్గురు: అంతేకదా!

75.శ్రీనివాస్: ముందున్న దృశ్యం వాస్తవం కాదంటారా?

సద్గురు: ఉంటే గాఢనిద్రలో ఉండాలి కదా!
అలా లేదు కదా!

76.శ్రీనివాస్: అర్థమైంది గురువుగారూ...
కానీ మన కళ్ల ముందే జనాలు బాధలు పడుతున్నారు కదా!

సద్గురు: మీరు ఏర్పడిందే గాఢనిద్రలో నుంచి మెలకువ వచ్చిన తర్వాత కదా!

గాఢనిద్రలో ఫలానా వ్యక్తినని మీకు ఎఱుక ఉందా?

77.శ్రీనివాస్: లేదు గురువుగారూ....

సద్గురు: అయినా మీరు లేరా?

78.శ్రీనివాస్: ఉన్నాను గురువుగారూ...

సద్గురు: వ్యక్తి ఏర్పడే క్రమంలోనే
సృష్టి అంతా ఏర్పడుతోంది.

79.శ్రీనివాస్: సమాజం పట్ల సానుభూతి చూపించనవసరం లేదా?

సద్గురు: కల కంటావు....కలలో నీవుంటావు....
అందులోని జనులు దుఃఖాలు అనుభవిస్తుంటారు...

కలలో ఉన్న నీకు అవన్నీ నిజం.
యెందుకంటే అది కల అనే ఎఱుక ఉండదు కాబట్టి.
కల నుంచి మేలుకోగానే జనమూ లేరు, వారి బాధలూ లేవు.

80.శ్రీనివాస్: నాటకం అని తెలుస్తూనే ఉంది.
ఇదంతా భగవద్విలాసంగానే తీసుకోవాలా?

సద్గురు: అక్కడ చెప్పే భగవంతుడు కూడా స్వయంగా మీరే.

81.శ్రీనివాస్: మనసు లేకుండా ఉండలేకపోతోంది....

సద్గురు: శ్రీనివాసు యొక్క మనస్సు కాదు.
శ్రీనివాసే మనస్సు.

82.శ్రీనివాస్: బాధపడడం అనేది కొంచెం కూడా మీకు ఉండదా?

సద్గురు: యెందుకుండదండీ.....మీ మీద ఎక్కువ ఉంటుంది.

కాకపోతే అది నిజం కాదు అని నాకు తెలుసు.

83.శ్రీనివాస్: మొత్తం ఇది ఒక కల అని తెలిసాక బాధపడే అవకాశం ఉండదు కదా?

సద్గురు: ఎందుకుండదు?
సినిమాలోని బాధలు ఒట్టివే అని తెలిసినా కూడా,
చూసి బాధపడుతున్నాం కదా!
అది జరిగినప్పుడు ఇది ఎందుకు జరగదు?

84.శ్రీనివాస్: బాధలొస్తే బాధపడవచ్చునేమోగాని
అది వాస్తవం కాదనే స్పృహ లోపల తెలుస్తూ ఉంటుంది...

సద్గురు: ఒక్కసారి తెలిస్తే చాలు...సదా తెలుస్తూ ఉండనక్కర్లేదు...

వివాహంలో వరుడు వధువు మెడలో మూడుముళ్లు ఒక్కసారే వేస్తాడు.
రోజూ వేసుకుంటూ ఉండడు కదా!

అలాగే 'ఇది కల' అనేది ఒక్కసారి అనుభవంలోకి వస్తే చాలు. ప్రతిసారీ అనుకోనక్కర్లేదు. అది చెదరదు.
* * *

ఒకరికి తెలుసు, మరొకరికి తెలియదు అనేది ఏమీలేదు.
ఆ 'ఉన్న ఒకనికి' అది మరపుకు వస్తోంది...ఇంకేమీ లేదు.

జ్ఞప్తి వస్తే 'అసలు' అవుతాడు.
మరపుకొస్తే కల అవుతాడు.

85.శ్రీనివాస్: మీతో మాట్లాడుతున్నంత సేపు
ప్రపంచసంబంధం తక్కువయ్యే ఉంటుంది....

సద్గురు: ఎవరికైనా అంతే. నాకైనా అంతే.

ఎండలో ఉంటే వేడిమి.
నీడలో ఉంటే చల్లదనము ఉంటాయి.
ఏదీ నిజం కాదు అని తెలుసు అందరికీ.

ఎండతీవ్రత కాసేపటికి తగ్గి చల్లదనం వస్తుంది.
చల్లదనం పోయి వేడిమి వస్తుంది.

కాబట్టి ఎప్పుడు ఏ స్థితి ఉంటే ఆ స్థితిని అనుభవించడమే కావలసింది.

86.శ్రీనివాస్: మీ వద్ద ఉన్నంత సేపు రిలాక్స్ గా అనిపిస్తుంది.
బయటకు రాగానే అంతా గందరగోళంగా అనిపిస్తుంది.

నా దగ్గర అని కాదు....'నేను' అని మీరు దేనినయితే సంబోధిస్తున్నారో ఆ 'నేను' దగ్గర ఉండడం వల్ల ఆ రిలాక్సేషను.

మళ్లీ ఆ 'నేను'ను మరచిపోతే
మళ్లీ గందరగోళంగా అనిపిస్తుంది.

87.శ్రీనివాస్: మీ దగ్గరకు వచ్చినప్పుడు 'నేను' వద్దకు వచ్చినట్టు లెక్క.

సద్గురు: మీ దగ్గర మీరున్నప్పుడు
నా దగ్గర మీరున్నట్టు లెక్క.

88.శ్రీనివాస్: వాస్తవమైన 'నేనే' మీరంటారా?

సద్గురు: అంతేకదండీ.....

89.శ్రీనివాస్: బాగుందండీ....

సద్గురు: బాగుండడం కాదు...అదే యధార్థం...

90.శ్రీనివాస్: గుర్వనుగ్రహం సదా మాపైఉండాలి....

సద్గురు: అనుగ్రహమే గురువు.

ఈ రకమైన (ఆధ్యాత్మిక) కదలిక మీలోఉంది అంటే
అది అనుభవిస్తుంది సహజంగా.
అందులో సందేహం లేదు.

91.శ్రీనివాస్: అర్థం కాలేదు గురువుగారూ....

సద్గురు: లేత మొగ్గలో పూవు కనబడదు.
దాని సమయం వచ్చినప్పుడు పూవు వికసిస్తుంది.
రంగు, వాసన, అందం అన్నీ సమకూడుతాయి.

కానీ ఆ పుష్పాన్ని లేత మొగ్గలో చూడాలని ప్రయత్నిస్తే ఏమీ కనబడదు.

అట్లా ప్రతి ఒక్కరిలోనూ 'అది' ఉంది.
స్వయంగా తనకు తాను బయట పడుతుంది.

తన గుడిసె క్రిందనే నిధి ఉన్న సంగతి తెలియక
నయాపైసా లేని దరిద్రుడిలా ఉంటాడు.
ఇది అజ్ఞాని స్థితి.

92.శ్రీనివాస్: దానికదే కలుగవలసిందేగాని
మన ప్రయత్నాలేవీ అవసరం లేదంటారా?

సద్గురు: నిద్ర నుంచి నీ ప్రయత్నంతో మేలుకుంటున్నావా?

93.శ్రీనివాస్: లేదు గురువుగారూ...

సద్గురు: అసలు నిద్రలో మీరే ఉండరు.
ఇక ప్రయత్నం ఏముంటుంది అక్కడ?

94.శ్రీనివాస్: అవును గురువుగారూ....

సద్గురు: ఆ విధంగానే ఇది కూడా....

95. శ్రీనివాస్: ఏదైనా ప్రయత్నం అనేది ఉంటే మేలుకున్నాక ఉంటుంది.....

సద్గురు: మేలుకోవడమే ప్రయత్నం అని చెప్పాలి.
మేలుకొన్నాక ప్రయత్నం కాదు.

96.శ్రీనివాస్: నమస్కారం స్వామీ....

సద్గురు: నమస్కారం.

* * *

97.సాయిచరణ్: నమస్కారం గురువుగారు....

సద్గురు: నమస్తే...

98.సాయిచరణ్: ఇది అంతా కల అంటున్నారు కదా మీరు...
ఇది కల అని ఎలా తెలుస్తుందంటారు?

సద్గురు: కల అని తెలియదు....

తెలియబడేదంతా కల.
తెలుసుకునేవాడు నిజం.

వినబడేదంతా కల.
వినేవాడు నిజం.

చూడబడేదంతా కల.
చూచేవాడు నిజం.

తాకబడేదంతా కల.
తాకేవాడు నిజం.

ఆ విధంగా చూస్తే నిజం అనేది ఒకటే కదా ఉంటుంది.
మిగిలినంతా కల అవుతుంది.

99.సాయిచరణ్: కల నుంచి ఎలా మేలుకోవాలి?

సద్గురు: కలలో నుండి మేలుకోవడం కాదు....
కలే మేలుకుంటుంది...

100.సాయిచరణ్: మనమందరమూ మేలుకున్నట్టేనా?

సద్గురు : అందరూ ఎవరూ లేరు...
ఉండేది నీవొక్కడివే.

101.చరణ్: ఆ ఒక్కడు చరణ్ కూడా కాదు.....

సద్గురు: చరణ్ కూడా కనిపిస్తున్నాడు....
చరణ్ మాట వినిపిస్తోంది....
అంటే అవన్నీ కలే...

కనిపించేది, వినిపించేది - అబద్ధం.
కనేవాడు, వినేవాడు - నిజం.
ఇదే సూత్రం.

102.సాయిచరణ్: ఈ ప్రపంచమనే కలను కనేదెవరు?

సద్గురు: ఈ ప్రశ్న వేసినవాడే కంటున్నాడు....

(సాయిచరణ్ నవ్వుకున్నాడు)

103. సాయిచరణ్: అంటే, చరణ్ కు లోపలుండి చూస్తున్నవాడు...

సద్గురు: లోపలో, బయటో....
ఎక్కణ్ణుంచైనా చరణ్ ను చూసేవాడు నిజం.

104.సాయిచరణ్: అంటే వాడే కల కంటున్నాడా?

సద్గురు: వాడికి కల లేదు....చరణ్ కి కల....

105.సాయిచరణ్: ఓహో చరణ్ కి కల....
వాడు మాత్రం ఉన్నరీతిగానే ఉంటాడు.....
అలా అయితే ధ్యానసాధలేవీ అవసరం లేదంటారు.....

సద్గురు: అవును.

106.సాయిచరణ్: కృష్ణుడు ఇక్కడకు రాక మునుపే అన్నీ వారికి అన్నీ తెలుసంటారు కదా.....

సద్గురు: కృష్ణుడికి ఇదంతా తెలియదు...
ఇది అంతా ఉందనిగాని, ఇది జరుగుతోందనిగానీ తెలియదు.

ఆయన "ఉంటాడు" అంతే.

107.చరణ్: ఆయన శరీరంతో.....

సద్గురు: ఆయనకు శరీరం లేదు....
శరీరం ఉండేది చరణ్ కు....

ఆయన గుఱించి చెప్పాలంటే- "ఉన్నాడు" అని మాత్రమే చెప్పాలి....

దానికి ఇంకొక అక్షరం చెప్పినా తప్పే...

108.సాయిచరణ్: సాక్షిగా ఉండమన్నారు కదా...అది ఎలా?

సద్గురు: ఉన్నదే సాక్షిగా....మళ్లీ ప్రత్యేకించి సాక్షిగా "ఉండటం" ఏముంది?

109.సాయిచరణ్: ప్రయత్నం చేయవలసిన అవసరం లేదా?

సద్గురు: అవసరం లేదు....

110.సాయిచరణ్: అంటే....చరణ్ కు ఒక్క అడుగు సాక్షిగా ఉండమన్నారు కదా...

సద్గురు: మీరు అలా ఎడంగా ఉంటే,
ఇప్పుడు ఈ సంభాషణ ఎలా జరుగుతుంది...?

(చరణ్ నవ్వుకున్నాడు)

.సాయిచరణ్: చరణ్ కు అతుక్కునే ఉండాలంటారా?

సద్గురు: ఎప్పుడూ అతుక్కునే కదా ఉండేది...

111.చరణ్: అనుభవంలో ...లోపల నేను నేనుగానే ఉన్నాను....

సద్గురు: బయట కూడా నేనుగానే ఉండేది...

"నేను" లో రెండు భాగాలు...
లోపల, బయట అని....
ఈ లోపల,బయట అని అనుభవాలు ఉండేది నేనులోనే...

అందువల్ల నేను అనేది లోపల ఉన్నదనిగానీ, బయట ఉన్నదనిగానీ చెప్పడానికి అవకాశం ఉండదు...

అది దేనిలోనూ ఉండదు....
ఎవరిలోనూ ఉండదు....

112.సాయిచరణ్: దానిలోనే అన్నీ ఉన్నాయి.....

సద్గురు: ఉన్నట్లున్నాయి...

113.సాయిచరణ్: అయితే మామూలుగానే ఉండమంటారు.....

సద్గురు: అవును. సత్యం అంటే "మామూలే"
అదేమీ స్పెషల్ కాదు...

114.సాయిచరణ్: ఈ బాధలన్నీ అంటకుండా...తాను తానుగానే ఉండాలంటే?
ఇవన్నీ మనపై ప్రభావం చూపకుండా ఉండాలంటే?

సద్గురు: ఎవరి మీద చూపిస్తున్నాయి?

115.సాయిచరణ్: చరణ్ మీదే....

సద్గురు: నిద్రలో చరణ్ ఉన్నాడా?

116.సాయిచరణ్: లేడు....నేనున్నాను.....

సద్గురు: ఇప్పుడు ఉండేది కూడా "నేనే"

117.సాయిచరణ్: కలలు "నేను" కు వస్తాయా?
చరణ్ కు వస్తాయా?

సద్గురు: అసలవి వస్తే కదా...!

118.సాయిచరణ్: ఇక్కడుండేవాళ్లందరూ నిజం కారన్నమాట....

సద్గురు: సాయిచరణే నిజం కాదు....
సాయిచరణ్ కు అగుపడేవాళ్లంతా నిజం ఎట్లా అవుతారు?

119.సాయిచరణ్: అవును అంతా అబద్ధమే ...
సాయిచరణ్ తో సహా....

వీరందరినీ నడిపిస్తున్నవాడు ఎవడు?

సద్గురు: ఎవడు నడిపిస్తున్నాడు?
నడిపిస్తున్నవాడు వచ్చి చెప్పాడా? నేను నడిపిస్తున్నానని....

120.సాయిచరణ్: (నవ్వుతూ) చెప్పలేదు...

సద్గురు: మరి వాడి డైలాగులూ మీరే చెబితిరి....

నీ డైలాగులూ నీవే చెబితిరి....

ఇతరుల డైలాగులూ మీరే చెబితిరి...

(సాయిచరణ్ నవ్వుకున్నాడు)

121.సాయిచరణ్: కలలో ఏమైనా ఉండొచ్చు...ఏమైనా జరగొచ్చు....అది నిజం కాదు...

సద్గురు: కాబట్టే కదా మనం మాట్లాడుకుంటూ ఉన్నాము....

నిజం అనేది నీవైనా....
నిజం అనేది నేనైనా....
మాటలు ఆగిపోతాయి.....

122.సాయిచరణ్: "మాట" వస్తే కలే...

సద్గురు:  అవును...

123.సాయిచరణ్: అంటే మనమేమీ చేయనక్కరేదన్నమాట...నార్మల్ గా ఎవరి పనులు వారు చేసుకుంటూ పోవడమే....

సద్గురు: భూమిని పడమట నుంచి తూర్పుకు  మీరు నెడుతున్నారా? లేక అదే తిరుగుతోందా?

124.సాయిచరణ్: దానికదే తిరుగుతోంది....

సద్గురు: మరి దాని మీద నిలబడి, ఏదో ఒక స్తంభాన్ని పట్టుకొని నెట్టూతూ... నేను భూమిని నెడుతున్నాను అని నెడితే మీరు నెట్టినట్టా?

స్తంభం, మీరు అన్నీ దానిమీదనే ఉన్నాయి....
దానిపై ఉన్నదేదీ దానిని త్రిప్పలేదు....

125.సాయిచరణ్: బాగా చెప్పారు.....
ప్రతీది దానంతటకు అదే  జరిగిపోతుందంటారు....

ఇక్కడికి రాక మునుపే script వ్రాసుకుని వస్తారని చెప్పారు కదా.....

సద్గురు:  అవును...అలా వ్రాసుకొచ్చిన డైలాగులే ఇప్పుడు మనిద్దరం చెబుతుండేది....

(సాయిచరణ్ నవ్వుకున్నాడు)

126.సాయిచరణ్:  ఆ ఒక్కడే కల కంటున్నాడు....

సద్గురు: ఆ ఒక్కడు నీవే....

వాడెవడో నీకు వేరుగా ఉన్నాడని  మాట్లాడుతున్నాం....అంతే.

127.సాయిచరణ్: ఆ అనుభవం చరణ్ పొందాలంటే?

సద్గురు: ఆ అనుభవం మీకు వేరుగా ఉంటే పొందడానికి అవకాశం ఉంటుంది....
అనుభవం  మీరే అయినప్పుడు పొందడం ఏముంది?

128.సాయిచరణ్: అవును స్వామి...

సద్గురు: గోడ మీద పడ్డ మీ నీడతో మీరు ఫైటింగ్ చేసినట్టు ఇదంతా....

129.సాయిచరణ్: (నవ్వుతూ) బాగా చెప్పారు స్వామీ..... ఉన్నట్టు ఉంటుందేగాని, దానిని ఏమీ చేయలేం....

ఆకాశమే మన ప్రతిరూపం అని చెప్పారు కదా మీరు....

సద్గురు: మన రూపం ఆకాశము....
చరణ్ ప్రతిరూపం....

130.సాయిచరణ్: మనం చూస్తున్నంత వరకే ప్రపంచం అన్నారు కదా....?

సద్గురు: చూస్తున్నంతవరకే ప్రపంచం కాదు,
ప్రపంచం అంటే "చూస్తున్నది" అని అర్థం.

131.సాయిచరణ్: మనం ఎక్కడ వరకు చూస్తున్నామో, అక్కడవఱకే ప్రపంచం ఉంది, దాని తర్వాత "నేను" మాత్రమే ఉంది అని మీరన్నారు

కదా....

సద్గురు: మీరు ఎక్కడవరకు(వ్యాపించి) ఉంటే,
అక్కడ వరకు చూస్తున్నాను....అని చెప్పగలరు.

132.సాయిచరణ్: దాని వెనుక "నేను" మాత్రమే ఉందనుకోవాలి.....

సద్గురు: దానికి "వెనకాల" ఉంటే కదా!

133.సాయిచరణ్: (నవ్వు....) నిజమే....

సద్గురు: మీ వెనకాల మీకు అగుపడతున్నదా?

134.సాయిచరణ్: ఊహు...కనబడదు...

సద్గురు: మరి కనబడనిదానిని "ఉంది" అని ఎట్లా చెప్పగలరు? వెనకేదో ఉందని.....

135.సాయిచరణ్: అవును.....

(సాయిచరణ్ ను మౌనం ఆవహించింది)

136.సాయిచరణ్: సరేనండీ...కృతజ్ఞతలు....చాలా సంతోషంగా ఉంది....

సద్గురు: అలాగే....అలాగే....

* * *

137.శివయ్య: నమస్కారం గురువుగారూ...!

గురువు: నమస్తే....

138.శివయ్య: వ్యవహారంలో ఉన్న శివయ్యను,
శివయ్యను తెలుసుకునే 'తెలివి'గాను
ఏకకాలంలో ఉన్నాను.
ఆధ్యాత్మికలక్ష్యాన్ని నేను చేరుకున్నట్టేనా?
ఇంకేమైనా ఉన్నదా?
మీ ద్వారా తెలుసుకోవాలని ఉన్నది....

గురువు: 'తెలుసుకోవాలి' అనిపించేది ఎవరికి?

139.శివయ్య: శివయ్యకే...

గురువు: శివయ్య ఉంటే ఆత్మానుభవం ఉండదు.
ఆత్మానుభవం ఉంటే శివయ్య ఉండడు.

శివయ్యగా ఉంటూ ఆత్మానుభవం పొందాలనేదే మన కోరిక...

అది జరగని పని.

'శివయ్యగా ఉన్నంతవరకు అది తెలియబడదు.'
అని తెలిస్తే, ప్రయత్నం నుండి విరమించుకుని తృప్తి పడతాడు.

శివయ్యగా ఉన్నంతవరకు
ఆ తృప్తి కలుగదు.

ఉంటే శివయ్యగా ఉండాలి.
లేదా ఆత్మానుభవంగా ఉండాలి.
అంతే.

ఆత్మానుభవాన్ని పొందాలంటే రెండు ఉండాలి...
1. అనుభవించేవాడు. 2. అనుభవింపబడేది. అని.

రెండు ఉంటే అది అసలు కాదు.
అసలైతే రెండు ఉండవు.

కాబట్టి దానిని(ఆత్మను) గురించి ఎంత విపులంగా మాట్లాడుకున్నా సరే
అది శివయ్యను గురించి మాట్లాడుకోవడమే అవుతుంది.

శివయ్య అనే అనుభవం లేకపోతే
ఉండేది ఆత్మానుభవమే.

'ఇది కాదు' అని తెలిస్తే చాలు.
'అది' అని ప్రత్యేకంగా తెలియవలసిన పనిలేదు,
"తెలియబడదు".

ఎంత గొప్ప అనుభవాన్ని అయినా పొందండి...
చివర్లో- 'ఇది కాదు' అని ముక్తాయింపు ఇవ్వండి.

చెత్తను ఊడ్చేస్తే, శుభ్రత అనేది అక్కడే ఉంటుంది.
శుభ్రతను వేరే చోటు నుండి తెచ్చిపెట్టం కదా!

అలాగే 'శివయ్య' అనే చెత్తను ఊడ్చేస్తే
'ఆత్మానుభవం' అనే శుభ్రత అక్కడే ఉంటుంది.

140.శివయ్య: దైనందిన కార్యక్రమాలను యథావిధిగా చేసుకోవడమే.....

గురువు: దానికీ, దీనికీ సంబంధమే లేదు...

'అది' సదా ఉంటుంది.

ఒక్కొక్కప్పుడు 'లేనట్టు' ఉంటుంది.
అశుభ్రత వలన.

మన ప్రయత్నం అశుభ్రతను తొలగించడానికేగాని,
శుభ్రతను సంపాదించడానికి ప్రయత్నం అవసరం లేదు.

శివయ్య ఉంటే అన్నీ ఉంటాయి.
శివయ్య లేకుంటే ఏ సమస్యా ఉండదు.

141.శివయ్య: కుటుంబ బాధ్యత అనేది ఒకటుంది కదా...

గురువు: వ్యక్తితో పాటే కుటుంబమూ, సమాజమూ, ప్రపంచమూ,
దైవమూ...కలిసే ఉంటాయి.

ఉంటే 'ఇది' అయినా ఉంటుంది.
లేకుంటే 'అది' అయినా ఉంటుంది.
రెండూ ఏకకాలంలో  ఉండవు.

శివయ్యకు సమస్య కాదు.
శివయ్యే సమస్య.

శివయ్య ఉన్నంతకాలం
సమస్య లేకపోవడం అనేది లేదు.

142.శివయ్య: ఏ ప్రయత్నమూ చేయవలసిన పనిలేదు....

గురువు: ప్రయత్నం చేయడానికి అక్కడ ఎవరూ ఉండరు కదా.....

143.శివయ్య: అట్లే గురువుగారు.....నమస్తే.....

సద్గురు: నమస్తే...

* * *

144.స్వప్న: గురువుగారూ! నన్ను మీ శిష్యురాలిగా స్వీకరిస్తారా?

సద్గురు: (నవ్వుతూ) నేను గురువును కానమ్మా....
ఎందుకో నాకా పేరు వచ్చేసింది...
అందరూ అలా పిలుస్తుంటారు...
నేను గురువని మీరు అనుకుంటే నేను కాదనను.
* * *
గురువు బయట ఉండడు.
మీ లోపలే ఉంటాడు.

లోపలుండే గురువు బయట ఉండే గురువుతో ఏకీభవించినప్పుడు...
బయటున్న గురువును గురువు అని వ్యవహరించడం జరుగుతుంది.

145.స్వప్న: ఆధ్యాత్మికంగా తపన ఉంది....
నిశ్చలత కలుగుతుందేగానీ, పరిస్థితుల ప్రభావం వలన ఎక్కువ సమయం అందులో ఉండలేకపోతున్నాను...

సద్గురు: సముద్రం ఉపరితలభాగంలో అల్లకల్లోలంగా ఉంటుంది....

సముద్రగర్భంలో నిశ్చలత ఉంటుంది...

146.స్వప్న: నేను శక్తివంతురాలిని(strong women)...
అనేది మీకు తెలుస్తోందా? యెందుకిలా అడిగానంటే...
నేను శక్తివంతురాలనే విషయాన్ని యెవరూ గుర్తించడం లేదు.... మీకైనా తెలుస్తోందా అని.

సద్గురు: మీలో ఆ ప్రశ్న పుట్టిందంటేనే మీరు శక్తివంతురాలనే...
శక్తి లేనిదే ఆ ప్రశ్నే పుట్టదు.

మొలక మొలిచిందంటే
విత్తనం లోపల ఉందనే అర్థం.

ఆధ్యాత్మికాన్వేషణ ఉందంటేనే
మీలో ఆధ్యాత్మికశక్తి ఉందనే అర్థం.

147.స్వప్న: నన్ను ఎవరూ అర్థం చేసుకోవడం లేదు...

సద్గురు: అది(ఆధ్యాత్మికం) అందరికీ వీలుకాదమ్మా....

*  * *

148.స్వప్న: ఆత్మానుసంధానం చేయడం ఎలా స్వామీ....

సద్గురు: ఏదో చేసి అనుసంధానం కావడం కాదు...
'ఎప్పుడూ అనుసంధానమై ఉన్నాను' అని జ్ఞాపకం పెట్టుకోవడమే చేయవలసింది.

నిజానికి నీవు జ్ఞప్తిలో పెట్టుకున్నా, లేకున్నా
సదా నీవు ఆత్మానుసంధానమయ్యే ఉన్నావు.

149.స్వప్న: బాహ్యాపరిస్థితుల వలన ఆత్మనిష్ఠలో ఉండలేకపోతున్నాను స్వామీ....

సద్గురు: 'పరిస్థితులు' అనేవి ఉంటే 'ప్రభావము' అనేది
లేకుండా ఎలా ఉంటుంది?

ఏది జరిగినా 'సహజంగా జరుగుతోంది' అన్న జ్ఞప్తి ఉంటే చాలు...

జరుగనిది మీరు జరుపలేరు.
జరుగునది మీరు ఆపలేరు.

అది జరిగిపోతూ ఉంటుంది....
మనం ఊరికే చూస్తూ ఉండాలి....

150.స్వప్న: కాని ఆ స్థితిలో యెక్కువ సేపు ఉండలేకపోతున్నాను....

సద్గురు: ఉండగలిగినంత సేపు ఉండండి.
ఉండలేనప్పుడు మానేయండి...తప్పేముంది?

151.స్వప్న: ఆ స్థితి నుండి జారకూడదు కదా...
జారినప్పుడు మళ్లీ ఏవో ఘర్షణలు పడవలసి వస్తుంది...అన్ని పరిస్థితుల్లోనూ "ఒకే స్థితి"లో ఉండలేకపోతున్నాను....

సద్గురు: ఎప్పుడూ "ఒకటి"గా ఉండాలంటే....దాని అర్థం...ఎప్పుడు ఏ సమయంలో ఎలా ఉండవలసి వస్తే అప్పుడు అలా ఉండడమే....

152.స్వప్న: జ్ఞానప్రసూనాంబ అనుగ్రహం వలననే నేను మిమ్మల్ని గానీ, బాబన్నను గానీ తెలుసుకోగలిగానా?

సద్గురు: అంతమాత్రమే కాదు, మేము మిమ్మల్ని తెలుసుకోవడం కూడా జ్ఞానప్రసూనాంబ అనుగ్రహం వలననే జరిగింది.

153.స్వప్న: అనుగ్రహం నాకు లభిస్తుందంటారా?

సద్గురు: 'నేను స్వప్న'ను అని నీవు తెలుసుకుంటున్నావా?

154.స్వప్న: అవునండీ...

సద్గురు: అనుగ్రహం లభించినట్లే.

155.స్వప్న: పాతవాసనల ప్రభావం నాపై పడడం నాకిష్టం లేదు.....

సద్గురు: నీ ఇష్టాయిష్టాలతో పనిలేకుండా అవి వస్తూ పోతూ ఉంటాయి....

ఆకాశంలో మబ్బులు వస్తూ పోతుంటాయి....
ఆకాశానికి, వాటికి సంబంధం లేదు.

అవి మనల్ని టచ్ చేయవు...
టచ్ చేసినట్లు అనిపిస్తాయి...

156.స్వప్న: కానీ వాటి స్పర్శతో దుఃఖం అనుభవిస్తున్నాను కదా...

సద్గురు: అనుభవించాలి.
ఎప్పుడు ఏ వాసనలు వస్తే అప్పుడు ఆ అనుభూతిని అనుభవించి తీరాలి.

157.స్వప్న: నేను ఇది కాను కదా అనిపిస్తుంది....

సద్గురు: కానిదానిని 'నేను కాదు కదా' అని అనుకోవలసిన పని ఏముంది? అవునన్నా కానిది అవడమెట్లా అవుతుంది?

158.స్వప్న: కర్మతో యుద్ధం చేయమంటారా? లేక
జరగేది జరుగుతుంది అని ఊరక ఉండమంటారా?

సద్గురు: ఏది జరగవలసి ఉంటే అదే జరుగుతుంది.
అది ఒకరి సలహా తీసుకొని ఉండేది కాదు.

మీరెలా ఉండాలో అలానే ఉంటారు.
మీరేమి చేయాలో అదే చేస్తారు.

Expect చేయడం మానుకో.
Accept చేయడం నేర్చుకో.

159.స్వప్న: నాకు నచ్చినట్టు స్వతంత్రంగా జీవించే హక్కు లేదా? అనిపిస్తుంది....

సద్గురు: అట్లా ఉండగలిగితే ఉండండి...
దానికి ఎవరి అనుమతీ అవసరం లేదు.

ఆ అవకాశం లేనప్పుడు అప్పుడు ఎలా ఉండాలో అలానే ఉండండి.

ఫైట్ చేసే శక్తి, ఓపిక ఉంటే చేయండి.
లేనప్పుడు ఉన్న పరిస్థితినే Accept చేసి కాలాన్ని గడిపేయడమే. అంతే.

160.స్వప్న: ఇప్పటివరకు నా జీవితంలో జరిగినదంతా
అవి జరగాలి కాబట్టి జరిగిందా? లేక నా ప్రమేయంతో జరిగిందా?

సద్గురు: మీ ప్రమేయం ఏమీ లేదమ్మా.....

161. స్వప్న: జరుగవలసింది కాబట్టి జరిగిందంటారా?

సద్గురు: అవును. ఉదయం నిద్రలేచింది మొదలు,
రాత్రి పడుకోబోయే ముందువఅకు ఏమేమి జరిగిందనేది Re-collect చేసుకుంటే, జరిగిందంతా ఈశ్వరేచ్ఛ.

162.స్వప్న: అంటే, నా చిన్నప్పట్నుంచి ఇప్పటివరకు జరిగిందంతా...అంటే మీతో ఈ క్షణంలో మాట్లాడేవఅకు జరిగిందంతా దైవేచ్ఛేనా?

సద్గురు: అవును...ప్రతిక్షణము కూడా అదే(దైవేచ్ఛే).
మన లెక్కేమంటే...ఏది నెరవేరుతున్నదో అదంతా దైవేచ్ఛే.

163.స్వప్న: వికల్పాలన్నీ మనవా?

సద్గురు: మధ్యలో మనం జోక్యం చేసుకోవడం వల్ల అలా అనిపిస్తుంది....వికల్పాలని...

164. స్వప్న: ఇంకాస్త వివరించరా.....

సద్గురు: ఉదయం నుంచి రాత్రి పడుకోబోయే వఱకు జరిగినదానినంతా మనం మార్చలేం కదా!
మార్చడానికి వీలులేకుండా జరిగిందే దైవేచ్ఛ.

165.స్వప్న: అంటే గతమంతానా?

సద్గురు: అవును. గతమంతా దేవేచ్ఛే.
భవిష్యత్తు తెలియదు కాబట్టి అది మన చేతుల్లో ఉందో లేదో అనేది తెలియదు.

వర్తమానం ఏమంటే -
గతము, భవిష్యత్తు కలిసే చోటు అది.

మనం ఆ మధ్య గీతలో నిలబడి ఉంటాం.
ఒక అడుగు గతంలో, ఒక అడుగు భవిష్యత్తులో పెట్టి నిలబడి ఉంటాం.

అదే ప్రతిక్షణంలోను జరిగే ప్రక్రియ.

166. స్వప్న: ఇప్పటివఱకు జరిగిన నా కుటుంబ సమస్యలు... నా రీయాక్షన్ వలన జరిగిందా?

సద్గురు: లేదు లేదు...మీ రీయాక్షన్ తో సంబంధంలేదు...

167.స్వప్న: ఇప్పటివరకు అజ్ఞానంతో ఉన్నాను....

సద్గురు: అదేమీలేదు...
అజ్ఞానం అంటే ఏమీలేదు....
మనకు అర్థంకాని జ్ఞానమే అజ్ఞానం.

168.స్వప్న: ఇప్పటివఱకు నేను తెలుసుకోకపోవడానికి కారణం?

సద్గురు: అందులో మీ జోక్యం ఏమీలేదు.

169.స్వప్న: మేము ఇతరులకు మంచి చేయాలనే మనస్తత్త్వం ఉండేవాళ్లం....

సద్గురు: చెడ్డ చేసేవాళ్లు కూడా వాళ్ల జోక్యంతో చేసేది కాదు....

170. స్వప్న: అది కూడా దైవేచ్ఛేనా?

సద్గురు: దానికి ఏ పేరైనా పెట్టుకోండి.

171.స్వప్న: ఆధ్యాత్మికంగా నేను, నా భర్త, నా పిల్లలు ముందుకు వెళ్లాలని ఆశీర్వదించండి...

సద్గురు: అలాగే....అలాగే....

172.స్వప్న: అది ఉంటే, నా జీవితంలో అన్నీ ఉన్నట్టే.

సద్గురు: అలాగే...

173.స్వప్న: దేవుని అనుగ్రహం కావాలనే తపిస్తున్నాను...

సద్గురు: "కావాలి" అని కోరడం కాదు.....
అది Already ఉన్నది కాబట్టే ఇదంతా జరుగుతోంది.

174.స్వప్న: మీతో మాట్లాడాక నాకు చాలా ప్రశాంతత లభించిందండీ...

సద్గురు: నీకు ప్రశాంతత కాదు, నీవే ప్రశాంతత అయిపోయావు.

175.స్వప్న: మీరు పరిచయం కాకముందు నుంచే
మీరు నన్ను కనిపెట్టుకుని ఉన్నారనిపిస్తోంది...

సద్గురు: అందులో సందేహమేమి?

176.స్వప్న: ఇప్పటివరకు నేను చేసిన ప్రయాణమంతా మిమ్మల్ని చేరుకోవడానికే అన్నట్టుంది...

సద్గురు: ప్రయాణం చేసి నన్ను చేరటం కాదు,
నన్ను చేరుకున్నాక చేసిన ప్రయాణం అది.

* * *

177.జయ: నమస్కారం గురువుగారూ!

సద్గురు: నమస్తే.

178.జయ: కాశీలో శాశ్వత నివాసం ఏర్పరచుకుని ఉన్నాం గురువుగారూ....

మీ ఆశీర్వాదం కావాలి...

సద్గురు: (నవ్వుతూ) కాశీ విశ్వనాథుని సన్నిధిలో ఉండగా ఇక వారి, వీరి ఆశీర్వాదాలెందుకు?

179.జయ: విశ్వనాథుడు నాకు గురురూపంలో కావాలి.
మీ రూపంలో ఉన్నది విశ్వనాథుడే అని నా భావన...

సద్గురు: అది భావన కాదు...యథార్థం...

180.జయ: మీ ఉపదేశాలకు సంబంధించిన రికార్డులను కొన్ని విన్నాను...మనసుకు చాలా బాగుంది...

ఆత్మతత్త్వం గురించి ఇంకా తెలుసుకోవాలనిపిస్తోంది...

సద్గురు: ప్రపంచంలో దేనిని గురించైనా తెలుసుకోవచ్చుగాని, ఆత్మ గురించి మాత్రం ఎవరూ తెలుసుకోలేరు...

181.జయ: అంటే...."నేను"ను అనుభవంలోకి తెచ్చుకోవడం ఎలా?

సద్గురు: నేను-నేను అని అంటూనే ఉన్నారు కదా...
మళ్లీ అనుభవంలోకి తెచ్చుకోవడం ఏముంది?

182.జయ: అంటే నా పేరు జయ...ఈ జయకు ఒక అడుగు యెడంగా ఉండమని తమరు చెప్పి ఉన్నారు కదా....

సద్గురు: అవసరం లేదు....

జయగా అనుభవంలో ఉండేదీ ఆత్మతత్త్వమే...

జయకు విడిగా ఉన్నట్టు కనిపించేది కూడా ఆత్మతత్త్వమే...

అసలు అనిపించేదానికి, కనిపించేదానికి అది తప్ప వేరే ఏమీ లేదు.

ఎలా అగుపడ్డా ఆత్మతత్త్వమే అని జ్ఞప్తి ఉంటే చాలు.

183. జయ: చూసేదంతా భగవద్రూపమే అని ఉన్నప్పుడు మళ్లీ నేను, భగవంతుడు వేరే వేరే అన్న ద్వైతభావన వస్తోంది...

సద్గురు: కనబడేది కాదు భగవంతుడు...

చూచేది భగవంతుడు.

చూచేది ఎవరు?

184.జయ: "నేనే"...

సద్గురు: కాబట్టి "నేనే" భగవంతుడు అని అర్థం.

185.జయ: శివుడు, దుర్గమ్మ...అంటూ సాకారోపాసనలు ఉన్నాయి కదా లోకంలో...వాటి గురించి ఏమంటారు?

సద్గురు:మీ కుటుంబంలో వాళ్లు, ఊళ్లోవాళ్లు అందరూ అగుపడుతున్నారు కదా... అంతే దేవుళ్లు కూడా....

186.జయ: అలా ఆకాశంలోకి చూసినప్పుడు ఏవో రూపాలు కనిపిస్తుంటాయి...

సద్గురు: చూడబడేది నిజంకాదు. చూచేది నిజం.
అని చెప్పుకున్నాం కదా...

ఇది గుర్తుంటే ఏ రకంగా అగుపడినా మనకు ఇబ్బంది లేదు.

187.జయ: చూచేది భగవంతుడంటారు....

సద్గురు: చూచేది మీరే కదా...మీరే భగవంతుడు.

* * *

188. శ్యామ్ సుందర్(సద్గురు దివ్యపాదాలను పట్టుకొని)

ఓ ప్రభూ! నేను అజ్ఞానిని.
నాకు మీ నుంచి ఏం కోరుకోవాలో తెలియనివాణ్ణి.
ఏది నా యెడల శ్రేయోదాయకమని మీకనిపిస్తుందో...
అట్టి దానిని నాకు ప్రసాదించండి...
సుగుణశీలత, భక్తిభావము బొత్తిగా లేదు...
అజ్ఞానాంధకారంలో నేనొర్చిన కార్యములన్నియూ
పాపముతో కూడుకున్నవే.
ఓ ప్రభూ! నాకు నీ దివ్యపాదారవిందములు తప్ప
నాకు వేరే మార్గం లేదు.
నేనే నీవై నీవే నేనై నన్ను మీలో ఐక్యం చేసుకోండీ....

మీ అనుగ్రహం ఎప్పుడూ ఉండాలి గురువుగారూ...!

సద్గురు:
అది ఉండబట్టే మీరు ఇక్కడకు వచ్చారు...

189. శ్యామ్ సుందర్:
మీ పాదాలు ఎప్పటికీ వదలను గురువుగారు...

సద్గురు :
నా పాదాలు నాకే కనిపించలేదిప్పటికి...
మీరు ఎట్లా పట్టుకుంటారు...?

190. శ్యామ్ సుందర్ :
చాలా భారంగా ఉంది స్వామి...!
మీరే ధైర్యం ఇవ్వాలి...

సద్గురు:
అలాగే...అలాగే...

191. నాగ లింగమయ్య: గురువు గారూ...!
చిన్నపాటి యోగం చేస్తే బాగుంటుంది...
ఏవైనా ఆరోగ్య సమస్యలుంటే నయం అవుతాయి...

సద్గురు: (కాసేపాగి, నవ్వుతూ)
నేనే యోగం...యోగిని కాను.
నేనే జ్ఞానం...జ్ఞానిని కాను.
* * *

సద్గురు: మీరు కాశీనాయనను ప్రత్యక్షంగా చూసారా?

192. రాజేంద్ర: చూడలేదు...

సద్గురు: నేను సదా చూస్తూనే ఉన్నాను.

193. రాజేంద్ర: భ్రమ...!

సద్గురు: ఆ.... అదే
చూస్తున్నాను అనుకోవడమూ భ్రమే.
చూడడంలేదు అనుకోవడమూ భ్రమే.

194. రాజేంద్ర: ఒకసారి రండి స్వామి...
కాశీనాయన్ని చూడడానికి...

సద్గురు: ఇప్పుడు చూస్తున్నానుగా...

195. రాజేంద్ర: అదెలా...?

సద్గురు: ఇప్పుడు రాజేంద్ర రూపంలో
వచ్చి కూర్చున్నది కాశీ నాయనేగా...
కాదనమను చూద్దాం...!

(అందరూ మౌనం వహించారు)

196. పట్టెయ్య:
ఇప్పుడున్న ఆకాశమే చిదాకాశం
అంటున్నారు తమరు...

సద్గురు:
అవును భూతాకాశం అనేది కూడా చిదాకాశమే.
మిగతా నాల్గు భూతములతో కూడి ఉండడటం చేత
దీనిని భూతాకాశం అన్నారేగాని
నాల్గు భూతములు లేనప్పుడు
ఉండేది చిదాకాశం ఒక్కటే.

చిదాకాశమే మహాభూతము; మహా అద్భుతము.
చిదాకాశమే పంచభూతములుగా వికసించింది.

పంచభూతములు ఉన్నప్పుడు, లేనప్పుడు
ఉన్నది  చిదాకాశము ఒక్కటే.

చిదాకాశమే "నేను".

197. ఒకరు:
ఈ భూమ్మీద జీవించే ప్రతి మనిషీ
ఏదో ఒక సమస్య చెప్పేవారే...

సద్గురు:
అవును...జీవించడానికి అదే ఇంధనం.

198. సద్గురు: నిద్రలో ఉన్న నీవే దైవం.
మెలకువలో ఉన్న నీవు వ్యక్తి.

ఒకరు: అదే నిష్ఠలో మెలకువలో కూడా ఉండాలంటే ఎట్లా?

సద్గురు: అదెట్లా వీలుపడుతుంది?
రెండుప్రక్కలా బొమ్మ ఉండే నాణెం చెల్లదు.
మన ఇష్టప్రకారం జరిగేటట్లయితే ఉండొచ్చు.
నీ నిర్ణయం ప్రకారం నీవు పుట్టి వుంటే,
మిగతా అన్నీ కూడా నీ నిర్ణయం మీదే ఉండేవి.
మొదలే లేదు...తరువాత ఎలా వస్తుంది?

199. ఒకరు: మనం మంచి మార్గంలో ఉన్నామని
ఎట్లా తెలిసేది?

సద్గురు: తెలియాల్సిన అవసరం ఏముంది?

200. విక్రం: అజ్ఞానం యెవరికి?
సద్గురు: అజ్ఞానానికే.
* * *

117. జ్ఞానప్రసూనాలు

---

1. జీవితాంతం అర్థం కానిది జీవితమే.

2. ఎవరి స్వాభావం, అది వారి ప్రారబ్ధం.

3. మౌనంగా ఉండటమంటే, మౌనమే ఉండడం.

4. అనుభవం అనేది కూడా ఓ తలంపే.

5. ఆశ్రమం లేని ఆశ్రమం అత్యాశ్రమం.

6. సత్సంగం అంటే తనతో తాను గడపడం.

7. ఉన్నట్లున్న దానికే ప్రారబ్ధం అని పేరు.

8. మారాలి అనేవాడే మారాలి.

9. దూరము, దగ్గర కలిసే చోట నేనుంటాను.

10. నీకు లోబడని సత్యమే అసత్యం.

11. అనుభవమే ప్రారబ్ధం.

12. తాను తానుగా ఉండడం - నిరాడంబరం.
తాను ఫలానా అని ఉండడం - ఆడంబరం.

13. ఈ జగత్ క్రీడకు ఫైనల్ ఏమి?
క్రీడించేవాడే ఫైనల్.

14. తానున్నానని దేవుడికి తెలియదు.
తాను లేనని జీవుడికి తెలియదు.

15. ఉన్నదానికి సిద్ధాంతమెందుకు?
లేనిదానికి రాద్ధాంతమెందుకు?

16. తన నెరిగినవాడు ఇతరము నెరుగడు.
ఇతరము నెరిగినవాడు తనను ఎరుగడు.

17. పరంపర ఉండేది శిష్యులకే.
గురువుకు పరంపర ఉండదు.

18. నాన్న ఎవరో అమ్మ మాట ప్రమాణం.
దేవుడు ఎవరో గురువాక్కు ప్రమాణం.

19. మౌనంగా ఉండడమే
నిజమైన దక్షిణామూర్తి స్తోత్రము.

20. శంకరులకు అద్వైతము తెలుసును.
అద్వైతానికి శంకరులు తెలియదు.

21. లోకాన్ని పట్టించుకోనివాణ్ణి
లోకమంతా పట్టించుకుంటుంది.

22. 'ఏకం సత్' అంతే.
అక్కడే నిలిచిపో.

23. రమణులు మౌనం వహించలేదు.
మౌనమే రమణుణ్ణి వహించింది.

24. Limited గా ఉండు.
సుఖం Un-Limited గా ఉంటుంది.

25. సర్వత్రా ఎవరు ఈశ్వరుణ్ణి సందర్శిస్తారో
వారికి 'ఎందుకు' అన్న ప్రశ్న కలుగదు.

26. ధ్యానం అనేది short time తపస్సు.
తపస్సు అనేది full time ధ్యానము.

27. కళ్లు మూసుకుంటే పదార్థమంతా ఏకమౌతుంది.
మనసు మూసుకుంటే శక్తి అంతా ఏకమౌతుంది.

28. కూరేది - విషయజ్ఞానం.
ఊరేది - ఆత్మజ్ఞానం.

29. నీవు చూచేవాడు దేవుడు అన్నా దేవుడు కాడు.
నిన్ను చూచేవాడు దేవుడు అనకున్నా దేవుడే వాడు.

30. చచ్చిపోయినవాడికి సమస్య లేదు.
బ్రతికున్నవాడికి చావులేదు.

31. అంతా నాదే అంటే - స్వార్థం.
అంతా నేనే అంటే - నిస్వార్థం.

32. ప్రతి భోగమూ ఒక యోగమే.
ప్రతి యోగమూ ఒక భోగమే.

33. దేవుడు రాముడయితేనే
రాముడు దేవుడయ్యేది.

34. మనం డబ్బును సంపాదించడం కాదు,
డబ్బు మనల్ని సంపాదించాలి.

35. లోపలున్నదంతా - నిత్యం.
వెలుపలున్నదంతా - లీల.

36. అదిగా ఉండేది ఇదే.
ఇదిగా ఉండేది అదే.

37. మాట్లాడని వివేకానందుడు - రమణుడు.
మాట్లాడే రమణుడు - వివేకానందుడు.

38. ఎవరెన్ని లెక్కలు వేసినా
ఆయన లెక్కలు ఆయనకున్నాయి.

39. దేవుడు అనేకం అవలేదు.
అనేకం దేవుడు అవుతుంది.

40. ఆనందం కోసం చేసేది - కర్మ.
ఆనందంగా ఉండి చేసేది - లీల.

41. ఒకటి అనేకం కాలేదు.
మనమే ఒకటిని అనేకంగా చూస్తున్నాం.

42. అసలు సత్యమేమి?
'అసలే' సత్యము.

43. బ్రతికేవాడు - సత్యం.
బ్రతుకంతా - అసత్యం.

44. మౌనంగా ఉంటే అందరూ జ్ఞానులే.
నోరు తెరిస్తే ఎవరైనా అజ్ఞానులే.

45. అనుభవం వలననే అనుష్ఠానం.
అనుష్ఠానం వలన అనుభవం రాదు.

46. దేవుడు లేడు - నామరూపాలతో.
దేవుడు ఉన్నాడు - సకల నామరూపాలతో.

47. నేను-నాది ని ఎలా అంతం చేయడం?
నేను-నాది ని అనంతం చేయడం.

48. ధనం - లౌకిక సంపాదన.
జపం - ఆ పారమార్థిక సంపాదన.

49. కల - ఇహలోకం.
నిద్ర - పరలోకం.

50. అన్యం తోస్తే - స్వప్నం.
అన్యం తోయకుంటే - మోక్షం.

51. లోకంలోని వ్యతిరేకపదాలన్నీ
ఆధ్యాత్మికంలో పర్యాయపదాలు.

52. ఏదీ నేను కాదు - సాధన.
అన్నీ నేనే - సిద్ధి.

53. సమాధానపరచువాడు - దేవుని కుమారుడు.
సమాధానము - దేవుడు.

54. సకలావయవాలు కలిపి నేను - దేహం.
సకల సృష్టి కలిపి నేను - దైవం.

55. సమాధానంలో నుంచే ప్రశ్న పుడుతుంది.
ప్రశ్నలో నుంచే సమాధానం పుడుతుంది.

56. విశ్వం మొత్తం ఎంత తూకమో
పరమాణువు కూడా అంతే తూకం.

57. వేదాంతరహస్యమంతా నీలోనే ఉంది.
నీలోపలికెళ్లిపో...అక్కడే ఉండిపో...

58. నిద్రలో - నేనున్నాననే ఎఱుక మోక్షం.
మెలకువలో - నేను లేననే మఱుపు మోక్షం.

59. అబద్ధమే చెలామణిలో ఉండేది.
నిజం చెలామణిలో ఉండదు.

60. మరణమనేది - మలుపు.
మోక్షమనేది - ముగింపు.

61. బంధమూ లేదు, మోక్షమూ లేదు.
యెందుకంటే అసలు జీవుడే లేడు.

62. స్వప్నం - జీవుని ప్రారబ్ధం.
విశ్వం - దేవుని ప్రారబ్ధం.

63. విధి చేత తాను ఖాళీ అవడం - నిర్యాణం.
మతి చేత తాను ఖాళీ అవడం - నిర్వాణం.

64. బహువచనం కలిగిన నేను - ప్రపంచం.
ఏకవచనం కలిగిన నేను - దైవం.

65. దేవుడికి సృష్టి(కార్యం) లేదు.
సృష్టికి దేవుడు(కారణం) లేదు.

66. నేను తటస్థంగా ఉండడం కాదు,
తటస్థమే నేను.

67. అవతరించేది గురువే కాదు,
శిష్యుడు కూడా అవతరిస్తాడు.

68. వ్యక్తం అయ్యాడు కాబట్టే వ్యక్తి అయ్యాడు.
వ్యక్తం కాకుంటే దైవంగా ఉంటాడు.

69. అనుభవం పొందటం అనేది లేనే లేదు.
అనుభవంలో వ్యక్తి ఉండడు.

70. రమణులు, దొరికి హాయిగా ఉండడం కాదు,
అది దొరకదు అని తెలిసి హాయిగా ఉండడం.

71. సత్యమే సాక్షి.
సత్యానికి మరో సాక్షి అవసరం లేదు.

72. నువ్వుంటే మౌనం ఉండదు.
మౌనం ఉంటే నవ్వుండవు.

73. సత్యం - దేవుడు.
ధర్మం - జీవుడు.

74. కనుక్కోవడం - అబద్ధం.
కనుక్కునేవాడు - నిజం.

75. ఇక్కడ కర్త లేడు.
అక్కడ కర్మ లేద.

76. 'ఉన్నది ఒకటే' అనుకుని
తర్వాత ఏమైనా అనుకో.

77. భక్తియోగి చివరిమాట - సోహం.
జ్ఞానయోగి చివరిమాట - దాసోహం.

78. వెలుగుతున్నవాడు - ఖగోళసూర్యుడు.
వెలిగించినవాడు - సూర్యభగవానుడు.

79. త్రాసులో కొలవబడేవాడుగా ఉండొద్దు.
నీవే త్రాసుగా ఉండు.

80. భూమి ఉండేది రోదసీలోనే.
కాబట్టి మనమంతా ఉండేది రోదసీలోనే.

81. నిన్నెవరూ పట్టించుకోకపోవడం - ఒంటరితనం.
నీవెవరినీ పట్టించుకోకపోవడం - ఏకాంతం.

82. ప్రపంచంలో అద్భుతాలు చూడడం కాదు,
ప్రపంచమే ఓ అద్భుతం.

83. చెప్పినవాడు పొందలేదు.
పొందినవాడు చెప్పలేడు.

84. మెలకువలో నిద్రపోగలిగితే
నిద్రలో మెలకువ కలుగుతుంది.

85.  మనకు దేవడు subject కాదు.
దేవుడికి మనం subject.

86. ప్రారబ్ధాన్ని అనుభవించడం కాదు
అనుభవమే ప్రారబ్ధం.

87. వంట కావాలంటే మంట కావాలి.
ఆత్మ కావాలంటే ఆర్తి కావాలి.

88. పిచ్చివాళ్లలో -
మొదటి పిచ్చివాడు - philosopher.
రెండవ పిచ్చివాడు - psychiatrist.

89. వర్తమానం - తురీయం.
భూతకాలం - స్వప్నం.
భవిష్యత్కాలం - సుషుప్తి.

90. కర్మ అంటే ధర్మానుష్ఠానం.
భక్తి అంటే భావోద్రేకం.
జ్ఞానం అంటే అంతర్ముఖత్వం.

91. అందరిలో తనను
తనలో అందరినీ
చూడడమే ఆత్మసాక్షాత్కారము.

92. నేను దేవుడంటే ఎవరూ నమ్మరు.
దేవుడే నేను అంటే అందరూ నమ్ముతారు.
నిజానికి రెండూ సత్యమే.

93. చదివేసిన పేజీ - దైవం.
చదువబోయే పేజీ - మాయ.
చదువుతున్న పేజీ - ప్రపంచం.

94. పుట్టుక ప్రయోజనం
పుట్టినవానిది కాదు
పుట్టించినవానిది.

95. కర్త - చైతన్యం.
కర్మ - జడం.
క్రియ - లీలావిలాసం.

96. జ్ఞానమంటే-
బుర్ర నింపేసుకోవడం కాదు,
బుర్ర దులిపేసుకోవడం.

97. సృష్టిలో-
ప్రతీది సహజమే.
ప్రతీది అవసరమే.

98. వ్యాపారం కోసం దేవుడు
దేవుడి కోసం వ్యాపారం
రెండూ ఉన్నాయి లోకంలో.

99. ఉన్నదెల్లా బ్రహ్మమే.
ప్రత్యేక కాలాలు లేవు.
ప్రత్యేక స్థలాలు లేవు.

100. దైవనియతిని అంగీకరించాలి.
పురుషకారాన్ని ఆచరించాలి.
ప్రారబ్ధాన్ని అనుభవించాలి.

101. నేను అనేది చిత్.
బాబు అనేది జడం.
ఇదే చిజ్జడగ్రంథి.

102. జీవుణ్ణి అంగీకరిస్తే
దేవుడు కూడా జీవుడే.
దేవుణ్ణి మాత్రమే అంగీకరిస్తే
జీవుడు కూడా దేవుడే.

103. ఏకంగా ఉన్న తాను అనేకం అవ్వాలనే దేవుని సంకల్పమే
జీవునికి 'మెలకువ'గా అనుభవంలోకి వస్తుంది.
అనేకంగా ఉన్న తాను ఏకం వైపుకు చేసే దేవుని ప్రయాణమే
జీవునికి 'నిద్ర'గా అనుభవంలోకి వస్తుంది.

104. వస్తువొకటే
ఒకడు ప్రపంచం అంటాడు.
ఒకడు పరబ్రహ్మం అంటాడు.
వస్తువొకటే.

105. యముడు ఆత్మీయుడిలా అనిపించినప్పుడు
మరణం అనేమాట మంగళకరంగా తోచినప్పుడు
శ్మశానం శైవక్షేత్రంలా కనిపించినప్పుడు
నీవు పొందవలసినదానిని నీవు పొందినట్టే లెక్క.

106. మరణమంటే-
ప్రపంచంలో తాను ఖాళీ అయిపోవడం.
మోక్షమంటే-
తనలో ప్రపంచం ఖాళీ అయిపోవడం.

107. దేన్నీ కోరకు; మోక్షాన్ని కూడా.
మనం యాచకులం కాము.
మనం జ్ఞానశిశువులం.

108. జ్ఞానాంబ దయామయీ!
నేను లేకుండా నాలో నీవే నిండిపో.
నేను మళ్లీ రాకుండా నాలో నీవే ఉండిపో.

109. తన చేతిలో ఇమడకుంటే
అది అంతే అంటాడు.
తన చేతిలో ఇమిడితే
ఇది ఇంతే అంటాడు.

110. రూపాయి నాణేన్ని చిల్లరగా మార్చుకుని వాడుకంటే
అది ప్రపంచానుభవం.

రూపాయిచిల్లరను రూపాయినాణెంగా మార్చుకుని దాచుకుంటే
అది దైవానుభవం.

111. ఇది కల అని తోచినప్పుడు
నీవు మెలకువలో ఉన్నట్టు.
మెలకువలో ఉన్నాను అని అన్నప్పుడు
నీవు కలలో ఉన్నట్టు.

112. ఏ సాధన చేయాలి?
అని ఆలోచించడం కంటే
ఏ సాధన చేయకుండా ఉండడం ఎలా?
అని ఆలోచించండి.

113. నిశ్శబ్ధం అంటే-
వెలుపల అలజడి లేకపోవడం.
మౌనం అంటే-
లోపల అలజడి లేకపోవటం.

114. 'ఒకటి'ని అనేకంగా చూడగలిగే శక్తికి
మాయ అని పేరు.
అనేకాన్ని ఒకటిగా చూడగలిగే శక్తికి
జ్ఞానం అని పేరు.

115. ఏ స్వామి అయినా
వాళ్ల నాయన అయినా
ఎప్పుడు ఏది అనుభవించాలో
అప్పుడు అది అనుభవిస్తాడు.

116. ప్రేక్షకులు సినిమా చూస్తున్నంత ఆసక్తిగా
హాలు గేట్ మేన్ అంత ఆసక్తిగా చూడడు.
ప్రపంచ చిత్రాన్ని ఆసక్తిగా చూసేవాడు సంసారి.
నిరాసక్తంగా చూసేవాడు సన్న్యాసి.

117. ఎవడి కిటికీ నుండి
వాడు సూర్యుణ్ణి చూస్తున్నట్టు

ఎవడి గురువు ద్వారా
వాడు దేవుణ్ణి దర్శిస్తాడు.

118. తిడితే ఈశ్వరుణ్ణి తిట్టు.
పొగిడితే ఈశ్వరుణ్ణే పొగుడు.
ఇంకెవర్నీ తిట్టకు.
ఇంకెవర్నీ పొగడకు.

119. దేవునికిచ్చినట్టు ఉండే విలువ
నిజానికది తనకు తాను ఇచ్చుకునే విలువే.
తనకు తాను ఇచ్చుకున్నట్టు ఉండే విలువ
నిజానికది దేవునికిచ్చే విలువ.

120. కొన్నిచోట్ల కొన్నివేళలలో మాత్రమే
చెల్లుబాటు అయ్యే నాణేలు - నామరూపాలు.
అన్నిచోట్లా అన్నివేళలా
చెల్లుబాటు అయ్యే నాణెం - నేను.

121. 'ఉండేది భగవంతుడొక్కడే'
అన్న స్థిరజ్ఞానంలో ఉంటే
ఏది ఎట్లా ఉన్నా సరే
'ఎందుకు' అన్న ప్రశ్న కలుగదు.

122. ఈ సృష్టిని ఎవరు చేశారో తెలియాలంటే
సృష్టికి పూర్వం ఉన్న అవస్థకు నేను చేరుకోవాలి.
సృష్టిలో భాగమైన నాకు అది అసంభవం.
కలలోనివాడు ఆ కలను కనేవాణ్ణి చూడగలడా?

123. నిద్ర అనేది తన నిద్ర కాదు.
యెందుకంటే నిద్రలో అసలు తానే ఉండడు.
నిద్ర అనేది స్వయంస్థితి.
అది యెవరిదీ కాదు.

124. ధర్మము అంటే జీవనవిధానము.
సత్యము అంటే జీవితపరమార్థము.
ఒకటి మార్గము.
ఇంకొకటి గమ్యము.

125. ఇంట్లో ఉంటావు.
ఒంట్లో ఉంటావు.
ఇల్లు నాది కాదనడం వైరాగ్యం.
వొళ్లు నేను కాదని ఉండడం జ్ఞానం.

126. ప్రేమ అంటేనే స్వార్థం.
స్వార్థం అంటేనే బంధం.
బంధం అంటేనే అజ్ఞానం.
అజ్ఞానం అంటేనే దుఃఖం.

127. నగ్నసత్యం ఏమంటే
నగ్నత్వమే సత్యం.
* * *
దేహానికి తొడుగు వస్త్రం.
మౌనానికి తొడుగు భాషణం.
స్వరూపానికి తొడుగు శరీరం.
* * *
వస్త్రం వదిలినవాడు దిగంబరుడు.
భాషణం వదిలినవాడు మునీశ్వరుడు.
శరీరం వదిలినవాడు చిదంబరుడు.

128. తాను ఖాళీ అయిపోయినా సరే
తానుంటానని తెలియడమే మోక్షం.

129. ఆధ్యాత్మికం అంటే గురువే.అంతే.
ఇంకొక్క మాటే లేదు.
శిష్యుడు లేని గురువే ఆధ్యాత్మికం అంటే.

130. విష్ణువంటే విశ్వం.
శివుడంటే కేంద్రం.

131. గురువుకు మించిన శిష్యుడు అంటే,
గురుస్థాయికి తాను ఎదిగే వరకు
'గురువు తనకు మించినవాడు' అనే
భావనతోనే కదా ఉండేది...
సమస్థితికి తాను చేరుకున్నప్పుడు
ఆ "మించిన" అనే భావనకు మించిపోతాడు.

132. తలను చూపించగలమేగాని,
తలనొప్పిని ఎలా చూపించగలం?
తల ఆయన సృష్టి.
నొప్పి ఆయన జ్ఞానం.

133. నీవుగాక దైవమనేది
ఎక్కడా లేదు - ఎప్పుడూ లేదు - ఏదీలేదు.
ఈ జగత్ స్వప్నం నుండి
మేలుకో - మేలుకో - మేలుకో
నీవే దేవుడవు...నీవే జీవుడవు...
జపాలతో తపాలతో నీకేం పని?
అహంబ్రహ్మాస్మి అని గొంతెత్తి పలుకు.
నీవెప్పుడూ ముక్తుడువే.

134. దైవమొక జీవనది...
నీవు గ్లాసు తీసుకెళితే గ్లాసునీళ్లే తెచ్చుకోగలవు.
బిందు తీసుకెళితే బిందెనీళ్లు తెచ్చుకోగలవు.
పాత్రలేవీ వద్దనుకుని అందులోనే
మునిగిపోయినవారూ ఉన్నారు...రమణుల వలె.
దైవం సదా సిద్ధంగా ఉంది.

135. జీవితాన్ని design చేసిందీ తానే.
దానిని అనుభవించేదీ తానే.
మొదటి తాను కూడా తానేనని
మర్చిపోవడం వలన వచ్చిన తిప్పలే ఇవన్నీను...
ఆ నేనే  ఈ నేనని(Iam That Iam) గుర్తుకుతెచ్చుకునే
ప్రయత్నానికే 'ఆధ్యాత్మికం' అని పేరు.

136. సూర్యకాంతి ఎంతదూరం ప్రయాణిస్తుందో
అంతవరకు ఉన్న మండలం అంతా కలిపి
సూర్యుడు అనాలి.

అలాగే యెంతెంతవఱకు ఈ దైవసృష్టి వ్యాపించి ఉన్నదో
ఆ మొత్తం అంతా కలిపి దేవుడు అనాలి.

137. నా మనస్సు అని నీవు స్వంతదారుగా ఫీలవడం వలన మనసు చెడ్డదయ్యిందేగాని
ఆత్మప్రకాశం నుండి ప్రసారమయ్యే ఓ కాంతిరేఖ మనస్సు.
* * *
బహిర్ముఖమైన ఆత్మే - మనస్సు.
అంతర్ముఖమైన మనస్సే - ఆత్మ.

138. జీవుల్లో భేదాలను చూడడానికి చూసేవాడి సంకల్పమే కారణం.
కుండలు, మూకుడు లాంటివి భూమిలో నుంచి మొలుస్తాయా? అని అడుగుతారు జ్ఞానేశ్వరులు...
కుమ్మరి బుద్ధితోనే అవన్నీ తయారవుతాయి...

139. "దేని వలన సంస్కారలోపాలన్నీ తొలగిపోతాయో అదే  ఉత్తమవిద్య" అన్నారు వివేకానందులు.....అంతేగానీ విద్య అంటే మార్కులు కాదు, ర్యాంకులు కాదు....విద్య అంటే సంస్కారం....
సంస్కారం అంటే ఉత్తమవస్త్రాలను ధరించడం కాదు,
సంస్కారం అంటే శీలం...
శీలం అంటే పారదర్శకత(transparency).

140. ముందు సంకల్పం చేస్తాం.
తర్వాతే కార్యం చేస్తాం.
* * *
అలానే ముందు కర్మ(design) జరుగుతుంది.
తర్వాతే జన్మ (కార్యం) కలుగుతుంది.
* * *
జన్మకు కారణం కర్మే.
కానీ కర్మకు కారణం జన్మ కాదు.
* * *
వచ్చే జన్మకు design
ప్రస్తుత జన్మలో జరుగదు.
* * *
రంగస్థలం మీద నాటకం జరుగుతుంటే
రేపు వేయబోయే నాటకం script వ్రాసుకుంటాడా?
* * *
జన్మకు-జన్మకు మధ్య వ్యవధిలో
design చేసుకుంటాడు.
* * *
జన్మకు-జన్మకు మధ్య వ్యవధిలో
జీవునికున్న ఇచ్ఛాశక్తి అనంతం.
* * *
ఆ ఇచ్ఛాశక్తి మూలంగానే
ప్రస్తుత జన్మ ఇలా ఉంది.
* * *
సుఖదుఃఖాలకు కారణం ఏ విధీ కాదు,
నీకు నీవే కల్పించుకున్న బంధనాలే ఇవి.
* * *
దుఃఖం, సుఖం రెండూ నీ స్వేచ్ఛానుసారం కలిగినవే.
బంధం, మోక్షం రెండూ నీ ఇచ్ఛాశక్తిలో భాగమే.
* * *

ఇప్పుడు నీవున్న స్థితిని
స్వయంగా నీవు కోరి design చేసుకున్నదే.
* * *
జరిగేదాన్ని చూస్తూ ఉండడం తప్ప
మార్చడం కూర్చడం వీలుకాదు.
* * *
జన్మకు-జన్మకు మధ్య వ్యవధిలో
ఉన్న ఇచ్ఛాశక్తిని అనుసరించే...

తాను ఏకంగా(దేవుడుగా) ఉండాలో లేక
అనేకంగా(జీవ-జగత్-జగదీశ్వరులుగా) అవ్వాలో
నిర్ణయించుకునేశక్తి ఉంటుంది ఇప్పుడు కాదు.

తలక్రిందులుగా తపస్సు చేసినా సరే
గతం తాను వ్రాసుకొచ్చిన script మారదు.
అని తెలిసే రమణులు "సుమ్మా ఇరు" ఊరికే ఉండు అన్నారు.

141. అనంతవిశ్వంలో ఉన్నదెల్లా చీకటి మాత్రమే.
అందులో మిణుగురుల్లా నక్షత్రకోటి ప్రకాశిస్తోంది.

ఈ చీకటి-వెలుగులు రెండూ
భౌతికవిషయములు.

ఈ చీకటి-వెలుగులు రెండూ
ఏ వెలుగులో ప్రకాశిస్తున్నాయో
(ఉనికి గలిగి ఉన్నాయో)
ఆ వెలుగే "పరంజ్యోతి".

ఉన్నదెల్లా నలుపే(చీకటే)
ఆ నలుపే శ్యామలాదేవి(మాయ)
ఆ నలుపే కృష్ణుడు(మాయావి)

భూమిని ఆవరించి వాతావరణపొరల వలన మనకు ఆ నలుపు నీలం
రంగులో కనిపిస్తోందే తప్ప ఉండేది నలుపే.

* * *

భౌతికవస్తువులు కనబడేది
సూర్యకాంతిలో.

తన శరీరం కూడా కనబడని
చిట్టచీకటిలో సైతం "నేను" ఉన్నానని తెలిసేది
పరంజ్యోతిలో.

* * *

ఇది వెలుగు, ఇది చీకటి అని గుర్తించే
ప్రజ్ఞయే - పరంజ్యోతి.

కలలు మెలకువలు కల అని ఎఱిగిన
మెలకువే - పరంజ్యోతి.

* * *

సదా మనం చీకటిలో(మాయలో)
ఉన్నామని తెలుసుకుంటే అదే శివరాత్రి.
నిత్యజాగరూకతయే - జాగరణ.

142. గురుసన్నిధిలో ఉండడం కాదు,
గురువులోనే ఉన్నాం అందరం.

143. శిశువు అని పేరేగాని
మాతృత్వాన్ని అనుభవిస్తుంది.

అమ్మ అని పేరేగాని
శిశుత్వాన్ని అనుభవిస్తుంది.

* * *

శిష్యుడు అని పేరేగాని
గురుత్వాన్ని అనుభవిస్తాడు.

గురువు అని పేరేగాని
శిష్యత్వాన్ని అనుభవిస్తాడు.

144. ప్రజాస్వామ్యంలో -
తొలిపౌరుడు పౌరుడేగాని అతడు రాష్ట్రపతి.
ఆత్మస్వామ్యంలో-
తొలి తలంపు తలంపేగాని అది విశ్వపతి.

145. మైండ్ బ్లాక్ అయితేనే అది అనుభవంలో ఉండేది.
మైండ్ పనిచేస్తే అది అనుభవంలో ఉండదు.

146. అల అణగితే సముద్రమే అవుతుంది.
అహం అణగితే దైవమే అవుతుంది.

147. చేసేది, చేయగలిగింది ఏమీలేదు,
'అదే నేను' అని ఉండడం తప్ప.

148. కాలదేశములకతీతమైనదానిని గుఱించి
కాలదేశములలో మాట్లాడుకుంటున్నాము.
సమస్య తెగదు.

149. భగవంతుడు ఎత్తింది పది అవతారాలు కాదు,
ఒకే ఒక అవతారం...అదే ప్రపంచం.

150. Un Limited అనేది నీ స్వరూపం.
Limited అనేది నీవై ఏర్పరచుకున్నది.

నీవుంటే Limited గా ఉంటావు.
నీవు లేకుంటే Un Limited గా ఉంటావు.

151. శివుడు నీ యెదుట పడ్డా సరే-
"నేనే కేంద్రం" అనాలి.
దర్శనం కంటే ద్రష్ట గొప్ప అనేది
ముందు అర్థం కావాలి.

152. ఒకటే రెండయ్యింది.
దేవుడే జీవుడయ్యింది.

153. కలకు గుర్తు - అన్యం తోచడం.
మెలకువకు గుర్తు - నీవొక్కడే శేషించడం.
* * *
అన్యం తోచడమే - బంధం.
అన్యం తోయకుంటే - మోక్షం.

154. 'నేను బాబు' అను దానిలో-
నేను అనునది భగవన్నామము.
బాబు అనునది వ్యక్తినామము.
వ్యక్తికి భగవంతుడు
ఒక్క అణువు కూడా
ఒక్క క్షణము కూడా
ఎడం లేడు.
అని ఎఱుగుటే ఆధ్యాత్మికజ్ఞానము.

155. పరిధి - పార్వతి.
కేంద్రం - శివుడు.

156. భావుకత అనేది మనసుకు సంబంధించినది.
అది పరమం కాదు.
* * *
భావుకత మీకు లొంగి ఉండాలి.
దానికి మీరు లొంగి ఉండకూడదు.
* * *
దాని ఆధీనంలో తానుంటే - కవి.
తన ఆధీనంలో ఉంచుకుంటే - జ్ఞాని.

157.
శ్లో|| నాయమాత్మా ప్రవచనేన లభ్య నమేధయాన బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేనలభ్య హస్తస్యైష ఆత్మావివృణుతే తనూంస్వామ్||
-కఠోపనిషత్తు
* * *
వేదాధ్యయనం వల్ల గాని

బుద్ధి కుశలత చేతగాని
గొప్ప పాండిత్యం వల్లగాని
ఆత్మను తెలిసికొనలేరు.
అది ఎవరిని ఎన్నుకుంటుందో
అట్టి వానికే తన నిజ స్వరూపాన్ని వెల్లడిస్తుంది.
* * *
అద్దంలో ఏ ప్రతిబింబానికి సాక్షాత్కరించాలి అనేది
బింబమే ఎన్నుకుంటుంది అన్నట్టు...
* * *
బింబము - దేవుడు.
ప్రతిబింబం - జీవుడు.

158. నాది అని ఇవ్వడం - దానం.
నాది కాదని ఇవ్వడం - త్యాగం.

159
కర్మయోగికి-
నిష్కామకర్మ అనేది
ప్రారబ్ధాన్ని
తనకు అనుకూలంగా మార్చుకునే ప్రక్రియ.
* * *
భక్తియోగికి-
శరణాగతి అనేది
భగవదేచ్ఛను తనకు అనుకూలంగా
మార్చుకునే ప్రక్రియ.
* * *
జ్ఞానయోగికి-
విచారణ అనేది
'నియతి' ని తనకు అనుకూలంగా
మార్చుకునే ప్రక్రియ.

160
లెక్కలు
వేసి-తీసి
వేసి-తీసి
వేసి-తీసి
చివరికి
'ఒకటి' మిగిలింది.
ఆ 'ఒకటి'
'నేనే' అని తెలిసింది.

161. 'ఉండటం' అనేది క్రియ కాదు; స్వస్థితి.

162. దేవుణ్ణి చూడడం అంటూ ఏమీలేదు.
దేవుడిగా ఉండటమే.
"అహంబ్రహ్మాస్మి" అని అంటూ, అనుకుంటూ ఉండటమే
ముఖ్యసాధన.

163. ఆత్మయే బ్రహ్మము.
అదియే సర్వము.

164. భక్తి అంటే,
నేను భగవంతుని బిడ్డని అని
నేను చెప్పుకుంటే చాలదు.
వీడు నా బిడ్డడు అని
భగవంతుడు అనాలి.
అప్పుడే ఆ భక్తికి ఓ అర్థం, పరమార్థం ఉంటుంది.
లేకుంటే అదొక వంచన అవుతుంది.
లేదా అదొక మానసిక వ్యాధి అవుతుంది.

165. భాషా పాండిత్యం
శాస్త్రపరిచయం
లేకుండా చేశావు తల్లీ...!

ఇదొక్కటి చాలు...
నన్నుద్ధరించే దిశగా నన్నెంత త్వరగా
తీసుకెళుతున్నావో నాకు తెలుస్తోంది.
నీ ఒడిలో నీ బడిలో 'తెలియదు' అనే
ముఖ్యపాఠాన్ని నేర్పావు నాకు.

166. అప్పుడెప్పుడో దక్షిణకైలాసపర్వతసానువుల్లో
యక్షిణి రూపంలో దిగివచ్చి ఇంద్రుణ్ణి
అనుగ్రహించావట.
* * *
ఇప్పుడు ఇంద్రియలోలుడైన అజ్ఞానశిశువును
ఉద్ధరించడానికి గురురూపంగా వచ్చావట.
* * *
అప్పుడు ఇప్పుడు నీ కరుణ సమం.
సరుకులో హెచ్చుతగ్గులుంటాయేగానే
తూకం రాయిలో హెచ్చుతగ్గులుండవు కదా!
* * *

167. జ్ఞానాంబా!
నేను చేయని తప్పూ లేదు.
చేసిన ఒప్పూ లేదు.
నేనొక మైల పదార్థాన్ని.
* * *
నా తలపుకు నీ రూపం అతికించి
నా శ్వాసకు నీ నామం తగిలించి
ఎడతెగని జ్ఞాననిష్ఠను కలిగించావు.
* * *
ఇదంతా నీ నియంతృత్వానికి నిదర్శనమేగాని
నా భక్తికి నిదర్శనం కాదు.
* * *

168. గ్రంథాలను వదిలేస్తే జ్ఞానం కలిగినట్టు.
గురువును వదిలేస్తే తత్త్వం తెలిసినట్టు.
దేవుణ్ణి వదిలేస్తే బంధం పోయినట్టు.
తనను వదిలేస్తే మోక్షం వచ్చినట్టు.

169. శక్తి - పార్వతి.
విద్య - సరస్వతి.
సంపద - లక్ష్మి.
* * *
జ్ఞానాంబా!
ముగ్గురమ్మల సమిష్టి రూపం నీది.
ముగ్గురమ్మల ఉమ్మడి ప్రేమ నాది.

170. జ్ఞానాంబా! నీ ఇచ్ఛ...
ఇదే మన చివరిమాటగా ఉండాలి.

171. గురువును మ్రింగేసిన శిష్యుడు - సద్గురువే.
దేవుణ్ణి మ్రింగేసిన జీవుడు - సద్వస్తువే.
* * *
వాడు వీణ్ణి మ్రింగేలోపు
వీడు వాణ్ణి మ్రింగేయాలి.
* * *
వాడు వీణ్ణి మ్రింగేస్తే - మరణం.
వీడు వాణ్ణి మ్రింగేస్తే - మోక్షం.

172. శిష్యుడు అంటే,
గురువుకు దిగువున ఉన్నవాడు అనికాదు,
గురువుకు సమానమైనవాడు అని అర్థం.

173. నిద్ర పోవడం
మెలకువ రావడం కాదు జరిగేది.

స్వప్నం రావడం
స్వప్నం పోవడం జరుగుతుంది.

174. "నేను" అనేది -
మూడు విధాలుగా ఉన్నది.

1. అండముగా(సుప్తావస్తగా)
2. పిండముగా (తనువుగా)
3. బ్రహ్మాండముగా(జగత్తుగా)

175. సిద్ధుడు పొందే ఆనందమే
త్రాగుబోతు పొందే ఆనందం కూడా.

సిద్ధుడు ఏ ఆలంబనమూ
లేకుండా పొందుతున్నాడు.

అదే ఆనందాన్ని ఒకడు  మత్తుపానీయాలద్వారా,
పదార్థాల ద్వారా పొందుతున్నాడు.

నిరాలంబనమైన ఆనందాన్ని పొందేవాడు - సిద్ధుడు.
ఆలంబనమైన ఆనందాన్ని పొందేవాడు - మత్తుడు.

176. జీవితం ఎందుకు? అనే ప్రశ్న జీవితానిది.
నీ కెందుకు ఆ ప్రశ్న?
జీవికే జీవితం ఉంటుంది.
నీవు జీవీ కావు, నీకు జీవితమూ లేదు.
నీవు హాయిగా ఉండు.
'హాయే' నీవు.

177. గాఢనిద్రలో ఉన్న అనుభవాన్ని
మెలకువలో పొందాలనే
ప్రయత్నమే జీవితం.

178. శిల్పి శిల్పాన్ని తయారు చేయగలడేగాని
శిలను తయారు చేయలేడు.
* * *
శిల - విధి.

శిల్పి - పురుషప్రయత్నం.
శిల్పం - ప్రారబ్ధం.

179. వాస్తవం అనేది కూడా మాయే.
మాయ అనేది కూడా వాస్తవమే.

180. దేవుడు ఎవర్నీ సృష్టించలేదు.
దేవుణ్ణి ఎవరూ సృష్టించలేదు.
* * *
సృష్టి లేని స్రష్ట - దేవుడు.
లేదా
స్రష్ట లేని సృష్టి - దేవుడు.
* * *
అంతేగాని,
సృష్టిని, స్రష్టను రెంటినీ అంగీకరిస్తే
సమస్య తెగదు.
* * *

181. సృష్టికి మునుపు, లయానికి తరువాత
ఏదైతే ఉన్నదో ఇప్పుడూ అదే ఉన్నది.
అదే నేను.
* * *
నేను పుట్టక మునుపు, నేను గిట్టిన తరువాత
ఏదైతే ఉన్నదో ఇప్పుడూ అదే ఉన్నది.
అదే నేను.
* * *
మెలకువకు మునుపు, నిద్ర పోయిన తరువాత
ఏదైతే ఉన్నదో ఇప్పుడూ అదే ఉన్నది.
అదే నేను.

182. నేను కంటున్నాను అని కనే కన్ను అనదు.
నేను వింటున్నాను అని వినే చెవి అనదు.
కానీ నీవు మధ్యలో దూరి-

నేను కంటున్నాను, నేను వింటున్నాను
అని అంటున్నావు.

అవి ఊరకే ఉన్నాయి
నీవూ ఊరకే ఉండొచ్చు కదా!

నీవు కంటే నీవు చెప్పాలి.
నీవు వింటే నీవు చెప్పాలి.

183. సృష్టికి మునుపు, లయానికి తరువాత
ఏదైతే ఉన్నదో ఇప్పుడూ అదే ఉన్నది.
అదే నేను.
* * *
నేను పుట్టక మునుపు, నేను గిట్టిన తరువాత
ఏదైతే ఉన్నదో ఇప్పుడూ అదే ఉన్నది.
అదే నేను.
* * *
మెలకువకు మునుపు, నిద్ర పోయిన తరువాత
ఏదైతే ఉన్నదో ఇప్పుడూ అదే ఉన్నది.
అదే నేను.

184. "నమశ్శివాయ" అనే యోగ పంచాక్షరీ మంత్రం కంటే
"అరుణాచల" అనే జ్ఞాన పంచాక్షరీ మంత్రం
3 కోట్ల రెట్లు ఎక్కువైంది...అని స్కాందం.

"అరుణాచల" అనే జ్ఞానపంచాక్షరీ మంత్రం కంటే
"నేను" అనే అహంమంత్రం 33 కోట్లరెట్లు ఎక్కువైంది...అని సద్గురు వాక్యం.

185. తెలియనిదానిని గుఱించి ఎందుకు బాధపడడం?
తెలియనిదానిని తెలియనట్టుగానే వదిలేయండి...
తెలియనిదానిని తెలుసుకోవాలని ఎందుకు అనుకోవడం?
తెలిబడేదే తెలియనివ్వండి.
తెలియనిదానిని వదిలేయండి.

186. నీకు తెలిసి ఒకడికి బాధ లిగించవద్దు.
ఇదే అన్నిటికన్నా గొప్ప ధర్మం.

187. నీకెట్లా అనిపిస్తే అట్లా అనుకో.
నీకెట్లా కనిపిస్తే అట్లా చూడు.
సమస్యేముంది?

188. యోగమో, రోగమో...
నిద్రో, సమాధో...
నిన్ను నీవు మరచిపోవాలి...అంతే.
అదే పరమానందస్థితి.

189. గుర్తు లేకుంటే గుంపులో ఒకడుగా ఉంటాడు.
గుర్తుంటే గుంపు మొత్తం తానే అని ఉంటాడు.

190. అవతార పురుషుడు అంటే-
డ్రైవింగు తెలిసిన ఓనరు.

191. దేవుడి దగ్గరకు మనం వెళితే - మరణం.
మన దగ్గరకు దేవుడు వస్తే - మోక్షం.

192. నిజమైన భక్తుడు జ్ఞాని అయ్యే ఉంటాడు.
నిజమైన జ్ఞాని భక్తుడు అయ్యే ఉంటాడు.
భక్తుని నిండా ఉండేది జ్ఞానమే.
జ్ఞాని నిండా ఉండేది భక్తే.

193. చూడబడేవి
మారిపోతూ ఉంటాయి.
చూడబడేవాళ్ళు
మారిపోతూ ఉంటారు.
కానీ,
చూచేవాడు మాత్రం
మారకుండా "ఒక్కడు"గానే ఉన్నాడు.
ఆ ఒక్కడు "తానే".

"తాను" అంటే వ్యక్తి కాదు.
వ్యక్తిని "చూచేవాడు".
కానీ వ్యక్తి
నేను చూస్తున్నాను అనుకుంటున్నాడు.
* * *
చూడబడేదంతా - మాయ.
చూచేవాడు - బ్రహ్మము.

194. రూపంగా ఉన్నవాడు - జీవుడు.
స్వరూపంగా ఉన్నవాడు - దేవుడు.

195. పెట్టిన పేరు - బాబు.
పెట్టని పేరు - నేను.

196. దేవుణ్ణి మోక్షం కోరేవాడు - భక్తుడు.
దేవుడికి మోక్షం ఇచ్చేవాడు - ముక్తుడు.

197. సృష్టి-లో అనేకం.
సృష్టి-గా ఏకం.

198. క్రీడ వలన ఆనందం పొందేవాడు జీవుడు.
ఆనందం వలన క్రీడ(సృష్టి) జరిపేవాడు దేవుడు.

199. గుర్తు పెట్టుకోవడం బంధం.
మరచిపోవడం మోక్షం.

200. దేవుడు కనబడక కాదు,
మనం చూడక.

* * *

118. అమృతవాక్యాలు

---

7-11-2021 * ఆదివారం

జోరున వర్షం...

అయినా సరే, ఈ ఉదయం 10 గంటలకు సద్గురు సన్నిధికి చేరుకున్నాం నేనూ దేవీప్రసాద్...

అడుగు పెట్టీ పెట్టగానే ఆత్మీయులు పట్టెయ్య గారు
వేడివేడిగా ఛాయ్ అందించారు...

పట్టెయ్య గతనెల తాత ఆరాధనకు వచ్చి,
ఇక్కడే ఉండి గురుసేవలో తరిస్తున్నారు...

ఉమ్మి పట్టడం, కాళ్లు పట్టడం, వీపు రుద్దడం...లాంటి వ్యక్తిగతసేవలు గతంలో పట్టెయ్య గారు చేసి ఉండలేదు....

అందువల్ల పట్టెయ్యగారు ఇలాంటి సేవలు చేయడం అనేది కాస్త ఇబ్బందిగా ఫీలయ్యారు(ట) గురువుగారు....

అలా ఏమీలేదు స్వామి...సంతోషంతో చేస్తున్నాను... నా తండ్రికి నేను సేవ చేసుకుంటున్నాను...అన్నరు(ట) పట్టెయ్య.

* * *

అనంతపురం జిల్లా నుంచి నాగలింగమయ్య అనే అతను వచ్చాడు ఓ వారం క్రితం...

నేనూ పట్టెయ్య వంటగదిలో టీ త్రాగుతూ
పిచ్చాపాటి మాట్లాడుతుండగా...
నాగలింగం వంటగదిలోకి వచ్చాడు...

పట్టెయ్య అతనికి టిఫన్ పెట్టాడు....
అతను తింటుండగా గురువుగారు హాల్లోంచి వంటగదిలోకి వచ్చి-

"ఇదిగో ఇతనే జ్ఞానశిశువు" అంటూ పరిచయం చేశారు నన్ను అతనికి.

మా మధ్య నమస్కార ప్రతినమస్కారాలు జరిగాయి...

గురువుగారి నోట "జ్ఞానశిశువు" అనేమాట వినడం ఇదే తొలిసారి.

ఆ అతిధి వచ్చి ఐదారు రోజులయ్యింది...
ఆధ్యాత్మికాన్వేషణలో ఉన్నవాడు...
తీవ్రజిజ్ఞాస ఉన్నవాడు...

అది అతను అడిగే కీలకమైన ప్రశ్నలను బట్టే అర్థమైంది-

గురుసన్నిధిలో ఉండగా నన్నేవో ప్రశ్నలు అడిగాడు-
విన్నట్టు తలూపానేగాని, సమాధానం ఇవ్వలేదు...
"గురువే సమాధానం"
వారి ముందు నేను సమాధానం ఇవ్వడం ఏమిటి? హాస్యాస్పదంగా ఉంటుంది.

ఎంత గొప్ప వాచాలత్వమైనా,
ఎంత గొప్ప వ్యాసమైనా
వారి సన్నిధిలో ప్రకటించడానికి లజ్జపడుతుంది మనసు.

తమ నగ్నత్వం కృష్ణుని కంట పడడానికి
గోపికలు పడిన లజ్జలాంటిదే...

కానీ అతని ఆర్తి వాస్తవం.
సమాధానం ఇచ్చే తీరాలి.

అందుకే గురువుగారు కూడా-
"ఆధ్యాత్మికం అనేది ఓ ఊహాప్రపంచం.
కానీ నీవు ప్రశ్నలను సిన్సియర్ గానే అడుగుతున్నావు...."అని ప్రశంసించారు అతన్ని.

"నీకు సమాధానం దొరికే బాధ్యత నాది...
కాని నేను చెప్పిన పని ఒకటి చేయవలసి ఉంటుంది నీవు...వివాహం చేసుకో...
వివాహం అయిన 11 నెలలకు నీవు వెతికేది నీకు దొరుకుతుంది...అన్నారు గురువుగారు...

అతను అందుకు సముఖంగా లేనట్లే ఉంది...అతని వాదన చూస్తే...

సృష్టికావల Something Doing ఏదో ఉంది...
దానిని తెలుసుకోవాలి...అన్నాడతను.

ఆ something దొరకాలంటే పెళ్లి చేసుకో...
అవాఙ్మానసగోచరమని ఋషులు దేనినయితే చెప్పారో, అదే something.
ఆ something గురించి నేను చూసుకుంటాను...
ముందు మీరు పెళ్లి చేసుకోండి....

పట్టు విడవడం లేదు గురువుగారు...

"వివాహం నా ఆత్మాన్వేషణకు సహాయకారి అని నేననుకోవడం లేదు...."

అతని వాదన కొనసాగుతూనే ఉంది...

"అలా అని మీ తల్లిదండ్రులు అనుకొని వుంటే, నీవెలా వచ్చివుండేవాడివి?"

అని బ్రహ్మాస్త్రం వేశారు గురువుగారు.

"స్త్రీ, ప్రేమ, పెళ్లి... ఇవన్నీ attraction" అన్నాడతను....
నీవు something Doing  అంటున్నావుగా...
అది ఇంకా dangerous attraction"
అన్నారు గురువుగారు.

'రమణమహర్షి, సాయిబాబా...లాంటి మహనీయులందరూ ఎక్కడికెళ్లారు? అడిగాడతను.

నిద్రలో నీవు ఎక్కడికెళుతున్నావో అక్కడికి...
అన్నారు గురువుగారు.

కీర్తి కాంక్షలు, కామ వాంఛలు... జయించడం ఎట్లా? అడిగాడతను...

"ఎందుకు జయించాలి?
అవన్నీ నువ్వు వచ్చిన తరువాత వచ్చినవి.
వాటిమానాన వాటిని వదిలేయండి...
నేను అనేది కూడా ఒక వాంఛే."
అన్నారు గరువుగారు.

* * *

"స్వానుభవం కలగాలి...."

"స్వానుభవము అంటే స్వయంగా తానే అనుభవం. అంతేగాని తన అనుభవం అనికాదు."

"క్రియేషన్ వలన purpose ఏమి?"

"క్రియేషనే purpose."

"fulfil కావాలంటే ఏం చేయాలి?"

"ఏమీ చేయొద్దు...అది యెప్పుడూ fulfilగానే ఉంది....
క్రొత్తగా నీవు ఏదో చేసి నింపాల్సిన అవసరం లేదు."

"నిజస్థితిలో ఉండేటట్లు అనుగ్రహించండి...."

"అందరూ ఉండేది నిజస్థితిలోనే.
నిజస్థితిలో లేననుకోవడం వల్లనే ఇబ్బంది అంతా."

"అర్థం కావడం లేదుస్వామీ..."

"అవును ఇది తప్ప మిగతా అన్నీ అర్థమౌతుంది.
ఇది అర్థం కావాలంటే నీవు పెళ్లి చేసుకో..."

* * *

spirituality అనేది Totality కి సంబంధించినది....

దానిని మనం వ్యక్తిగతమైన సమస్యగా తీసుకొని హైరానా పడుతున్నాం.

కన్ను చూస్తుంటే, నేను చూస్తున్నానని అనుకున్నట్టుగా....

చూసేవాడు, చేసేవాడు వేరే వున్నాడు.
మనం మధ్యలో దూరి మన subject గా భ్రమపడుతున్నాం ఆధ్యాత్మికాన్ని.

* * *

నా తనువుకు లోపల మాత్రమే నేనున్నాను అని వుంటే అది బంధం.
నా తనువుకు వెలుపల కూడా నేనున్నాను అని వుంటే అది మోక్షం.

అలా లోపల, బయట నిండివున్న అనంత చైతన్యాన్ని తన లోపల మాత్రమే అనుభవించాలనే కోరికే సాధనకు కారణం అవుతోంది.

* * *

వెలుపల కూడా వున్నాను...అనుకోవడం భావనే కదా?

లోపల ఉన్నాను అనేది కూడా భావనే....

* * *

"నేను" మూలాన్ని కనుగొనమన్నారు భగవాను....

ఎంతటివాడు చెప్పినాసరే,
అవన్నీ చెప్పుడు మాటలే...
చెప్పుడు మాటలు నమ్మొద్దు...
అన్నారు గురువుగారు.

* * *

సాధన అవసరం లేదా?

అంతటా ఉన్న ఆకాశాన్ని చేరడానికి ఏ సాధన చేయాలి?

ఆ నేనుకు, ఈ నేను భిన్నం కాదు...
సముద్రంలోని నీరును ఓ పాత్రలోకి తీసుకున్నప్పుడు
ఆ నీరు, ఈ నీరు ఒకటే.
కానీ, పాత్రలో ఉన్న సముద్రపునీటికి ఆటుపోటులు, తుఫానులు కలుగవు....
ఆ ఒక్క తేడా వలన ఈ నేను ఆ నేను కాదేమోనని అనుకుంటున్నాడు...

ఆత్మనిష్ఠ అంటే?

ఆ నీరు, ఈ నీరు ఒకటే అనుకోవడమే ఆత్మనిష్ఠ.

* * *

ప్రయత్నం దేనిని తెలుపుతోందంటే,
already మీరు దానిని పొందే వున్నారు అనే విషయం తెల్పుతోంది.

"దర్శకుడు" అంటే సినిమా తీయక మునుపే తీయబోయే సినిమాను తనలో మొదటగా దర్శించినవాడు అని అర్థం.

రిలీజ్ అయ్యాక చూసేది రెండవసారి.

బాణం విడిచే ముందే, తన చూపు మొదటగా గమ్యాన్ని చేరిపోయి వుంటుంది.
తరువాతే బాణం చేరుకుంటుంది.

అలాగే సిద్ధి కలిగిన తరువాతే
సాధన జరిగేది....

సిద్ధిలో కలిగే కదలికే - సాధన.

సిద్ధి వలననే సాధనగాని
సాధన వలన సిద్ధి కలగడం కాదు.

* * *

సంజీవరావు అడిగిన ప్రశ్న-
ఏది సత్యం? ఏది మిథ్య?

"నేను సంజీవరావు" అనే నేను సత్యము.
సంజీవరావు నేను అనే నేను మిథ్య.

* * *

వ్యక్తికి ఆలోచనలు ఉండటం కాదు,
వ్యక్తే ఓ ఆలోచన.

* * *

ఒక్క మనిషే దేవుడి గుఱించి, సృష్టి గుఱించి ఆలోచిస్తుండేది...

ఇతర ఏ జీవీ ఆలోచించడం లేదు...

పుడుతున్నాయి...కష్టసుఖాలు అనుభవిస్తున్నాయి...మరణిస్తున్నాయి...

మనలాగా వాటికి "ఎందుకు?" అన్న ప్రశ్న కలగడం లేదు.

మనకు ఆ ప్రశ్న తొలగడం లేదు...

కానీ మానవజన్మ ఉత్తమమైనదనే మానవుడే పుస్తకాల్లో వ్రాసుకున్నాడు...

* * *

అటు స్థూలవిషయాల గురించి మనకు దిగులు లేదు....
అంటే గ్రహాలు, నక్షత్రాలు గుఱించి....

ఇటు సూక్ష్మవిషయాల గుఱించీ మనకు దిగులు లేదు....
అంటే మనలోపల కిడ్నీ, లివరు, గుండె, రక్తప్రసరణ...లాంటివి ఎలా పనిచేస్తున్నాయో అనేవాటి గుఱించి....

మధ్యలో ఉన్న "జీవితం" గుఱించే దిగులంతా....

స్థూల, సూక్ష్మ విషయాలు జరిగినంత సహజంగా మధ్యలో జీవితం కూడా సహజంగా జరుగుతోంది....దిగులు అవసరం లేదు.

* * *

అరుణగిరి ప్రదక్షిణ చేసి చివరకు ఎక్కడకు చేరుకుంటారు?

బయలుదేరిన చోటుకే కదా...!

అంత సంబడానికి ఉన్నచోటనే ఉంటే పోలా...! అన్నారు గురువుగారు.

ఆ "విరమణే" కావలసింది....

ఈ విషయం మొదట్లో చెబితే ఎవరికీ నచ్చదు....

తిరిగి తిరిగి మళ్లీ "స్వస్థానం" చేరవలసిందే.

ఇప్పుడు-ఇక్కడ-ఇలా అన్న "స్వస్థితి"లో సంస్థితమవ్వాల్సిందే.

* * *

మొత్తం 100 ఓట్లు ఉన్నాయి...
అందులో నీ వద్ద 50 ఓట్లు ఉన్నాయి.
ప్రకృతి వద్ద 50 ఓట్లు ఉన్నాయి.

నీవు ప్రయత్నపూర్వకంగా ప్రకృతి ఓట్లు లాక్కోగలగాలి.
అప్పుడు నీవు బలం అవుతావు.

నీవు బలహీనుడవైతే
ప్రకృతి నీ ఓట్లను లాక్కొని ప్రకృతి బలం అవుతుంది.

* * *

మాయ ఉంది అనుకోవడమే మాయ

* * *

"అది"
తెలిసింది
తెలియంది
అందుకే సమస్య తెగడం లేదు.

* * *

మరణించిన తరువాత పరిస్థితి ఏమి?

ఎలాగూ మరణిస్తావుగా అప్పుడు తెలుస్తుందిలే.
ఈలోపు ఎవరు ఏం చెప్పినా అది అనుభవంలోకి రాదు.

* * *

ఏది నిజం?
నీవు నిజం అనుకునేది అబద్ధం.
నీవు అబద్ధం అనుకునేది నిజం.

* * *

ఏది శాశ్వతం?
ఏది శాశ్వతమో అదే శాశ్వతం.

* * *

జ్ఞానం పలు రకాలు.
అందులో అజ్ఞానం ఒక రకం.

అజ్ఞానం పలు రకాలు.
అందులో జ్ఞానం ఒక రకం.

* * *

ధర్మాధర్మములను అనుభవించేదే ధర్మం.
న్యాయాన్యాయములను అనుభవించేదే న్యాయం.

జ్ఞానాజ్ఞానములను అనుభవించేదే జ్ఞానం.
సత్యాసత్యములను అనుభవించేదే సత్యం.

* * *

దగ్గరగా ఉన్న నేను - నేను.
దూరం ఉన్న నేను - నీవు, అతడు.

* * *

బ్రహ్మము అంటే, బృహత్+అహము.
అంతకు మించి నేను లేదు అని అర్థం.

సకలమూ బ్రహ్మమే అంటే,
సకలమూ నేనే అని అర్థము.

* * *

"నేను" యొక్క క్యారెక్టర్ ఏమి?

అన్ని క్యారెక్టర్లూ నేనులో భాగాలే.
నేనుకంటూ ఓ క్యారెక్టరు లేదు.
అన్ని నేనులూ కలిపి నేను.
ఇదే నేను యొక్క క్యారెక్టర్.

* * *

"నేను" ఎలా ఉంది?

నేనులాగే ఉంది.
మిగతా అన్నిటికీ ఏదోవిధంగా వివరణ ఇవ్వొచ్చు.
కానీ "నేను" ఒక్కదానికి మాత్రం  వివరణ చెప్పలేం.

* * *

"అది" ఉందా? లేదా?

లేనట్లు ఉన్నది.

* * *

ఎంతవఱకు ఈ ప్రయాణం?

కలలో చేసే ప్రయాణం లాంటిదే.
నీవున్న చోటే నీవుంటావు.

* * *

ఇది ఎవరి కల?

కలను కనేవానిది.

* * *

మఱపు ఎందుకొచ్చింది?

నీవు లేకుండా నీ నీడ ఉంటుందా?
నీవుంటేనే జ్ఞప్తి, మఱపు ఉంటాయి.
అన్నింటికీ నీవే కారణం.

* * *

ఏది ఉన్నది?

ఉన్నదే.

లేనిదేది?

లేనిదే.

* * *

ఇవికాక వేఱే ఇంకేమున్నాయి మీకు?

వేరే అనేవి కూడా నేనే.

* * *

అంతా నేనేనా?

"ఈ దేహం మాత్రమే నేను" అనుకోబట్టే
ఈ ప్రశ్న కలిగింది.

నేను ప్రక్కన డేష్ పెట్టేయ్...ఇలా....

నేను_____________

అందులో ఏమైనా వ్రాసుకో.
ఏం వ్రాసుకున్నా సరిపోతుంది.

* * *

వేదాంతసారాన్నంతా ఒక్కమాటలో చెప్పాలంటే-
"ఉన్నది ఉన్నది" అనాలి...అంతే.

మొదటి ఉన్నది నామవాచకం
రెండవ ఉన్నది క్రియావాచకం

* * *

కన్ను ద్వారా నీవెలా దృశ్యాన్ని చూస్తున్నావో
నీ ద్వారా దృశ్యాన్ని చూచేవాడు భగవంతుడు.
భగవంతుడికి నీవే కన్ను.

* * *

భద్రాచలం నుండి ఉపాధ్యాయులు కృష్ణారావుగారు వీడియో కాల్ లో గురువుగారిని దర్శించుకుని ఆనందపడ్డారు....

ఏవైనా అమృతవాక్యాలు చెప్పండి గురువుగారూ...! అని కోరారు...

ఉన్నవన్నీ అమృతవాక్యాలే....అన్నారు గురువుగారు.

* * *

119. ఎందుకు జరక్కూడదు?

---

8-11-2021 * సోమవారం * నాగులచవితి

ఉదయం 11 గంటలకు సద్గురు సన్నిధికెళ్లాం...
నేనూ ప్రసాద్...

పట్టెయ్య వేడి వేడి ఛాయ్ అందించాడు....

నోటితో తేనీటి మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ...
కంటితో సద్గురు ముఖారవిందాన్ని వీక్షిస్తూ...

మనసుతో స్వరూపమైన మౌనాన్ని అనుభవిస్తూ...
చాలా సేపు అలా మౌనంగా కూర్చున్నాం...

ఇంతలో ఎవరో గురువుగారికి ఫోన్ చేశారు-
స్వామీ... దత్తక్షేత్రం వెళ్లినప్పుడు దైవసన్నిధిలో మా ఆవిడ చీరకు మంట అంటుకొని కాలింది...
దత్తసన్నిధిలో ఎందుకిలా జరిగింది? దానిని ఎలా అర్థం చేసుకోవాలి? అని అడిగారు...

"పొరపాటున కూడా ఆ క్షేత్రానికి వెళ్లకూడదని అర్థం చేసుకోవాలి" అన్నారు గురువుగారు.

* * *

జరిగిన పుట్టానికి
దేవుడు కర్త అనుకున్నా ప్రశ్న కలుగదు.
నేనే కర్త అనుకున్నా ప్రశ్న కలుగదు.

ప్రశ్న కలిగిందంటే అర్థమేమి?
నేను perfect...
దేవుడే మాకు అన్యాయం చేశాడని ఫిర్యాదు చేయడమే కదా!

* * *

మా కైకాలవీధిలో ఉన్న రామ మందిరంలో జరిగే భజనలో సత్యం అనే టీచరు తబలా వాయించేవాడు....

వారి పూర్వికుల నుండి మందిరంతో అనుబంధం ఉన్నవారే...

ఐదేళ్ల క్రితం వారి పెద్దబ్బాయి క్యాన్సర్ తో మరణించాడు...

రాముడి మీద అలిగాడు...
అప్పట్నుంచి మందిరానికి రావడం మానుకున్నాడు...

గురువుగారితో ఈ విషయం ప్రస్తవిస్తే-
గుడిలో అడుగు పెట్టగానే, నీవు ప్రార్థించినా ప్రార్థించకపోయినా దాని

అర్థమేమంటే-
"నా భవబంధములను త్రెంచుము" అని భగవంతుణ్ణి అడిగినట్లే.

భవబంధాలు త్రెంపాడు...
ఇక అలగడం యెందుకు?" అన్నారు.

భగవత్ సన్నిధికి -
ఏ కోరికతో వెళ్లినా
ఏ కోరిక లేకుండా వెళ్లినా
జరిగేది భవబంధాలు త్రెంపబడడమే.

మంట వద్దకు వెళ్లి చల్లదనాన్ని కోరుకుంటే ఎలా?
నీతో సహా "నాది" అనుకున్న సర్వాన్ని కాల్చి బూడిద చేస్తాడు భగవంతుడు.
అందుకు సిద్ధపడే భగవత్ సన్నిధిలోకి అడుగు పెట్టు...

పులిగుహలోకెళ్లడం, భగవత్ సన్నిధికెళ్లడం రెండూ ఒకటే...
అని గుర్తుంచుకో.

ముక్తినిచ్చేవాడు భగవంతుడు.
నీవు అడిగిందల్లా తీర్చడం వాడి పని కాదు.

దేవుడు కావాలంటే దేవుణ్ణి ధ్యానించు.
ధనం కావాలంటే ధనాన్ని ధ్యానించు.
అంతేగాని ధనం కోసం దేవుణ్ణి ధ్యానించకు...
అంటారు గురువుగారు.

* * *

దేవాలయానికెళ్లే ప్రతి ఒక్కడూ
దేవుని కోసమే వెళుతున్నాడు అనుకుంటే పొరపాటే...

దేవుడి "ద్వారా" ఏదో పొందాలనే కాంక్ష తప్ప
దేవుడి కోసమే దేవుడి వద్దకు ఎవడూ వెళ్లడు.

వేంకశ్వరస్వామి దర్శనానికి వెళ్లే భక్తులను స్వామి తనలో లీనం చేసేసుకుంటున్నారు అనే వార్త వచ్చిందనుకో...

గర్భగుడిలోకి వెళ్లినవాడు తిరిగి బయటకు  రావట్లేదని తెలిసిందనుకో...
మళ్లీ ఎవడైనా ఆలయానికెళతాడా?

ఆలయం చుట్టూ కంచె వేసి, డేంజర్ జోన్ గా ప్రకటించేస్తారు...

ముక్తి కోరేవాళ్లు ప్రపంచంలో ఎంతమంది వున్నారనేది  అప్పుడు లెక్క తేలుతుంది.

కాబట్టి తమ అవసరాలకు దేవుడు అని కాకుండా
దేవుడే తమ అవసరంగా ఉన్నవాడు భక్తుడు, ముక్తుడు.

* * *

నేనెప్పుడో చదివిన చలంగారి వెలుగురవ్వలు లోని కథ ఒకటి గుర్తుకొచ్చి గురువుగారికి చెప్పాను-

ఎవడో ఒకడు  నుదుటన గుడ్డ చుట్టుకుని దారిన వెళుతుంటాడు...

ఆ ప్రక్కనే ఉన్న ఓ యోగిని అతణ్ణి పిలిచి-
"తలకు ఆ గుడ్డ చుట్టావు ఏమి?" ప్రశ్నించింది.

తలనొప్పి తగ్గడానికి....అన్నాడు.

ఇంతకాలం తలనొప్పి లేకుండా చేసినందుకు దేవుడికి నీవు ఏ కృతజ్ఞతను ప్రదర్శించావు?

ఇప్పుడు కాస్త తలనొప్పి వచ్చిందో లేదో
దేవుడు ఎంత నిర్దయుడో చూడండి...అన్నట్టు
తలకు గుడ్డ చుట్టి ప్రదర్శిస్తున్నావా...? అంది.

అంతే అతను ఆ గుడ్డ పీకేసి, ఆవిడకు దండం పెట్టి వెళ్లిపోయాడు.

* * *

అన్ని ఒప్పులు వదిలేసి,
రెండు తప్పులను ఎత్తి చూపాడు అని
ఓ విద్యార్థి ఉపాధ్యాయుడిపై నొచ్చుకున్నాడట-

జీవితంలో తనకు ఎన్నో సుఖాలు సంభవించి ఉంటాయి...
వాటికి ఏ కృతజ్ఞతా చూపడు.

చిన్న కష్టం వస్తే చాలు....
నాకు ఎందుకీ కష్టం ఇచ్చావు అని దేవుణ్ణి నిలదీస్తాడు....

ఇలా ఎందుకు జరగాలి? అని ఎవరైనా ప్రశ్నిస్తే
ఎందుకు జరక్కూడదు? అని తిరిగి ప్రశ్నిస్తారు గురువుగారు.

సమాధానం లేని ప్రశ్న అది.

కష్టం వచ్చినప్పుడు, నాకెందుకు కష్టాన్నిచ్చావని దేవుణ్ణి అడుగుతాడేగాని,
సుఖం వచ్చినప్పుడు, నాకెందుకు సుఖం ఇచ్చావని ఎవడూ దేవుణ్ణి
అడగడు.

* * *

రూపాయి తప్పుకు పైసా శిక్ష వేస్తాడు దేవుడు.
అందుకు కృతజ్ఞత చూపకపోగా నిందిస్తాం...
నాకు దేవుడు అన్యాయం చేశాడని.

తనకు ఏ పరిస్థితి తటస్థించినా సరే,
"అందుకు నేను అర్హుణ్ణే" అని ఉండగలగడమే
నిజమైన శరణాగతి.

ఏ పరిస్థితినైనా దైవప్రసాదంగా తీసుకోగలగడమే శరణాగతి.

గడచిన క్షణం వరకు జరిగిందంతా భగవదిచ్ఛ మేరకు జరిగిందే....
అని స్థిమితంగా ఉండగలగడమే నిజమైన శరణాగతి.

వరదల్లో, భూకంపాల్లో కొన్ని వందలమంది మరణిస్తారు...
వాళ్లందరూ పాపాత్ములు అనుకోవాలా?

భగవదిచ్ఛను మరవడమే పాపం.

భగవదిచ్ఛను మరచి చేసే ఎంత గొప్పకర్మైనా ఎంత గొప్ప ఆలోచనైనా అది
పాపమే.

* * *

అరుణాచలం భానుగారు వాట్సప్ లో రమణుడికి సంబంధించిన ఓ
మేటరు పెట్టారు -

రమణుణ్ణి ఓ విదేశీ భక్తుడు ఇలా అడిగాడట-
భగవాన్! అరుణాచలపర్వతాన్ని ఈశ్వరుడుగా ఎందుకు భావిస్తున్నారు?
అది మీతో మాట్లాడదు...అది ఉలకదు పలకదు...అని.

భగవాన్ అన్నారట-
ఏది ఉలకదో పలకదో,
ఏది నీతో సంభాషించదో
ఏది నీతో వాదోపవాదాలు చేయదో
అదే ఈశ్వరతత్త్వం...అని.

* * *

భానుగారికి నేనిలా ప్రత్యుత్తరమిచ్చాను-

"కాబట్టి మన ఊళ్లో ఉన్న కొండ, మనింట్లో ఉన్న రుబ్బురోలు కూడా ఉలకదు, పలకదు...భాషించవు, వాదించవు...కాబట్టి అవి కూడా ఈశ్వర స్వరూపాలే. కాబట్టి ఈశ్వరుడి కోసమని అరుణాచలమే వెళ్లనక్కర్లేదు కదా! అని.

* * *

మీరు పంపిన 'అమృతవాక్యాలు' ఆర్టికల్ బాగుందని....అందులో "సిద్ధి కలిగాకే సాధన" అనే మాట అద్భుతం అని...సోదరి సాయిలతగారు వాట్సప్ లో తన సంతోషాన్ని వ్యక్తం చేశారు...

నిజమేగా....
సిద్ధుడే సాధన చేయగలడు.

టెంకాయను భూమిలో పాతితే అది మొలచి మొక్కై మానై చివరికి అది ఇచ్చేది కూడా టెంకాయనే కదా!

* * *

మనిషి జీవితం అనేది భగవంతుని నుండి విడువబడిన బాణం.
అది ఎంత దూరం ప్రయాణించి పడిపోతుందనేది
బాణం విడువబడినప్పుడే విడిచినవాని(దేవుని)యొక్క శక్తి
అందులో నింపబడి ఉంటుంది.

బాణం ప్రయాణంలో ఉండగా దానికి అదనపు శక్తిని చేకూర్చలేరు
దేవుడైనా, జీవుడైనా...

లక్ష్యం బాణానిదే అన్నట్టు కనిపిస్తుంది.
కాని లక్ష్యం బాణం విడిచినవానిది.

* * *

120. ఇప్పుడు-ఇక్కడ-ఇలా

---

11-11-2021 * గురువారం

జోరుమని వాన...హోరుమని గాలి...

అయినా నేనూ దేవీప్రసాద్ కలిసి ఉదయం 9.45 కు సద్గురు సన్నిధికెళ్లాం...

పట్టెయ్య టీ కాస్తున్నాడు...

ఇంతలో ఆత్మీయులు లీలమ్మ, రాధిక, సాయిలత, ఒంగోలు శ్రీను, మురుగానంద, భీమవరం మురళీకృష్ణ... వీడియోకాల్ లో సద్గురు దర్శనం చేసుకున్నారు నా ఫోన్ లో....

వేడివేడి టీ త్రాగాం..
మేం తీసుకెళ్లిన పూతరేకులు తలా ఒకటి తీసుకొని తిన్నాం...

ఇంతలో శ్రీనివాస మంగాపురం నుంచి శ్రీకాంత్ అనే జిజ్ఞాసి ఫోన్ చేసి గురువుగారిని కొన్ని ప్రశ్నలు అడిగాడు...

శ్రీకాంత్: "నాతో సహా సర్వమూ నాలో ఉన్నట్లున్నది" అన్నారు....
రెండు నేనులు ఉన్నట్లా?

సద్గురు: ఒక "నేనే" రెండు రకాలుగా అనుభవిస్తున్నాం.
"ఉన్నది"గా, "ఉన్నట్లున్నది"గా.

రూపాయినాణెంగా ఉన్నా,
రూపాయి చిల్లరగా ఉన్నా
"రూపాయి" అనే అనుభవం ఒకటే కదా!

శ్రీకాంత్: శ్రీకాంత్ కు పూర్వమున్న స్థితి...అంటే,
నిద్రలో ఉన్న స్థితిని మెలకువలో కూడా ఆ నిద్రాస్థితిని పోలిన స్థితిని కొనసాగించవచ్చా?

సద్గురు: కొనసాగించవచ్చు...

శ్రీకాంత్: అలా మెలకువలో నిద్రాస్థితిని పోలినస్థితిలో ఉండటానికి మొదట్లో సాధన ఏమైనా అవసరమా?

సద్గురు: అవసరం లేదు...
ఉన్నదే ఆ స్థితి...అంటే కలకైనా, మెలకువకైనా నిద్రే ఆధారం. యెప్పుడూ తానుండేది నిద్రాస్థితిలోనే.
ఇక సాధనెందుకు? ఇదొక కల అని ఉంటే చాలు.
నిద్రాస్థితిలో ఉన్నట్టే.

శ్రీకాంత్: శ్రీకాంత్ పుట్టుకను, మరణాన్ని ఎలా చూడాలి గురువుగారూ...?

సద్గురు: ఎందుకు చూడాలి...?
ఎలా అగుపడుతుంటే అలా చూడు....

ఏమైనా ఉండనివ్వండి...
ఎలా అయినా ఉండనివ్వండి...
ఇదంతా కలలో భాగమే.
మేలుకుంటే ఏమీలేదు.

శ్రీకాంత్: ఉన్నదేదో ఉన్నది...అది చిల్లరగా(జగత్తుగా) ఎందుకు మారింది?

సద్గురు: మారనివ్వండీ...ఇబ్బందేముంది?
రూపాయి విలువ మారలేదు కదా!
రూపాయి రూపాయిగానే ఉంది కదా!

శ్రీకాంత్: నిద్ర, మృత్యువు రెండూ ఒకటేనా?

సద్గురు: ఒకటే.

శ్రీకాంత్: ఈ రెండు నేనుల ఆట ఇలా ఎంతకాలం?

సద్గురు: మీరెంత కాలం అనుభవిస్తే అంతకాలం.

* * *

కొత్తగూడెం నుండి వచ్చిన సుబ్బారావు దంపతులు
సద్గురు సత్సంగంలో పాల్గొన్నప్పుడు సద్గురు నోట జాలువారిన కొన్ని ఆణి ముత్యాలు-

* * *

సుబ్బారావు: ఈ జన్మలో మేలుకోగలనా?

సద్గురు: జన్మం అనేది అసలు ఉందా? చూడు.
జన్మ లేదని తెలుసుకోవడమే మెలకువ

* * *

జీవితంలో ఇట్లా ఉండాలి, అట్లా ఉండాలి అని అనుకుంటున్నామేగాని
గ్రహాలు ఇట్లా తిరగాలి, అట్లా తిరగాలి అని అనుకుంటున్నావా?
మన లోపల గుండె ఇట్లా కొట్టుకోవాలి, అట్లా కొట్టుకోవాలి అని అనుకుంటున్నావా?
లేదు కదా?
ఖగోళంలో ఉన్నదేదీ నీ స్వాధీనంలో లేనట్లు
శరీరంలో ఉన్నదేదీ నీ స్వాధీనంలో లేనట్లు
జీవితంలో ఉన్నదేదీ కూడా నీ స్వాధీనంలో లేనిదే.
నీ స్వాధీనంలో ఉన్నట్లు అనిపిస్తుంది...అంతే.

* * *

మాయ అంటే అసత్యము అని కాదు,
నిరంతరమూ మారుతూ ఉండే సత్యము - మాయ.

* * *

ప్రశ్నను వదిలేయ్....
అదే సమాధానం.

* * *

సద్గురు: మెలకువ వచ్చినప్పటి నుండి, మెలకువ పోయేవఱకు ఈ మధ్యలో "అది" దొరకదు అని తెలిసి ప్రశాంతంగా ఉండిపోయారు

భగవాన్.

సుబ్బారావు: అయితే భగవాన్ మేలుకోలేదంటారా?

సద్గురు: ఆ ప్రశాంతతే మెలకువ.

* * *

"ఇది ఒక కల" అన్న ఒక్క మాట గుర్తుంటే చాలు.
ఇక నిన్ను కదిలించేదేదీ ఉండదు.

* * *

ప్రపంచంలో నీవు పుట్టలేదు.
నీలో నుంచే ప్రపంచం పుట్టింది.
తల్లిదండ్రుల నుంచి నీవు పుట్టలేదు.
నీలో నుంచే తల్లిదండ్రులు పుట్టారు.

* * *

సుబ్బారావు: "అంతా మాయ" అంటోంది ఫిజిక్స్ కూడా....
సద్గురు: ముందు మీరే మాయ.

* * *

తనవారు హాస్పిటల్ లో చికిత్స పొందుతుంటే,
వారి కోసం ఎంతగానో విచారిస్తాం...సేవ చేస్తాం.
ఇంకా చుట్టూ ఎంతోమంది రోగులు ఉంటారు.
కానీ వారి కోసం విచారించం....ఏమి?
తనవారు కాదని అనుకోవడం వలన.

* * *

అందరూ తనవారే అనుకున్నా లేదా
ఎవరూ తనవారు కారు అనుకున్నా
మనసు Neutral(తటస్థం)అయిపోతుంది.
అనగా బంధం పోతుంది.
బంధం పోవడమే మోక్షం.

* * *

సుబ్బారావు సతీమణి అడిగారు-
అహంకారం లేకుండా కర్మ చేయాలంటే ఎలా?

సద్గురు: అహంకారం లేకపోతే అసలు మీరే ఉండరు.

"నా వల్ల జరిగింది అని అనుకోకూడదన్నమాట..."

సద్గురు: అది కూడా అనుకోకూడదు...
ఏమి అనుకున్నా తప్పే.

* * *

ఓ రాజు ఓ రోజు సభలోకి ఓ బంగారు పెట్టెను ప్రవేశపెట్టాడు...

ఆ పెట్టెలో మరో పెట్టె, ఆ పెట్టెలో మరో పెట్టె...ఇలా ఓ ఐదారు పెట్టెలు తీశాక, చివరి పెట్టెలో ఓ బరిణె ఉంది. ఆ బరిణెలో ఓ పెసరబద్ద ఉంది... తీసి సభికులందరికీ చూపించి, దానినిపరిశీలించి- అదేంటో చెప్పమన్నాడు రాజు...

అందరూ ఒక్కొక్కరుగా తీసుకొని పరిశీలించారు...

అది పెసరబద్దే...
తెలుస్తూనే ఉంది...

అయినా పెసరబద్దను అంత కట్టుదిట్టం చేసి ఎందుకు తెచ్చినట్టు? అని ఒక ప్రక్క అనుమానం. ఎవరూ నోరు విప్పి ధైర్యంగా చెప్పలేకపోయారు... ఎట్లాపోయి ఎట్లా వస్తుందోనని...అందరూ మిన్నుకుండిపోయారు...

అందులో ఓ శెట్టిగారు మాత్రం సాహసం చేసి చెప్పాడు-
ప్రభూ...! ఇది పెసరబద్ద అయి ఉండవచ్చునేమోనని అందరూ భావిస్తున్నారు....అన్నాడు తెలివిగా.

అది పెసరబద్ద అనేది సత్యం.
అని తెలిసినా ధైర్యంగా ఎవరూ ప్రకటించలేకపోయారు...

"సత్యం" అనేది అందరికీ  తేటతెల్లమే.
అందరికీ సులభసాధ్యమే.

కానీ మనమే ఒప్పుకోం.

ఋషులు అంత కష్టపడి సంపాదించారు కదా...! మనకంత సులభంగా దొరుకుతుందా? అని మనకే అనుమానం....ఆ అనుమానమే ఆటంకం సత్యదర్శనానికి.

మిలారేపా జీవితం చదివితే, అలానే అనిపిస్తుంది....ఆ "ఉన్నతస్థితి"ని పొందటానికి చాలా చాలా కష్టపడాలని...

కానీ గురువుగారు ఆ పుస్తకం చదివి, చివర్లో ఒక మాటన్నారు నాతో- మిలారేపా కష్టపడి సంపాదించాడని, మనం కూడా కష్టపడి సంపాదించాలని రూలేమీ లేదన్నారు...

సులభంగా పొందవచ్చును...

అసలు పొందడమేమిటి?
"అదే మనం" అనే అవగాహన పొందడమే
సద్గురు సన్నిధి ఫలం.

అత్యంత సులభం ఆత్మవిద్య...అన్నారు రమణ భగవానులు....

అంత సులభంగా పొందటం మనకే ఇష్టం ఉండదు....

ఇప్పుటికిప్పుడే, ఇక్కడకిక్కడే పొందటానికి వీలయినది.

అందుకోసం ఒక్క అడుగు కూడా వేయవలసిన అవసరం లేదు.

ఒక్క క్షణం కూడా వాయిదా వేయవలసిన అవసరం లేదు.

అది ఎప్పుడూ ఉన్నదే.
అది ఎక్కడా ఉన్నదే.

ఈ "ఎప్పుడూ" ఈ "ఎక్కడా" అనే మాటలు కూడా
దేశకాలాలకు సంబంధించిన మాటలే...
భాషకున్న పరిమితులను అనుసరించి, గత్యంతరం లేక వాడుతున్న మాటలే.

యెందుకంటే సత్యం అనేది దేశకాలాలకు సంబంధించినది కాదు.

ఇప్పుడు ఇక్కడ ఇలా....ఉన్నపళంగా
ముక్తి పొందే మార్గమే సద్గురు తత్త్వం.

ఇక్కడ పొందలేదు, మరెక్కడో పొందుతాను అనడంగాని,
ఇప్పుడు పొందలేదు, మరెప్పుడో పొందుతాను అనడంగాని
అవగాహన లేక అనే మాటలే.

అది ప్రాంతాలకు, తేదీలకు సంబంధించిన విషయం కాదు.

ఫలానా గదిలో ఉండగా మోక్షం వచ్చింది అనిగాని,
ఫలానా తేదీ రోజున మోక్షం వచ్చింది అనిగాని
అలా ఏమీ ఉండదు....

అవి ఇతరులు(followers) వ్రాసుకున్న అంశాలే తప్ప
అది ఆ "జ్ఞాని"కి సంబంధించిన విషయాలు కానేకావు.

యెందుకంటే, మోక్షం అనేది-
"దేశకాలాలను తనలో కలిగిఉన్న స్థితి" అది.

దేశకాలాల మధ్య తానుంటే తాను - జీవుడు.
తన మధ్యలో(తనలో)దేశకాలాలు ఉంటే తాను - దేవుడు.
అని గురువుగారు అన్నారు.

* * *

సినిమారీలు చూస్తే...ఏ బిట్టుకాబిట్టు చూస్తే నిశ్చలంగా ఉంటుంది.
"వర్తమానం"లో ఉంటుంది.
సెకనుకు 16 ఫిల్ములు కదలటం వలన అందులో చలనం ఉన్నట్టు
తోస్తుంది...

ఆ కథలో భూత-భవిష్యత్-వర్తమానాలుంటాయి.
మళ్లీ ఆ వర్తమానం వేరే...
అది కాలానికి సంబంధించిన వర్తమానం.

సినిమా జరుగుతున్నా జరగకపోయినా
ఫిల్మ్ లోని ఏ బిట్టుకాబిట్టు నిశ్చలంగానే ఉన్నది.

అది సదా వర్తమానంగానే ఉన్నది.
ఆ వర్తమానం కాలానికి సంబంధించినదికాదు.

కాలానికి సంబంధించని ఆ వర్తమానాన్నే
గురువుగారు "ఇప్పుడు-ఇక్కడ-ఇలా" అని పేరు పెట్టారు.

ఎప్పుడైనా ఉండు...ఉండేది ఇప్పుడే.
ఎక్కడైనా ఉండు...ఉండేది ఇక్కడే.
ఎలాగైనా ఉండు...ఉండేది ఇలాగే.

ఎప్పుడు ఎక్కడ ఎలా ఉన్నాననే దాంట్లో మార్పులుంటాయేగాని,
ఇప్పుడు-ఇక్కడ-ఇలానే అనే దాంట్లో మార్పు ఉండదు.

అదే నిత్యవర్తమానం...
భూత-భవిష్యత్-వర్తమానాలకు ఆధారశ్రుతి అది.

* * *

2016 లో ఇప్పుడు-ఇక్కడ-ఇలా అనే పుస్తకం తయారుచేశాం....

ఆ టైటిల్ కు సంబంధించిన మేటర్ ను ఉపోద్ఘాతంగా వ్రాద్దామని
కూర్చుంటే,
ఏమీ తోచలేదు...
ఒక్క అక్షరం కూడా వ్రాయలేకపోయా...
సరే గురువుగారి చేతనే వ్రాయిద్దామని ఓ పెన్ను, నోట్ బుక్ తీసుకెళ్లి
ఇప్పుడు-ఇక్కడ-ఇలా గుఱించి  మీకు తోచింది వ్రాసిమ్మని కోరాను...

వారు వాటిని తీసుకొని దాచుకున్నారేగాని,
ఏ మేటరూ నాకు వ్రాసివ్వలేదు...

వారం తర్వాత చూచినా...ఆ పుస్తకంపై నేను స్కెచ్ పెన్ తో వ్రాసిన
ఇప్పుడు-ఇక్కడ-ఇలా  అనే హెడ్డింగు తప్ప ఒక్క అక్షరం కూడా
వ్రాయబడక ఖాళీగా ఉంది...

గురువుగారు నవ్వి-
ఆ ఖాళీనే ఇప్పుడు-ఇక్కడ-ఇలా గుఱించిన సరియైన మేటరు...అన్నారు.

ఐతే సరి....

అలాగే టైటిల్ పెట్టి ఆ 'ఉపోద్ఘాతం పేజీ' అంతా అలా ఖాళీగా పెట్టేద్దామని ఆలోచన వచ్చింది....

DTP వర్క్ అలానే చేశాను...ప్రెస్ కు వెళ్లింది...
ఆ ఖాళీ పేజీ చూసి ప్రెస్ వారు DTP చేసిన గుణభూషణ్ కు ఫోన్ చేశారు...
అయ్యా ఒక పేజీ మేటర్ మిస్ అయినట్టుంది...
ఫలానా పేజీ ఖాళీగా ఉందని...

గుణభూషణ్ నవ్వుతూ-
అయ్యా ఆ "ఖాళీ"నే వేదాంతసారమట...
వారిది అదొక రకమైన వేదాంతం...
అదేమీ పొరపాటుగా వచ్చింది కాదు...
ఓ సత్-ఉద్దేశంతోనే అలా పెట్టారు...
మీరు అలానే ప్రింట్ వేసేయండీ....అని చెప్పారు...

* * *

ఏదైనా మేటరు ఇచ్చి ముందుమాట వ్రాయమంటే వ్రాయగలరేగాని, ఆ మేటరుకు ఆధారంగా ఉన్న "తెల్లకాగితం" గుఱించి ముందుమాట వ్రాయమంటే ఏం వ్రాయగలరు?

ఇప్పుడు-ఇక్కడ-ఇలా అనే నిత్యవర్తమానం గుఱించి ముందుమాట వ్రాయమనడం కూడా అలాంటిదే.

ఇప్పుడు-ఇక్కడ-ఇలా గుఱించి వ్యాసం వ్రాస్తున్నాని పట్టెయ్యతో అంటే వారూ ఇలానే అన్నారు-
"ఇప్పుడు ఇక్కడ ఇలా గురించి వ్రాసేదేముంటుంది?" అని.

నేనన్నాను-
అవును...నేను వ్రాసిన వ్యాసాలన్నీ లేనిదాని గురించే....
ఉన్నదానిని గుఱించి ఏం వ్రాయగలం?

ఉన్నదానిని గుఱించి ఒకే ఒక అక్షరం వ్రాయగలం...
అదే "నే".

అదే "జ్ఞ".
అదే 'ఓం'.

ఈ మూడూ ఒకటే అర్థం.

భగవాన్ బహు సుందరంగా చెప్పారు-

ఏకమక్షరం హృదినిరంతరం.
భాసతేస్వయం లిఖ్యతే కథం?

* * *

గురువుగారూ...! తమరి శిలావిగ్రహం పెట్టడానికి తమరి అనుమతి కావాలండీ...
అడిగాడు నాగలింగమయ్య.

నా అనుమతి ఏమీ అవసరం లేదు...
నేనేమీ మీ మీద కేసు పెట్టను....
పైగా....బ్రతికున్నవాడు కేసు పెట్టగలడేగానీ,
చచ్చిపోయినవాడు కేసు ఎలా పెట్టగలడు?
అన్నారు గురువుగారు....

నిజమే....'జ్ఞానప్రసూనాలు' లోని ఒక వాక్యం గుర్తుకువస్తోంది...

బ్రతికి చచ్చువాడు - అజ్ఞాని.
చచ్చి బ్రతుకువాడు - జ్ఞాని.

* * *

జ్ఞానశిశువు
9533667918

121.శిష్యుడే గురువు చేత చెప్పిస్తాడు

---

12-11-2021 * శుక్రవారం

ఈ ఉదయం 10 గంటలకు నేనూ, దేవీప్రసాద్
సద్గురు సన్నిధికెళ్లాం...

అప్పుడే పార్శిల్ ఏదో వచ్చింది...
విజయవాడ నుండి త్రిపుర గారు విండో కర్టెన్స్ పంపారు...
గురువుగారు వెంటనే తగిలించమన్నారు...
నేనూ పట్టెయ్య కలిసి తగిలించాం.
ఆ తెల్ల కర్టెన్లు చాలా అందంగా, transparent గా ఉన్నాయి...శుద్ధాత్మ వలె...
ఫోటో కూడా తీశాం....

నేనూ పట్టెయ్య కలిసి టీ పెట్టాం...
ప్రతి వ్యాసంలో ఈ "టీ" గొడవ ఏంట్రా బాబూ! అని అనుకోకండి...

ప్రతి సన్నివేశాన్నీ రసాత్మకంగా అనుభవించడం నేర్పారు మా గురువుగారు....

బ్రహ్మతత్త్వాన్ని ఎంత రసాత్మకంగా అనుభవిస్తామో, తేనీరును కూడా అంతే రసాత్మకంగా అనుభవిస్తాం.

టీ కూడా మాకు బ్రహ్మపదార్థమే...
సందేహం లేదు...

* * *

గురువు వద్దకు వెళ్లి నిశ్శబ్దంగా కూర్చున్నాం...
ఏదో ఒకటి చెప్పండి అన్నట్టు...

గురువుగారు ఇలా చెప్పడం ప్రారంభించారు...

తాను తెలుసుకున్నదేమి... అనే దాంట్లో తృప్తి ఉండదు.
తనకు తెలుసు అన్న విషయం అందరికీ  తెలియడమే తనకు తృప్తి.

అందు కోసం ఏవేవో చేస్తుంటాడు...

నా దృష్టిలో నేనేమిటి? అని చూసుకుంటే చాలు.
జీవితం సఫలం అవుతుంది.

ఇతరుల దృష్టిలో నేనేమిటి? అని చూసుకుంటేనే
జీవితం నరకం అవుతుంది.

తానేంటో తనకు తెలుసు.
ఇతరుల ముందు ఏ ప్రదర్శనా అవసరం లేదు,
వారి అభిప్రాయమూ మనకు అవసరం లేదు.

తానేమో అనేది తనలో ఉన్నవాడు
చెప్పినంత నిక్కచ్చిగా ఇంకెవడూ చెప్పలేడు.

తన అనుభవమే తనకు ప్రమాణం. అంతే.
ఇతరుల అభిప్రాయాలతో తనకు పనిలేదు.

* * *

రెండు నేనులు ఉన్నాయి-
1. నేను బాబు
2. బాబు నేను

నేను బాబు అనే ఆ మొదటి నేను
బాబు ఉన్నా ఉంటుంది,
బాబు  లేకపోయినా ఉంటుంది.

బాబు నేను అనే ఈ రెండవ నేను
బాబు ఉంటేనే ఉంటుంది.
బాబు లేకపోతే ఉండదు.
బాబు నిద్రపోతే ఈ రెండవ నేను ఉండడం లేదు కదా!

నిన్ను నీవు తెలుసుకో అంటే-

"బాబు నేను" అనే నేను
"నేను బాబు" అనే నేనును తెలుసుకోమ్మనే.

మొదటి నేను - నేను అని అనదు; అనుకోదు.
రెండవ నేను - నేను అని అంటుంది. అనుకుంటుంది.

* * *

ఏరును తెప్పతో దాటాక,
ఆ తెప్పను వదిలి వెళ్లిపోతాడు.
అంతేగాని ఎవడూ మోసుకెళ్లడు.

ఈ రెండవ నేనే ఆ తెప్ప.
దాటడానికి ఈ తెప్ప అవసరమే...
కానీ దరి చేరాక కూడా ఈ తెప్పను మోసుకెళుతున్నాం...

పట్టెయ్య: ఎందుకని...? వదలలేకా?

బాబు: అభిమానం...

సద్గురు: వదలలేకనే...

* * *

పుణ్యతీర్థాలలో "తెప్పతిరునాళ్లు" చేస్తారు.
మనల్ని సంసారం నుండి తరింపజేసిన తెప్పలు దేవుళ్లు.

తెప్ప మీద దేవుడు కాదు,
తెప్పే దేవుడు.

కృతజ్ఞతగా వారికి తెప్ప తిరునాళ్లు చేస్తాము.

రాముడు, కృష్ణుడు, శంకరులు, రమణులు, సుబ్రహ్మణ్యులు...
ఇత్యాది గురువులందరూ తెప్పలు...
మనల్ని దాటించడమే వారి అవతార ప్రయోజనం.

తెప్పను వదలలేనివాడు - భక్తుడు.
తెప్పను వదిలినవాడు - ముక్తుడు.

* * *

ఏటి ప్రవాహానికి దిగువన స్నానం చేసేవాడు
ఎగువన స్నానం చేసేవాని నీటిని

ఎలా కలుషితం చేయగలడు?

"మొదటి నేను" దేనివలనా కలుషితం కాదు.
"రెండవ నేను" కలుషితం కాకుండా ఉండలేదు.

ద్వంద్వములన్నీ నాణేనికి బొమ్మ-బొరుసు లాంటివే.
రెండూ వుంటేనే ఆ నాణెం  చెల్లేది;
వ్యవహారం జరిగేది...

తామరపువ్వు - మొదటి నేను.
బురద - రెండవ నేను.

తామరపువ్వు, బురద ఒకే బిందువులో ఉన్నట్లు
ఆ నేను, ఈ నేను ఒకే బిందువులో ఉన్నాయి.

బురదా ఉంటుంది.
బురదను అంటక తామరా ఉంటుంది.

ఈ నేనూ ఉంటుంది,
ఈ నేనును అంటక ఆ నేనూ ఉంటుంది.

ఒకదాని ఉనికి తెలియడానికి,
మరొకదాని ఉనికి అవసరం.

"ఉన్నది" ఏదో తెలియాలన్నా
"ఉన్నట్లున్నది" ఏదో తెలియాలన్నా
రెండూ ఉండాల...

దేవుడుంటేనే జీవునికి ఉనికి.
జీవుడుంటేనే దేవునికి ఉనికి.
అంటారు గురువుగారు.

* * *

ఒకడు చెట్టునీడలో ఉండి సేద తీరుతున్నాడు.
మరొకడు ఆ దారిన పోతూ అతనూ సేద తీరడానికి వచ్చాడు.
ఎవరొచ్చినా, ఎంతమంది వచ్చినా ఆ హాయి కలిగేది చెట్టు(నీడ)వలన.

కానీ ఆ హాయి అంతకు ముందున్న వ్యక్తి వలన వచ్చింది అని వచ్చిన ప్రతివ్యక్తీ అనుకోవడమే గురుపరంపరకు కారణమైంది.

అయితే గురువు యెడల పూజ్యభావం ఉండాలి కదా? అంటే, చూపవచ్చు...

మా వూళ్లో మా ఇంట్లో కిటికీ ద్వారా నేను ఆకాశాన్ని చూస్తాను...

మీ వూళ్లో మీ ఇంట్లో ఉన్న కిటికీ ద్వారా నీవు ఆకాశాన్ని చూస్తావు.

కిటికీలు వేఱు వేఱు, ఆకాశం ఒకటే.
అలానే కిటికీలు అనేవి గురువులు.

ఆకాశం అనేది - ఆత్మతత్త్వం.
దానికి సమానంగా కిటికీని కూడా గౌరవిస్తాం.

మనం గురువుకు చూపే కృతజ్ఞత కిటికీకే.
మనం గురుపూజ అని చేసేది కిటికీపూజే.
మనం గురుపరంపర అనేది కిటికీల పరంపరే.

ఉండేది శిష్యపరంపరే.
గురు పరంపర కాదు.
గురువు సదా ఏకవచనం.

ఆకాశానికి పరంపర ఉండదు.
గురువుకు పరంపర ఉండదు.

* * *

బరువు తగ్గించుకోవడం ఎలా?
అన్న రెండు కిలోల పుస్తకం
ఉన్న బరువుకు మరో బరువు చేర్చడమే అవుతుంది.

మనం చేసే సాధనలు కూడా అలా ఉన్న బరువుకు అదనపు బరువును చేర్చేవే.

ఒకడు అన్ని పార్టీలకు అతీతంగా ఒక పార్టీ పెట్టాడట...

ఉన్న పార్టీలతో పాటు ఇదొక పార్టీ అయ్యింది.

మన గురువుగారు మోతనే కాదు,
మోసేవాణ్ణి కూడా దించేస్తాడు.

చెత్తనే కాదు చెత్తబుట్టను కూడా పారవేస్తాడు.

"నాది"నే కాదు "నేను"ను కూడా తుడిపేస్తాడు.

* * *

దీపం జ్యోతి పరబ్రహ్మం ... అంటారు.

వెలుగు చీకటులను గుర్తించే వెలుగే తాను.
తానే జ్యోతి...తానే పరబ్రహ్మం.

* * *

గురువు మాట్లాడుతున్నాడు కదా...! అంటావేమో

గురువు మాట్లాడడు...
శిష్యుడే చెప్పిస్తాడు...
అన్నారు గురువుగారు.

అచ్చంగా UG కూడా ఇలానే అన్నారు-
నేనేమీ మాట్లాడడం లేదు...
నా చేత మాట్లాడిస్తుండేది మీరే...అని.

* * *

గురువు వద్దకు వెళ్లిన ప్రతిసారీ చివర్లో పట్టెయ్యగారి గదిలో కాసేపు గడుపుతూ వస్తున్నాం...

మురుకులు, వేరుచెనక్కాయపప్పులు, బెల్లం అరిస, సజ్జరొట్టె...మొదలైన ఉపాహారాలతో మమ్మల్ని తృప్తి పరుస్తున్నాడు....

ప్రతిసారీ పట్టెయ్య మాకు అతిథిగా ఉండేవారు.
ఈసారి వారికి మేం అతిథులుగా ఉన్నాం.

* * *

122. ఉన్నదంతా రాద్ధాంతమే...

---

13-11-2021 * రెండవ శనివారం

ఈ ఉదయం 10 గంటలకు సద్గురు సన్నిధికి చేరుకున్నాం నేనూ, దేవీప్రసాద్....

గురువుగారు కాసేపు విశ్రాంతి తీసుకోవడానికి పడుకోబోతూ....మేం రావడం చూసి అలానే  కూర్చొన్నారు...

పట్టెయ్య వంటగదిలోకి దూరాడు టీ పెట్టడానికి...
పట్టెయ్యగారు టీ చాలా రుచిగా పెడతారు...
చిట్కా ఏమంటే- టీ ఉడుకుతున్నంతసేపు గరిటెతో అలా  త్రిప్పుతూ ఉండటమేనంట...
అని పట్టెయ్యగారన్నారు...
* * *

గురువు వద్దకు ఆదివారం మాత్రమే వెళదామనుకున్నవాణ్ణి....
కారణం ఏదైతేనేం...ప్రతిరోజూ వెళ్లే అవకాశం వచ్చింది...ప్రతిరోజూ సబ్జక్టు జరిగింది...

అదే సద్గురు మహిమ.
అదే సద్గురు కరుణ.

నేను నెల్లాళ్ల నుంచి గురువు వద్ద ఉన్నాను...
నాకు ఒక్క ముక్క కూడా ఏమీ చెప్పలేదు...
అని వాపోయారు పట్టెయ్యగారు...
* * *

పట్టెయ్య: నిన్న ప్రస్తావనలో- ఏరు దాటాక కూడా తెప్పను మోస్తున్నారు అని చెప్పారు కదా! తరించడానికి(దాటినవాడికి) ఇక తెప్పతో ఏంపని ఉంటుంది?

సద్గురు: చెప్పినవాడు దాటినవాడు కాదు.
చెప్పింది తెప్ప(గురువు).

నన్ను వదిలేసి వెళ్లరా బాబూ! అని చెబుతున్నాడు గురువు...

* * *

సద్గురు: అర్థమవడం కోసం ఉపమానం వాడతాం.
కానీ ఉపమానంలో అర్థం ఉండదు...
అర్థం ఉన్నట్టు అనిపిస్తుంది.

బాబు: మరి ఉపమానం వలన ప్రయోజనం??

సద్గురు: ప్రయోజనం లేదని తెలియటమే ప్రయోజనం.

"తామరాకు మీద నీటి బొట్టువలె ఉండాలి" అని చెబుతాం...
కానీ తాను తామరాకూ కాదు, నీటిబొట్టూ కాదు.

* * *

నేను అంటేనే, కర్త-కర్మ-క్రియ కలిపి నేను.
ఈ మూడింట్లో ఏది లేకపోయినా నేనుండను.

* * *

దేవుని చెప్పబడిన విశేషణాలన్నీ
తనకు సంబంధించిన విశేషణాలే.

* * *

అర్థం అనేది మేలు చేస్తుంది అని,
అనర్థం అనేది కీడు చేస్తుంది అనుకుంటాం.
అనర్థమేమి? అంటే, అర్థమే.
"అర్థం ఉంది" అనుకోవడమే అనర్థం.

* * *

గొప్ప గొప్ప వేదాంత సభలు జరుగుతుంటాయి...
గొప్ప గొప్ప సిద్ధాంతకర్తలు వస్తారు...
ఒకరినొకరు అభిప్రాయాలను ఖండించుకుంటూ వుంటారు.
మధ్యాహ్నం 1 గంటకు భోజన కార్యక్రమం అంటారు...
అక్కడ అందరూ ఒకటే. ఖండించినవాడు, ప్రతిపాదించినవాడు ఇద్దరూ
ప్రక్కప్రక్కనే కూర్చుని భోంచేస్తుంటారు....
శాస్త్రచర్చలేవీ అప్పుడు గుర్తుకురావు.

* * *

"దేనివలన దానికి ప్రయోజనం ఉండదు."

నా వలన ఇతరానికి,
ఇతరం వలన తనకి
ప్రయోజనం ఉంటుందేగానీ
నా వల్ల నాకు ప్రయోజనం ఉండదు.

బంగారం వలన బంగారానికి ప్రయోజనం ఉండదు.
దేవుని వలన దేవునికి ప్రయోజనం ఉండదు.

* * *

పనిలేని మంగలోడు పిల్లి తల గొరిగినట్లు....
అని సామెత.

నిజానికి అది కూడా ఒక పనే కదా!

పని లేని మంగలోడు ఆ పని కూడా చేయడు.

* * *

ఉన్నది 'నేను' మాత్రమే అయినప్పుడు,
నేను అది తెలుసుకున్న తెలుసుకోకపోయిన
'నేను' అలానే ఉంటుంది.
ఇంక నేను తెలుసుకోవటం ఎందుకు?

అని ఒకరు నన్ను అడిగారని గురువుగారికి చెబితే,

అతడు అదైనా చెప్పడం ఎందుకు? అన్నారు.

తెలిసి, ఊరికే ఉంటే పోలా...!

అతను చెప్పేదానికి అతడే విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు...

"చెప్పడం" వలన తన మాటను తానే ఖండించుకున్నట్టు అవుతుంది.

మౌనాన్ని గుఱించి మూడు గంటలు అనర్గళంగా ఉపన్యాసం ఇచ్చాడంట ఒకడు...

అలానే వుంటుంది...సత్యాన్ని గుఱించి మనం ఏ స్టేట్ మెంట్ ఇచ్చినా తప్పే అవుతుంది...

* * *

తెరమీద ఉండే బొమ్మలలో ఓ బొమ్మ మౌనంగా ఉంటుంది.

కానీ అది మౌనం కాదు....

"తెర" యే మౌనం.

అని చెప్పి మౌనం దాల్చారు గురువుగారు.

కాసేపు తరువాత -

"ఈ రెండూ కూడా అసలు మౌనం కాదు."
అన్నారు...

అన్న వెంటనే "నిజమైన మౌనం"
మా అనుభవంలోకి వచ్చింది...

అదే సద్గురు సన్నిధి గొప్పతనం....

మేం పొందిన మౌనాన్ని మాటల్లో ఎలా చెప్పడం...?
వాట్సప్ లో ఎలా పంపడం...?

అసాధ్యం.

ప్రత్యక్ష గురుసన్నిధి ఒక్కటే మార్గం.

* * *

ఒక చిత్రకారుడు ఓ రోజంతా కష్టపడి మహంకాళీ చిత్రాన్ని గీశాడు...
చీకటి పడింది...ఆ చిత్రాన్ని చూసి తానే బయపడ్డాడు...
ప్రక్క గదిలో ఉన్న ఒకర్ని తోడుగా రమ్మని పిలిచాడట.

అలాగే ఈ చిత్రవిచిత్ర ప్రపంచ చిత్రాన్ని స్వయంగా తానే చిత్రించుకున్నాడు...

సృష్టికర్తా తానే.
ఎందుకు? అని ప్రశ్నించేదీ తానే

భయాన్ని పోగొట్టుకోవడానికి అవసరమైన
తోడే గురువు.

* * *

ఉండేది రాద్ధాంతమే... సిద్ధాంతం అనేది లేదు...
అన్నాడు బాబు.

'లేదు' అన్నట్టు పెదవి విరిచి,
"అంటే, సిద్దాంతం అయిపోతుంది" అన్నారు నవ్వుతూ.

* * *

పట్టెయ్య కోసం  జొన్నపేలాలు తెచ్చాను...అని బాబు అంటే...

పేలాలు పట్టెయ్య కోసం...
పట్టెయ్య ఎవరి కోసం? అని ఇంకొక్క ప్రశ్న వేసుకుంటే "సమాధానం"
అక్కడే ఉంటుంది...
అన్నారు గురువుగారు.

* * *

నీకు అన్యంగా ఉన్నదానిని గుఱించి తెలుసుకోగలవు,
అనుభవించగలవేగాని,
నీవే అయినదానిని ఎలా తెలుసుకోగలవు?
ఎలా అనుభవించగలవు?
కాబట్టి తెలుసుకోలేకపోతున్నాను, అనుభవించలేకపోతున్నాను అంటే,
దాని అర్థం, నీవు 'అది'గానే ఉన్నావు అని.

కాబట్టి-
నేను తెలుసుకున్నాను...
నేను అనుభవించాను...
అని ఎవరైనా అంటే,
మనసులో నవ్వుకుని, అక్కణ్ణుంచి తప్పుకో....

* * *

123. శాస్త్రాలన్నీ అ ఆ లే....

---

19-11-2021 * కృత్తికాదీపోత్సవం

ఉదయాన్నే 7 గంటలకు గుండు చేయించుకున్నాను...

"బోడిగుండు అంత సుఖం లేదు.
ఊరకుండడం అంత ఉత్తమం లేదు."
అన్న సామెత గుండు కొట్టించుకుంటున్న ప్రతిసారీ గుర్తుకొస్తుంటుంది...

ఒకటి బాహ్యామైన సుఖం.
ఇంకొకటి ఆంతరంగికమైన సుఖం.

తలలు బోడులైన తలపులు బోడులా?
అని వేమన ప్రశ్నకు సమాధానం ఎవడికి వాడికే ఎఱుక.

తలపులబోడినే నిజంగా తలబోడి అనాలి...

తరిగొండ వెంగమాంబగారికి వైధవ్యం ప్రాప్తించినప్పుడు...ఆమె బొట్టు, జుట్టు తీయలేదు.

పుష్పగిరి పీఠాధిపతులు ఆమెను ముండనం చేసుకోవలసిందిగా ఆజ్ఞాపించారట...

"మళ్లీ మొలవకుండా చేయగలిగితే ముండనం చేసుకుంటాను..." అని అన్నారట వెంగమాంబ గారు.

మఠాధిపతి ఏమీ మాట్లాడలేకపోయారు...

ఆమె చివరి వఱకు సకేశినిగానే ఉండిపోయారు...

ముండనం కావలసింది తలపులు...
తలలు కాదు అనేది వెంగమాంబ ఆంతర్యం.

* * *

నిన్నటి గుఱించి వగచకపోవడం.
రేపటి గురించి ఊహించకుండడం.
ఈ రెండు లక్షణాలు ఉన్నట్లైతే తలపులు బోడులే.

వ్యవహారంలో నాటకీయమైన కర్తవ్యాన్ని కలిగి ఉండడం.
ఆంతరంలో "అకర్త"గా ఉండడం
ఈ రెండు లక్షణాలు ఉన్నట్లైతే తలపులు బోడులే.

మెలకువ కలగా తోచడం
నిద్ర మెలకువగా తోచడం
ఈ రెండు లక్షణాలు ఉన్నట్లైతే తలపులు బోడులే.

పరిస్థితులు ఎలా ఉన్నా సరే
తానూ సంతోషంగా ఉండడం
ఇతరులనూ సంతోషపెట్టడం
ఈ రెండు లక్షణాలు ఉన్నట్లైతే తలపులు బోడులే.

సమూహంలో ఏకాంతం
భాషణంలో మౌనం
ఈ రెండు లక్షణాలు ఉన్నట్లైతే తలపులు బోడులే.

కర్తృత్వభావన తొలగడం
బుద్ధిగతమైన జ్ఞానం తొలగడం
ఈ రెండు లక్షణాలు ఉన్నట్లైతే తలపులు బోడులే.

పరమేశ్వరునికి శరణువేడడం
గురుపాదాల వద్ద గడపడం
ఈ రెండు లక్షణాలు ఉన్నట్లైతే తలపులు బోడులే.

* * *

నాకు తెలిసినప్పట్నుంచి గురువుగారు జులై మాసంలో వచ్చే ఆడికృత్తిక రోజున గుండు గీయించుకునేవారు....అప్పటివరకు తలవెంట్రుకలు, గెడ్డం బాగా పెరిగిపోయి ఓ ప్రాచీనఋషిలా కనబడేవారు...

ఈ సంప్రదాయాన్ని వారు ఏ సంవత్సరం నుంచి మొదలుపెట్టారో నాకు తెలియదు...

చాలామంది "గెడ్డం అయ్యోరు" అని చెబితేనే గుర్తుపట్టేవారు...

అంతగా ఆ రూపం జనాలకు అలవాటయ్యింది...

2004 ప్రాంతంలో ఓ సారి గురువుగారు తనను తాను అద్దలో చూసుకున్నప్పుడు-
"ఈ గెడ్డంలో నేను చాలా అందంగా ఉన్నాను..." అని అనిపించిందట...

అంతే....ఎవరికీ ఇబ్బంది లేని ఈ అహంకారం సైతం ఉండకూడదని భావించి గురుభక్తుడు, క్షురకుడు అయిన 'రమణ'ను పిలిపించి గుండు గీయించేసుకున్నారు గురువుగారు.

ఈపట్టం జరిగింది 2004 నరసింహ జయంతి నాడు.

ఆరోజు నుంచి ఈ రోజు వఱకు ప్రతి రెండురోజులకు ఒకసారి గుండు గీయించుకుంటున్నారు...

తెల్ల వెంట్రుకలు కనబడకుండా భలే యెత్తు వేశార్రా గురువుగారూ...!!
అంటూ శిష్యులం జోక్ వేసుకుని నవ్వుకున్నాం...

ముండనం సన్న్యాసి విధి.
కానీ గురువుగారు గృహస్తు.

సంసారంలో సన్న్యాసిగా ఉండవచ్చు...
సన్న్యాసంలో సంసారిగా ఉండకూడదు...

వివాహ వేడుకలో జరిగే కాశీయాత్ర తంతుకు అర్థం కూడా ఇదే...అటువంటి వైరాగ్యమూర్తే సంసారానికి అర్హుడు అని.

ముగ్గురు క్షురకులు గురువుగారికి సేవ చేసుకున్నారు...ముగ్గురూ గురుభక్తులే....
1. రమణ  2. కైలాసం  3. రాజేంద్ర

* * *

కైలాసం ఓరోజు గురువుగారికి గుండు గీస్తూ...
గురువుగారూ మీ శిరస్సును నేను శివలింగంగా భావిస్తుంటాను...అన్నాడు.

"అవును ఇది కళ్లు ఉండే శివలింగం" అంటూ
తనస్వరూపాన్ని బట్టబయలు చేశారు గురువుగారు.

* * *

గురువుగారి శిష్యుడైన కాశిరెడ్డి ప్రతినెలా కృత్తికరోజున గుండు గీయించుకునేవాడు...

రమణాశ్రమం New Hall లో  రమణభగవానుల నల్లరాతి విగ్రహంలా అచ్చంగా అలానే ఉండేవాడు.

కాశిరెడ్డితో కలిసి మేం ఎప్పుడు రమణాశ్రమం వెళ్లినా మాకు Accommodation ఇచ్చేసేవారు...ముందస్తుగా బుక్ చేసుకోకున్నా సరే.

బహుశా వారికి కాశిరెడ్డిలో రమణమహర్షి కనబడివుంటారు....

* * *

ఐదారేళ్లుగా నేనూ ప్రతి నెలా గుండు చేయించుకుంటున్నాను, తిథులతో నిమిత్తం లేకుండా....
యెందుకంటే, "హాయిగా ఉంటుంది" అన్న ఒక్క కారణం తప్పితే, నా గుండుకు ఏ ఆధ్యాత్మిక నేపథ్యమూ లేదు...

ఈ "గుండోపాఖ్యానం" ఇంతటితో సమాప్తం.

* * *

10 గంటలకు సద్గురు సన్నిధికి చేరుకున్నాం నేను, దేవీప్రసాదు....

గుత్తి నుంచి వచ్చి భద్రయ్య, రంగస్వామి, రామచంద్ర అతిథులుగా ఉన్నారు...

"బాబూ! త్రిపురావాళ్లు వస్తామని నాకు ఫోన్ చేశారుగానీ...వర్షంగా ఉందని నేనే వద్దన్నాను...తీరా చూస్తే ఎండ కాస్తోంది..." అన్నారు గురువుగారు బయటకు తొంగిచూస్తూ...

త్రిపుర, పిల్లలు వచ్చివుంటే బాగుండేది...అన్నట్టు కనబడింది వారి ముఖంలో హావభావం.

బాబూ...! స్నానానికెళుతున్నాను...అరగంటలో వచ్చేస్తాను...అని బాత్రూంలో దూరారు గురువుగారు...

ఈ లోపు నేను దేవుడిపటాల వద్ద ఓ యాపిల్ ఒంటరిగా ఉండడం చూశాను...

నన్నెవరు ఆరగించి అనుగ్రహిస్తారో...! అన్నట్టుంది ఆ యాపిల్...
నేను దానికి మోక్షం ఇచ్చేశాను...
(అనగా సుబ్బరంగా తినేశాను)

మోక్షం-మోక్షం అంటూ ప్రాకులాడుతున్నాం...
మనల్ని కూడా ఇలానే భోంచేస్తాడేమో ఆ భగవంతుడు...అనిపించింది.

గురువుగారు స్నానం చేసి, శుభ్రమైన దుస్తులు ధరించి, ఫ్రెష్ గా వచ్చి దివాన్ కాట్ మీద కూర్చున్నారు...

రామచంద్ర గురుపాదాలకు దగ్గరగా జరిగారు...

"తెలుసుకోవాలనే తపనకు ముగింపు ఉండదా?"
అని అడిగాడు...

గురువుగారు అన్నారు -

దాహం లేకుంటే నీళ్ల వలన ప్రయోజనమేమి?
ఆకలి లేకుంటే అన్నం వలన ప్రయోజనమేమి?

నీటిని త్రాగాలనే తపన ఉందంటే దాహం ఉన్నట్టే.
అన్నం తినాలనే తపన ఉందంటే ఆకలి ఉన్నట్టే
తెలుసుకోవాలనే తపన ఉందంటే నీవు ఇంకా తెలుసుకోవలసినదానిని తెలుసుకోనట్టే.

నాకు ఏదో లేదని ఉండడం వల్లనే
నాకు ఏదో కావాలి అనే తపన ఉంటుంది.
అందుకు చేసే ప్రయత్నాలే ఈ సాధనలు...

గుర్వనుగ్రహం, దైవానుగ్రహం...అంటే
అవి రెండు గ్రహాలు అని అర్థం.

నీవు పొందవలసినది నీకు వేరుగా ఉందని నీకు అనిపించడమే ఆ గ్రహాలు నిన్ను పట్టి ఉన్నాయి...అని గుర్తు.

* * *

అవధూత దుస్తులు వదలడం కాదు,
దుస్తులు వదిలినవాడు అవధూతే ఎవడైనా.

అలా మోక్షం పొందినవానికి కోరికలుండవు అని కాదు,
కోరికలు లేనివాడు మోక్షం పొందినవాడే ఎవడైనా.

* * *

నీకు సుఖాన్నిచ్చేది ఏదైనా మోక్షమే.
నీకు దుఃఖాన్నిచ్చేది ఏదైనా బంధమే.

* * *

చచ్చిపోతానేమో అనుకోవడమే బంధం. చచ్చిపోయేవున్నాను అని వుంటే మోక్షం.

* * *

సద్గురు: పండితుడికి, పామరుడికి తేడా ఏమి?

బాబు: శాస్త్రపరిచయం ఉండడం, ఉండకపోవడమే తేడా....

సద్గురు: (నవ్వుతూ) కాదు...కాదు...
నేను పండితుణ్ణి అనుకోవడం వలన
వాడు పండితుడైనాడు.
నేను పామరుణ్ణి అనుకోవడం వలన
వాడు పామరుడైనాడు.

* * *

తెలిసినట్టుండేది తెలియనిది.
తెలియనట్టుండేది తెలిసింది.

తెలిసింది అన్నవాడు తెలియనివాడు.
తెలియదు అన్నవాడు తెలిసినవాడు.

* * *

బదరికావనంలో నర-నారాయణులుంటారని ప్రతీతి.

ఇంతవఱకు నరుడికి నారాయణుడుగాని
నారాయణుడికి నరుడుగాని కనబడిందే లేదు.

నరుడికి నారాయణుడు కనబడగానే
నారాయణుడైపోతున్నాడు.

నారాయణుడికి నరుడు కనబడగానే
నరుడైపోతున్నాడు.

* * *

నేను అంటే జీవుడు.
నేనుగా ఉంటే దేవుడు.

* * *

నోరు తింటుంటే, నేను తింటున్నానని అంటావు.
నోరు కదా చెప్పాలి....

ఎవరో చేస్తుంటే, నేను చేస్తున్నానని అంటున్నావు.

నేను చేస్తున్నాను అని చేస్తే - జీవుడు.
అనకుండా చేస్తే - దేవుడు.

* * *

జీవుడు-
నేను జీవుడన్నా జీవుడే.
నేను దేవుడన్నా జీవుడే.

దేవుడు-
నేను దేవుడన్నా దేవుడే.
నేను జీవుడన్నా దేవుడే.

* * *

చిన్న పిల్లాణ్ణి, ఏం వ్రాస్తున్నావు?
అని అడిగితే - అ ఆ లు వ్రాస్తున్నాను...అంటాడు.

వాల్మీకిని,  ఏం వ్రాస్తున్నావు?
అని అడిగితే - రామాయణం వ్రాస్తున్నాను...అంటాడు.

వ్యాసుణ్ణి, ఏం వ్రాస్తున్నావు?
అని అడిగితే - భారతం వ్రాస్తున్నాను...అంటాడు.

రామాయణం కూడా అ ఆ లే కదా...!
భారతం కూడా అ ఆ లే కదా...!
లోకంలో ఉన్న సర్వ శాస్త్రాలూ అ,ఆ లే....!

పిల్లవాడి అ ఆ లను  తక్కువగా చూస్తాము.
మహనీయుల గ్రంథాలను గొప్పగా చూస్తాము...
కానీ అన్నీ అ ఆ లే...

ఉన్నది ఉన్నట్లుగా చెప్పిన పిల్లవాణ్ణి అమాయకుడు అంటున్నాం.

ఉన్నది ఉన్నట్లుగా చెప్పనివాణ్ణి
మహనీయుడు అంటున్నాం.

భగవంతుని దృష్టిలో ఇద్దరూ పిల్లవారే.
ఇద్దరివీ అ ఆ లే....
* * *

ఈ సందర్భంలో నాకొక కథ గుర్తుకొస్తోంది....

ఒక బాలిక భగవంతుణ్ణి ప్రార్థించడానికి పూనుకున్నది...

కాని ప్రార్థించడం ఎలాగో ఆమెకు తెలియదు.
స్తుతులనూ, గీతాలను పెద్దలు పాడుతూ ప్రార్థించడం ఆమె అనేకసార్లు చూచింది.
కాని పాపం, ఆమెకు స్తుతులో, పాటలో తెలియవు.
అయినప్పటికీ ప్రార్థించాలి.
ఏం చేస్తుంది ఆ బాలిక! ప్రశాంతంగా ఆయన విగ్రహం ముందు చేతులు జోడించుకొని నిలబడింది...
అ-ఆ-ఇ-ఈ....అంటూ వర్ణమాలను క్రమం తప్పక ఉచ్ఛరించసాగింది.
తరువాత హృదయంలో భావోద్వేగ వెల్లువ పొంగిపొరలగా,

"తండ్రీ! నాకు స్తుతులుగాని, గీతాలుగాని తెలియవు.
నాకు తెలిసినదంతా ఈ అక్షరాలే.
నీకు కావలసిన ప్రార్థనను ఈ అక్షరాల నుండి నువ్వే రూపొందించుకో"
అని విన్నవించుకొంది.

* * *

ఈ సాయంత్రం 6 గంటలకు
ప్రపంచానికి హృదయమైన అరుణాచల శిఖరాన
కృత్తికాదీపం వెలిగించే సమయానికి
మా ఇంటి బయట గోడపై నెయ్యి దీపం వెలిగించి పెట్టాను....

దీపం అంటే గురువు.
గురువు అంటే జ్ఞానప్రకాశం.

My Self is Sathguru...
నా హృదయంలో నేను-నేను అంటూ ఆత్మజ్యోతి సదా వెలుగుతోంది....

దానికి బాహ్యప్రతీకయే ఈ చిరుదీపం....

* * *

124. రమణీయం

---

"ఉన్నది" మౌనమే.

సృష్టికి మునుపు, సృష్టికి తరువాత ఉన్నది మౌనమే.

అనగా మెలకువకు మునుపు, మెలకువకు తరువాత ఉన్నది మౌనమే.

* * *

ఆలోచనకు ఆలోచనకు మధ్య ఉన్నది మౌనమే.
మాటకు మాటకు మధ్య ఉన్నది మౌనమే.
అనుభవానికి అనుభవానికి మధ్య ఉన్నది మౌనమే.

మధ్యలో అంటే మధ్యలో మాత్రమే అనికాదు, వాటికి ఆధారంగా అని అర్థం.

ఆ మౌనానికి స్థూలరూపమే ఆకాశం.
ఆకాశం అన్ని గ్రహాలకు ఆధారమైనట్లు
మౌనమే అన్ని భావాలకు, మాటలకు ఆధారం.

ఆ మౌనమే తన స్వరూపం.
అది తన అనుభవంలోకి రావడానికి
నిశ్శబ్దం ఓ మార్గం.

నిశ్శబ్దం-మౌనం ఒకటే అనిపిస్తుంది.
మాట ఆగితే నిశ్శబ్దం.
మనసు ఆగితే మౌనం.
* * *
నా చిన్నప్పుడు ఆకాశం వైపు ఎక్కువగా చూస్తుండేవాడిని.
ఆ చుక్కలు, ఆ సూర్యుడు, ఆ చంద్రుడు...ఈ ప్రపంచము... వీటిని భగవంతుడు చేయక మునుపు ఉత్తఆకాశమే ఉన్నప్పుడు ఎలా ఉండేది? అన్న ఆలోచన కలిగేది.
ఆ 'కేవలశూన్యాన్ని' అలానే కాసేపు ఎఱుకలో పెట్టుకోవడానికి ప్రయత్నించేవాడిని. కాసేపటికి తల తిరిగినట్లు అనిపించేది. ఆ 'తలతిరుగుడు'ను ఎంజాయ్ చేసేవాణ్ణి.
* * *
ఇప్పుడు సద్గురుదేవులు కూడా అచ్చంగా అదే బోధిస్తున్నారు...నీ చూపు దృశ్యాన్ని చేరకుండా మధ్యలోనే(శూన్యంలోనే) ఆగిపోవాలి...అని.
ద్రష్ట-దృశ్యము లేని దృష్టే దివ్యదృష్టి అన్నారు.
* * *
ఆ కేవలశూన్యాన్ని ధ్యానించడమే అత్యాశ్రమ ప్రధాన సాధన.

ఆ కేవలశూన్యస్థితియే తురీయావస్థ.

ఆ కేవలశూన్యం  వైపుకు నిన్ను మళ్లించేదే అజాతవాదం.

ఆ కేవలశూన్యస్థితిని శేషింపచేసేదే నేతి-నేతి అనే ఉపనిషత్ సందేశం.

* * *

ఆ కేవలశూన్యస్థితిని సదా ధ్యానించడం వలన
ఆ కేవలశూన్యస్థితియే తానైపోతాడు.
తను, సంసార, ప్రపంచ, దైవములనే మాయావిషయములేవీ తనను బాధించవు.

ప్రపంచానికి తానుంటాడు.
తనకు ప్రపంచం ఉండదు.

శూన్యాన్ని బంధించగల బంధం(త్రాడు) ఎక్కడుంది?

అందువలన తనకు బంధమూ లేదు, మోక్షమూ లేదు.

* * *

ఈ శూన్యోపాసన వలన,
ఈ మౌనోపాసన వలన
ఈ అకర్మోపాసన వలన
జీవితంలో, ప్రపంచంలో స్తబ్ధత(జడత్వం) ఏర్పడుతుందేమోనని ఆందోళన అవసరం లేదు.
అకర్తృత్వంలోనే
లోకవ్యవహారాలు సజావుగా సాగిపోతాయి.

నేను అనే ఆలోచన ఉన్నప్పుడు కంటే అహంవృత్తి లేనప్పుడే కార్యకలాపం బాగా జరుగుతుంది అన్నారు రమణభగవానులు.

పెళ్లిపెద్ద ఏ పనీ చేయకపోయినా కర్తృత్వం వలన అలసిపోతాడు.

సేవకుడు అన్ని పనులు తానే చేస్తున్నా కర్తృత్వం లేకపోవడం వలన శ్రమరహితంగా, హాయిగా, సంతోషంగా తన పని తాను చేసుకుంటూ వెళ్లిపోతాడు.

* * *

యోగవాశిష్ఠంలో చెప్పబడిన ఆ ఆకాశజుడు తానే అవుతాడు.

నా ప్రియుడు రమణుడు ఆ ఆకాశజుడే.
నా గురువు సుబ్రహ్మణ్యుడు ఆకాశజుడే.

వారిరువురు బోధించినంతా శూన్య(పూర్ణ)వాదమే.

బుద్ధుని శూన్యవాదము
ఋషుల పూర్ణవాదము
రెండూ ఒకటే.
ఇద్దరూ లోకంలోని సుఖదుఃఖాలను రూపుమాటడానికి అవతరించిన కరుణామయులే.

శూన్యత్వం అంటే-
ఏమీలేని ఖాళీతనం కాదు.
సమస్తమూ తానే అయి ఉన్న పూర్ణత్వం.

శూన్యం అనే మాట సాధకునికి సంబంధించినది.
పూర్ణం అనే మాట సిద్ధునికి సంబంధించినది.
అంతే. విషయం ఒకటే.

ఏమీలేనితనంగా కనిపించే
అన్నీఉన్నతనానికి సంజ్ఞారూపమే - ఆదిభిక్షువు.

ఆదిభిక్షువు యొక్క బిడ్డడైన రమణుడూ భిక్షువై
జ్ఞానశిశువై అరుణాచలేశుని ఒడిలో కొలువై
అన్ని వాదాలను అంగీకరిస్తున్నట్టు కనిపిస్తూనే,
ఏ వాదమూ లేని ఆత్మనిష్ఠను ప్రబోధించాడు.

* * *

ప్రపంచానికి హృదయం అరుణాచలం.
అరుణాచలానికి హృదయం రమణా నీవే.

రమణా! మా అహంకారాన్నే గురుదక్షిణగా
స్వీకరించే జగద్గురువు నీవు.
నీవు ఒక్కడివే ఒక్కడివే.

రమణా! నీ పరిపూర్ణస్వరూపంలో
సకలమూ ఇమిడి ఉన్నది.

కానీ ఒక్క లోటు మాత్రం ఇమిడి ఉన్నది.
అందులో ఆది లేదు, అంతం లేదు.

సముద్రునికి ఆ నీటితోనే అర్ఘ్యమిచ్చినట్లు
రమణా! అంతా నీ దివ్యస్వరూపమే అయినప్పుడు
నీకు నేనేమి సమర్పించగలను?
నీ మాటలను నీకే అప్పగించడం తప్ప.

* * *

ప్రతి యేటా డిశెంబరు 30న వచ్చే రమణజయంతికి  పూజలు చేసేవాళ్లం సత్సంగంలో.
1999 సంవత్సరం రమణజయంతిని మా శ్రీరామ మందిరంలో జరపాలని నేనూ నా స్నేహితుడు ముక్కంటి చంద్ర(టైలర్) నిర్ణయించుకున్నాం.
సూరమాలస్వామిని, ఇతర భక్తులను ఆహ్వానించి గురువుగారితో ఆ రాత్రంతా సత్సంగం చేశాం...
వీడియో రికార్డింగులు చేశాంగానీ...ఆ కేసెట్స్ ను సరిగా భధ్రపరచకపోవడం వలన అవన్నీ పాడైపోయాయి...
రమణజయంతి సందర్భంగా రమణుని చరిత్రను సంక్షిప్తంగా వ్రాసి, కరపత్రంగా ముద్రించి, అందరికీ పంచే ఏర్పాటు కూడా చేశాం...
ఆధ్యాత్మికంగా...నా తొలిరచన అదే.
"జ్ఞానప్రసూనాలు"  కూడా 2000 సంవత్సరం తరువాత వ్రాసినవే.
ఆ నాలుగు పేజీల కరపత్రం చదివి-
"ఇది నువ్వు వ్రాయలేదు..." అన్నారు గురువుగారు.
సత్యము, పొగడ్త రెంటినీ కలగలిపి చెప్పడం గురువుకే తగును అనిపించింది.
మొత్తానికి ఆ compliment భవిష్యత్తులో మరెన్నో రచనలు చేయడానికి నాకు స్ఫూర్తినిచ్చింది.

ఆ నాలుగు పేజీల కరపత్రం ఇదే-

* * *

భగవాన్ శ్రీ రమణమహర్షి తమిళనాడు మధురైకు దగ్గరలో ఉన్న తిరుచ్చిళి అనే గ్రామంలో అళగమ్మ-సుందరమయ్యరు అనే పుణ్యదంపతలకు పునర్వసు నక్షత్ర పుణ్యదినాన
అనగా 30 డిశెంబరు 1879 న జన్మించారు.

భగవాన్ తన 16వ యేట ఒకసారి మేడపై పడుకుని ఉండగా హఠాత్తుగా శ్వాస ఆగిపోయినట్లు, దేహం బిగుసుకుపోయి చనిపోయినట్లు అనుభూతి కలిగింది. శరీరం నిర్జీవం అయిపోయినా కూడా ఆయన ఆలోచన ఇట్లా కొనసాగింది-

ఇప్పుడు ఈ శరీరం చనిపోయింది. దీన్ని శ్మశానానికి తీసుకుపోయి దహనం చేస్తారు.
అది కాలి బూడిదవుతుంది.
కానీ "నేను" అనేది మాత్రం శరీరంతో పాటు చావక మిగిలి ఉంది. కాబట్టి "నేను" అనేది శరీరం కాదు. ఈ "నేను" శరీరంతో పాటు చచ్చేది కాదు.

అనే భావం అతనిలో స్థిరపడింది.
నేను ఈ శరీరాన్ని కాను.
"నేనున్నాను" అన్న ఎఱుకయే "నేను" అని తెలుసుకున్నారు.
ఇదంతా కేవలం ఆలోచనగా కాక అనుభవంగా మారుకుంది. వెంటనే శరీరంలో చలనం వచ్చి మామూలుగా అయినారు.

ఆ స్వానుభవంతో మనిషి ఋషి అయినారు.
వైరాగ్యం పెరిగింది. బాహ్యవిషయాలపై ఆసక్తి తగ్గింది. ఇల్లు విడిచి అరుణాచలం చేరారు. శివలింగాన్ని కౌగిలించుకుని, తండ్రీ! నీ ఆజ్ఞ మేరకు వచ్చాను. అంటూ ఆనందభాష్పాలతో అభిషేకించారు. నమస్కారం చేయలేదు, సాష్టాంగపడలేదు. ప్రదక్షిణం చేయలేదు. ఏ స్తోత్రమూ చేయలేదు. తండ్రీ! అని సంబోధించారు.
శరణాగతికి గొప్ప అర్థం చూపారు. ప్రయాణంలో మిగిలిన పైకాన్ని బయట కోనేరులో పారేశారు. కౌపీనం ధరించారు. మౌనం పట్టారు. అరుణాచలమే సింహాసనంగా ఆధ్యాత్మిక సామ్రాజ్యాన్ని ఏలారు 54 ఏళ్లు.

ఇంట్లోవాళ్లు ఇతని కోసం దేశమంతా గాలించారు.
అరుణాచలంలో యోగిగా ఉన్నాడని తెలిసి బయలుదేరింది తల్లి.
కుమారుని అవతారం చూసి భోరుమని ఏడ్చింది. తనతో ఇంటికి రమ్మంది.
స్వామి మౌనం వీడలేదు. ప్రక్కనున్నవారు పెన్సిలు, కాగితం ఇచ్చి తల్లికి ఏదైనా తెలియజేయమన్నారు.

అందులో ఇలా వ్రాశారు-
కర్త(ఈశ్వరుడు) వారి వారి ప్రారబ్ధకర్మానుసారము జీవులను ఆడిస్తున్నాడు. జరగవలసినదానిని ఎవరెంత అడ్డుపెట్టినా జరిగి తీరుతుంది. జరుగనిది ఎవరెంత ప్రయత్నించినా జరుగనే జరుగదు. ఇది సత్యము. కనుక మౌనముగా ఉండుటయే ఉత్తమం.

కుమారుని ఉన్నతస్థాయిని గుర్తించి ఆమె తన జీవిత అంత్యం వఱకు భగవాన్ తోనే గడిపి, ఆయన ఒడిలోనే చివరిశ్వాసను విడిచింది. భగవాన్ ఆమెకు ముక్తిని ప్రసాదించారు.

తిరుపతి వేంకటకవులు సైతం పాదాభివందనం చేసిన మహాకవులు, తపస్వి, మంత్రద్రష్ట అయిన శ్రీ కావ్యకంఠ గణపతిముని భగవాన్ ను దర్శించి "భగవాన్! నేను చదువని శాస్త్రం లేదు, జపించని మంత్రం లేదు. అయినా నేను శాంతిని పొందలేకున్నాను. మార్గం చూపండి" అని వేడుకున్నాడు.

భగవాన్ కరుణతో తన 12 ఏళ్ల మౌనాన్ని వీడి,
గొంతు సవరించుకుంటూ మెలమెల్లగా ఇట్లా చెప్పారు- "నేను-నేను" అంటున్నావే ఈ "నేను" అనేది ఎక్కడ నుంచి పుడుతోందో గమనించి చూడు. మనస్సు అందులో లీనమౌతుంది. అదియే తపస్సు. మంత్రాన్ని జపించేటప్పుడు మంత్ర నాదం యెక్కడ నుంచి పుడుతోందో గమనించి చూడు. మనస్సు అందులో లీనమౌతుంది. అదియే తపస్సు." అని ఉపదేశించారు. గణపతిముని ఆ దివ్యమైన ఉపదేశానికి పులకించినవాడై సాష్టాంగపడీ ఆశువుగా భగవాన్ మీద శ్లోకాలు పాడారు.

గణపతిముని తన దివ్యదృష్టితో చూచి భగవాన్ శ్రీ రమణమహర్షి సాక్షాత్తు పార్వతీదేవి ముద్దుల కుమారుడైన కుమారస్వామి అవతారమని నిరూపించి లోకానికి చాటారు.

కుల, మత ప్రమేయం లేకుండా లక్షలాదిమంది జనం చేరారు. ప్రశ్నలు వేసి సమాధానం పొందారు. అవన్నీ పెద్ద పెద్ద గ్రంథాలైనాయి. చిన్న గుడిసె ఇప్పుడు పెద్ద గుడి అయ్యింది. భగవాన్ మాత్రం గోచీ, తుండుగుడ్డ, ఊతకర్ర, కమండలం తప్ప ఇంకేవీ ముట్టుకోలేదు. ఇవే ఆయన ఆస్తి.

ఒక్క మానవులకే గాక, గోవు, జింక, కాకి, కుక్క మొదలైన జీవజాలానికి కూడా ఆయన ముక్తిని ప్రసాదించారు. నేటికీ శ్రీరమణమహర్షి ఆశ్రమంలో వీటి సమాధులు ఉన్నాయి.

చివరికి భగవాన్ 1950 ఏప్రిల్ 14వతేది రాత్రి 8-47 నిమిషాలకు మహానిర్యాణం పొందారు. ఒక జ్యోతి రూపంలో ఆయన అరుణాచలంలో కలిసిపోయారు. ఈ జ్యోతిని వేలాది భక్తజనమంతా చూసి తరించారు. నేటికీ రమణమహర్షి సమాధి సన్నిధిలో గొప్ప శాంతి ఆవరించి ఉంటుంది.

ఆయన ఉపదేశసారమంతా ఒక్కటే-
"నిన్ను నీవు తెలుసుకో" అని.
"నేను" అనేది ఇప్పుడు దేహం వఱకే పరిమితమైపోయింది. నేనెవడను? అనే ఆత్మశోధన ద్వారా ఈ దేహపరిమితమైన నేను, అపరిమితమైన "నేను"గా మారుకుంటుంది. అంటే చిన్న నది సముద్రంలో కలిసి అనంతమైన తత్త్వంగామారుకున్నట్లు, ఈ చిన్న "నేను" ఆ అనంతమైన "నేను"లో కలిసిపోతుంది. అదే ముక్తి అంటే. ఇంకేమీ కాదు.

జ్ఞానులు చెప్పే ఆత్మకు, భక్తులు చెప్పే దైవానికి, రమణమహర్షి చెప్పే ఈ "నేను"కు ఏ తేడా లేదు. ఆత్మ-దేవుడు-ఓంకారం-నేను ఈ నాలుగూ ఒకటే అర్థం. భగవంతునికి నిజమైన పేరు, అర్థం "నేను" అంటారు భగవాన్. నేనెవడను? అనే ఆత్మశోధన కన్నా గొప్ప కర్మగాని, గొప్ప భక్తిగాని మరేదీలేదు. "నేను"ను తెలుసుకుంటే, ఏకకాలంలో అన్నీ తెలుసుకున్నట్లే.

నేనెవడను? అనే ఆత్మవిచారణ ద్వారా మనమందరం తరియింతుము గాక.

* * *

గురుదేవులవారికి రమణుల జీవితం అన్నా, రమణుల తత్త్వం అన్నా బహుప్రియం...
రమణులు రచించిన "ఉన్నది నలుబది" గ్రంథాన్ని నోట్ బుక్ లో వ్రాసుకుని మరీ కంఠస్తం చేశారు...
వారు శిష్యులకు ఆధ్యాత్మికం బోధించేటప్పుడు వారి నోట రమణుల వాక్యం ఒక్కటైనా వచ్చి తీరుతుంది...

గురుదేవులవారు 2001 లో "జయశ్రీ రమణ గీతామృతం" అనే గ్రంథం వ్రాసి, స్వంతఖర్చుతో అచ్చువేయించి, రమణులకు అంకితం చేశారు.
మా అత్యాశ్రమంలో ప్రతి మంగళవారం జయశ్రీ రమణ గీతామృతమును పారాయణం చేస్తున్నాం.

---

జయశ్రీ రమణ గీతామృతం

---

పల్లవి:

రండీ రండీ రండీ రండీ...
రమణస్మరణ జేయండీ...
లెండీ లెండీ లెండీ లెండీ...
రేపు మాపని అనబోకండీ...

* * *

చరణాలు:

1.అలగు సుందరుల అమృతఫలమిది
ఆరగించ రారండి.
పదునారేడుల ప్రాయములోనా
ప్రాణమ్ముల నెడబాసి లేచెనట.

2. అరుణాచలమని యన్నమాట విని
ఆనందముతో పొంగీ
ఇల్లు వదలి ఎవ్వరికీ తెలియక
ఎట్లో కదలెనటండీ.

3. పలుపాటుల బడిపడుచు లేచుచును
పట్టణరాజము చేరి,
అరుణాచలు గుడిలోని లింగమును
అప్పా అని దరిజేరి,

4. పుట్టుగోచి తాబెట్టిన వాడై
పూర్ణుడుగా తానుండీ,
తలపులు బోడిగ తలయు బోడిగ
తపోనిష్ఠలో నుండీ,

5. చీము నెత్తురులు చెదలుపాలుగా
పాములె తోడుగ మెలగీ,
తనలో తానుగ తనువును మరచి
తన్మయత్వమున జెలగీ,

6. మౌనస్వామి యని పేరుగాంచె దా
నేమాటయు లేకుండీ,
బ్రహ్మానంద రసానుభూతిచే
బ్రాహ్మణస్వామిగనుండీ,

7. ఆ రూపున మెలమెల్లగ కదలి
విరూపాక్షగుహ నుండీ,
కోరి చేరిన భక్తుల పాలిటి
కొంగుబంగారమయ్యెనండీ.

8. కావ్యకంఠ బిరుదాంకితుడగు శ్రీ
గణపతిముని పడి మ్రొక్కి,

శాంతిని పొందెడు సూటిమార్గమున
భ్రాంతిని వీడెనటండీ.

9. ఘనుడను ఆ ముని శిష్యుల జూచుచు
గద్గదస్వరమున తెలిపే.
పరమగురుడు శరవణభవుడీతడు
భగవాన్ శ్రీ రమణమహర్షని పలికే.

10. తనచే ముక్తిని బడసిన తల్లికి
ఘనముగ గుడి కట్టించి,
మాతృభూతేశ్వరాలయమంచును
మౌనసాక్షిగానుండె.

11. గిరిపాదమ్మున ఆశ్రమమ్ము
తన పేరన బరగుచునుండ
భగవానుడు రమణుడు కరుణతొ
భక్తుల గాచెనటండీ.

12. చిన్నలలో కడ చిన్నగనుండె.
పెద్దలలో తలపెద్దగనుండె.
నిరుపేదల నిరుపేదగ నుండె.
భోగులలో పుట్టు భోగిగానుండె.

13. రాజుల పాలిటి రారాజతడు.
చక్రవర్తులకె సార్వభౌముడు.
అపరిచుతులకు పరిచుతుడతడు.
పరిచితులకు అపరిచితుడే అతడు.

14. పశుపక్ష్యాదుల రక్షకుడతడు.
నరవానరముల నాథుండతడు.
జీవుల పాలిటి దేవుండతడు.
జిజ్ఞాసువులకు జ్ఞేయంబతడు.

15. అతి దుర్లభగు ఆత్మవిద్యను
అతి సులంభంబని అన్న ఘనుడతడు.
నేనెవరను విచారమార్గమును
నేర్పుతోడ బోధించు గురువతడు.

16. ఎవని యందు యీ జగతి పుట్టెనొ?
ఎవని యందు నిలుకడను జెందెనొ?
ఎవని యందు కలగలసిపోవునొ?
అతడే రమణుడు ఆశ్రితావనుడు.

17. ఎవడు నిద్రలో స్వప్నము వలెనే,
ఎవడు త్రాటిలో సర్పము వలెనే,
ఎవడు ఆత్మలో లోకము జూచెనొ
అతడే రమణుడు ఆశ్రితావనుడు.

18. ఎవడు శిష్యులకు శ్రీ గురురూపమో?
ఎవడు భక్తులకు భగవతత్త్వమో?
ఎవడు జ్ఞానులకు జ్ఞానమాత్రమో?
అతడే రమణుడు ఆశ్రితావనుడు.

19. ఎవని భాషణము కేవలం మౌనమో?
ఎవని వర్తనము సమరసాత్మకమో?
ఎవని మౌనము నవనీత సమానమో?
అతడే రమణుడు ఆశ్రితావనుడు.

20. ఎవని దేశమున కెల్లలు లేవో?
ఎవని కాలమున మితులే లేవో?
ఎవని మనస్సున గతులే లేవో?
అతడే రమణుడు ఆశ్రితావనుడు.

21. ఎవడు దీనులకు పెన్నిధానమో?
ఎవడు దుఃఖితులకు సన్నిధానమో?

ఎవడు ప్రశ్నలకు సమాధానమో?
అతడే రమణుకు ఆశ్రితావనుడు.

22. ఎవని తనువు అరుణాద్రి స్వరూపమో?
ఎవని హృదయము రమణాశ్రమమో?
ఎవని జీవుడు రమణాచలుడో?
అతడే రమణుడు ఆశ్రితావనుడు.

23. తను, సంసార, ప్రపంచ, దైవములు
తనలో తోచెడు తలపులేయనె.
తలపులు అణగిన తన్మయత్వమనె.
తన్మయత్వమే తన స్వరూపమనె.

24. అంతవంతమౌ అహంస్వరూపము
అహంకారమై బాధపడుననె.
అనంతమయ్యేడు అహంకారమే
అహంస్వరూపానుభవంబనె.

25. ఏ కాలంబునకేది కావలెనో
ఆ కాలంబున కదియై తీరును.
కానిది ఏ విధి గానేకాదు.
కర్త ఈశ్వరుడు కాక మరెవ్వరు?

26. అనువుగ తనువున అవయవమ్ములు,
అవనిలోన గిరి, కాననమ్ములు,
జలధిలోన బహు జలచరమ్ములు
జెలగునట్లాత్మయందు జగమ్ములు.

27. విశ్వరూపము, వేదస్వరూపము,
విశ్వేశుని మాయాస్వరూపము,
విఘ్నేశ్వరుని శక్తిస్వరూపము
వివరించుటయే రమణస్వరూపము.

28. ఆదిశంకరుల అద్వైతమ్ము,
గౌతమబుద్ధుని దయాళుత్వము,
ఏసు పరలోకరాజ్య మహత్వము
ఏకమైన అదె రమణస్వరూపము.

29. నిరాకారమైయున్న పరమాత్మ
పురాకృత పుణ్యఫలరూపమ్మై
పరాపరాతీత బ్రహ్మతేజమున
ప్రకాశించె, అదె రమణస్వరూపము.

30. ప్రకృతి, పరమాత్మనేకాంతంబున
పరతత్త్వ మహిమ వర్ణింపవేయన
వర్ణనము లేల కనులార గాంచుమని
నట్లు దోచు రమణుల స్వరూపము.

31. జనులలోన జ్ఞానాగ్ని రగల్చి,
వారి కర్మపరిపాకము జేసి,
ముక్తిని ముద్దలు ముద్దలు చేసి,
వడ్డన జేసిన వలలుడు రమణుడు.

32. జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడు
స్వప్న సమానమటంచును చూడు.
చూచెడు తననే చూచెడివాడు
సుందరుడగు రమణేశుడెవాడు.

33. సాగరసంగమ సమయ విలాసము
సదమల కమల వికాస విలాసము
సాయంసంధ్యా సామయ విలాసము
సద్గురు రమణుని స్మరణ విలాసము.

34. మాతా శిశు మధురానుబంధము
శీతలానిల కుసుమ పరిమళము

సుబ్రహ్మణ్య విభూతి మహత్త్వము
సద్గురు రమణుని స్మరణ వైభవము.

35. ఎవరూహింతురు ఆతని గరిమ?
ఎవరు తెలియుదురు ఆతని మహిమ?
ఎవరు భరింతురు ఆతని భారము?
ఎచట కలదు రమణుని సంసారము?

36. అసత్తు నుండి సద్వస్తువునకు
తమస్సు నుండి ఉషోదయమునకు,
మృత్యువు నుండి అమృతత్వమునకు,
జేర్చెడి సాధన రమణుల బోధన.

37. జనన మరణ చక్ర భ్రమణమ్మున
యోగ, సంయోగ, వియోగానలమున
తిరిగెడి, మరిగెడి, జీవుల నావల
జేర్చెడి సాధన రమణుల బోధన.

38. అతి సరళము, అత్యంత సహజము,
అనపాయము, అత్యంతాద్భుతము,
సులభము, సూక్ష్మము, సుందరశివమును
జేర్చెడి సాధన రమణుల బోధన.

39. దక్షిణామూర్తి మౌన బోధ ప్ర
త్యక్ష వ్యాఖ్యాన పూర్వకము, సదా
శివజ్ఞాన సంబంధ బంధమున
జేర్చెడి సాధన రమణుల బోధన.

40. శివగురునాధ వశీకర మంత్రము,
సకల జీవ సంచాలక యంత్రము,
అరిషడ్వర్గ నివారక తంత్రము,
లకుగా సాధన రమణుల బోధన.

41. అతి గంభీరము ఆతని మౌనము.
అతి ప్రశాంతము ఆతని వదనము.
అతి మనోహరము ఆతని రూపము.
ఆతని జూడ దను మరచుట సత్యము.

42. అతని శక్తి గమనించవలెనని,
అతని బోధనలను శోధింతుమని,
అతని జూడ గనిపెట్టవలెనని,
అతని జూడ తను మరచుట సత్యము.

43. లవణము జలధిని లయించినట్టుల,
నీరము క్షీరము జేరినట్టుల,
నిదుర మెలకువను చెదరి నట్టుల
అతని జూడ తను మరుచట సత్యము.

44. ఆశ నిరాశల అల్లాడు వారును,
సుఖదుఃఖమ్ముల సుడిపడువారును,
కుమిలి కుమిలి మది గుందెడు వారును,
అతని జూడ తను మరచుట సత్యము.

45. వేదవేదాంగ ఘనాపాఠీలు,
వివిధ శాస్త్రార్థ విశ్లేషకులు,
విశ్వాంతరాళ వివేచనపరులు
అతని జూడ తను మరచుట సత్యము.

46. పీఠాధిపతులు, మఠాధిపతులు,
హఠయోగ సమ్రాట్టులు, యతులు,
కంఠీరవాది బిరుదాంకితులు, నటులు,
అతని జూడ తను మరచుట సత్యము.

47. పలికియు పలకడు, వినియు వినడు
ఇచ్చియు ఇవ్వడు, ముట్టియు ముట్టడు

కనియూ కనడు, తినియూ తినడు,
కదలియు కదలడు రమణేశ్వరుడు.

48. వేదవిధులు, సాధులు, సన్న్యాసులు,
విద్యానిధులు, విజ్ఞానులు, జ్ఞానులు,
కవులు, కాల్పనికులు, పాలకులు
రమణఛాయ విశ్రాంతి బడసిరట.

49. దేశ దేశముల ధీమంతులు, బుధులు,
స్త్రీలు, పురుషులు, చిన్నలు, పెద్దలు,
పండుముదుసలులు, పరితప్తులు శ్రీ
రమణఛాయ విశ్రాంతి బడసిరట.

50. సూర్యరశ్మి సూర్యుని ఎడబాయదు.
చంద్రకాంతి చంద్రుని జతబాయదు.
దహనశక్తి దహనుని విడబోవదు.
స్మరణశక్తి రమణుని విడివడదు.

51. కనులకు రెప్పలమర్చిన విధమున,
కడలికి నియతిని నేర్పిన విధమున,
పదములకర్థము పలికిన విధమున
సదయుడు రమణుడు సద్గతి దెలుపును.

52. అద్దములో ప్రతిబింబము జూచుచు
అద్దము జూచియు చూడని విధమున,
జగతి జూచి జగదీశుని జూడరు.
చూచువారె మన రమణుని జూతురు.

53. నేనెవరను రమణుని దెలిసిన
నేనెవరని ఆత్మను తెలియును.
నేనెవరని ఆత్మను తెలిసిన,
నేనెవరను రమణుడు తెలియును.

54. తరించు మార్గము దయ చేయుడని
తన్ను గోరిన మురుగునారుని
కరుణాభరణుడు నలువది మాటల
మురియుచు రమణుడు తరింపజేసెను.

55. తలపులు లేక తన మూలములో
తానుగ స్వస్వరూపమున్నదనె.
అది ఉన్నట్లుగ తానుండవలననె.
అదె సద్వస్తువు అన్యము లేదనె.

56. చావుపుట్టుకల జంకు గలవారు
సదా మహేశుని శరణుగోరెదురు.
అహంకార మమకార రహితులకు
ఆ భయమన్నది లేనే లేదనె.

57. లోకము జూచెడు లోకులందరు
లోకేశ్వరుడొకడున్న వాడనిరి.
లోకంబుల, లోకేశులు, లోకుల
రూపమైన వాడొక్కడే అనిరి.

58. జీవ, జగత్, ఈశ సంపుటి మతము,
సతతము మూడుగ తోచుటె అహము.
అహము చచ్చిన మూడు తొలగుననె.
అదియే ఉత్తమమైన స్థితియనె.

59. సత్యము, జ్ఞానము, సుఖము లోకమున
నిత్యము కాదన ఫలమేమిటనె?
తన్నుదా దెలిసి నేను లేని స్థితి
ఉన్న సమ్మతము, తెలిసికొమ్మనె.

60. తాను సాకారుడైన, ఈశ్వరుడు
తప్పక అట్లే కావచ్చుననె.

తాను కాకున్న అతడెట్లగునసె
తానే తుదిలేని కన్ను అనె.

61. దేహము లేకనె లోకమున్నదా?
దేహము లేకనె లోకము గనిరా?
పంచకోశముల నణిగిన దేహియె
ప్రపంచదృశ్యము పరికించుననె.

62. పంచేంద్రియముల పంచవిషయముల
పరికించెడి మనసే లోకమనె.
మనసు లేనిదే లోకము లేదనె.
లోకము మనసని తెలుసుకొమ్మనె.

63. లోకజ్ఞానముల భవలయస్థానము
భవలయ రహితము, భాసమానము,
పరిపూర్ణము, లోకమునకు మూలము
భవ్యము, దివ్యము పరికించుడనె.

64. బహునామంబుల, బహురూపంబుల
బహుళవిధంబుల భజించుచున్నను
సత్యవస్తువును జూడవచ్చుననె
సత్యదర్శనము తన్మయమగుటనె.

65. ఆశ్రయము లేక ద్వంద్వములుండవు.
అంతకు ముందే త్రిపుటులుండవు.
మనసులోన అది యేదని చూడగ
మాయమౌను కలతేమీ ఉండదనె.

66. జ్ఞానమునకు అజ్ఞానము కలదనె.
జ్ఞానము అజ్ఞానమునకు కలదనె.
జ్ఞానాజ్ఞానములెవ్వరికని కను
జ్ఞానమె జ్ఞానంబగును సుమ్మనె.

67. ఎరిగెడు తనను ఎరుగక ఇతరము
నెరుగుట జ్ఞానము కానే కాదనె.
జ్ఞాన ఇతరముల కాధారమౌ తనకు
జ్ఞానాజ్ఞానములు నశించుననె.

68. ఎరుగు వారెవరు? ఎరిగించువారెవరు?
ఇతరము లేక వెలుగును జ్ఞానము.
ఎరుగునది యధార్థము కాదనె.
ఇది జ్ఞానంబనె. శూన్యము కాదనె.

69. జ్ఞానమై యున్న తానే సత్యము.
నానాకార జ్ఞాన మసత్యము.
పసిడి లేక ఆభరణముండదనె.
పరికించిన ఆ రెండు ఏకమనె.

70. నేను తత్త్వమును ఎరిగిన వానికి
నేను ఉండడు, ఇతరులుండరు.
ఏకమైన నేనే ఉండుననె.
ఈ నేనే తన నిజ స్వభావమనె.

71. భూత భవిష్యత్ వర్తమానముల
పూర్ణస్వరూపము వర్తమానమనె
వర్తమానమే తక్కిన రెండనె.
ఒకటి లేక యెంచుటయు జరుగదనె.

72. ఇప్పుడు, అప్పుడు, ఎప్పుడు ఒకరమె.
ఇక్కడ, అక్కడ, ఎక్కడ ఒకరమె.
కాలదేశములు మనకు లేవనె.
మనము లేకున్న అవియు లేవనె.

73. తన్నెరిగినచొ తానే తనువగు
తన్నెరుగనిచో తనువే తానగు.

ఎరిగినవారికి, ఎరుగనివారికి
ఇంతే బేధము. ఎరిగి చూడమనె.

74. తెలియనివారికి జగమే సత్యము.
తెలిసినవారికి సత్యమే జగము.
సత్యమె జగతికి మూలాధారము.
ఇరువురి బేధము. ఇంతే పొమ్మనె.

75. విధి,మతులు రెండు గెలుచు వివాదము
విధిమతుల సమూల వివేకము
లేనివారలకు కలుగుచుండుననె.
లేశమైన జ్ఞానులకు కలుగదనె.

76. చూచెడు తననె చూడనివాడు,
చూడగలడె దైవమును తెలియుడనె.
తన్ను గనక దైవమును గనడనె.
కనినట్లున్నను కల్పన యౌననె.

77. ఏకమైయున్న తనను జూచుటే
ఏకేశ్వరుని జూచుట యౌననె.
సర్వశాస్త్రముల సారమిదేయనె.
సర్వాత్మున కాహారమగుట యనె.

78. బుద్ధికి లోపల వెలుగుచునుండీ
బుద్ధికి దైవము వెలుగు నొసగుననె
బుద్ధిని లోనికి ద్రిప్పి దైవమున
ఒద్ధిక మీరగ చేర్చి చూడుమనె.

79. ఈ దేహము నేనని పలుకదు.
ఎవ్వరు నిద్రలొ నేను లేననరు.
ఈ నేననునది ఎక్కడ పుట్టునో
ఎరుక తోడ శోధించి చూడుమనె.

80. జడమీ దేహము నేనని అనదు.
సత్తైయున్న చిత్తును పుట్టదు.
నడుమ దేహమంతయె నేనుగ
పొడగట్టును. కనిపెట్టి చూడుడనె.

81. ఇదె సాంసారము, చిజ్జడగ్రంథి,
ఇదే బంధము, జీవుడు, మనసు,
ఇదే సూక్ష్మశరీరము, సర్వము.
ఈ నేనే తన దేహమంత అనె.

82. రూపును పుట్టును, రూపున పుట్టును,
రూపున నిలుచును, పెరుగును, తినును,
రూపును వదలి, రూపును దాల్చి,
అరూపమై చను, అహంకారమనె.

83. అఖిలముండుటకు, లేకుండుటకు
అహంకారమే మూలకారణము.
అహంకారమును కని వదలిన, అదె
సకలంబును వదులుట యౌనవె.

84. పుట్టకున్న స్థితి స్వస్థితి యౌనవె.
పుట్టెడు చోటును జేరి చూడుమనె.
చూచి నిలుకడను చెంది యుండుమనె.
ఉండకన్నచో స్వస్థత లేదనె.

85. బావిలో పడిన వస్తువు కొరకై
వాక్ ప్రాణములను బంధించి మునుగరె.
ఆ రీతిని తన పుట్టు చోటును
కోరి మునిగి కనిపెట్టవలెననె.

86. నేనని ఎచ్చట వెలుగుచుండునో
లోన మునుగు మనస్సున గనుమనె.

ఆత్మవిచారము అదియే కానీ
అది, ఇది యని పలుకుట కాదనె.

87. తానెవ్వడనని వెదకువానిని,
తలక్రిందులుగా పడినవానిని
జూచుచు, సాక్షిగ దోచెడు దానిని
చూచిన అదియే పరిపూర్ణంబనె.

88. తన్మయుని స్థితి ఇది అది అనుటకు
తగినవారు లేనే లేరనె.
విధినిషేధముల కాతడతీతుడు.
వివరించుట కెవ్వరికి సాధ్యమనె?

89. అది నీవేయని అన్యము లేదని
ఆత్మవిదులు విశదమ్ము చేయగా
అది నేనిది గాదనుట మానుమనె.
ఆ వెలుగే నీవనుచు తెలియుమనె.

90. నను నేనెరుగను, నను నేనెరుగుదు
ననెడు వారలది నాటకమే యనె
ఏకమైన తననెరుగకుండుటకు,
ఎరుగుట కెవ్వరి తరము? చూడుడనె.

91. తన స్వభావమై యున్న వస్తువును
ఉన్నది, లేదని వేయి విధమ్ముల
ఘనతమీర  వాదించెడు వెఱ్ఱులు
కానలేరు మాయా విశేషమనె.

92. సిద్ధవస్తువును ఎరుగుటె సిద్ధి.
శేషించినవి స్వప్నసిద్ధులే.
ఆత్మసిద్ధులకు ఆ భ్రమలుండవు.
సత్యవస్తువే సిద్ధవస్తువనె.

93. తనువే తానని తలచువారలకు
తానిది, అది కాదనుట సహాయము.
తన్నెరింగిన తత్త్వమూర్తులకు
తత్ సహాయమనవసరమే యనె.

94. సాధనలోను, సాధ్యములోను
ద్వైతా ద్వైతములుండుట వట్టిది.
సాధన సాధ్యములందద్వైతమ్మే.
సత్యంబిది మది మరువకుండుడనె.

95. కర్తృత్వము తన్నెరిగిన వదలును.
కర్తృత్వముతో కర్మలు వదలును.
మూడును వదలుటే ముక్తపదమగును.
ముక్తపదస్థుడె నిత్యముక్తుడనె.

96. బద్ధుడు నేనని భావించినచో
బంధముక్తి చింతలు బాధించును.
బద్ధుడెవ్వడని తను తానెరిగిన
బంధ, ముక్తి చింతలెట్లుండుననె.

97. మూడు రూపముల ముక్తి యుండునను
మూఢ మతులకొక మాట తెలిపెదను
మూడు ముక్తులను చింతించెడి యా
మూఢుని అహంత నశింపవలెననె.

98. యతిగణముల సంగతియే కాని
యతిగణముల సంగతియే ఎరుగను.
గురుజనముల మ్రోల లఘువునై
గురు రమణుని గోరి నుతింతును.

99. అతని పరమపద సోపాన పటమున
సతతము యెక్కుటె, జారుట ఉండదు.

కంటబడిన చాలును కరుణించెడి
గురురమణుని గోరి నుతింతును.

100. ఎవని నిత్య వ్యవహార భాషణలు
ఇహపరార్థ సంహితలై చెలగునొ
పరమ కృపాకరుడు, ధరనడయాడెడు
గురురమణుని గోరి నుతింతును.

101. లోకమునకు రమణులున్నారనినను
లోకము రమణునకున్నదనుటెటులు?
ఉండుట, కుండకుండుటకు అందని
గురు రమణుని గోరి నుతింతును.

102. అపశబ్దంబుల గూడియు హరికథ
దారుణ పాతక వారణమందురె.
అపశబ్దంబుల కభయము నిమ్మని
గురు రమణుని గోరి నుతింతును.

103. పాపపుణ్యముల దన కర్పించిన
పరిశుద్ధాత్ములగుచు తరింతురు.
భయమేమియు లేదని నుడివిన
గురు రమణుని గోరి నుతింతును.

104. పసిబాలుర పలుకుల ముద్దుగ
మిసిమి బుగ్గల నిమురుచు విందురు.
విసుగుపడక వినుమని వరముని
గురురమణుని గోరి నుతింతును.

105. ఎవ్వరే గతిని నిన్ను జూచినను
వారు తమనె జూచిరి పరవశించిరి.
అద్దమున జూచు ప్రతిబింబము వలె స
ద్గురు రమణుని గోరి నుతింతును.

106. ఇతనికి యోగ్యత ఏమి కలదనుచు
కరుణమాలి కఠినుడ వగుదువేమొ.
కలదె నిన్ను మనమున దలచుట కంటెను?
గురు రమణుని గోరి నుతింతును.

107. మంగళము నీదు రూపమునకు, స
న్మంగళము నీదు రమణ నామమునకు
మంగళము సకల జగతికి వినుమని
గురు రమణుని గోరి నుతింతును.

108. శ్రీకాళహస్తీశ్వర సన్నిధి
రమణ సత్సంగమున గల పెన్నిధి.
సద్గురు రమణుల స్మరణామృతమిది
తనివి తీరగైకొనరె. సుఖింపరె.

---

అరుణగిరి వాస! రమణేశ! ఆదిపురుష!
పలుకు, పలికించువాడును, పలుకువాడు,
పఠిత, ఫలప్రదాతయు, ఫలము నీవ
యగుచు వెలుగొంద, నేనెవరయ్య! తెలియ.

---

125.
65 వ నయనారు

---

20-12-2021 * సోమవారం...

ఈరోజు ఆర్ద్రోత్సవం...
వ్యావహారిక పదం ఆరుద్ర...
ప్రకటనంకాని శివుడు...
ప్రకటన అయినట్టు కనిపించడమే...
శివునిలో ఉన్న అతిశయశక్తి...
ఏకవచనం  బహువచనం అయినట్టుగా...

ప్రపంచానికి అనిపించినరోజు ఆరుద్ర...
శివుడికి పుట్టినరోజు ఆరుద్ర...
"ఉన్నదే" ఉన్న"ట్లు"గా...లేన"ట్లు"గా ఉన్నది...
ఆ సదా ఉన్నదే...
ప్రపంచంగా పుట్టిన"ట్లు" ఉండడం సృష్టి...
ప్రపంచంగా ఉన్న"ట్లు"గా ఉండడం స్థితి...
ప్రపంచం "లేనట్లు"గా ఉండడం లయం...
ఉండడం సదా ఉండటమే సదాశివుడు...
కానీ మన లెక్కలో...
పుట్టనివాడికి కూడా పుట్టినరోజు దొరికింది...
కాలకాలుడికి కూడా మన క్యాలెండరులో చోటు దొరికింది...
అందుకే వాకింగ్ పూర్తి చేసుకుని...
గురుసన్నిధికి చేరుకున్నాను...
బుద్ధి తెలిసినప్పట్నుండి...
భౌతికశాస్త్రమే తప్ప ఆధ్యాత్మికశాస్త్రం పరిచయం లేనివాణ్ణి...
"ఒక్క దైవమహిమ"ను నా కళ్లారా చూడగలిగి...
నాకు దేవునిపై నమ్మిక కలిగేటట్టు అనుగ్రహించండి...
అని కోరిన ఓ ఆంగ్లవైద్యుని విన్నపాన్ని విన్నవించాను గురువుగారికి...
తనను తాను నిరూపించుకోవలసిన అవసరం...
దేవుడికి లేదు...
అన్నారు నవ్వుతూ గురువుగారు...
దేవుని బట్టి మహిమ కాదు...
మహిమను బట్టి దేవుడు...
అన్నారు గురువుగారు...
శూన్యాకాశంలో ఏ ఆధారమూ లేకుండా...
భూమి తిరగడం అద్భుతమే కదా! అన్నాను...
అంతవఱకు పోనవసరం లేదు...
తనవైపు తాను చూసుకుంటే చాలు...
తానే ఓ అద్భుతం...అన్నారు.

పొగను బట్టి నిప్పును అనుమానించినట్లు...
సృష్టిక్రమాన్ని బట్టి సృష్టికర్తను అనుమానిస్తున్నాం...
తప్పితే "భగవదానుభవం" అంటూ ప్రత్యేకంగా ఏమీలేదు...
అన్నారు గురువుగారు...
ఈ దినం ఆరుద్ర...అని చెప్పాను గురువుతో...
బ్రహ్మవిష్ణువుల మధ్య తేజోలింగమై ఆవిర్భవించినరోజు...
ఆ తేజోలింగం అరుణాచలంగా వెలసినరోజు...
చిదంబరంలో నటరాజస్వామికి అభిషేకం జరిగే రోజు...
తిరువాయూరులో త్యాగరాజేశ్వరుని పాద దర్శనం అయ్యే రోజు...
శ్రీకాళహస్తీశ్వరుడికి వేడినీళ్ల స్నానం జరిగే రోజు...
ఈ రోజు మాత్రమే లింగాన్ని తాకి స్నానం చేయిస్తారు...
మిగతా రోజులలో వాయులింగాన్ని తాకరు...
భూమినాథేశ్వరుడు ఊరెరిగింపు పూర్తయ్యి...
దేవాలయంలోకి ప్రవేశిస్తుండగా....
జ్ఞానశిశువు మురుగడు రమణుడుగా అవతరించాడు...
అప్పుడే ఆరుద్రానక్షత్రం శెలవు తీసుకుంది...
పునర్వసునక్షత్రం తొంగి చూసింది...
రమణుణ్ణే కాదు, రాముణ్ణి కూడా...
గతంలో తన ఖాతాలో వేసుకుంది పునర్వసు...
అందుకే ఈరోజు గురువులో శివుణ్ణి చూడ్డానికి వెళ్లా...
రేపు గురువులో రమణుణ్ణి చూడ్డానికి వెళతా...

* * *

21-12-2021 * పునర్వసు...
శ్రీరమణజయంతి...
రమణతత్త్వానికి కొనసాగింపు "నా గురువు..."
అందుకే గురుసన్నిధికి వెళ్లాను ఉదయాన్నే...
మీరు టచ్ చేసిన సబ్జక్టు...
రమణుడు కూడా టచ్ చేయలేదు...

అని ఓసారి నేనంటే...
రమణుడే ఈ రూపంలో టచ్ చేస్తున్నారు...
అని ఠక్కున అన్నారు నా గురువు...
బాబూ...!
సుబ్రహ్మణ్యంలో గురువును చూడొద్దు...
గురువులో సుబ్రహ్మణ్యాన్ని చూడు...
అని బోధించిన పరమగు దైవం నా గురువు...
ఆర్ద్రోత్సవం  సందర్భంగా...
భక్తులను అనుగ్రహించడానికి...
తిరుచ్చిళిలో భూమినాథేశ్వరుడు...
ఊరెరిగింపుగా విచ్చేసి...
తిరిగి ఆలయప్రవేశం చేస్తుండగా...
ఒక్క క్షణం ఆ ఉత్సవమూర్తి ఆగాడు...
ఆ క్షణమే...మాడావీధిలో...
"అందం" అయిన అమ్మకు...
"సుందరం" అయిన నాన్నకు...
రమణీయమైన శిశువు పుట్టాడు...
పురుడుపోసిన గ్రుడ్డి అవ్వకు...
తేజోమూర్తిగా దర్శనమిచ్చాడు...
తన పూర్వీకులు పొందిన ఓ సన్న్యాసిశాపాన్ని...
లోకానికి వరంగా మార్చి ఇవ్వడానికి...
జ్ఞానశిశువుగా అవతరించాడు...
నామరూపరహితుడైన ఆ పరబ్రహ్మం...
"తిరుచ్చిళి వేంకటేశ్వరశర్మ"గా....
నామరూపాలను పులుముకున్నాడు...
మరణించిన తన తండ్రి శరీరం...శ్మశానంలో...
కట్టెల్లో ఓ కట్టెగా కాలిపోవడం చూశాడు...
అప్పుడే వైరాగ్యబీజం హృదయంలో పడింది...
క్రైస్తవపాఠశాలలో చదువుకున్నాడు...

పెరియపురాణం మనసుకు పట్టించుకున్నాడు...
మేడపై గదిలోన...
చావును నాటకీయంగా అనుభూతి చెందాడు...
మరణభయం కాస్త ఆత్మవిచారంగా మారుకుంది...
వేంకటేశ్వరశర్మ అంతటితో అంతమైనాడు...
సాంబ్రాణిపుల్ల వెలిగించినప్పుడే...
దాని అంతం ప్రారంభమైనట్లు...
పుట్టినప్పుడే చావు ప్రారంభమయ్యింది...
already తాను మరణించే ఉన్నాడని కనుగొనగానే...
భవమరణరహితుడైన అరుణాచలుడు జ్ఞప్తికొచ్చాడు...
అరుణాచలం వైపుకు పరుగులుతీశాడు...
అప్పా...! నీ ఆజ్ఞమేరకు వచ్చాను అంటూ...
ఆనందభాష్పాలతో లింగాన్ని అభిషేకించాడు...
అయ్యంకుళములో కులమతాలను దులుపుకున్నాడు...
"బోడి"(ఖాళీ)గా నిలబడ్డాడు...
కౌపీనం పెట్టాడు...
మౌనం పట్టాడు...
అరుణాచలమే సింహాసనంగా...
ఆధ్యాత్మికసామ్రాజ్యాన్ని ఏలాడు 54 ఏళ్లు...
మహాపండితుడు కావ్యకంఠుడు సైతం...
రమణపాదాలకు దాసుడైనాడు...
కన్నతల్లి, స్నేహితులు... వెతుక్కుంటూ వచ్చారు...
కానీ తల్లికి కుమారుడు దొరకలేదు...
స్నేహితులకు స్నేహితుడు దొరకలేదు...
సకలానికి కర్త ఈశ్వర సంకల్పం...
మౌనంగా ఉండడం ఉత్తమం...
అంటూ తల్లికి తొలిబోధ చేశాడు...
ఆ బోధ ఆధ్యాత్మికంలో చివరిబోధ అయ్యింది...
కపిలుడు తనతల్లి దేవహూతికి ముక్తినిచ్చాడు...

శంకరుడు తనతల్లి ఆర్యాంబకు ముక్తినిచ్చాడు...
రమణుడు తనతల్లి అళగమ్మకు ముక్తినిచ్చాడు...
తల్లులు వీళ్లకు "జన్మ"నిస్తే...
తల్లులకు వీళ్లు "జన్మరాహిత్యం" ఇచ్చారు...
గణపతిమునికి...
"నేను" మూలాన్ని...
"నాద" మూలాన్ని...
శోధించమని బోధించి...
"భగవాన్ శ్రీ రమణమహర్షి"....
అని శిష్యుని చేత నామకరణం చేసుకున్నాడు...
వాసనతో శునకం యజమానిని కనిపెట్టినట్లు...
నిర్వాసనతో విశ్వయజమాని అయిన శివుణ్ణి కనిపెట్టాలి...
అని లోకానికి బోధించాడు...
సమాధానపరచువారు ధన్యులు...
వారు దేవుని కుమారులనబడుదురు...
అని క్రీస్తువాక్యము...
సనత్కుమారుడు శివకుమారుడై...
కుమారస్వామిగా...అధికారిక గురువుగా...
ఈ లోకానికి సమాధానం(బోధ) ఇవ్వడానికి...
కుమారిలభట్టుగా...
జ్ఞానసంబంధరుగా...
రమణమహర్షిగా...
సద్గురు "సుబ్రహ్మణ్యుడు"గా...
అవతరించాడు ఆ శివకుమారుడు...
పురిటి గదిలో  జ్యోతిగా కనబడి...
నిర్యాణ గదిలో జ్యోతిగా వెలువడి...
మహాజ్యోతియైన అరుణాచలంలో కలిసిపోయాడు రమణుడు...
ప్రపంచ కేంద్రం అరుణాచలం.
జ్ఞాన కేంద్రం అనిలాచలం.

అరుణాచలంలో రమణుడు సుబ్రహ్మణ్యుడుగా ఉన్నాడు...
అనిలాచలంలో రమణుడు సుబ్రహ్మణ్యుడుగా ఉన్నాడు...
64వ నయనారు అరుణాచల రమణుడు...
65వ నయనారు నా గురువు సుబ్రహ్మణ్యుడు...

* * *

126. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

'నా గురువు' గ్రంథ మహిమ

---

నా బాల్యంలో మా ఇంటికి...
విజయవాణి పబ్లిషర్స్ వారి "మా బడి"
అనే మాసపత్రిక వచ్చేది...
దానిని నాయునికృష్ణమూర్తి అనే అతను నడిపేవాడు...
వారు రచించిన 'రామాయణం'
నేను చదివిన మొదటి గ్రంథం...

ఆంధ్రప్రభ అనే వారపత్రిక కూడా మాకు వచ్చేది....
పొత్తూరి వేంకటేశ్వరరావు దానికి ఎడిటర్...
ఆ పత్రికలో...
రాగతి పండరిగారి కార్టూన్స్ ఎంజాయ్ చేసేవాణ్ణి...
చాగంటి శంకర్ గారి పదకేళి గడులను నింపేవాడిని...
మాలతీ చందూర్ గారి 'అడగండి చెబుతా' శీర్షికకు ప్రశ్నలు పంపేవాడిని...
లల్లాదేవిగారి సీరియల్స్ ఆసక్తిగా చదివేవాణ్ణి...
అలా చిన్ననాడే సాహిత్యాభిలాష కలిగింది...

మా రామమందిరంలో కొద్దిరోజులు
భగవద్గీత శిక్షణాతరగతులు జరిగాయి...
శిష్ట్లా సుబ్బారావుగారి భగవద్గీతను రూపాయికి అమ్మారు...
అది మా ఇంట్లో చాలాకాలం నలిగింది...

ఆ శిష్ట్లాసుబ్బారావు రమణభక్తుడని తరువాత తెలిసింది...
సుబ్బారావుకు కంటిచూపు తగ్గుతూ....
చివరకు పూర్తిగా అంధుడైపోయాడు...
రమణభగవానుకు తన సమస్యను చెప్పుకున్నారు...
బాహ్యాదృష్టి మరుగైతే...
అంతర్ దృష్టి మెరుగవుతుంది...
అన్నారు భగవాన్ నిమ్మళంగా...

ఆ తరువాత పరమత గ్రంథాలను చదివాను...
వీడెక్కడ మతం మార్చుకుంటాడో...
అని ఇంట్లోవాళ్లు బయపడిన రోజులవి...
"దాస్" అనే మతప్రచారకునితో...
నాకు బాగా స్నేహం ఉండేది...
మతం మార్చుకోవలసిన అవసరం...
నాకేమీ కనబడలేదు...

కులం అనేది వృత్తి సౌలభ్యం...
మతం అనేది ప్రవృత్తి సౌలభ్యం...

జనాభివృద్ధి మతాభివృద్ధికి ప్రమాణం కాదు...
ఓరోజు ఉదయం దాస్ ఇంటికెళ్లాను...
అప్పుడు దాస్ గారు కోడిని కోస్తున్నాడు...
నేను ఆశ్చర్యంగా అడిగాను...
శాంతికాముకులు...
క్షమాగుణాన్ని బోధించే మీరేనా...
ఈ పని చేస్తున్నది? అని...
అతను చెప్పిన సమాధానం మరీ విచిత్రం...
బాబూ! ఇది తప్పేమీ కాదు...
మానవునికి ఆహారంగా...
దేవుడు  కోళ్లను సృష్టించాడు...
కోళ్లకు ఆత్మ ఉండదు...అన్నాడు...

నా గురువు వద్ద ఈ విషయం ప్రస్తావిస్తే...
నిజమే...పులి యెదుటపడ్డప్పుడు కూడా...
దానికి ఆహారంగా దేవుడు తనను సృష్టించాడు...
అని ఉండగలిగితే...తప్పేమీ లేదు అన్నారు...

తరువాత నేను చదివిన గ్రంథం...
పూడి వేంకట్రామయ్యగారు రచించిన దేవీభాగవతం...
వారి నివాసం శ్రీకాళహస్తి...
తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్...

అలా చిన్న వయసులోనే మహత్ గ్రంథాల పారాయణం వలన....
సద్గురు భక్తుల్లో యెంతోమంది విద్యావంతులు ఉన్నప్పటికీ...
"నా గురువు" వ్యాసాలను వ్రాయగలిగే శక్తీ, భక్తీ...
నాకు కలగడం గుర్వనుగ్రహఫలం...

రాజేంద్ర అనే క్షురకుడు...గురుభక్తుడు...
గురుసన్నిధిలో కూర్చొని...
"నా గురువు" గ్రంథం వైపు...
తదేకదృష్టితో చూస్తున్నాడు...
గురువు గారు అన్నారు అతనితో...
ఆ ఐదు బుక్స్ ఇక్కడే ఉంటాయి...
నీవు ఇక్కడకు వచ్చినప్పుడల్లా...
ఓ నాలుగు పేజీలు చదివి వెళ్లు...
అన్నారు...
నాకు చదువు రాదండి...
ఊరికే అలా చూస్తూ ఉన్నాను అంతే...
అన్నాడు రాజేంద్ర...

చదువు రాకపోయినా సరే...
అలా బుక్ చేతిలోకి తీసుకుని...
అలా కాసేపు చూసి అక్కడ పెట్టేయ్...
చదివిన వారికి ఏ ఫలం వస్తుందో...

చదువు రాని వారికి కూడా అదే ఫలం వస్తుంది...
అన్నారు గురువుగారు...

"నా గురువు" గ్రంథ మహిమను...
గురువు ఆ విధంగా ప్రకటించారు...

* * *

127. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

ఆమోదముద్ర

---

10-4-2022 * శ్రీరామనవమి
ఈరోజు ఉదయాన్నే గురువు వద్దకు వెళదామనిపించింది...

"ప్రకృతిచ్చే సాక్ష్యం కొరకు ఎదురుచూశాను..."

జనవరి ఒకటిన జరిగిన ఓ చిన్న ప్రుట్టం కారణంగా
గురువు వద్దకు వెళ్లడం మానుకున్నాడు బాబు.

దేనినీ పట్టించుకోకండి...అని వ్యాసాల్లో వ్రాసే బాబు, అన్నిటినీ
పట్టించుకుంటాడు...

ఇంతలో దేవీప్రసాద్ మెసేజ్ పెట్టాడు-
టీ త్రాగుదాం...కేరళా అంగడికి వచ్చేయ్...అని.

వెళ్లాను...

టీ త్రాగడం పూర్తయ్యాక దేవీప్రసాద్ అడిగాడు-
"గురువు వద్దకు వెళదామా...?" అని.

"ప్రకృతి ఏకీభవించింది..."

ఇద్దరమూ గురువు వద్దకు వెళ్లాము...

గురుసేవకురాలు సునీతగారు టీ ఇచ్చారు...

* * *

గురువుగారి పూజామందిరంలో పటాలు ఉంచే టేబుల్ ను నాకు ఊహ తెలిసినప్పట్నుంచి చూస్తున్నాను...

దాని గురించి అడిగాను గురువుగారిని...

"ఆ టేబుల్ ను మా నాన్నగారు స్వయంగా తయారుచేశారు... దాని మీద ఉంచిన పటాల కంటే, నాకు ఆ టేబులే ముఖ్యం..."అన్నారు.

నిజమేగా...

దేవుడి పటానికి దండం పెడతారు...
ఆ పటాన్ని మోసే చీలను ఎవరూ గుర్తించరు.

చూడబడే దృశ్యం - పటం.
చూచేవాడు - చీల.

సకలసృష్టి  ఓ పటం  అయితే
ఏ చీలను ఆధారం చేసుకుని ఈ "సృష్టిపటం" వ్రేలాడుతోందో...!

ఆ చీల "నేను".

* * *

ఇంతలో గది ఊడ్వడానికి పనిమనిషి లక్ష్మి వచ్చింది...

లేచాం....
చాపలు మడిచి, మూల ఉంచాం...

టేబుల్ మీదున్న "నా గురువు" బుక్స్ ను తాకి చూశాను...

గురువుగారన్నారు-

బాబూ! నిన్ననే "నా గురువు" లో 1 నుండి 25 భాగాలు చదివాను...ఆ ఘట్టాలు కళ్లకు కట్టినట్లు వ్రాశావు...అన్నారు.

ఓ జ్ఞాని ఆమోదముద్ర కంటే ఇంకేం కావాలి?
'జ్ఞానపీఠ అవార్డు' కంటే 'జ్ఞాని ఆమోదం' గొప్పది.

* * *

దైవజ్ఞులు శివస్వామిగారు నిన్న ఫోన్ చేశారు...
మా పిల్లలిద్దరూ రేపు సద్గురుసన్నిధికి వస్తున్నారు అని...
ముందుగా తమరి దర్శనానికి వస్తారు అని...
గ్రంథప్రసాదాన్ని మా పిల్లల ద్వారా ఇచ్చిపంపండి అని...
ఆ గ్రంథం ద్వారా మీ ఆశీస్సులు నాకు చేరుతాయి అని...
ప్రార్థించారు...
నాకు సంతోషమైంది...
వారు అలా కోరినప్పుడే నా మనసులో ఓ గ్రంథం మెదిలింది...
అదే - ఏకనాథ భాగవతం...
* * *
ఈ మధ్య నుంచి...
అంటే "నా గురువు" లో 107 వ వ్యాసం...
'గ్రంథపరిత్యాగం' వ్రాసినప్పటి నుంచి...
మా అత్యాశ్రమం దర్శించినవారికి....
తలా ఓ గ్రంథం కానుకగా ఇచ్చేస్తున్నాను...
* * *
ఈ సాయంత్రం 8.45 కు శివస్వామి కుమారులు 1. ఈశ్వర్ 2. మహేశ్వర్ ఇద్దరూ కైకాలవీధి అత్యాశ్రమం చేరుకున్నారు...
ప్రసాదాలు ఇచ్చి పుచ్చుకున్నాం....
ఏకనాథభాగవతం పెద్ద కుమారుని చేతిలో పెట్టి
వారి తండ్రిగారికి చేర్చమన్నాను...
పాలకోవా పేకెట్ చిన్న కుమారుని చేతిలో పెట్టి
వారి తల్లిగారికి చేర్చమన్నాను...
శెలవు తీసుకొని సద్గురుదర్శనానికై బయలుదేరి వెళ్లారు....
* * *
## 128. నీవే Subject

---

26-4-2022 * మంగళవారం

ఈ ఉదయం బెంగళూరు నుండి యజ్ఞేశ్వరశర్మ దంపతులు వచ్చారు మా అత్యాశ్రమానికి...

మా ఆశ్రమం చాలా బాగుందన్నారు..
ఫోటోలు కూడా తీసుకున్నారు...
స్వాత్మసుఖి, శంకరవిజయం రెండు పుస్తకాలు తీసుకున్నారు...
పుస్తకాలు ఇచ్చినందుకు కృతజ్ఞతలు తెలిపారు...

"అవి మీ కోసమే ఎదురుచూస్తున్నాయి..." అన్నాను.

నిజమే గ్రంథమే పాఠకుణ్ణి ఎన్నుకుంటుంది.
గ్రంథమే పాఠకుడికి కృతజ్ఞతలు చెబుతుంది.
పాఠకుని వల్లనే గ్రంథం యొక్క జన్మ ధన్యమౌతుంది.

* * *

మా గురువుగారు ఒకమాట అనేవారు-

"వీడు నాకు వద్దు" అని భూమి అనుకుంటే
వాడికి ఆ భూమిని అమ్మేయాలనే బుద్ధి కలుగుతుందట...

"వీడు నాకు కావాలి" అని భూమి అనుకుంటే
వాడికి ఆ భూమిని కొనాలనే బుద్ధి కలుగుతుందట.

ప్రతి వస్తువుకూ జ్ఞానం ఉంటుంది.
దాని మనం గుర్తించక జడం అంటాం.

* * *

శెలవు తీసుకొని గురుసన్నిధికి చేరుకున్నారు...
వారి దివ్యసన్నిధిలో కొంతసేపు సంభాషణ సలిపారు...

* * *

సద్గురు:
గాఢనిద్రలో "నేనుండడం" ఉంటుందేగాని

వ్యక్తిగా ఉండడం అనేది ఉండదు.

ఆ గాఢనిద్రలో కలిగే చిన్నపాటి కదలికనే
మెలకువ అంటున్నాం.

నిజానికి ఇది మెలకువ కాదు.
ఇదొక (పెద్ద)కల.

గాఢనిద్రనే మెలకువ అనాలి.

యజ్ఞేశ్వరశర్మ:
కానీ గాఢనిద్ర అనేది తమస్సు కదా?

సద్గురు:
నిద్ర గురించి నిద్రలోనే మాట్లాడుకోవాలి.
మెలకువలో మాట్లాడితే ఎలా?

బెంగుళూరు గురించి బెంగుళూరులోనే మాట్లాడుకోవాలి.
కాళహస్తిలో మాట్లాడితే ఎలా?
కాళహస్తిలో ఉండి బెంగళూరు గురించి మాట్లాడినా
అది కాళహస్తి గురించి మాట్లాడ్డమే అవుతుంది.

* * *

సద్గురు:
గాఢనిద్రలో ఉన్న ఆ నేను
మూడుగా డివైడ్ అవుతుంది.
ఆ డివైడ్ అవటాన్నే మనం 'మెలకువ' అంటున్నాం.

ఆ మూడే-
1.వ్యక్తి
2.ప్రపంచము
3.పై రెంటికీ కారణమైన శక్తి(దైవము)

వ్యక్తి ప్రపంచంతో, దైవంతో ఎంజాయ్ చేస్తాడు.
మళ్లీ గాఢనిద్రలో మూడూ ఏకం అవుతాయి.

మూడూ ఒకటిగా ఉంటే - నిద్ర.
ఒకటి మూడుగా అయితే - మెలకువ.

శ్రీమతి శర్మ:
మళ్లీ నిద్రలో కల వస్తోంది కదా!

సద్గురు:
ఈ మెలకువ అనేది కూడా కలే.

మెలకువ అనేది పెద్ద కల.
కల అనేది చిన్న కల.
ఈ కలకు ఆ కల శాంపిల్.

అలాగే...
గాఢనిద్ర-సమాధి రెండూ ఒకటే.
సమాధిస్థితికి శాంపిల్ గాఢనిద్ర.
* * *
యజ్ఞేశ్వరశర్మ:
"గాఢనిద్ర ఒక్కటే నిజమైన మెలకువ"

సద్గురు:
అవును...
అది ఎవరి మెలకువా కాదు...
దేని మెలకువా కాదు.
అది "స్వయం".
* * *
సద్గురు:
1. నేను శర్మ అనేది శర్మ కాదు "నేను".
2. శర్మను నేను అనేది శర్మయే.

మొదటి స్టేట్ మెంటు "నేను"ది.
రెండవ స్టేట్ మెంటు "శర్మ"ది.

మొదటి నేను అహంస్వరూపం.
రెండవ నేను అహంకారం.

నేనుగా "ఉంటుంది" అహంస్వరూపం.
నేను అని "అంటుంది" అహంకారం.

* * *

యజ్ఞేశ్వరశర్మ:
ఉండేది త్రాడొక్కటే.
పాము లేనేలేదు...

ఉండేది దైవమొక్కటే
అన్నీ దాంట్లోనుంచే వచ్చాయి...

సద్గురు: 'దాంట్లో నుంచి రావడం' కాదు...
స్వయంగా అదే.
"అదే" సకలంగా ఉంది.

యజ్ఞేశ్వరశర్మ మేలుకొని ఉంటే ఉంటాడు.
మెలకువలో లేకపోతే ఉండడు.

కానీ "నేను" అనేది-
యజ్ఞేశ్వరశర్మ మేలుకున్నా ఉంటుంది.
మేలుకోకపోయినా ఉంటుంది.

యజ్ఞేశ్వరశర్మ:
ప్రశ్నలన్నీ అహంకారానికే...
అహంస్వరూపానికి కాదు.

సద్గురు:
దానికి ఆ అవసరం లేదు...

యజ్ఞేశ్వరశర్మ:
కనబడేది - ఉపాధి.
కనబడినది - తత్త్వం.

సద్గురు:
కనబడేది, కనబడనిది రెండూ
"నేను"లోనే ఉండేది.

యజ్ఞేశ్వరశర్మ:
త్రాడే ఉంది...పాము లేనేలేదు...

సద్గురు:
ఉండేది ఒకదానికే ఉనికి.
ఆ ఉనికి త్రాడుగానైనా ఉంటుంది.
పాముగానైనా ఉంటుంది.

తెలియకుంటే పాము అంటాం.
తెలిస్తే త్రాడు అంటాం.

తెలియకుంటే ప్రపంచం అంటాం.
తెలిస్తే ఆత్మ అంటాం.

* * *

నేను తండ్రి
నేను తల్లి
నేను కుమారుడను
నేను కుమార్తెను

అని వారి చేత వ్రాయించి...
ఆ నాలుగు నేనులు వటికే ఎడంగా తీసి చూస్తే
ఏ నేను తండ్రిది? ఏ నేను తల్లిది? అని చెప్పలేం.

నేను పురుషుడను.
నేను స్త్రీని

అని వారి చేత వ్రాయించి...
ఆ రెండు నేనులు వటికే ఎడంగా తీసి చూస్తే
ఏ నేను పురుషునిది? ఏ నేను స్త్రీది?
అని చెప్పలేం.

* * *

శరీరంలో ఏ భాగాన్ని చూపించినా
దానికో స్థానం, దానికో పేరు, దానికో క్రియ ఉంది.

కానీ ఈ నేను-నేను అనేదానికి ప్రత్యేక స్థానం లేదు...

ప్రపంచంలోని ఈ స్థానాలకు, ఈ నామాలకు, ఈ రూపాలకు సంబంధం లేకుండా ఉంది "అది".

* * *

యజ్ఞేశ్వరశర్మ:
యద్దృశ్యం తన్నశ్యం...
కనబడే దృశ్యమంతా నశించేదే...

సద్గురు:
అసలు లేనేలేదు... అని అర్థం.
నాశనం అవుతుంది అనికాదు.

* * *

ఆత్మానుభవం అనేది-
అనుభవించేవాడు ఉండి,
అనుభవించే అనుభవం కాదు అది.

స్వయంగా అనుభవం అది.
అనుభవించేవాడు-అనుభవింపబడేది-అనుభవం
అనే త్రిపుటి లేని "అనుభవం" అది.

* * *

యజ్ఞేశ్వరశర్మ:
విత్తుముందా? చెట్టుముందా?

సద్గురు:
నీవు ముందుగా దేన్ని చూస్తావో అదే ముందు.

ఈ రెంటినీ చూసే నీవే నిజం.
మిగతా అంతా అబద్ధం.
అనగా తత్కాలిక సత్యం.

* * *

సద్గురు: ఎంత గొప్ప conclusion కు వచ్చినా...
చివర్లో "ఇది కాదు" అనుకుని లేచి వెళ్లిపోండి...

యజ్ఞేశ్వరశర్మ: విచారణ చేసి ఓ conclusion కు వచ్చాము కదా! అదే పరమసత్యం కదా! మళ్లీ "ఇది కాదు" అని యెందుకనుకోవడం?

సద్గురు:
conclusion కు వచ్చినవాడే సత్యం కాబట్టి.

చెత్తను ఊడ్చేస్తే, శుభ్రత అక్కడే ఉన్నట్టు.
subject ను ఇదికాదు అని తుడిపేస్తే...
నీవే subject గా ఉంటావు.

నీకు subject కాదు.
నీవే subject.

* * *

యజ్ఞేశ్వరశర్మ:
"నేను" పైనే దృష్టిని కేంద్రీకరించాలి...

సద్గురు:
నీవే "అది".
మళ్లీ దృష్టిని కేంద్రీకరించడం ఎందుకు?
నిజానికి అన్నిటిపైనా దృష్టి పెట్టి ఉంది "నేను".

* * *

యజ్ఞేశ్వరశర్మ:
ఊరకే ఉండాలన్నమాట...

సద్గురు:
అది కూడా అనకూడదు...

* * *

(యజ్ఞేశ్వరశర్మ దంపతులు గురువు వద్ద శెలవు తీసుకొని బెంగుళూరుకు తిరుగుప్రయాణమయ్యారు)

* * *

129. లోపలి మాట

---

5-6-2022 * భానువారం

ఈ ఉదయం 6.05 కు నేనూ దేవీప్రసాద్ కేరళా అంగట్లో టీ త్రాగి గురువు వద్దకు వెళ్లాం....

ఎవరో ఖమ్మం నుండి ఇద్దరు యువకులు
గురుసన్నిధిలో కూర్చొని ఉన్నారు...

గురువు దగ్గర బొట్టు తీర్థం తీసుకొని చాప మీద కూర్చున్నాం...

గది-మది ప్రశాంతంగా ఉంది...

వైజాగ్ నుండి మా సోదరి రాధిక కు వాట్సప్ లో గురుదర్శనం చేయించాను...

రాధిక చాలా ఆనందపడ్డారు...
తన తల్లిగారితో కలిసి నమస్కారాలు చేసుకున్నారు...

"మీ దర్శనం చాలా ఆనందంగా ఉంది గురువుగారూ..." అంది రాధిక.

"అందుకు బాబుగారే కారణం..." అన్నారు గురువుగారు నవ్వుతూ...

* * *

మన జ్ఞానప్రసూనాలను పద్యరూపంలో వ్రాస్తున్నారు ఇంద్రకంటి సంతోష్ కుమార్...అన్నాన్నేను...

"ఆఁ ... కొన్ని చదివాను...చాలా బాగున్నాయి..."
అన్నారు గురువుగారు.

మళ్లీ నిశ్శబ్దం ఆవహించింది...

బల్లి నిలిచి నిలిచి కీచుకీచుమని అరుస్తోంది.
ఏ పటాల వెనుక దాగి ఉందో ఏమో...
నేనైతే ఇప్పటివఱకు దానిని చూడలేదు...
చాలాకాలంగా ఆ శబ్ధాలు వింటున్నాను...:
సద్గురు సన్నిధిన ఉండే ఆ దివ్యమైన దృశ్యానికి
అదొక సహజమైన నేపథ్యసంగీతంలా ఉంటుంది.

గురువుగారు సిగరెట్ ముట్టించారు...

తమాషా ఏమంటే-

వారు సిగరెట్ కాలుస్తున్నా సరే
వారుకాలుస్తున్నట్టు ఉండదు...
ఎవరో కాలుస్తుంటే వీరు చూస్తున్నట్టు ఉంటుంది.

వారు మనతో మాట్లాడుతున్నా సరే
మనతో మాట్లాడుతున్నట్టు ఉండదు...
తనలో తాను మాట్లాడుతున్నట్టు ఉంటుంది.
వారికి మాటలన్నీ తన 'లోపలి మాటలే'.

దేవీప్రసాద్ వ్రాస్తున్న 'లోపలిమాట' పుస్తకం గుర్తుకొచ్చి, పుస్తకం ప్రచురిస్తున్న విషయం ప్రస్తావించాను...

'లోపలిమాట' 'వెలుపలి మాట' గా రూపుదాల్చబోతోంది...అన్నాను చమత్కారంగా.

గురువుగారన్నారు-

ఒకే మాట మీద నిలబడు అంటే
అన్నమాట మీద నిలబడు అని కాదు...

ఏదైనా అను...అంతా అదే అను...

లోపలి మాటలు అన్నావా...
బయటి మాటలు కూడా లోపల మాటలే

అని ఉండు.

బయటి మాటలు అన్నావా...
లోపలిమాటలు కూడా బయటి మాటలే
అని ఉండు.

ఏదైనాసరే ఒక లెక్కలోనే ఉండు...అన్నారు.

* * *

చూచేవాడు-చూడబడేది-చూపు
మూడూ తానే అయివున్న కన్ను గలవాడే త్రినేత్రుడు.

* * *

ఒక కుటుంబంలో ఉన్న అన్ని నేనులను తీసుకొచ్చి
ఒకడికి చూపించి, ఇందులో 'తండ్రి నేను' ఏది?  'తల్లి నేను' ఏది? అంటే చెప్పగలడా?

అందరూ 'నేనే'...
నేనే' అందరూ...

నీవే తల్లివి తండ్రివి
నీవే నా తోడు నీడ సఖుడౌ
నీవే గురుడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!

అనే కృష్ణప్రార్థనలో-
'నీవు' తీసివేసి 'నేను' అని పెట్టుకో...
అప్పుడు నీవే కృష్ణుడవు...అన్నారు.

నేను అని చెప్పినప్పటికీ నేను కాదు...
అని తెలుసుకునే నేనే నేను.

* * *

తల్లిదండ్రులు నన్ను కనలేదు.
నేను తల్లిదండ్రులను కన్నాను.

నేను కంటేనే(చూస్తేనే) దేనికైనా, ఎవరికైనా ఉనికి.

ప్రపంచంలో నేను పుట్టలేదు.
నాలో ప్రపంచం పుట్టింది.
సకలమూ నాలో పుట్టి ఉండి
నాలోనే కలగలిసిపోతుంది.

* * *

భగవాన్ ఎందుకంత స్థిమితంగా ఉన్నారంటే-
"కనురెప్ప తెరచి, కనురెప్ప మూసే వరకు మధ్యలో
కనేబడేదంతా ఉత్తదే, లేనిదే..." అన్న స్థిరజ్ఞానంలో ఉండడం వల్లనే.

మరి ఆ విషయం మనకు చెప్పేయొచ్చు కదా!
అంటావేమో...

"ఆ విషయాన్నైనా ఎప్పుడు చెప్పాల? మధ్యలోనే కదా...!
మధ్యలో అసలు "ఏమీలేదు" అంటుంటే,
మళ్లీ ఎవరికి చెప్పాలి? అన్నారు నవ్వుతూ...

"నిజమే... స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా జరుగుతున్న సమయంలో
కూడా ఏమీ "జరగనట్టే" ఉండిపోయారు వారు" అన్నాను...

"నిజానికి ఏమీ జరగలేదు కదా!" అన్నారు వెంటనే గురువుగారు.

శిష్యుడు జారడం...
గురువు స్థితిలో నిలబెట్టడం...
ఎంత గొప్ప క్రీడో కదా...!

* * *

ఇక్కడ ఎంతమంది ఉన్నారు?
వ్రేలితో లెక్కించు...అన్నారు.

వ్రేలిని మొదటగా నా వైపు చూపించి...
ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు...అంటూ ఎంచి...
ఐదు మంది ఉన్నారు...అన్నాను.

బాబు కూడా లెక్కలో భాగమే కాబట్టి నీవు బాబువు కావు...

"నీవు" లెక్కించేవాడివేగాని, లెక్కలోనివాడివి కావు... అన్నారు.

ఛట్టున తన నుంచి తాను విడిపడే గొప్ప బోధ అది నిజంగా...

* * *

కలను కనేవాడు కలలో ఉండడు.
శరీరాన్ని కనేవాడు శరీరంలో ఉండడు.
సృష్టిని కనేవాడు సృష్టిలో ఉండడు.

* * *

శక్తి-శక్తుడు అర్ధనారీశ్వరుడు
శక్తి ప్రకటనం కాకపోయినా శక్తుడు ఉంటాడు.

బాబును తెలుసుకునేవాడు దేవుడు.
బాబు తెలుసుకునేవాడు కాదు.

నేనుగా ఉండేది - శివుడు.
నేనని అనేది - పార్వతి.

నేను అని నేను అనకపోయినా 'ఉన్నది' ఉంటుంది.

అదే 'నేను'.

అని తెలుసుకునేవరకు-
ఉన్నది కూడా లేనిదే.

ఉన్నదే ఇన్ని రకాలుగా ఉన్నది-
1. ఉన్నదిగా
2. లేకున్నదిగా
3. ఉండీలేనట్లుగా
4. లేక ఉన్నట్లుగా

* * *

స్వచ్ఛమైన వేదాంతం ఏమంటే-

ఆధ్యాత్మికం అనేది లాభనష్టములు లేని వ్యాపారం...

అనేదొక్కటే స్వచ్ఛమైన వేదాంతం.
అని నొక్కివక్కాణించారు.

* * *

గురుసేవకురాలు ఉమాగారు టీ తెచ్చిచ్చారు...
సిప్ చేయడం మొదలెట్టాను...
గురువు చెబుతూనే ఉన్నారు...

శిష్యుడు దర్జాగా టీ త్రాగుతుంటే...
గురువు శ్రద్ధగా బోధిస్తుంటే...
చూడ్డానికి క్రొత్తవారికి చిత్రంగా ఉంటుంది...

అందుకే దీనిని "అత్యాశ్రమం" అన్నారు.
ఆ గురువును "అత్యాశ్రమి" అన్నారు.

మాటల్లో...చేతల్లో... సంప్రదాయఛాయలు ఏమీ కనబడవు...

కానీ సంప్రదాయానికి అత్యాశ్రమం చేసిన సేవ, మేలు అంతా ఇంతా కాదు అనేది నా అనుభవం.
అత్యాశ్రమి ఉనికే లోకానికి శ్రేయస్సు...
పైకి సంప్రదాయవిరోధిగా కనబడ్డా సరే.

* * *

చీకట్లో సూర్యుడున్నాడు...
వెలుగుండేది చీకట్లోనే.
మన ఇంట్లో వెలిగే దీపం చిన్నదీపం.
ఆకాశంలో వెలిగే దీపం పెద్దదీపం.

పగలు అనుకునేది కూడా నిజానికి రాత్రే.
అన్న గ్రహింపే శివరాత్రి.
ఆ జ్ఞానమే నిత్య జాగరణ.

చీకట్లో ప్రకాశం ఉంది
శూన్యంలో ప్రపంచం ఉంది.

చీకట్లో ప్రకాశం ఉంది...అని గ్రహించినవాడే
సదా జాగరణలో ఉన్నవాడు.

శూన్యంలో ప్రపంచం ఉంది...అని గ్రహించినవాడే
సదా 'నిద్ర'లో ఉన్నవాడు.

వెలుగు చీకటులు చీకటులు చీకటి అయితే
వెలుగు తానౌర అనిలాచలా (89)

వెలుగు-చీకటి లో ఉన్న వెలుగు వెలుగు కాదు.
ఇది వెలుగు, ఇది చీకటి అని గుర్తించే జ్ఞానమే వెలుగు.

ఉనికి-లేమి లో ఉన్న ఉనికి ఉనికి కాదు.
ఉన్నది, లేనిది అని గుర్తించే జ్ఞానమే ఉనికి(సత్).

ఉత్త ప్రకాశం ప్రకాశం కాదు,
శక్తిపూర్ణమైన ప్రకాశమే ప్రకాశం.

ఉత్త జ్ఞానం జ్ఞానం కాదు,
శక్తిపూర్ణమైన జ్ఞానమే జ్ఞానం.
* * *

గురువుకు మూడు లక్షణాలు-

1. తనకన్నా అధికుడు ఉండడు.
2. తనకు సమానుడు కూడా ఉండడు.
3. తనకు అన్యము ఉండదు.

* * *

జ్ఞానమంటే తెలుసుకునేది.

దేనిని తెలుసుకునేది?

అన్నిటినీ తెలుసుకునేది...

జ్ఞానమంటే తెలుసుకునేదేగాని,
తెలియబడేది కాదు.

* * *

తన ప్రక్కనే ఉన్న ఓ పత్రిక తీసి అందులో ఉన్న వేమన పద్యం చదివి వినిపించారు గురువుగారు.

పాలు పెరుగు వెన్న పాయసన్నము నెయ్యి
జున్ను లెన్నియైన జూడ పాలె
పాలవంటి కులము బ్రహ్మంబు కానరో
విశ్వదాభిరామ వినుర వేమ.

పాలు, పెరుగు, వెన్న, పాయసం, నెయ్యి...
వీటన్నిటికీ మూలం పాలే.
సృష్టిలో ఎన్నెన్ని చరాచర రూపాలు కనిపించినా
వాటన్నింటికీ మూలం పరబ్రహ్మమే.
* * *

ముక్కుపచ్చలారని శిశువు అంటే
అప్పుడే పుట్టిన శిశువు యొక్క ముక్కు, పసుపు పచ్చగా ఉంటుంది.
అది ఒకరోజుమాత్రమే ఉంటుంది.
తరువాతిరోజు అది తుడిచిపెట్టుకుపోతుంది.
అని మౌనం వహించారు గురువుగారు...

ఆ ముక్కుపచ్చలారని శిశువొక్కడే జ్ఞానశిశువు.

తనకో రూపం, నామం ఉన్నా లేనివాడే జ్ఞానశిశువు.

ప్రపంచపు వాసన అంటుకోని శుద్ధమనసు కలవాడే జ్ఞానశిశువు.

అని ఆ గురుమౌనాన్ని పూరించుకుని...
శెలవు తీసుకొని బయటకు వచ్చేశాం...
* * *

130. అరుణాచల యాత్ర

---

12-6-2022 * ఆదివారం

అరుణాచలం పౌర్ణమి ప్రదక్షిణం చేయటానికి...
డా.సత్యనారాయణ గారు,

వారి తమ్ముడు చందు,
మిత్రుడు తిరుపతి
ముగ్గురూ కారేసుకొచ్చారు...
తెలంగాణా చేర్యాల నుండి...

కైకాలవీధిలో ఉండే అత్యాశ్రమం చేరుకున్నారు
ఈ సాయంత్రం...

డాక్టరుగారు ఖర్జూరాలు ఇచ్చారు...
నా పాదాలను స్పర్శించారు...

ఆ చర్య, వారిలో ఉన్న భక్తికి తార్కాణమేగాని,
నా అర్హతకు నమస్కారం అని నేను అనుకోవట్లేదు...

నన్నెవరైనా ప్రత్యేకంగా గుర్తిస్తే లజ్జపడతాను...
అలా గుర్తించేవారు బజారులో యెదుటపడినా సరే
వీలైనంతవరకు వారి కంటపడకుండా తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాను.
చిన్నప్పట్నుండి privacy గా ఉండడం ఇష్టం.
బహుశా ఇదొక మానసిక వ్యాధి కావొచ్చు.

నా privacy ని బద్దలుగొట్టి నాకు దగ్గరైనవారు చాలా తక్కువమంది.
దేవీప్రసాద్, మురళీ, పట్టెయ్య, రమణ, సత్యనారాయణ...మొదలైనవారు.

పైగా సద్గురు పాదాల సన్నిధి రుచి తెలిసిన నాకు
ఈ పాదనమస్కారాలకు ఆనందించే గుణం పోయింది మనసుకు.

గురువుగారు అన్నట్టు-
ఎవరు ఎవరికి నమస్కారం చేసుకున్నా సరే
ఆ నమస్కారాలన్నీ చేరేది భూమికే...అన్నారు.

అత్యాశ్రమం నుండి గురుసన్నిధికి చేరుకున్నాం...
డాక్టరు సిగరెట్ ప్యాకెట్లు తీసుకెళ్లి ఇచ్చాడు...
అక్కణ్ణుండి దేవీప్రసాదును వెంటతీసుకుని అందరం జ్ఞానాంబ
దర్శనానికెళ్లాం....

ఆశ్చర్యంగా, అమ్మవారి దర్శనం చేసుకుని తన్మయులమౌతుండగా
పరమేశ్వరుడు పల్లకిలో వచ్చి అమ్మ ముందు నిలుచున్నాడు...
అప్పుడే అమ్మకు హారతి పట్టారు...
ఆ సన్నివేశం హృదయరంజకంగా ఉండినది.
ఏకకాలంలో అమ్మను, అయ్యను చూసి పరవశించాం...

దక్షిణామూర్తి సన్నిధిలో కాసేపు కూర్చొని
జ్ఞానాంబ ప్రసాదం స్వీకరించి గదికి చేరుకున్నాం.
* * *

13-6-2022 * సోమవారం

ముందురోజు అనుకున్న ప్రకారం-
ఈ ఉదయం 3 గంటలకు సద్గురు సన్నిధికి చేరుకున్నాం నేను, దేవీప్రసాద్, సత్యనారాయణ బృందం.

గురువుగారు అప్పటికే లేచి స్నానం చేసి పూజామందిరంలోకి వచ్చివున్నారు.

పట్టెయ్యగారు పటాలకు కర్పూరహారతి ఇచ్చారు...

పట్టెయ్య, వారి మిత్రుడు శ్యాంతో కలిసి మొత్తం ఏడుమందిమి అరుణాచలం బయలుదేరాం.

ముందుగా వసతి గది చూసుకుని,
తరువాత రమణాశ్రమం నుండి
స్కందాశ్రమానికి కొండబాట పట్టాం.

మామూలుగా కొండకు దారి ఉంటుంది.
కానీ ఈ కొండ ప్రత్యేకత ఏమంటే-
కొండే దారి...పరమపదాన్ని చేరటానికి.

మామూలుగా కొండపైన దేవుడుంటాడు.
కానీ ఇక్కడ కొండే దేవుడు.

కాబట్టి కొండే మార్గము...కొండే గమ్యము...
అదే అరుణాచలము...

నేనే మార్గమును...
నేనే సత్యమును...
నేనే జీవమును...
అన్న క్రీస్తు వాక్యము గుర్తుకొస్తోంది...

'నేను' అంటే క్రీస్తు అని కాదు...
'నేను' అనేది ఆత్మవాచకము...

* * *

స్కందాశ్రమానికి బయలుదేరాం...
రాళ్లతో తయారైన బాటలో నడుస్తున్నాం...

పట్టెయ్య అడిగాడు-
"గురుసన్నిధి వీడి దేవుని కోసమంటూ ఇంకొక్క అడుగు వేసినా సరే గురువును అవమానించినట్లే" అని అన్నారు మీరు గతంలో... మరి మీరిప్పుడు చేస్తున్నదేమిటి...? గురుసన్నిధి వీడి తిరువణ్ణామలైకు రాలేదా? దీనినెట్లా సమర్థిస్తారు?

నేనన్నాను-
తల్లి ఎక్కడకెళ్లినా తన బిడ్డను చంకలో పెట్టుకొని వెళ్లినట్టు,
సత్యనారాయణగారు నన్ను అలా తీసుకెళ్లి అరుణాచలం చూపించారు...అంతే.

ఇందులో నా ప్రమేయం ఏమీలేదు...
నాకు పోవాలన్న ఇచ్ఛా లేదు...
పోయామన్న తృప్తీ లేదు...
పోలేదన్న లోటూ లేదు...

అసంకల్పితంగా ఎక్కడికైనా వెళ్లొచ్చు.
అప్రయత్నంగా ఏ పనైనా చేయొచ్చు.
అకారణంగా ఏమైనా జరగొచ్చు.

నిజానికి అదొక్క సంఘటనే కాదు,
జీవితంలోని ప్రతి కదలికా అంతే.

అసంకల్పితంగా, అప్రయత్నంగా, అకారణంగా
జరుగుతోంది...ఈశ్వరసృష్టితో సహా.

అకారణానికి కారణం వెతకడం అవివేకం.
మూలానికి మూలం వెతకడం అజ్ఞానం.
అప్రయత్నానికి ప్రయత్నం చేయడం హాస్యాస్పదం.

నిర్లిప్తత అనేది నీ స్వభావంగా ఉండాలి.
తటస్థత అనేది నీ స్వరూపంగా ఉండాలి.

అప్పుడే మనకు తెలుస్తుంది-
ప్రయత్నంతో జరిగే కర్మలు,
అప్రయత్నంగా జరిగే కర్మలు
రెండూ భగవదిచ్ఛలోని అంతర్భాగాలని.

'నేను' అనేది అచలం.
ఇంచుకైనను అది కదలదు...అన్యం లేక.
అంతేగాని కదలలేక కాదు.

శ్రీకాళహస్తి నుండి తిరువణ్ణామలై వచ్చాను అంటున్నాను...

నిజానికి వచ్చింది ఏది?
తనువా?
తనువు కూడా ఉన్నచోటనే, నాతోనే ఉంది...
రోడ్డూ కదలదు...అది అక్కడే ఉంది...
కారు కూడా తానుతానుగానే, తానున్న చోటనే అది ఉంది.

అయితే ప్రయాణం ఎలా జరిగింది?
దూరం అనేది ఎట్లా లెక్కకొచ్చింది?

నిజానికి ప్రయాణం ఏమీజరగలేదు.
జరిగిందేమి?

నేనున్న చోటనే నేనున్నాను...
సినిమాహాలులో కూర్చుని ఉన్న ప్రేక్షకుని వలె.

దృశ్యం మన కళ్ల ముందు ఒకటి తరువాత ఒకటి జరిగిపోతున్నట్టు తోస్తుంది అంతే.
ఇదంతా "ఉత్త తోపకమే".

ఈ లెక్కలో తాను గిరిప్రదక్షిణం కూడా యెప్పుడూ చేసిందే లేదు.

తానున్న చోటనే తానున్నాడు...
తనతో సహా...అరుణగిరితో సహా...
సమస్త దృశ్యం "నా" చుట్టూ తిరుగుతోంది...

ఏమీ జరగపోయినా జరుగుతున్నట్టు
ఏమీ కదలకపోయినా కదులుతున్నట్టు
అనిపించడం అనేది మాయాదోషం.

కనబడే దృశ్యంలో ఎంత గొప్ప మహిమ కనిపించినా సరే,
కనేవాని కంటే అది గొప్పది కాదు.

'ద్రష్ట లేక దృశ్యము సున్న' అనే రమణుని సూక్తి
జ్ఞప్తిలో ఉంచుకుంటే చాలు...
ఇక ఏ దృశ్యమూ నిన్ను కలవరపరచదు.
'నేనే కేంద్రం' అంటూ ద్రష్టలో సంస్థితమై ఉండడమే ఆత్మలో ఉండటం...ఆత్మగా ఉండటం అవుతుంది.

* * *

స్కందాశ్రమం వెళ్లే చివరి మలుపు వద్ద నుంచి అరుణాచలదేవాలయ శిఖరాలను దర్శించాం...

"ఈశ్వరుడైనా సరే నీ కంటికి దిగువనే ఉండాలి"
అన్న సద్గురు వాక్యం గుర్తుకొచ్చింది...

సరిగ్గా ఇప్పుడు అలాగే ఉంది ఈ దృశ్యం...

ఈశ్వరుడు-
నీ చూపుకు ఎగువన ఉంటే నీవు భక్తుడవు.
నీచూపుకు దిగువన ఉంటే నీవు ముక్తుడవు.
అన్నారు గురువుగారు.

* * *

స్కందాశ్రమం చేరుకున్నాం...

రమణుల మాతృమూర్తి అళగమ్మ తనువు చాలించిన గదిలో కాసేపు గడిపాం.

'మనకు మైల లేదు...రండి కలిసి భోంచేద్దాం...'
అన్న రమణుల మాట గుర్తుకొచ్చింది...

నారాయణగురు రమణులపై వ్రాసిన
'నివృత్తి పంచకం' గుర్తుకొచ్చింది...

* * *

అక్కణ్ణుంచి విరూపాక్షగుహకు వెళ్లాం...

'అహం' మూలానికి,
'నాదం' మూలానికి
చేరుకుంటే, మనస్సు అందులో లీనమౌతుందని
రమణుడు కావ్యకంఠకు చెప్పిన తొలిపాఠం గుర్తుకొచ్చింది...

రమణుణ్ణి దర్శించుకున్న తొలి ఆంగ్లేయుడు హంఫ్రీస్ ఘట్టం గుర్తుకొచ్చింది...

గుహవద్ద కాపలాదారుడు సందర్శకులు చేసే చిన్నపాటి అలజడిని కూడా సహించలేక తన సైగలతో హెచ్చరిస్తున్నాడు ఊరక ఉండమని...

ఆ సైగలు, మాటల గోల కంటే పెద్ద చప్పుడుగా అనిపించింది...

ఆహా! అతను నిశ్శబ్దంగా ఎంత శబ్దం చేస్తున్నాడు!! అనిపించింది...

ఆ చోటులో ఉండబుద్ధి కాలేదు...
వీలైనంత త్వరగా బయటకు వచ్చేశాం...

గుహ నుండి వెలుపలి వస్తుండగా దేవీప్రసాద్ శిరస్సు గుహ గుమ్మానికి కొట్టుకుంది...

ఆ సైగల వీరుడు గబగబ బయటకు వచ్చి-
అలా తల కొట్టుకోవడం, అది విరూపాక్షస్వామి వారి ఆశీస్సులు అన్నాడు...
మాటలతో కాదు, అది కూడా సైగలతోటే...

* * *

అక్కణ్ణుంచి గుహనమశ్శివాయ ఆలయానికొచ్చాం...

విరూపాక్షదేవర్ కు గురువే ఈ గుహనమశ్శివాయ.
గుహనమశ్శివాయ ఇక్కడ సశరీరంగా జీవసమాధి చెందారు.

గుడిప్రక్కనే పెద్ద మర్రిచెట్టు...
దాని క్రింద పెద్ద అరుగు...
అందరం అక్కడ ఫోటోలు తీసుకున్నాం.
డాక్టరుగారు ఆ మఱ్ఱివృక్షం క్రింద కూర్చొని తపస్సు చేస్తున్నట్టు ఫోటో తీసుకున్నారు...
ఫోటో తపస్సు...

భగవాన్ రమణులు కొంతకాలం ఈ గుహలో ఉన్నారు.

శివప్రకాశం పిళ్లై అనే జిజ్ఞాసి అడిగిన ప్రశ్నలకు భగవానులు నేల మీద వ్రాసి ఇచ్చిన సమాధానాలే నేనెవడను? అనే గ్రంథంగా రూపుదాల్చింది...
ఆ ఘట్టం ఈ చోటులోనే జరిగింది,

ఆలయ మండపంలో ఓ స్తంభంలో గణపతి శిల్పం చెక్కి వుంది.
రమణభక్తురాలైన ఆకుకూరలవ్వ
ఆ గణపతిమూర్తిని ఆరాధించేది.

* * *

అక్కణ్ణుంచి కొండదిగి, ఆటోలో  రమణాశ్రమం చేరుకున్నాం...

బుక్ స్టాల్ లో పోలూరి హనుమజ్జానకీరామశర్మగారి 'భగవత్ సంకలిత ప్రసాదము' అనే పుస్తకం కొన్నాను.

నేను రమణాశ్రమం వెళ్లిన తొలినాళ్లలో
శర్మగారు రచించిన 'రమణ కథామణిమాల' అనే పుస్తకం కొన్నాను...
అది నాకు ఎంతో ఆనందాన్నిచ్చింది...
ఇప్పుడాపుస్తకం దొరకడం లేదు...

కథకు కథకు మధ్య లంకె పెట్టుకుంటూ వ్రాశారు...
ఆ ప్రయోగం అద్భుతం అనిపించింది...

'త్రిపురారహస్యం' కూడా వారే వ్రాశారు తెలుగులో.
ఇది రమణాశ్రమంలో దొరుకుతుంది.
నేను ప్రతి శుక్రవారం ఈ గ్రంథాన్ని పారాయణం చేస్తాను.

వారు వ్రాసే ఏ పుస్తమైనా అందులో 'బాలప్రియ' అనే వ్యాఖ్యానం వ్రాస్తారు...
పాఠకులకు సహజంగా వచ్చే సందేహాలను తీరుస్తుంది ఆ వ్యాఖ్యానం.

మన ఉపరాష్ట్రపతి వెంకయ్యనాయుడుగారికి
కళాశాలలో తెలుగు మాష్టారుగా ఉన్నారట వారు.

* * *

మధ్యాహ్నం రాంసూరత్ కుమార్ ఆశ్రమంలో భిక్ష చేశాం...అరుణగిరి ప్రొడక్షన్ అధినేత దుర్గాప్రసాద్ తోడుగా ఉండి కారులో మమ్మల్ని మా గదికి చేర్చి అరుణాచల ప్రసాదం, క్యాలెండర్లు ఇచ్చి శెలవు తీసుకున్నారు...

అనిలాచలం వీడి అరుణాచలం వెళ్లినా సరే
జ్ఞానాంబ మా మీద అలగకుండా
ఎండకు మా కాళ్లు కాలకుండా
ఈ దుర్గాప్రసాదును పంపింది ప్రేమతో...

కేరళాలో ఉన్న పప్పా రామదాస్ వద్ద తారక మంత్రం పొంది ఆ ఉపాసనాబలం వలన యోగిగా మారిపోయారు రాంసూరత్ కుమార్.

అక్కడే "టోపీ అమ్మ" అవధూత కనబడింది మాకు.
భక్తులు కొందరు ఆమె చుట్టూ గుమికూడి వున్నారు.

నేనూ, పట్టెయ్య 'అవధూత' అనేదానికి ఏవేవో నిర్వచనాలు చెప్పుకుంటూ కాలం గడిపాం...
మేం ఎన్ని నిర్వచనాలు చెప్పుకున్నా...
గురువుగారు చెప్పిన నిర్వచనమే హైలెట్.

ఋషి అను, స్వామి అను, సద్గురు అను, అవధూత అను...
ఆ పదాలన్నీ ఒక్క ఈశ్వరునికే చెల్లుతుంది.
లోకంలో ఇంకెవరికీ చెల్లదు...అన్నారు.

ఈ ఒక్క నిర్వచనం గుర్తుంటే చాలు.
నిర్వచనాలతో నింపబడిన పుస్తకాలన్నింటినీ
నిప్పులో పడేయొచ్చు...దోషమేమీ కాదు.

* * *

14-6-2022 * మంగళవారం ఉదయాన 3 గంటలకు అరుణగిరిప్రదక్షణం బయలుదేరాం...

సత్యనారాయణగారు అన్నారు-
ఓ దేవాలయం వద్ద ప్రారంభించి
తిరిగి అదే దేవాలయం వద్దకు చేరుకుంటే ప్రదక్షిణం పూర్తయినట్టు అని.

పట్టెయ్య గారు అన్నారు-
గురువు వద్ద నుంచి బయలుదేరాం...
తిరిగి గురువు వద్దకు చేరుకున్నప్పుడు ప్రదక్షిణం పూర్తయినట్టు అని.

రమణులు అన్నారు-
నేను అనేది ఎక్కణ్ణుంచి పుట్టిందో
తిరిగి నేను పుట్టుచోటుకి చేరుకున్నప్పుడే
ప్రదక్షిణం పూర్తయినట్టు అని.

మన గురువుగారంటారు-
ఉన్నచోటనే ఉంటే ప్రదక్షిణం పూర్తయినట్టు...అని.

ఏది సులభమో మీరే నిర్ణయించుకోండి.

* * *

నేర్ అణ్ణామలై గుడి వద్ద గురుసమానులైన యోగిరాజాంను కలిశాం...
సరదాగా అవీ ఇవీ మాట్లాడుకుంటూ...
అందరం కాఫీలు త్రాగాం...

రాజారాం యొక్క సూటితనానికి డాక్టరుగారు ఆశ్చర్యపడి, రాజారాంను పొగడబోయారు-
రాజారాం వెంటనే "మాటల్ని మ్రింగేయ్" అన్నారు.
అదే అతని జీవితానికి సరిపడా బోధ అయ్యింది.

ప్రదక్షిణం పూర్తవగానే రమణాశ్రమంలో భిక్ష చేసి తిరుగుప్రయాణమయ్యాం...
సాయంత్రానికి సద్గురు సన్నిధికి చేరి మా అరుణాచలయాత్రను ముగించాం.
* * *

జ్ఞానశిశువు
9533667918

131. గ్రంథం: నా గురువు

రచన: జ్ఞానశిశువు

---

నవఖండయోగిని మూటలమ్మ

---

జ్ఞానప్రదాత అయిన జ్ఞానప్రసూనాంబ కొలువై ఉన్న జ్ఞానక్షేత్రం శ్రీకాళహస్తి.

ఇక్కడ ఎంతోమంది యోగులు, యోగినిలు, అవధూతలు, జ్ఞానులు సదా చరిస్తూ ఉంటారు గుప్తంగా...

భక్తులకు అనుగ్రహప్రసారం చేస్తుంటారు నిశ్శబ్దంగా...

చరిత్రకెక్కని మహనీయులు యెందరో  మన కళ్లముందే నడచి మరుగైపోతుంటారు...

మనకు వాళ్ల స్థాయి తెలియదు...
వాళ్లకు మన స్థాయి తెలుసును...

ఆ వోల్టేజీని భరించేశక్తి మనకున్నప్పుడే
వారు మనకు టచ్ అవుతారు....

లేకుంటే హై వోల్టేజీ జొరబడిన బల్బులా పేలిపోతామని తెలిసి, మన శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని మనల్ని టచ్ చేయకుండా వెళ్లిపోతారు...

మన దృష్టిలో వారు పడకపోయినా
వారి దృష్టిలో మనం ఉంటాం...

వైరాగ్యం వలన ఆర్తి...
ఆర్తి వలన శ్రద్ధ...
శ్రద్ధ వలన సద్గురు అనుగ్రహం...
దొరుకుతాయి.

ఆ సమయం వచ్చినప్పుడు వారే వచ్చి మనల్ని టచ్ చేస్తారు...

సద్గురు అనుగ్రహమనే వోల్టేజీని భరించగలిగే శక్తి
ఒక్క వైరాగ్యానికే ఉంటుంది.

ముందు వైరాగ్యాన్ని సంపాదించుకోవాలి.
ఇదొక్కటే మోక్షానికి క్వాలిఫికేషను.

జ్ఞానానికి పునాది వైరాగ్యమే...
జ్ఞానాంబ(గురు)భక్తులందరూ వైరాగ్యసంపన్నులే...

అలాంటి హై వోల్టేజీని కలిగివున్న ఓ వ్యక్తి సామన్యవ్యక్తిలా చరిస్తూ...తన ఎదురింట్లోనే ఉన్నాడని బాబు అనే ఓ 18 ఏళ్ల బాలుడు దైవవశాన గ్రహించాడు...

వారి విప్పారిన నేత్రాలు తేజోగోళాలుగా దర్శనమిచ్చాయి...

వారి మాటలు తిరుగులేని జ్ఞానశాసనాలుగా  గర్జనస్వరాలు వినిపించాయి...

అవాక్కై వినడమే తప్ప వ్రాసుకోవడం, దాచుకోవడం ఆ బాబుకు లేవప్పుడు...

ఆ మహనీయ వ్యక్తే - సద్గురు సుబ్రహ్మణ్యుడు.

* * *

అలా మా తాతల కాలంలో శ్రీకాళహస్తి పరిసరప్రాంతాలలో చరించి,
భక్తులను అనుగ్రహించిన
ఓ అద్భుతమైన యోగిని మూటలమ్మ.
గొప్ప అవధూత...

* * *

మూటలమ్మ అనే పేరు ఎందుకొచ్చిందంటే...
తనవద్ద ఎప్పుడూ ఓ మూట ఉంచుకుని ఉండేది...
అందులో ఏముండేది అనేది ఎవరికీ తెలియదు ఆవిడ మరుగయ్యే వరకు...

తన శరీరాన్ని తొమ్మిది ముక్కలుగా చేయబడి,
మళ్లీ అతకబడేవట...
అందుకే నవఖండయోగినీ అని పేరొచ్చింది.

* * *

శ్రీకాళహస్తి సమీప గ్రామాలలో ఆమె తిరుగుతుండగా అక్కడి ప్రజలు మూటలమ్మకు తమ కష్టాలు నివేదించుకొనేవారు...

ఆమె కారుణ్యదృష్టి సోకితే రోగాలు బాధలు తొలగిపోయేవి...

కొందరు గృహస్తులు ఆమెను తమ యిండ్లలో నిలువుకోవడానికి ప్రయత్నించారు. ఆమె మెట్టిన యింట్లో చింతలు దూరమై సిరులు పొంగేవి.

అధివ్యాధులు తొలగిపోయి ఆనందం తాండవించేది...
ఆమె ఎప్పుడూ ఒకరి యింట శాశ్వతంగా ఉండలేదు...

ఆ రోజుల్లో కన్నలి, తాటిపర్తి, పొయ్యి, పూడి, కమ్మకొత్తూరు, అక్కుర్తి, చోడవరం గ్రామాల్లో అమ్మ ఎక్కువగా తిరుగుతుండేది.

శ్రీకాళహస్తి ప్రాంతాల్లో అమ్మ మాహాత్మ్యం మొదట గుర్తించిన ముఖ్యులు పి.వి.రామచంద్రరావు, పల్లం మునిస్వామి ప్రభృతులు.

అమ్మ చాలా సంవత్సరాలు సంచారజీవితం గడిపారు. చివరకు అక్కుర్తి గ్రామం వెలుపల రైల్వేస్టేషన్ మైదానంలో స్థిరపడ్డారు...

ఇది గమనించిన అక్కూర్తి ప్రజలు ఆమెకు గ్రామంలో ఒక పూరిపాక వేసిచ్చారు...
ఆ ప్రాంతానికి అనేక ప్రదేశాల నుండి భక్తులు వచ్చేవారు.

ఆమె దుష్టస్వభావము కలవారిని దగ్గరికి రానిచ్చేవారుకాదు....
అలాంటివాళ్లు దగ్గరకు వస్తే రాళ్ళు రువ్వేది...

కొన్నిసార్లు రాత్రులు ఆ గుడిసె కాలుతున్నట్లు మంటలు అందరికీ కనిపించేవి....
తీరా ఆర్పుదామని వస్తే ఏమీ ఉండేదికాదు...

* * *

ఆమె నెల్లూరు సమీపాన 10 కి.మీ. దూరంలో గల రాసపాళెం గ్రామంలో వెంకట సుబ్బమ్మ, వెంకటకృష్ణారెడ్డి దంపతులకు 1882లో జన్మించారు.

చిన్నతనంలోనే తనవారికి దూరమై...
పెంపుడు బిడ్డగా ఒక బ్రాహ్మణ కుటుంబంలో పెరిగింది...

ఆ బ్రాహ్మణులు కాశీకి వెళితే...
ఈ తల్లిని ఆ కాశీలో వారికి వసతి ఇచ్చిన బ్రహ్మణోత్తముడు దత్తుకు తీసుకొన్నాడు...
తనతోనే ఉంచుకున్నారు...
వారి నుండి మొదట మంత్రోపదేశం పొందారు...
దైవానుభూతిలో ఉన్న ఈ అమ్మ వివాహాన్ని ఇష్ట పడక...
ఉత్తరం దేశం విడిచి దక్షిణ దేశం చేరింది...

నారాయణవనంలో మహిమాన్వితులైన శ్రీ సొరకాయల స్వామి వారి వద్ద దీక్ష పొంది, వారికి శిష్యురాలైంది...

నారాయణవనం కళ్యాణ వేంకటేశ్వరస్వామి దేవాలయం ఎదురుగ్గానే సొరకాయలస్వామివారి జీవసమాధి ఉంది.
వారి చరిత్ర అమోఘం...
చిన్న చిన్న వ్యాసాలలో చెప్పడం కుదరదు...

శ్రీ సొరకాయలస్వామి ద్వారా పూర్ణత్వం పొందిన మహాయోగినిగా ఈమె స్వామివారి జీవితకథలో అంతర్భాగంగా నిలిచిపోయింది.

మా వీధిలో మా శ్రీరామమందిరం ప్రక్కనే చెంచురామయ్య అనే అతను ఉండేవాడు...
అతనికి సంతానం లేదు...
మూటలమ్మను తన ఇంటికి తీసుకొచ్చి పూజించాడు...
ఎందుకు తీసుకొచ్చాడో అమ్మకు అర్థమైంది...
ఒరే...! నీకీ జన్మలో సంతానం లేదురా...అంది.
అన్నట్టుగానే ఆయనకు సంతానం కలగనేలేదు.

ఆ సందర్భంలోనే మా మందిరంలో అడుగు పెట్టింది అమ్మ...
ఎందరో మహనీయులు ఆ మందిరంలో అడుగుపెట్టారు.

అందుకే మా అత్యాశ్రమానికి సందర్శించేవారిని ఆ మందిరంలోకి తీసుకెళుతుంటాను.

* * *

ఓ రోజు తనకు కిటికిలు లేని గదిని కట్టించమంది...
"అందులో నేను ఓ ఏడాదిపాటు సమాధిస్థితిలో ఉంటాను...
ఏడాది తరువాత తలుపులు తీయండి...మీకు ఓ అద్భుతమైన నిదర్శనాన్ని చూపెడతాను." అని చెప్పి లోపలకెళ్లి సమాధిస్థితిలోకి వెళ్లిపోయారు మూటలమ్మ.

శ్రీకాళహస్తిలో ప్రముఖవ్యక్తి అయిన రామచంద్రరావు అనే అతను దగ్గరుండి తలపులకు తాళం బిగించి సీలు వేశారు.

ఇదంతా జరిగింది 1943 ప్రాంతంలో...

నమ్మకస్థులైన ఓ దంపతులను ఆ గదికి కాపలాగా ఉంచారు.
వారూ అమ్మకు భక్తితో సేవ చేసినవారే...

కానీ ఏడాది పూర్తవడానికి కొద్ది నెలలముందే ఆ దంపతులకు ఆసక్తి కలిగింది-
లోపల మూటలమ్మ నిజంగా జీవించి ఉందా? అని.
తాళం తీసి లోపల చూశారు-
ఆశ్చర్యం...! లోపల మూటలమ్మ లేదు.
అంతే ఈ దంపతులకు వాంతులు మొదలయ్యాయి...
ఊరు ఊరంతా అక్కడకు చేరుకుంది...
అందరికీ విషయం చెప్పారు-
ఓ అరగంటలో ఆ దంపతులిద్దరూ చనిపోయారు.

అమ్మ సశరీరంగా పరమపదం చేరిపోయారు...
జ్యోతిరామలింగస్వామివారి వలె.

ఇప్పుడా గది లేదుగాని, ఆ స్థలానికి గుర్తుగా చిన్న కట్టడం ఏదో ఉంది.

ఆవిడ జీవితాంతం మోసిన మూట మాత్రం దొరికింది.
విప్పి చూస్తే అందులో కొన్ని బట్టలు, విబూధిపండ్లు ఉన్నాయి....

వారు ఏ బల్లమీద కూర్చుని సమాధిస్థితిలోకి వెళ్లారో
ఆ బల్లను ఉయ్యాలపీటగా మార్చి దానిపై అమ్మ విగ్రహం ఉంచారు.

ఓ రోజు నేనూ నా స్నేహితులు మునిరెడ్డి, కైలాసం, కలిసి వెళ్లాం ఆ ఆశ్రమానికి.

అక్కడ మూటలమ్మ పటం శిధిలావస్థలో ఉండడం చూసి
మునిరెడ్డి చింతించాడు...
క్రొత్తపటం చేసి పెట్టాలని సంకల్పించాడు...
మా స్నేహితుడు పొన్నారావు మంచి ఫోటోగ్రాఫరు...
మంచి కాపీ ఒకటి తయారుచేసి ఇచ్చాడు.

ఆ క్రొత్త పటం మూటలమ్మ ఆశ్రమంలో పెట్టే శుభసందర్భంలో గురువుగారిని కూడా తీసుకెళ్లాం...
పూజాసామగ్రితో పాటు, పులుసన్నాలు, పెరుగన్నాలు వెంట తీసుకెళ్లాం...
గురువుగారి ఆధ్వర్యంలో క్రొత్తపటం ప్రతిష్ఠించి పూజ చేసి ఆనందించాం.

* * *

132. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

ఇంజం...నందీశ్వరం...

---

ఇంజం వేంకట నరసయ్య...
ఖమ్మంలో ప్రముఖ పాత్రికేయులు...
కోటయ్య-దుర్గమ్మ వారి తల్లిదండ్రులు...
భార్య ఉమ...
పిల్లలు రమాదేవి...విశాల్...
మేనకోడలు నవ్య...
అందరూ గురుభక్తులే...

సూర్యుణ్ణి కమ్మిన మేఘాలను...
ప్రభంజనమైన వాయువు చెల్లాచెదరు చేసి...

లోకానికి సూర్యదర్శనాన్ని ప్రసాదించినట్లు...
శ్రీకాళహస్తిలో గుప్తంగా ఉన్న సద్గురువును గుర్తెరిగి...
అనామకంగా ఉన్న ఆ దివ్య ప్రదేశానికి...
"అత్యాశ్రమం" అని పేరు పెట్టి....
ఆ గురువుకు "అత్యాశ్రమి" అని నామకరణం చేసి...
వారి తత్త్వప్రభను లోకానికి అందించిన నందీశ్వరావతారులు....
ఇంజం వేంకట నరసయ్య...

ఆధ్యాత్మికంగా గురువుగారిని ఒక్కప్రశ్న కూడా అడక్కుండా...
గురుసన్నిధిలో గురుతత్త్వాన్ని నిశ్శబ్ధంగా జుర్రుకునే నిశ్శబ్ద శిష్యుడు
ఇంజం...
మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు పోవునే
మదనములకు...
అన్నట్లు సద్గురు పాదాలను ఆశ్రయించాక...
ఇక ఏ దేవతా మాలాధారణలూ, దీక్షలు చేయక...
మౌనమే మాలగా...
గురుతత్త్వప్రచారమే దీక్షగా...
అత్యాశ్రమి యాప్ ను సృష్టించి...
నిశ్శబ్దంగా పొలికేక పెట్టి....
ప్రపంచాన్ని గురుసన్నిధికి ఆహ్వానించిన...
నిశ్శబ్దప్రేమికుడు ఇంజం...

కైకాలవీధిలో సద్గురు జ్ఞాపకార్థంగా ఉన్న గదిని...
మేము అద్దెకు తీసుకున్నప్పుడు...
అందులోకి అవసరమైన వస్తువులు కొనడానికి...
పైకం ఇచ్చి ప్రోత్సహించిన నిశ్శబ్ద దాత ఇంజం...

20 ఏళ్లపాటు బాబు చేసిన గురుసాహిత్యసేవ ఒక యెత్తు...
ఒక్క ఏడాదిలో ఇంజం జేసిన సేవ ఒక యెత్తు...

website ద్వారా అయితేనేమి...
సద్గురు సూక్తులతో నిండిన క్యాలెండర్లను... తెలుగురాష్ట్రమంతా పంచడం

ద్వారా అయితేనేమి....
అత్యాశ్రమి పత్రిక వలన అయితేనేమి...
అనిలాచలశివమాల పుస్తకాలను పంచడం ద్వారా అయితేనేమి...
అత్యాశ్రమి యాప్ వలన అయితేనేమి...
ఈరోజు రాష్ట్రం నలుమూలల నుండి...
జిజ్ఞాసువులు సద్గురు దర్శనానికై పరుగులిడుతున్నారు...

మా అత్యాశ్రమపతాక చిహ్నం- నందీశ్వరుడు...
అని చెప్పుకోవడానికి గర్వపడుతున్నాం...
ఆ నందీశ్వరుడే ఇంజం వేంకటనరసయ్య...
పరమసత్యాన్ని వెలిబుచ్చడం తప్ప
అతిశయోక్తులు వ్రాయడం నా కలానికి తెలియదు...

ముందు పతాక దర్శనం...
తర్వాతే గురుతత్త్వ దర్శనం...
సూర్యప్రకాశం సూర్యునికి వేరుకానట్లు...
గురుప్రకాశమే శిష్యగణం...
"గురువు" యొక్క Extension శిష్యగణం...

* * *

ఈ వ్యాసం వ్రాయడం పూర్తవగానే...
'బజారుకెళ్లి టీ త్రాగుతాం రా..." అన్నాడు దేవీప్రసాద్...
వెళ్లాం...
అదే సమయానికి దేవాలయం ముఖద్వారం నుండి....
నంది వాహనం మీద జ్ఞానప్రసూనాంబిక ఊరెరిగింపుగా విచ్చేసి
దర్శనమిచ్చింది...
బిడ్డా...! నీవు వ్రాసిన ప్రతి అక్షరమూ సత్యమే...
అని జ్ఞానాంబ తన ఆమోదాన్ని తెలిపినట్లయ్యింది...

* * *

133. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

నేనే ప్రశ్న - నేనే సమాధానం

---

1. సాంబశివరావు:
కనేవాడు - నిజం.
కనేబడేది - అబద్దం.
అని మీరు అన్నారు.
వివరించండి...

సద్గురు:
అబద్ధము అన్నా, అసత్యము అన్నా, మిథ్య అన్నా
వాటి అర్థమేమంటే 'మారుతూ ఉండే సత్యము' అని అర్థం.
అంతేగాని అసత్యము అంటే అది 'లేనిది' అని కాదు.

కనబడేది మారుతూ ఉంటుందేగాని,
కనేవాడు మారడు.

2. సాంబశివరావు:
సాంబశివరావుతో సహా సకలాన్ని "అదే" కంటోందా?

సద్గురు:
ఏది సాంబశివరావును చూస్తోందో అదే 'చూసేది'

3. సాంబశివరావు:
చూస్తుంది అంటే?

సద్గురు:
తెలుసుకోవటాన్ని కూడా 'చూస్తుంది' అని చెప్పవచ్చు.

4. సాంబశివరావు:
తెలుసుకోవడం అంటే మామూలు తెలివా?

సద్గురు:
కాదు కాదు. సాక్షిగా ఉండటం అది.

ఉండటం ఒకటి
ఉన్నట్లు ఉండటం ఒకటి.

రెండూ ఉండటమేగాని,
ఉండేది మారదు.
ఉన్నట్లున్నది మారుతూ ఉంటుంది.

5. సాంబశివరావు:
ఉన్నట్లున్నదిగా తోచేది కూడా 'ఉన్నది'యేనా?

సద్గురు: అంతేగా...

శరీరంలో అవయవాలను ఒక్కొక్కటిగా చూపించి
ఇదేమని అడిగితే- కాలు, చెయ్యి, కన్ను, ముక్కు...అంటాడు.
నేను-నేను అంటున్నావే...అదెక్కడుంది? అని అడిగితే చెప్పలేడు.

6. సాంబశివరావు:
నేనని 'నేను' అంటుంటే,
సాంబశివరావు అంటున్నాడని అనుకుంటున్నాను.

సద్గురు: అంతే.

7. సాంబశివరావు: నమస్కారం గురువుగారు...
సద్గురు: నమస్కారం.

8. దొరబాబు: సుఖంగా ఉండేలా అనుగ్రహించండి స్వామీ...

సద్గురు: సుఖం అంటే ఏమి?

9. దొరబాబు: జీవితం ప్రశాంతంగా గడిచిపోవడం...

సద్గురు: ప్రశాంతం అంటే ఏమి?

10. దొరబాబు:తెలియదండీ...ఐతే ఏం కోరుకోమంటారో మీరే చెప్పండి...

సద్గురు: 'అభయస్థితి'ని కోరుకోండి.

* * *

11. దొరబాబు: 'నేను దొరబాబు' అనుకునే ఈ నేనును తీసేసుకోండి స్వామీ...

సద్గురు: అసలు నీ దగ్గర ఏముంది నాకివ్వడానికి?
దొరబాబును అనుకునే నేను కూడా నేనే.

12. దొరబాబు: అయితే మీ దగ్గరున్నది నాకు ఇవ్వండీ...

సద్గురు: మీరు నన్ను కలిసినరోజునే, తొలిచూపులోనే
నీ దగ్గరున్నది నాకు, నా దగ్గర ఉన్నది నీకు ఇవ్వడం జరిగిపోయింది.

13. మురుగానంద: ఏమిటి స్వామీ సంగతులు?

సద్గురు: ఏమున్నాయి...మనసు మౌనంగా ఉంటోంది. ఈ మధ్య ఏమీ పలకడం లేదు, మాట్లాడడం లేదు. బెంగుళూరు నుండి రవి వచ్చాడు. ఏమైనా చెబుతానేమోనని ఎదురుచూస్తున్నాడు పాపం...! కానీ 'ఇది' పలికితేగా...

14. మురుగానంద: మీరు చెప్పకపోయినా అందవలసింది అందుతుందిగా...!

సద్గురు: అసలది అందేది మౌనంలోనే. అది తలంపులోకి వచ్చేసరికే కలుషితం అయిపోతుంది. తలంపు నుండి మాటగా వచ్చేసరికే ఇంకా కలుషితం అయిపోతుంది. సూటిమార్గం మౌనమే.

నేనొక చెట్టునీడకు వచ్చి హాయిని అనుభవిస్తున్నాను.
ఇంకొందరు వచ్చి కూడా ఆ హాయిని అనుభవిస్తారు.
ఇందులో మాటలతో పని ఏముంది?

15. మురుగానంద: జ్ఞానసిద్ధి అంటే ఏమిటి స్వామీ...?

సద్గురు: మనమందరం జ్ఞానరూపమే.
నేను సుబ్రహ్మణ్యం, నేను మురుగానంద అనుకోవడం కూడా ఆ జ్ఞానస్థితిలో ఇదొక సిద్ధి. నామరూపాలు లేని తాను, నామరూపాలను కలిగివుండడం సిద్ధి కాదా? సిద్ధి అంటే 'నిజం కానిది' అని అర్థం. ఏదైనా

సిద్ధిస్తుందేగాని, జ్ఞానం సిద్ధించదు. దానిని పొందటం, పోగొట్టుకోవడం రెండూ జరుగదు. యెందుకంటే  స్వయంగా తానే జ్ఞానం కాబట్టి.

16. మురుగానంద: దీప్తానందస్వామి ఆరోగ్యం ఏమీ బాగుండడం లేదు...మందులు తీసుకోమంటే తీసుకోవడం లేదు స్వామీ...

సద్గురు: శరీరం మాయ. దాని కోసం తీసుకునే మందులు కూడా మాయే కదా!

మందులు తీసుకోవడం లేదు అంటే-
శరీరం ఒక్కటే మాయ, మందులు నిజం అని అనుకున్నట్టే కదా!

* * *

సద్గురు: కలలో మీరు ఉన్నప్పుడు కల కనేది మీరు కాదు. అలాగే ప్రపంచంలో మీరు ఉన్నప్పుడు ప్రపంచాన్ని కంటున్నది కూడా మీరు కాదు.

కలలో లేకనే కలను కంటున్నవాడు,
ప్రపంచంలో లేకనే ప్రపంచంలో ఉంటున్నవాడు
ఒక్కడే.

వాడే వీడు...వీడే వాడు.
వాడినే మనం దేవుడు అంటున్నాము.

మీరు కలను కని, మేల్కొన్నాక 'నేను కల కన్నాను' అంటున్నావు.

అలాగే ప్రపంచం నుండి మేలుకోవడాన్ని మనం జ్ఞానం అంటున్నాం.

అంటే కల, మెలకువలు అనే కలలను సదా కంటుండేది జ్ఞానమే.

ఆ జ్ఞానం ఎవరిదీ కాదు.
అది స్వయం జ్ఞానం.
అదే పరమజ్ఞానం.

కలను కనేవాడు, ప్రపంచాన్ని కనేవాడు ఒక్కడే.
వాడే 'నేను'.

అందుకే మనకు తెలియకుండానే మన ఒరిజినల్ అడ్రసు చెప్తాము-
ముందు 'నేను' అని, తరువాత సుబ్రహ్మణ్యం అంటాను.

అంటే నేను అనేది ఒరిజినల్, సుబ్రహ్మణ్యం అనేది డూప్లికేట్.

17. సంతోష్: ఈ డూప్లికేట్ అసలుసత్యమేనా?

సద్గురు: సత్యం యొక్క వివిధరూపాల్లో ఒక రూపం అది.
అది కూడా 'ఉన్నట్లున్నదే'.

18. సంతోష్: శాస్త్రాలు లేవంటున్నాయిగా...

సద్గురు: ఈ శాస్త్రాలన్నీ మీరొచ్చిన తరువాత వచ్చినవే. ఎండమావులు కూడా కనబడుతానే ఉన్నాయిగా... లేదని ఎలా చెప్పగలం? ఇదీ అంతే.

'నేను సుబ్రహ్మణ్యం' అనేదానిలో-
నేను అనేది అహంస్వరూపం.
సుబ్రహ్మణ్యం అనేది - అహంకారం.

అహంస్వరూపం సదా ఉంటుంది.
అహంకారం వ్యక్తి ఉన్నంతవరకే ఉంటుంది.
ఈ నేను ప్రక్కన ఉండే సుబ్రహ్మణ్యాన్ని తొలగిస్తే ఏ గోలా ఉండదు.
రమణులు చెప్పిన నిన్ను నీవు తెలుసుకో అంటే ఇదే.

19. సంతోష్: ఆ 'అసలు నేను' యొక్క ముఖమే తెలియడం లేదే?

సద్గురు: అన్ని ముఖాలతోనూ ఉండేది అదే.
అసలు నేనుకు ఏమీ అంటవు. వచ్చిన బాధెలెల్లా ఈ డూప్లికేట్ నేనుకే.

20. సంతోష్: మూలాన్ని తెలుసుకోవడం అంటే ఇదేనాండీ...?

సద్గురు: కొత్తగా తెలుసుకునేది ఏమీలేదు.
మనం సదా ఉండేది మూలంలోనే.
మనం తెలియనట్లు మాట్లాడుకుంటున్నది కూడా మూలంలోనే.

21. సంతోష్: అసలు ఈ ఆది అంతములు అంటే ఏమిటి  స్వామీ...?

సద్గురు: అద్యంతములు తెలియాలంటే ముందు నీవు ఆద్యంతములు లేనివాడుగా ఉండాలి.

పెట్టుడు మీసాలు, గెడ్డాలు పెట్టుకున్నంతమాత్రాన వయసు రాదు.

ఆ వయసొచ్చాక పెట్టుడివాటితో పనిలేదు.

అలాగే ఈ గ్రంథాలు, శాస్త్రాలు చదివి ఏదో తెలుసుకోవడం అంటే అది తెచ్చిపెట్టుకున్నవేగాని, సహజమైన జ్ఞానం కాదు.

22. శ్రీనివాస్: మీరు 'ఇదంతా ఓ కల' అంటున్నారు... కళ్లముందు కనిపిస్తున్న ఈ ప్రపంచాన్ని కల అని ఎలా అనుకోమంటారు?

సద్గురు: నిద్రలో నీకొక కల వచ్చింది... కలలో ఉన్నంతసేపు ఇది కల అని నీకు తెలియదు... దానినంతా నిజం అనే అనుభవిస్తావు. మెలకువ వచ్చాక కల అంటున్నావు.

ఇక్కడా అంతే.... కలలో ఉన్నామన్న జ్ఞప్తి సదా ఉంటే, ఇందులోని సుఖదుఃఖాలు కలలోనివే అవుతాయి. ఇది నిజం అనుకున్నంతసేపు అవి ఇబ్బంది పెడుతూనే ఉంటాయి.

కేవలం కష్టాలు తీరటానికిగాను 'ఇది కల' అని చెప్పడం కాదు, ఇది ముమ్మాటికీ కలే.

23. శ్రీనివాస్: ఇది కల అని కొట్టివేయలేకపోతున్నాను స్వామీ...

సద్గురు: కలనుంచి మెలకువ సహజంగా, దానికదే కలిగినట్లు
ఈ కల నుండి కూడా మెలకువ సహజంగా, దానికదే కలుగుతుంది.

24. సంతోష్: మా బండ్లు ఆ మార్గంలోనే వెళుతున్నాయా స్వామీ...?

సద్గురు: మీ బండ్లు already చేరాల్సిన చోటుకే చేరిపోయాయి. అవి ఉండాల్సిన చోటులోనే ఉన్నాయి.

25. శ్రీనివాస్: మరణభయం తొలగడానికి ఔషధం ఉందాస్వామీ...?

సద్గురు: మరణం ఉంటే ఔషధం ఇవ్వొచ్చు. అసలు మరణమే లేదు. మళ్లీ దానికి ఔషధం ఎందుకు? లేనిదానికి మందెవరిస్తారు? లేనిదాన్ని ఉంది అనుకోవడమే మాయ.

ఈ మాయ తెలిసినవాడికి, తెలియనివాడికి ఎప్పుడూ ఉండదు. తెలిసీతెలియనివాడికి ఎప్పుడూ ఉంటుంది.

(నవ్వుతూ)ఆ మాయ వల్లే ఈ గురువులతో పని పడేది మీకు.

26. మూర్తి:
గురువుగారూ...నన్ను తరింపచేయండీ...

సద్గురు:
తరింపచేయడం అంటే దాటించడం...
ఎక్కణ్ణుంచి ఎక్కడకు దాటించాలి?
ఉన్నదెల్లా సత్పదార్థమే...

27. పృచ్ఛకుడు: అంతా చైతన్యమే అంటున్నారుగానీ...
కొండలు బండలు జడంగానే అనిపిస్తున్నాయి...

సద్గురు: చూడబడేదంతా జడమే, చైతన్యంగా కనిపించినా సరే.
చూచేవాడు ఒక్కడే చైతన్యము.

* * *

28. పృచ్ఛకుడు: భేదబుద్ధి ఎందుకు కలిగింది?

సద్గురు: ఎందుకు ఏర్పడకూడదు?

29. పృచ్ఛకుడు: ఆవేశం ఎందుకొస్తుంది?

సద్గురు: నీవెట్లా వచ్చావో అట్లానే వస్తుంది.

* * *

ప్రశ్నించేవాడు ఉన్నంతకాలం ప్రశ్న ఉంటుంది.
ప్రశ్న ఉండకూడదు అంటే ప్రశ్నించేవాడు ఉండకూడదు.
ప్రశ్నించేవాడే ప్రశ్న.
నీవు కోరినట్టు ప్రశ్నలేని స్థితి నీకు కలిగితే,
నీవుండవు.
నీవుండటమే ప్రశ్న.
నీవే ప్రశ్న.
నీవు లేకుంటే అదే సమాధానం.

30. పృచ్ఛకుడు: ఎలా మరణించాలి?
సద్గురు: నీవు మరణించే ఉన్నావని తెలుసుకో.
* * *
'నేనున్నాను' అనేదే సాధన; సిద్ధి.
* * *
సౌమ్యం, దౌష్ట్యం రెండూ
నీ స్వాధీనంలో లేనివి.
* * *
31. పృచ్ఛకుడు: నేనును ఎట్లా అనుభవించాలి?
సద్గురు: నేనుండడమే అనుభవము.
* * *
Deep Sleep అని చెప్పుకుంటామే...
అదే మెలకువ.
* * *
32. పృచ్ఛకుడు: మీరు ఎలా సమాధానం చెప్పగలుగుతున్నారు?
సద్గురు: నీవెలా ప్రశ్న వేయగలుగుతున్నావో అలానే.
* * *
33. పృచ్ఛకుడు: ఇదంతా ఎందుకు అర్థం కావడం లేదు...
సద్గురు: నీవు లేవు కాబట్టి.
* * *
34. పృచ్ఛకుడు: నాకేమీ అర్థం కావడం లేదు...
సద్గురు: ఆ విషయం అర్థమయ్యిందిగా...
* * *
నాకు తెలుసు అనేది అజ్ఞాని మాట.
నాకు తెలియదు అనేది జ్ఞాని మాట.
* * *

35. పృచ్ఛకుడు: ఈ అజ్ఞానం ఎక్కణ్ణుంచి వచ్చింది?
ఎలా వచ్చింది?

సద్గురు: నీవెక్కణ్ణుంచి వచ్చావో
అక్కణ్ణుంచే వచ్చింది.
నీవెలా వచ్చావో అలానే వచ్చింది.

36. పృచ్ఛకుడు: దేహాత్మబుద్ధి ఎలా పోతుంది?

సద్గురు: దేహం పోతే పోతుంది...

* * *

37. పృచ్ఛకుడు: మనసుకు బాధెందుకు?
సద్గురు: మనసుకు బాధ కాదు, మనసే బాధ.

* * *

ఇంకొకడికి దుఃఖం కలగకుండా
నీకు సుఖం కలుగదు.

* * *

ఒకడికి లాభం మరొకడికి నష్టం.

* * *

నీవుంటే అది తెలియబడదు.
అది తెలియబడితే నీవుండవు.

* * *

పుస్తకంగా(మొత్తంగా) ఉండే ఒకటి - దేవుడు.
పుస్తకంలో ఓ పేజీగా ఉండే ఒకటి - జీవుడు.
రెండు లేని ఒకటి - దేవుడు.
రెండు ఉండే ఒకటి - జీవుడు.

* * *

అలాగే నేనులు రెండున్నాయి-
రెండు ఉండే నేను ఒకటి.
రెండు లేని నేను ఒకటి.

* * *

నిన్ను నీవు తెలుసుకో అంటే-
రెండు లేని నిన్ను
రెండు ఉన్న నీవు తెలుసుకో అని.
* * *
మొదటి పేజీగా ఉన్న నీవు
పుస్తకంగా ఉన్న నిన్ను తెలుసుకో అని.

38. శ్యామ్: అహంకారం లేకుండా ఉండాలి అంటే ఎలా ?

సద్గురు: ఉండనివ్వండి...
అది లేకుంటే సృష్టి నడవదు.

39. శ్యామ్: అహాన్ని చంపాలి అంటారు కదా?

సద్గురు: అది నేను కాదని తెలియడమే
అహాన్ని చంపడం.

40. శ్రీవల్లి: తత్త్వం తెలిసినవాళ్లే  తనలో లోకం చూడగలరేగాని
ఇతరులు తనలో లోకం ఎలా చూడగలరు?

సద్గురు:
అందరూ చూస్తుండేది తనలో లోకాన్నే.
నీ కలలోని లోకాన్ని నీవు నీలోనే చూస్తున్నట్టు
ఈ ప్రపంచాన్ని కూడా నీవు నీలోనే  చూస్తున్నావు.

ఆ కలలోని ప్రపంచం నీలోనిదే కదా!
అలాగే ఈ ప్రపంచం కూడా నీలోనిదే.
నీకు వెలుపల లేదు ప్రపంచం.

ఎప్పుడో ఒకసారి అగుపడితే 'కల' అంటున్నాం.
సదా అగుపడుతుంటే 'నిజం' అంటున్నాం.
నిజానికి ఇది కూడా కలలోని ప్రపంచమే.
రెండూ కలే...
రెండూ నీలోనివే...

కలను ఎవడు కంటున్నాడో
ఇలను కూడా వాడే కంటున్నాడు.
ఆ కనేది శ్రీవల్లీ కాదు...
శ్రీవల్లీ కూడా కలలో భాగమే.

41. శ్రీవల్లీ: అన్నిటి దెలిసెడు వానిని తెలిసిన
ఆత్మజ్ఞుడురా అనిలాచలా(87)

సద్గురు: ఆ కలను శ్రీవల్లీ చూస్తుంటే...
శ్రీవల్లీని కలిపి  కలగా చూసే నీవే ఆత్మ.

నిద్రలో కలను కనేది శ్రీవల్లీ.
ఈ 'మెలకువ' అనే కలను కనేది ఈశ్వరుడు.

42. శ్రీవల్లీ: మాయ అనే పొర ఎలా తొలగుతుంది?

సద్గురు: మాయ ఉందని అనుకోవడం మాయ.
మాయ అనేదే లేదని తెలుసుకోవడమే
మాయ తొలగడం.

43. శ్రీవల్లీ: అన్యం కనిపిస్తోంది కదా...!

సద్గురు: కలలో కూడా అన్యం కనిపిస్తోంది
అదేమాదిరి ఇది కూడా.

44. ఓ భక్తురాలు:
సంసారంలో ఉండాలనిపించడంలేదు స్వామి...
వైరాగ్యం వచ్చేస్తోంది...

సద్గురు:
వైరాగ్యం కూడా సంసారమే.
సంసారంలో ఒక భాగమే వైరాగ్యం కూడా.

45. పృచ్ఛకుడు: అజ్ఞాని జ్ఞాని కావడానికి మార్గమేమి?

సద్గురు: అజ్ఞాని యెక్కడున్నాడు?
అజ్ఞాని కూడా జ్ఞాని అని గుర్తించలేని నీవే అజ్ఞానివి.

46. విద్యాసాగర్: గురువుగారూ...! మనసు అంటే ఏమి?

సద్గురు: నీ పేరేమి?

47. విద్యాసాగర్: విద్యాసాగర్...

సద్గురు: నీవడిగే మనసు పేరు విద్యాసాగర్...
నీ మనసు పేరును నీ పేరుగా భ్రమపడుతున్నావు.
ఫస్ట్ స్టెప్పే రాంగ్ స్టెప్పు పడిపోయింది.
ఈ రాంగ్ స్టెప్ లో నిలబడి మొత్తం వ్యవహారాన్ని చేస్తున్నావు.
కరెక్టు స్టెప్ లో ఉన్నందుకు గుర్తేమంటే "క్వశ్చనే" రాదు.

నా మనసు అంటూ ఏమీలేదు.
మనసే సకల నామరూపాలతో ఉండేది.

నేను విద్యాసాగర్ అని చెప్పేదే మనసు.
విద్యాసాగర్ చెప్పేదంతా మనసు కాకుండా ఎట్లా పోతుంది?

ప్రపంచానికి 'అసత్యం'గా(విద్యాసాగర్ గా)ఉండు.
లోపల 'సత్యం'గా ఉండు.

నేను విద్యాసాగర్ అనుకోవడమే తొలికర్మ.
మిగతా కర్మలన్నీ దీనికి కలిగే కర్మలే.
'నేను' కు ఏ కర్మలూ లేవు.

రైలు వస్తోంది...రైలు పోతోంది...అని రైలును అంటున్నామేగాని,
డ్రైవరు వస్తున్నాడు...డ్రైవరు పోతున్నాడు...అని అంటున్నామా?
డ్రైవరు లేకుండా రైలు కదలదు.

అలాగే 'కర్త'ను (ఈశ్వరుణ్ణి)మరచిపోవడం వలన
నామరూపాత్మకమైన దేహమే వ్యవహరిస్తున్నట్టు భ్రాంతిపడుతున్నాం. కర్త లేకుండా 'కర్మ-క్రియ'లు ఉండవు.

48. స్రవంతి: సత్యాన్ని తెలుసుకోవడానికి సాధనను ఎలా మొదలుపెట్టాలి?

సద్గురు: ఆకాశం యొక్క కొలతను లెక్కించడానికి ఎక్కణ్ణుంచి
మొదలుపెట్టి, ఎక్కడకు ముగిస్తారు?

49. స్రవంతి: ఆకాశం అనంతమైనది కదా!

సద్గురు: ఇది కూడా అంతేనమ్మా...
ఆకాశము, సత్యము అని పేర్లు రెండేగాని
ఆకాశమే సత్యం, సత్యమే ఆకాశం.

50. స్రవంతి: ఎలా నమ్మమంటారు?

సద్గురు: నమ్మొద్దు...అన్ని అవస్థలూ పడ్డాక నెమ్మదిగా నమ్మండి...

51. స్రవంతి: ప్రాపంచికవిషయాల్లో ఉన్న మనస్సు ఒక్కసారిగా గ్రహించడం కష్టమే....

సద్గురు: ప్రపంచం ఉండేది కూడా ఆకాశంలోనే.

52. పట్టెయ్య: కాసేపు పడుకుంటారా స్వామీ...!

సద్గురు: (నవ్వుతూ)మీకు పడుకోవాలని...నన్ను అడుగుతున్నారా...?

53. పట్టెయ్య: లేదుస్వామీ...

సద్గురు: పడుకునే కదా ఇప్పుడు ఈ కలను కంటుండేది...

* * *

54. శ్రీను:
నిద్రపోయి కల కనడానికి
మేల్కొని కల కనడానికి
తేడా ఏమి?

సద్గురు:
మొదటి కల శ్రీనుది.
రెండవ కల దైవానిది.

55. శ్రీను:
కల కనేవాడికి లేని బాధ
కలలో ఉన్నవాడికి ఎందుకు ఉంటోంది?

సద్గురు:
ఇది కల అని తెలియక.

ఇది కల అని తెలిస్తే అదే మెలకువ.
మెలకువే కలలోని అన్ని సమస్యలకూ పరిష్కారం.

56. డా. అమర్ నాథ్: నేను ఎవడను?

సద్గురు: నేను-నేను అంటూనే
నేనెవడను? అని ప్రశ్నిస్తే
నేనేం చెప్పను?

57. డాక్టర్: ఇప్పటివఱకు మా వైపు నుంచి సమాధానాలిచ్చారు...
మీ వైపు నుంచి ఏమైనా చెబుతారా?

సద్గురు:
ఇప్పటివఱకు చెప్పిందంతా కూడా
నా వైపు నుంచే...
* * *
మబ్బుల్ని పట్టుకోవద్దు
ఆకాశాన్ని పట్టుకో.
ఆలోచనల్ని పట్టుకోవద్దు
ఆత్మను పట్టుకో.

58. సాంబశివరావు: జీవుడు దేవుణ్ణి తెలుసుకోవాలని అంటారు...అదెలా?

సద్గురు: కానీ నిజానికి తెలుసుకోవడం అంటూ ఏమీలేదు.
ఒకే వస్తువు రెండువిధాలా కనిపిస్తోంది...
జీవుడుంటే దేవుడుండడు...
దేవుడుంటే జీవుడుండడు...
* * *
కుక్క కనబడితే రాయి కనబడలేదు...
రాయి కనబడితే కుక్క కనబడలేదు...
అనే మాట ఉంది...
ఒక ఇంటి ముందు రాతి కుక్క ఉన్నది...
అది రాయి అని తెలియనప్పుడు...
కుక్కే కనిపిస్తుంది...

భయపడతాడు...
తెలిసినప్పుడు రాయే కనిపిస్తుంది...
కుక్క కనబడదు...
అభయంగా ఉంటాడు...
* * *
నాణేనికి-
బొమ్మాబొరుసు లాగా ఈ జీవుడు, దేవుడు...
జీవుడు బొమ్మ...దేవుడు బొరుసు...
బొమ్మ వైపు చూస్తే బొరుసు కనబడదు...
బొరుసు వైపు చూస్తే బొమ్మ కనబడదు...
* * *
నీవిప్పుడు సాంబశివరావుగా ఉన్నావంటే...
ఇక దేవుడుండడు...
దేవుడున్నాడంటే, సాంబశివరావు ఉండడు...
* * *
ఏకకాలంలో-
కుక్క, రాయి...
బొమ్మ, బొరుసు...ఉన్నాయి కదా...
అంటారేమో...
ఉండొచ్చు గాక...
నీకు ఇప్పుడు అనుభవంలో ఉన్నదే లెక్క.
కుక్కను చూసేవాడికి రాతి అనుభవం లేదుకదా!
రాతి అనుభవం ఉన్నవాడికి కుక్కగా కనబడినా...
అది కుక్క అనుకోడు కదా!
కాబట్టి ఏదైనా ఒకటే ఉంటుంది...
అంటే "ఒకే అనుభవం" ఉంటుంది...
సాంబశివరావును కంటూనే
సాంబశివరావుగా ఉంటూనే
దైవాన్ని కనడం...

దైవంగా ఉండడం...
అసంభవం.
దైవమన్నా...దైవానుభవం అన్నా ఏమీలేదు...
"సాంబశివరావు లేకపోవడమే".
కాబట్టి-
సాంబశివరావుకు సాంబశివరావు అనుభవమే ఉంటుంది...
దైవానికి దైవానుభవం ఉంటుంది...
* * *
సాంబశివరావుకు దైవం తెలియదు.
దైవానికి సాంబశివరావు తెలియడు.
సాంబశివరావుకు తెలిసేదంతా సాంబశివరావే.
"నేను దేవుణ్ణి తెలుసుకున్నాను" అని సాంబశివరావు అన్నా కూడా...
దైవానికి తెలిసేదంతా దైవమే...
నాకు ప్రపంచం కనబడుతోంది అని దైవం అన్నా కూడా...
* * *
నీవు పోయాక దేవుడు కనబడతాడో...
దేవుడు కనబడ్డాక నీవు పోతావో...
నాకు తెలియదు...
కానీ "ఒకటే" ఉంటుంది యెప్పుడూ...
జీవుడుగానో...దేవుడుగానో...
* * *
ప్రస్తుతం సాంబశివరావుగా ఉన్నావు...
అలాగే ఉంటే పోలా...!
దేవుడిగొడవ మనకెందుకు?

59. సతీష్ (గురువుకళ్లలోకి చూస్తూ...)
మీ కళ్లలో గొప్ప తేజస్సు కనిపిస్తోంది...

సద్గురు: (నవ్వుతూ-)
నన్ను చూస్తుండేది మీరు కాబట్టి
మీలోని తేజస్సే అది.

మీలోని తేజస్సునే నాలో చూస్తున్నారు.
నా కళ్లలోనే కాదు...
ఎవరి కళ్లలోనైనా తేజస్సును చూడగలగాలి...
అదే సాక్షాత్కారం.

తెరమీద కనబడే దృశ్యానికి ఆధారమైన కాంతి
తెరలో నుంచి రాదు...
ప్రొజెక్టర్ లో నుంచి వస్తుంది.
అలాగే ఈ దృశ్యప్రపంచానికి ఆధారమైన కాంతి
నీలో నుంచే వస్తోంది...
సకలసృష్టికి కాంతిదాతవు నీవు.
అక్కడ కాంతి అంటే వెలుగు.
ఇక్కడ కాంతి అంతే ఉనికి.

ప్రధమం నీవే.
ద్వితీయం సతీషు.
తృతీయం జగత్తు.
చతుర్థం గురువు.
పంచమం దేవుడు.

60. సతీష్: ఇదంతా భావనే అంటారా?

సద్గురు: సతీషే ఓ భావన...
ఈ భావనకు కలిగే భావనలే మిగతావన్నీను.
ఈ సతీష్ అనే భావన ఎవరిది?
అని ప్రశ్న వేసుకోవాలి...
దానికి దొరికే సమాధానమే - నేను.
ఆ "నేను" సతీష్ కాదు.
నీవు కనే కలలో సతీష్ ఓ భాగం అంతే.
నీవు కలను కనేవాడివి...కలలో ఉన్నవాడివి కావు.
నీవు కలను కనడం - సతీష్ జననం.
నీవు కలను కొనసాగించడం - సతీష్ జీవితం.

నీవు కలను ముగించడం - సతీష్ మరణం.
నీవు సతీష్ కావు...
నీకు జనన-జీవిత-మరణాలు లేవు...
"ఇది ఒక కల" అని జ్ఞప్తి ఒక్కటి ఉంటే చాలు...
ఇక ఏ సాధనా అవసరం లేదు.

61. సతీష్: వివాహం చేసుకోవాలని అనుకుంటున్నాను....

సద్గురు: చేసుకోండీ....

62. సతీష్: సంబంధాలు చూస్తున్నాంగానీ...
నచ్చిన అమ్మాయి దొరకడం లేదు...

సద్గురు: కావలసింది-
మీకు నచ్చే అమ్మాయి కాదు...
మిమ్మల్ని నచ్చే అమ్మాయి...
అప్పుడే మీరు సుఖపడతారు...

63. సతీష్: నాలోని భయాన్నీ తీసేయండీ...

సద్గురు: ఉంటే కదా తీసేయడానికి...
లేనిదానిని ఉంది అనుకోవడమే భయం.

64. సతీష్: మీ అనుగ్రహం కావాలి...

సద్గురు: ఉంది అనుకుంటే "ఉంటుంది".
అది నేనిచ్చేది కాదు...

65. సాంబశివరావు: నాకు సత్యం కావాలండీ...

సద్గురు: ఇంతవరకు సత్యం ఎవరికీ దొరకలేదండీ...

66. పృచ్ఛకుడు: మనసు స్థిరంగా ఉండాలంటే ఏం చేయాలి...?

సద్గురు:
స్థిరంగా ఉన్నా ఒకటే...
స్థిరంగా ఉండకపోయినా ఒకటే...

అని తెలిస్తే...అప్పుడు తెలుస్తుంది...
స్థిరత్వం అంటే  ఏంటో...

67. పృచ్ఛకుడు: ఆత్మ అంటే?

సద్గురు: నేను.

68. గౌరి: మోక్షం అంటే?

సద్గురు: నేను ప్రక్కన 'గౌరి' అని వ్రాస్తేనే
సరిపోయే నేను...
నేను ప్రక్కన ఏది వ్రాసినా సరిపోయే
నేనుగా మారుకోవడమే మోక్షం.

ఇది మాత్రమే నేను అని ఉన్న నేను...
సకలమూ నేనే అని ఉండే నేనుగా మారుకోవడమే
మోక్షం...

వెలుపల...వ్యవహారంలో... వ్యక్తిమాత్రంగానే ఉండాలి...
లోపల...అనుభవంలో... సర్వత్రా తానే అయి ఉండాలి.

నన్ను తల్లిదండ్రులు కన్నారనేది అబద్ధం...
నాతో సకలాన్ని నేను కన్నాను అనేది వాస్తవం...
దేవుడు కూడా నేను కన్నవాడే...
నేనులో నుంచే గౌరీతో సహా సకలమూ పుడుతుంది...
ఉంటుంది...
తిరిగి గౌరీతో సహా సకలమూ...
నేనులోనే లయం అయిపోతుంది...

69. గౌరి: మరి అఖండమైన ఆ వస్తువు యెందుకు ఇన్ని డివిజన్లుగా
అయ్యింది?

సద్గురు: యెందుకు అవకూడదు...?

రాముడి డైలాగులు వ్రాసిందీ వాల్మీకియే...
రావణుడి డైలాగులు వ్రాసిందీ వాల్మీకియే...

ఇంతకీ వాల్మీకి రాముడా? రావణుడా?

70. గౌరి: ఇద్దరూ తానే...

సద్గురు: వాల్మీకిని మరిస్తే...ప్రతిపాత్రా దేనికది సత్యమే...
వాల్మీకి జ్ఞప్తిలో ఉంటే...వాల్మీకి మాత్రమే సత్యం...
"నేను"ను మరిస్తే సకలమూ సత్యమే...
"నేను" జ్ఞప్తిలో ఉంటే "నేను" మాత్రమే సత్యము...

రచయిత సృష్టించిన హీరోపాత్ర ధనవంతుడై...
సకలభోగాలను అనుభవిస్తుంటాడు...
కానీ ఆ రచయిత అద్దె ఇంట్లో ఉంటాడు...
సృష్టిలోని అన్నిటికీ అన్ని అనుభవాలూ ఉంటాయి...
సృష్టికర్తకు ఏ అనుభవమూ ఉండదు...

71. పృచ్ఛకుడు: సృష్టి చేయవలసిన అవసరం భగవంతునికెందుకు కలిగింది?

సద్గురు: మెలకువలో ప్రశ్న తొలగదు...
నిద్రలో ప్రశ్న కలుగదు...

72. పృచ్ఛకుడు: మరి నిద్రలో ఉన్నట్టు...
మెలకువలో ఉండలేంగా...

సద్గురు: కర్తృత్వభావన లేకుంటే...
మెలకువ కూడా నిద్రతో సమానమే...

73. పృచ్ఛకుడు: ఇది నాలాంటి పామరులకు అసాధ్యం...

సద్గురు: "నేనున్నాను" అని అనుకోవడం పామరత్వం.
"నేను లేను" అని తెలియడం పాండిత్యం.

74. పృచ్ఛకుడు మీరు చెప్పిన స్థితికి నాలాంటి వారు చేరడం కష్టమండీ...
పెద తిరుమలాచార్యులు నాలాంటి వారికోసం...
ఒక కీర్తన రాశారు...
ఎక్కడి మానుషజన్మంబెత్తిన ఫలమేమున్నది...

సద్గురు: అది పెదతిరుమలాచార్య సమస్య...
ఆయన నీ కోసం వ్రాయలేదు...

75. పృచ్ఛకుడు: చాలా జీవితాలు అలానే ఉంటాయండీ...

సద్గురు: అన్ని జీవితాలు లేవు...
ఉండేది నీ ఒక్కని జీవితమే...

76. పృచ్ఛకుడు: కానీ తత్వం బోధ పడలేదు...
ఆచరణ మార్గం తెలియరాలేదు...

సద్గురు: ఆచరణకు వీలైనది ఆచారం...
ఆచరణకు వీలుకానిది వేదాంతం...

77. పృచ్ఛకుడు: సృష్టిలో జ్ఞానులూ ఉన్నారు...
అజ్ఞానులూ ఉన్నారు...
మరి సృష్టికర్త జ్ఞానా? అజ్ఞానా?

సద్గురు: రెండూ ఆయనే...
జ్ఞాని, అజ్ఞాని ఇద్దరూ జ్ఞానులే...
ఒక్కో జ్ఞాని వ్యక్తమౌతాడు...
ఒక్కో జ్ఞాని అజ్ఞానిగా మారువేషంలో ఉంటాడు...
రాజు రాజుగా సింహాసనం మీదున్నా రాజే...
మారువేషంలో రాజ్యంలో తిరుగుతున్నా రాజే...

తెలియబడిన జ్ఞాని - జ్ఞాని.
తెలియబడని జ్ఞాని - అజ్ఞాని.

ఒకర్ని అజ్ఞాని అనడం ఎంత అవమానించడమో...
ఒకర్ని జ్ఞాని అనడం కూడా అంత అవమానించడమే...

'ప్రత్యేకత' చూపడం జ్ఞానికి నచ్చదు...
'ప్రత్యేకత' చూపకపోవడం జ్ఞానలక్షణం...

ప్రత్యేకత వలనే ప్రపంచానుభవం...
ప్రత్యేకత లేకుంటే ఏకత్వానుభవం...

ప్రత్యేకత ఉంటే ద్వైతం...
ప్రత్యేకత లేకుంటే అద్వైతం...
* * *
చెట్టు మీద పక్షి ఉండడం చూసి...
చెట్టు మీద పక్షి ఉంది...అన్నాడొకడు...
పక్షి ఎగిరిపోయింది...
ఇంకొకడు చూసి...చెట్టు మీద ఏ పక్షీ లేదన్నాడు...
ఇద్దరూ సత్యమే చెప్పారు...
కానీ సత్యం ఒకటే ఉంటుంది...
కాబట్టి చెప్పబడే సత్యాలన్నీ అసత్యాలే...
చెప్పేవాడు ఒక్కడే సత్యం.

సత్యానికి రంగు-రుచి-వాసన ఉండవు.
యెవడి "అనుభవం" వాడికి సత్యం.

అనుభవింపబడేది సత్యం కాదు.
అనుభవించేవాడు సత్యం.

ఇది అసత్యం...అది సత్యం.
అని గుర్తించే నీవు సత్యం.

వీడు అజ్ఞాని...వాడు జ్ఞాని.
అని గుర్తించే నీవు జ్ఞానం.

78. పట్టెయ్య: నేను పట్టెయ్య అనేది, అనుకునేది పట్టెయ్య కాదా...!

సద్గురు: పట్టెయ్య-పట్టెయ్య అని నీవు అనుకుంటున్నావు...
నీవు పట్టెయ్య కాదు...
నిద్రలో పట్టెయ్య ఉండడు...
నిద్ర లేవగానే మీకు మొదటగా కనిపించే వ్యక్తి పట్టెయ్య...
తిరిగి నిద్రపోయేవరకు పట్టెయ్యతో తిరిగి తిరిగి...
అందరూ పట్టెయ్య-పట్టెయ్య అని పిలిచి పిలిచి...
"నేను" పట్టెయ్యతో మమేకం అయిపోయి...

రెండూ ఒకటైపోయినట్టు అనిపిస్తుందిగాని....
రెండూ ఒకటి కాదు...
"నేను పట్టైయ్య" అనడంలోనే...
నేను, పట్టైయ్య ఇద్దరున్నామని చెప్పినట్టే...
పోలీసుడ్యూటీలో క్రొత్తగా జాయిన్ అయినవానికి...
107 నెంబరు ఇస్తారు...
మొదట్లో S.I ఆ నెంబరుతో పిలిచినప్పుడు...
పలుకడు...
అలా కొద్ది రోజులు పిలువగా, పిలువగా...
తాను ఆ నెంబరుతో మమేకం అయిపోతాడు...
అలా తాను పట్టైయ్యతో మమేకం అయ్యి...
పట్టైయ్య అయ్యాడేగానీ...
తాను పట్టైయ్య కాదు...
పేర్లు అనేకం....ఈ పేర్లు తీసేస్తే...
అందరిలో ఉన్న "నేను" ఒక్కటే శేషిస్తుంది...

79.ఓ ఆగంతకుడు:(గురుబోధలు విని ఆశ్చర్యపోయి..
గురుసేవకుడైన చెంగల్వరాయరెడ్డివైపు తిరిగి...)
గురువు చెప్పే సబ్జక్టు మీకు అర్థమవుతుందా?

సద్గురు: "అర్థం కాకనే అనుభవిస్తున్నాం".

* * *

సద్గురు: ఒకటి జ్ఞానపూర్ణం కానట్టు
మరొకటి జ్ఞానపూర్ణం అయినట్టు
రెండు రకాలుగా కనిపిస్తుంది.
కానీ మొత్తం జ్ఞానపూర్ణమే.

80. పట్టైయ్య:
అలా కొన్ని చోట్ల జ్ఞానపూర్ణం కానట్లు అనిపించడం
మాయాదోషమా?

సద్గురు: పట్టెయ్య ఉండడమే దోషం.

81. సాంబశివరావు: మానావమానాలను, లాభనష్టాలన సమానంగా స్వీకరించమన్నారు భగవద్గీతలో... నాకు సాధ్యం కావడం లేదు గురువుగారూ...

సద్గురు: అది వ్యక్తిత్వభావనలో ఉన్నవారికి చెప్పబడింది...
"నేను సాంబశివరావు" అనుకునేవాడికి చెప్పబడింది భగవద్గీత...
'నీవు సాంబశివరావు కాదు' అనేది భగవద్గీత సారాంశం...
అర్జునుడు...భగవద్గీతను విని...
కర్త నేను కాదని తెలుసుకొని...
కర్తవ్యనిర్వహణ(యుద్ధం) చేసినట్లు...
నీవు కూడా సాంబశివరావుకు విడిపడి...
అలా నీ కర్తవ్యాన్ని నిర్వహించాలి.

విశ్వరూపసందర్శనంలో...
జరగబోయే సినిమాను చూసేశాడు అర్జునుడు.
తాను కేవలం ప్రేక్షకుడే...
దర్శకుడు భగవంతుడే...
అని తెలుసుకునేశాడు అర్జునుడు.
నష్టో మోహః అంటూ...
యుద్ధరంగంలోకి దూకేశాడు అర్జునుడు.

నీ జీవితం కూడా చిన్న కురుక్షేత్రమే...
పోరాటం తప్పదు...
పోరాడాలి తప్పదు...
జయాపజయాలనేవి క్రీడలో భాగమే.

క్రీడకు లోపల అందరం ప్రత్యర్థులం.
క్రీడకు బయట అందరం స్నేహితులం.

క్రీడ మొదలు పెట్టే ముందు
మనమందరం చేసుకున్న నింబంధనే ప్రారబ్ధం.

82. శ్రీధర్: "నేను" అంటే ఏమి?

సద్గురు: ఇప్పుడు-ఇక్కడ-ఇలా అనేదే నేను...

83. శ్రీధర్: కేవలం ఆత్మానుభవం ఉండదా?

సద్గురు: "అప్పుడు మీరు ఉండరు...
కేవలం ఆత్మానుభవమే ఉంటుంది.
మీరు ఉండి ఆత్మానుభవం పొందడం అంటూ ఉండదు..."

84. శ్రీధర్: మొత్తానికి మనం చేయవలసింది...
అన్నిటినీ అంగీకరించడమే...

సద్గురు: అంతకు మించి చేసేది కూడా ఏమీలేదు.

85. శ్రీధర్: బంధం ఎలా తొలగుతుంది?

సద్గురు: తొలగాల్సిన అవసరం ఏముంది...?

86. శ్రీధర్: కానీ మానవమేధస్సుకు అందనిది ఏదో ఉంది...

సద్గురు: దానిని ఎవడూ చెప్పలేడు.

87. శ్రీధర్: అదే ultimate తత్త్వము...

సద్గురు: ఆ ultimate తత్త్వమే నేను-నేను అంటోంది...

88. శ్రీధర్: ఆలోచన అంటే?

సద్గురు: సత్యం యొక్క రూపాంతరమే ఆలోచన.

89. శ్రీధర్: జీవితంలో ఎలా ఉండాలి?

సద్గురు: ఎలా ఉన్నా అది జీవితమే.

90. శ్రీధర్: దేన్నీ మార్చలేమా?

సద్గురు: మార్చండి చూద్దాం...

91. భార్గవి:
ఈ దేవుళ్ళను మనం సృష్టించినవారే
అంటున్నారు కదా మీరు...!
మరి వేంకటేశ్వరస్వామిని స్వయంభూ అంటారు కదా?

సద్గురు:
మీరు 'నేను' అంటున్నారు కదా!
ఆ 'నేను' అనేదే స్వయంభూ.

'మీరే స్వయంగా స్వయంభూ'
మీరు వచ్చిన తరువాత మీలోనుంచి వచ్చిన
ప్రతిదీ స్వయంభూయే...

92. భార్గవి: 'అంతా స్వయంభూ' అయితే
అందరూ దేవుళ్లేనా?

సద్గురు: 'అంతా స్వయంభూ అని అనుభవంలో ఉన్నవాడు స్వయంభూ.

93. భార్గవి: కాలమంటే?
సద్గురు: నీవుండడమే.

94. పట్టెయ్య: జిడ్డుకృష్ణమూర్తిగారి వాక్యాలు, మీ వాక్యాలు ఒక్కలాగే ఉంటాయి స్వామీ....

సద్గురు: ఒకే శ్రుతిలో ఉండే వాయిద్యం ఏ ఊరిలో వాయించినా, ఎవరు వాయించినా మార్పు కనిపించదు.

95. పట్టెయ్య: శంకరులు అద్వైతస్థాపనకే అవతరించారని అంటారు...

సద్గురు: అద్వైతం అనేది ఒకరి చేత స్థాపించబడింది కాదు.
అందరూ, అన్నీ అద్వైతంలో స్థాపించబడి ఉన్నాయి.

96. పట్టెయ్య: మీరిప్పుడు చెబుతోంటే తెలుస్తోంది...
అన్నింటినీ తెలుసుకునే తెలివి ఒకటుందని, దేనినీ అంటక ఉందని...

సద్గురు: దానివల్లనే ఇదంతా తెలుస్తోంది.
వీటి వల్ల 'అది' తెలియబడదు.

97. పట్టెయ్య: ఇంత క్లారిటీగా తెలియబడేది దానివల్లనేనా?

సద్గురు: ఈ క్లారిటీతో దానిని తెలుసుకోలేం.

98. పట్టెయ్య: ఈ క్లారిటీ కూడా దాన్ని తెలుసుకోవడానికి
ఉపయోగపడదా?

సద్గురు: క్లారిటీ అంటేనే, క్లారిటీ లేనిది ఒకటి ఉంటేనే, క్లారిటీ అనే పదాన్ని ఉపయోగించే అవసరం వస్తుంది.

99. పట్టెయ్య: కాబట్టి దానికి ఇదేదీ లేదు. దీనికి ఉపయోగం ఏమిటి?

సద్గురు: ఉపయోగం లేదని తెలియడమే ఉపయోగం.

* * *

సద్గురు: జ్ఞానికి వినాలనే కోరిక ఉండదు.
వినబడుతుంటే వినడం జరుగుతుంది.

కనాలనే కోరిక ఉండదు.
కనబడుతుంటే చూడడం జరుగుతుంది.

తలవాలనే కోరిక ఉండదు.
తలంపులొస్తే తలవడం జరుగుతుంది.

ఇది చేయాలి, ఇది చేయకూడదు...అని ప్రత్యేక సంకల్పమేమీ ఉండద తనలో.

100. పట్టెయ్య: Empty గా ఉంటాడన్నమాట...

సద్గురు: పూర్ణంగా ఉంటాడు.

101. పట్టెయ్య: Empty అంటే అది నాస్తికత్వం అయిపోతుందన్నమాట...

సద్గురు: నాస్తికత్వం అనేది కూడా తత్త్వాల్లో అదొక తత్త్వం.
నాస్తికత్వమనేది తప్పేమీ కాదు.

నాణేనికి బొమ్మ-బొరుసు లాగా ఈ ఆస్తికత్వం-నాస్తికత్వం.

102. పట్టెయ్య: నాస్తికత్వం తప్పు కాదాండీ...

సద్గురు: పరిపూర్ణ నాస్తికుడు, పరిపూర్ణ ఆస్తికుడు ఇద్దరిస్థితి ఒకటే.

ఏదైనా సరే పూర్ణంగా ఉండాలి.
అది కొంచెం, ఇది కొంచెం ఉంటేనే ఇబ్బంది...

పూర్ణనాస్తికుడూ ఏమీ మాట్లాడడు, పూర్ణ ఆస్తికుడూ ఏమీ మాట్లాడడు.

మాట్లాడేవాళ్లంతా అది కొంచెం, ఇది కొంచెం ఉన్నవాళ్లే.

నాస్తికుడికి ఏ మూలో దేవుడున్నాడేమోనని అనుమానం ఉంటుంది. అందువల్లనే దేవుడు లేడని వాదిస్తాడు.

ఆస్తికుడికి ఏ మూలో దేవుడు లేడేమోనని అనుమానం ఉంటుంది. అందువల్లే దేవుడు ఉన్నాడు అని వాదిస్తాడు.

పూర్ణనాస్తికుడైనా, పూర్ణ ఆస్తికుడైనా వాదించరు.

103. పట్టెయ్య: సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః
-భగవద్గీత 18-66

గురువుగారూ! భగవద్గీతలోని ఈ చరమశ్లోకాన్ని కాస్త వివరించండి స్వామీ...

సద్గురు: ఇంతకీ 'ధర్మం' అంటే ఏమి?

104. పట్టెయ్య: తమరే వివరించండి స్వామీ...

సద్గురు: మీరు అన్నిటికీ 'నేను' అని వ్యవహరిస్తుంటారు కదా... ఆ 'నేను' తర్వాత వచ్చే ప్రతి అక్షరమూ, ప్రతి తలపూ, ప్రతి వ్యవహారమూ ఆ 'నేను' యొక్క ధర్మమే అవుతుంది. ఆ ధర్మాన్ని త్యజించమని చెప్పింది...

మామేకం శరణం వ్రజ...కు అర్థం 'నేను' అంటే కృష్ణుడు అని కాదు...కృష్ణుడు కూడా ఆ 'నేను'కు శరణువేడినవాడే.

'నేను'కు శరణువేడడమంటే,
వ్రక్తిగతమైన నేను, సర్వగతమైన నేనుగా మారుకోవడమే.

'నేను' ఒక్కటే పరమధర్మం.
'నేను' తర్వాత వచ్చే ప్రతీది సాపేక్షధర్మములు.
సాపేక్షధర్మములన్నీ పాపములే.

'నేను' అనేది పరమధర్మము.
పట్టెయ్య అనేది పాపము.

105. పట్టెయ్య: ధర్మము అనే మాటకు పాపము అనే అర్థం తీసుకోలేకపోతున్నాను స్వామీ...

సద్గురు: తెలియనంతవఱకు 'ధర్మం'గా ఉంటుంది.
తెలిసిన తర్వాత 'పాపం'గా గోచరిస్తుంది.

కృష్ణుడు, అర్జునుడు, వ్యాసుడు...అందరూ 'నేను' తర్వాత వచ్చినవారే.

106. పట్టెయ్య: చరమశ్లోకాన్ని ఈ విధమైన అర్థంలో వినడం ఇదే తొలిసారి స్వామీ...

సద్గురు: మీతో పాటు నేను కూడా ఇప్పుడే విన్నాను...
ఇప్పుడే తెలుసుకున్నాను...

107.బాబు: కృష్ణుడు పుట్టలేదు...పుట్టినట్టు కనిపించాడు...

సద్గురు: కృష్ణుడే కాదు, అందరూ అంతే...పుట్టినట్టు కనిపిస్తున్నారేగాని ఎవరూ పుట్టలేదు...

108. ఒకరు: గురువుగారూ...! మరణించిన తరువాత ఉన్న స్థితి ఏమి?

సద్గురు: నేనింకా మరణించలేదు.  మరణించినవానికొక్కనికే ఆ రహస్యం తెలుసును.
జీవించి ఉన్నవానికి మరణం తెలియదు.
మరణించినవానికి ప్రపంచం తెలియదు.
ఆ ప్రశ్నకు సమాధానం ఎప్పటికీ దొరకదు.
* * *

మౌనభాషణం - 1

---

మనసుకు అందని మౌనం
సద్గురు నోట మధురమైన మాటగా ప్రకటింపబడి
'బాబు'గారి శైలితో మరింత సొగసును అద్దుకుని
చూడ్డానికి ఓ పూవులా కనబడి,
అహంభావానికి గొడ్డలిపెట్టుగా మారి
మన హృదయాలలో 'జ్ఞానముద్ర' పడడానికి ముద్రించిన జ్ఞానగ్రంథమే ఈ 'మౌనభాషణం'.
* * *

వ్యక్తి - శిష్యుడు.
శక్తి - గురువు.
తనతో తాను సంభాషిస్తున్నట్టు గురువుకు తెలుస్తుందేగానీ, ఆ విషయం శిష్యుడికి తెలియదు.
తెలిసిననాడు గురువూ లేడు, శిష్యుడూ లేడు.
ఏకాత్మస్వరూపమే అక్కడ శేషిస్తుంది.
ఇదొక ఆట అంతే.
ఈ ఆటకు పుస్తకరూపమే ఈ 'మౌనభాషణం'
* * *
సద్గురు సూక్తులు జ్ఞానవంతమైనవి.
పామరులకు సైతం అర్థమయ్యే సులభరీతిని కలిగినవి.
ఆలోచింపచేసేవి.
చివరికి ఆలోచన లేకుండా చేసేవి.
* * *
నా అహమనే పాతభవనాన్ని కుప్పకూల్చారు
రమణ భగవానులు.
ఆ స్థానములో నూతన భవనాన్ని నిర్మించారు
సద్గురు సుబ్రహ్మణ్యులు.
శిల్పి శిలను శిల్పంగా మలచినట్లు
గురువు జడమైన నన్ను 'జ్ఞానశిశువు' గా మలిచారు.
* * *
మనం వెతికేది మనకు కనిపించనప్పుడు
అజ్ఞానులుగా ఉంటాము.
మనకు కనిపించేదే మనం వెదికేది అని తెలిసినప్పుడు
అదే జ్ఞానము, అదే దైవదర్శనము, అదే సద్గురుతత్త్వము.
మరి అటువంటి సద్గురుతత్త్వాన్ని తన డైరీలలో పదిలపఱచి ప్రేమతో మనకు అందజేసిన T.V.N.బాబుగారు...
సద్గురువైభవాన్ని నలుదిశలకు వెళ్లి ప్రకటించిన పట్టెయ్యగారు...
ధన్యజీవులు.

వీరికి ధన్యవాదములు.
సద్గురుదేవులవారికి శతకోటివందనములు.
* * *
ఉయ్యాల్లో నిద్రపోతున్న శిశువుకు తటాలున మెలకువ వచ్చి
అమ్మ కోసం ఏడ్చినట్లు
పరమవిశ్రాంతి స్థానమైన 'జ్ఞానాంబ ఒడి' కోసం
ఏడ్చే జ్ఞానశిశువుల కోసమే ఈ 'మౌనభాషణం'.
చదవండి...
'తరించే ఉన్నాం' అని తెలుసుకోండి...
* * *
-సారిపల్లి వేంకటకృష్ణవేణి
M.Sc., Organic Chemistry
రాచపల్లి. తూ.గో.జిల్లా.
* * *
నాకు సద్గురుదేవులవారు 1992 నుండి తెలుసును.
మా సమీపబంధువు మరియు మిత్రులు అయిన T.V.N. బాబు
సద్గురుబోధలను సిగరెట్ పెట్టె అట్టల మీద రోజుకో సూక్తి వ్రాసిస్తూ
వుండేవాడు...
'ఆధ్యాత్మికం' అనే పేరు కూడా తెలియని నాకు
ఆ సూక్తుల వలన నాలో ఆధ్యాత్మికాసక్తి కలిగి నన్ను సద్గురు సన్నిధికి
చేర్చింది.
ఆ రోజుల్లో నాకు బాబు వ్రాసిచ్చిన ఆ చిన్న చిన్న సూక్తులే ఈ రోజు
'జ్ఞానప్రసూనాలు' అనే పేరుతో బృహత్ గ్రంథం తయారయ్యింది.
* * *
ఆధ్యాత్మికంలో  అన్ని స్థాయిలలో ఉన్నవారందరికీ ఇందులో ఏ ఒక్క
వాక్యమైనా సరే ట్యూన్ అవక తప్పదు. ఆ ఒక్క సూక్తి తమ 'స్థితి'ని
బలపరచక తప్పదు. ఆ ఒక్క సూక్తి ఏదన్నది తెలియాలంటే,
జ్ఞానప్రసూనాలు అన్నింటినీ చదువవలసిందే.
* * *
శుకమహర్షి కొత్తగా తెలుసుకోవలసిన విషయం ఏమీ లేనప్పటికీ జనకుని

వద్ద సర్టిఫికేట్ పొందినట్లు, జ్ఞానులకు సర్టిఫికేట్ లాంటిది ఈ 'జ్ఞానప్రసూనాలు'.
నేను ఇంత ధీమాగా ఎందుకు చెబుతున్నానంటే- ఈ జ్ఞానప్రసూనాలు కేవలం జ్ఞానప్రసూనాంబిక దయాహృదయం నుండి వెలువడి, సద్గురుదేవుల వారి వాగ్రూపంగా వ్యక్తమై, బాబు కలం నుండి జాలువారిన అక్షరరూపమే ఈ జ్ఞానప్రసూనాలు.
ఈ జ్ఞానప్రసూనాలు ముక్తి పొందినవారికేగాని, పొందాలి అనుకునేవారికి కాదు. ఈ 'మౌనభాషణం' అనే ఈ జ్ఞానప్రసూనం మీ చేతికి వచ్చిందంటేనే దాని అర్థం- మీరు పొందినవారే అని.
* * *
అరుణాచలం కొండ శిఖరాన పొందే అనుభూతి లాంటిది సద్గురు సన్నిధి. అక్కడ 'ఒకటి' తప్ప ఇంకేమీ కనిపించదు; అనిపించదు.
* * *
గురుభక్తులైన పట్టెయ్యగారు సద్గురు దేవులవారితో సలిపిన సంభాషణలను T.V.N. బాబు తన డైరీలలో దాచి ఉంచారు. ప్రస్తుతం వాటినే 'మౌనభాషణం' పేరుతో ప్రపంచంలో ప్రకటించడం జరిగింది.
వండిన కూరను అమ్మ తన అరచేతిలో కాస్త వేసుకుని రుచి చూచినట్లు ఈ పుస్తకం కేవలం రుచి చూపించడం కోసమే. తృప్తిగా ఆస్వాదించాలంటే సద్గురుసన్నిధిని ప్రత్యక్షంగా అనుభవించాల్సిందే...వేఱే మార్గం లేదు.
* * *
రమణసత్సంగాన్ని అన్ని విధాలా ఆదుకుని సద్గురుతత్త్వ పరిమళం నలుదిశలకూ వ్యాపించిందంటే దానికి ముఖ్యులు నలుగురు-
1. T.V.N.బాబు
2. పొన్నారావు
3. మునికృష్ణారెడ్డి
4. పట్టెయ్య
వీరికి సద్గురు ఆశీస్సులు నిండుగా ఉండాలని ఆశిస్తూ...సద్గురుదేవులవారికి సాష్టాంగప్రణామాలు....
* * *

రామాయణం రాఘువులు.
శ్రీరమణ సత్సంగం
శ్రీకాళహస్తి
* * *

సద్గురు: నీ వలన దేవునికి గానీ
దేవుని వలన నీకుగానీ
నీ వలన నీకు గానీ
దేవుని వలన దేవునికి గానీ
ఎట్టి ప్రయోజనం లేదు...
ఈ ఒక్క విషయం అర్థమైతే
నీవు ముక్తుడవే.

1. పట్టెయ్యి: నా వలన దేవునికి ప్రయోజనం లేకపోవచ్చునేమోగానీ
దేవుని వలన నాకు ప్రయోజనం ఉందని భావిస్తున్నానండీ...

సద్గురు: మీరన్న మాటలోనే ఉంది...
'భావిస్తున్నాను' అని.
నిజమే... అది ఓ భావన మాత్రమే.

2. పట్టెయ్యి: భావించడం అంటే, నా ఉద్దేశం దేవుని వలన నాకు
ప్రయోజనం ఉంటుందనే కదా...సద్గురువునుగాని, దేవుణ్ణిగానీ
ఆశ్రయించడం...!

సద్గురు: భావించడం మాత్రమే అది.
ఇద్దరూ వేఱు వేఱు అనుకోవడం వల్లనే
ఆ భావం పుడుతోంది.

3. పట్టెయ్యి: దేవుని వలన నాకు ప్రయోజనం లేదనే విషయాన్ని
నేను అంగీకరించలేకపోతున్నాను స్వామి...

సద్గురు: అంగీకరించకపోవడం తప్పేమీ కాదు...

4. పట్టెయ్యి: అంటే నేను ప్రతి కార్యమూ...
దేవుని వలన లేదా గుర్వనుగ్రహం వలన జరుగుతోంది...

అనే అభిప్రాయం నాకుండడం వల్ల
ఈ మాటను జీర్ణించుకోలేకపోతున్నాను స్వామీ...
సద్గురు: అవును...అది కొంచెం అజీర్ణమే...

5. పట్టెయ్య: ఈ ఒక్క విషయం అర్థమైతే
నీవు ముక్తుడవే...
అనే చివరివాక్యాన్ని బట్టి...
విషయం నాకు అర్థం కాలేదనే కదా!
దేవుని వల్ల నాకు ప్రయోజనం లేదంటే ఎలా?
నేను జీవించడమే కుదరదు గదా!

సద్గురు: మీకు భిన్నంగా దేవుడున్నాడా?
ఎక్కడున్నాడు? ఎప్పుడున్నాడు?
అనేది ముందు తేల్చండి...
ఇంతకుముందే మా సత్సంగంలో ఓ విషయాన్ని ప్రస్తావించుకున్నాము-
కాలానికి భిన్నంగా ఏదయినా ఉందా?
అంటే, కాలానికి సంబంధించకుండా ఏదయినా జరుగుతోందా?

6. పట్టెయ్య: లేదు స్వామీ...

సద్గురు: అంటే, నాకు కాలం ఆధారంగా ఉంది.
కాలం ఆధారంగా ఉండే నేను 'పట్టెయ్య'.
అసలు కాలమనేదానికి ఉనికి ఉందా?
సరే ఉంది అనుకుందాం...
ఆ కాలానికి ఏది ఆధారంగా ఉంది?
ఎవరు ఆధారం?

7. పట్టెయ్య: 'ఈశ్వరుడు' అని అనుకుంటున్నాము...

సద్గురు: ఈశ్వరుణ్ణి ప్రస్తుతం వదిలేద్దాం...
మీరు మేల్కొని ఉన్నప్పుడు కాలం ఉంది.
స్వప్నంలో ఉన్నప్పుడూ కాలం ఉంది.
గాఢనిద్రలో ఉన్నప్పుడు మాత్రం మీరూ లేరు, కాలమూ లేదు.

ఇప్పుడు కాలానికి ఎవరు ఆధారము?
ఏది ఆధారము?
ఎవరుంటే కాలం ఉంటోంది?

8. పట్టెయ్య: అవును స్వామీ...
జాగ్రత్ స్వప్నావస్థలో కాలం ఉంది.
సుషుప్తావస్థలో కాలం లేదు.

సద్గురు: కాబట్టి కాలం తోచే అవస్థల్లోనూ
కాలం తోచని అవస్థలోనూ నీవున్నావు.
కానీ ఆ 'నీవు' పట్టెయ్య కాదు.

పట్టెయ్య జాగ్రత్ స్వప్నావస్థల్లో మాత్రమే ఉన్నాడు.
సుషుప్తిలో లేడు.
అని మీరే చెబుతున్నారు...

కాబట్టి రెండు స్థితుల్లో ఉండి, ఒక స్థితిలో లేకపోవడం అనేది 'ఉనికి'కి అది లెక్క(ప్రమాణం)కాదు.
ఉనికి అనేది స్థితులతో సంబంధం లేకుండా ఉండాలి.

కాబట్టి జాగ్రత్ స్వప్నావస్థల్లో ఉండే నేను
కాలాన్ని ఆధారంగా చేసుకుని వ్యవహరిస్తుంది.
సుషుప్తిలో ఉండే అదే నేను కాలానికే ఆధారమై ఉంది.

కాలం మీద ఆధారపడి ఉన్న నేను ఒకటి.
కాలానికి ఆధారంగా ఉన్న నేను ఒకటి.

ఇది రెండు నేనులుగా కనిపించే ఒకే "నేను".
బింబ-ప్రతిబింబములు వలె.

'ప్రతిబింబం' ఉండాలంటే అద్దం అవసరం.
'బింబం' ఉండడానికి అద్దం అవసరం లేదు.

కాలం అవసరమై ఉన్న నేను - పట్టెయ్య.
కాలానికి ఆధారమై ఉన్న నేను - ఈశ్వరుడు.

కాబట్టి రెండు నేనులుగా కనిపించే "నేను"కు
తనతో(దేవునితో) తనకు(పట్టెయ్యకు) ప్రయోజనం ఏముంటుంది?

బంగారం వలన ఇతరులకు ప్రయోజనం ఉంటుందిగాని...
బంగారం వలన బంగారానికి ప్రయోజనం ఏముంటుంది?
దేవుడికి ఇతరం లేదు కాబట్టి
'ప్రయోజనం' అనే మాట అసంబద్ధం absurd.
కాలాన్ని ఆధారం చేసుకుని ఉన్న నేనుకు(పట్టెయ్యకు) ఇతరం తోస్తోంది కాబట్టి...
కాలానికి ఆధారమైన "నేను" వలన 'ప్రయోజనం' ఉంటుంది...
ఎలాగూ ఆ "నేను" ఈ నేను ఒకటే అని మీరే అంగీకరించారు...

9. పట్టెయ్య: అంటే అది అంగీకారమాత్రంగానే ఉందిగాని...
అనుభవానికి వచ్చేసరికి పట్టెయ్యను వేఱుగా చూడడం జరుగుతోంది...

సద్గురు: 'అనుభవం' అనేది కూడా పట్టెయ్యకు సంబంధించినదే.
కాలానికి ఆధారంగా ఉన్న "నేను"కు ఏ అనుభవమూ ఉండదు.

* * *

మరొక కోణంలో చూస్తే-
అనుభవాలన్నీ కాలానికి ఆధారంగా ఉన్న "నేను" యొక్క అనుభవాలే.

ఆ "నేను" లేక పట్టెయ్య లేడు కాబట్టి
ఆ "నేను"ను ఆధారం చేసుకునే మూడవస్థలూ ఉన్నాయి.
రెండవస్థల్లో మాత్రమే ఉన్న నేనుకు(పట్టెయ్యకు)
మూడవస్థల్లోనూ ఉన్న "నేను" ఆధారంగా ఉన్నది కాబట్టి...
తన వలన తనకు ప్రయోజనం అనేది కుదరదు.
యెందుకంటే "నేను" కు ఇతరం లేదు కనుక.
ఇంకో నేనుకు (ప్రత్యేక)ఉనికి లేదు కనుక.

10. పట్టెయ్య: అంటే, ఇప్పుడు పట్టెయ్యగా వ్యవహరించేది సాక్షాత్తు ఈశ్వరుని యొక్క తత్త్వమే అని అంగీకరించి ఉండాలంటారా?

సద్గురు: తత్త్వం కాదు. సాక్షాత్తు ఈశ్వరుడే...
ఇక్కడ సమస్య ఏమంటే-
పట్టెయ్యి ఈశ్వరుణ్ణి అనుభవించాలని చూస్తున్నాడు...
కానీ  ఈశ్వరుడే పట్టెయ్యను అనుభవిస్తున్నాడు.

11. పట్టెయ్య: అంటే పట్టెయ్య ఈశ్వరుణ్ణి అనుభవించడం...
లేదా
ఈశ్వరుడి వలన పట్టెయ్యకు ప్రయోజనం ఉంది అనుకోవడం...
ఇవన్నీ వొట్టి భ్రమలేనా?

సద్గురు: భ్రమ కాదు...
తన్ను తాను జ్ఞప్తికి తెచ్చుకునే ప్రక్రియలు అవి...

12. పట్టెయ్య: ఓ అలాగాంటారా...
భ్రమ అని అనుకొనవలసిన పనిలేదన్న మాట...

సద్గురు: భ్రమ అనేది కూడా ఈశ్వరుని రూపమే.
ప్రకృతి, అహంకారము, భ్రాంతి...ఇవన్నీ కూడా ఈశ్వరునికి భిన్నమని చెప్పబడతాయిగానీ, ఇవన్నీ కూడా ఈశ్వరుణ్ణి ఆధారం చేసుకొని ఉనికి కలిగినవే.
ఇవి లేకుండా ఈశ్వరుడు ఉండగలడు.
ఈశ్వరుడు లేకుండా ఇవి ఉండలేవు.
ఈశ్వరుడు లేకుండా పట్టెయ్యా ఉండడు, పట్టెయ్యకు కలిగే భ్రమా ఉండదు, పట్టెయ్యకు కలిగే అనుభవమూ ఉండదు.
అందువల్ల 'ప్రయోజనం లేదు' అని అనుకున్నాం.
నిజానికి 'ప్రయోజనం లేదు' అనే మాట అనుభవం కలిగాక అనుకునే మాట.

13. పట్టెయ్య: ఆ సూక్తి చివర్లో-
ఈ ఒక్క విషయం అర్థమైతే....అని అన్నారు.
అర్థమవడం అంటే?

సద్గురు: అర్థమవడం అంటే, అనుభవంలోకి రావడం అనే...

14. పట్టెయ్య: అర్థం అవడం అంటే అనుభవంలోకి రావడం.
అనుభవంలోకి రావడం అంటే ముక్తి కలగడమే.
అంతేనా స్వామీ....

సద్గురు: అంతే.

15. పట్టెయ్య: చాలా బాగుంది స్వామీ...

* * *

సద్గురు: నూరు మెతుకులు తినవలసి ఉంటే
తొంభై తొమ్మిది మెతుకులతో ఆపడం కుదరదు.
నూట ఒకటవ మెతుకు తినడం కుదరదు.
నూరు శ్వాసలు పీల్వవలసి ఉంటే
తొంభై  తొమ్మిది శ్వాసలతో ఆపడం కుదరదు.
నూట ఒకటవ  శ్వాస  పీల్వడం కుదరదు.

16. పట్టెయ్య: ఈశ్వరనియతి అంత కచ్చితంగా ఉంటుందని తెలిసి కూడా మళ్లీ ఏవో ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాము...

సద్గురు: ప్రయత్నం చేసి, ఆ ప్రయత్నం వల్ల లాభం లేదని తెలుసుకున్న తర్వాతే స్థిమితంగా ఉంటారు.
దానిని ఎక్కువ తక్కువ చేయగలము అని అనుకోవడం వల్లనే ఈ ప్రయత్నాలు చేయడానికి కారణం.

17. పట్టెయ్య: అయినా ప్రయత్నం చేయకుండా ఉండలేకపోతున్నాను స్వామీ...

సద్గురు: ప్రయత్నం ఉండకూడదని కాదు దాని అర్థం.
మనం 'పురుషప్రయత్నం' అనేది
అది 'దైవయత్నం' యొక్క ప్రాథమిక స్థితి
అని తెలుసుకోవాలి.
ఇప్పుడు 'మామిడి కాయ' అంటాము.
అదే 'మామిడి పండు'గా అవుతుంది.
కాయ రంగు, రుచి వేఱు...

పండు రంగు, రుచి వేఱు...
కాయ కఠినంగా ఉంటుంది...
పండు మెత్తగా ఉంటుంది...
అలాగని వాటిని రెండు అని చెప్పగలమా?
కాయ - పురుషయత్నం అని...
పండు - దైవయత్నం అని...
ఆయా స్థితిని బట్టి చెప్పుకుంటాము...
వెఱసి ఆ రెండూ ఒక్కటే కదా!
పండు యొక్క ప్రాధమికస్థితి కాయ.
కాయ యొక్క పూర్ణస్థితి పండు.
యత్నంలో కూడా అదే జరిగేది...

18. పట్టెయ్యి: ప్రాధమిక స్థితిలో యత్నం ఉంటుందన్నమాట...

సద్గురు: అవును.
అక్కడ ఎవరూ ప్రయత్నించకుండా ఉండలేరు...
ప్రయత్నించాలన్నా ప్రయత్నించలేరు.
ఈ రెండూ మన స్వాధీనంలో లేని విషయాలే...
అని తెలుస్తూనే ఉంటుంది మనకు అనేక విషయాలలో...

19. పట్టెయ్యి: ప్రయత్న-అప్రయత్నాలతో సంబంధం లేకుండా ఉండటమేనా జ్ఞానమంటే?

సద్గురు: అంతే.

20. పట్టెయ్యి: అంటే, ప్రయత్న-అప్రయత్నాలతో ప్రమేయం పెట్టుకోకుండా...
చేయవలసింది చేయడమే...
జరగవలసింది జరగడమే...

సద్గురు: అంతే.
ఇతరులను నీవు విడిగా చూస్తున్నట్టు...
పట్టెయ్యిను కూడా విడిగా చూడగలిగితే...
అది అర్థమౌతుంది.

యత్నము(సాధన)
అయత్నము(సిద్ధి)
ఈ రెండూ దైవయత్నాలుగానే స్పష్టంగా గోచరిస్తుంది.

21. పట్టెయ్య: మొత్తానికి ఉండేది 'దైవయత్నం' మాత్రమే అన్నమాట...

సద్గురు: అవును.
అది ఒకటే ఉండేది.
మనం ఎన్ని త్రిప్పులు త్రిప్పినా ఉండేది ఒక్కటే.

22. పట్టెయ్య: అంటే, ఏ కార్యం ఎట్లా జరిగినా సరే...
ఇదంతా దైవయత్నమని అంగీకరించి ఉండటమేనా స్వామీ...?

సద్గురు: అంతేకదా...
నేను అంగీకరించను అంటే అది మారేదిగాని, తప్పేదిగాని ఏమీ ఉండదు.
మనం అంగీకరించకపోవడం వల్లనే సుఖదుఃఖాలనేవి మనల్ని ఇబ్బంది పెడుతున్నాయి.

23. పట్టెయ్య: కేవలం అంగీకరిస్తే సరిపోతుందంటారా స్వామీ...?

సద్గురు: అంగీకారమంటే-
వాచా కాదు, మనసా కాదు...అనుభవం కూడా.
ఈ మూడింటితో.
వాచా కావాలంటే మనం అంగీకరిస్తాము.
అది ఇతరులకు తెలుస్తుంది.
మానసికంగా కూడా అంగీకరిస్తాము.
అది మనకు తెలుస్తుంది.
కాని ఇంకొకటి కూడా అందులో కలవాలి.
అప్పుడే అది అంగీకారం అవుతుంది.

24. పట్టెయ్య: మనసు వఱకే కదా మనకు తెలుస్తుంది...
'ఇంకొకటి' కలవాలి అన్నారు...
అదెట్లా వీలుపడుతుంది?
సద్గురు: దానిని గుఱించిన ఆత్రుత, ఆందోళన లేకపోవడమే మూడవది

అంగీకరించినట్లు గుర్తు.
కేవలం వాచా మనసా ఉంటే అది అంగీకారం కాదు.

25. పట్టెయ్య: నేను అంగీకరించినట్టున్నా కూడా నాకు సుఖదుఃఖాలు ఉన్నాయంటే, నేను నిజంగా అంగీకరించలేదన్నమాట...

సద్గురు: అంగీకారం తర్వాత కూడా ఆందోళన, ఆతృత, భయము ఉన్నాయంటే, చీకటిని వెలుతురు అనుకున్నట్లే. నిజంగా అది అంగీకారమే అయితే అలజడి ఉండదు. అదే గుర్తు అంగీకారానికి.

26. పట్టెయ్య: మనసా, వాచా కాక ఆ మూడవదాని విషయంలో మన ప్రమేయం ఏమీ కనిపించడం లేదు...
సద్గురు: కానీ ఆందోళన, అలజడి లేకుండా ప్రశాంతంగా ఉండటం అనేది మనకు సంబంధించినదే కదా! కాబట్టి ఆ మూడవది కూడా మనకు సంబంధించినదే అనుకోవాలి. మూడూ కలిస్తేనే దైవయత్నం.
* * *
సద్గురు: ఇతర సత్సంగాలకు దేవుడి బలం తెలుసు.
మన సత్సంగానికి దేవుడి బలహీనత తెలుసు.

27. పట్టెయ్య: అర్థం కాలేదు స్వామీ...
కాస్త వివరించండి...

సద్గురు: సత్సంగం జరిగే చోట ఆయన ప్రకటనం కాకుండా ఉండలేడు.
అదే ఆయన బలహీనత.
సత్సంగం అనేది ఆయన రూపం.

28. పట్టెయ్య: అలా ప్రకటనం అవడమే బలహీనత అంటారా?

సద్గురు: అంతేకదా!
మనం బలం అని చెప్పబడేది
మరొక కోణంలో అది బలహీనత.
ఒక కోణంలో బలహీనత అనేది
మరొక కోణంలో బలం.
తల్లి దగ్గర చంటిబిడ్డ బలహీనుడు కదా!

కాని ఆ బలహీనతే తల్లి చేత అన్నీ పనులూ
చేయించుకోవడానికి వాడికి బలం అవుతోంది.
ఒక కోణంలో(భౌతికంగా) చూస్తే వాడు బలహీనుడు.
కదలలేడు...నడవలేడు...
కాని వాడి దగ్గర 'ఏడుపు' అనే ఆయుధం ఉంది.
అదే వాడికి బలం.
ఇక్కడ మనకు సత్సంగమనేదే బలం.
సత్సంగమనేది వ్యక్తుల సమూహం అనుకుంటే,
వ్యక్తుల సమూహమే అవుతుంది.
అధిష్ఠానం అనుకుంటే అధిష్ఠానమే అవుతుంది.
ఆయనే ఇన్ని రూపాలుగా ఇక్కడ చేరి ఉన్నాడనుకుంటే,
అదే అవుతుంది.

29. పట్టెయ్య: బాగుంది స్వామీ...!

* * *

సద్గురు: సత్సంగం ముగిసాక 'ఇప్పుడు చెప్పుకున్నదాని కంటే "అది" గొప్పది'....
అని అనుకొని లేచి ఇళ్లకు వెళ్లండి...

30. పట్టెయ్య: కాస్త వివరించండీ స్వామీ...

సద్గురు: మానవమేథస్సుకు అది ఎంత స్పష్టంగా తెలిసినప్పటికీ అది అసలు కాదు. అంతా మాట్లాడుకోవచ్చు, అన్నీ చేయవచ్చు, అన్నీ అనుభవించవచ్చు. కాని ముగింపులో మాత్రం 'అసలు వేఱే....ఇది కాదు' అని అనుకుని వెళ్లడం మంచిది. ఎందుకంటే, 'అసలుదానిని' ఇప్పటివఱకు ఎవరూ అనుభవించలేదు. అది అని ఇతరాన్ని అనుభవిస్తున్నారు. యాక్షన్, రీయాక్షన్ రెండూ మనవే. 'అసలుదానికి' రియాక్టు అవ్వాల్సిన అవసరం దానికి లేదు.

31. పట్టెయ్య: మన యాక్షన్ బట్టే రీయాక్షన్ ఉంటుందంటారా?

సద్గురు: అంతేకదా! అద్దం ఎదురుగా నిలబడ్డట్టే...

32. పట్టెయ్యః అయితే మన భావమే ప్రతిఫలిస్తుందంటారా?

సద్గురు: అంతే.

పట్టెయ్యః అక్కడ ఏ భావాలూ లేవు కాబట్టి...
నేను ముక్తుణ్ణి అనుకుంటే ముక్తుణ్ణి
నేను బద్ధుణ్ణి అనుకుంటే బద్ధుణ్ణి
అవుతున్నానంటారా?

సద్గురు: అంతేకదండీ...
మీర్రై నేను అపరాధిని అని అన్నాక, పోలీసుశాఖకి అభ్యంతరం ఏముంటుంది? 'నేరస్తుడు తానే స్వయంగా అంగీకరించాడు' అని తీర్పు ఇస్తారు.

33. పట్టెయ్యః అలాగయితే తప్పొప్పులు అనేవి మన భావాలను అనుసరించి జరుగుతున్నాయన్నమాట...

సద్గురు: అవును.
నేను ముక్తుణ్ణి అనేదీ కరెక్టే...
నేను బందితుణ్ణి అనేదీ కరెక్టే...
'నేను బంధితుణ్ణి' అని అహంకారం(మేథస్సు) అంటుంది.
'నేను ముక్తుణ్ణి' అని అహంస్వరూపం(ఆత్మ) ఉంటుంది.
'నేను బంధితుణ్ణి' అని ఆత్మ అనదు.
దానికి ఆ అనుభవం లేదు.
అది సదా ముక్తమే.
దానిని బంధించడానికి ఇతరము లేదు.
'నేను బంధితుణ్ణి' అనుకునేవాడు మేథాపరంగా అనుకుంటున్నాడు, నామరూపాత్మకంగా.

34. పట్టెయ్యః మేథస్సును వినియోగించి-
'నేను బంధితుణ్ణి' అని భావిస్తున్నాడు కాబట్టి తాను బంధంలో ఉండవలసి వస్తోందంటారా?

సద్గురు: అంతేకదా! తానే అంగీకరించినప్పుడు
ఇంకొకరికి అభ్యంతరం ఏముంటుంది?

35. పట్టెయ్య: బావిలో నీటిని తోడేస్తుంటే,
క్రొత్త నీరు ఊరుతున్నట్లు...
చెప్పేవాడు చెప్పినదానిని,
వినేవాడు విన్నదానిని
వ్రాసుకోకుండా దాచుకోకుండా
ఏ రోజుకారోజు అలా విని, విడిచేస్తుంటే
మళ్లీ క్రొత్త క్రొత్త విషయాలు
ఆవిష్కరింపబడుతుంటాయి...
అన్నారు బాబుగారు...
మరి శ్రవణ మననాదులు అవసరమే లేదా? అని అడిగితే-
కంప్లీట్ గా విడిచి పెట్టేయండి...
ఫ్రెష్ గా ఉండండి...
నూతనసత్యం ఆవిష్కరింపబడడానికి అవకాశం ఇవ్వండి...
అన్నారు బాబుగారు.
మీరేమంటారు గురువుగారు?

సద్గురు: ఇప్పుడు వినబడేదాన్ని శ్రవణం చేయండి.
ఎప్పుడో శ్రవణం చేసినదానిని
పునశ్చరణ చేయవలసిన అవసరం లేదు.

36. పట్టెయ్య: మరి పెద్దలు శ్రవణ మనన నిధిధ్యాసములు...గుఱించి చెప్పారు కదా!

సద్గురు: శ్రవణ మననాదులు...గతాన్ని గుఱించి చేసుకోవచ్చు, ఇప్పుడు విన్నదాన్ని గురించి చేసుకోవచ్చు మరియు భవిష్యత్తని చెప్పబడేదాన్ని గురించి కూడా చేసుకోవచ్చు.
గతాన్ని ఎంత శ్రవణం, మననం చేసినా గతం గతః దాని వల్ల లాభం లేదు.
భవిష్యత్తు తెలియదు.
అక్కడ కేవలం ఊహలతో, కల్పనలతో మనం నిర్ణయించుకోవాలి.

కాబట్టి ఇప్పుడు ఎదురుగా ఉన్నదాన్ని ప్రస్తుతం శ్రవణం చేయండి.
ఇది కూడా గతమవుతుంది...
వదిలేయండి.
మరల అనుకోవలసిన అవసరం లేదు.

37. పట్టెయ్య: పొగను ఎంత ప్రోగు చేసుకున్నా అది నిప్పు అవదు. మీరే నిప్పుగా మారిపోవాలి...అన్నారు బాబుగారు...
మననం అంటే పొగను ప్రోగు చేసుకోవడమేనా...?

సద్గురు: అవును.

38. పట్టెయ్య: శ్రవణ మననాదులు బ్రహ్మవిషయంగా కూడా సహకరిస్తుందని మహాత్ములు చెప్పి ఉన్నారు...

సద్గురు: బ్రహ్మవిషయం కానిదేముంది చెప్పండీ...

39. పట్టెయ్య: లౌకిక విషయం, బ్రహ్మవిషయం అని రెండుగా చెప్పి ఉన్నారు కదా!

సద్గురు: లేదు.
బ్రహ్మ విషయం ఒక్కటే.
మనం లౌకికంతో పాటు ప్రస్తావించుకునే బ్రహ్మవిషయం కూడా లౌకికవిషయమే...
కాకపోతే లౌకికంలో మేలైనదిగా చెప్పుకోవచ్చు.
'అసలైన బ్రహ్మ విషయాని'కి లౌకికం అనేది లేదు.
ఆ బ్రహ్మానికి ఒక ప్రకటనరూపమే లౌకికం.
బ్రహ్మానికి భిన్నంగా ఏదీ ఉండే అవకాశం లేదు.
లౌకికాన్ని ఆమోదించాం కాబట్టి లౌకికంలో ఉన్నతమైన స్థితిని బ్రహ్మమనే పేరుతోనే పిలుస్తారు. అదెలాగంటే- గ్రామానికి గ్రామాధికారి బ్రహ్మము. మండలానికి తహసీల్దారు బ్రహ్మము. రాష్ట్రానికి రాష్ట్రాధికారి బ్రహ్మము....అన్నట్లు.
అట్లా బ్రహ్మమనే పదం అధికారి రీత్యా పలకబడే శబ్దము అది.

40. పట్టెయ్య: బ్రహ్మము కూడా లౌకికమే...!

సద్గురు: లౌకికంలో ఉన్నతమైన భాగాన్నే బ్రహ్మమని భావిస్తారు.
'అసలు బ్రహ్మము' అనిర్వచనీయము.
దానిని గుఱించి మాట్లాడినవారు ఇప్పటివఱకు ఎవరూ లేరు. ఇక ఉండబోరు.
"అది ఉంటుంది" అంతే.
అది నీవుగా, నేనుగా, సర్వులుగా, సకలంగా ఉంటుంది. దానిలోనే సకలమూ ఉంది. సకలమూ అంతరిక్షంలోనే కదా జరుగుతూ ఉన్నది. అంతరిక్షం దేని గురించీ పట్టించుకోదు. అంతరిక్షం అంతరిక్షంగానే ఉంటుంది.
దానిలోనే ఉండే జ్ఞప్తి తగ్గే కొద్దీ కార్యకలాపాలు ఏర్పడతాయి.  బ్రహ్మంలో నిమ్నస్థితినే లౌకికంలో ఉన్నతస్థితిగా  చెప్పుకుంటున్నాము.
కాని బ్రహ్మము వైపు నుంచి ఏ భేదమూ లేదు.

41. పట్టెయ్య: మన నుండే ఏర్పడ్డాయన్నమాట...

సద్గురు: అవును.

42. పట్టెయ్య: నేనున్నాను...అని నా స్థితిని ప్రకటించేసరికి, అది లౌకికంలోకి వచ్చేస్తుందంటారా?

సద్గురు: అవును.
నిజమైన 'నిజమైన నేను' ప్రకటన చేయదు.
అది అసంభవం.

43. పట్టెయ్య: ఇట్లా చేస్తోందంటే, అది మనసు యొక్క టక్కరితనమా?

సద్గురు: టక్కరితనం కాదుగానీ...
దాని లిమిట్స్ అంతే మరి.
అది కూడా నిజమే చెబుతోంది.

44. పట్టెయ్య: నేను బ్రహ్మమును, నేను బ్రహ్మమును...అని మహనీయులు కూడా
మాటల సందర్భంలో పలికి ఉన్నారు కదా!

సద్గురు: 'నేను భారతీయుణ్ణి' అన్నట్టు...
అది మరచి మళ్లీ నేను తమిళుడను, ఆంధ్రుడను అన్నట్టు....

45. పట్టెయ్యః నేను నా అసమర్థతను, నా అజ్ఞానాన్ని అంగీకరించడం వలన బ్రహ్మము యొక్క సమర్థతను చాటి చెప్పడం కాదా?

సద్గురు: ఆ రెండూ ఒకటి కాదు.
మీ అసమర్థతను చెప్పుకోవడం వేఱే,
బ్రహ్మము యొక్క సంపూర్ణత్వం వేఱే.
నేను అసమర్థుడను, అజ్ఞానిని అని మీరు అనుకున్నందువలన దానికి సంపూర్ణత్వం రాదు. అది సదా సంపూర్ణమే. నేను అజ్ఞానిని, నేను అరిమితుణ్ణి అనుకునే ఈ మిథ్యానేను కొంతకాలానికి ఫేడవుట్ అయిపోతుంది.
తర్వాత ఉన్నదేదో ఉంటుంది.

46. పట్టెయ్యః అంటే, ఇది ఫేడవుట్ అయ్యేదాక తన అసమర్థతను అలా చెప్పుకుంటూ ఉంటుందంటారా?

సద్గురు: అది అలా చెప్పుకునేటప్పుడు కూడా బ్రహ్మము బ్రహ్మముగానే ఉంటుంది. అలా చెప్పుకోవడం వలన బ్రహ్మమునకు హానీ లేదు, మేలూ లేదు. అలా చెప్పుకునేది తొలగిపోతుంది.

47. పట్టెయ్యః నా శ్వాస కూడా నాకు తెలియకుండా పీల్చబడుతోంది...
నాకు తెలియకుండానే నా శరీరంలో సమస్త క్రియలు జరుగుతున్నాయి కదా! ఇదంతా నా అసమర్థతగా నేను అంగీకరించాల్సిన అవసరం ఉంది కదా?
సద్గురు: సమర్థత అని ఎందుకు అనుకోకూడదు?

48. పట్టెయ్యః సమర్థత ఎలా అవుతుంది?
నా ప్రేమయంతో జరగడం లేదుకదా!

సద్గురు: అసలు ఆ శ్వాస జరిగితేనే మీరు 'నేను పట్టెయ్య' అని అనగలుగుతున్నారు...
శ్వాసక్రియ ప్రారంభమైన తర్వాత ఏర్పడ్డ 'నేను' పట్టెయ్య.

ఆ శ్వాసక్రియకు ఆధారమైనటువంటి "నేను" బ్రహ్మము.
ఈ రెండు నేనులకు ప్రధానమైన తేడా ఏమంటే-
శ్వాసక్రియ ప్రారంభమైన తర్వాత ఏర్పడ్డ నేను
శ్వాస లేకుండా ఉండలేదు.
శ్వాసకు ఆధారంగా ఉండే నేను
శ్వాస లేకపోయినా ఉండగలదు.
ఈ రెండు నేనులకు 'నేను' అని ఒకే పేరు ఉండడం వలన ఈ confuse కు కారణం.
శ్వాస మీద ఆధారపడి ఉన్న పట్టెయ్య నేను అసమర్థుణ్ణి, నేను పరిమితుణ్ణి అనుకోవడం తప్పుకాదు. అది నిజమే కాబట్టి.
శ్వాసకు ముందు, శ్వాస ఉన్నప్పుడు, శ్వాస ఆగిన తర్వాత కూడా శ్వాసకు ఆధారమైన 'నేను' సదా ఉంటుంది.
అందువల్ల నేను బలహీనుణ్ణి అని పట్టెయ్య అంగీకరించడం వలన బ్రహ్మమును బలపరచడం అంటూ ఏమీ ఉండదు.

49. పట్టెయ్య: ఇంతకూ నేను ఏ నేను?
తేల్చుకోలేకపోతున్నాను స్వామీ...!

సద్గురు: మీరు అద్దం ఎదురుగా నిలబడ్డప్పుడు అద్దం లోపల ఒక పట్టెయ్య ఉంటాడు. అద్దం ఎదురుగా ఒక పట్టెయ్య ఉంటాడు. ఇంతకూ మీరు ఏ వైపు ఉన్నట్టు?

50. పట్టెయ్య: అద్దానికి ఎదురుగా ఉన్నవాడినే...
సద్గురు: ఇక confuse ఏముంది?

51. పట్టెయ్య: నా ద్వారానే అద్దంలో ప్రతిబింబం ఏర్పడుతుంది...

సద్గురు: కాబట్టి మీరు నిజంగా శ్వాసకు ఆధారంగా ఉండే 'నేనే'.
శ్వాస మీద ఆధారపడి, పట్టెయ్య అనే పేరుతో పిలువబడే నేను అద్దంలో ప్రతిబింబం లాంటిది.
అది ఉన్నట్టు కనిపించినా అక్కడ ఉండదు.

52. పట్టెయ్య: అద్దంలో ఉన్న ప్రతిబింబం నిజమని ఎవరు ఓటు వేస్తున్నారు?

సద్గురు: ఎవరు వేస్తారు? తానే వేసుకుంటున్నాడు...

53. పట్టెయ్య: ఇదంతా తన మీద తానే వేసుకొని తానిది, తానది అనుకుంటున్నాడన్నమాట...

సద్గురు: అంతే.
కాని సత్సంగం ముగిసిన వెంటనే మనం డస్టర్ తీసుకుని బ్లాక్ బోర్డును తుడిచేసినట్లు
సత్సంగంలో విన్న ఎంత గొప్ప విషయాలైనా మనలో ముద్రపడకుండా అలా తుడిచేసి వెళ్లిపోండి...

54. పట్టెయ్య: తమ సన్నిధిలో శ్రవణం చేస్తే సరిపోతుంది...
కానీ బయట మరలా రకరకాల విషయాలు శ్రవణం చేయాల్సివస్తోంది...

సద్గురు: మనం ఎవరి సన్నిధిలో ఉన్నా కూడా శ్రవణం చేసేది మనమే కదా!

55. పట్టెయ్య: అవునండి...

సద్గురు: గురుసన్నిధి, ఇతర సన్నిధి అని రెండు ఉన్నాయి అనుకోవడమే ఈ confuse కు కారణం.
ఉన్నదంతా సద్గురు సన్నిధే...
ఇది మరిస్తే ఏదో ఒక వేపచెట్టును మాత్రమే అంకమ్మదేవతగా కొలిచినట్టు...

56. పట్టెయ్య: ఇతర విషయానికి, బ్రహ్మ విషయానికి తేడా ఉంటుంది కదా...!

సద్గురు: ఏమీ ఉండదు...
బ్రహ్మవిషయం అనేది అనుభవంలోకి వచ్చిన తర్వాత మీకసలు ఇతర విషయమే కనిపించదు, వినిపించదు, అనిపించదు.

57. పట్టెయ్య: అంటే ఇతరవిషయం కనిపిస్తోందంటే, బ్రహ్మవిషయం అనుభవానికి రాలేదనా?

సద్గురు: అక్కడ అనుభవానికి రావడం అంటూ ఏమీ ఉండదు. 'ఉన్నది ఒకే వస్తువు' అన్న విషయం జ్ఞప్తిలో ఉండడమే అనుభవం.
భగవద్విషయంలో- జ్ఞాపకమే అనుభవం.
ఇతర విషయాల్లో- జ్ఞాపకం వేఱు, అనుభవం వేఱు.

58. పట్టెయ్య: భగవద్విషయం జ్ఞప్తిలో ఉన్నప్పుడు లౌకికవిషయాల మధ్యలో ఉన్నా సరే అంతా బ్రహ్మమయంగా మారిపోతుందా?
సద్గురు: తానొక్కడే మారేదక్కడ.
తానొక్కడు మారితే సకలమూ మారుతుంది.
పచ్చకామెర్లు వచ్చేది ఒకడికే...కానీ లోకమంతా పచ్చగా అయిపోతుంది.
లోకానికి పచ్చరంగు ఎవరు వేస్తున్నారు?

59. పట్టెయ్య: మారటం అంటే జ్ఞాపకం పెట్టుకోవడమేనా?

సద్గురు: అంతే. ఇంకేమీలేదు...

60. పట్టెయ్య: జ్ఞాపకంలో ఉంటే సరిపోతుందా?
సద్గురు: అది ఒక్క భగవద్విషయంలో మాత్రమే.
జ్ఞప్తియే జ్ఞానము, అనుభవము, అన్నీ అదే.
నేను-నేను అంటున్నారు కదా!
'నేను' అన్న పదానికి అర్థమేమి?

61. పట్టెయ్య: నేను అంటే నేనే.

సద్గురు: అనుభవమేమి?

62. పట్టెయ్య: "నేనే".

సద్గురు: "నేను" అనేదే పదము, అర్థము.
అనుభవమూ అదే కాబట్టి "నేను" అనేదే పరమపదము అని చెప్పబడుతుంది.
ఆ జ్ఞప్తి ఉంటే నిరంతరం ఆ పరమపదంలో ఉన్నట్టే.
జ్ఞప్తి లేనప్పుడు ఇతరవిషయములు, బ్రహ్మవిషయములు అని వేఱువేఱుగా కనబడతాయి.
ఒకటికి రెండవదిగా కనిపిస్తుంది.

ఐదింటికి ఆరవదిగా కనిపిస్తుంది.
పదింటికి పదకొండవదిగా కనిపిస్తుంది.
జ్ఞప్తి ఉంటే అది తప్ప ఇంకేమీ కనిపించదు.

63. పట్టెయ్య: జ్ఞప్తియే సాధన అంటారా స్వామీ...

సద్గురు: అక్కడ సాధన అంటూ ఏమీలేదు...
జ్ఞప్తి అంటే పట్టెయ్య యొక్క జ్ఞప్తి అని కాదు.
బ్రహ్మమనేదే జ్ఞప్తి. అది స్వయం.
అది ఎవడి శిరస్సులోనూ ఉండేది కాదు.

64. పట్టెయ్య: జ్ఞప్తి అంటే గుర్తు పెట్టుకోవడం కాదా?

సద్గురు: కాదు కాదు...
ఆ జ్ఞప్తి ఆధారంగానే గుర్తు పెట్టుకోవడం జరుగుతుంది.

65. పట్టెయ్య: నేను నేనుగా ఉండడం అనేదానిని
జ్ఞప్తి అని అనవల్సిన అవసరం లేదంటారా?

సద్గురు: తెరమీద బొమ్మలున్నాయి...
సీతారాములు సినిమా జరుగుతోంది...
సీతారాములు లేరా? అంటే, ఉన్నారు...
వారికి కూడా ఉనికి ఉంది.
తెరకు కూడా ఉనికి ఉంది.
ఈ రెంటిలో మార్పు చెందే ఉనికి ఏది?
మార్పు చెందని ఉనికి ఏది?

66. పట్టెయ్య: తెర మార్పు చెందదు.
దృశ్యం మారుతుంటుంది.

సద్గురు: 'నేను పట్టెయ్య' అనేది తెరమీద దృశ్యం లాంటిది.
తెర లాగా పట్టెయ్యకు ఆధారమైన 'నేను' ఒకటి ఉంది.
ఆ 'నేను'కు మార్పు లేదు.
అది జ్ఞప్తి స్వరూపం.
ఆ 'నేను' మీద ఈ నేను మెలగుతుంది.

ఆ 'నేను' స్వయంగా జ్ఞప్తి స్వరూపం.
ఆ జ్ఞప్తికి శిరస్సు అవసరం లేదు.
ఈ పట్టెయ్యకు శిరస్సు అవసరం.
పట్టెయ్య శిరస్సు, పట్టెయ్య జ్ఞాపకశక్తి అన్నీ
ఆ 'నేను'లో ఏర్పడ్డవే.

67. పట్టెయ్య: 'నేను పట్టెయ్యను'అని అంగీకరించడమే ఈ సమస్యలన్నిటికీ కారణమా?

సద్గురు: కాదు...
సమస్యకు కారణం "నేను పట్టెయ్యను మాత్రమే" అని ఉండటం వల్ల.
సకలమూ నేనే, పట్టెయ్య కూడా నేనే అని ఉండాలి.
మనం పదిమందిమి కలిసి గ్రూప్ ఫోటో తీసుకున్నాము... ఆ ఫోటోను మీరు చేతికి తీసుకోగానే మీ చూపు మీ బొమ్మ మీదనే పడుతుంది. నేను తీసుకొని చూస్తే నా బొమ్మనే చూస్తాను. బాబు బాబునే చూస్తాడు. ఆ విధంగా సకలమూ తానే అయినప్పటికీ పట్టెయ్య అనే బొమ్మనే అభిమానించడం వలన మీరు పట్టెయ్య మాత్రమే అయిపోయారు.
నేను పట్టెయ్యను అని మీరు అనుకన్నా, అనుకోకపోయినా అసలు "నేను"కు భంగమేమీ లేదు.
మీ వద్ద వంద నోటు ఉంది...
అందులో నుంచి ఇరవై తీసివేస్తే ఎనభై అవుతుంది.
వందకు ఇరవై చేరిస్తే నూటఇరవై అవుతుంది.
ఇది మన వ్యవహారంలో.
కానీ దైవవిషయంలో-
వందలో నుంచి ఇరవై తీసివేసినా వందగానే ఉంటుంది.
వందకు ఇరవై చేర్చినా వందగానే ఉంటుంది.

68. పట్టెయ్య: తీసివేసినా, కలిపినా లాభనష్టములు ఉండవన్నమాట...

సద్గురు: అవును...
తీసివేయడం వలన నష్టంగానీ
కలపడం వలన లాభంగానీ ఉండవు.

మన నోటు అట్లా కాదు...
ఐదుసార్లు ఐదు ఇరవైలు తీసివేస్తే
ఏమీ ఉండదక్కడ.

69. పట్టెయ్య: చిత్రపటములోని పట్టెయ్యను చూచినా లాభం లేదు,
చూడకపోయినా నష్టం లేదు...

సద్గురు: అవును.
ఒక అబద్ధాన్ని అబద్ధం అనుకున్నా ఇబ్బంది లేదు.
అబద్ధాన్ని నిజం అనుకున్నా ఇబ్బంది లేదు.
అది అబద్ధమే కాబట్టి.

70. పట్టెయ్య: అబద్ధాన్ని అబద్ధంగా
నిజాన్ని నిజంగా అంగీకరిస్తే సరిపోతుందన్నమాట.

సద్గురు: అంగీకరించినందువల్ల అబద్ధానికి లాభముగాని,
అంగీకరించనందువల్ల నిజానికి నష్టంగాని ఉండదు.

71. పట్టెయ్య: అబద్ధాన్ని నేను నిజం అని అనుకోవడం వల్లనే
సమస్యలన్నమాట...

సద్గురు: అబద్ధానికి ఏమైనా సమస్యా?

72. పట్టెయ్య: మరి సమస్య ఎవరికి?

సద్గురు: ఎవరికుంది?
అబద్ధాన్ని నిజం అనుకున్నవారికి సమస్య ఉంది.
అబద్ధాన్ని అబద్ధం అనుకుంటే సమస్యేముంది?
ఇక్కడ నిజం అనుకున్నా అబద్ధమే.
అబద్ధం అనుకున్నా అబద్ధమే.
మీవద్ద రోల్డుగోల్డు రింగు ఉందనుకోండి...
దానిని అసలు బంగారం అన్నా, రోల్డుగోల్డు అన్నా
ఆ రింగుకు వచ్చిన లాభముగాని, నష్టముగాని ఏముంది?
అలాగే నిజమైన బంగారాన్ని రోల్డుగోల్డు అన్నా, బంగారం అన్నా
దానికొచ్చిన అదనపు ఆదాయమేమి?

73. పట్టెయ్య: రెండవదానిని అంగీకరించడం వల్లనే సమస్యలు తలెత్తుతున్నాయి...

సద్గురు: అవును.
సమస్య అనేదే లేదు.
సమస్య ఉండి అవస్థ పడితే అది వేఱే సంగతి.
లేని సమస్యను అనుభవించడం ఇది.
మీరు గాఢనిద్రలో ఉండేటప్పుడు గురువుగారిని ఇటువంటి సందేహాలు అడిగితే, అప్పుడు నిజంగా ఆందోళన పడవలసిందే. అట్లా ఏమీ జరగడం లేదు కదా! గాఢనిద్రలో ఉన్నట్లే ఇప్పుడు కూడా మీరు ఉండేది. అట్లా లేననుకోవడమే సమస్య.

74. పట్టెయ్య: బావుందండీ...
తమతో మాట్లాడేటప్పుడు ఉండే ఊరట ఎల్లప్పుడూ ఉంటే బాగుండును...

సద్గురు: చిన్నపిల్లవాడు బొటనవ్రేలిని నోట్లో పెట్టుకొని చీకుతుంటాడు...
లాలాజలం ఊరుతూ ఉంటుంది...
దాన్నే మ్రింగతూ ఉంటాడు...
ఆ ద్రవం బొటనవ్రేలిలో నుంచే వస్తోందని అనుకుంటాడు.
అట్లా గురువుగారితో మాట్లాడితే, గురువుగారి దగ్గర నుంచి ఏదో వచ్చినట్లు ఉంటుందేగాని, అది నీలోంచి కలిగిందే...

75. పట్టెయ్య: బావుంది స్వామీ...

సద్గురు: జగద్రూపంగా ఉన్నది సద్గురువే.
జగత్తులో ఏ ఒక్కడు మాత్రమే సద్గురువు కాడు.

76. పట్టెయ్య: అంటే జగత్తులో ఉన్న ఎవరి మాటలైనా, చేతలైనా అవన్నీ సద్గురుని యొక్క మాటలు, చేతలేనా?
సద్గురు: "యొక్క" కాదు...
ఆ మాటలే, ఆ చేతలే సద్గురువు.
వేదఋషుల నుండి రమణమహర్షి వఱకు మాట్లాడింది ఆ "ఒక్కటే".

77. పట్టెయ్య: మహర్షుల వాక్కులే కాక, మిగతా వారి మాటలు కూడా గురువాక్కులేనా?

సద్గురు: ఇప్పుడు పట్టెయ్యగా మాట్లాడుతుండేది కూడా సద్గురువే...దానికేదీ మినహాయింపు లేదు.

78. పట్టెయ్య: మేథస్సుతో ప్రమేయం లేకుండా సద్గురువు మాట్లాడుతాడు...అన్నారు మీరు.

సద్గురు: మనస్సు, మేథస్సు...ఇవి కూడా సద్గురు స్వరూపాలే.

79. పట్టెయ్య: మేథస్సు ద్వారా వచ్చేది "మిథ్యానేను" పలికే మాటలుగా భావిస్తున్నాను...

సద్గురు: మీరే చెబుతున్నారుగా...భావన అని.
అది భావన మాత్రమే.
దేనిని మనం భావన అంటున్నామో అది కూడా సద్గురువే.
మనకు కనిపించేవన్నీ సద్గురుతత్త్వము యొక్క ప్రకటన రూపాలే...
అది తప్ప ఇంకేమీ లేదు, ఇంకేమీ కాదు.
మేథస్సు రూపంలో మాట్లాడుతున్నది కూడా సద్గురువే. దానికి మేథస్సు లేకపోవడమేమీ లేదు. నీలో నీకభిన్నంగా ఉన్న అవయవాల గుఱించి మాట్లాడుకున్నట్లు మాట్లాడుకోవచ్చు...ఇబ్బందేమీ లేదు.

80. పట్టెయ్య: నా సందేహం ఏమంటే,
మనస్సు, మేథస్సు లేకుండా మాటలు ఉంటాయా?అని.

సద్గురు: మనస్సు, మేథస్సు ఇవి రెండు కూడా మాటలే...
మనస్సును, మేథస్సును మీరు ఎన్నడైనా చూశారా?
అవి లేకుండా మీరు ఎన్నడైనా ఉన్నారా?
మీరు లేకుండా అవి ఎన్నడైనా ఉన్నాయా?
సద్గురువును మనకు భిన్నంగా చూసినప్పుడు మాత్రమే ఈ సందేహాలన్నింటికీ అవకాశం ఉంటుంది. సద్గురువులో మనం కరిగిపోతే, సద్గురువే శేషిస్తాడు. తరువాత కూడా మనం ఉంటాంగానీ, చూచాయిగా ఉంటాం అంతే. ఉన్నట్లు ఉంటాము. "ఉన్నది" సద్గురువు మాత్రమే.

మనమూ, మన మేథస్సూ, మన మంచీ, చెడ్డా అన్నీ "ఉన్నట్లు"ఉన్నవే.
వీటికి నిజంగా ఉనికి లేదు.
సద్గురువుకు అర్థం ఉనికి.
ఉనికికి అర్థం సద్గురువు.
ఉనికే సద్గురువు.
సద్గురువు యొక్క ఉనికి కాదు.
ఉనికి అనేదే సద్గురు రూపం.
"సత్" అంటే ఉనికి అని అర్థం.
సద్గురువును మరచినప్పుడు
మిగతా వాటికి ఉనికి  ఉన్నట్లు కనిపిస్తుంది.
ఈ మనస్సు, మేథస్సు విషయంలో కూడా.

81. పట్టెయ్య: కేవలం మరవడమే కారణమంటారా?

సద్గురు: అంతేకదా!
మీరు పది అయితే, ఆయన పదకొండవవాడు కాడు. ఈ పది ఆయనలో ఉన్నాయి.

82. పట్టెయ్య: స్వామీ...మరొక సందేహం...
నిజాయితీపరుడు, మోసగాడు ఇద్దరూ స్వతంత్రులు కారు అన్నారు మీరు. కాస్త వివరించండి...

సద్గురు: అవును...
స్పృహ లేనితనం ఇద్దరికీ సమానం.
స్పృహ కలిగిన క్షణం ఇద్దరూ మాయం.

83. పట్టెయ్య: నిజాయితీపరుడు, మోసగాడు ఇద్దరు కనిపిస్తున్నారంటే నాకు స్పృహ లేదనేనా?

సద్గురు: అవును.
స్పృహ ఉంటే తనకు అన్యంగా ఇంకొకరు, ఇంకొకటి గోచరించరు. అదే స్పృహకు అర్థం. స్ఫురణ కూడా అదే.
* * *

సద్గురు: పంచేంద్రియాలకు అందుబాటులో ఉన్న ఆధ్యాత్మికమే భౌతికము. పంచేంద్రియాలకు అందుబాటులో లేని భౌతికమే ఆధ్యాత్మికము.

84. పట్టెయ్య: కాస్త వివరించండి స్వామీ...

సద్గురు: ఆధ్యాత్మికమే పంచేంద్రియముల ద్వారా చూసినప్పుడు అది భౌతికంగా గోచరిస్తుంది. పంచేంద్రియములకు అందుబాటులో లేనిది అది సూక్ష్మమైనా సరే, స్థూలమైనా సరే ఆధ్యాత్మికం అవుతుంది.
అదెలాగంటే-
తేజోస్తంభంగా అవతరించిన పరమేశ్వరుని 'అంతు' (అంచు) చూడడానికి మహావిష్ణువు వరాహరూపంలో క్రిందవైపుకు వెళ్లాడంటే,
సూక్ష్మాన్ని చూసుకుంటూ వెళ్లడమన్నమాట.
బ్రహ్మ హంసరూపంలో పైకి వెళ్లాడంటే,
స్థూలాన్ని చూస్తూ వెళ్లడమన్నమాట.
ఈ రెండు ప్రయత్నాలూ విఫలమైనాయి.
అందువల్ల ఇక్కడ సూక్ష్మ స్థూలములు లేవు.
ఈ రెండూ లేనివాడే అరుణాచలేశ్వరుడు.
ఇప్పుడు మీరు నాకు దగ్గరగా ఉన్నారా?
దూరంగా ఉన్నారా?

85. పట్టెయ్య: దగ్గరగానే ఉన్నానండీ...
సద్గురు: రాచపల్లి దగ్గరా కాళహస్తికి?

86. పట్టెయ్య: అంటే  ఇప్పుడు మీరు నాతో ఫోన్ లో మాట్లాడుతున్నారుగా...అందుబాటులో ఉన్నట్టేగా...

సద్గురు: కాబట్టి దగ్గర, దూరం అనేదానికి
'అందుబాటు' అనేదే ప్రమాణం.
అందుబాటులో ఉంటే దూరమే దగ్గరవుతుంది.
అందుబాటులో లేనప్పుడు దగ్గరే దూరమౌతుంది.
ఆ విధంగానే అందుబాటులో లేని భౌతికమే ఆధ్యాత్మికం.
అందుబాటులో ఉన్న ఆధ్యాత్మికమే భౌతికం.

87. పట్టెయ్య: టోటల్ గా ఉన్నది ఆధ్యాత్మికమే అయినప్పటికీ మనకు అందుబాటులో ఉంటే ఒక విధంగా, అందుబాటులో లేకుంటే మరో విధంగా మాట్లాడుకుంటున్నాము...

సద్గురు: అవును.
'ఉనికి'యే ఆధ్యాత్మికం.
ఏది ఎలా కనిపించినా, అనిపించినా సరే.
అది ఆధ్యాత్మికమే.
ఉనికి ఆధ్యాత్మికానికేగాని భౌతికానికి లేదు.
భౌతికానికి రాకడ,పోకడ ఉన్నాయి.
ఆధ్యాత్మికానికి రాకడ, పోకడ లేవు.
కేవలం 'ఉనికి' మాత్రమే అది.
రాకడ,పోకడ కలిగింది అది ఉనికిగా తోచినా
అది ఉనికి కాదు.
రాకడ,పోకడలు లేని ఉనికే ఉనికి.

88. పట్టెయ్య: రాకడ,పోకడలు లేని ఉనికిని
రాకడ,పోకడలు ఉన్న నేను ఎలా అనుభవించడం?

సద్గురు: అక్కడ అనుభవించడం అనే ప్రసక్తే లేదు.
రాకడ,పోకడలు లేని ఉనికే మీరు.
మీరే అయినదానిని మీరెట్లా అనుభవించగలరు?
పురుషుడు పురుషత్వాన్ని ఎలా అనుభవిస్తాడు?
అక్కడ అనుభవమనే ప్రసక్తే లేదు.
అనుభవమూ అదే, ఉనికీ అదే.

89. పట్టెయ్య: నా మనస్సులోని భావాలు నాకు తెలుస్తున్నట్టుగా, ఇతరుల మనస్సులోని భావాలు నాకు తెలియటం లేదు కదా! ఆ 'అనుభవమే' నేను అని నేనెట్లా అనుకోగలను?

సద్గురు: ఈ 'పట్టెయ్య నేను' అనుకునే నేనుకు అది వీలుకాదు.
'అసలు నేను' నేనుగా అనుభవవేద్యమేగాని

అసంభవమేమీ కాదు.
పట్టెయ్య తెలుసుకునే విషయాలు, అనుభవాలూ వేఱే. పట్టెయ్యను విషయంగా చూచే తత్త్వం వేఱే.
అన్నిటినీ, అందరినీ పట్టెయ్య అనుభవిస్తే, పట్టెయ్యను అనుభవించేవాడు 'అతడు'.
పట్టెయ్యకు విషయములు అనేకం.
కాని పట్టెయ్యను అనుభవించేవానికి ఒకటే విషయం...పట్టెయ్యే.
కాబట్టి తాను అనుభవించేవాటిని గుఱించి మథనపడక, తనను అనుభవించేవానిని గుర్తించడమే చాలు.
పట్టెయ్య అనుభవాలు అనేకం.
కాని పట్టెయ్యను అనుభవించేవాని అనుభవం ఒక్కటే - "నేను".

90. పట్టెయ్య: ఇక్కడ ప్రత్యేకంగా పట్టెయ్య అనుభవాలంటూ ఏమీలేనట్లుగా కనిపిస్తున్నాయి....

సద్గురు: లేనట్లుగా కనిపించినా, ఉన్నట్లుగా అనిపించినా నష్టమేమీ లేదు...

91. పట్టెయ్య: ఒక సమయంలో ఉన్నట్లుగా ఉంటుంది. తమలాంటివారితో మాట్లాడుతున్నప్పుడు లేనట్లుగా ఉంటుంది.

సద్గురు: అది ఒక సమయంలో ఉన్నట్లుగా, మరొక సమయంలో లేనట్లుగా కనిపించేవన్నీ కూడా లేనివే. 'నేనున్నాను' అనేది సదా ఉన్నది. సదా ఉన్నదే తత్త్వమ్. అది నీవే.
పట్టెయ్య ఒక కల కంటున్నాడు అనుకుందాం...
పట్టెయ్యకు ఒక్కనికే నిద్రించి కలకనేవానితో సంబంధం. ఇతరముతో, ఇతరులతో సంబంధం లేదు.
అలాగే ఇతరంతో, ఇతరులతో పట్టెయ్యకు సంబంధం ఉన్నదేగాని, కలకనేవానితో పట్టెయ్య ఒక్కనికే సంబంధం ఉన్నది.
అందువల్ల అనుభవం రెండు రకాలుగా గోచరిస్తుంది-
1. ఆత్మలో నేనున్నాను.
2. ఆత్మగానే ఉన్నాను.
ఆత్మలో నేనున్నాను - అనేదానికి ఇతర అనుభవాలు గోచరిస్తాయి.

ఆత్మనే అయి ఉన్నాను - అనేదానికి ఏ అనుభవమూ లేదు.
కేవలం ఆత్మానుభవమే.
"ఆత్మ ఉన్నది" అని కాకుండా
"ఉన్నది ఆత్మ" అని ఉండాలి.
"ఉన్నది"యే సకలంగా ఉన్నది అని ఉన్నప్పుడు
ఏ సమస్యా ఉండదు.

92. పట్టెయ్య: 'ఉన్నది ఆత్మే' అనేది అనుభవమన్నమాట...

సద్గురు: అది అనుభవం కాదు...
'అదే అది' అనడమే సరి.
అనుభవం అంటే-
అనుభవించేవాడు-అనుభవింపబడేది
వేఋవేఋగా ఉంటాయి.

93. పట్టెయ్య: 'ఆత్మ ఉన్నది' అని అన్నవాడికే ఇవి ఉంటాయి...

సద్గురు: అవును.
'ఉన్నది ఆత్మ' అని ఉన్నవాడికి ఒక్కటే ఉంటుంది.
ఆఒక్కటి తానే అయి ఉంటాడు.
కాబట్టి
ఉన్నది - నేను.
ఉన్నట్లున్నది - సకలము.
ఆ సకలంలో తన(వ్యక్తిగతమైన) నామరూపాలు కూడా చేరిపోతాయి.

94. పట్టెయ్య: అంటే సకలంలో ఒకడుగా ఉన్నవాడు పట్టెయ్య అన్నమాట...

సద్గురు: అంతేకదా...

95. పట్టెయ్య: బాగుందండీ....

* * *

సద్గురు: అండంలో కేవలం ప్రాణి మాత్రమే కాదు,
ఆ ప్రాణి మొత్తం జీవితానికి సంబంధించిన యావత్ ప్రపంచము

కాలదేశములతో సహా సూక్ష్మరూపంలో ఉంటుంది.
అలాగే మఱ్ఱివిత్తనంలో మఱ్ఱిచెట్టు సూక్ష్మరూపంలో ఉంటుంది.
కేవలం ఆ మఱ్ఱిచెట్టే కాదు, ఆ చెట్టు పుట్టినప్పటి నుంచి అది శిథిలమైపోయేవరకు దానిని ఆవరించి ఉండే ఆకాశము, భూమి, ఆ చెట్టు కొమ్మలమీద వ్రాలి, లేచేపోయే పక్షులతో సహా ఆ చెట్టునీడలో సేదతీరే బాటసారులతో సహా దాని జీవితం మొత్తం దాని ప్రపంచం మొత్తం ఆ విత్తనంలో ఉంటుంది. అదేవిధంగా అండములో కూడా ఒక పక్షి అది తిరిగే ప్రదేశాలు, దానిని చూసే మనుష్యులు, దృశ్యాలు అన్నీ ఆ అండములో ఉంటాయి.

96. పట్టెయ్య: మనిషి యొక్క పిండం విషయంలో కూడా అంతేనా?

సద్గురు: అవును..

97. పట్టెయ్య: అంతా ముందుగానే నిర్ణయించబడి ఉన్నప్పుడు ప్రత్యేకించి మనం అలా చేయాలి, ఇలా చేయాలి అని...ఈ ఆలోచనలు, ఆ ఆలోచనలు అని...ఇదంతా ఎందుకు?

సద్గురు: అవన్నీ వద్దనే కదా పెద్దవాళ్లు చెప్పింది...

98. పట్టెయ్య: అంటే దీని అర్థం ఏ ఆలోచనలూ లేకుండా ఉండాలంటారా?

సద్గురు: పిండంలో ఎట్లా ఉంటే అట్లా ఉంటారు...

99. పట్టెయ్య: మన ప్రమేయం ఏమీ ఉండదంటారా?

సద్గురు: అంతేకదా...
మన ప్రమేయం ఉన్నట్లైతే మనకిష్టమొచ్చినట్లు కలుగజేసుకుంటాం కదా!

100. పట్టెయ్య: ఈశ్వరసృష్టి అంత కచ్చితంగా, నిష్కర్షగా ఉంటుందా?

సద్గురు: అవును...

101. పట్టెయ్య: శాస్త్రాలు చెప్పిన ఆగామి సంచిత ప్రారబ్ధ కర్మలలో 'ఆగామి కర్మ' విషయంలో మనకు స్వేచ్ఛ ఉంటుందని, రాబోవు జన్మను మన ఇష్టం వచ్చినట్టు మలచుకునే వెసులుబాటు ఉంటుందని అంటారు కదా!

సద్గురు: ఈశాస్త్రాలు ఇవన్నీ కూడా మీరు వచ్చిన తరువాత మీకు తెలిసినవా? మీరు రాక ముందు తెలిసినవా?

102. పట్టెయ్య: నేను వచ్చిన తరువాతనే...

సద్గురు: మొదట వచ్చినవాడివి నీవు.
తరువాత వచ్చినవే మిగతా అన్నీను.
తిరిగి వెళ్లేటప్పుడు మాత్రం ముందు అన్నీ వెళ్లిపోయాకే, చివర్న వెళ్లేవాడివి నీవు.
అక్కడ వదిలిపోయేదీ లేదు.
అక్కడ వదిలి వచ్చేదీ లేదు.

103. పట్టెయ్య: 'ఆగామికర్మ' విషయంలో జీవునిస్వేచ్ఛ ఉండడం ఏ మాత్రం నిజం?

సద్గురు: ఆగామికర్మ కూడా పిండము లోపల సూక్ష్మరూపంలో ఉండేదే.
ప్రారబ్ధ-సంచిత-ఆగామి ఇవన్నీ మనం పెట్టుకున్న పేర్లే... ఏ కర్మయినా ఒకటే.
శాస్త్రాలలో చెప్పిన ఆ విషయాలను మీరు వినింది జాగ్రదవస్థలోనా? గాఢనిద్రావస్థలోనా?

104. పట్టెయ్య: నా మెలకువలోనే...

సద్గురు: అదీ విషయం...ముందు మీరు మేలుకోవాలి...మీరు మేలుకున్నాకే దేనినైనా మీరు గుర్తిస్తుండేది.
కలకైనా, మెలకువకైనా గాఢనిద్రే ఆధారం.
గాఢనిద్రనే 'నిజమైన మెలకువ' అనాలి.
భేదం తోస్తుంటే నీవు కలలో ఉన్నట్లే.
భేదం తోయకుంటే నీవు గాఢనిద్రలో
అనగా 'నిజమైన మెలకువ'లో ఉన్నట్టే.
గీతలో కూడా ఏం చెప్పారంటే-
అందరూ నిద్రపోతుంటే యోగి మేల్కొని ఉంటాడు.
అందరూ మేల్కొని ఉండేటప్పుడు యోగి నిద్రపోతుంటాడు...అని.

ఆయన నిద్రపోతే అందరూ ఏర్పడరు.
అందరూ ఉంటే ఆయన ఏర్పడడు.
పలికేవన్నీ పలవరింతలు.
చూచేవన్నీ కలవరింతలు.
ఇవి వ్యాధి లక్షణాలు.

105. పట్టెయ్య: ఎంత గొప్ప సత్యవాక్కులైనా అంతేనా?

సద్గురు: అవును...పలవరింతలే.

106. పట్టెయ్య: ఎంత గొప్ప మహనీయులైనా అంతేనా?

సద్గురు: అవును...కలవరింతలే.

వీళ్లందరూ మీ 'నిజమైన మెలకువ'లో ఉండరు.

107. పట్టెయ్య: నేనొక్కణ్ణే మేలుకొంటే సరిపోతుందంటారా?
నా గాఢనిద్రే నిజమైన మెలకువ అంటారా?

సద్గురు: అంతే.

108. పట్టెయ్య: నా ఇప్పటి మెలకువ అంతా ఓ కలేనా?

సద్గురు: అవును.

* * *

135. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

మౌనభాషణం - 2

---

సద్గురు: వాస్తవం కాని ఊహ నీచే ఊహించబడదు.
నీచే ఊహించబడింది అంటే అది ఎప్పటికైనా వాస్తవరూపం దాలుస్తుందనే...

1. పట్టెయ్య: ఊహించినంతమాత్రాన ఊహ నిజమౌతుందా?
ఊహ అనేది జరగనిదానిని కూడా ఊహించుకుంటుంది కదా?

సద్గురు: వాస్తవమనేది కూడా ఊహే.
జరుగుతున్న ఊహను వాస్తవమంటున్నాము.
జరగబోయే వాస్తవాన్ని ఊహ అంటున్నాము.
వాస్తవమయ్యే వఱకు అది ఊహగానే ఉంటుంది.
వాస్తవమయితే ఆ ఊహే వాస్తవమని పిలువబడుతుంది.
మనం దేనిని వాస్తవమంటున్నామో
అది రెండవస్థల్లో ఉండి ఒక అవస్థలో లేకుండా పోతోంది కదా! కాబట్టి వాస్తవమనేది వాస్తవం కాదు. నిజంగా వాస్తవమైతే సర్వదా సర్వకాల సర్వావస్థల్లో ఉండాలి.

2. పట్టెయ్య: ఇప్పుడు తాను ఊహించాడు అంటే,
అది ఎప్పటికైనా వాస్తవమై తీరుతుందంటారా?
వాస్తవమయ్యే పరిస్థితి ఉంటేనే అది మనలోకి ఊహగా వస్తుందంటారా?

సద్గురు: అవును.

3. ఆ వాస్తవం భూత-భవిష్యత్-వర్తమాన కాలాల్లో ఎప్పుడైనా జరిగి ఉండవచ్చా?

సద్గురు: అవును.

* * *

సద్గురు: తన కోరిక తనకు అర్థమైతే,
అర్థమైన క్షణములోనే అది నెరవేరుతుంది...

4. పట్టెయ్య: కోరిక అనేది భౌతికవిషయం కదా?

సద్గురు: భౌతికం ఆధ్యాత్మికానికి భిన్నంగా ఉందా?
పంచేంద్రియాలకు అందుబాటులో ఉండే ఆధ్యాత్మికమే భౌతికం.
పంచేంద్రియాలకు అందుబాటులో లేని భౌతికమే ఆధ్యాత్మికం.

5. పట్టెయ్య: కోరిక అంటే ఏదో విషయాలకు సంబంధించి ఉంటుంది కదా?

సద్గురు: ఉనికి ఒక్కదానికే ఉన్నది.
అది ఏ రూపంలోనైనా మనకు అనుభవంలో ఉండొచ్చు.

కోరిక రూపంలో ఉండొచ్చు...
విషయాల రూపంలో ఉండొచ్చు...

6. పట్టెయ్య: ఉనికి ఉన్నది ఒక్కదానికే కాబట్టి
దాని నుండి వచ్చే కోరిక ఏదయినా నెరవేరుతుందంటారా?

సద్గురు: అంతే కదా!
నెరవేరినప్పుడే అర్థమైనట్టు గుర్తు.

7. పట్టెయ్య: అర్థమయ్యే కదా కోరుకుంటాడు...
నాకు అదికావాలి, ఇది కావాలి అని...

సద్గురు: ప్రతి ఒక్కరికీ అబద్ధం ఆడరాదు అని తెలుసు కదా! కానీ
అబద్ధాలు ఆడుతూనే ఉన్నారు కదా!
ఇప్పుడు వారు తెలిసినవారి క్రింద లెక్కా?
తెలియనివారి క్రింద లెక్కా?

8. పట్టెయ్య: తెలియనివారి క్రిందే లెక్క.
అబద్ధం ఆడుతున్నారు కనుక.

సద్గురు: అబద్ధం ఆడటం నిలిపివేసినరోజు
అబద్ధం ఆడరాదు అన్న విషయం వాడికి తెలిసినట్టు.

9. పట్టెయ్య: తాను కోరుతూనే ఉన్నాడంటే, తనకు ఆ కోరిక అర్థం కాలేదనేనా?

సద్గురు: అంతేకదా! కోరిక అనేది కూడా ఇంతకు ముందు మనం ప్రస్తావించుకున్న 'ఊహ'తో సమానమైన పదమే. వాస్తవమనేది ఆ కోరిక తీరినప్పుడు కలిగే స్థితి. వాస్తవమైతేనే కోరిక తీరిందని చెబుతారు. కాబట్టి 'కోరిక అర్థమైతే' అంటే 'అనుభవంలోకి వస్తే' అని దాని అర్థం.

10. పట్టెయ్య: అనుభవంలోకి వస్తేనే అర్థమైనట్టు అన్నమాట...

సద్గురు: అవును...
దేనినయినా సరే, మీరు అదిగా అయితేనేగాని దానిని మీరు తలవలేరు, చూడలేరు...

11. పట్టెయ్య: నేను 'భగవద్గీత' అయితేనే నేను గీతను చూడగలను, తాకగలను, చదువగలను...

సద్గురు: భగవద్గీతే కాదు, మామూలు వస్తువులు చూడాలన్నా మీరు అది అయితేగాని మీరు దానిని చూడలేరు. అంతేకాదు, మీరు బాబు అయితేగాని బాబును చూడలేరు. మీరు రాజారాం అయితేగాని రాజారాంను చూడలేరు. అది మహావేగంగా జరుగుతుంది కాబట్టి ఆ విషయం మనకు తెలియదు.

* * *

సద్గురు: జగత్తుకు ఇంతవఱకు సద్గురువే పరిచయం కాలేదు...

12. పట్టెయ్య: అదెలాగండీ...శంకర భగవత్పాదులు, రామకృష్ణులు, రమణులు లాంటి గురువులున్నారు కదా! వారి ద్వారా ఎంతో జ్ఞానం లోకం పొందినట్లు అనుభవించినట్లు చరిత్ర ఉంది కదా!

సద్గురు: జగత్తు యొక్క వైశాల్యము, దాని కొలతలు చెప్పండి ముందు...

13. పట్టెయ్య: మనం భూగోళంలో నివసిస్తున్నాం కాబట్టి భూగోళమే మనకు తెలిసిన జగత్తు.

సద్గురు: భూగోళానికన్నా పెద్దది ఏది?

14. పట్టెయ్య: అంతరిక్షం.

సద్గురు: జగత్తుకు అవకాశంగా అంతరిక్షం ఉంది కాబట్టి జగత్తు కన్నా పెద్దది అంతరిక్షం.
జగద్గురువు అంటే జగత్తు కన్నా పెద్దది అని అర్థం.
జగద్గురువు అంతరిక్షమే.
ఆ అంతరిక్షమే వేదములను పలికిన ఋషుల నుంచి,
మొన్న మొన్నటి వరకు ఉన్న రమణమహర్షి వరకు
ఆ ఒక్కటే మాట్లాడింది.

15. పట్టెయ్య: అంటే అంతరిక్షమే మాట్లాడుతుందంటారా?

సద్గురు: అంతే కదండీ...
అంతరిక్షానికి మాట్లాడేది తెలియకపోతే
దానిలో ఏర్పడ్డ మనకు ఎట్లా వచ్చింది మాట్లాడే శక్తి?
దానిలో పుట్టి, దానిలో ఉండి, దానిలోనే లయించే మనకే ఇన్ని శక్తులుంటే
అంతరిక్షానికి ఉండదా?

16. పట్టెయ్య: ఉంటాయండీ...

సద్గురు: మీ మాటల్ని నా ఫోన్ ద్వారా వింటున్నాను...
నా మాటల్ని మీ ఫోన్ ద్వారా వింటున్నారు...
అలాగే శంకరభగవత్పాదుల 'ద్వారా'
రామకృష్ణుల 'ద్వారా'
రమణుల 'ద్వారా'
వినడం జరిగింది.

17. పట్టెయ్య: మూలం అంతరిక్షమే అన్నమాట...
అంతరిక్షమే మహనీయుల 'ద్వారా' మాట్లాడిందన్నమాట...

సద్గురు: మహనీయుల 'ద్వారా' మాత్రమే కాదు,
మన 'ద్వారా' మాట్లాడేది కూడా అదే.

18. పట్టెయ్య: మరి జగత్తుకు సద్గురువే పరిచయం కాలేదనటం...!

సద్గురు: మనం ఇక్కడ వేఱువేఱుగా చూస్తున్నాం కాబట్టి జగద్గురువు మనకు అనుభవంలోకి రావడం లేదు. జగత్తు రూపంగా ఉన్నది సద్గురువే అని ఉంటే మనకు పరిచయం ఉన్నట్టే.

19. పట్టెయ్య: దాని ద్వారానే మనకు ఈ మాటలన్నీ
వినిపిస్తున్నాయంటారా?

సద్గురు: మనకు మాట్లాడాలంటే నోరు ఉండాలి.
వినాలి అంటే చెవులుండాలి.
అవన్నీ అంతరిక్షంలో సృష్టించబడ్డాయి.
కాబట్టి అది నోరు లేకనే మాట్లాడగలదు.

చెవి లేకనే వినగలదు.
మనసు లేకనే సంకల్పించగలదు.

20. పట్టెయ్య: దానికి శరీరమే అవసరం లేదన్నమాట...

సద్గురు: జగత్తే దాని శరీరం.

21. పట్టెయ్య: అంటే మన నోర్లు, మన శరీరాలు, మన బుద్ధి, మన మనస్సు అన్నీ జగద్గురువు ఉపకరణాలన్నమాట...

సద్గురు: అంతే.

* * *

సద్గురు: అనిర్వచనీయమైన శక్తి లోకంలోని కుటుంబాల మొత్తం దుఃఖాన్ని లోకంలోని అందరికి సరాసరిన పంచబడి, అందరి చేతా సమంగా అనుభవించేటట్లు చేస్తుంది...

22. పట్టెయ్య: మరి వారి వారి ప్రారబ్ధకర్మానుసారంగా భగవంతుడు సుఖదుఃఖాలనిస్తాడని అంటారు కదా!
మీరేమో సరాసరి లెక్కన పంచబడుతుంది అని అంటున్నారు...మరి ఇదెట్లా సమన్వయం?

సద్గురు: ఎవరికి వారు అనుభవించేవాటిల్లో తేడాలన్నీ చూచేవారికి మాత్రమే. అనుభవించేవారికి సరాసరి లెక్కనే అనుభవంలో ఉంటుంది. ఒకడు ఎక్కువ దుఃఖపడుతున్నట్టు ఇతరులకు అనిపిస్తుందేగాని, అంత దుఃఖం వాడి అనుభవంలో ఉండదు. వాడు అనుభవించేది సరాసరి దుఃఖాన్నే.
ఒకడు ఎక్కువ సుఖాన్ని పొందుతున్నట్టు పైకి అనిపిస్తుందేగాని, వాడి స్వానుభవంలో సరాసరి సుఖమే ఉంటుంది.

23. ఇక్కడ ప్రారబ్ధకర్మానుసారంగా వచ్చే అనుభవంలో హెచ్చుతగ్గులు ఉండవా?

సద్గురు: ఉండవు.
అందుకే మనం ముందుగా దేహాన్ని గుఱించి ఉపమానంగా చెప్పుకున్నాం...
దేహంలో అవయవాలు అనేకం ఉన్నాయి.

ఇంద్రియాలు ఉన్నాయి.
ఏ అవయవంగాని, ఇంద్రియంగాని స్వస్థత కలిగి దాని స్థితి సుఖభాజనమైతే ఆ సుఖాన్ని దేహమంతా అనుభవిస్తుంది.
అలా కాక ఏదయినా అది చిన్నదే కాని, స్వస్థత చెడి దుఃఖభాజనమైనప్పుడు ఆ బాధను, దుఃఖాన్ని దేహమంతా అనుభవిస్తుంది. కలక పడింది కంటిలోనేకాని, ముల్లు విరిగింది కాలిలోనేగాని ఆ బాధను దేహమంతా అనుభవించడం తెలిసిందే. కాబట్టి ఏ అవయవం యొక్క సుఖంగాని, దుఃఖంగాని దేహమందలి ఒక శక్తి చేత అణువణువుకు సమంగా పంచబడుతుంది. అనుభవానికి గురిచేస్తుంది. అక్కడ హెచ్చుతగ్గులున్నాయా?

24. పట్టెయ్య: లేవు స్వామీ...

సద్గురు: ఆ విధంగానే ఇక్కడ కూడా...

25. పట్టెయ్య: ప్రారబ్ధం అనేది లేనట్లేనా?

సద్గురు: నేను ఈ దేహమాత్రమే అని తలచేవానికే ప్రారబ్ధం అని చెప్పబడింది.

26. పట్టెయ్య: అంటే, ప్రారబ్ధకర్మానుసారంగా అనుభవించేదంతా కూడా దేహస్ఫురణ పోవడంతో పాటు అంతమయిపోతుందన్నమాట...

సద్గురు: మీరు ఒక స్వప్నాన్ని కన్నప్పుడు అక్కడ దుఃఖితుల యొక్క దుఃఖంగాని, సుఖపురుషుల యొక్క సుఖంగాని దానిని ప్రారబ్ధం అని చెప్పగలరా? కల కనేవాని అనుభవమే అక్కడ వారి అనుభవం అవుతుంది. దుఃఖితుల అనుభవంగాని, సుఖుల అనుభవంగాని ఆ విధంగా జగత్తులో సరాసరి దుఃఖానుభవాన్నే సుఖానుభవాన్నే అనుభవిస్తుంటాడు.
సరాసరి అనుభవిస్తున్నాడని అందరి ప్రకటన ఒకే విధంగా ఉండదు. ప్రకటన పలు విధాలుగా ఉన్నప్పటికీ సుఖదుఃఖానుభవాల్ని సరాసరి లెక్కనే అనుభవిస్తుంటారు.
ఒక లోభికి ఒక్క రూపాయి నష్టము

ఒక ఉదారుడికి కోటిరూపాయిల నష్టంతో సమానం. ఉదారుడు కోటిరూపాయిల నష్టాన్ని అనుభవించే అనుభవం లోభి ఒక్క రూపాయి నష్టములోనే అనుభవిస్తాడు. కాబట్టి ఇవన్నీ ఇతరుల దృష్టిలో నుంచి చెప్పబడిన మాటలే. స్వానుభవంలో సరాసరియే అనుభవంలో ఉంటుంది.

27. పట్టెయ్య: దేహాభిమానం ఉన్నవాడికి, లేనివాడికి అనుభవించే విషయంలో సమానంగానే వర్తిస్తుందంటారా?

సద్గురు: అది ఇతరుల విషయంలో కాదు మీ విషయంలోనే లెక్క అది. ఇతరుల విషయం ఎట్లా కనిపించినా సరే మీరు అనుభవించే సుఖమే సరాసరి.

28. పట్టెయ్య: జ్ఞాని విషయంలో చూస్తే సుఖదుఃఖాలు స్వప్నతుల్యంగా ఉంటున్నాయి. అజ్ఞాని విషయంలో సుఖదుఃఖాలు యదార్థంగా బాధిస్తున్నాయి కదా!

సద్గురు: ఇతరులెవరూ లేరు. మీరొక్కరే ఉన్నది. జ్ఞాని సుఖాన్ని, అజ్ఞాని దుఃఖాన్ని మీరే అనుభవిస్తున్నది.

* * *

సద్గురు: పరమాత్మునికి ఆద్యంతములు లేవని చెప్పారు...పోనీ, మీ "ఆది" మీకు తెలుసా?

29. పట్టెయ్య: తెలియదు...

సద్గురు: మీ అంత్యం తర్వాత పరిస్థితి మీకు తెలుసా?

30. పట్టెయ్య: తెలియదు...

సద్గురు: మరి మీరు ఆద్యంతములు లేనివారే కదా! మీరు పరమాత్ములే కదా!
పరమాత్మునికి చెప్పబడిన లక్షణములన్నీ స్వయంగా తనవే.

31. పట్టెయ్య: బాగున్నదండీ...

సద్గురు: బాగున్నదే బాగున్నది.

* * *

32. పట్టెయ్య: నరకాసురవధ అంటే ఏమి?
తాత్త్వికంగా ఏదైనా అర్థం ఉన్నదా?

సద్గురు: పట్టెయ్యే నరకాసురుడు.
గాఢనిద్రలో పట్టెయ్య లేడు.
కలలో, మెలకువలో పట్టెయ్య ఉన్నాడు.
సాపేక్షకమైన సుఖదుఃఖాలకు 'నేను పట్టెయ్య' అన్న అహంభావనే ఆలంబన.

33. పట్టెయ్య: నరకాసుర వధ అంటున్నారు కదా! వధించేదెవరు?

సద్గురు: గాఢనిద్రలో ఉన్నవాడే.
'పట్టెయ్య నేను కాదు అని తెలుసుకోవడమే వధ.
ఇంతకన్నా వధ ఏమున్నది?

34. పట్టెయ్య: భగవద్దర్శనం అంటే ఏమి?

సద్గురు: ఇక్కడున్న బాబును బాబు అని,
చిలకమ్మను చిలకమ్మ అని, రాఘవులను రాఘవులు అని వ్యవహార సౌలభ్యం కొఱకు అలా అనవచ్చు...
కానీ పరమసత్యం ఏమంటే-
భగవంతుడే బాబుగా, చిలకమ్మగా, రాఘవులుగా ఉన్నారనేది అనుభవంలో ఉండాలి.
సకల నామరూపాలతో వ్యవహరిస్తుండేది భగవంతుడే అని తెలిసి ఉండడమే భగవద్దర్శనం.

* * *

సద్గురు: కలలో కనిపించే ఆకారాలు, వికారాలు అన్నీ ఆ కలను కనేవాడివే అయినట్లుగా, ఈ జాగ్రదవస్తలోని సకల ఆకారాలు, వికారాలన్నీ అచ్చంగా నీవే.

35. పట్టెయ్య: అది కల, ఇది నిజం కదా!

సద్గురు: ఇదీ కలే.
దీనికీ దానికీ తేడా లేదు.

పట్టెయ్య కలకు పట్టెయ్యే ఆధారం.
కానీ 'జాగ్రత్-స్వప్న-సుషుప్తులు మూడూ కలిపి ఓ పెద్ద కల' అని ఉన్నవాడు మాత్రం పట్టెయ్య కాదు.
వాణ్ణే "దేవుడు" అనేది మనం.
నీ కలకు, ఆయన కలకు తేడా ఏమంటే-
కలలో నీవు ఉన్నంతవఱకు ఇది కల అని నీకు తెలియదు.
ఆయన కల ఎటువంటిదంటే,
ఆయన కల కంటూనే 'ఇది కల' అనే జ్ఞప్తిలో ఉంటాడు.
అందుకే నీకు ప్రతీది అంటుతుంది.
ఆయనకు ఏదీ అంటదు.
నీవు మేలుకున్నందుకు గుర్తేమంటే-
నీవు తప్ప నీకు అన్యంగా ఏమీ గోచరించదు.
నిజమైన మెలకువలో భేదాలకు తావుండదు.

* * *

సద్గురు: పిల్లవాడికి చదువు రావడం మాష్టారు చెప్పడం వలన కాదు.
సంతానం కలగడం భార్యాభర్తల కలయిక వలన కాదు.
మొక్క మొలవడం విత్తు నాటడం వలన కాదు.
ఒకదాని నుంచి ఒకటి అలా వచ్చినట్టు కనిపిస్తుందేగాని,
అది తనకు తానై వస్తుంది.
గురువు చెప్పినందు వలన,
శిష్యుడు విన్నందు వలన
శిష్యుడికి స్వస్థితి గుర్తుకు రావడం కాదు,
వీళ్లిద్దరికీ సంబంధం లేకుండా వస్తుంది అది.
నేను చెప్పడం వలన వచ్చింది అని గురువు,
నేను విని, అర్థం చేసుకుని, ఆచరించడం వలన వచ్చింది అని శిష్యుడు భ్రమపడుతుంటారు.

36. పట్టెయ్య: తానుగా తాను రావడానికి సంబంధించిన ప్రక్రియను తానే ఏర్పాటు చేసుకుంటుందా?

సద్గురు: అంతే.
అది తనకు తానుగా వస్తుంది.
మరొకరు, మరొకటి కారణం కాదు.

37. పట్టెయ్య: కానీ చూచేదానికి అట్లా అనిపిస్తుందన్నమాట...

సద్గురు: అవును.
నలుగురు సంతానం కలిగిన తల్లిదండ్రులకు నలుగురూ ఒక్క లెక్కలోనే కదా ఉండాలి! అలా ఉండడం లేదే!
అందులో ఒకడు రాగిగా ఉంటాడు...
మరొకడు విరాగిగా ఉంటాడు...
ఒకడు ఆస్తికుడుగా ఉంటాడు...
మరొకడు నాస్తికుడుగా ఉంటాడు...
ఒకే కంపెనీ నుండి ఒకే రకమైన కార్లు ఉత్పత్తి కావొచ్చుగాక, కానీ వాటిని నడిపే డ్రైవర్లు ఒకే రకంగా ఉండరుగా...అట్లాగే ఇదీను...
* * *

భగవాన్ చెప్పిన 'సహజసమాధి' అంటే అందరూ అనుష్టించదగిన ఏదో ప్రక్రియ అని కాదు.
ఎన్ని రకాలుగా ఉన్నా అన్నీ సహజంగా ఉన్నాయని తెలిసి ఉండడమే సహజసమాధి.
రెండు వేఱు వేఱు లక్షణాలను కలిగిన వాటిని ఒకే లక్షణంగా చేయాలనే ప్రయత్నం కాదు సహజసమాధి.
అది ఆ విధంగా ఉండడం సహజం.
ఇది ఈ విధంగా ఉండడం సహజం.
అని ఉండడమే సహజసమాధి.
సహజ సమాధిలో ఉన్నవాడికి ఏదీ పొరపాటుగా కనిపించదు...
ఏదీ అసహజంగా కనిపించదు...
ఏదీ అపరిపూర్ణంగా కనిపించదు...
సృష్టిలో ప్రతీది దేనికది సహజంగా పూర్ణంగా ఉందని, మార్పు తేవలసిన అవసరం ఎప్పుడూ ఎక్కడా లేదని తెలిసి స్థిమితంగా ఉంటాడు.

వైవిధ్యతలో అంతర్లీనంగా ఉన్న సమత్వాన్ని దర్శించడమే సహజసమాధి.
పైపై పరిస్థితులు ఏవీ మారవు.
నిజానికి సమత్వం అనేది లోపలి విషయం.
బయటి విషయం కానేకాదు.

* * *

సద్గురు: 'గురుచరిత్ర' పుస్తకం తెరచి మనం చదవడం ప్రారంభించగానే అక్కడ జరిగేది ఏమంటే- గురువే మన చరిత్రను చదవడం జరుగుతుంది.

38. పట్టెయ్య: అలాగా స్వామీ...!!!
గురువే చదివేవాణ్ణి చదువుతాడన్నమాట!

సద్గురు: అవును.
గురుచరిత్ర అంటే గురువు యొక్క చరిత్ర అని కాదు.
గురువు చదివే చరిత్ర అని అర్థం.
చూసేదానికి మనం ఆయన చరిత్రను చదివేసినట్లుంటుంది. జరిగేది మన చరిత్రను ఆయన చదవడం.
'బాబుచరిత్ర'ను నీవు చదవాలంటే
బాబుకు ముందు, బాబుకు తర్వాత కూడా నీవుండాలి. అప్పుడే 'బాబుచరిత్ర'ను చదవడం సాధ్యం.
అలాగే 'గురుచరిత్ర'ను చదవాలంటే
గురువుకు ముందు, గురువుకు తరువాత కూడా ఉన్నవానికే అది సాధ్యం.
గురువు 'ఆద్యంత రహితుడు'
మరి గురుచరిత్రను చదువగలవారెవరు?

39. పట్టెయ్య: గురువు తర్వాతనే నేనొచ్చాను కాబట్టి గురుచరిత్రను చదవడం అసంభవం అంటారా?

సద్గురు: అవును.
ఆయన నీ చరిత్రను చదువగలడేగాని,
నీవు ఆయన చరిత్రను చదువలేవు.
చంకలో బిడ్డ తల్లిని గట్టిగా పట్టుకుని ఉంటుంది.

చంటిబిడ్డ పట్టుకుని ఉండడం వలన తల్లి నిలబడగలిగి ఉంది అని అనుకున్నట్లు, గురుచరిత్ర చదువుతున్నాను అని అనుకోవడం కూడా.

40. పట్టెయ్య: అంటే, పట్టెయ్య ఖాళీ అయిపోతాడన్నమాట...

సద్గురు: ఖాళీ అవడు...ఆ గురుచరిత్రను చదివే పట్టెయ్యను చూచేవాడుగా తాను మారుకుంటాడు. అంటే, తన నుంచి తాను వేఱుపడతాడన్నమాట. ఇదే గురుచరిత్రను పారాయణం చేయడం వలన ముఖ్య ప్రయోజనం.

* * *

సద్గురు: నామరూపములు కలిగిన ప్రతిదానికీ 'సద్గురు' నామం చేర్చవచ్చు...తప్పులేదు.

41. పట్టెయ్య: అతడు సద్గురువు అయి ఉండనక్కర్లేదా?

సద్గురు: సద్గురువే అందరిగా అయి ఉన్నాడు.
జగద్రూపంగా ఉన్నది సద్గురువే.
ప్రతి ఒక్కరికీ సద్గురు నామం చేర్చడం దోషమేమీ కాదు.

42. పట్టెయ్య: అప్పుడే ఆ నామం నిర్దోషం అవుతుందా?

సద్గురు: అవును.
ఏ ఒక్కని నామం ముందు మాత్రమే 'సద్గురు' చేర్చడం దోషం.

43. పట్టెయ్య: మేమంతా అలానే ప్రయోగిస్తున్నామే...! ఏ కొద్దిమందికో సద్గురువు చేర్చి వ్యవహరిస్తున్నాము.
సద్గురు: సద్గురు నామాన్ని చేరిస్తే అందరికీ చేర్చు.
లేదంటే ఎవరికీ చేర్చకు.

* * *

సద్గురు: సృష్టిలో  ప్రతీది దేనికది సహజంగా పూర్ణంగా ఉన్నది.
అసహజమైనది అంటూ ఏదీ లేదు.
నీవిప్పుడు నడుం కట్టి మార్పు తేవల్సిన అవసరం ఎప్పుడూ ఎక్కడా లేదు.
అంతా సహజంగా పూర్ణంగా ఉన్నది.

44. పట్టెయ్య: తనకు తెలిసినా తెలియకపోయినా అంతా సహజంగా పూర్ణంగా ఉందంటారా?

సద్గురు: అవును. తెలిసినందువల్ల లాభంగానీ, తెలియనందువల్ల నష్టంగానీ ఏమీ ఉండదు.
ఈ విషయంలో మహా మేధావులు కూడా బోర్లా పడుతుంటారు. ఏదో ఒకదాన్ని నిలపాలని, గొప్ప చేయాలని ప్రయత్నిస్తుంటారు.

45. పట్టెయ్య: ఈ ఒక్క విషయాన్ని గుర్తిస్తే సరిపోతుందంటారా?

సద్గురు: సరిపోతుందా? సరిపోదా? అనేది మీకు మీకే తెలుస్తుంది.
గుర్తించడం అంటేనే, అనుభవించడం తరువాత ఉండే స్థితినే గుర్తించడం అంటారు.
కేవలం గుర్తించడం కాదు, దాన్నిమీరు యథాతథంగా అనుభవిస్తేనే గుర్తించడం జరుగుతుంది.

* * *

సద్గురు సన్నిధిలో ఓ ప్రస్తావన-
షిరిడీయాత్రలో పర్సు పోగొట్టుకున్నవానికి,
పర్సు దొరికిన వ్యక్తి పర్సు తెచ్చివ్వగా
'బాబా'యే ఈ రూపంలో తెచ్చిచ్చాడని బాబా మహిమకు పొంగిపోయాడు.

సద్గురు: పర్సు ఇచ్చినవాడు మాత్రమే కాదు సాయిబాబా...
మిగతా ప్రయాణికులు కూడా బాబాయే.
స్వయంగా తాను కూడా బాబాయే.
జడమైన రైలు కూడా బాబాయే.

46. పట్టెయ్య: ఏ ఒక్కరికో, ఏ ఒక్కటికో పరిమితం చేసి చూడకూడదన్నమాట...

సద్గురు: అంతేకదా!
ఏదన్నా అద్భుతమో, ఏదన్నా మహిమో చేస్తేనే సాయిబాబా అయ్యేటట్లయితే ఆయన ఇంద్రజాలికుడు అవుతాడేగాని భగవంతుడు ఎలా అవుతాడు?

47. పట్టెయ్య: ఏ ఒక్క పుట్టాన్ని మాత్రమే బాబా మహిమగా చూడడం దోషమంటారా?

సద్గురు: అంతేకదా! అలా చూస్తే ఆయన్ను ఆయనగా గుర్తించలేదని అర్థం...
మహిమను చూపించేవాడూ బాబానే...
మహిమను అనుభవించేవాడూ బాబానే...
ఆ మహిమకు సాక్ష్యంగా ఉండే చుట్టూ ఉన్న జడవస్తువులు కూడా బాబానే...

48. పట్టెయ్య: A to Z సాయిబాబే అన్నమాట...

సద్గురు: బాబా అంటే 'మొత్తం'.
బాబా తప్ప ఇంకేమీ లేదు...
అని ఉన్నప్పుడే 'బాబా' దర్శనం అయినట్టు లెక్క.

49. పట్టెయ్య: త్రిపురా రహస్యం జ్ఞానకాండ రహస్యం అనే గ్రంథంలో జ్ఞానుల్లో స్థితిభేదాలు గురించి చెప్పబడి ఉంది...వివరించండి స్వామీ...

సద్గురు: జ్ఞానుల్లో స్థితి భేదాలుండవు నిజంగా జ్ఞానులైతే. వాళ్లను చూసి, వాళ్లను అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేసేవాళ్లలో ఉన్న తేడాలు అవి.

50. పట్టెయ్య: కొంతమంది జ్ఞానులు శుకుడు వలె విరాగులుగా ఉంటారని, మరి కొంతమంది జ్ఞానులు జనకుని వలె అన్ని కార్యాలు చేస్తూ లోక వ్యవహారంలో మునిగి ఉంటారని చెప్పి వున్నారు కదా!

సద్గురు: అవునవును...ఆ లెక్కలన్నీ చూచేవాళ్లకే, జ్ఞానులకు కాదు.

వాళ్ల ప్రతి కదలికలను రికార్డు చేసి "ఇవి జ్ఞాని లక్షణాలు" అని ప్రపంచానికి ప్రకటించేస్తారు. రాబోయే తరాలవారు అవి చదివి వాటిని ఆదర్శంగా తీసుకొని నానా తంటాలు పడుతుంటారు పాపం.

బుద్ధుడు తర్వాత మరో బుద్ధుడు పుట్టలేదు.
బౌద్ధులు తయారయ్యారు.

క్రీస్తు తర్వాత మరో క్రీస్తు పుట్టలేదు.
క్రైస్తవులు తయారయ్యారు.

రమణుడు తరువాత మరో రమణుడు పుట్టలేదు.
రమణఫాలోవర్స్ తయారయ్యారు.

అందుకే మనం గతంలో ఓ మాట అనుకున్నాం-
'జ్ఞాని పుడతాడు, తయారు కాడు' అని.

కానీ వీళ్లంతా తయారవ్వడానికి ప్రయత్నిస్తున్నారు.
అది అసాధ్యం.

51. పట్టెయ్య: కాబట్టి జ్ఞానుల్లో స్థితి భేదాలు ఉండవన్నమాట...

సద్గురు: అవును. భేదముంటే జ్ఞాని ఎట్లా అవుతాడు? ఆ భేదాలన్నీ ఇతరుల దృష్టిలోనివి.

ఉన్నది జ్ఞానమొక్కటే.
జ్ఞాని అని పురుష, స్త్రీ భేదంతో కూడా ఉచ్ఛరించే వీలు లేదు.

ఇతరులదృష్టికి జ్ఞానేగాని, జ్ఞాని దృష్టిలో జ్ఞానం తప్ప మరేమీ కనబడదు.

52. పట్టెయ్య: ప్రయత్నం ద్వారా ఆత్మానుభవాన్ని పొందలేమా?

సద్గురు: అది 'బోరు' వేసి నీళ్లు సంపాదించడం లాంటిది. అదీ నీరే.

ఏ ప్రయత్నమూ లేకుండా అప్రయత్నంగా 'జల' ఒకటి భూమిలో నుంచి ఊరుతుంది. ఇదీ నీరే.

కానీ ఆ నీరు, ఈ నీరు ఒకటి కాదు.

రమణభగవాన్ ఇటువంటి స్థితిని కలిగినవారు.
భూగర్భజలం తన్నుకుని పైకి తానై ఉరికినట్లు కలిగింది ఆయనకు ఆత్మానుభవం అనేది. అది 'అసలు'.

'జ్ఞానం' అనేది పుస్తకాల ద్వారా, వినడం ద్వారా, అనుకరించడం ద్వారా, ఆచరించడం ద్వారా కలిగేది కాదు. జ్ఞానం లాగా కనిపించవచ్చు అంతవరకే.

ఆకాశంలో మెఱసే మెఱుపు, కెమెరాలో నుంచి వచ్చే ఫ్లాష్ మెరుపు ఒకటిగానే కనిపిస్తుంది. కానీ ఒకటి కాదు.

జ్ఞాని, అజ్ఞాని అనే ప్రశ్న ఉండేది అజ్ఞానికే, జ్ఞానికి లేదు.

జ్ఞానమే ఒక చోట ప్రకటనమై ఉంటే 'జ్ఞాని' అని,
జ్ఞానమే మరొకచోట ప్రకటనం కాకుండా ఉన్నప్పుడు 'అజ్ఞాని' అని లెక్క అవుతోంది.

వెఱసి రెండూ జ్ఞానమే.

జ్ఞానికి జ్ఞానం కాకుండా ఇంకొకటి, ఇంకొకరు కనిపిస్తే జ్ఞాని ఎలా అవుతాడు?

దీనికి తాతగారు ఒక మాట చెప్పారు-
"పతివ్రతకు వేశ్య కూడా పతివ్రతగానే కనిపిస్తుంది" అని.

అట్లా ఎవరు, ఏది, ఏ రూపంలో కనిపించినా అది "జ్ఞానం"గానే జ్ఞానికి అనుభవంలో ఉంటుంది.

భగవంతుడు తప్ప అన్యం గోచరించనివాడు భక్తుడు.

అలాంటప్పుడు భక్తుడికి భక్తుడు కానివాడంటూ ఎట్లా కనిపిస్తాడు?

భక్తుడు కానివాడు కనిపిస్తే, తాను భగవంతుని సర్వవ్యాపకత్వాన్నిగాని, సర్వాంతర్యామిత్వాన్నిగాని తాను అనుభవించలేదనే కదా అర్థం.

53. పట్టెయ్యి: జ్ఞానికి జ్ఞానం తప్ప మరేమీ కనిపించదు...
భక్తునికి భగవంతుడు తప్ప మరేమీ కనిపించదు...
బాగుంది స్వామీ...

* * *

54. పట్టెయ్యి: దత్తాత్రేయ తత్త్వాన్ని గుఱించి వివరించండి స్వామీ...

సద్గురు: ప్రాణముతో కూడిన తనువు - బ్రహ్మ.
కేవల తనువు - విష్ణువు.
కేవల ప్రాణము - శివుడు.

ఈ ముగ్గురి చేత దత్తత చేయబడింది, ఇవ్వబడింది కాబట్టి తానే దత్తాత్రేయుడు.

ప్రాణంతో కూడిన ప్రతి తనువూ దత్తాత్రేయుడే.

ప్రాణం ప్రాణంగా
రక్తమాంసాలు రక్తమాంసాలుగా విడిపోయినప్పుడు
శివకేశవులిద్దరూ విడిపోయినట్టు లెక్క.
అక్కడ బ్రహ్మ ఉండడు.
శివకేశవులిద్దరూ కలిస్తేనే బ్రహ్మ.
ఇది తనువు విషయంలో....

ఇక కుటుంబవిషయానికి వస్తే-
తల్లి - విష్ణువు.
తండ్రి - శివుడు.
సంతానం - బ్రహ్మ.

మహావిష్ణువు గర్భంలో ఒక నాభి కమలం.
ఆ కమలంలో బ్రహ్మ ఉంటాడు అని చెప్పబడి వుంది.

స్త్రీ గర్భాన్ని కూడా కమలం అనే శబ్ధాన్ని ఉపయోగిస్తారు. అది గర్భకోశం. దాంట్లో నుంచి వచ్చేవాడు బ్రహ్మ.

ఆ కమలానికి ప్రాణమిచ్చేవాడు తండ్రి కాబట్టి
ఆయన శివుడు.

తండ్రి - శివుడు.
తల్లి - విష్ణువు.
వీరిద్దరి సంయోగంతో వచ్చినవాడు - బ్రహ్మ.

ఇక జగత్తు విషయానికి వస్తే-
ఆకాశం - శివుడు.
సూర్యుడు - విష్ణువు.
భూమి - బ్రహ్మ.

55. పట్టెయ్య: మరి బ్రహ్మసృష్టి అంటే?

సద్గురు: బ్రహ్మ, శివకేశవుల కలయిక చేత సృష్టించబడ్డాడు. బ్రహ్మ నుంచి మిగతా అంతా సృష్టించబడింది.

* * *

సద్గురు: తనకు రెండుస్థితులున్నాయి...
ఒకటి సాకారము, మరొకటి నిరాకారము.

నేను సాకారంగా ఉన్నప్పుడు-
'సుబ్రమణ్యం అయ్యావారు అని, ఫలానా సిద్ధయ్య
కుమారుడు అని లెక్కకు వస్తుంది.

నేను నిరాకారంగా ఉన్నప్పుడు-
ఇప్పుడు మనం ఈశ్వరుడని, భగవంతుడని చెప్పుకుంటున్నామే ఆ లెక్క నాకే వస్తుంది.

పెద్దవాళ్లు మనకు చెప్పింది ఏమంటే-
ఒక సాధనో, సమాధో, ధ్యానమో చేసి సాకారంగా ఉన్నవాడివి నిరాకారంగా మారాలి అని.

ఇప్పుడు మనం అనేది ఏమంటే-
నీవు ఏకకాలంలో సాకారంగానూ, నిరాకారంగానూ ఉన్నావు అని. కానీ నీవు మొదటి నుండి సాకారంగా ఉండడమే అలవాటు చేసుకున్నావు. Already నిరాకారం కూడా నీకు ఉంది. నిరాకారంగా ఉండడం కూడా అలవాటు చేసుకోమ్మని మనం చెబుతున్నాం....

56. పట్టెయ్య: అంటే నేను సాకారంగా ఉంటూనే నిరాకారానుభవాన్ని పొందగలనా?

సద్గురు: ఏకకాలంలో రెండూ ఉంటాయి...
నేను నీ వైపు చూసినా, నీవు నీవైపు చూసుకున్నా సాకారమే లెక్కకు వస్తోంది. నిరాకారం లెక్కకు రావడం లేదు. అయినా నిరాకారం కూడా ఉన్నది.

నేను నా వైపు చూసుకున్నా లేదా నేను నీ వైపు చూసినా నిరాకారత్వాన్ని చూడగలిగితే మీరూ దైవమే, నేనూ దైవమే.

అంతేగాని ఒకటి మరొకటిగా మారటం ఏమీ జరగదు. తనకున్న రెండు కాళ్లు లాంటివి సాకారనిరాకారములనేవి. ఒక కాలు మీదనే నిలబడి, రెండవ కాలును ముడుచుకుని ఉన్నాడు. ముడుచుకున్న కాలు క్రిందబెట్టి నేల మీద ఉన్న కాలును ముడుచుకుంటే సరిపోతుంది.

57. పట్టెయ్య: సాకారానికి నిరాకారం ఆధారమా?

సద్గురు: అవి పరస్పరం ఆధారం. సాకారం లేనిదే నిరాకారం లేదు, నిరాకారం లేనిదే సాకారం లేదు. ఒకటుంటేనే మరొక దాని ప్రస్తావన వచ్చేది.

58. పట్టెయ్య: నేను సాకారంగా ఉన్నానంటే, నేను నిరాకారంగా కూడా ఉన్నట్టే. కానీ అనుభవంగా లేదేమి?

సద్గురు: ఊహ తెలిసినప్పటి నుంచి సాకారంలో ఉండడం అనేది అలవాటైపోయింది. కాని తన స్థితి రెండూను. అట్లైనా ఉండగలడు. ఇట్లైనా ఉండగలడు. రెండూ తానే కాబట్టి.

59. పట్టెయ్య: మెలకువలో సాకారంగాను, సుషుప్తిలో నిరాకారంగానూఉంటాడు అనేదేనా తమరి అభిప్రాయం?

సద్గురు: కాదు కాదు...మెలకువలోనూ, సుషుప్తిలోనూ రెండూ ఉంటాయి.

60. పట్టెయ్య: సుషుప్తిలో కూడా రెండూ ఉంటాయండీ....!!!

సద్గురు: అవును. కలలో, మెలకువలో సాకారం వైపు ఉంటాడు. సుషుప్తిలో నిరాకారం వైపు ఉంటాడు.

కల, మెలకువ(సాకారం) రెండు భాగాలు.
సుషుప్తి(నిరాకారం) ఒక భాగమే కాబట్టి ఇదే(సాకారమే) నేను అని అనుకుంటున్నాడు.

61. పట్టెయ్య: నాణేనికి బొమ్మ-బొరుసు లాగా ఒకే వస్తువుకున్న రెండు ముఖాలన్నమాట సాకార నిరాకారాలు...

సద్గురు: అవును.
సాకారం - పార్వతి.
నిరాకారం - శివుడు.

62. పట్టెయ్య: ఒకదాని నుంచి మరొకదానిని విడదీయలేమన్నమాట...

సద్గురు: అందుకే అర్థనారీశ్వరుడన్నారు...

63. పట్టెయ్య: సాకారం లేకపోయినా నిరాకారం ఉంటుంది. కానీ నిరాకారం లేకుండా సాకారం ఉండదు...అంతేనా?

సద్గురు: అంతే.

64. పట్టెయ్య: 'చలనం' విషయంలో కూడా అంతే కదా స్వామీ...

సద్గురు: అవును. చలనానికి అచలమే ఆధారము.
చలనానికి 'శక్తి' అని పేరు. అచలానికి 'శివుడు' అని పేరు.

'నేనున్నాను' అనేది అది శక్తి మాట, శివుని మాట కూడా.

కాని వీడికి మొదట నుంచి శక్తి యొక్క 'నేనున్నాను' అనేదే పరిచయం.

శివుని యొక్క 'నేనున్నాను' అనేది పరిచయం లేదు.

65. పట్టెయ్య: ప్రస్తుతం నా అనుభవంగా ఉన్న 'నేనున్నాను' అనేది శక్తి యొక్క ప్రకటనమే అన్నమాట.

సద్గురు: అవును. దానికి ఆనుకునే శివుని యొక్క 'నేనున్నాను' ఉంటుంది. అది లేక ఇది లేదు.

ప్రతి పురుషుని వెనుక స్త్రీ ఉంటుంది. ప్రతి స్త్రీ వెనుక పురుషుడు ఉంటాడు అదృశ్యంగా...

పురుషుని వెనుక ఉండే స్త్రీయే భార్యగా వస్తుంది.
స్త్రీ వెనుక ఉండే పురుషుడే భర్తగా వస్తాడు.

వెనుక స్త్రీ లేకుండా పురుషరూపం నిలబడదు.
వెనుక పురుషుడు లేకుండా స్త్రీ రూపం నిలబడదు.

పురుషుని వెనుక ఉండే స్త్రీ
జగత్తులోకి ప్రకటనం కావొచ్చు, కాకపోవచ్చు.

ప్రకటనం అయితే తాను సంసారి అవుతాడు.
ప్రకటనం కాకపోతే తాను సన్న్యాసి అవుతాడు.

66. పట్టెయ్య: తనలో అర్థభాగమే స్త్రీగా, తన భార్యగా వస్తుందంటున్నారు...ఆశ్చర్యంగా ఉంది స్వామీ...

సద్గురు: అంతేకాదు...ఆమె రూపంకూడా తనలోంచే వస్తుంది జగత్తులోకి.

67. పట్టెయ్య: రూపంతో సహా ముందే నిర్ణయించబడి ఉందన్నమాట తనలో...

సద్గురు: అవును. మీలో లేనిదానిని ఏదీ 'కావాలి' అని నీవు అనుకోవడం జరగదు. 'వద్దు' అనుకోవడం కూడా జరగదు. మీరు కావాలి అనుకునేది మీలోనే ఉంది. అది ఉంది కాబట్టి 'కావాలి' అని మీరు అనుకోవడం జరిగింది.

'వద్దు' అనుకునేది కూడా మీలోనే ఉంది. కాబట్టి దాన్ని వద్దనుకుంటున్నారు.

తనలో ఉంటేనే తలంపుకు వస్తుంది.
లేకపోతే తలంపుకు రాదు.

నాకు మోక్షం కావాలి అన్నారనుకో- అది already మోక్షస్థితి ఉంటేనే నాకు మోక్షం కావాలి అన్న ప్రశ్న పుడుతుంది.

నాకు బంధం వద్దు, ఈ సంసారం వద్దు అన్నారనుకో- అది already ఉంటేనే 'వద్దు' అనే ప్రశ్న వస్తోంది.

మనం కావాలి అంటే ఎక్కణ్ణుంచో ఇక్కడకురావడం, వద్దంటే ఎక్కడకో పోవడం కాదు. ఏదైనా సరే లోపలుంటేనే సంకల్పం వచ్చేది.

ఇప్పుడు మీరు ఇక్కడ ఉన్నారు...
మీరు సదా ఇక్కడ లేకపోతే మీరు మీరు ఊరి నుండి ఇక్కడకు రావడంగాని, ఇక్కడ నుండి మీ ఊరికి పోవడంగాని జరుగదు. ఈ రాకపోకలు జరుగుతున్నాయి అంటే, ఇవి జరగనప్పుడు కూడా మీరు ఇక్కడ ఉన్నట్టే లెక్క.
అనిలాచలశివమాలలో ఓ మాట చెప్పుకున్నాం-

అక్కడ, ఇక్కడ, ఎక్కడ జూచినా
ఇక్కడనే కదా అనిలా చలా (57)

'అది' ఇక్కడ అనొచ్చు, అక్కడ అనొచ్చు, ఎక్కడా అనొచ్చు. మూడింటిలో ఏ పదం ఉపయోగించినా దానర్థం 'ఇక్కడే'.

అప్పుడు ఇప్పుడు ఎప్పుడు తలచిన
ఇప్పుడె అగుదువు అనిలాచలా (56)

ఇప్పుడు కానిదానిని మీరు ఇంతకు ముందెప్పుడూ చూచే ప్రశ్నే లేదు. ఇప్పుడూ చూచే ప్రశ్నే లేదు., ఎప్పటికీ చూచే ప్రశ్నే లేదు.

68. పట్టెయ్య: అనిలాచలశివమాలలో -

ఇంతవాడవని అంతవాడవని
ఏమని తలతుర అనిలాచలా (80)

వివరించండి స్వామీ...

సద్గురు: కిటికీ కొలత పెట్టి నలుచదరంగా పెట్టుకున్నామంటే దాని నుండి కనిపించే ఆకాశం అంతే నలుచదరంగా కనిపిస్తుంది. త్రికోణంగా కిటికీ పెట్టుకున్నావనుకో త్రికోణంగానే ఆకాశం కనిపిస్తుంది. ఆకాశానికంటూ చదరమూ లేదు, త్రికోణమూ లేదు, వృత్తమూ లేదు. ఈ వైపు నుంచి కిటికీ ద్వారాలు తెరచినప్పుడు సాకారమవుతోంది. కిటికీకి ఆవల వైపు వెళ్లినప్పుడు నిరాకారమవుతుంది. అంతే.

* * *

69. పట్టెయ్య: వ్యష్టి సాక్ష్యానుభవము, సమిష్టి సాక్ష్యానుభవము అని రెండు మాటలు విని ఉన్నాను. దయచేసి కాస్త వాటిని గుఱించి వివరించండి...

సద్గురు: 'నేను పట్టెయ్య' అనే స్థితి నుండి 'ఇతడు పట్టెయ్య' అని మీ చేత వస్తే అదే వ్యక్తి సాక్ష్యానుభవము.

పట్టెయ్యనే కాకుండా పట్టెయ్య ఉన్న ప్రపంచం కూడా ఇతరంగా తోచినప్పుడు అది సమిష్ట్యానుభవము అవుతుంది.

ఈ రెండు స్థితుల్లోనూ సాక్షిలో తేడా ఏమీ ఉండదు. ఈ రెండింటి యొక్క పరిధి మారుతుంది అంతే.

ఎవడు వ్యక్తికి సాక్షిగా ఉన్నాడో, సమిష్టికి కూడా వాడే సాక్షిగా ఉన్నాడు.

వాణ్ణే మనం 'కేవలసాక్షి' అనేది.

ఆ కేవలసాక్షి పురుషుడూ కాదు,
స్త్రీ కాదు, నపుంసకుడూ కాదు.

ఆ 'సాక్షి' అనే పదం కూడా ఈ వైపు నుంచే గాని,
ఆ వైపు నుంచి ఆ పేరు కూడా ఉండదు.
అది కేవలం "ఉనికే".

చూడలేక చూడకపోవడం ఒకటి (గ్రుడ్డితనం)

చూడగలిగి చూచుటకు తనకన్నా అన్యం ఏమీలేక చూడకపోవడం ఒకటి (అద్వైతస్థితి)

రెండూ ఒకటిగా అనిపించినా, రెండూ ఒకటి కాదు.

అలాగే సాక్షి, కేవలసాక్షి రెండూ ఒకటిగా అనిపించినా రెండూ ఒకటి కాదు.

ఈ వ్యష్టి సమిష్టి రెండు సాక్ష్యత్వాలు కొంతవఱకే. మరలా సాక్ష్యత్వం ఉంటుందిగాని సాక్షిగా ఉండడానికి సబ్జక్టు ఏమీ ఉండదు. "కేవలం" అనాలి దాన్ని. సాక్షి అనేదానికి కూడా లేదు. ఆ కేవలస్థితినే 'కైవల్యము' అనే పేరుతో మనవాళ్లు చెబుతారు...

....సమాధానం క్లిష్టంగా ఉందా...?

70. పట్టెయ్య: అవునండీ...ఈ సబ్జక్టు క్లిష్టమైనదే కదా!

సద్గురు: అదేమీ కాదు...ఇప్పుడు మీకు నేను పట్టెయ్య అనేది ప్రస్తుతానుభవంగా ఉన్నదనుకుందాం...ఇతరాన్ని చూసినప్పుడు నీకెట్లా ఉంటుందో అట్లా మీ వైపు మీరు చూసినప్పుడు కూడా మీకు ఇతరంగానే గోచరించడం అనేది ఏర్పడుతుంది. దీనినే వ్యష్టి సాక్ష్యానుభవము అంటారు.

పట్టెయ్యకు సంబంధించిన సకలమూ ఇతరంగా గోచరించేటప్పుడు దానిని సమిష్టి సాక్ష్యానుభవం అంటారు.

తరువాత కూడా సాక్ష్యత్వం ఉంటుందేగాని పట్టెయ్య కనిపించడు, పట్టెయ్యకు సంబంధించిన సకలమూ కనిపించదు. సాక్షిగా ఉండటానికి సబ్జక్టు ఉండదుగాని సాక్షి ఉంటాడు.

అప్పు ఇచ్చినవాడు, అప్పు తీసుకున్నవాడు ఇద్దరూ ఉంటే సాక్షి అని సాక్షికి పేరు.

అప్పు ఇచ్చినవాడూ లేడు, అప్పు తీసుకున్నవాడూ లేడు అనుకో...అలాంటప్పుడు సాక్షి అనడానికి అవకాశం ఎక్కడిది?

71. పట్టెయ్య: పట్టెయ్యతో సహా సకలాన్ని సాక్షిగా చూడాలంటే ఏదైనా సాధన ఉన్నదా?

సద్గురు: సాధన వలన క్రొత్తగా సంపాదింపదగిన స్థితి కాదు అది. సాక్షి సదా సాక్షిగానే ఉన్నది. (పట్టెయ్యతో సహా) ఇతరం సదా ఇతరంగానే ఉన్నది.

72. పట్టెయ్య: అయ్యా! నా సందేహం ఏమంటే-
నేను సాక్షిగా ఉండడం వలన పట్టెయ్యకు సంబంధించిన శారీరక దుఃఖాలు తొలుగుతాయా?

సద్గురు: ఏ షేప్ లో ఉన్న కిటికీ ద్వారా చూసినప్పుడు ఆకాశం ఆ షేప్ లోనే కనబడుతుంది.

కాబట్టి సాక్షిగా ఉన్న మీరు మిమ్మల్ని నామరూపాలు అనే కిటికీలోంచి చూసినప్పుడు అది శారీరకం, మానసికం అని రెండు రకాలుగా గోచరిస్తుంది. అక్కడ దుఃఖం నామరూపాలను అనుభవించడంలో ఉందిగానీ "స్థితి" దుఃఖస్థితి అనేది ఎప్పుడూ లేదు. మీకు జరగనప్పుడు, నచ్చనిది జరిగినప్పుడు దుఃఖం అని పేరు.

"ఇష్టమైన కష్టం" అనేది ఒకటుంది...ఇది వాస్తవానికి సుఖమే. గర్భంగా ఉన్న స్త్రీ ప్రసవ వేదన పడుతున్నప్పుడు కష్టంగానే ఉంటుంది శరీరానికి. కాని ఇది ఇష్టమైన కష్టం. ప్రసవం కాగానే క్షణంలో మొత్తం సుఖమయం అయిపోతుంది తన శిశువును చూడగానే.

* * *

73. పట్టెయ్య: దైవం గురించి ఎవరైనా చెప్పుకుంటూ ఉన్నప్పుడు, అది తన గురించి చెప్పుకున్నట్టుగా అనుభూతి చెందడమే స్వానుభవం అని చెప్పారు బాబుగారు...

సద్గురు: నిజమే. ఒకవేళ అట్లు కాని పక్షంలో కూడా స్వస్థితిలో మార్పు ఉండదు. అప్పుడు కూడా తాను అదే(దైవమే).

* * *

74. పట్టెయ్య: జ్ఞానప్రసూనాల్లో ఓ మాట ఉంది-
రమణుడు ఇచ్చిన సమాధానం ప్రశ్నించినవాని వద్దకు చేరనే లేదు.
రమణుని నుంచే వచ్చినట్టు ఉన్న సమాధానం నిజానికి రమణునిది కాదు.
అది ప్రశ్నించినవానిదే.

సద్గురు: అవును. ప్రశ్న అడిగినవాడు సమాధానంలో తనకు కావలసిన కోణంలో, తనకు కావలసినంత వరకు, తనకు కావలసిన రూపంలో తీసుకుంటాడు. ఇదంతా ప్రశ్న అడిగినవాని వ్యవహారము. అది రమణునికి సంబంధించిన సమాధానం కాదు. అడిగినవానికి సంబంధించినది.

ఇక రమణుని భాగంలో-
సమాధానమనేది రమణునికే.
అది ఎవరిదీ కాదు. అది ఎవరినీ చేరదు.

ఆ సమాధానం ప్రశ్నకు సమాధానం కాదు. అది కేవలం సమాధానం. అంతే.

స్వయంగా వండి వార్చిన అన్నాన్ని తీసుకెళ్ళి భగవంతుని విగ్రహం ముందు పెట్టి పూజ చేసి ఆ అన్నాన్ని తానే స్వీకరించినట్లుగా ప్రశ్న, సమాధానము రెండూ తనవే.

రమణునికి ఏ సంబంధమూ లేదు. ఆయన సమాధానం ఇవ్వలేదు...సమాధానంగానే ఉన్నాడు అంతే.

యదార్థమైన ప్రశ్నకు సమాధానం లేదు.
యదార్థమైన సమాధానానికి ప్రశ్న లేదు.

తన వద్ద సమాధానం లేదు అనుకునే కదా ప్రశ్న అడుగుతాడు. సమాధానం ఒకరి చేత ఇవ్వబడేది కాదని, సమాధానం తన దగ్గరే ఉన్నదని తెలుసుకంటాడు. పొందబడిన సమాధానం తనదే; తానే.

* * *

సత్సంగంలో 'జ్ఞానవాశిష్ఠం'లోని చూడాల-శిఖిధ్వజుడు గురించి ప్రస్తావన వచ్చింది-

సద్గురు: 'చూడాల' అనేది ఇతరులకు చూడాల. ఆమెకు నామరూపాలు లేవు. నేను స్త్రీని అనిగాని, నేను ఈ రకంగా ఉన్నాను అనిగాని ఆమెకు లేదు. అయితే ఎట్లా ఉంది ఆమె అంటే- ఉత్పత్తిస్థానం లేని వెలుతురు మాదిరి కేవలం జ్ఞానంగా ఉంది. అటువంటి ఆమె చూడాలగా ఒక స్త్రీగా మారి తన భర్త కోసం ప్రవర్తించిందన్న మాట. అక్కడ సిద్ధి అంటే ఏమీలేదు- నామరూపాలు లేని ఆమె నామరూపాలుగా ప్రవర్తించడమే సిద్ధి.

75. పట్టెయ్య: చూడాల తన భర్తను నమ్మించడం కోసం కొన్ని యోగసాధనలు అవలంబించింది. దాని ఫలితంగా కలిగిన కొన్ని సిద్ధుల వలన మారురూపాల్లో వెళ్లి భర్తకు తత్త్వబోధ చేసినట్లుగా ఉంది...

సద్గురు: ఇప్పుడు మీరు కలలో ఎన్నో రకాలుగా మారుతున్నారు, ఒక్కరు అనేకులౌతున్నారు, అనేక రకాలుగా ప్రవర్తిస్తున్నారు కదా! అలాగే ఇది కూడా. ఒక చూడాల మాత్రమే కాదు, మీరూ జ్ఞానరూపమే, నేనూ జ్ఞానరూపమే. అందరూ జ్ఞానరూపమే. ఆ జ్ఞానాన్ని శుద్ధమైన వెలుగుతో పోల్చవచ్చు. నేను సుబ్రహ్మణ్యం, నేను బాబు, నేను పట్టెయ్య అనుకోవడం ఏమిటంటే, అది జ్ఞానంతో పోల్చినప్పుడు ఇది ఒక సిద్ధి అవుతుంది. ఇది నిజం కాదు అని అర్థం. నిజం కాని దానిలో ఎన్ని అయినా ఉండొచ్చు.

76. పట్టెయ్య: చూడాలగా ఉండడమే సిద్ధి అంటారా?

సద్గురు: అవును. నామరూపాలు లేని తాను నామరూపాలను ధరించడమే సిద్ధి.

77. పట్టెయ్య: అంటే, జ్ఞానమే భౌతికాకృతి ధరించి, అటువంటి ఉపాధి వచ్చేసరికి అది సిద్ధి ఐపోతుంది కనుక ఆ సిద్ధిలో ఎన్ని సిద్ధులైనా

ప్రకటించవచ్చునంటారా?

సద్గురు: అంతేకదా! ఆ ప్రాసెస్సే మిగతా నామరూపాలు కూడా...

78. పట్టెయ్య: అక్కడ సిద్ధులు ప్రకటించవచ్చునన్నమాట...

సద్గురు: అవును. తాను కలగంటున్నాను అనే జ్ఞప్తితో కల కనడం అది. మనం జ్ఞప్తి లేక కల కంటాం.

* * *

సద్గురు: దేవుణ్ణి పొందటానికి మనిషి ఇన్నిసాధనలు చేస్తున్నాడు...నిజంగా పొందటం అంటూ జరిగాక దేవుణ్ణి వదిలించుకోవడానికి ఇంతకు మించి సాధనలు చేయవలసి ఉంటుంది.

79. పట్టెయ్య: (ఆశ్చర్యంగా) పొందేదానికన్నా ఎక్కువ సాధనలు చేస్తాడా స్వామీ...!

సద్గురు: అవును.
పొందటానికి నూరు.
వదిలించుకోవడానికి వేయి.
అయినా లాభం లేదు.

80. అయినా వదలడా పట్టు?

సద్గురు: ఒక్కసారే పట్టు. ఆ పట్టు ఏదో మధ్యలో జరిగినట్టు అనిపిస్తుందేగాని అసలు ఎప్పుడూ పట్టుకున్నది వాడే అన్నది తెలుస్తుంది.

81. పట్టెయ్య: ఓహో అలాగా! ఆ పట్టు మొదట్నుంచి ఉందన్నమాట...

సద్గురు: అవును. ఆయన పట్టుకున్నాకే మనం మనంగా ఉండేది. అది తెలియక మళ్లీ ఆయన పట్టు కోసం ఏవేవో సాధనలు చేస్తుంటాము.

సాక్షాత్తు పరమేశ్వరుడు ఏ వరమూ ఇచ్చే అవకాశం లేదో, అవసరమూ లేదో... ఏ శాపమూ ఇచ్చే అవకాశమూ లేదో, అవసరమూ లేదో అట్టి పరమేశ్వరుశ్వరుణ్ణి వరాలియ్యమని మనం పట్టుకుంటాం, పీకులాడుతాం. ఆయన్ను పొందాకే తెలుస్తుంది, మనం ఆయన్ను పొందలేమని, పోగొట్టుకోలేమని.

* * *

82. పట్టెయ్య: అనిలాచలశివమాల పారాయణం సమిష్టిగా మా సత్సంగంలో జరుపుకోమంటారా? లేక ఎవరింట్లో వాళ్లు పారాయణం చేసుకోమంటారా?

సద్గురు: గుళ్లూ గోపురాలూ, ఆశ్రమాలూ సత్సంగాలు...ఇవన్నీ ఎందుకు పెట్టారు?
ఇంట్లో పూజ, ధ్యానం చేసుకునే అవకాశం అందరికీ ఉండదు. వాళ్లందరికీ అట్టి అవకాశాన్ని కల్పిస్తాయి ఇవన్నీ.

ఇంట్లో టిఫన్ చేసుకునే అవకాశం అందరికీ ఉండదు. అలాంటివాళ్ల కోసం టిఫన్ సెంటర్లు ఉంటాయి. అలాగే ఈ మెడిటేషన్ సెంటర్లు కూడా. ఇంట్లో అట్టి అవకాశం ఉంటే ఇంట్లోనే ధ్యానం, పారాయణం చేసుకోవచ్చు.

83. పట్టెయ్య: అలాగే స్వామీ...! అయితే సత్సంగానికి అందరినీ ప్రత్యేకంగా ఆహ్వానించనక్కర్లేదు....

సద్గురు: ఆ బరువు బాధ్యతలు మీరు తీసుకోవవలసిన పనిలేదు. నీవూ, సుబ్బలక్ష్మి ఉన్నారు. మూడోవాడు ఈశ్వరుడు ఉన్నాడు...చాలు. మీరిద్దరూ లేకపోయినా సరే ఈశ్వరుడు సదా ఉంటాడు సత్సంగంలో.

'సత్యం' ఉన్నచోటకే అందరూ వస్తారు.
సత్యానికి ప్రచారం అవసరం లేదు.

అందుకే 'అనిలాచల శివమాల' పుస్తకంలో రచయిత పేరు వేయలేదు. యెందుకంటే వ్రాసింది మనం కాదని మనకు స్పష్టంగా తెలుసు. ధర కూడా పెట్టలేదు. ఎందుకంటే, దాని ధర ఎంతో మనం లెక్కకట్టలేం కాబట్టి.
* * *

సద్గురు: చపలుడునని నను దూరము చేయకు అపవాదగురా అనిలాచలా!

-అనిలాచలశివమాల(5)

ఇది కవిత్వం కోసం చెప్పింది కాదు...
నూటికి నూరుపాళ్లు సత్యం.

ఇక్కడుండే సరుకు అంతా
(నాకున్న అవలక్షణాలన్నీ)
ఈశ్వరా! నీకు నైవేద్యంగా పెడుతున్నాను.

84. పట్టెయ్య: అది మంచి అయినా, చెడు అయినా, తన దగ్గర ఏది ఉంటే అదే సమర్పించడమేనా?

సద్గురు: అవును.
అందుకే నేను దేవుడితో ఇలా చెబుతాను-
స్వామీ...! ఇదీ నా పద్ధతి. నీకు ఇష్టముంటే చూడు. నీకు నచ్చలేదా?నలిపి అవతల పడేయ్... ఒక్క నిమిషం కూడా, ఒక్క శ్వాస కూడా పెంచొద్దు. ఆ స్వాతంత్ర్యం నీదే. కాబట్టి ఈలోపు జరుగుతున్నదంతా నీ అనుమతితోనే జరుగుతోంది అనేది నాకు లెక్క. శిక్ష వద్దని నేను అనటం లేదు కదా! నీకు నచ్చని క్షణం, ఇక ఒక రెప్పపాటు కాలం కూడా ఇక్కడ నన్ను ఉంచొద్దు.

నీవు వింటేనే నాకు దేనినైనా వినే శక్తి కలిగేది.
నీవు కంటేనే నాకు దేనినైనా కనే శక్తి కలిగేది.
నీవు తలిస్తేనే నాకు దేనినయినా తలచేశక్తి కలిగేది.

కర్త-కర్మ-క్రియ మూడూ నీవే.
మధ్యలో నాకెందుకు గొడవ?

పాపమూ వద్దు.
పుణ్యమూ వద్దు.
అసలు నువ్వే వద్దు అని చెప్పేశా.

అందువల్ల గురువైనా, దేవుడైనా నన్ను పట్టుకుని వ్రేళ్లాడుతున్నారు మొదట్నుంచి.

నేనెప్పుడూ గురువు వెనుక తిరగలేదు.
గురువే నా చుట్టూ తిరిగారు.

మనం వాళ్లను పట్టుకొని ఉండడం మనవల్ల అయ్యే పనేనా?

శాస్త్రప్రకారం ధ్యానాలతో, జపాలతో, తపాలతో పట్టుకుని ఎంతసేపు ఉంటాము?

ఆయనకు ఆ శక్తి ఉంది. మనకు అంత శక్తి ఎక్కడిది? నిమిషానికి పది రకాలుగా మారిపోయే మనస్తత్వం మనది.

* * *

85. పట్టెయ్య: అనిలాచలశివమాలను 108 రోజులు పారాయణం చేద్దామని అనుకున్నాం స్వామీ...

సద్గురు: పనికిమాలిన పనులను జీవితకాలం చేస్తాం, ఏ విసుగూ లేకుండా, ఏ లెక్కా లేకుండా. అవసరానికి పనికి వచ్చేది ఏదైతే ఉందో దానికి లెక్కా 108 రోజులని? పనికిరానిదానికంతా లెక్కలేదా? ఏమి న్యాయమిది?

నీవు లెక్క చూస్తే ఆయన కూడా లెక్క చూస్తాడు.
కాబట్టి శ్వాసక్రియ జరుగుతున్నంతకాలం అనిలాచలశివమాలను పారాయణం చేయవలసిందే.

ఇంట్లోకి ఎప్పుడూ గాలి, వెలుతురు రావాలంటే, ఎప్పుడూ కిటికీ తలుపులు తెరిచే ఉంచాలి. అలాగే మనం సదా ఆనందంగా ఉండాలంటే అనిలాచలశివమాలను నిత్యపారాయణం చేయాల్సిందే.

86. పట్టెయ్య: జ్ఞానప్రసూనాల్లో ఓ వాక్యం ఉంది-
భగవంతుణ్ణి నీ కుటుంబసభ్యుల్లో ఒకడిగా  చేర్చుకో అని...కాస్త వివరించండి.

సద్గురు: అవును. భగవంతుణ్ణి కూడా నీ కుటుంబ సభ్యుల్లో ఒకనిగా చేర్చుకుని,  ఒక సభ్యునికి అయ్యే ఖర్చును,
ఆ పైకాన్ని వీధిలో పారేయ్... దాన్ని ఎవడు పట్టుకెళతాడు అనే సమస్య నీకొద్దు.
ఆ పైకం నీ నుంచి దూరం కావాలి...అంతే.
అప్పుడు కలుగుతుంది 'భగవదానుభవం' అనేది.

87. పట్టెయ్య: గురువుగారూ...!పురుషోత్తమప్రాప్తి యోగం అంటే ఏమి?

సద్గురు: వాల్మీకి రామాయణం ఉంది...
'శ్రీమద్రామయణం' అనే టైటిల్ నుండి...కవి వాల్మీకి పేరు నుండి... ఆ గ్రంథం చివర్న వచ్చే 'సంపూర్ణం' అనే పదం వఱకు...
రామాయణంలో వచ్చే ప్రతి పదం క్రింద గీత గీసి 'నేను' అని వ్రాసుకుంటూ వచ్చేయండి. ఈ నేనులు ఎన్ని ఉన్నాయో, అన్ని నేనులనూ ఎడంగా తీసి వాటినన్నిటినీ కలిపి ఓ గ్రంథంగా తయారుచేసి అప్పుడు చదవండి.
అప్పుడు రామాయణం కనబడదుగాని, రామాయణానికి ఆధారమైన 'నేను' మాత్రమే కనబడుతుంది.

88. పట్టెయ్య: అవునండీ....
రామాయణం నేను...
వాల్మీకి నేను...
రాముడు నేను...
సీత నేను
రావణుడు నేను...
సంపూర్ణం నేను...
ఇలా టోటల్ గా 'నేను' అయిపోతుందన్నమాట...

సద్గురు: అవును.
అయోధ్య నేను...
దశరధుడు నేను...
కౌశల్య నేను...
మంధర నేను...
హనుమ నేను...

89. పట్టెయ్య: ఆ గ్రంథసారం 'నేను' అన్నమాట...

సద్గురు: అది మాత్రమే కాదు, మన నిత్యవ్యవహారంలో మాట్లాడే ప్రతిమాట క్రిందా 'నేను' చేర్చండి.

90. పట్టెయ్య: ఓ అలానా...! బావుందండీ...

ఇప్పుడు - నేను
నేను - నేను
మీతో - నేను
మాట్లాడుతున్నాను - నేను

.....ఇలా అన్నమాట...

సద్గురు: అంతేకాదు...
కాకి కావుకావుమన్నా...
ఆవు అంబా అన్నా...
కావు క్రింద, అంబా క్రింద 'నేను' చేర్చు...

91. పట్టెయ్య: ప్రతి శబ్ధమునకు అర్థం 'నేను' అని వస్తోంది.

సద్గురు: అంతేకాదు...
ప్రతి దృశ్యానికి క్రింద 'నేను'ను చేర్చండి...
అలాగే ప్రతి 'స్పర్శ' క్రింద, ప్రతి 'వాసన' క్రింద, ప్రతి 'తలంపు' క్రింద 'నేను'ను చేర్చండి.

ఉదాహరణకు-

*నీరు చాలా వేడిగా ఉన్నది
నీరు - నేను
చాలా - నేను
వేడిగా - నేను
ఉన్నది - నేను

*పంచదార తీయగా ఉన్నది
పంచదార - నేను
తీయగా - నేను
ఉన్నది - నేను.

*ఇది సువాసన, అది దుర్వాసన
ఇది - నేను
సువాసన - నేను

అది - నేను
దుర్వాసన - నేను

పై వ్యవహారానికి ఏమీ భంగం లేదు.
లోపల అనుభవం మాత్రం 'నేను'గానే ఉండిపోతుంది.

అట్టి 'నేను' అన్న 'ఉత్తమపురుష'త్వానుభవంతో సదా ఉండటమే పురుషోత్తమప్రాప్తియోగం అవుతుంది.

92. పట్టెయ్య: బావుందండీ...

* * *

93. పట్టెయ్య: దివ్యదృష్టి అంటారు కదా స్వామీ... దాని గుఱించి వివరించండీ...

సద్గురు: దివ్యదృష్టి అంటే ద్రష్ట లేని దృష్టి.
అనగా చూసేవాడు లేని చూపు.

దివ్యశ్రవణం అంటే, వినేవాడు లేని వినికిడి.

'నేను' అనేది కూడా నేను అనేవాడు లేని నేను.

ఇప్పుడు పట్టెయ్య ఉన్నాడు-
నేను అంటున్నాడు.
నేనని ఎవరయ్యా అనేది? అంటే పట్టెయ్య అని అంటాడు.

వ్యక్తిగతమైన ఈ నేనుకు,
అహంస్వరూపమైన నేనుకు తేడా ఏమంటే-

అనేవాడు ఉండి, అనే నేను ఇది.
అనేవాడు లేకనే అనే నేను అది.

నేనున్నాను...అని ఇది అంటుంది.
'అది' ఉంటుంది.

పట్టెయ్య నేను అంటే, ఆ అనేది పట్టయ్యే అని పట్టెయ్యా అనుకుంటాడు, ఇతరులూ అనుకుంటారు.

(అహంస్వరూపమైన) 'నేను' అన్నవాడు ఎవడో లేక ఏదో అన్నది తెలియడం లేదు.

అందువల్ల పోతన 'ఎవ్వనిచే జనించు...' పద్యం చెప్పాల్సివచ్చింది.

నిజంగా రాముని వల్లనో, శివుని వల్లనో అయివుంటే, రామునిచే జనించు...శివునిచే జనించు...అని చెప్పి వుండేవాడు.

94. పట్టెయ్య: అలా వీలుపడకే "ఎవ్వనిచే..." అని అన్నారన్నమాట...

సద్గురు: ఎలా వీలుపడుతుంది?
పని తెలుస్తున్నదేగాని
చేసినవాడు తెలియడం లేదు.

ప్రపంచం కనబడుతోందిగాని,
ప్రపంచాన్ని పాలించేవాడు తెలియడం లేదు.

కానీ ఎవడో ఒకడు ఉండి ఉండాలి కాబట్టి,
వాటికి 'ఎవడో' అనేదే నామవాచకంగా వాడారు పోతనగారు.

మనం గతంలో ఓ మాట చెప్పుకున్నాం-

నేను ఎవడను? అని క్వచ్ఛన్ మార్కు పెడితే
అది ప్రశ్న.
నేనెవడను. అని ఫుల్ స్టాప్ పెడితే
అది సమాధానం.

* * *

సద్గురు: తెర మీద దృశ్యంలో కొండలను పేల్చేయవచ్చు.
అరణ్యాలను దాటుకు పోవచ్చు.
భూకంపరూపంలో భూమిని చీల్చివేయవచ్చు.
కానీ, అవి తెరను ఏమి చేయగలవు?

ఆ విధంగా ప్రకృతిశక్తులన్నీ పరమాత్ముని తప్ప
మిగతా అన్నిటిపై తమ ప్రభావాన్ని చూపిస్తాయి.

ఆత్మని ఏమీ చేయలేవు.
ఎందుకంటే మాయకు ఆధారం 'అదే' కాబట్టి.
'అది' ఉంటేనే మాయ నిలబడగలదు.

దృశ్యంలో ఉండేవాడు, ఆ దృశ్యానికి ఆధారమైన తెరను చేరుకోవడానికి ఎంతదూరం ప్రయాణించాలి?

95. పట్టెయ్య: అక్కడ దూరం ప్రసక్తే లేదు కదా స్వామీ...

తాను దృశ్యమనే విషయం తనకు తెలిస్తే సరిపోతుందా?

సద్గురు: అవును.
తెలియకపోతే దృశ్యంగా ఉంటాడు.
తెలిస్తే తెరగా ఉంటాడు.

మనం 'నిద్ర' అంటున్నామే...అదే తెర.
దృశ్యం ప్రొజెక్ట్ అయినప్పుడు అది మెలకువ.
తెరలో నుంచే దృశ్యం వస్తుంది.
బయట ఎక్కణ్ణుంచో రాదు.

మామూలుగా సినిమా అనేది ప్రొజెక్టర్ లో నుంచి వస్తుంది.
ఈ 'మెలకువ' అనే సినిమా తెరలో నుంచే వస్తుంది.
సముద్రంలో నుంచే అలలు లేచినట్లు.
బంగారం నుండే ఆభరణాలు పుట్టినట్టు.

96. పట్టెయ్య: తాను ఆభరణంగా ఉన్నా ఇబ్బందేమీ లేదు. తాను బంగారం అనే స్ఫురణ ఉంటే చాలంటారా?

సద్గురు: సరిపోతుందిగానీ, అది తాను ఆభరణంగా ఉండి అంటే లాభం లేదు. తాను బంగారంగా ఉండి అనాలి.

దృశ్యంగా ఉండి నేనే తెర అంటే లాభం లేదు.
తెరగా ఉండి నేనే దృశ్యం అనాలి.

మనం దేని మీద స్టాండ్ అయివున్నాం అనేది ముఖ్యం.

నేను బ్రహ్మమును అనేది పట్టెయ్య.
నేను పట్టెయ్యను అనేది బ్రహ్మము.

97. పట్టెయ్య: 'నేను బ్రహ్మమును' అని పట్టెయ్య అనకూడదా?

సద్గురు: దానివలన లాభం లేదు.
తాను బ్రహ్మముగా ఉండి 'నేను బ్రహ్మమును' అనాలి.

బ్రహ్మమే-
నేను బ్రహ్మమును అని, నేను పట్టెయ్యను అని అనేది.

98. పట్టెయ్య: ఇవన్నీ దృశ్యం ఏర్పడిన తరువాత వచ్చిన మాటలే కదండీ....

సద్గురు: అవును. 'అసలు' ఇప్పటికీ ఏమీ అనలేదు, అనుకోలేదు. దానికి ఆ అవసరమూ లేదు, అవకాశమూ లేదు.

99. పట్టెయ్య: సుషుప్తి మాదిరి ఉంటుందాండి 'అది'?

సద్గురు: దానికేం మాటలు లేవు అక్కడ.
మాటలు, తలంపులు అన్నీ దృశ్యంలోనివే.

'ఇది నేను కాదు' అనే జ్ఞప్తియే
నేనెవడను? అనేదానికి సమాధానము.

100. పట్టెయ్య: 'ఇది నేను కాదు' అన్న జ్ఞప్తి ఒక్కటుంటే సరిపోతుందా?

సద్గురు: అవును. దీనికి మాదిరిగా దానికి నిర్వచనం దొరకదు, వివరణ దొరకదు.

నేనిది కాదు అనుకుంటే చాలు.
నువ్వు 'అదే' లెక్కలోనే ఉంటావు.

101. పట్టెయ్య: అయితే కానిది కానట్లుగా జ్ఞప్తిలో ఉంటే సరిపోతుందా?

సద్గురు: అంతేకదూ....

102. పట్టెయ్య: 'ఉన్నది' ఏదో అది ఎవరి జ్ఞప్తిలో ఉండేది కాదన్నారు... కాబట్టి 'నేను ఇది కాదు' అని జ్ఞప్తిలో పెట్టుకుంటే సరిపోతుంది.

సద్గురు: అవును. ఇది సులభం.
అందుకే అనిలాచలశివమాలలో ఒకమాట చెప్పుకున్నాం-

కలలు, మెలకువలు కలయని ఎరిగిన
మెలకువ తానే అనిలాచలా (90)

ఇవి రెండూ కల అని జ్ఞప్తిలో ఉంటే చాలు.
తాను మెలకువలో ఉన్నట్టే.
అది ఎవరి మెలకువా కాదు.
అది స్వయంగానే మెలకువ.

103. పట్టెయ్య: భగవాన్ చెప్పిన 'నేనెవడను?' అన్న ప్రశ్నకు ఇది సూత్రమన్నమాట...

సద్గురు: అవును. 'ఇది నేను కాదు' అని ఉంటే అదే నేనెవడను? అన్నప్రశ్నకు సమాధానం అవుతుంది.

* * *

సద్గురు: ఇప్పుడు మెలకువలో ఉన్న పట్టెయ్యకు, గాఢనిద్రలో ఉన్న పట్టెయ్యకు సంబంధమే లేదు.
ఆ పట్టెయ్య వేఱే, ఈ పట్టెయ్య వేఱే.
అంతేకాదు నిన్న పట్టెయ్య వేఱే, ఈరోజు పట్టెయ్య వేఱే.
ఇంకా సూక్ష్మానికి పోతే, ఒక శ్వాసలో ఉండే పట్టెయ్య మరో శ్వాసలో ఉండడు.

104. పట్టెయ్య: ఏ శ్వాసకాశ్వాస పట్టెయ్యలు మారిపోతుంటారు...

సద్గురు: అంతేకాదు. పట్టెయ్యతో సహా సకలసృష్టికి అది వర్తిస్తుంది. ఒక శ్వాసలో ఉన్న సృష్టి మరొక శ్వాసలో ఉండదు.

అన్ని శ్వాసలకు ఆధారంగా ఉండే "అది" ఒక్కటే ఏ మార్పూ లేక ఉంటుంది. కాబట్టి ఆ continuation ఉన్నట్లు అనిపిస్తుంది.

సినిమా ఫిల్మ్ రన్ అవుతుంటే అది విడి విడి బిట్ లు అనేది మనకు తెలియదు. అలాగే మన జీవితసినిమా కూడా ఏ క్షణానికాక్షణం విడి విడి

బిట్లు కలిగిందే. అందులో కొన్ని బిట్లు తీసుకుని భద్రపరచుకోవడమే మనం తీసుకున్న still photos.

105. పట్టెయ్య: continue గా మన జీవితసినిమా జరుగుతోందన్నమాట...

సద్గురు: అవును. ఆ continuity తెలిసేది వెనక ఉండి చూచేవానికేగాని, ఫిల్ములో భాగమైన పట్టెయ్యకు కాదు.

ఇక్కడ ద్రష్ట-దృశ్యము-దృష్టి మూడూ వేఱు వేఱు.
అక్కడ ద్రష్ట-దృశ్యము-దృష్టి మూడూ ఒక్కటే.

అందుకే భగవాన్ ఉన్నది నలుబదిలో చెప్పారు-

"మనము లోకమున్నట్టు గనుట వలన బహువిధశక్తులు గల యొక కారణకర్త కలడని యొప్పుకొనుట యందఱంగీకరింపదగినది. నామరూప చిత్రములు, చూచువారు, ఆధారవస్త్రము, వెలిగించు వెలుగు, ఇవన్నియు దానే యగువాడు."

కాబట్టి రమణసాహిత్యమంతా అవసరం లేదు. ఎవరిదీ పూర్తిగా అవసరం లేదు. ఒకే ఒక్క మాట, ఒక్క పదం, ఒక్క అక్షరం చాలు తరించడానికి.

* * *

సద్గురు: తనువు పుట్టిన తరువాత అవయవ నిర్మాణాన్ని బట్టి స్త్రీయో, పురుషుడో అనేది లెక్కుకు వస్తుంది.

కదిలితే చైతన్యం అని, కదలకుంటే జడం అని అంటున్నాం.

భగవంతుడికున్న గొప్ప శక్తి ఏమంటే-
మన స్థితికి పూర్తిగా రివర్స్.

ఇక్కడ ఏర్పడ్డాక పురుషుడు అంటున్నాము.
అక్కడ పురుషుడు అన్నాక పురుషుడు ఏర్పడతాడు.
స్త్రీ అంటే స్త్రీ ఏర్పడుతుంది.
జడం అంటే జడం, చైతన్యం అంటే చైతన్యం ఏర్పడుతుంది.

106. పట్టెయ్య: ఇక్కడ ఏర్పడ్డాక అనుకుంటున్నాం.
అక్కడ అన్నాక ఏర్పడుతోంది.

సద్గురు: అవును. అందుకే ఆయనకు సత్యసంకల్పుడు, సిద్ధ సంకల్పుడు అని పేర్లు.

107. పట్టెయ్య: ఇన్ని యుగాల తరబడి ఉన్న చరిత్రంతా దేవుని సంకల్పమే అన్నమాట...

సద్గురు: యుగాలు లేవు. అంతా ఒట్టిది.
ఇప్పుడున్నదే ఉన్నది. ఇక్కడున్నదే ఉన్నది.

108. పట్టెయ్య: ఇలాగైతే ఏదీ లేదండీ. అంతా పోతుంది,
నాతో సహా.

సద్గురు: అని తెలుసుకునేది ఒకటి ఉంది కదా...!
అన్నీ వచ్చిన విషయమూ దానికి తెలుసు,
అన్నీ పోయిన విషయమూ దానికి తెలుసు.
ఏది వచ్చినా, ఏది పోయినా దానికొచ్చిన లాభంగాని, నష్టంగాని ఏమీ ఉండదు.

* * *

జ్ఞానశిశువు
9533667918

136. జ్ఞానప్రసూనాలు

---

1. లౌకికంగా-
సంఘం యొక్క ఆమోదం పొందినది - పుణ్యం.
సంఘం యొక్క వ్యతిరేకతను పొందినది - పాపం.

పారమార్థికంగా-
మీకు దుఃఖాన్ని కలిగించేది - బంధం.
మీకు సుఖాన్ని కలిగించేది - మోక్షం.

2. సత్యాన్ని నిర్వచించే ప్రయత్నమే ఉందిగాని,
ఇంతవఱకు ఎవరూ సత్యాన్ని నిర్వచించలేదు.

3. పరమసత్యము అంటే వ్యతిరేకత లేని సత్యము.

4. బహువచనమే లేదు.

5. మెలకువలో అనేక సత్యాలుంటాయి.
గాఢనిద్రలో ఒకే సత్యం ఉంటుంది.

6. మన యొక్క అవాఙ్మానసగోచరమగు శక్తినే మనం 'దైవం' అంటుండేది.

7. ఈశ్వరుడికి సృష్టి ఉందన్న స్పృహే లేదు.
ఈశ్వరుడు అనన్యుడు.
అనగా అన్యము లేనివాడు.

8. జ్ఞాని శరీరంలో ఉన్నా లేనట్లే ఉంటాడు.
అతనికి ప్రపంచం నీడలా కనబడుతుంది.

9. నీకసలు ఉనికే లేదని తెలుసుకోవడమే
ఆధ్యాత్మికం.

10. సత్యమే గురువు.
సత్యాన్ని బోధించేవాడు
సత్యాన్ని వినేవాడు
ఇద్దరూ శిష్యులే.

11. ఋషి లక్షణం
ఏ ప్రత్యేకతా లేకుండా 'ఉండటం'.

12. అ-హ-ం పోవాలంటే-
అ నుంచి హ వరకు అన్ని అక్షరాలనూ తుడిపేయాలి.

13. మాటలన్నీ మాయమాటలే...
Language Game...
అన్నమైతేనేమి? సున్నమైతేనేమి?
అన్నమే పెట్టు అన్నాట్ట ఒకడు.
ఇది శక్తిహీనమైన మాట.
అన్నమైతేనేమి? సున్నమైతేనేమి?
సున్నమే పెట్టు అంటే
అది శక్తిపూర్ణమైన మాట.
అటువంటి శక్తిపూర్ణమైన మాటలే జ్ఞానప్రసూనాలు.

14. చిత్రంలోని దీపం వెలుగునివ్వదు.
చిత్రంలోని అన్నం ఆకలి తీర్చదు.
గ్రంథంలోని జ్ఞానం మోక్షం ఇవ్వదు.

15. కదలగలిగి కదలకుండా ఉండేది నిశ్చలం.
కదలడానికి అవకాశం లేక కదలనిది అచలం.

16. సిద్ధాంతం కాని సిద్ధాంతం అచల సిద్ధాంతం...
ఆశ్రమం కాని ఆశ్రమం అత్యాశ్రమం...
గురువు కాని గురువు సద్గురు సుబ్రహ్మణ్యం...

17. 'ఉన్నది ఒక్కటే' అని ఉంటాడు జ్ఞాని.
'ఉన్నది ఒకటే' అని అంటాడు అజ్ఞాని.

18. ఉండడం జ్ఞానలక్షణం.
అనడం అజ్ఞాన లక్షణం.

19. ఉంటే 'ఒకటే' ఉంటుంది...
అంటే 'రెండు' అయిపోతుంది...

20. శరణాగతి అంటే...
అప్రయత్నంగా దేవుణ్ణి పొందటం...
సాధన అంటే...
ప్రయత్నపూర్వకంగా దేవుణ్ణి పొందటం...

21.పడవసహాయంతో నది దాటేవాడు భక్తియోగి.
ఈతకొట్టుకుంటూ నది దాటేవాడు కర్మయోగి.

22. శ్వాస పీలిస్తే జననం...
శ్వాస వదిలితే మరణం...
శ్వాస పరంపరయే జన్మ పరంపర...

23. ఆడది నేను అంటాది.
మగది నేను అంటాది.
ఇంతకీ "నేను" ఆడదా? లేక మగదా?

24. సాధన' అనే సంకల్పం రాక ముందు
ఎట్లా జీవిస్తూ ఉన్నావో అట్లానే జీవించు.
జీవితమే సాధన.
సాధనే జీవితం.
ఎవరి జీవితాన్ని వారు జీవించి వెళ్లిపోవాలి.
రమణుని జీవితం రమణునిదే.
నీ జీవితం నీదే.
మోక్షమనేది ఒకటుందని అనుకోవడమే
ఆ మార్గానికి అడ్డంకి.
మోక్షమంటూ ఏమీలేదు.
మోక్షమనేది ఏమీలేదని తెల్సుకోవడమే మోక్షం.

25. నేనుకు రెండు పేర్లు-
1. నేను
2. ఎవడను

26. నేను అనేది నామవాచకం.
బాబు అనేది సర్వనామం.

27. నీవు అజ్ఞానివనే అనుభవంలో సదా ఉంటే
సదా నీవు జ్ఞానస్థితిలో ఉన్నట్టు.

28. సత్యాన్వేషణలో-
ఇది ఫైనల్ అని conclusion కు వచ్చినప్పుడు-
వెంటనే "ఇది కాదు" అనుకో.

29. నువ్వు అయినదేదీ నీకు కనిపించదు.
నీకు కనిపించేదేదీ నీవు కాదు.

30. జాగ్రత్-స్వప్న-సుషుప్తులు అనే మూడవస్థలను
ఏ అవస్థలో ఉండే గుర్తిస్తున్నాడో
ఆ అవస్థే - తురీయం.

31. 'డూప్లికేట్ నేను' - రాహువు(అహమిక)
దాని యొక్క నీడ - కేతువు(వ్యక్తి)
'అసలు నేను' - శివుడు.

శివుణ్ణి శరణుజొచ్చినచో
నేను అను రాహువు
నాది అను కేతువు
యొక్క దోషము తొలగి
శాంతి కలుగును.

32. మీరు తినే ఆహారం యొక్క అనుమతి ఉంటేనే
దానిని మీరు తినగలరు.

ఆహారం అంగీకరించకుంటే
ఒక్క మెతుకును కూడా మ్రింగలేవు.

మనకులాగే ఆహారానికి
ఉనికి, జ్ఞానము, ప్రాణము ఉన్నాయి.

33. తెలుసుకోవడం రెండు రకాలు-

తెలుసు అని తెలుసుకోవడం.
తెలియదు అని తెలుసుకోవడం.

ఈ రెండు రకాలు తెలిసిన వానిని-

తెలుసు అని తెలుసుకోవడం.
తెలియదు అని తెలుసుకోవడం.

34. 'మౌనంలో నుంచే మాట వచ్చింది'
అన్న అనుభవంలో ఉన్నవాడు మాట్లాడినా
అతడు మౌనియే.

35. నేను కానిది ఏదీ లేదు.
నేను లేకుండా ఏదీ ఉండదు.

36. నామరూపాల వలన ప్రయోజనం ఏమంటే,
దాని ఉనికిని ప్రకటించడమే.

37. జ్ఞానుల వలన ఎంత ప్రయోజనం ఉందో
అజ్ఞానుల వలన కూడా అంతే ప్రయోజనం ఉంది.

38. ఇతరులను ఉద్ధరించాలనుకోవడం
తనను తాను ఉద్ధరించుకోవడంలో భాగమే.

39. సాక్షాత్తు 'పరమాత్మ' అని చెప్పబడేవాడు 'స్వయంభూ'గా పుట్టి వ్యక్తి అయినాడు. అంతేగాని నీవనుకున్నట్టు  తల్లిదండ్రుల కడుపులో నుంచి కాదు.

40. నేను వేఱు, కాలం వేఱు కాదు.
'నేను'కు ప్రతిబింబమే కాలం.

41. నీవు బ్రతికుండగా చచ్చినవాడు ఎవ్వడూ ఉండడు.
నీవు చచ్చాక బ్రతికుండేవాడు కూడా ఎవ్వడూ ఉండడు.

42. లౌకికాసక్తి యెంతో
ఆధ్యాత్మికాసక్తి కూడా అంతే.

రెంటికీ సమంగా శక్తి ఖర్చవుతుంది.
టీవీలో-
బూతు సినిమా వేసుకున్నా
నీతి సినిమా వేసుకున్నా
కరెంటు ఖర్చు ఒకటే అయినట్టు.

దేని యెడలా ఆసక్తి, ప్రత్యేకత చూపకపోవడమే
నిజమైన ఆధ్యాత్మికం.

43. ప్రత్యేకమైన వ్యక్తి
ప్రత్యేకమైన వస్తువు
ప్రత్యేకమైన కాలం
ప్రత్యేకమైన ప్రదేశం
అంటూ మనసుకు తోచనప్పుడు
అదే స్థితప్రజ్ఞత.

మనం చేసే సాధనలంతా
ఈ ప్రత్యేకతలను పోగొట్టుకోవడానికే.

ప్రత్యేకత తోయని మనస్సే ఆత్మ.

44. తన తనువులో-
లేకనే ఉన్నట్లు,
ఉండీ లేనట్లు
ఉన్న అవయవాన్ని కనుగొంటే
సృష్టి రహస్యం తెలుసుకోవచ్చు.
కానీ మెడ మీద తల ఉన్న వాడికి
ఇది తెలియదు.

45. అందరిలో నీవొక్కడివి కావు.
నీవొక్కడిలో అందరూ ఉన్నారు.

46. పరమపదమే పరమగు దైవం.
పరమపదమే సద్గురువు.

పరమపదమే సత్సంగం.
పరమపదమే పారాయణం.
పరమపదమే నిత్యస్మరణీయం.
పరమపదమే కైవల్యం.

47. నేనిది కాదు అని తెలుసుకుంటే
నీవు అది అయినట్టే.

నాకు తెలియదు అని తెలుసుకుంటే
నీవు దానిని తెలుసుకున్నట్టే.

పొందలేం అని తెలుసుకుంటే
నీవు దానిని పొందినట్టే.

48. ఆధ్యాత్మికం అంటే ఏమీలేదు...
"ఏమీ లేదు"

ఆధ్యాత్మికం అంటే ఏదో కాదు...
"ఏదీ కాదు"

49. కళ్లు తెరిస్తే బహిర్ముఖం
కళ్లు మూస్తే అంతర్ముఖం
అని అనుకునేరు...
బహిర్ముఖం, అంతర్ముఖం రెండూ అంతర్ముఖమే.
'నాలో 'నివే అని ఉన్నవాడు లో-వెలి లేని సద్గురువు.
* * *
కలలో ఉన్నవాడికి ఏది బహిర్ముఖమో
ఆ కలకనేవాడికి అది అంతర్ముఖం.

50. భౌతికత ఉండేది స్వప్నంలో.
ఆధ్యాత్మికత ఉండేది గాఢనిద్రలో.

గాఢనిద్రలో భౌతికత ఉండదు.
స్వప్నంలో ఆధ్యాత్మికత ఉండదు.

స్వప్నంలో వెతికినా లాభం లేదు.
గాఢనిద్రలో వెతికే అవసరం లేదు.

స్వప్నంలో స్వభావంతో ఉంటావు.
గాఢనిద్రలో స్వరూపంగా ఉంటావు.

నీవే గాఢనిద్రలో ఏకం.
నీవే స్వప్నంలో  అనేకం.

అనేకం ఉండడమే స్వప్నానికి ప్రమాణం.
అన్యం తోయకుండడమే గాఢనిద్రకు ప్రమాణం.

అన్యం తోయకుంటే మెలకువ కూడా గాఢనిద్రే.
అన్యం తోస్తే భగవత్సాక్షాత్కారం కూడా స్వప్నమే.

51. కన్నప్పను శివభక్తుడు అంటాం.
రామకృష్ణుణ్ణి కాళీభక్తుడు అంటాం.
విషయమేమంటే-
శివుడు కన్నప్పకు భక్తుడు.
కాళీమాత పరమహంసకు భక్తురాలు.

52. లౌకికంగా మన కంటే చిన్నవాళ్లతో పోల్చుకోవాలి.
ఆధ్యాత్మికంగా మన కంటే పెద్దవాళ్లతో పోల్చుకోవాలి.

53. ఉన్నది ఏదో అది
ఇప్పుడే ఇక్కడే ఉన్నది.
నాలోనే నేనుగానే ఉన్నది.

* ఇది గొప్ప ఉపాసనావాక్యం...

54. స్థూలశరీరం ఈ అమ్మది...
సూక్ష్మశరీరం ఆ అమ్మది (జ్ఞానాంబది)...
కార్యశరీరం ఈ నాన్నది...
కారణశరీరం ఆ నాన్నది  (శివునిది)...

55. జీవులకు అనేక జన్మలు ఉండటం కాదు,
దేవుడు అనేక జన్మలుగా ఉండడమే జీవులు.

56. జడం చైతన్యాన్ని సూచిస్తుంది.
శిల్పం శిల్పిని సూచిస్తుంది.
మార్పు నిత్యాన్ని సూచిస్తుంది.
చలనం అచలాన్ని సూచిస్తుంది.
శబ్దం మౌనాన్ని సూచిస్తుంది.
ప్రపంచం దైవాన్ని సూచిస్తుంది.

57. శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకొనే ప్రయత్నం కూడా
దేవ పూజలో భాగమే.
దేహంపై శ్రద్ధ చూపడం, అదేమీ దేహాభిమానం కాదు
దేహాభిమానం ఉన్నవాడు దేహమై ఉండే అవకాశం లేదు.
దేనినైనా అభిమానించాలంటే, తాను దానికి విడిగా ఉండాల.
కాబట్టి దేహాభిమాని అనేవాడు సాక్షాత్తు బ్రహ్మమే.

58. ఆధ్యాత్మికసంస్థలన్నీ వ్యాపారసంస్థలుగా ఉన్నాయి.
వ్యాపారసంస్థలన్నీ ఆధ్యాత్మికసంస్థలుగా ఉండాలి.

59. తాను సదా ఏకం.
జీవ-జగత్-జగదీశ్వరులుగా
విభాగం అయినట్టు అనిపించడమే సంసారం.
ఈ మూడు మూడు కాదు,
'ఒకటే' అని తెలియటమే జ్ఞానం.
తిరిగి తాను 'ఒక్కడు'గా అయితేనే ఆనందం.
అందుకు చేసే ప్రయత్నమే ఆధ్యాత్మికం.

60. నిజమైన మెలకువకు గుర్తేమంటే-
నీవు అక్కడ ఉండవు.

61. తత్వశాస్త్రం వున్నత పరీక్షలో "ఎందుకు?" అని ప్రశ్న ఇచ్చారు.
దానికి వంద మార్కులు.

వందమార్కుల ప్రశ్న అంటే
కనీసం పది పేజీలైనా రాయాలని చాలామంది వూహించి,
తలవంచుకుని రాసేశారు.
ఒక విద్యార్థి మాత్రం "ఎందుకు కాదు?" అని జవాబు రాసి వూరుకున్నాడు.
అతనికి నూటికి నూరు మార్కులు వేశారు.

62. అత్యాశ్రమం ప్రత్యేకత ఏమంటే-
ఏ 'ప్రత్యేకత' లేకపోవడమే.

63. గుడ్డతానులో నీకు అవసరమైన ముక్క వఱకే తీసుకుని
చొక్కాగా ధరించినట్లు
అనంతమైన కాలంలో కొంత కాలాన్ని తీసుకుని
దానినే జీవితంగా అనుభవిస్తున్నావు.
* * *
'అదే నేను' అనే విషయాన్ని మరిచాడు.
దానిని గుర్తుకు తెచ్చుకునే ప్రయత్నమే సాధన అయ్యింది.
* * *
ఒకడు గంట కూర్చొని గుర్తుకు తెచ్చుకునే ప్రయత్నం చేశాడు.
అది ధ్యానం.

ఇంకొకడు మూడు గంటలు కూర్చొని గుర్తుకు తెచ్చుకునే ప్రయత్నం
చేశాడు.
అది తీవ్రధ్యానం.

ఇంకొకడు సంవత్సరం పాటు గుర్తుకు తెచ్చుకునే ప్రయత్నం చేశాడు.
అది తపస్సు.

మరొకడు జీవితకాలం గుర్తుకు తెచ్చుకునే ప్రయత్నం చేశాడు.
అది తీవ్రతపస్సు.

64. శిశుత్వమే శివత్వము.
జ్ఞానాంబకు తొలి శిశువే శివుడు.

65. కాలంలో నీవు జీవించడం కాదు,
నీవు జీవించడమే కాలం.

66. ద్వంద్వభావనే బంధం.
ఏకత్వానుభవమే మోక్షం.

67. ఆనందం మనిషిలో అంతర్గతంగా ఉంది.
అది బాహ్యకారణాల వల్ల లభించేది కాదు.

68. నీ ఉనికియే సాక్షాత్కారము.

69. ఆత్మప్రాప్తి గురించి మాట్లాడటమే పొరపాటు.
పొందటానికి ఏముంది?
అది ఉన్నది ఉన్నట్లుగా ఉంది.

70. శిలయే ఉలిని, శిల్పిని, శిల్పాన్ని, సందర్శకుణ్ణి  సృష్టించుకుంటుంది.

కావ్యమే కలాన్ని, కవిని, గ్రంథాన్ని, పాఠకుణ్ణి సృష్టించుకుంటుంది.

71. తీర్థయాత్రల వలన ప్రయోజనం ఏమంటే-
ప్రతి క్షేత్రంలోనూ శివలింగాలను చూసి చూసి
చివరకు తన ఇంట్లో ఉన్న రుబ్బురోలు కూడా
శివలింగంగానే కనిపిస్తుంది.
అంతటితో యాత్రల ప్రయోజనం పూర్తయినట్టే.

72. రాకపోకలున్న ప్రతీది స్త్రీత్వమే...
రాకడ...స్త్రీ నుంచే...గర్భం నుంచే...
పోకడ...స్త్రీలోకే...(భూ)గర్భంలోకే...
రాకపోకలు లేనిది ఒకటే ఉంటుంది...
అది లింగ వచన విభక్తులకందని లింగము...
అదే పరమపురుషము...
అదే ఉత్తమపురుషము...
అదే నేను...

73. గురువుకు అనుభవం కాదు...
అనుభవమే గురువు...

అనుభవమే భాషిస్తుంది...
ఆ భాషణం శిష్యునికి అనుభవంగానే ద్యోతకమవుతుంది....
వినడం-అనుభవం ఏకకాలంలో జరుగుతుంది శిష్యునికి.

74. ఉపనిషత్ ఋషులు ఎక్కడా...
నీతిని బోధించలేదు...
సాధనలు చెప్పలేదు...
ఆ కేవలజ్ఞానంతోనే...
ఆత్మసాక్షాత్కారాన్ని కలుగజేశారు...
మా గురుడు సుబ్రహ్మణ్యుడు కూడా...
అలాంటి ఉపనిషత్ ఋషే...

75. అనుభవమే భాషిస్తుంది...
కానీ భాషణం ద్వారా అనుభవాన్ని చేరుకోలేము.

76. జ్ఞానం అంటే తన ధర్మం తనకు తెలియడం.
అజ్ఞానం అంటే తన ధర్మం తనకు తెలియకపోవడం.

77. జ్ఞానాంబదయామయీ...!
బంధం నీతోనే...
మోక్షం నాతోనే...

78. ఆకాశం 'నీలం' కాదు.
ఓంకారం 'శబ్ధం' కాదు.

అంతరిక్షం యొక్క అనంతత్త్వాన్ని సూచించే
అద్భుతమైన వర్ణం 'నీలం'.

అంతరిక్షంలోని అనేకశక్తుల ఏకత్వాన్ని సూచించే
యెడతెగని నాదం 'ఓంకారం'.

79. బాబు చెప్పారు...గురువుగారు చెప్పారు...
అని అనిపించడం మాని...
నేనే చెప్పాను...

అన్న అనుభూతి మీకు కలిగిననాడు...
మీ కోర్సు పూర్తయినట్టు...

80. అహంకారం ఉండడం దోషమేమీ కాదు...
అది పరిమితంగా ఉండడం దోషం...
అనంతమైన అహంకారం అహంస్వరూపమే...
అహం అనేది దేహం వఱకే పరిమితమైతేనే...
అది అహంకారం...
అహం అంటే మొత్తం...
సంస్కృత భాషలో తొలి అక్షరం - అ.
చివరి అక్షరం - హ.
అహము అనే పదం అలా మొత్తాన్ని సూచిస్తుంది.

81. జగద్గురు అంటే-
జగత్తే గురువు అని అర్థం.
జగత్తులో ఏ ఒక్కడో జగద్గురువు కాడు.
జగద్రూపంగా ఉన్నది గురువే.

82. విచిత్రమైన విషయం ఏమంటే-
'జగత్తు మిథ్య' అంటూనే...
జగత్తులో సత్యాన్ని వెతుకుతుంటాం...
'ఉన్నది సత్యమొక్కటే' అంటూనే...
దాన్ని ఎలా పొందాలి అని అడుగుతుంటాం...

83. తన అశక్తతను గుర్తించడం ఒక్కటే శక్తి.
తన అజ్ఞానాన్ని గుర్తించడం ఒక్కటే జ్ఞానము.

84. "నాది" అనేది పోవడం అరణ్యవాసం.
"నేను" అనేది పోవడం అజ్ఞాతవాసం.
ఆ తరువాతే మోక్షసామ్రాజ్యం.

85. వదలడం...
పొందటం...

ఈ రెండు ప్రోగ్రాములు వదిలేస్తే...
నీవు ముక్తుడవే...

86. నా ప్రపంచం నాది...
నీ ప్రపంచం నీది...
ఎవడి ప్రపంచం వాడిదే...
నా ప్రపంచంలో నీవొక భాగం...
నీ ప్రపంచంలో నేనొక భాగం...
అందరికి కలిసి ఒకే ప్రపంచం అంటూ లేనేలేదు...
ఇద్దరు కలిసి ఒకే కలను కనలేరు...
ఇద్దరు కలిసి ఒకే లోకాన్ని కనలేరు...
ఉండేది నీవొక్కడివే...
లేదా...
ఉండేది నేనొక్కడినే...
* * *
శివా!
నీ కలే మాకు మెలకువ (సృష్టి)
నీ మెలకువే మాకు నిద్ర (లయం)
* * *
భగవంతుడొక్కడే భక్తుడు, జ్ఞాని, కర్మిష్ఠి.

87. ఈ ఆధ్యాత్మికంలో ఉన్న తమాషా ఏమంటే-
ఇందులో ఓటమే విజయం అవుతుంది.
మృత్యువే అమృతత్వం అవుతుంది.
పోగొట్టుకోవడమే పొందటం అవుతుంది.
నిస్సహాయతే బలం అవుతుంది.
దుఃఖమే సుఖం అవుతుంది.

88. వ్యక్తిగా నటించు...
ఆత్మగా జీవించు...

89. నాయనా ఇంజం...
నా మాట విను కొంచెం...
"ఇదంతా ఉత్త కల" నిజం...
ఇదే సద్గురు ఇజం...

90. నేను లేను' అనేది సాధన.
'నేను మాత్రమే ఉన్నాను' అనేది సిద్ధి.

91. ఇంటి బయటున్న గజ్జికుక్క
ఇంటి లోపలున్న సద్గురువు
ఇద్దరూ సమానంగా తోచినప్పుడు
నీవే సద్గురువు.

92. దాహం వేసినవాడికి
దాహాన్ని గుఱించి సైన్టిఫిక్ లెక్చర్ ఇస్తే
అతని దాహం తీరదు.
కాసిన్ని మంచినీళ్లు ఇస్తే దాహం తీరిపోతుంది.
అదే మా సత్సంగంలో జరిగేది.
కార్యకారణాలతో సంబంధం లేకుండా
ఆధ్యాత్మికదాహం తీరిపోతుంది.

93. 'పొందటం' అనే ప్రక్రియ
అసలు లేనేలేదు.

94. ఆకాశానికి ఏది నిర్వచనమో
ఆత్మకు కూడా అదే నిర్వచనం.

95. సరియైనది అంటూ ఏమీలేదు.
నీవు దేనిని సరియైనదిగా భావిస్తావో
అది సరి అయినదే.

96. అన్ని జీవులు ఏకమై ఉన్న
ఒకే జీవుడు - దేవుడు.
* * *

అన్ని తలపులు ఏకమై ఉన్న
ఒకే తలంపు - ఆత్మ.
* * *
అన్ని సృష్టులు ఏకమై ఉన్న
ఒకే సృష్టి - మనస్సు.
* * *
అన్ని శబ్దములు ఏకమై ఉన్న
ఒకే శబ్దం - ఓంకారం.
* * *
అన్ని వేదములు ఏకమై ఉన్న
ఒకే వేదం - పరమపదం.
* * *
అన్ని ప్రశ్నలు ఏకమై ఉన్న
ఒకే ప్రశ్న - నేనెవడను?
* * *
అన్ని సమాధానాలు ఏకమై ఉన్న
ఒకే సమాధానం - నేను.
* * *
అన్ని రూపములు ఏకమై ఉన్న
ఒకే రూపం - అహంస్వరూపం.
* * *
అన్ని అక్షరములు ఏకమై ఉన్న
ఒకే అక్షరం - "నే"ను.
* * *
అన్ని నేనులు ఏకమై ఉన్న
ఒకే నేను - దైవం.

97. రమణుడికి-
"నేనున్నాను" అని తెలుస్తోందిగాని
నేనెవడనో తెలియడం లేదు...

అందుకే తన వద్దకు వచ్చిన ప్రతి ఒక్కణ్ణీ అడిగాడు-
"నేనెవడను?" అని.

ఈ ఆగంతకులు దానికి సమాధానం ఇవ్వకపోగా
అదొక సాధనాప్రక్రియ అనుకుని...
నేనెవడను? అని సాధన మొదలుపెట్టారు...

98. నడిసముద్రంలో ఓడకు చిల్లుపడితే
నావికుని మనోస్థితి ఎలా వుంటుందో ఊహించండి...
శరీరమనే నౌకకు కూడా నవరంధ్రాలున్నాయి...
అందులోకి విషయ'జలం' దూరి...
కొద్ది కొద్దిగా మునుగుతున్నాం...
ఆ మునగటాన్నే 'జీవితం'గా అనుభవిస్తున్నాం...
పూర్తిగా మునగడం(మరణం) ఖాయం...
నీ ఆత్మకంటే నీకు మృత్యువు అత్యంత సన్నిహితంగా ఉంది...అంటారు
శ్రీరామచంద్రులవారు భరతునితో.

99. పుట్టి పెరిగి నశించే స్వభావం కలిగింది దేహం.
ఈ దేహ తాదాత్మ్యత వల్లనే మృత్యుభీతి ఉండేది.
శాశ్వతమైన ఆత్మతో మమేకం వల్ల ఈ శరీరం తోచదు...
అందువల్ల మరణభయం ఉండదు...
అందుకే "శరణాగతి"కి పెద్దపీట వేశారు రమణులు.
శరణాగతి అంటే-
భవమరణాలు లేని మహేశునికి తనను తాను అప్పగించుకోవడం.
ప్రయాణికులందరూ తమ ప్రాణాలను డ్రైవరుకు అప్పజెప్పి హాయిగా
నిద్రపోయినట్లుగా.
సద్గురు యమధర్మరాజు గారు
మృత్యుర్యస్య ఉపసేచనం...
ఆత్మనెఱిగినవానికి మృత్యువు అనేది
ఒక పసందైన నాటకం...అంటారు.

100. దెయ్యాన్ని వదిలిచ్చినట్టు
దేవుణ్ణి వదిలిచ్చడమే
మా అత్యాశ్రమ ప్రాధాన ధ్యేయం.

101. ఈ ఒక్క దేహమే నేను...
అని ఉండడం దేహాభిమానం.
సర్వదేహాలూ నేనే...
అని ఉండడం దేహాతీతం.

102. దేవుని స్వప్నమే - జగత్సృష్టి.
దేవుని మెలకువే - జగత్ప్రళయం.

103. దేవుని కలే - జీవుని మెలకువ.
దేవుని మెలకువే - జీవుని నిద్ర.

104. సూర్యుని యొక్క ప్రారబ్ధం - ప్రకాశం.
నిద్ర యొక్క ప్రారబ్ధం - మెలకువ.
మరణం యొక్క ప్రారబ్ధం - జననం.
దేవుని యొక్క ప్రారబ్ధం - జీవుడు.
శివుని యొక్క ప్రారబ్ధం - పార్వతి.
ఆత్మ యొక్క ప్రారబ్ధం - మాయ.
బ్రహ్మము యొక్క ప్రారబ్ధం - ప్రపంచం.
చైతన్యం యొక్క ప్రారబ్ధం - జడం.
ఉన్నది యొక్క ప్రారబ్ధం - ఉన్నట్లున్నది.
భగవంతుని యొక్క ప్రారబ్ధం - భక్తుడు.
రమణుని యొక్క ప్రారబ్ధం - ఋషిత్వం.
గురువు యొక్క ప్రారబ్ధం - శిష్యుడు.

105. కలంతా అసత్యం...
కలకనేవాడు సత్యం...
జీవితం అంతా అసత్యం....

జీవించేవాడు సత్యం...
ఇదే వేదాంతసారం...

106. ఇతరులు తనను ప్రేమించలేదని
వాపోతున్నామంటే....
దాని నిజమైన  అర్థం ఏమంటే-
తనను తానే ప్రేమించడం లేదని అర్థం.

107. ఏ పరిస్థితి వచ్చినా పోయినా...
వచ్చేదాన్ని పోయేదాన్ని చూస్తూ ఉండండి...
లేదంటే చూడడం మానేయండి...
ఆకాశంలో మబ్బులు వస్తూ ఉంటాయి...
పోతూ ఉంటాయి...
చూడాలనిపిస్తే చూడండి...
లేదంటే చూడడం మానేయండి...
అంతేగానీ
మబ్బులు రావాలి అనిగానీ...
రాకూడదు అనిగానీ అనుకోవడం యెందుకు?

108. ఆహా! కనుగొన్నాను...
అక్కడ-ఇక్కడ లేని ప్రదేశం నేను.
అప్పుడు-ఇప్పుడు లేని కాలం నేను.
పైన-క్రింద లేని అవకాశం నేను.
లోపల-వెలుపల లేని బట్టబయలు నేను.
అది-ఇది లేని ఉనికి నేను.
ప్రశ్న-సమాధానం లేని మౌనం నేను.
చలం-నిశ్చలం లేని అచలం నేను.
సత్యం-అసత్యం లేని సద్వస్తువు నేను.
పాపం-పుణ్యం లేని పరిశుద్ధుణ్ణి నేను.
బంధం-మోక్షం లేని అనంతుణ్ణి నేను.

నేను-నాది లేని నేను నేను.

* * *

137. కేరింతలు - 1

---

1. భద్రయ్య: 'ఇదొక కల' అని ఉండడం జ్ఞానమా?

జ్ఞానశిశువు: హరిమయముగాని ద్రవ్యము పరమాణువు కూడా లేదు... అన్నాడు పోతన.

జగత్తనేది భగవంతునిచే సృష్టింపబడింది కాదు.
మనకు ఓ శరీరం ఉన్నట్టు భగవంతుని శరీరమే ఈ ప్రపంచం.

అందువల్లనే పరమేశ్వరుణ్ణి పంచముఖేశ్వరుడుగా కొలుస్తారు.
పంచముఖాలు అంటే పంచభూతాలు.

'నేను' అని జీవుడూ అంటాడు, దేవుడూ అంటాడు.
జీవుని నేను వ్యష్టిగా ఉంటుంది.
దేవుని నేను సమిష్టిగా ఉంటుంది.

బ్రహ్మమూ అనాదే.
ప్రపంచమూ అనాదే.
రెండూ ఒకే వస్తువు.

రూపాయినాణేన్ని చిల్లరగా మార్చుకుని వాడుకుంటే అది ప్రపంచానుభవం.

చిల్లరను రూపాయినాణెంగా మార్చుకుని దాచుకుంటే అది దైవానుభవం.

కుండను చూస్తున్నాను అని నీవనుకునేటప్పుడు కూడా
నీవు చూసేది మట్టినే.

జగత్తును చూస్తున్నాను అని నీవనుకునేటప్పుడు కూడా
నీవు చూసేది భగవంతుణ్ణే.

ఈ అవగాహనే సాక్షాత్కారం.
అంతేగాని భగవంతుడు ఓ రూపంగా వచ్చి
నీ యెదుటపడడం కాదు.

ఈ జగత్తు మాయా కాదు, మిథ్యాకాదు, కలా కాదు,
జగత్తు సాక్షాత్తు ఈశ్వరస్వరూపమే అని గ్రహించడమే సాక్షాత్కారం.

దీనిని ఈశ్వరస్వరూపంగా చూడకపోవడమే మాయ.

జీవ-జగత్తు-ఈశ్వరుడు మొత్తం కలిపి ఒకే వస్తువు.
ఈ మూడింట్లో ఒక వంతుగా(జీవుడుగా) మాత్రమే తానుండడం వలననే ఈ సమస్యలు.

* * *

జగత్తు మిథ్య అని ఎందుకన్నారంటే
సత్యాన్ని సత్యంగా చూడక, జగత్తును మాత్రమే సత్యం అనుకుంటున్నావు కాబట్టి...నీ దృష్టిని ఆధారసత్యం వైపుకు మళ్లించడానికి తత్కాలికంగా 'జగత్తు మిథ్య' అని బోధించవల్సివచ్చిందే తప్ప జగత్తు నిజానికి మిథ్య కాదు. జగత్తు కూడా సద్వస్తువులో అంతర్భాగమే.

* * *

గాఢనిద్రలో ఏమీ తెలియకపోయినా
భావాలు, దృశ్యాలు ఉండని కారణంగా
తన స్వరూపమే అయిన "హాయి" తేటతెల్లంగా
అనుభవంలోకి వస్తుంది.
అందువల్లనే గురువుగారు గాఢనిద్రానుభవమే(ఏ అనుభవమూ లేకపోవడమే) దైవానుభవం అంటారు గురువుగారు.

అంటే దాని అర్థం ఎప్పుడూ పడుకుని నిద్రపొమ్మని కాదు.

సమూహంలో ఏకాంతమే గాఢనిద్రాస్థితి.
మెలకువలో నిద్రయే ముక్తస్థితి.

* * *

2. దుర్గాశ్రీనివాస్:

ఒక జ్ఞానికి, ఒక నాస్తికుడికి
పోలిక కానీ, బేధము కానీ వుంటుందా?

* * *

"నామరూపాలు కలిగిన దేవుడు"లేడు...అని ఇద్దరూ అంటారు.

ఇదే పోలిక.

* * *

'నేను' అని అన్నప్పుడు -
నాస్తికునికి దేహం తోస్తుంది.
జ్ఞానికి దైవం తోస్తుంది.
* * *

3. దుర్గాశ్రీనివాస్: ఈ దుర్గాశ్రీనివాస్ అహంకారి....
అరిషడ్వార్గాల కలిగినవాడు.
'నీ నిజస్థితి ఆత్మే' అని గురువులు చెబుతుంటే
అప్పటికి అలా అనిపిస్తుందేగాని, మళ్లీ దుర్గాశ్రీనివాస్ గానే ఉంటున్నాను.
మార్గదర్శనం చూపించండి.

జ్ఞానశిశువు:

అహంకారం చెడ్డలక్షణమేమీ కాదు.
మీరు ఎలా ఉన్నారో అలానే ఉండండి...
అలా ఉంటేనే భగవంతుడు మీకు నిర్దేశించిన పాత్రను
బహు చక్కగా పోషిస్తున్నట్టు.

ఒక్కొక్కరం ఒక్కొక్క పాత్రను తీసుకొచ్చాం ఈ భూమ్మీదకు.

స్టేజీ మీదకు వచ్చాక పాత్రను, పాత్రస్వభావాన్ని, పాత్ర డైలాగులను
మార్చడం కుదరదు.
* * *

4.ఒకరు: సాధన అవసరమా? కాదా?

* * *

తనదే, తానే అయి ఉన్న ఆత్మస్వరూపం

కనబడనంతగా....మరిచిపోయేంతగా

చేసుకున్నామంటే....అంతగా ఆత్మను వదిలి
బాహ్యావిషయాలనే దుప్పట్లతో ఆత్మను కప్పేశామన్నమాట.

మళ్లీ ఆ దుప్పట్లను తొలగించాలంటే
ప్రాపంచిక వ్యవహారాలను అంతకంతకు తగ్గించుకోవాలి.

అవన్నీ అశాశ్వతమనే వైరాగ్యాన్ని
మనసులో నింపుకోవాలి.

అనేకం వదిలి ఏకం వైపుకే మనసును మళ్లించాలి.

నేను-నాది తుడిచేయాలి.
అనగా రెంటినీ ఏకం చేయాలి.

సదా ప్రపంచాన్ని నిరసిస్తూ ఉండాలి.
అప్పుడే ఆ దుప్పట్లు తొలగి
ఆత్మ తేటతెల్లమౌతుంది.

"తండ్రినైనను తల్లినైనను నా కంటె ఎక్కువగా ప్రేమించువాడు నాకు పాత్రుడుకాడు; కుమారునినైనను కుమార్తెనైనను నాకంటె ఎక్కు వగా ప్రేమించువాడు నాకు పాత్రుడు కాడు." అంటారు క్రీస్తు.

అంతగా దైవానికి ప్రథమస్థానం ఇచ్చినప్పుడు మాత్రమే తత్త్వం బోధపడగలదు.

దేవునికి ప్రథమస్థానం ఇవ్వడమే 'తపస్సు' .

* * *

ఆత్మకు సమానమైన విలువగలిగిన వస్తువు ప్రపంచంలో ఏదీలేదు.
మొత్తపు ప్రపంచం కూడా దానితో సరితూగదు.

కాబట్టి ఆత్మకు నీవిచ్చే విలువ
ప్రపంచంలో ఇక దేనికీ నీవు ఇవ్వకూడదు.

అప్పుడే నీ ఉపాసన సఫలం అవుతుంది.

* * *

నిష్కామకర్మ...భగవద్భక్తి...జ్ఞానవిచారణం....
అందులో ప్రధాన మార్గాలు...

మూడింటిలోనూ 'గురువు' పాత్ర అమోఘం.
మన ఆధ్యాత్మిక ప్రయాణాన్ని సులభతరం చేస్తుంది.

గురువులేని ప్రయాణం నావికుడు లేని నావలో ప్రయాణం చేయడం లాంటిది.

* * *

పరమపుణ్యక్షేత్రమైన శ్రీకాళహస్తిలో
సద్గురు సుబ్రహ్మణ్యుల వారు ఉన్నారు.

వారు మూర్తీభవించిన జ్ఞానమే.
సందేహం లేదు.

వారు ఈ ప్రపంచానికి ఉచితంగా దొరికిన ఆధ్యాత్మిక ఖని.

తవ్వుకున్నవారికి తవ్వుకున్నంత.

నీ శ్రమకు తగ్గ ఫలితం అప్పటికప్పుడే దొరకడం అనేది
ఈ క్షేత్ర మాహాత్మ్యంలో ఉన్న వైచిత్ర్యం.

శ్రీకాళహస్తి వైపుకు...అందునా రమణసత్సంగం వైపుకు...అందునా సద్గురు సుబ్రహ్మణ్యుని వైపుకు
నీ మనసు తిరిగిందంటే...అదే నీ మనసుకు చివరిదినం...ఆత్మను సాక్షాత్కరించుకున్న శుభదినం అవుతుంది.

5. సాయిచరణ్: రాత...అంటారు కదా...అది ఏమి?

జ్ఞానశిశువు: భగవదిచ్ఛ యే
"రాత" గా
"ప్రారబ్ధం" గా
"విధి" గా
"పురుషప్రయత్నం" గా ఉండేది.

* * *

నీవు స్వయంగా చేస్తున్నట్టు ఉండే కర్మలు కూడా
భగవదిచ్ఛలో అంతర్భాగమే.

* * *

నేను చేస్తున్నాను.....అని అంటాడు అజ్ఞాని.
నా 'ద్వారా' చేయబడుతున్నది....అని ఉంటాడు జ్ఞాని.

వ్యవహారాలన్నీ ఇద్దరికీ సమం.
అందులో తేడా ఏమీ ఉండదు.

* * *

6.పరమేశ్వర్:మనసు కన్నా బుద్ధి గొప్పదా?

జ్ఞానశిశువు: మనసు కన్నా బుద్ధి గొప్పది.
బుద్ధి కన్నా ఆత్మ గొప్పది.
వాస్తవానికి మూడూ ఒకే వస్తువు.
జల్లు కన్నా కెరటం గొప్పది.
కెరటం కన్నా సముద్రం గొప్పది.
మూడూ నీరే.

7.పరమేశ్వర్: మహత్తు అనగా ఏమి?

జ్ఞానశిశువు: దేనికి అన్యం ఉండదో
అదే మహత్తు.

8.పరమేశ్వర్: అవ్యక్తం అనగా ఏమి?

జ్ఞానశిశువు: వ్యక్తం కావడానికి అవకాశం లేనిది.

9.పరమేశ్వర్: పై వాటిలో ఏది గొప్పది ?

జ్ఞానశిశువు: మహత్తు, అవ్యక్తం అనేవి ఒకే వస్తువుకున్న రెండు పేర్లు.

10. పరమేశ్వర్: ఆ గొప్ప స్థితికి చేరుకోవడం ఎలా?

జ్ఞానశిశువు: ఆ గొప్ప స్థితికి చేరుకోవడానికి దానికి ఇతరంగా
ఒకడున్నాడంటే అది గొప్పస్థితి కాదు.

* * *

11.పరమేశ్వర్:

మనసు కంటే ఆత్మ గొప్పదని ఏ విధంగా చెప్పగలరు?

జ్ఞానశిశువు:

కెరటం సదా ఎగసి పడుతుంటుంది.
సముద్రం నిశ్చలంగా గంభీరంగా ఉంటుంది.
అలానే మనసు, ఆత్మ.

* * *

స్వరూపతః రెండూ ఒకటే.
స్వాభావతః రెండూ వేఱు వేఱు.

12. ఒకరు: వేదాంతరహస్యం అంటే?

జ్ఞానశిశువు: రహస్యం అంటే
చెప్పకుండా దాచిపెట్టినది అని కాదు.
చెప్పడం వలన అర్థం కానిది అని.

చెఱకు ఎలా ఉంటుంది? అని అడిగితే
తీయగా ఉంటుదని చెప్పగలమేగాని
తీపు ఎలా ఉంటుంది? అని అడిగితే ఏమి చెప్పగలం?
"అది" కేవలం అనుభవైకవిషయం...అంతే.

* * *

అనుభవం ఎలా వస్తుంది ? అని అడక్కండి.
వస్తుంది. అంతే.

* * *

13. భద్రయ్య: ఇప్పుడు మనం చూస్తున్న ఈ జగతిలో ఒకడు పేదవాడు గాను ఒకడు కోటీశ్వరుడు గాను మరొకరు వేరే విధంగాను మనము చూస్తున్నాము.

ఎవరికివారి ప్రారబ్ధ కర్మను అనుసరించి వారి జీవితము జరుగుతూ ఉంటుంది అని పెద్ద అంటున్నారు.... ఇది ఎంతవరకు నిజం? కొంచెం

వివరిస్తారా అండీ...

జ్ఞానశిశువు: ఒక దర్శకుడు తనే ఓ విషాదగాథను వ్రాసి అందులో తానే పేదవాని పాత్రను ధరించి ఓ సినిమా తీశాడు...నిర్మాత కూడా తానే. ఆ సినిమాను స్వంత థియేటర్ లో ఒక్కడే కూర్చొని ఆ సినిమాను చూస్తూ...ఆ సినిమాను తాను తీసిందే అని మరచిపోయి...ఆ పేదవాని పాత్రను వేసింది తానే అనేది కూడా మరచిపోయి...ఆ కథలో తల్లీనమై ఆ పేదవాని కష్టాలను చూసి దుఃఖిస్తున్నాడు....

ఇప్పుడు చెప్పండి సృష్టి ఎవరిదో....
ప్రారబ్ధకర్మ ఎవరిదో.....

కర్త-కర్మ-క్రియ మూడూ భగవంతుడే.

* * *

దేవీసూక్తంలో అమ్మ స్వయంగా నేనే చెబుతున్నాను అని చెప్పిన మాటలు చూడండి...

అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభిరుత మానుషేభిః|

యం కామయే తంతముగ్రం కృణోమి తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధామ్||

నేనే స్వయంగా చెబుతున్నాను-

నేను ఉగ్రుణ్ణి చేయాలనుకొంటే ఉగ్రుడిగా
వేదవేత్తను చేయాలని తలంచితే వేదవేత్తగా
ఋషిగా తీర్చిదిద్దాలని భావించితే ఋషిగా,
మేధావిగా చేయ నిర్ణయించితే మేధావిగా
ఆయా వ్యక్తులను నేనే చేస్తాను.

* * *

ఒకవేళ వారు ఆమె కంటే భిన్నులయి ఉంటే
అది పక్షపాతమై ఉండేది.

కాని ఆమె స్వయంగా విభిన్నరూపాలను ధరించి
విభిన్న పాత్రలలో నటిస్తూ ఉంది.

14.పట్టెయ్య: ఎడతెగని అఖండ జ్యోతి ఏది?

జ్ఞానశిశువు: 'నేను' అన్న అహంస్ఫురణ.

15. సాయికృష్ణ:

పునరపి జననం పునరపి మరణం అని శంకరుల వాక్యం ఉంది కదా! మరి మోక్షం పొందిన వారికి మళ్లీ జన్మ ఉండదు అంటారు... ఈ రెంటి లో ఏది సరి?

జ్ఞానశిశువు: మోక్షం అంటే మరుజన్మ లేకపోవడం కాదు
ప్రస్తుత జన్మ కూడా లేదని తెలుసుకోవడం.

16. సాయికృష్ణ: మరి కాశీ లో మరణించిన వారికి మోక్షం వొస్తుంది అంటారు... మరి అది ఎలా అండి?

జ్ఞానశిశువు: అవును...కాశీలో మరణించడం అంటే ఏంటో తెలిస్తే.....

కాశీ అంటే నగరం కాదు....స్వరూపనిష్ఠ.

17. సాయికృష్ణ: స్వరూప నిష్ఠ అంటే ఏమిటి స్వామి?

జ్ఞానశిశువు: ఏ తలంపులూ లేక "కేవల నేను"లో నిలవడం.

18. సాయికృష్ణ: మరి ప్రవచన కర్తలు మనిషి మోక్షం పొందాలంటే చాలా జన్మలు పడుతుంది.... చేసిన సాధన పండితేగాని మోక్షం రాదు అంటారు స్వామీ....

జ్ఞానశిశువు: అవగాహన లేనివారే మైకులు పట్టుకుని ప్రవచిస్తారు...

ముందు తన కంట్లో పడిన నలుసును తొలగించుకుని, తరువాత ఎదుటివాని కంట్లో పడిన నలుసును తొలగించు... అంటారు క్రీస్తు.

బోధ యెప్పుడూ గురు-శిష్య పరంపరగానే జరగాలి.

అడగండి-ఇవ్వబడును అన్నారు క్రీస్తు.

గురువుకు శరణాగతి చెంది శ్రద్ధతో ప్రశ్నించడమే పరిప్రశ్న.

అటువంటి శిష్యునికి అనుగ్రహం తప్పక ఇవ్వబడుతుంది.

19. సాయికృష్ణ: సాధన చాలా ముఖ్యం అంటారు... అసలు సాధన అంటే ఏమిటండీ....

జ్ఞానశిశువు: నీ ప్రతి శ్వాసా....

నీ ప్రతి కదలికా....

సాధనలో అంతర్భాగమే.

సాధనే 'జీవితరూపం' గా ఉంది.

20.సాయికృష్ణ: మంత్రోపదేశం అంటారు.....

జ్ఞానశిశువు: "నేను" అనేదే మహా మంత్రం అన్నారు రమణ భగవాను.

నేనును పట్టుకుని వదలకు.

ఇదే స్వరూపనిష్ఠ అంటే.

21.సాయికృష్ణ: మరొక చిన్న సందేహం...ప్రతి జీవిలో ఆత్మ ఉందా? లేక ఆత్మలోనే అన్ని జీవులూ ఉన్నాయా?

జ్ఞానశిశువు: ఆత్మలోనే సకల జీవులూ ఉన్నాయి...
సముద్రంలో జలచరాలున్నట్లు.

22. భద్రయ్య: మెలకువకు మునుపు అంటే తాను భద్రయ్యగా
పరిణమించక మునుపు ఏమిగా ఉన్నాడో
మెలకువ తర్వాత కూడా తాను అదిగా ఉన్నట్లయితే అదే జీవన్ముక్తి
అంటున్నారు మీరు....
కొంచెం నాకు అర్థమయ్యేట్టు వివరించండి.

జ్ఞానశిశువు: నిద్రలో నిశ్చలంగా ఉన్న నేనే,
మెలకువలో ఉండే నేను కూడా...

నిద్రలో నిశ్చలత ఉంటుందేగానీ
'నేనున్నాను' అన్న ఎఱుక ఉండదు.

మెలకువలో 'నేనున్నాను' అన్న ఎఱుక ఉంటుందేగానీ
నిశ్చలత ఉండదు.

కాబట్టి  నిశ్చలతను-ఎరుకను ఏకకాలంలో పొందడమే
ఆధ్యాత్మిక ఏకైక లక్ష్యం.
* * *
నిద్రలో విచారణ(సాధన) చేయలేం.
మెలకువలో మాత్రమే చేయగలం.

కాబట్టి నిద్రలో  'ఎఱుక ' ను  సాధించడం కంటే
మెలకువలో 'నిశ్చలత' ను సాధించడం ఒకటే మార్గం.
* * *
మెలకువలో-  తలంపులతోను, వ్యవహారాలతోను
కర్తృత్వంతోను... నిద్రలో స్వరూపంగా ఉన్న ఆ 'సహజమైన నిశ్చలత'
చెదిరిన'ట్టు'
అనిపిస్తుంది....

ఈ బాహ్యావిషయాలకు అధిక ప్రాధాన్యత ఇవ్వక,
కాస్త అంతర్ముఖమైతే చాలు...

అనగా "నిజంగా నేను కర్తనా?" అని ప్రశ్నించుకుంటే చాలు...

'నేనెవడను?' అని ఆత్మవిచారణ చేసుకుంటే చాలు.

ఈ అబద్దపు నేను మాయమై
ఆ నిజమైన 'నేను' మిగులుతుంది.
ఆ 'నేనే' నేనని తెలుస్తుంది.

తత్ఫలితంగా-

నిద్రలోని ఆ నిశ్చలత మెలకువలోకి కూడా ప్రవహించడం
మొదలుపెడుతుంది.

అలా మెలకువలోని 'నేనున్నాను' అన్న ఎఱుకకు,
నిద్రలోని నిశ్చలత తోడై స్థితప్రజ్ఞత కలుగుతుంది.

ఇతరులకు తాను మెలకువలో ఉన్నట్టే కనిపిస్తాడు.
నిజానికి తాను నిద్రలో ఉంటాడు.

ఇతరులకు తాను నిద్రలో ఉన్నట్టే ఉంటాడు.
నిజానికి తాను మెలకువలో ఉంటాడు.

23. ఒకరు: దగ్గరలో ఎక్కడైనా అవధూతలు
ఎవరైనా ఉంటే చెప్పగలరా?

జ్ఞానశిశువు: నీకు దగ్గరలో ఉన్న అవధూత నీవే.

* * *

24. రాధిక: ముక్తి అంటే ఏమిటండీ...

జ్ఞానశిశువు: ముక్తి అంటే తన నుంచి తాను విడుదల అవడం.

* * *

25. రాధిక: విలీనం, ఐక్యం అయినట్లు ఎలా తెలుస్తుంది?

జ్ఞానశిశువు:  నీకు నీవు ఇతరంగా తోచినప్పుడు

లేదా

ఇతరం కూడా నీవుగానే తోచినప్పుడు

విలీనం, ఐక్యం అయినట్లు లెక్క.

26. సాయికృష్ణ: దేవస్థానం లో నిద్ర చేయటానికి,
ఇంట్లో నిద్ర పోవటానికి ఏమైనా తేడా ఉన్నదా?

జ్ఞానశిశువు: ఏ తేడా లేదు.
నిద్రలో ఇల్లూ ఉండదు, గుడీ ఉండదు...
అసలు తానే ఉండడు.
నిజానికి నిద్ర అనేది తన స్వరూపమే.

27. శేష సాయి శర్మ: గురువుగారి గుఱించి మీరు రాస్తున్న రచనలు చదివి తెలుసుకున్నాను. మరింతగా తెలుసుకోవాలని అనుకుంటున్నాను....

జ్ఞానశిశువు:

ఓ మహాజ్ఞాని....ఇక్కడ .....శ్రీకాళహస్తిలో....
నిశ్శబ్దంగా జీవిస్తున్నారు.....

ప్రపంచం నిర్లక్ష్యం చేసిన ఋషి వారు.
వారు ప్రపంచానికి దేవుడిచ్చిన ఒక దివ్యకానుక...
అని తెలియజేయడానికి అవతరించిన జ్ఞానశిశువు నేను.

* * *

28. ఒకరు: సాధన అవసరం అని అందరూ చెబుతుంటే, మీరు మాత్రం సాధన అవసరం లేదని చెబుతున్నారు....

జ్ఞానశిశువు: అత్యంత సులభం ఆత్మవిద్య అన్నారు రమణభగవానులు.

నేను-నేను అని అంటుండేది ఆత్మే.
కానీ నాకు తెలియడం లేదు అంటున్నారు.
ఇది హాస్యాస్పదమైన విషయం.

తనకు తనకన్నా తెలిసిన విషయం మరొకటి లేదు.
చేతికి అందేంతంగా ఉన్న (జ్ఞాన)ఫలాన్ని పొందడానికి
చెట్టు ఎక్కడం (సాధన) ఎందుకు?

29. ఒకరు: భగవంతుని చేతిలో తానొక ఉపకరణమా?

జ్ఞానశిశువు: అవును.తొండం అనేది ఏనుగుకు అభిన్నమునూ
తనకు ఓ ఉపకరణమునూ.
అలాగే వ్యక్తి దేవునికి అభిన్నమునూ
తనకు ఓ ఉపకరణమునూ.

30.త్రిపుర: నేను గురువుగారి వద్దకు వచ్చి
రెండేళ్లు పూర్తయ్యింది....
అంతా నేర్చుకున్నానా? అంతా వదిలేశానా?
నాకే అర్థం కాలేదు....

జ్ఞానశిశువు:
వదిలేయడమే...నేర్చుకోవడం.
(పరిత్యాగమే...జ్ఞానం)

31.శ్రీదేవి: మనలో దేవుడుంటాడు అంటారు కదా...
మరి మీ గురువు సిగరెట్టు త్రాగుతున్నారు...లోపలున్న దేవుడికి ఇబ్బంది

కదా?

జ్ఞానశిశువు: యజ్ఞంలో నుండి వచ్చే పొగ కూడా ఇబ్బందే కదా?

32.శ్రీదేవి: అది లోక కళ్యాణం కోసం చేసేది...

జ్ఞానశిశువు: ఇది కూడా లోకకళ్యాణానికే...

33.శ్రీదేవి: నేను అంగీకరించను...

జ్ఞానశిశువు: మిమ్మల్ని అంగీకరించమని నేను అడగలేదే!

34.పరమేశ్వర్: మా స్నేహితుణ్ణి అరుణాచలం ప్రదక్షిణకు తీసుకెళ్లాను....నీవు చెప్పినంత గొప్పగా ఏమీలేదే? అన్నాడు నాతో...

జ్ఞానశిశువు: దుమ్మంటే దుమ్మే - సొమ్మంటే సొమ్మే.
రాయంటే రాయే. దేవుడంటే దేవుడే. కొండంటే కొండే.శివుడంటే శివుడే.

35.పద్మ: మనము గురువుని మనసారా నమ్మినపుడు మాత్రమే గురువుగారు అంతా నిండిపోయి వున్న ఆ పరమాత్మగా దర్శనమవుతారు.

మన పాప కర్మలు దగ్ధము చెయ్యటానికి మాత్రమే అలా చేస్తారని(సిగరెట్ త్రాగుతారని) నేను మనస్ఫూర్తిగా నమ్ముతాను.

నాకు గురువుగారు మొదటిసారి దర్శనం లభించినపుడు గురువుగారు సిగరెట్ త్రాగుతూ కనిపించారు.

నేను చేసిన కర్మలన్నీ యజ్ఞములో వేసి దగ్ధము చేసారని భావించాను....

జ్ఞానశిశువు: అవును...బాగా గ్రహించారు...

36.పద్మ: మీరు అన్నీ గ్రంథాలు వ్రాయగలిగారంటే... గురువుగారే మీరు.
మీరే గురువుగారు.
సందేహము లేదు.
నేను చాలా సార్లు అంతర్లీనముగా చక్ర ధ్యానము చేసినపుడు నాకు మీ ఇద్దరి దర్శనం ఆజ్ఞా, సహస్రారములో మీరిద్దరూ దర్శనం ఇచ్చారు.
నేను ప్రతీ రోజు మిమ్మలిని దర్శిస్తున్నాను. కళ్ళు మూసుకుంటే నా గురువుల్ని దర్శిస్తున్నాను...

జ్ఞానశిశువు: అవును....మేమిద్దరం ఒకటే....
వారు జ్ఞానాంబ....
నేను జ్ఞానాంబ గర్భస్థశిశువును...
అది అనంతమైన గర్భము...
నేను జ్ఞానంబ శిశువును....
ఎప్పటికీ ప్రసవింపబడని శిశువును నేను....
ప్రసవింపబడడానికి అవకాశం లేని శిశువును నేను....

* * *

నీవు జ్ఞానశిశువు అయితే....
మేమంతా అజ్ఞాన శిశువులమా? అనేది కాదు పాయింటు....
ఉపాసన అనేది పూర్తిగా వ్యక్తిగతమైనది.....
మీరు ఎలా భావిస్తే అలా అయిపోతారు....అంతే.
యెందుకంటే ఉండేది 'ఒక్కడే' కాబట్టి.
ఇది కీలకమైన విషయం.

* * *

ఉపాసన అంటే ఇలా ఉండాలి...అని చెప్పడమే నా ఉద్దేశంగానీ....
ఈ బాబుగాడు సెల్ఫ్ డబ్బా కొట్టుకుంటున్నాడు....అని  మీరు భావిస్తే...నేనేమీ చేయలేను.....

* * *

జ్ఞానశిశువని యెందుకనుకోవాలంటే.....
భౌతికపరిధిలో తనకున్న పరిమితులు అంతే మరి.
మానసిక పరిధిలో 'అదే నేను' అని ఉండాలి....

నేను దేవుని కుమారుడను.....అన్నారు క్రీస్తు.
నేను, నా తండ్రి అభిన్నులం  అని కూడా అన్నారు.

కాళీకామాత విగ్రహం రామకృష్ణులకు అమ్మయే.
అరుణాచల పర్వతం రమణుడికి అప్పయే.

మిగతావారికి అదొక బండ, ఇదొక కొండ అంతే.

సాధన అంటే తనకు లేనిదానిని పొందాలనే ప్రయత్నం.

ఉపాసన అంటే తన స్వరూపమే అయినదానితో రమించడం.

సాధన అనేది - అజ్ఞానం.
ఉపాసన అనేది - జ్ఞానం.

37.శ్రీదేవి: నాకు పిల్లలున్నారు...వాళ్లని గైడ్ చేయాలి..
ఊరికే ఉంటే ఎలా?

జ్ఞానశిశువు:

ఊరికే ఉండడం అంటే-
పనీపాటా వదిలి ఉండడం కాదు

'నేను కర్తను కాను' అని
నిత్య వ్యవహారాలను సలపడం.

* * *

వ్యవహారంలో - మౌనంగా ఉండాలి.
అనుభూతిలో - శూన్యంగా ఉండాలి.
అనుభవంలో - పూర్ణంగా ఉండాలి.

38. శ్రీదేవి: ఆత్మసాక్షాత్కారం పొందడం ఎలా గురువుగారూ?

జ్ఞానశిశువు: ముందు ఆత్మ అంటే ఏమిటో తెలిస్తే
అదే సాక్షాత్కారం.

39.భాను(రమణ భక్తులు): శనివారం నాడు గురు దర్శనానికి
వస్తున్నామండీ....

జ్ఞానశిశువు: మంచిది.
సద్గురు దర్శనం రమణ దర్శనమే.
సద్గురు దర్శనం తత్త్వదర్శనమే.
వ్యక్తి దర్శనం కాదు.

40. శివప్రసాద్: సృష్టి రహస్యమేమి?

జ్ఞానశిశువు: అది చెబితే ఇక రహస్యం ఎందుకవుతుంది?

రహస్యం అంటే ఒకనికి మాత్రమే తెలిసింది అని కాదు,
ఒక్కడికి కూడా తెలియంది.

41.శివప్రసాద్: భగవంతుడు సృష్టి ఎందుకు చేసాడు?

జ్ఞానశిశువు: దానికి మీ అనుమతి అవసరం లేదు.
నీవు కనే కలలో ఉన్నవారి అనుమతి తీసుకొని నీవు కల కంటావా?
లేదుకదా.

42.పద్మ: అలనాడు దేవహూతికి కపిల మహాముని
తల్లికి సందేశము ఇచ్చినట్లు మీరు నాకు జీవితసత్యాలు బోధిస్తుంటే
దేవహూతి స్థానంలో నేను, కపిలమహాముని స్థానములో మీరు ఉండి నాకు
అన్నీ బోధిస్తున్నటు ఉంది.  నేను అలానే భావిస్తున్నాను.

జ్ఞానశిశువు: భావన కాదు...సత్యం.
నీవు నా తల్లివి....నా శిష్యురాలివి.

43. పద్మ: నేను పరిపూర్ణత పొందాలి మీ అనుగ్రహముతో...

జ్ఞానశిశువు: "నేను" అనేది యెప్పుడూ పరిపూర్ణమే.

మీరు ఇప్పటికే పరిపూర్ణులు.
పరిపూర్ణులైనవారే మాకు పరిచయం అవుతారు.

44. పద్మ: ప్రతినిత్యం అనిలాచలశివమాల పారాయణం చేస్తున్నాను...

జ్ఞానశిశువు: మంచిది. అదొక్కటి చాలు....ఏ గ్రంథాలూ అవసరం లేదు...ఏ
సాధనలూ అవసరం లేదు...అది మిమ్మల్ని స్వరూపనిష్ఠలో ఉంచుతుంది.

అనిలాచలశివమాల పారాయణం చేస్తున్నప్పుడు
మీరు పార్వతి.

అనుభవంలోకి వచ్చినప్పుడు
మీరే శివుడు.

పారాయణం - సాధన.
అనుభవం - సిద్ధి.

45. సాయి: దేవుడి పూజలో పుష్పాలు  మరియు బిల్వం వాడతారు...

మొక్కలో దేవుడు వాటిని ఆల్రెడీ అలంకరించి ఉన్నాడు కదా? మళ్లీ వాటిని త్రుంచి దేవునికి ప్రత్యేకంగా  పెట్టవలసిన అవసరం లేదు కదా?

జ్ఞానశిశువు: అవును అవసరం లేదు.

నీ జేబులో నుంచి డబ్బులు తీసి బహుమానంగా తిరిగి నీకే ఇవ్వడం లాంటిదే ఇది.

మనం దేవునికి సమర్పించే ప్రతీది దేవునివే.

దేనినయినా సరే మార్పులు, చేర్పులు చేయకుండా  యథాతథంగా చూడగలడమే
నిజమైన దైవపూజ.

నాదంటూ ఏమీలేదు, నాతో సహా సమస్తమూ నీ స్వాధీనమే అని ఉండడమే నిజమైన  అర్పణ.

ప్రతీది భగవత్స్వరూపమే అని వ్యవహరించడమే నిజమైన అర్చన.

just ఆ భావనలకు ప్రతీకగా సమర్పించేటివే
ఈ పుష్పాలు, ఈ పత్రాలు...

46. పరమేశ్వర్: ఆత్మసాక్షాత్కారం పొందటం ఎలా?

జ్ఞానశిశువు: పొందటం సంగతి తరువాత...
ముందు ఆత్మ అంటే ఏమిటి? తెలుసుకో.

47.పరమేశ్వర్: పరమాత్మ నుండి విడిపోయిన నేను.

జ్ఞానశిశువు: ఇకనేమి? నీకు  నీవు కనబడుతూనే ఉన్నావు కదా?
అదే సాక్షాత్కారం.

48.పరమేశ్వర్: నాకు నేను శరీరంగా కనబడుతున్నాను!

జ్ఞానశిశువు: కనబడనీ తప్పేముంది?

1. కంటికి కనబడేది దేహాత్మ(శరీరం)

2. కనబడక, స్ఫురించే నేను - జీవాత్మ(మనస్సు)

"ఉన్నదే"  ఇలా రెండు విధాలా ఉన్నది.

49. పరమేశ్వర్: ఈ శరీరం అశాశ్వతం కదా?

జ్ఞానశిశువు: ఈ శరీరం శాశ్వతం కాదు అని తెలుసుకున్నావు కదా...

చాలు....శాశ్వతసత్యాన్ని నీవు తెలుసుకున్నట్లే.

50. పరమేశ్వర్: అశాశ్వతం అయిన దానికోసం పరిగెడుతూ, అలసిపోతూ, బాధపడుతున్నాను...

జ్ఞానశిశువు: పరిగెట్టడడం మానేసినప్పుడే....
ఇది అశాశ్వతం అని నీవు నిజంగా గ్రహించినట్టు.

51.పరమేశ్వర్: బ్రతకాలి అంటే తినాలి.
తినాలంటే, పని చేయాలి, పరిగెత్తాలి....
ఎందుకు బ్రతకాలి? ఇలా ఎంతకాలం?

52. జ్ఞానశిశువు:పరిగెత్తేవాణ్ణి
పనిచేసేవాణ్ణి
తినేవాణ్ణి
బ్రతికేవాణ్ణి

సాక్షిగా చూడు.

ఆ సాక్షివి నీవు.
పరుగులు లేనివాడివి నీవు.
పని(కర్మ)లేనివాడివి నీవు.
నిత్య ఉపవాసివి నీవు.
పుట్టుక-బ్రతుకు-చావు లేనివాడివి నీవు.

నీ శరీరం శ్రమించనీ...
నీ మనసు చలించనీ...

నీవు అశ్రమడవు.
నీవు అచలడవు.

నీ ఏకైక కర్తవ్యం....
నీకు నీవు యెడంగా ఉండడమే.

నీకు నీవు యెడంగా ఉన్నప్పుడు మాత్రమే
"ఎందుకు" అన్న ప్రశ్న తొలగుతుంది.

అప్పటివరకు ఆ ప్రశ్న నిన్ను తొలుచుకు తినేస్తుంది.

53.పరమేశ్వర్: నాకు జ్ఞాన భిక్ష పెట్టి, నా ఆకలి తీర్చాలని కోరుతున్నాను...

జ్ఞానశిశువు: జ్ఞానభిక్ష పెడుతూనే ఉన్నాను....
ఆరగించేవారు లేరు....

54.త్రిపుర: టిఫన్ అయ్యిందా?

జ్ఞానశిశువు: ఇప్పుడే...ఇడ్లీ, టమోటా సూప్...

ఆగస్టు 24న గురుజయంతికి మీరు వస్తున్నారా?

55.త్రిపుర: వస్తున్నాను....వెంటనే రిటర్న్ అయిపోతాను....

జ్ఞానశిశువు: మంచిది....

56.త్రిపుర: నిన్న గురువుగారొచ్చారు....పూజ చేసే టైంలో...
నీతోనే ఉంటాను...నీవుగానే ఉంటాను....అన్నారు...

జ్ఞానశిశువు: మంచిది...ప్రయాణం చేసి వచ్చి మరీ గురుదర్శనం
చేసుకోనక్కర్లేదన్నమాట....

ఇక మీకు గురువు  అవసరం లేదు...
మీరే గురువుగా ఉండండి...

నేను గురువు అనుకోవడం....
నేను దేవుడు అనుకోవడం...

అహంకారం కాదు....అహంస్వరూపం....

నేను ఇది తప్ప మిగతా అన్నీ అహంకారాలే....
నేను త్రిపురను, నేను బాబును అనుకోవడమే తొలి అహంకారం.

57.త్రిపుర:అవునా...అయితే నేను కూడా ఇక నుంచి "నేను గురువు" అనే
భావనతో తాదాత్మ్యం చెంది ఉంటాను....

జ్ఞానశిశువు: మంచిది.

58.త్రిపుర: గురువు వద్దకు వెళ్లారా?

జ్ఞానశిశువు: నిన్నే వెళ్ళా.....
ఇప్పుడు బాగా తగ్గిస్తున్నాను...అక్కడకు వెళ్లడం...

మనసు స్వేచ్ఛ కోరుకుంటోంది....గురువు నుంచి...దేవుడి నుంచి....

59.త్రిపుర: కారణం...?

జ్ఞానశిశువు: జ్ఞానాంబ అనుగ్రహం వలన...అలా వ్యాకోచించాం.....గురువు కోసం, దేవుని కోసం ప్రత్యేకమైన చోటుకి వెళ్లి...ప్రత్యేకమైన వ్యక్తిని గురువని తలవడం, ప్రత్యేకమైన విగ్రహాన్ని దేవుడని మ్రొక్కడం
అనేవి.....పోతున్నాయి....

గురువు యెడల అద్వైతభావముండరాదు అన్నారు రమణులు....

ఇది వ్యవహార రీత్యా చెప్పారేగాని.....

గురువు కూడా "నాలో"ని వాడే అని ఉంటే దోషమేమీ కాదు....

ఏనుగు స్వప్నంలో కనబడే సింహం గురువు.
తటాలున మెలకువ వస్తుంది.

ఆ మెలకువలో గురువూ ఉండడు, శిష్యుడూ ఉండడు.

60.త్రిపుర: ఈ మధ్య నాకు అలానే అనిపిస్తుంది....

జ్ఞానశిశువు: మంచిది....

61.త్రిపుర: అలా భావించడం తప్పేమో అనుకున్నా.....

జ్ఞానశిశువు: తప్పేమీ కాదు....
తెలుగుభాషలో.....నేను.....నాలో.....
అనేవి ఎంత గొప్ప పదాలు....!!
నిజమైన భగవన్నామాలు అవి.

62.త్రిపుర: ఇంతకుముందు పూజలు బాగా చేసేదాన్ని. మరి ఇప్పుడు చేయడం లేదు.

జ్ఞానశిశువు: శుభపరిణామం...

శివుడు ఎదురుపడ్డా సరే....ఏం పని మీద వచ్చావు? అని అడుగుతావు .....నిమ్మళంగా....

63.త్రిపుర: ఈ మధ్య ఎన్ని సార్లో "నాలో నేను" అనుకున్నానో....

జ్ఞానశిశువు: అదే సరి.

ఆ స్థాయిలో ఉన్నవారే మన గురువు గడప త్రొక్కగలరు....

కోర్సు పూర్తయిపోయి....యోగ్యతాపత్రంపై సంతకం కోసం వచ్చేవాళ్లే దూరప్రాంతం నుండి వచ్చేవాళ్లంతా...

సంతకం(దర్శనం) అయ్యాక ఇక గురువూ అవసరం లేదు, ఆ స్కూలూ(సత్సంగమూ) అవసరం లేదు.

మనసు ఏకాంతం కోరుకుంటుంది.

కళ్లెదుట దేవుడు సాక్షాత్కరించినా కూడా ఆటంకంగానే భావించడం జరుగుతుంది.

64.త్రిపుర: కొన్ని రోజుల క్రితం వెంకట నర్సయ్య గారికి కలలోకి వచ్చారట... అమ్మ , గురువుగారు....

గురువుగారే చెప్పారు నాకీ విషయం...

అప్పుడు నేను అన్నాను గురువుగారితో...
ఈ మధ్య నాకు అసలు మీరు  కలలోకి రావడమే లేదు అని.

నేను నీతోనే, నీవుగానే ఉంటే.... ఇంకా స్వప్నదర్శనాలతో ఏంపని?  నువ్వే అమ్మవి(త్రిపురాంబవి) అన్నారు.

జ్ఞానశిశువు: బాగుంది సమాధానం...

65.ప్రశ్న: భగవంతుడు ఈ ప్రపంచాన్ని యెందుకు సృష్టించాడు?

జ్ఞానశిశువు: అందరికీ కలిసి ఒక ప్రపంచం లేనే లేదు.
యెవడి ప్రపంచంలో వాడున్నాడు.
యెవడి స్వప్నప్రపంచం వాడిదే అన్నట్టుగా.

నీ కలలో ఇదే విధమైన సంభాషణే జరిగిందనుకో...
ప్రశ్నించేవాడు, సమాధానమిచ్చేవాడు ఇద్దరూ నీవే కదా అవుతావు....

ఎవడి కలకు వాడే కర్త.
ఎవడి జగత్తుకు వాడే కర్త.

స్వప్న జగత్తుకు, జాగ్రత్ జగత్తుకు ఇంచుకైనా భేదం లేదు.

"భగవంతుడు ఎందుకు సృష్టించాడు?" అని ప్రశ్నించేవాడు, ఆ భగవంతునికి అభిన్నం.

ఆడించేవాడూ భగవంతుడే.
ఆడేవాడూ భగవంతుడే.

తన మూలం వెళ్లి...
తనలో కలిసిపోయి...
తాను  ఒక్కడే శేషించినప్పుడు...
ఆ తాను భగవంతుడే అని అనుభవమాయ్యాక...
ఆ ఏకాత్మస్థితిలో...
సృష్టితో పాటు ప్రశ్న, ప్రశ్నించేవాడు కూడా మాయమౌతారు...

"ఎందుకు" అన్న ప్రశ్నకు ఖచ్చితమైన సమాధానం వాచా ఎప్పటికీ దొరకదు.

మనం(ప్రపంచం) భగవంతునిలో అంతర్భాగమై ఉన్నప్పటికీ...

మనం "అదే" అయినప్పటికీ....మనకు తెలియడం లేదు.

* * *

ఒకడు గూబ గుయ్యమనేట్టు చెంపమీద కొట్టాడు...
ఎందుక్కొట్టావు? అని అడిగితే...
నా బలమేమిటో నీకు తెలియడానికి అన్నాట్ట...

ఈ సృష్టి యెందుకు చేశావు? అని భగవంతుణ్ణి అడిగితే,
నేనొకడ్ని ఉన్నానని నీకు తెలియడానికి అన్నాట్ట.

ఇది హాస్యాస్పదంగా అనిపించినప్పటికీ...

సృష్టి కారణమేమి? అన్న ప్రశ్నకు ఇంతకు మించి సమాధానం లేదనిపిస్తుంది.

గొంతెత్తి పాట పాడకుంటే అతడు గాయకుడు అని ఎలా తెలుస్తుంది?

వీణ పై స్వరాల్ని మీటకుంటే అతడు వైణికుడు అని తెలుస్తుంది?

రాతిని శిల్పంగా మలచుకుంటే అతడు శిల్పి అని తెలుస్తుంది?

చిదాకాశమనే తెరపై విశ్వసృష్టిని గీయకుంటే అతడు భగవంతుడు అని ఎలా తెలుస్తుంది?

* * *

బ్రహ్మ మానసపుత్రుడైన వశిష్ఠమహర్షి పుట్టుకతోనే
శుద్ధబ్రహ్మజ్ఞాని...అతనికి బంధంగానీ, దుఃఖంగానీ తెలియవు.

నీవు గడియకాలం అజ్ఞానానికి లోనవుదువుగాక
అని అకారణంగా...ఓ సదుద్దేశంతోనే వశిష్ఠునికి శాపం పెట్టాడు బ్రహ్మ.

వశిష్ఠుడు అజ్ఞానవశుడై విచారవదనంతో
తన అకారణ దుఃఖాన్ని పోగొట్టమని ప్రార్థించగా అందుకు బ్రహ్మ చేసిన ప్రబోధమే  యోగవాశిష్ఠం అయ్యింది.

కష్టసుఖాలనేవి ఎలా ఉంటాయో అనుభవంలో ఉన్నప్పుడే
వాటి నుంటి బయటపడడానికి అనువైన బోధ లోకులకు చేయగలిగే సమర్థత వశిష్ఠునికి వస్తుంది.

అదే బ్రహ్మగారి సదుద్దేశము.

* * *

మితం అనేది తెలియకపోతే
అమితం అనేది ఎలా తెలుస్తుంది?

అంతం అనేది తెలియకపోతే
అనంతం అనేది ఎలా తెలుస్తుంది?

బాధ అనేది తెలియకపోతే
ఆనందం అనేది ఎలా తెలుస్తుంది?

అజ్ఞానం అనేది తెలియకపోతే
జ్ఞానం అనేది ఎలా తెలుస్తుంది?

భగవంతుడు చేసిన సృష్టికార్యము కూడా అలాంటిదే.

ఏకంగా ఉన్న తాను ఏకంగా ఉండక
అనేకమైనాడు అది లీల అయ్యింది.

తిరిగి అనేకం నుండి ఏకం వైపుకు ప్రయాణమయ్యాడు.
అది జీవితం అయ్యింది.

"ఎందుకు?" అని అడిగితే,
లోకవత్ లీలా కైవల్యం అంటుంది బ్రహ్మసూత్రం.
"లీల" అన్నాక ఇంకేం మాట్లాడగలం?
"లీల యెందుకు?" అని అడగలేం.

ఆనందం కోసం ఆడేది క్రీడ.
ఆనందంగా ఉండి చేసేది లీల.

ఎందుకు దుఃఖిస్తున్నావు? అని అడుగుతామే గాని
ఎందుకు ఆనందంగా ఉన్నావు? అని అడగం.

దుఃఖానికి కారణం ఉంటుందేగాని,
ఆనందానికి కారణం ఉండదు.

శిశువు అకారణ ఆనందానికి బాహ్యచేష్టలే కేరింతలు.
శివుని అకారణ ఆనందానికి బాహ్యరూపమే ప్రపంచం.

శివుని ఆనందసాగరంలో తేలియాడే నురగలు
ఈ ద్వంద్వాలు, త్రిపుటులు.

66.ప్రశ్న: ఈ సృష్టి ఎలా జరిగింది?

జ్ఞానశిశువు: మలం తొక్కావు...కడుక్కోవాలి అంతే.
ఎలా తొక్కాను? అనే విచారణ అనవసరం.

మాయ ఎలా తొలగించుకోవాలో అనేది సందర్భానుసారంగా ఒక్కొక్క
శిష్యునికి ఒక్కొక్క  మార్గం చెప్పారు ఋషులు.

మాయ ఎందుకు కలిగింది? అనేదానికి సమాధానం మాత్రం వారు ఇవ్వలేదు.

పిల్లవాడు ఏడుస్తుంటే వాడికి మిఠాయి ఇచ్చి సముదాయించినట్టే ఈ గురువులు చెప్పిన సమాధానాలన్నీ.
అవన్నీ కంటి తుడుపు సమాధానాలేగాని...అసలు కావు.

67.ప్రశ్న: అయితే సమాధానం చెప్పడం ఋషులకు కూడా సాధ్యం కాలేదన్న మాట...

జ్ఞానశిశువు: యెందుకంటే "తానే" సమాధానం.
తనకు సమాధానం కాదు కాబట్టి.

ఋషికి సృష్టీ ఉండదు, బంధమూ ఉండదు.

68.ప్రశ్న: జన్మలకు వాసనలే కారణమంటారు?
తొలి వాసన ఎప్పుడు వచ్చింది?

జ్ఞానశిశువు: "ఎప్పుడు?" అనేది కాలానికి సంబంధించినది.
కాలం అనేది నీ తలపులలో తప్ప...దానికి స్వయం ఉనికి లేదు.

మనం నిద్రనుండి మేలుకోగానే
"నేను" అనే తొలి ఆలోచన కలిగాకే
మిగతా ఆలోచనలు, వ్యవహారాలూ కలుగుతాయి.

అలాగే భగవంతుని "తొలి ఆలోచన" అయిన "నేను" నుండే సర్వసృష్టీ జరిగింది.

అందుకే సృష్టిలోని ప్రతివ్యక్తిలోనూ, వస్తువులోనూ దివ్యత్వం ఉందనడానికి కారణం.

69.ప్రశ్న: నేను కనే ఈ సృష్టి నాదేనంటారా?

జ్ఞానశిశువు: అక్షరాలా....

ఈ సృష్టి నీ మనో వైచిత్ర్యమే...
ఇది తెలిసి ఓ మహాత్ముడుగా ఈ జగత్తులో చరించు...

70.ప్రశ్న: ఈ జగత్తు ఇంత సత్యంగా కనిపిస్తుంటే
ఇది కల అని యెందుకు అనుకోవడం?

జ్ఞానశిశువు: నిజమే.  ఆధ్యాత్మికంలో అత్యుత్తమస్థాయికి చేరుకునే వరకు
దీనిని కలగా భావించాలి తప్పదు.
ఇదొక మంచి సాధన.

మూలసత్యం వైపుకు నీ దృష్టి మరలే వరకు
నీవనుకునే సత్యాలన్నీ అసత్యాలే అని చెప్పాల్సి ఉంటుంది....

ఆ కోణంలో జగత్తు అసత్యమన్నారేగాని,
నిజానికి సత్యంవైపు నుండి చూస్తే
జగత్తు కూడా సత్యమే.

చైత్యన్యస్థాయిలో ఈ జగత్తు కూడా చైతన్యపు తునకే.
చైతన్యస్థాయిలో ఈ జీవితం కూడా ఆనందపు సారమే.

నిద్రలో కలిగే మెలకువ - కల.
మెలకువలో కలిగే కల - మెలకువ.

మొదటి కల - జీవునిది.
రెండవ కల - దేవునిది.

అందుకే ముందు నీవు ఈ మెలకువ నుండి మేలుకో.... అంటాను...

నిద్ర నుండి మేలుకుంటే కల చెదిరిపోయినట్టు.
ఈ మెలకువ అనే కల నుండి మేలుకుంటే ఈ సృష్టి చెదరిపోతుంది(కల ఉన్న ప్పటికీ కలకు బాధితుడై ఉండడు అని భావము)

కల కనేవాడు ఒకడే శేషిస్తాడు.
ఇదే ఆధ్యాత్మిక లక్ష్యం.

వచ్చిన కలను విధిలేక కనేవాడు - జీవుడు.
నచ్చిన కలను స్వేచ్ఛగా కనేవాడు - దేవుడు.

71.ప్రశ్న: భగవంతుడు ఈ సృష్టి ఎందుకు చేశాడు?

జ్ఞానశిశువు: సృష్టి కూడా తానే కాబట్టి....
తనకు విడిగా రెండవ వస్తువు లేదు కాబట్టి...
ఎందుకు అన్న ప్రశ్నకు తావులేదు.

బంగారం సదా బంగారంగానే ఉంది.
నీవెందుకు ఆభరణాల్ని సృష్టించావు?
అని బంగారాన్ని నిలదీయగలమా?

అవునా....నేనెప్పుడు ఆభరణమయ్యాను?
నేను నేనుగానే ఉన్నానే! అని అది ఆశ్చర్యపోతుంది.

ఆభరణసృష్టి మనం చేసుకున్న రూపకల్పనే తప్ప
బంగారం సదా బంగారంగానే ఉన్నది.
జగత్సృష్టి కూడా  మనో విక్షేపమే తప్ప
బ్రహ్మము బ్రహ్మముగానే ఉన్నది.

ఆభరణం అనేది వ్యావహారిక సత్యం.
బంగారం అనేది పారమార్థిక సత్యం.

ప్రపంచం అనేది వ్యావహారిక సత్యం.
బ్రహ్మం అనేది పారమార్థిక సత్యం.

ఒకటి యెప్పుడూ రెండు కాలేదు.

ఒకటి(ఏకం) అనేది - ఆత్మకు సంబంధించినది.
రెండు(అనేకం) అనేది - మనసుకు సంబంధించినది.

ఒకటి అనేది - ఉన్నది.
రెండు అనేది - ఉన్నట్లున్నది.

ఒకటి అనేది - సత్యము.
రెండు అనేది మిథ్య.

ఒకటి అనేది - దైవము.
రెండు అనేది - ప్రపంచము.

తెల్లకాగితం - దైవం.
అక్షరాలు - ప్రపంచం.

జడమైన ఈ సకల నామరూపాల మరుగున ఆత్మచైతన్యమే ఉండేది.

72. ప్రశ్న: ఇదంతా నా మనస్సృష్టే అనేది నమ్మలేకపోతున్నాను...

జ్ఞానశిశువు: జ్ఞానంలో నీవు మేలుకుంటే గాని తెలియదు
ఈ జాగ్రదవస్థ అనేది నీ మనస్సృష్టే అనేది.
అప్పుటి వరకు వాస్తవంగా ఉండి బాధిస్తుంది.

ఆ జ్ఞానమెలకువలో స్వప్నం కూడా జ్ఞానప్రకాశంతో(సంపూర్ణ ఎఱుకతో) ఉంటుంది.

ఇది కల, ఇది మెలకువ, ఇది నిద్ర అనే తేడా చూచేవాళ్లకేగానీ తన అనుభవంలో "జ్ఞానం" తప్ప మరొక అవస్థ ఏదీ ఉండదు.

ఇదే తురీయం.
ఆ తురీయాన్ని  సద్గురు సన్నిధిలో మాత్రమే సాధించగలం.

* * *

గుర్వనుగ్రహమే ప్రధానం.
ఇతరత్రా సాధనలన్నీ ద్వితీయం.
అని రమణులు చెప్పి ఉన్నారు.

73.ఆనంద్: మహనీయులు భారతదేశంలోనే యెందుకు పుడుతుంటారు?

జ్ఞానశిశువు: ఓ పదహారేళ్ల కుర్రవాడు(రమణుడు) దేవునికోసమని ఇల్లు వదిలి
అరుణాచలం చేరి, ధనం, వస్త్రం పరిత్యజించి
కేవలం  "గోచీతో నిలబడడం" అనే అద్భుతమైన ఘట్టం
నాకు రోజులో ఒక్కసారైనా గుర్తుకువస్తుంటుంది.

ఆ పదహారేళ్ల కుర్రవాడే - భగవాన్ శ్రీరమణ మహర్షి.

చదివింది ఫిఫ్త్ ఫామ్.
కానీ పండితులకు, పీఠాధిపతులకు సైతం అవగతం కాని తాత్త్విక

విషయాలెన్నింటినో బోధించారు.

ఎలా వచ్చింది ఆ కుర్రాడికి ఆ శక్తి? ఆ జ్ఞానం?

ఓ పువ్వు పుట్టినట్టు, ఓ మెరుపు మెరిసినట్టు
జ్ఞాని అలా పుడతాడు సహజంగా.

జ్ఞానికావడానికి-
కోచింగ్ సెంటర్లు లేవు,
text books లేవు,
రిజర్వేషన్లు లేవు,
రెకమెండేషన్లూ లేవు.

ఈ పవిత్ర భారతభూమిలో అటువంటి జ్ఞానవృక్షాలు సహజంగా ఎదగడానికి అవసరమైన "సారం" ఏదో ఉంది.

ప్రతి దశాబ్దంలోనూ అటువంటి మహనీయులు అవతరించడం చూస్తూనే ఉన్నాం.

అది మన భారతీయ ధార్మిక జీవన విధానమే
ఆ "సారం".

అలా మహనీయుడు పుట్టని దశాబ్ధం ఉన్నదంటే
ఈ భూమికి "చేవ" చచ్చినట్టు.

యుగాలపర్యంతం వస్తున్న ఆ చేవను
అలాగే మనం భవిష్యత్తరాలవారికి మనం అందివ్వాలంటే ఏకైక మార్గం - ధర్మాచరణం.

ధర్మాచరణే యొక్క దివ్యఫలమే భగవదనుగ్రహంగా,
అవతారమూర్తిగా ప్రకటనమౌతుంది ప్రపంచంలో.

ధర్మాచరణ అంటే శీలం.
శీలం అంటే పారదర్శకత.

పారదర్శకత అంటే-
నీవు నీ లోపల ఏదో

బయట కూడా అదిగానే ఉండడం.

74.కిరణ్మయి: ఓ వ్యక్తి ఆత్మసాక్షాత్కారం పొందాక అతడు లోకవ్యవహారాల రీత్యా ఎలా ఉంటాడు?

జ్ఞానశిశువు: ఆత్మసాక్షాత్కారం పొందిన మహనీయుడు ఎలా ఉంటాడంటే, అతని కంటే ఉత్తమనటుడు మరొకడు ఉండడు అనిపిస్తుంది.

అందరితో పాటు ఏడుస్తాడు.
తన లోపల ఏ ఏడుపూ ఉండదు.

అందరితో పాటు నవ్వుతాడు.
తన లోపల ఏ నవ్వూ ఉండదు.

అందరితో కలిసి అన్ని వ్యవహారాలూ నడుపుతాడు.
తన లోపల ఏ స్పందనా  ఉండదు.
* * *
వెలుపల - బంధం.
లోపల - మోక్షం.
అతని స్థితి.
* * *
అందరికీ తానుంటాడు.
తనకు ఎవరూ ఉండరూ తనతో సహా.
* * *
మెలకువలో నిద్రపోయే భోగి అతడు.
నిద్రలో మెలకువగా ఉండే యోగి అతడు.
మరణించి జీవించే జ్ఞాని అతడు.

75.ఒకరు: సర్వసాక్షి, కేవల సాక్షి అంటే ఏమి?

జ్ఞానశిశువు: సర్వము ఉన్నప్పుడు సర్వసాక్షి.
సర్వము లేనప్పుడు కేవలసాక్షి.

76. శశి: గురువుగారి పేరు తెలుపగలరు...

జ్ఞానశిశువు: గురువుకు గురువు అనేదే పేరు.
మరో పేరుతో పనియేమి?

77. ఒకరు: జ్ఞాని లక్షణమేమి?

జ్ఞానశిశువు: నేను అన్న అహాన్ని అమాంతంగా మ్రింగివేసి, ఆనందంతో ఉప్పొంగుతాడు జ్ఞాని.
నీది,నాది అంటూ మాటవరుసకు కూడా పలుకడు జ్ఞాని.
అతనికి కర్తవ్యం అంటూ ఏమీ ఉండదు.
ఇది జ్ఞాని స్థితి అని చెప్పడానికి మరో జ్ఞాని ఉండడు.
యెందుకంటే జ్ఞాని అనేది సదా ఏకవచనం.
ఆ ఏకైక జ్ఞాని "నేను".

78.బాలసుబ్రహ్మణ్యం: సాధన అవసరం లేదని అంటున్నారు మీరు....సద్గురు స్థితి అదే కావొచ్చునుగానీ, అందరికీ అలా వీలుపడదేమో?

జ్ఞానశిశువు:సాధన అవసరం అని అన్నప్పుడు ఎంతమంది సాధన చేస్తున్నారో

సాధన అవసరం లేదు అని మేం(గురువుగారు) అన్నప్పుడు కూడా

అంతమందే ఆ స్థితిలో ఉండగలుగుతారు.

ఏ బోధా అందరికీ కాదు.....

విత్తనాలు చల్లినప్పుడు భూమిలో పడినవి ఫలిస్తాయి,
రాతిమీద పడినవి ఫలించవు.

సామాన్యులు, మహనీయులు ఇద్దరున్నారని ఉపనిషత్ ఋషులు వారిని అనుసరించి రెండు బోధలు చేయలేదు.

తాము అనుభవించినదానిని పలవరించారు అంతే.

రమణులు కూడా తానై చెప్పిన ప్రతి మాటా సాధనకు అతీతమైనదిగానే ఉండినది.

కానీ ప్రశ్న అడిగినవాని మనఃస్థితిని బట్టి కూడా రకరకాల మార్గాలనూ సమర్థించారు...

మూలం ఒకటే...మార్గం ఒకటే...
ఆత్మవిచారణే ఏకైక మార్గం అనీ చెప్పారు.

రామనామం జపించుకుంటున్నాను స్వామీ....అంటే
జపించుకో అనీ చెప్పారు.

అన్నింటినీ ఆమోదించడం మహనీయులకు ఉండే సహజసిద్ధమైన లక్షణం.

యెందుకంటే,

అన్ని నదులూ సముద్రం వైపుకే...
అన్ని దారులూ కేంద్రం వైపుకే...
అని వారికి తెలుసు.

* * *

ఆ పరమపదంలో స్థిరమై ఉన్న గురువులకు
సామాన్యుడు కనబడడు.
సాధన అన్నమాట అనడు.
అది అంతే.

నీవెవరినైతే సామాన్యుడు అంటున్నావో
వీడు మన బోధలకు లొంగడు.
వీణ్ణి సాధన ఆపమన్నా ఆపడు.
ఇది ఇంతే.

సాధనలతో బ్రహ్మర్షిత్వాన్ని సాధించినవాడు విశ్వామిత్రుడు.

ఏ సాధనా చేయక ఋషిత్వాన్ని పొందినవాడు
తిరుచ్చిళి రమణుడు.

* * *

మనం విశ్వామిత్రుడిలా తపస్సూ చేయలేము.
రమణుడిలా ఊరకా ఉండలేము.

మనకు అన్ని సంసారిక బంధాలూ ఉంటూనే
ఆత్మసాక్షాత్కారం పొందే చిట్కాల కోసం పుస్తకాల్లో వెతుకుతాం,

గురువులను ఆశ్రయిస్తాం.

చిట్కాలు చిట్కాలుగానే ఉన్నాయి...
మన చింతలు చింతలుగానే ఉన్నాయి...

ఈ ఆధునిక సౌకర్యాల మధ్య ఆ ప్రాచీనమైన ఋషులకథలు చదువుతాం....

ఈ సౌకర్యాలూ వదులుకోలేము
తపస్సులు చేయడానికి అడవులకూ వెళ్లలేము.
కానీ ఋషుల పొందిన ఆత్మానుభవాన్ని మాత్రం సులభంగా కొట్టేయాలి....

మనం ఏ సాధన చేసినా 'షో' యెక్కువ,
సత్తా తక్కువ.

6 నుండి 7 వరకు ధ్యానం అనే టైంటేబుల్ సాధనల వలన ఒరిగేదేమీ ఉండదు.
ఆ కాసేపు రిలాక్స్ మనం బ్రహ్మపదం పొందేశామన్న ఫీలింగుతో ప్రపంచాన్ని చూస్తాం.

ప్రపంచమేమో మనల్ని గుర్తించదు...అదో పెద్ద సమస్య...

ధ్యానం చేయండి....అంటూ ప్రచారాలు...
ఈ ప్రచారం యొక్క ముఖ్య ఉద్దేశం ఏమంటే నేను గొప్ప ధ్యానపరుణ్ణి అని లోకానికి చాటి చెప్పడమన్నమాట...

నీవు పొందడం నిజమైతే
పొందనివాడంటూ నీకు కనబడడు.
అంటారు గురువుగారు.

పొందనివాడే, అందరూ పొందాలి...అంటూ ప్రచారం చేస్తుంటాడు....

పొందినవాడు ఊరక ఉంటాడు.
అడిగినవాడికి కూడా 'ఊరకే ఉండు' అని బోధిస్తాడు.

* * *

'నేను'కు నీడ వ్యక్తి.
నేను తోటే వ్యక్తి కూడా.
'నేను'నూ తొలగించలేం.
నీడనూ తొలగించలేం.

ఆధ్యాత్మిక సాధన అనేది -
వెంటాడే నీడను తొలగించాలనుకోవడం.
అంటే లేని కష్టాన్ని తొలగించాలనుకోవడం.
ఆహా! సాధన అనేది యెంతటి హాస్యాస్పదం!

79.భద్రయ్య: నేనే రెండూ అయ్యి, రెండూ కాకనూ
సాక్షిగా ఉన్న తానే "నేను" అని ఉండడమే
నిజమైన ఆధ్యాత్మికత...అని అన్నారు....

రెండూ అయ్యి, రెండూ కాకనూ...అంటే ఎలా?

జ్ఞానశిశువు: నీ ఇల్లును చూపించి
ఈ ఇల్లెవరు కట్టారు? అంటే?
నేనే కట్టాను అంటావు.
నిజంగా నీవే కట్టావా? అంటే.
లేదు తాపీమేస్త్రీ కట్టాడు అంటావు.

వీడెవడు? అని నీ కొడుకును చూపించి అడిగితే,
వీడు నా కన్న కొడుకు అంటావు.
నిజంగా నీవు కన్నావా? అంటే
లేదు నా భార్య కనింది అంటావు.

ప్రపంచవిషయంలోనూ అంతే.

ఏకకాలంలో -

కర్తృత్వమూ ఉంది...అకర్తృత్వమూ ఉంది.
రెంటికీ సాక్షిగా ఉండడమూ ఉంది.
* * *
80. ఒకరు: ముని అంటే?

జ్ఞానశిశువు: మౌనియే ముని.

వాఙ్మౌనం అసలు మౌనం కాదు.
మూగవానిది వాఙ్మౌనమే.

మనో మౌనం కూడా అసలు మౌనం కాదు.
శవం ఉండేది కూడా మనో మౌనమే.

రమణుడు, లేదా మన సద్గురువు లాంటివారు
నిరంతరం భాషిస్తూ ఉన్నప్పటికీ
వారు నిత్యమౌనులే.

మౌనం అంటే స్వరూప నిష్ఠ...అంతే.
వేఱొక మాట లేదు.

స్వరూపనిష్ఠుడే నిజమైన మౌని....ముని.

81.ఫణి: అందరూ జ్ఞానులు అయినప్పుడు
ఇంక సమస్య ఏమిటో...
ఒకరు జ్ఞాని ఇంకోకరు జ్ఞాని కానివారు అని రెండు ఉన్నాయి
అనిపించినపుడు కదా సమస్య ...

జ్ఞానశిశువు: నిజమే....
చరిత్రకెక్కినవారినే మహనీయులుగా పరిగణిస్తుంటాం.....మన వీధిలో
సమోసాలు అమ్మేవాడు కూడా జ్ఞాని అయి ఉండవచ్చును...

82.ప్రసాద్:
భగవాన్ రమణుల అనుగ్రహం యెల్లప్పుడూ మీకు ఉండాలని ప్రార్థిస్తూ....

జ్ఞానశిశువు: రమణానుగ్రహం అంటే రమణుడే తానైపోవడం....

83.ఒకరు: భోగిమంటల భావమేమి?

జ్ఞానశిశువు: గతాన్ని కాల్చేయ్...!

84.ఒకరు: అందరూ సమానం ఎలా?

జ్ఞానశిశువు: భౌతికంగా అందరమూ మరణిస్తాము.
ఆధ్యాత్మికంగా అందరమూ శాశ్వతులము.

85.ఒకరు: అష్టాంగమార్గం గురించి చెప్పండి...

జ్ఞానశిశువు: ఆకాశంలో 8  నిచ్చెన మెట్లు కట్టి
ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ...
చివరి మెట్టు  ఎక్కి ఆకాశాన్ని చేరుకున్నట్టు.....
ఈ అష్టాంగమార్గం.
చివరి మెట్టుకు అవతల ఉండే ఆకాశమే
మొదటి మెట్టుకు ఇవతల ఉండే ఆకాశం కూడా.
అసలు నిచ్చెన ఉండేదే ఆకాశంలో.
ఆకాశాన్ని చేరుకోవడానికి అసలు నిచ్చెనే అవసరం లేదు.

ఆకాశం - దైవం.
నిచ్చెన - సాధన.

86. ఒకరు: కర్మ-భక్తి-మార్గములు గుఱించి చెప్పండి...

జ్ఞానశిశువు: శివుడు లేక నేను లేను
అని తెలిసి వ్యవహరించు.
ఇది కర్మమార్గం.
* * *
శివునికి శరణు చెందు.
ఆయన ఇచ్ఛకు తల ఒగ్గు.
ఇది భక్తి మార్గం.
* * *
హృదయంలో లోతులకు దిగి
ఆత్మగా నిలిచిపో.
ఇది జ్ఞానమార్గం.

87.రఘు: ఎవరైనా మనల్ని ఇబ్బంది  పెడుతుంటే మనము శక్తివంతముగా ఎలా తయారు కావాలి?

జ్ఞానశిశువు: ఆ ఇబ్బంది పెట్టేవాణ్ణి కూడా 'నేనే' అని తెలియడం వలన...

మన నాలుక మన పళ్ల మధ్య పడి నలిగి మనల్ని బాధిస్తుంది ఒక్కోసారి....
మనం ఎవర్ని శిక్షించగలం?

క్రీస్తు అలానే భరించారు తనను శిలువ వేసే వారిపట్ల కూడా.

88.రఘు: ధ్యానం ద్వారా మానసికముగా
శక్తివంతముగా తయారు కాగలమా?

జ్ఞానశిశువు: మనసుకు ఇప్పుడున్న శక్తితోనే వేగలేకున్నాం....
ఇంకా శక్తి యెందుకు?

బల్బు కెపాసిటీకీ మించి విద్యుత్ శక్తి చేరితే
బల్బు పేలిపోతుంది.

మనం జీవించి ఉన్నాం అంటే ఈ బల్బుకు(మనకు) ఎంత శక్తి అవసరమో
అంత శక్తినే భగవంతుడు సహజంగానే సమకూర్చి ఉన్నాడు....

ఇంకా యెక్కువ శక్తి యెందుకు?
ఏం చేద్దామని?

మనసు ఆత్మలో ఎక్కువుగా స్థిరమయ్యే శక్తినే
నిజంగా మనోశక్తి అనాలి.

89.రఘు: స్వామీ... మానసికముగా స్థిరత్వము, దృఢత్వము అనేవి
ధ్యానం ద్వారా వస్తుందా?

జ్ఞానశిశువు: అవును.

సముద్రం యొక్క ఉపరితల భాగమంతా అల్లకల్లోలంగా ఉంటుంది.

అడుగు భాగం నిశ్చలంగా ఉంటుంది.

మనసు యొక్క ఉపరితల భాగం - ప్రపంచంగా ఉంటుంది.

అడుగు భాగం - దైవంగా ఉంటుంది.

ధ్యానం అంటే...మీ లోలోపలికి ప్రయాణం...

90. రఘు:స్వామి మానసిక స్థిరత్వము, దృఢత్వము రావాలంటే ధ్యానం
రోజుకు ఎన్ని గంటలు, ఎన్ని రోజుల్లో వస్తుంది?

జ్ఞానశిశువు: కాలంలో ధ్యానం ఉండదు.
ధ్యానంలో కాలం ఉండదు.

91. తిరుపతి: సృష్టి ఆయనదా?మనదా?

జ్ఞానశిశువు: ప్రశ్న మనదే కాబట్టి....
సృష్టి కూడా మనదే.

ఆయనకు ప్రశ్నా లేదు,
సృష్టీ లేదు.

* * *

ప్రశ్నించేవాడు జీవుడు.
సమాధానంగా ఉండేవాడు దేవుడు.

93. భద్రయ్య: పాక్షిక సత్యం-పారమార్థిక సత్యం అంటే ఏమి?

జ్ఞానశిశువు: 'నేను భద్రయ్య' అన్నదాంట్లో
భద్రయ్య అనేది పాక్షికసత్యం. నేను అనేది పారమార్థిక సత్యం.

94.భద్రయ్య: వెనుకటి జన్మముల పాపపుణ్యముల బట్టి
ఈ జన్మ నడుస్తుంది అంటున్నారు...
ఇది ఎంతవరకు సత్యం?

జ్ఞానశిశువు: గతజన్మ, మరుజన్మ అనేవి ఎవరో చెప్పడమేగాని,
నీ స్వానుభవంలో అవి లేవుగదా!
కాబట్టి అవి లేవు.

విచారిస్తే...ప్రస్తుతజన్మే లేదు.

* * *

దేవుని తలంపే జీవుని జన్మగా ప్రకటితమౌతుంది.
కలకనేవాని తలంపే కలగా ప్రకటనమయినట్టు.

* * *

కర్మలు-జన్మలు అన్నీ భగవంతునివే.
ఉన్న సకలమూ అతనిలో అంతర్భాగములే.
* * *
దేవుణ్ణి విడిచి జీవుడికి స్వంతంగా ఉనికి లేదు.
అని తెసుకోవడమే జ్ఞానం.
అలా నడచుకోవడమే కర్మ, భక్తి.
జన్మలు-కర్మలు ఉంటే ఉండనీగాక...
అన్నీ భగవంతుడిలోనే.
కలలోనివాడు ఆ కలకనేవాడి నుంచి వెలుపలికి రాలేనట్లు
ఎవడూ ఏదీ భగవంతుడ్ని విడిపడి ఉండలేరు ఉండలేదు.
ఒక్క క్షణమాత్రం కూడా, ఒక్క అణుమాత్రం కూడా దేవునికి ఎడం లేము.
దేవుణ్ణి ఎలా పొందడం? అని కాదు ఆలోచించవలసింది....
దేవుడికి ఎడంగా ఎలా ఉండగలం? అని ఆలోచించండి.
95.ఒకరు: కేవలానుభవం అంటారే? అది ఏమి?
జ్ఞానశిశువు: కేవలం అనుభవం మాత్రమే ఉండడం.
ఏదీ, ఎవరూ లేని స్థితి అది.
అనుభవం ఒకరికి కలగడంగానీ
ఒకరు అనుభవం పొందడం గానీ
అవకాశం లేని స్థితి  అది.
* * *
అనుభవానికి ఎవరూ ఉండరు,
ఎవరికీ అనుభవం ఉండదు.
* * *
అనుభవం అంటే
గత సంపటనలకు సంబంధించిన

జ్ఞాపకాల సమాహారం కాదు.

అనుభవం అంటే 'వ్యష్టిత్వం' లేకపోవడం.

96.ఒకరు: ఆత్మస్థితిని పొందడం ఎలా?
జ్ఞానశిశువు: 'ఇప్పుడు'న్న స్థితియే ఆత్మస్థితి.
క్రొత్తగా పొందవలసినది కాదు.

97. ఒకరు: 'ఇది ఒక కల' అని ఉండమన్నారు....
ఇంత స్పష్టంగా ప్రపంచం అనుభవంలో ఉంటే
కలగా భావించడం యెందుకు?

జ్ఞానశిశువు: 'కొద్దిసేపు' ఉండి పోయేది ఏదైనా అది కలే.

98.ఒకరు: సాధన చేస్తున్నాను....సిద్ధి యెప్పుడు కలుగుతుంది?

జ్ఞానశిశువు: గాలం పట్టుకుని ఉండడం అనేది మాత్రమే మన చేతుల్లో ఉంది.
ఇదే పురుషప్రయత్నం.

చేప పడడం మన చేతుల్లో లేదు.
అది భగవదిచ్ఛ.

సిద్ధి ఎప్పుడు కలుగుతుందో ఎవరు చెప్పగలరు?

రమణుడు అసలు గాలమే వేయలేదు
కానీ చేప దొరికింది.

భగవదిచ్ఛ అనేది బహు చమత్కృతి  కలిగినది సుమా!

99.ఒకరు: జ్ఞానిస్థితి ఏమి?

జ్ఞానశిశువు: పెన్సిల్ కే ఎరేజర్ ఉంటుంది.
వ్రాయడానికి, తుడపడానికి ఒకే పరికరం.
జ్ఞాని అలా ఉంటాడు.
కర్మ చేస్తున్నట్టే ఉంటాడు.
అదే సమయంలో ఏమీ చేయని స్థితిలోనూ ఉంటాడు.
జ్ఞాని ఏకకాలంలో కర్తగానూ, అకర్తగానూ ఉంటాడు.

100.ఒకరు: శిష్యుడనగా ఎవడు?
జ్ఞానశిశువు: ప్రశ్నించువాడు.

101.ఒకరు: గురువనగా ఎవడు?
జ్ఞానశిశువు:సమాధానపరచువాడు.

102. ఒకరు: ఈ ధ్యానకేంద్రాలలో మూకుమ్మడిగా ధ్యానం చేస్తుంటారు...ఇది సరియేనా?

జ్ఞానశిశువు: నా చిన్నప్పుడు మా అమ్మ ఓ కథ చెప్పింది...

పరమానంద గురువుగారు, ఒక శిష్యుణ్ణి పిలిచి అంగడికెళ్లి ఓ సూది కొనుక్కు రమ్మంటారు...
సరేనని అతను బయలుదేరుతుండగా, మిగతా శిష్యులంతా అతన్ని మధ్యలో అడ్డగించి, గురుసేవను మనమందరమూ కలిసికట్టుగా చేయాలి. కాబట్టి సూది తేవడానికి మనం పదిమంది కలిసి వెళదాం అని బయలుదేరారు...అంగడికెళ్లి సూది కొన్నారు... ఆ సూదిని ఒకడు తెస్తే సరిపోతుంది...కానీ గురుకార్యాన్ని పదిమంది కలిసి నెరవేర్చాలి కాబట్టి...పెద్ద దుంగ తీసుకొచ్చి, ఆ సూదిని దానికి గ్రుచ్చి కష్టపడి మోసుకొచ్చి గురువుముందు ఆ దూలాన్ని పడేసి, గురువుగారూ! ఇదిగోనండి సూది అన్నారు.
ఒరే చవటల్లారా! సూది తెమ్మంటే దూలం తెచ్చారేమిట్రా... అరిచాడు గురువు. ఉండండి గురువుగారూ...అంటూ దూలానికి గ్రుచ్చిన సూది కోసం వెతికారు అంతా...ఇంకెక్కడుంది? దారిలో ఎక్కడో అది కాస్త రాలిపోయింది.

* * *

ఆధ్యాత్మిక సాధన యెప్పుడూ వ్యక్తితంగానే ఉండాలి.
స్వరూపం (ఆత్మ) అనేది సూది కంటే, అణువు కంటే సూక్ష్మమైనది...
దానిని పొందటానికి(అనుభవంలో రావటానికి) ఒక్కడుగానే సాధించాలి.

సామూహిక ధ్యానాలు వలన, సామూహిక సత్సంగాల వలన సూది(ఆత్మ) చేజారిపోతుంది.

ఆధ్యాత్మికం అంటేనే వ్యవహారం తగ్గించుకోవడం...
కానీ వ్యవహారం పెరిగేలా జరుగుతుంటాయి
ఈ ఉమ్మడి సత్సంగాలు, ఈ ఉమ్మడి ధ్యానాలు...

పెద్దలు అంటుంటారు...
కాపురం ఉమ్మడిగా చేయాలి...
ధ్యానం ఒంటరిగా చేయాలి...అని.

* * *

గాంధీగారన్నారట-
నా ముక్తి కంటే ఇతరుల ముక్తి కొఱకే నేను పాటు పడతాను...అని.

రమణుల వద్ద ఈ విషయం ప్రసావనకు వస్తే,
వారు చిరునవ్వుతో ఇలా సెలవిచ్చారు-

కల కనేవాడు మేలుకోక
కలలో ఉన్నవారందరినీ మేల్కొలపాలని
ప్రయత్నించడం లాంటిదే ఇది.

తానొక్కడు మేలుకొంటే(ముక్తి పొందితే) చాలు.
ముక్తి పొందటానికి ఇతరులు అంటూ ఎవరూ ఉండరు.
తానొక్కడే శేషిస్తాడు.

"ఒక్కడు" మిగలడమే ముక్తి.

"ఇతరం" అనేదంతా తనలోనిదే, తానే.

ఉమ్మడి పోరుతో అవసరం లేని
ఒంటరి పోరాటమే - ధ్యానం.

అందరికీ సాధ్యం కాదు కదా! అని అంటే,
"అందరూ" ఎక్కణ్ణుంచి వచ్చారు?
ఉండేది నీవొక్కడివే...
అని గురువుగారు అనడం కద్దు.

మన ప్రాచీన ఋషులు చేసిన తపస్సు ముందు
ఈ ధ్యానం అనేది చచ్చు పదంలా అనిపిస్తుంది.

తీవ్రత ఉండాలి....తపన ఉండాలి...
తీవ్రమైన తపనే తపస్సు....

రమణులకు తన 16వ యేట తీవ్రమైన మరణ భయం పట్టుకుంది....కొద్ది నిమిషాల్లోనే మనిషి ఋషైపోయారు...

కామోత్కంఠత గోపికల్,
భయమునం గంసుండు,
వైరక్రియాసామగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్,
సంబంధులై వృష్ణులుం,
బ్రేమన్ మీరలు,
భక్తి నేము,
నిదె చక్రింగంటి
మెట్లైన నుద్దామ ధ్యానగరిష్ఠుఁడైన
హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!

అంటారు పోతన...

* * *

ఇన్ని విధాలా భగవంతుణ్ణి పొందవచ్చు...

కాబట్టి భయంతోనా? వైరంతోనా? అనేది కాదు ముఖ్యం, ఆ భయం, ఆ వైరం యెంతటి తీవ్రతతో  ఉన్నదనేదే ముఖ్యం.

ఆ తీవ్రతలో నుంచే ముక్తి కలిగేది.

మనం చేసే 7 to 8 ధ్యానం లాంటి Time Table సాధనల వలన ఒరిగేదేమీ ఉండదు....

ఆ కాసేపు ఓ చిన్నపాటి Relaxation తప్ప.

'ఆత్మలబ్ధికి మార్గం ఆర్తి' అన్నారు భగవాన్.

సాక్షాత్కారం కలుగలేదంటే ఇప్పుడున్న ఆర్తి చాలదనే.

మనకు ఐహిక విషయాల పట్ల ఉన్న ఆర్తి
ఆధ్యాత్మికం విషయంలో ఉన్నట్లయితే
ఈ వేళ్టికే మనం ఋషులమైపోయి వుండేవాళ్లం.

కావలసినంత ఆర్తి ఉంది....కానీ సాక్షాత్కారం కలగలేదు...అంటారు కొందరు...

భగవంతునిపై మనం వేసే అనవసరపు నింద మాత్రమే ఇది.
భగవంతుడు దయాహీనుడు అని మనం చెప్పక చెప్పినట్లే.

ప్రార్థనను బట్టి ఫలాన్ని కాదు,
ఫలాన్ని బట్టే ప్రార్థనను నిర్ణయించాలి...
అంటారు గురువుగారు.

భగవంతునికై మన పరితాపం యెంత గొప్పదిగా ఉంటుందో....

భగవంతుడు మనకు అంతకంతకు దగ్గరౌతున్నట్టే.

ఆత్మ విషయమై దీనులైనవారు ధన్యులు.
పరలోకరాజ్యం(మోక్షం) వారిదే...అంటారు క్రీస్తు.

అశాశ్వతమైన విషయాల పట్ల మనకున్న దీనత్వాన్ని వదిలి,

ఆత్మవిషయమై దీనత్వం వహించడమే గొప్ప సాధన.

103.భద్రయ్య: దేహం మీద భ్రాంతి పోవాలంటే ఏంచేయాలి?

జ్ఞానశిశువు: నీవేమీ చేయనక్కర్లేదు....
దేహం మీకు సహకరిస్తున్నంత కాలం
దాని మీద మమకారం పెరిగిపోతుంది.

దేహం మిమ్మల్ని ఇబ్బంది పెట్టినప్పుడు...
ఆటోమేటిక్ గా దాని మీద భ్రాంతి పోతుంది....

104. కొత్తకోట.శ్రీనివాసరావు: అరుణాచలం పేరు విన్నంతనే చెప్పలేని అనుభూతి కలుగుతుంది మనసులో...

జ్ఞానశిశువు: అవును.....
ఈ భూమ్మీద పెద్ద అయస్కాంతము అరుణాచలము..

105.కొత్తకోట శ్రీనివాసరావు:
అందరిలో వున్నది ఒక్కటే 'నేను'.
అదే పరబ్రహ్మము అనితెలిసినా...
ఈ స్థూలశరీరము కర్మ బంధములకు వశమై గృహస్తాశ్రమమునుండి తొందరగా బయటపడాలని వువ్విళ్ళూరుతున్నది. జ్ఞానాగ్నిలో కర్మలు దగ్ధమై ఈశ్వరానుగ్రహము కోసమే నా నిరీక్షణ....

జ్ఞానశిశువు: కర్మబంధాలకు వశమయ్యేది శరీరం కాదు, మనసు.

శరీరం జడం.

వంటగదిలో వాడుకునే గరిట లాంటిది శరీరం...
కారం పచ్చడికీ వాడొచ్చు, పాయసానికీ వాడొచ్చు.
గరిటకు ఏ సంబంధమూ లేదు.

మనసు చైతన్యరూపమైనది.
జడ శరీరముతో సహవాసం వలన తాను పరిమితమైనట్లు ఉన్నదేగాని, వాస్తవానికి తన స్వరూపం అనంతం అనేది దానికి అనుభవంలో లేదు.

అనంతమైన మనసే ఆత్మ. తాను అనంతమనే విషయం సద్గురు సన్నిధిలో మాత్రమే గ్రహించగలం.

అప్పుడు శ్రీనివాసురావులో తానుండడం కాదు,
తనలో శ్రీనివాసరావు ఉన్నాడనేది అనుభవంలోకి వస్తుంది.
ఈ అనుభవానికే ఆత్మానుభవం అని పేరు.

అంతేగాని సినిమాగ్రాఫిక్స్ లో చూపించినట్లు...ఆత్మానుభవంలో ఏ జిలుగులూ, వెలుగులూ కనబడవు... ఆ తరువాత కూడా మనకు సంసారమూ ఉంటుంది...అప్పులవాళ్లూ ఉంటారు...

మరి ఆత్మానుభవం వలన లాభమేమి అంటారేమో...
శ్రీనివాసరావు అనేవాడు నీకు ఓ కలలా, ఓ నీడలా తోస్తాడు...

తానెప్పుడూ ఆనందసాగరంలో తేలియాడుతూ ఉంటాడు...
ప్రపంచంలో నటిస్తూ....ఆత్మలో జీవిస్తూ....

106. విధి అంటే ఏమి?

జ్ఞానశిశువు:
జరుగుతున్నదంతా దైవేచ్ఛ.
జరిగిపోయినదంతా విధి.

ఇలా జరగాలి అలా జరగాలి
అని  అనుకోవడం,
అలా ప్రయత్నించడం
ఇది పురుషప్రయత్నం.

పురుషప్రయత్నం, దైవేచ్ఛ రెండూ ఒక్కోసారి
coincide అవుతుంది...

అప్పుడు సంతోషం కలుగుతుంది.
అలా కానప్పుడు దుఃఖం కలుగుతుంది.

దైవేచ్ఛకు తలవంచి,
ఏ సమయానికి ఏది సంభవిస్తే
దానిని అనుభవించడానికి సిద్ధపడడమే
నిజంగా శరణాగతి.

శరణాగతి అంటే -
కర్మరాహిత్యం కాదు,
కర్తృత్వరాహిత్యం.
* * *

107.ఒకరు: ఎవరికి సాక్షాత్కరించాలో ఆత్మే ఎన్నుకొంటుంది అన్నది కఠోపనిషత్తు....

జ్ఞానశిశువు: అవును...ఆ వాక్యం చాలా అద్భుతమైనది....
ఆ ఎన్నుకోవడం మన ప్రయత్నాలతో, సాధనలతో ముడిపడి లేదు.
భక్తులు చెప్పే "భగవదిచ్ఛ"అనే మాట కూడా దానికి సరిసమానమైనదే.

ఏ అర్హతా లేకపోయినా అనుగ్రహించే నియంత భగవంతుడు.

అయినప్పటికీ....అర్హతను బట్టి అనగా సాధనను బట్టి కూడా భగవంతుడు అనుగ్రహించిన  ఘటనలు లేకపోలేదు.

ఆత్మ చేత మనం ఎన్నుకోబడడానికి  మనకు ఉండవలసిన అర్హత - ఆర్తి, శ్రద్ధ...

* * *

పువ్వులో మకరందం ఉంటే,
భ్రమరం దానికదే వచ్చి ఆస్వాదిస్తుంది.

మనలో ఆర్తి ఉంటే,
ఆత్మ దానికదే వచ్చి ఆవహిస్తుంది.

* * *

ఆత్మవిషయమై దీనులైనవారు ధన్యులు
పరలోకరాజ్యం వారిదే అన్నారు క్రీస్తు... కొండమీద ప్రసంగంలో.

లావొక్కింతయును లేదు...అని గజేంద్రుడు మొరపెట్టినప్పుడు...సిరికి కూడా చెప్పకుండా పరుగున వచ్చి కాపాడాడు.

నీ ఆర్తి నిజమే అయితే....భగవంతుడు నీ ఇంటి పై కప్పు పగలుగొట్టుకొని మరీ నీ ముందు సాక్షాత్కరిస్తాడు అంటారు గురువుగారు.

* * *

నాకు శ్రద్ధ ఉందిగానీ గురువు దొరకలేదు అన్నమాట కూడా సరికాదు.
గురువు దొరకడమే నీకు శ్రద్ధ ఉన్నందుకు గుర్తు.
శ్రద్ధ ఉన్నప్పుడు నీవున్న చోటుకే వచ్చి నిన్ను అనుగ్రహిస్తాడు గురువు.
అంతేగాని దారినపోయేవాళ్లందరినీ పిలిచి బోధించడు. అలాంటి విధి, కర్తవ్యం ఏ గురువుకూ లేదు.
అడగండి ఇవ్వబడుతుంది అంటారు క్రీస్తు.

* * *

అడిగి పొందినవాడు - శ్రీరామకృష్ణులు.
అడగకనే పొందినవాడు - అరుణాచల రమణులు.

ఆత్మే ఎన్నుకొంది రమణుణ్ణి.
రామకృష్ణులే ఆత్మను పొందారు ఆర్తితో.

* * *

ఇద్దరి శైలి వైవిధ్యమైనది.

అందువల్లనే ఇరువురు ఆత్మసాక్షాత్కారానికి చెప్పిన ఉపాయాలు వైవిధ్యంగానే ఉంటాయి.

"ఊరికే ఉండు" అన్నారు రమణులు.
"కామినీకాంచనములు జయించు" అన్నారు రామకృష్ణులు.

ఒకటి అప్రయత్నం.
మరొకటి ప్రయత్నం.

రెండూ సరియే ఆత్మవస్తువు దొరకడానికి.
రెండూ గురియే జ్ఞానఫలాన్ని కొట్టడానికి.

* * *

మన సాధనను బట్టి దైవానుగ్రహం లభిస్తుందా?
దైవానుగ్రహాన్ని బట్టి మన సాధన ఉంటుందా?

అని అడిగితే తేల్చి చెప్పడం కష్టం.
రెండూ సరియే.

మొదటివారు కర్మయోగులు.
రెండవవారు భక్తియోగులు.

ఒకడికి కర్మే భక్తి.
మరొకడికి భక్తే కర్మ.

107.దినకర్: మీరు ఏ సాధనామార్గమూ వద్దంటున్నారు....మరి గమ్యం చేరేదెట్లా?

జ్ఞానశిశువు:
భగవంతుడు అనంతుడు.

అనంతుణ్ణి చేరుకోవడానికి మార్గమేమి? గమ్యమేమి?

108.కొత్తకోట శ్రీనివాసరావు: మన కర్మలకంతటికీ కర్త భగవంతుడు అని తెలుసుకోమంటున్నారు...

గీతలోకూడా "ఆడించుచున్నాడు" అన్న పదము విన్న జ్ఞాపకం...

అంటే అనుభవిస్తున్న కర్మలకు నాకు సంబంధం లేదు (కర్త చేతిలో నేనొక పరికరం అని మీరు చెబుతున్నట్లు అనిపిస్తున్నది...)

అలా తెలుసుకోగలిగితే కర్మబంధం నుండి బయటపడినట్లేనా?

మన పూర్వ జన్మవాసనలను బట్టి
కర్త(భగవంతుడు) ఈ జన్మలో మనకు కర్మలను నిర్దేశించవలసి ఉంటుంది కదా!

జ్ఞానశిశువు: ప్రస్తుత జన్మ ఉందనుకోవడమే ప్రధాన వాసన.
ఈ ప్రధానవాసన తొలిగితే సర్వ వాసనలూ తొలిగినట్లే.

కర్మ జడం. అది దేనినీ యెవరినీ బంధించలేదు.

* * *

138. కేరింతలు - 2

---

1. వర్మ: తిరువణ్ణామలై లో గిరిప్రదక్షిణకు భక్తులను అనుమతిస్తున్నారా మాష్టర్ గారు?

జ్ఞానశిశువు: నీ హృదయమే అరుణాచలం

నీ లోలోపలికి ప్రయాణం చేయి.

అక్కడ యెవరి అనుమతీ అవసరం లేదు.

2. ఒకరు: ఆత్మనిష్ఠకు మంచి ఉపాయం చెప్పండి...

జ్ఞానశిశువు: నేను లేనే లేను
అని భావన చేయి...

లేదా

ఉన్న సమస్తమూ నేనే
అని భావనచేయి...

ఆత్మనిష్ఠకు ఈ రెండే ఉత్తమ ఉపాయాలు.

3.శ్రీనివాస్: ఈ జ్ఞానం నేను పొందేదెప్పుడు?
నేను 'నేను'గా మిగిలేదెప్పుడు?

జ్ఞానశిశువు: శ్రీనివాస్ అనే ఈ నేను మిథ్యానేను.
ఈ నేనుకు అస్సలు ఉనికే లేదు.
కాబట్టి ఇది జ్ఞానం పొందడం అంటూ ఏమీలేదు.

"ఎప్పుడు" పొందుతాను? అని అడిగారు...
ఎప్పుడు అనేది కాలానికి సంబంధించినది.
కాలంలో పొందింది కాలంలోనే నశిస్తుంది.

అసలు నేను కాలదేశాలకు అతీతమైనది.
అది మాత్రమే ఉన్నది.

ఇది అది కావడమంటూ ఏమీలేదు.
ఇది లేదని తెలుసుకుంటే చాలు.
అది అదిగానే శేషిస్తుంది.
* * *
నేను లేనని తెలుసుకోవడం జీవునికి మోక్షం.
నేను మాత్రమే ఉన్నాను అని తెలుసుకోవడం దేవునికి మోక్షం.

4. వర్మ: సాధన అవసరమే లేదని అంటున్నారు మరి గురువు గారు మీకు మంత్రోపదేశం చేశారు కదా!
మీరు దానిని సాధన చేశారు కదా!

జ్ఞానశిశువు: ఈగ తన పేరును మరిచిపోయిందట...
చిన్నప్పుడు చదువుకున్నాం ఈ కథను.

గురువుగారు పంచాక్షరీ మంత్రాన్ని ఉపదేశం చేశారు చెవిలో...

ఉపదేశం అనేది-
'నీవే శివుడవు' అని గుర్తుకు తెచ్చే అద్భుతమైన ఆధ్యాత్మిక ప్రక్రియ అది.

సాధన అంటే నీకు లేనిదానిని పొందాలనే ప్రయత్నం.
ఉపాసన అంటే నీకు ఉన్నదానినే, నీవై ఉన్నదానినే
జ్ఞప్తికి తెచ్చుకోవడం.

మరపే - మాయ.
గుర్తుకు తెచ్చేవాడు - గురువు.
జ్ఞప్తే - జ్ఞానం.

5.వర్మ: ఇప్పుడు నేను ఆనాపానసతి అనే ధ్యానం చేస్తున్నాను. మరి అది నాకు అవసరమా కాదా?

జ్ఞానశిశువు: భగవదిచ్ఛ...

మీకు ఇంకా చేయాలనిపిస్తోందంటే
అది మీకు అవసరమనే.

ఇక ఏదీవద్దు అని అనిపిస్తోందంటే
అవేవీ అవసరం లేదనే.

మేం చెప్పేదేమంటే-
కార్యం(సాధన) వలన
కారణం(సిద్ధి) కలుగదు అనేదే.

6.వర్మ: మాస్టారి గారు!  సాధన చేస్తేనే కదా మన ఆత్మకు శక్తి వచ్చేది! Baby soul కాస్త proud soul అయ్యేది.

జ్ఞానశిశువు: అన్ని soul లు లేవు...అవన్నీ సొల్లు కబుర్లే....

7.వర్మ: సరే! ఇప్పుడు నన్ను ఏమి చేయమంటారు?

జ్ఞానశిశువు: నీ పని నీవు చేసుకుంటూ వెళ్లిపో ధర్మబద్ధంగా....

ఇదే ఆధ్యాత్మికం.

ఆధ్యాత్మికం అనేది స్పెషల్ గా జీవితానికి విడిగా ఏమీ ఉండదు....

పర్ ఫెక్ట్ గా(ధర్మబద్ధంగా)లౌకికజీవితాన్ని అనుభవించడమే నిజమైన ఆధ్యాత్మికత.

8. వర్మ: అలా మన పని మనం చేసుకుంటూ పోతే శ్రీకృష్ణుడు గోవర్ధన గిరి పర్వతాన్ని చిటికెన వ్రేలు తో పైకి ఎత్తాడు కదా! అలాంటి శక్తి మనకు కూడా వస్తుందా?

జ్ఞానశిశువు: కృష్ణుడు సాధన చేసి ఆ శక్తిని సంపాదించలేదు...

9. వర్మ: గత జన్మలలో అయినా చేసి ఉంటాడు కదా!

జ్ఞానశిశువు: గతజన్మలు అనేవిలేవు....
ప్రస్తుతజన్మే లేదని గీతావాక్యం.

10. వర్మ: మొత్తానికి గురువు గారి పుస్తకాలు చదువుతుంటే మనస్సు ఆగిపోతోంది మాష్టర్ గారు...

జ్ఞానశిశువు: మనసు ఆగిపోతే....అప్పుడు దాని పేరు మనసు కాదు...ఆత్మ.

11.వర్మ: ఏ ప్రయత్నమూ లేకుండా ఆలోచనలు ఆగిపోతున్నాయి....

జ్ఞానశిశువు: అవును ఏ సాధనా లేకుండానే సిద్ధి కలుగుతుంది.

12.వర్మ: ముందు శక్తిని సంపాదించు.
నీవు ఏమతస్తుడిగా ఉన్నా సరే
మిగతా మతస్తులందరూ
నీపాదాల చెంత చేరి భక్తితో మోకరిల్లుతారు....
అన్నారు 'సద్గురు దర్శనం' అనే గ్రంథములో...
మరి శక్తిని సంపాదించడం ఎలా?

జ్ఞానశిశువు:
శక్తి నిన్ను సంపాదిస్తుంది(ఆవహిస్తుంది).
కానీ లోకానికి మాత్రం నీవు శక్తిని సంపాదించినట్టు అనిపిస్తుంది.

13.వర్మ: మాష్టర్ గారూ!
మామూలుగా మనం అంటూ ఉంటాము కదా... "purpose of life" అని, అది తెలుసుకోవడం ఎలా?

మీరొక సారి అన్నారు- సద్గురు బోధలను ప్రపంచానికి తెలియపరచటమే నా జన్మ ప్రణాళిక అని.

ఏ సాధనా లేకుండా వీటిని ఎలా తెలుసుకుంటాం? గుర్తు ఏమి? దయచేసి వివరించగలరు.

జ్ఞానశిశువు: ప్రకృతిని మనం వాడుకోవడం లేదు, ప్రకృతే మనల్ని వాడుకుంటోంది...అంటారు వివేకానంద.

బంగారం వలన బంగారానికి ఏమీ ప్రయోజనం ఉండదు.

ఆ బంగారాన్ని ఉపయోగించుకునేవానికి ప్రయోజనం ఉంటుంది.

అలా మన వలన మనకు ఏ ప్రయోజనమూ ఉండదు.

మనల్ని సృష్టించినవానికే ఆ ప్రయోజనమేదో మన ద్వారా నెరవేర్చుకుంటాడు.

ఆ ప్రయోజనం ఏమో మన చిన్నబుర్రకు అందదు.

ప్రయోజనం పూర్తయినందుకు గుర్తేమంటే-
ఇంకొక్క శ్వాసను కూడా మ పీల్చుకోలేం.

నీకు ఇష్టమున్నా లేకున్నా నీ పుట్టుక ప్రయోజనం పూర్తయ్యే తీరుతుంది....అంటారు భగవాన్.

పురుషప్రయత్నం, ప్రారబ్ధం అనే పేర్లతో మనం వ్యవహరించేది భగవదిచ్ఛనే.

పుస్తకాలు వ్రాయడం నా పురుషప్రయత్నం అనొచ్చు.
పుస్తకాలు వ్రాయడం  నా ప్రారబ్ధం అనొచ్చు.
పుస్తకాలు వ్రాయడం భగవదిచ్ఛ అని కూడా అనవచ్చు.

పురుషకారం - ప్రారబ్ధం - భగవదిచ్ఛ
ఈ మూడు పేర్లు ఒకదానివే.

నీకు ఏ పేరు ఇష్టమైతే, ఆ పేరుతోనే వ్యవహరించుకో...

నేను జ్ఞానాంబ ఉపాసకుడను కాబట్టి ప్రతి విషయానికీ 'జ్ఞానాంబ ఇచ్ఛ' అనడం నా ఉపాసనకు అనుకూలం.

నీవు పురుషప్రయత్నాన్ని బేస్ గా తీసుకుంటే
నీవు సాధన చేసి తీరాలి.

కర్మయోగి కర్మఫలాన్ని ప్రారబ్ధం పేరుతో అనుభవిస్తాడు.
భక్తియోగి కర్మఫలాన్ని భగవదిచ్ఛ పేరుతో అనుభవిస్తాడు.

ఫలం ఒక్కటే - పేర్లు వేఱు.

14. కొత్తకోట శ్రీనివాసరావు: పట్టెయ్యగారు అరుణాచలప్రదక్షిణకు గురువుగారిని ఆహ్వానిస్తే 'అరుణాచలమే నా చుట్టూ తిరుగుతోంది' అన్నారట....అది ఎలా?

జ్ఞానశిశువు: "నేనే" కేంద్రం.
నాతో సహా సర్వసృష్టి(అరుణాచలం కూడా)
"నా" చుట్టూ తిరుగుతోంది.
అని అర్థం.

15. ఒకరు: శివుని పూజించే వారు శైవులు.
విష్ణువును పూజించేవారు వైష్ణవులు.
శక్తిని పూజించేవారు శాక్తేయులు.
నేనును పూజించేవారిని ఏమంటారు?

జ్ఞానశిశువు: నేనును పూజించడం ఏముంది?
నేనును తెలుసుకోవడం అనేది మాత్రమే ఉంది.
దానిని జ్ఞానవిచారం అంటారు.
వారిని జ్ఞానయోగులు అంటారు.

16.ఒకరు: అరుణాచల రమణుడు మహానుభావుడు.
16 ఏళ్లకే వైరాగ్యంతో ఇల్లు వీడారు....

జ్ఞానశిశువు: విజయం పొందిన సైనికుణ్ణి అభినందిస్తాం.
కానీ మన బిడ్డను సైన్యంలో చేర్చం.

16 ఏళ్లకే గోచీపెట్టిన అరుణాచలయోగికి దండం పెడతాం.
కానీ మన బిడ్డ అలా అయిపోతే తట్టుకోలేం.

మన బిడ్డ కూడా అలా అవడానికి
మనంఇష్టపడినప్పుడే, సిద్ధపడినప్పుడే
ఆ జవాన్ను, ఆ భగవాన్ను నిజంగా మనం గౌరవించినట్టు.

17. ఒకరు: మంచి ఉపాసన ఉంటే ఏదైనా చెప్పండి....

అహమేకో2 హమాత్మాస్మి
త్యేకాం భావయా భావనామ్
తయా భావనయా యుక్తః
స ఏవ త్వం భవస్యలం.
-యోగవాశిష్ఠం
* * *
"నేను ఒక్కడినే, అద్వితీయుణ్ణి, నేనే పరమాత్మను"
అనే భావన ఒక్కటే పెట్టుకో.
అది ఒక్కటీ బలంగా ఉంటే
నువ్వు ఆ పరమాత్మవే ఐపోతావు.

18.భద్రయ్య: గురువుగారు ఎక్కడ ఉంటే అక్కడే కదా అరుణాచలం...

జ్ఞానశిశువు: నీవు ఎక్కడుంటే అదే అరుణాచలం.
నీ హృదయమే అరుణాచలం.

వేదాంత రహస్యమంతా నీలోనే ఉంది....
నీలోపలికెళ్లిపో...అక్కడే ఉండిపో...

19.భద్రయ్య: లోపలికి పోవడానికి గురుదేవుని అనుగ్రహం, మీ ప్రేమ వలన నా ప్రయత్నం చేస్తున్నామండీ...

జ్ఞానశిశువు: మంచిది.
వెలుపలున్న విషయాలకు ప్రాముఖ్యత ఇవ్వడం మానేస్తే....ఆటోమేటిక్ గా లోపలికి వెళ్లిపోవడం జరుగుతుంది.

20. భద్రయ్య: నాకు కోపం అనేది పోవటం లేదండి... అదే కొంచెం అర్థం కావడం లేదు...

జ్ఞానశిశువు:
మిరపకాయ తీయగా ఉంటే ఎలా?
మామిడి పండు చేదుగా ఉంటే ఎలా?
ఏది ఎలా ఉండాలో అలా ఉండడమే సరి.

మంచి లక్షణాలు, అవలక్షణాలు అని రెండు లేవు.
జగన్నాటకం రక్తి కట్టాలంటే అన్ని రకాలూ ఉండాలి.

వెలుపల - వైవిధ్యం.
లోపల - ఏకత్వం.
రెంటినీ అనుభవించడమే ఆధ్యాత్మికం.

21.లక్ష్మి: ఆ స్థితిలో ఉండటం కోసం
యోగవాశిష్ఠం చదువుతూ ఉంటాను...

జ్ఞానశిశువు: already మీరు ఆ స్థితిలో ఉన్నారు కాబట్టి
చదువగలుగుతున్నారు...
* * *
22. ఒకరు: స్థితప్రజ్ఞత అంటే ఏమి?

జ్ఞానశిశువు: ఓ దసరా రోజున నేను, దేవీప్రసాదు గురుసన్నిధికి వెళ్లాం...

గురువుగారి మనవరాలు పద్మావతి వేడివేడి టీ ఇచ్చారు....

గురువుగారు సిగరెట్ త్రాగుతున్నారు...

వారి సన్నిధిలో సహజ సుందరంగా ఉండే మౌనాన్ని ఆస్వాదిస్తూ టీని సిప్ చేస్తూ ఎంజాయ్ చేశాం...

ఆ తరువాత గురువుగారు తలా ఒక ఆపిల్ ఇచ్చారు....

దసరా రోజున జ్ఞానాంబ ప్రసాదం...

షాప్ లో తిందామని సంచిలో వేసుకున్నా....

గురుసన్నిధి నుండి మా షాప్ వద్దకు రాగానే....

జడలు కట్టిన అమ్మవారు(అవధూత) పడుకుని ఉన్నారు....

గురువుగారు ఇచ్చిన ఆపిల్ ఆ అమ్మకు ఇచ్చాను....

చేతికి తీసుకున్న వెంటనే నోట్లో పెట్లో పెట్టుకుని ఆవురావుమని తిన్నారు.....

నా మిత్రుడు  దేవీప్రసాద్ కూడా తన ఆపిల్ ఆమెకు ఇచ్చేశాడు....

మా వైపు కన్నెత్తి కూడా చూడకుండా అక్కణ్ణుంచి లేచి వెళ్లిపోయారు....

కృతజ్ఞత, గుర్తింపు చూపకుండా అలా వెళ్లిపోవడం అవధూత  లక్షణాలలో ఒకటి....

గురువుగారు అంటుంటారు....

దక్షిణ ఇచ్చిన సంగతి ఇచ్చినవాడు ఇచ్చినట్టూ మరచిపోవాలి....
తీసుకున్నవాడు తీసుకున్నట్టూ మరచిపోవాలి...
అప్పుడే ఆ దక్షిణ వలన ఫలం...అని అంటారు.

ఎవరైనా గురువుగారి చేతికి డబ్బు ఇవ్వబోతే....చేతికి తీసుకోరు....

అక్కడ పటాల వద్ద పెట్టండి....అంటారు....

వారు దక్షిణగా ఎంత ఇచ్చారు? అనేది అస్సలు చూడరు...

తీసి అలాగే జేబులో పెట్టుకుంటారు....
అలాగే తీసి ఖర్చు పెట్టేస్తుంటారు....

నాలా రోజూ  జమాఖర్చులు వ్రాసుకోరు....

నీవు లెక్క వ్రాసుకుంటే దేవుడు కూడా లెక్క వ్రాసుకుంటాడు...

లెక్క వ్రాయకుంటే దేవుడు కూడా లెక్క వ్రాసుకోడు...

నీ లెక్కే దేవుని లెక్క.

దేవుడికంటూ ఓ లెక్క ఉండదు....అంటారు గురువుగారు...

నిజంగా "లెక్కలేనితనమే" స్థితప్రజ్ఞత.

* * *

23.రామ్మోహన్:
శక్తిపూర్ణమైన జ్ఞానం

జ్ఞానపూర్ణమైన శక్తి
దానికదే సంభవిస్తుందా ?
లేక మన ప్రయత్నమేమైన ఉన్నదా?

జ్ఞానశిశువు:
ప్రయత్నిస్తే లభించేది ఉత్తజ్ఞానం(పాండిత్యం)
లేదా ఉత్తశక్తి(సిద్ధులు).
వీటివల్ల పారమార్థిక ప్రయోజనం సున్న.

శక్తి సహిత జ్ఞానం, జ్ఞానసహిత శక్తి
అప్రయత్నంగానే లభిస్తుంది.
* * *
ప్రయత్నంతో పొందినవాడు
'స్థితి' నుండి  జారే అవకాశం ఉంది.
ఉదా.విశ్వామిత్రుడు.

అప్రయత్నంగా పొందినవాడు
'స్థితి' నుండి  జారడు.
ఉదా.రమణుడు.

ఇదే ప్రయత్న-అప్రయత్నానికి తేడా.

* * *

జ్ఞానంతో  కూడిన శక్తి
శక్తితో కూడిన జ్ఞానం
ఇవి ఫలప్రదములు.

ఉత్త శక్తి, ఉత్త జ్ఞానం
వీటివల్ల ప్రయోజనం లేదు.

* * *

రమణుడు పైకి జ్ఞాని.
లోపల శక్తుడు.

బాబా పైకి శక్తుడు.
లోపల జ్ఞాని.

24. అప్పాజీ: విశ్వము ఎలా, ఎవరు, ఎందుకు సృష్టించారు...?

జ్ఞానశిశువు: నీ మెలకువతో పాటు నీతో సహా సకలసృష్టి నీలోనుంచే పుట్టింది.

తిరిగి నీవు నిద్రపోయాక నీతో సహా సకలసృష్టీ నీలోనే లయం అయిపోతుంది.

25. అప్పాజీ: ఎవరి కోరిక విశ్వసృష్టి?
కోరిక ఎందుకు పుట్టింది?

జ్ఞానశిశువు: నిద్రలోఈ ప్రశ్నలేవీ ఉండవు.
మెలకువలో సమాధానం ఉండదు.

26. గణేష్:
ఎఱుక-మఱపు గురించి చెప్పండీ....

జ్ఞానశిశువు:
నిద్రలో - నేనున్నాననే ఎఱుక మోక్షం.
మెలకువలో - నేనున్నాననే మఱపు మోక్షం.

27. ప్రశ్న: ఆధ్యాత్మికలక్ష్యం ఏమి?

జ్ఞానశిశువు: నీ నామం-రూపం ప్రపంచంలో ఉన్నంతకాలం
అనగా నామరూపాలు నీకు తోస్తున్నంతకాలం
నీతో సహా యెవడూ ముక్తి పొందనట్లే.
* * *
దేహాత్మభావంతో ముక్తి పొందాలనుకోవడం
మసిగుడ్డతో అద్దాన్ని శుభ్రం చేయాలనుకోవడమే.
* * *
కల నుండి మేలుకున్నాక
కలలో ఉన్నవారందరూ మాయమై
నీవొక్కడివే మిగిలినట్టు

* * *
నీవొక్కడు ముక్తి పొందితే
'అందరూ' అనే భావం పోయి
ఏకాత్మరూపుడువైన నీవొక్కడివే
మిగులుతావు.
* * *
'ఒక్కడు' లేదా 'ఒక్కటి' మిగలడమే
ఆధ్యాత్మిక ఏకైక లక్ష్యం.

28.రామ్మోహన్: మన గాఢ సంకల్పం యొక్క ఫలితమే "భగవదిచ్ఛ" అన్నారు...వివరించండి.

జ్ఞానశిశువు: అవును... మనం బ్యాంకులో అప్పుడప్పుడు పొదుపుచేసిన ఒక్కొక్క రూపాయి చివరకు 'పెద్దమొత్తం'గా డ్రా చేసుకున్నట్లు మనం చేసే ప్రతి సంకల్పం, లేదా ప్రతి కర్మ పెద్దమొత్తంగా మనకు తిరుగుటపాలో రావడమే ప్రారబ్ధం, విధి, లేదా భగవదిచ్ఛ.
* * *
కర్తృత్వంతో చేసే ప్రతి కర్మా "ప్రారబ్ధం" పేరుతో
ప్రతిఫలిస్తుంది.

అకర్తగా ఉండి చేసే ప్రతికర్మా "దైవానుగ్రహం"గా
ప్రతిఫలిస్తుంది.
* * *
"విధి"ని -
భగవదిచ్ఛ అని అనుభవిస్తావో....
లేక
పురుషప్రయత్నంతో ఎదిరిస్తావో...
నీ ఇష్టం.

29. పట్టెయ్య: మాయా దర్పణం అంటే ఏమి?

జ్ఞానశిశువు: మామూలు దర్పణంలో-
బింబం - అద్దానికి వెలుపల ఉంటుంది.

ప్రతిబింబం - అద్దంలో ఉంటుంది.

మాయాదర్పణంలో-
బింబము(దేవుడు), ప్రతిబింబము(జీవుడు)
రెండూ అద్దంలోనే ఉంటాయి.

30. శ్రీనివాస్ రెడ్డి: కృతజ్ఞతలు గురువు గారూ!
మీరు పంపిన ఆధ్యాత్మిక గ్రంథాలు మొత్తం చదివి అవగాహన చేసుకుని
ఆధ్యాత్మికత వైపు అడుగులు వేయాలని అనుకుంటున్నాను
ఆశీర్వదించండి గురువు గారు...

జ్ఞానశిశువు: నిజంగా అవగాహన అయితే...
వేయడానికి అడుగులు ఉండవు...

* * *

రాజారాంగారు చాలా యేళ్ల నుంచి UG బుక్ చదువు బాబూ.... అని
చెబుతున్నారేగానీ....నాకది దొరకలేదు....

ఈ మధ్య flipcart లో UG గారి బుక్
"మనసొక మిథ్య" తటస్థపడింది....తెప్పించి చదివాను...చాలా బాగుంది....

రెండు మూడు పేజీలు చదవగానే
వారి తత్త్వం అవగాహన అయిపోయింది....

నేను వ్యక్తీకరించలేక మిగిలిపోయిన కొన్ని అనుభవాలను...వారు
వ్యక్తీకరించి నా వ్రాతపనిని అతను పూర్తి చేసినట్టు అనిపించింది.

బహుశా నా జీవితంలో చదివిన చిట్టచివరి పుస్తకం ఇదే
అనుకుంటున్నాను...

ఇక క్రొత్తగా వ్రాయడానికి...చెప్పడానికి ఏమీలేదు...

మనసు నిండుగా మారిపోయింది....

మనసు మనసుగా ఉంటేనే అది మిథ్య.
అది 'ఆత్మ ప్రకాశం' అని తెలిస్తే అది పరిపూర్ణం.
ఈ పరిపూర్ణానుభవమే సాక్షాత్కారం.

కావలసినది సమాధానాలు కాదు,
ప్రశ్నలు కలుగకపోవడమే.
అప్పుడు నీవే సమాధానంగా ఉంటావు.

కాయే పండు అవుతుంది.
ప్రశ్నే సమాధానం అవుతుంది.

అందుకు ఏమీ చేయాలి?
పండు కావడానికి కాయ ఏం చేసింది?
కొమ్మకు అంటి పెట్టుకుని ఉండడం తప్పితే...
అలానే 'నేను'ను సదా అంటిపెట్టుకో...పండిపోతావ్....

* * *

31.చరణ్:
పరమపద మంత్రాన్ని
బయటకు జపించాలా? లేక
లోపల స్మరించాలా?
జ్ఞానశిశువు:
అది మంత్రం కాదు,
అది నీ స్వరూపం.

చేయవలసింది జపమూ కాదు, స్మరణమూ కాదు,
చేయవలసింది శ్రవణము.

అనగా "ఎవరో" లోపల అంటూవుంటే
మనం వింటూ ఉండడం అన్నమాట.

బయట వినేవాడుగా ఉన్న నీవు
లోపల అనేవాడుగా మారుకోవడమే సిద్ధి.

32.చరణ్: అది లోపల నుంచి ఎలా వినబడుతుంది?

జ్ఞానశిశువు: నీ అనుమతితో సంబంధం లేకుండా
నీతో...నీలో..."ఒకడు"న్నాడు....అని ముందు అంగీకరించు....

వాని "ఉనికి"ని సదా ఎఱుకలో ఉంచుకో...
ఎంతగా అంటే...నేను అని నీవన్నప్పుడల్లా...చరణ్ కాకుండా "అతడే" అన్నట్టు అనుకో.

ఈ అనుకోవడమే చివరికి "స్వా"నుభవంగా మారుకుంటుంది.

అదే సాక్షాత్కారం.

33. కార్తిక్: కర్మలను అంటకుండా ఉండడం ఎలా?
ప్రస్తుతం ఉన్న కర్మలను దగ్ధం చేయడం ఎలా?

జ్ఞానశిశువు: కర్త కర్మ క్రియ మూడూ భగవంతుడే.

కానీ మూడూ తనవే అని తన నెత్తిన వేసుకుని బాధపడడమే ప్రారబ్ధం.

కేవలం ఆయన చేతిలో నీవొక పనిముట్టు మాత్రమే.
ఇదొక్కటి గ్రహిస్తే చాలు...
నీ ఆధ్యాత్మికాన్వేషణ పరిసమాప్తమయినట్లే.

34.రెండేళ్లుగా మెడిటేషన్ చేస్తున్నాను...
ఉద్యోగరీత్యా ఉదయాన్నే ధ్యానం చేయలేకపోతున్నాను...

35. ధ్యానంలో...
శ్వాస మీద ధ్యాస చేయాలా?
లేక
దేవుణ్ణి స్మరించాలా?

జ్ఞానశిశువు: సిసి కెమెరా లాగా ఒక కన్ను(దైవం) సదా మన వైపు వేసి ఉంది అనే ఎఱుక మీకు ఉన్నట్లైతే అదే గొప్ప ధ్యానం.

శ్వాస మీద ధ్యాస కంటే
"నేను" అనే ఆత్మస్ఫురణలో సదా ఉండడమే
గొప్ప సాధన.

36. ఒకరు: జ్ఞానం కలగాలంటే ఏం చేయాలి?

జ్ఞానశిశువు: జ్ఞానం ఎవడిని ఆవహిస్తే వాడు జ్ఞాని అవుతాడు.
శక్తి ఎవడిని ఆవహిస్తే వాడు శక్తుడు అవుతాడు.

అంతేగాని జ్ఞాన-శక్తులనేవి
మన ప్రయత్నంతో పొందబడేవి కావు.
* * *
జ్ఞాన-శక్తులు మనల్ని ఆవహించాలంటే ఏం చేయాలి?
అని మళ్లీ ప్రశ్నించకండి.
ఆ ప్రయత్నాన్ని కూడా వదలండి.
* * *
ప్రజాస్వామ్యంలో -
ఎన్నిక ఈ వైపు నుంచి ఉంటుంది.

దైవస్వామ్యంలో -
ఎన్నిక ఆ వైపు నుంచి ఉంటుంది.
* * *
"మన చేతుల్లో ఏమీ లేదు"అని
సామాన్యరైతు కూడా పలుకుతాడు.
దీని కోసం పవిత్రగ్రంథాలు, ప్రవచనకర్తలు
అవసరం లేదు.
* * *
సిద్ధి అనేది ఓ హఠాత్ సంఘటన అంతే.
సాధన వలన సిద్ధి కలుగదు.
* * *
మానవమేథస్సుకు అందినంతవరకు
"భగవదిచ్ఛ" అనేదే చిట్టచివరి సమాధానము.
లేదా "నాకు తెలియదు" అనేదే.
భగవదిచ్ఛ అన్నా, నాకు తెలియదు అన్నా
రెంటి అర్థం ఒక్కటే.

37. ప్రశ్న: అత్యాశ్రమి నియమాలేవి?

జ్ఞానశిశువు: అత్యాశ్రమి నియమాతీతుడు.
ఏ నియమమూ అతని విషయంలో వర్తించదు.
కాబట్టి అతని గురించి ఏమీ అడగకూడదు.

38.ప్రశ్న: నిద్రను మెలకువ అంటున్నారు...
మెలకువను కల అంటున్నారు...
ఎలా?
* * *
జ్ఞానశిశువు:  భేదం తోచడమే కల.
భేదం తోయకుంటే మెలకువ.

గాఢనిద్రలో భేదం తోయడం లేదు కాబట్టి
గాఢనిద్రే నిజమైన మెలకువ అన్నారు.

నీవనుకునే మెలకువలో భేదం తోస్తోంది కాబట్టి
ఈ మెలకువను కల అన్నారు.

ఈ మెలకువలో అభేదస్థితి కలిగితే,
నీవు మెలకువలో ఉన్నట్టు ఇతరులకు
కనిపిస్తున్నప్పటికీ నీవు గాఢనిద్రలో ఉన్నట్టే.
అనగా 'నిజమైన మెలకువ'లో ఉన్నట్టే.

39.ఒకరు: U.G.కృష్ణమూర్తి అంటే మీకు బాగా ఇష్టమున్నట్టు ఉంది...

జ్ఞానశిశువు: అవును...
హిమవత్పర్వతంలో అప్పుడే పుట్టి జాలువారిన స్వచ్ఛమైన నీటి పాయ UG.
(అప్పటికి గంగ అనే పేరు రాలేదు)
* * *

తనకు స్వతఃగా ఏ కల్మషమూ లేకపోయినా అందరి కల్మషాలనూ తనతో తీసుకెళ్లి బంగాళాఖాతంలో కలిసిపోయిన గంగ UG.
(తరువాత గంగ అనే పేరు ఉండదు.)

* * *

5 లడ్లు తింటే తృప్తి కలుగుతుంది అనుకో.
అలా అని కేవలం 5 వ లడ్డును మాత్రమే తింటే తృప్తి కలుగదు. అంతకు

ముందు 4 లడ్లు తిని ఉండాలి...అప్పుడే 5 వ లడ్డు వల్ల తృప్తి కలిగేది.
ఆ ఐదవ లడ్డు లాంటిది - UGకృష్ణమూర్తి తత్త్వం.

ఆధ్యాత్మికాన్వేషణలో చివరిదశకు చేరుకున్నవారికి మాత్రమే
అవగతమయ్యే తత్త్వం UG తత్త్వం.

40.బుచ్చిబాబు:
మనసు నిలుపలేకున్నాను....
అదే నా బాధ...

జ్ఞానశిశువు: మనసును ఎందుకు నిలపాలి?
దానిపాటికి దానిని వదిలేయండి.
మీ పాటికి మీరు ఉండండి.

41.బుచ్చిబాబు:
దానిని వదిలేసి సాక్షిగా ఉండలేక పోతున్నాను...

జ్ఞానశిశువు:
నీటికి పల్లంలోకి  పారేగుణం ఉంటుంది.
సమతల ప్రదేశం చేరగానే నిశ్చలత వస్తుంది.
మనసూ అంతే...
భేదదృష్టి వలన చలిస్తూ ఉంటుంది. సమత్వదృష్టి వలన నిశ్చలత వస్తుంది.
* * *

దేనికీ ప్రాధాన్యత ఇవ్వకు.
దేనినీ లోకువగా చూడకు.
ఇదే సమదృష్టి అంటే.
* * *

42. బుచ్చిబాబు:
మూషికం లాగా ఉంది మనసు...కలుగులోకి రాను పోను,రాను పోను...
ఎంతవరకు ఈ అర్థం లేని దాగుడు మూతలు..? బాధగా ఉంది స్వామీ...

జ్ఞానశిశువు:
దాని చేష్టలను చూస్తూ ఉండు.....

కాసేపటికి అది మనం గమనిస్తున్నామన్న విషయాన్ని గమనించి, సిగ్గుబోయి...కలుగులోకి(హృదయంలోకి)వెళ్లి  ఇక తిరిగి నీకు కనబడదు.

43.ప్రశ్న: ధర్మం అంటే ఏమి? సత్యం అంటే ఏమి?

జ్ఞానశిశువు: ధర్మం అనేది దీపకాంతి లాంటిది.
వత్తిని ఎవరో ఒకరు ఎగదోస్తూ ఉండాలి.
తైలం నింపుతూ ఉండాలి.
ప్రయత్నం అవసరం.
* * *
సత్యం అనేది సూర్యకాంతి లాంటిది.
వత్తి, తైలము అవసరమే లేదు.
అప్రయత్నంగా ప్రకాశిస్తుంది.
* * *
ధర్మానికి నిరూపణ అవసరం అవుతుంది.
సత్యానికి నిరూపణ అవసరం ఉండదు.
* * *
ధర్మం వెలుపలి విషయం.
సత్యం లోపలి విషయం.
* * *
ధర్మం ఆచరణ యోగ్యమైనది.
సత్యం ఆచరణకు వీలుకానిది.
* * *
ధర్మం తనకు అన్యమైనది.
సత్యం తన స్వరూపమైనది.
* * *
44.జక్కా రాము:
గురువు గారితో బాబు గారి ఫ్రెండ్ ని అని  పరిచయం చేసుకుని, వారి పాదనమస్కారం చేసుకొని వచ్చేసాను.
మీకు రెండు సార్లు ఫోన్ చేశాను కలవలేదు. సాయంత్రం ఐదు గంటలకు తిరిగి వెళ్ళిపోయాను...

బాబు:
గురువుగారి వద్దకు దారి చూపించే
బోర్డు మాత్రమే నేను.

గురుదర్శనం తరువాత
ఆ బోర్డుతో(బాబుతో) అవసరం లేదు.

45. వరలక్ష్మి:
మనదేశం హైందవదేశమనిఅంటారు... హైందవధర్మమనికూడా అంటారు...
అసలు హైందవం అంటే ఏంటి?

జ్ఞానశిశువు:
పునర్జన్మ సిద్ధాంతాన్ని....
అనగా కర్మ సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని భగవంతుని వైపుకు తీసుకెళ్లే
మంచి వాహనం హైందవవధర్మం.

46.ఒకరు: ఎలా పొందాలి?
సూటిగా అడుగుతున్నాను చెప్పండి.....

జ్ఞానశిశువు: సూటిగానే చెబుతున్నాను వినండి....
"పొందటం" అనే క్రియే లేదు.
అని చెప్పాను....

మరి యెలా ? అని అడిగాడు....

నీవు నీవుగా ఉండు....అన్నాను....

నీలా ఉండేవాడు నీవొక్కడివే నాలుగు యుగాల్లోను....
నీవు మరొకరిలా ఉండకుండా....నీవు నీలా ఉండు...

అంటే?

పోలిక వలననే....
పొందటం, పొందకపోవడం అనే సమస్య వస్తోంది.....

బాబానో, రమణమహర్షినో, మరొక మహనీయుణ్ణో చూచి, వారి
జీవితచరిత్రలు చదివి....ఓహో మనమూ అలా తయారవ్వాలని...ఏవేవో

సాధనలు చేస్తూ...సతమతమవుతూ....

వారిలా అవలేక....తనలా ఉండలేక....
జీవితం ఘర్షణతోటే సాగి....ఘర్షణతోటే ముగిసిపోవడం విచారకరం.

* * *

భగవంతుడు అనంతుడు.
అనంతానికి విడిగా నేను లేనుగా....
నేను భగవంతుడిలోనే ఉన్నాను...

అన్న ఆలోచన యెందుకు కలగడం లేదు?

పరిపూర్ణంలో నేను అపరిపూర్ణంగా యెందుకుంటాను?
"నా దైవం పరిపూర్ణం, నేనూ పరిపూర్ణం" అని నిండుగా
జీవించడమే జీవన్ముక్తి.

* * *

ఏకకాలంలో -

వ్యక్తిగా వైవిధ్యతను ఎంజాయ్ చేయాలి...
జ్ఞానిగా అద్వైతభావమును కలిగి ఉండాలి.
ఇదే ఆధ్యాత్మికసారం.

47. ఒకరు: సాధన వలన సిద్ధి కలుగదు.
మరి ఏం చేయాలి?

జ్ఞానశిశువు : ఊరికే ఉండు.

48. ఒకరు: మరి జరిగేదెట్టా?

జ్ఞానశిశువు: నీవు జరగడం లేదు, నీవు జరపడం లేదు.
ఒక అతీతశక్తి చేత నీవు జరపబడుతున్నావు.
ఒకవేళ నీకు సిద్ధి కలిగినా సరే,
అది ఆ అతీతశక్తి యొక్క ఇచ్ఛలో భాగమే.

దానికి ఆ ఇచ్ఛ నాపై కలగాలంటే ఏం చేయాలి?

శరణాగతి.

49. ఒకరు: శరణాగతి అంటే?

జ్ఞానశిశువు: నీవు 'ఖాళీ' అయిపోవడం.

50. ఒకరు. నేను ఖాళీ అయిపోతే ఇక సిద్ధి ఎవరికి?

జ్ఞానశిశువు: పరిమితమైన నేను(అహమిక) ఖాళీ అయిపోతే
పరిపూర్ణమైన 'నేను'(అహంస్వరూపం) సిద్ధిస్తుంది.
అప్పుడు "నాకు సిద్ధి" అని కాకుండా...."నేనే సిద్ధి" అని ఉంటావు.

51.ఒకరు: సాధన అవసరమా? కాదా?

జ్ఞానశిశువు:

సాధన చేసి తీరాలి.

ఉత్త పుస్తకపఠన వలన
ఉత్త మాటలు వలన

ఆత్మ స్వరూపం జ్ఞప్తికి రాదు.
పరమశాంతి అనుభవంలోకి రాదు.

తనదే, తానే అయి ఉన్న ఆత్మస్వరూపం
కనబడనంతగా....మరిచిపోయేంతగా
చేసుకున్నామంటే....అంతగా ఆత్మను వదిలి
బాహ్యవిషయాలనే దుప్పట్లతో ఆత్మను కప్పేశామన్నమాట.

మళ్లీ ఆ దుప్పట్లను తొలగించాలంటే
ప్రాపంచిక వ్యవహారాలను అంతకంతకు తగ్గించుకోవాలి.

అవి అశాశ్వతమనే వైరాగ్యాన్ని
మనసులో నింపుకోవాలి.

అనేకం వదిలి ఏకం వైపుకే మనసును మళ్లించాలి.

నేను-నాది తుడిచేయాలి.
అనగా రెంటినీ ఏకం చేయాలి.

సదా ప్రపంచాన్ని నిరసిస్తూ ఉండాలి.
అప్పుడే ఆ దుప్పట్లు తొలగి
ఆత్మ తేటతెల్లమౌతుంది.

అందుకు తీవ్రప్రయత్నమే చేయాలి.
ఆ తీవ్రప్రయత్నానికే 'తపస్సు' అని పేరు.

* * *

ఆత్మకు సమానమైన విలువగలిగిన వస్తువు ప్రపంచంలో ఏదీలేదు.
మొత్తపు ప్రపంచం కూడా దానితో సరితూగదు.

కాబట్టి ఆత్మకు నీవిచ్చే విలువ
ప్రపంచంలో ఇక దేనికీ నీవు ఇవ్వకూడదు.

అప్పుడే నీ ఉపాసన సఫలం అవుతుంది.

* * *

నిష్కామకర్మ...భగవద్భక్తి...జ్ఞానవిచారణం....
అందులో ప్రధాన మార్గాలు...

మూడింటిలోనూ 'గురువు' పాత్ర అమోఘం.
మన ఆధ్యాత్మిక ప్రయాణాన్ని సులభతరం చేస్తుంది.

గురువులేని ప్రయాణం నావికుడు లేని నావలో ప్రయాణం చేయడం లాంటిది.

* * *

పరమపుణ్యక్షేత్రమైన శ్రీకాళహస్తిలో
సద్గురు సుబ్రహ్మణ్యుల వారు ఉన్నారు.

వారు మూర్తీభవించిన జ్ఞానమే.
సందేహం లేదు.

వారు ఈ ప్రపంచానికి ఉచితంగా దొరికిన ఆధ్యాత్మిక ఖని.

తవ్వుకున్నవారికి తవ్వుకున్నంత.

నీ శ్రమకు తగ్గ ఫలితం అప్పటికప్పుడే దొరకడం అనేది
ఈ క్షేత్ర మాహాత్మ్యంలో ఉన్న వైచిత్ర్యం.

శ్రీకాళహస్తి వైపుకు...అందునా రమణసత్సంగం వైపుకు...అందునా సద్గురు సుబ్రహ్మణ్యుని వైపుకు
నీ మనసు తిరిగిందంటే...అదే నీ మనసుకు చివరిదినం...ఆత్మను సాక్షాత్కరించుకున్న శుభదినం అవుతుంది.

52.ఒకరు: 'సాధన వలన సిద్ధి కలుగదు' అని మీరు సెలవిచ్చారు...
'ఊరికే ఉండు' అంటున్నారు....

ఏ ఆలోచనా లేకుండా ఊరకే ఉండడం కూడా
ఒక రకమైన సాధనే కదా!

జ్ఞానశిశువు: ఊరికే ఉండడం అంటే,
ఆలోచనలు లేకుండా ఉండడం అని కాదు,
నేను కర్తను అనే భావన లేకుండా ఉండడం.

53. ఒకరు: అసలు ఆలోచనలు లేని స్థితి జ్ఞానేతరులకు కలుగతుందా?
దానిని ఎట్లా సాధించాలి?
నేను-నేను అంటూ ఆత్మనిష్ఠలో ఉంటే కలుగుతుందా?

జ్ఞానశిశువు: పిల్లవాడి అల్లరిని మాపడానికి
పిల్లవాణ్ణే అంతం చేయడం  సరియైన మార్గం కాదు కదా!
పిల్లవాణ్ణి బుజ్జగించి తండ్రి యొక్క గొప్పతనం చెప్పి మంచి చేసుకోవాలి.

అలాగే ఆత్మ అనే తండ్రిలోంచే మనస్సనే పిల్లవాడు వచ్చాడు.

అది తుంటరే అయినప్పటికీ
నీ యధార్థస్వరూపం ఆత్మయే అని విషయాన్ని దానికి గుర్తుచేస్తూ
ఉండడమే సత్సంగం.

* * *

'ఆలోచలనలు లేకపోవడం జ్ఞానస్థితి' అనే తప్పుడు అభిప్రాయం ముందు వదలాలి.

నిద్రలో, మూర్ఛలో తలపులు ఉండవు.
అంతమాత్రానికే అవి జ్ఞానస్థితులా?
నిద్ర, మూర్ఛ అనేవి జడస్థితులు కదా!

'ఆలోచనలే నీవు'
ఆలోచనలే లేకుంటే నీవే ఉండవు.

ఆలోచనలు లేకుండా చేసుకోవాలనేది కూడా
ఓ ఆలోచనే.

మనస్సును అంతం చేయాలనుకోవడం
తన నీడను గుంట తీసి పాతి పెట్టి పూడ్చేయాలనుకోవడమే....
అది సదా నీ వెంటే ఉంటుంది.

దేవుని  మనస్సు పేరు - మాయ.
జీవుని మాయ పేరు - మనస్సు.

మనస్సును లేకుండా చేయడం అంటే
'ఆత్మకు విడిగా దానికి ఉనికి లేదు'
అని గ్రహించడమే.

ఆత్మప్రకాశంలోని కిరణాలు ఆలోచనలు...

54. హరిప్రసాద్:
ఈ భూమిపై ఎందుకు పుట్టాము?
మనిషి ఈ భూమి పై ఏం చేయాలి?

జ్ఞానశిశువు:
'ఎందుకు' అన్న ప్రశ్నకు సమాధానం లేదు.
మన మెదడుతో, ఆ మెదడును తయారుచేసినవాణ్ణి
కనుగొనాలని ప్రయత్నిస్తున్నాం.
ఇది అసాధ్యం.
* * *
ఈ భూమిపై ఏం చేయాలి? అని అడిగారు...
ఆ ప్రశ్నకు సమాధానం దొరికేవరకు

ఏమీ చేయకుండా మీరు కూర్చోలేదు కదా!
ఏదో ఒకటి చేస్తూనే ఉన్నారుగా...

అంతే....ఏ సమయానికి ఏం చేయాలో అది చేస్తూ వెళ్లిపోవడమే
చేయవలసింది.
* * *
జీవితలక్ష్యం అనేది మనం పెట్టుకున్నాం.
మిగతా ఏ జీవులూ జీవితలక్ష్యం పెట్టుకోలేదు.
వాటికి జీవించడమే జీవితలక్ష్యం.

అలానే మనిషి కూడా జీవితలక్ష్యాన్ని పెట్టుకున్నా, పెట్టుకోకున్నా జీవితం
దానికదే సఫలం అవుతుంది.
అనే విషయం గ్రహిస్తే చాలు.
హెచ్చుతగ్గులు అనేవి మనిషి మనసులో నుంచి తొలిగిపోతాయి.

మనసుకు అటువంటి సమతుల్యత కలిగే దిశగా ప్రయాణించడమే
నాగరికత అభివృద్ధి అంటే.
అంతేగాని మిద్దెలు మేడలు పెరగడమో,
ఊపిరి సలపని  మూర్ఖపుజీవితాన్ని గడపడమో నాగరికత అభివృద్ధి
కానేకాదు.
* * *
జీవనసాఫల్యం అనేది మన ప్రయత్న అప్రయత్నాలతో ముడిపడి ఉండదు.

ఇదొక అడవి...
అడవిలో ప్రతి మొక్కకూ ఓ ప్రత్యేకత ఉన్నట్లే
ప్రతిజీవికీ తనకంటూ ఓ ప్రత్యేకత ఉండనే ఉంటుంది.

మనకు లాభం ఉండడం, ఉండకపోవడం అనే కోణం నుంచి  ఎదుటవాని
గొప్పతనాన్ని నిర్ధారించకూడదు.

మనకు పనికిరాకపోతే "పిచ్చిమొక్క" అంటున్నాం.
ఇది సరికాదు.

* * *

జ్ఞానశిశువు:
భగవత్ ప్రేమ తప్ప
మిగతా అన్నీ గ్రుడ్డివే.

55. రాధిక:
భగవత్ ప్రేమను ఎలా తెలుసుకోగలం?

జ్ఞానశిశువు:
'గురువు' అనే ద్వారం ద్వారా...
ఆ ప్రేమ ప్రసరిస్తుంది...

56. రాధిక:
ఆ ప్రేమను పొందటానికి అర్హత ఏమి?

జ్ఞానశిశువు:
నీవు దేనిని పొందాలో
దానినే నీవు పెట్టుబడిగా పెట్టాలి.

57. నాగేశ్వరరావు: బాబుగారూ! మీరు చాలా అదృష్టవంతులండీ....
సదా సద్గురు నీడలో గడుపుతున్నారు...

జ్ఞానశిశువు: నీడ కాదు, ప్రకాశం....

58. పట్టెయ్య: తటస్థంగా ఉండడమంటే?
* * *
జ్ఞానశిశువు:
కుండగా కనబడుతున్నప్పటికీ
మట్టిగా ఉండడం తటస్తం.
* * *
వ్యక్తిగా కనబడుతున్నప్పటికీ
ఆత్మగా ఉండడం తటస్తం.

59. శ్రీను: అన్ని గందరగోళంలో నుండి మీకు మీరే బయటపడండి...అని
చెప్పే యూజీ కృష్ణమూర్తి...
ఒక అద్భుతమైన గందరగోళం అని చెప్పక తప్పదు...

జ్ఞానశిశువు: Good....

60. శ్రీను: ఏమోనండీ...నాకు తోచింది చెప్పా....

జ్ఞానశిశువు : ఎవరైనా తోచిందే చెప్పగలరు...
తోయనిది ఎవరూ చెప్పలేరు...

61. శ్రీను: మీరు పెట్టిన U.G గారి PDF చదువుతున్నాను... అది ఒక అద్భుతమే...

జ్ఞానశిశువు: నేను గతంలోనే ఓ మెసేజ్ పెట్టా....
చదవండి....అంతే.
ప్రాభావితం కాకండి దేనికీ....అని.
వైవిధ్యతను ఎంజాయ్ జేయండి....

గురువుగారు చెప్పినట్టు - అన్నీ వినండి...
చివర్లో డస్టర్ తో తుడిపేసి వెళ్లిపోండి....

62. శ్రీను: అద్భుతాన్ని అద్భుతంగా ఎంజాయ్ చేస్తున్నాను... ఏం చేయగలను అంతకంటే...

జ్ఞానశిశువు : నేనూ అంతే...
బాబును కూడా నేను అద్భుతంగా చూస్తాను....

మీరే ఓ అద్భుతం కాకుంటే, మీరు ఏ అద్భుతాన్నీ చూడలేరు...

63. శ్రీను: మీరు మంటను రగిల్చి , పక్కనే బకెట్ తో నీళ్ళు పెట్టారు... అంతే మీరు చేసింది.

జ్ఞానశిశువు : కావొచ్చు ....

64. శ్రీను: క్షణ క్షణం ఓ అద్భుతం లాగా ఉంది...

జ్ఞానశిశువు: అవును...ప్రతిక్షణమూ ఓ రసగుళికే....

65.MV.రెడ్డి: నాదో ప్రశ్న....
"చైతన్యం "మనిషిగా రూపాంతరం ఎలా చెందింది?

జ్ఞానశిశువు: బ్రహ్మము సర్వశక్తి సంపన్నము అని యోగవాశిష్టంలో ఉంది.

Everything is possible for GOD అని బైబిల్ లో ఉంది.
* * *
ఉన్న శక్తులన్నీ
చైతన్యానివే(భగవంతునివే)

ఏలా? ఎందుకు? అన్న ప్రశ్నలు
సర్వశక్తుసంపన్నుడైన భగవంతుని విషయంలో అడగకూడదు.

ఆయన ఎలా అయినా ఉండగలడు...

66.ఒకరు: ధ్యానం అంటే ఏమిటి?
దేనినైనా ధ్యానించడమా?
ఆలోచనలు ఆపివేయడమా?
ఆలోచనలు లేని స్థితి అంటారా?
* * *
జ్ఞానశిశువు: దృశ్యం నుండి ద్రష్టవైపుకు చేసే యానం ధ్యానం.
ద్రష్టనే ధ్యానించాలి.

ఆలోచనలను ఆపే ప్రయత్నం
యుద్ధం అవుతుంది, ధ్యానం కాదు.

ఆలోచనే "నీవు".
ఆలోచన లేకపోతే నీవూ ఉండవు.

'ఆలోచన' సజీవమైనది.
సవ్యంగా(అంతర్ముఖంగా) ఉన్నప్పుడు ఆత్మగా ఉంటుంది.
అపసవ్యంగా(బహిర్ముఖంగా) ఉన్నప్పుడు దృశ్యంగా ఉంటుంది.
* * *

67.ప్రశ్న: భగవంతుడు ఈ ప్రపంచాన్ని యెందుకు సృష్టించాడు?

జ్ఞానశిశువు : అందరికీ కలిసి ఒక ప్రపంచం లేనే లేదు.
యెవడి ప్రపంచంలో వాడున్నాడు.
యెవడి స్వప్నప్రపంచం వాడిదే అన్నట్టుగా.

నీ కలలో ఇదే విధమైన సంభాషణే జరిగిందనుకో...
ప్రశ్నించేవాడు, సమాధానమిచ్చేవాడు ఇద్దరూ నీవే కదా అవుతావు....

ఎవడి కలకు వాడే కర్త.
ఎవడి జగత్తుకు వాడే కర్త.

స్వప్న జగత్తుకు, జాగ్రత్ జగత్తుకు ఇంచుకైనా భేదం లేదు.

"భగవంతుడు ఎందుకు సృష్టించాడు?" అని ప్రశ్నించేవాడు, ఆ భగవంతునికి అభిన్నం.

ఆడించేవాడూ భగవంతుడే.
ఆడేవాడూ భగవంతుడే.

తన మూలం వెళ్లి...
తనలో కలిసిపోయి...
తాను  ఒక్కడే శేషించినప్పుడు...
ఆ తాను భగవంతుడే అని అనుభవమాయ్యాక...
ఆ ఏకాత్మస్థితిలో...
సృష్టితో పాటు ప్రశ్న, ప్రశ్నించేవాడు కూడా మాయమౌతారు...

"ఎందుకు" అన్న ప్రశ్నకు ఖచ్చితమైన సమాధానం వాచా ఎప్పటికీ దొరకదు.

మనం(ప్రపంచం) భగవంతునిలో అంతర్భాగమై ఉన్నప్పటికీ...

మనం "అదే" అయినప్పటికీ....మనకు తెలియడం లేదు.

* * *

ఒకడు గూబ గుయ్యమనేట్టు చెంపమీద కొట్టాడు...
ఎందుక్కొట్టావు? అని అడిగితే...
నా బలమేమిటో నీకు తెలియడానికి అన్నాట్ట...

ఈ సృష్టి యెందుకు చేశావు? అని భగవంతుణ్ణి అడిగితే,
నేనొకడ్ని ఉన్నానని నీకు తెలియడానికి అన్నాట్ట.

ఇది హాస్యాస్పదంగా అనిపించినప్పటికీ...

సృష్టి కారణమేమి? అన్న ప్రశ్నకు ఇంతకు మించి సమాధానం లేదనిపిస్తుంది.

గొంతెత్తి పాట పాడకుంటే అతడు గాయకుడు అని ఎలా తెలుస్తుంది?

వీణ పై స్వరాల్ని మీటకుంటే అతడు వైణికుడు అని తెలుస్తుంది?

రాతిని శిల్పంగా మలచుకుంటే అతడు శిల్పి అని తెలుస్తుంది?

చిదాకాశమనే తెరపై విశ్వసృష్టిని గీయకుంటే అతడు భగవంతుడు అని ఎలా తెలుస్తుంది?

* * *

బ్రహ్మ మానసపుత్రుడైన వశిష్ఠమహర్షి పుట్టుకతోనే
శుద్ధబ్రహ్మజ్ఞాని...అతనికి బంధంగానీ, దుఃఖంగానీ తెలియవు.

నీవు గడియకాలం అజ్ఞానానికి లోనవుదువుగాక
అని అకారణంగా...ఓ సదుద్దేశంతోనే వశిష్ఠునికి శాపం పెట్టాడు బ్రహ్మ.

వశిష్ఠుడు అజ్ఞానవశుడై విచారవదనంతో
తన అకారణ దుఃఖాన్ని పోగొట్టమని ప్రార్థించగా అందుకు బ్రహ్మ చేసిన ప్రబోధమే  యోగవాశిష్ఠం అయ్యింది.

కష్టసుఖాలనేవి ఎలా ఉంటాయో అనుభవంలో ఉన్నప్పుడే
వాటి నుంటి బయటపడడానికి అనువైన బోధ లోకులకు చేయగలిగే సమర్థత వశిష్ఠునికి వస్తుంది.

అదే బ్రహ్మగారి సదుద్దేశము.

* * *

మితం అనేది తెలియకపోతే
అమితం అనేది ఎలా తెలుస్తుంది?

అంతం అనేది తెలియకపోతే
అనంతం అనేది ఎలా తెలుస్తుంది?

బాధ అనేది తెలియకపోతే
ఆనందం అనేది ఎలా తెలుస్తుంది?

అజ్ఞానం అనేది తెలియకపోతే
జ్ఞానం అనేది ఎలా తెలుస్తుంది?

భగవంతుడు చేసిన సృష్టికార్యము కూడా అలాంటిదే.

ఏకంగా ఉన్న తాను ఏకంగా ఉండక
అనేకమైనాడు అది లీల అయ్యింది.

తిరిగి అనేకం నుండి ఏకం వైపుకు ప్రయాణమయ్యాడు.
అది జీవితం అయ్యింది.

"ఎందుకు?" అని అడిగితే,
లోకవత్ లీలా కైవల్యం అంటుంది బ్రహ్మసూత్రం.
"లీల" అన్నాక ఇంకేం మాట్లాడగలం?
"లీల యెందుకు?" అని అడగలేం.

ఆనందం కోసం ఆడేది క్రీడ.
ఆనందంగా ఉండి చేసేది లీల.

ఎందుకు దుఃఖిస్తున్నావు? అని అడుగుతామే గాని
ఎందుకు ఆనందంగా ఉన్నావు? అని అడగం.

దుఃఖానికి కారణం ఉంటుందేగాని,
ఆనందానికి కారణం ఉండదు.

శిశువు అకారణ ఆనందానికి బాహ్యచేష్టలే కేరింతలు.
శివుని అకారణ ఆనందానికి బాహ్యరూపమే ప్రపంచం.

శివుని ఆనందసాగరంలో తేలియాడే నురగలు
ఈ ద్వంద్వాలు, త్రిపుటులు.

* * *

68.ప్రశ్న: ఈ సృష్టి ఎలా జరిగింది?

జ్ఞానశిశువు: మలం తొక్కావు...కడుక్కోవాలి అంతే.
ఎలా తొక్కాను? అనే విచారణ అనవసరం.

మాయ ఎలా తొలగించుకోవాలో అనేది సందర్భానుసారంగా ఒక్కొక్క శిష్యునికి ఒక్కొక్క  మార్గం చెప్పారు ఋషులు.

మాయ ఎందుకు కలిగింది? అనేదానికి సమాధానం మాత్రం వారు ఇవ్వలేదు.

పిల్లవాడు ఏడుస్తుంటే వాడికి మిఠాయి ఇచ్చి సముదాయించినట్టే ఈ గురువులు చెప్పిన సమాధానాలన్నీ.
అవన్నీ కంటి తుడుపు సమాధానాలేగాని...అసలు కావు.

69. ప్రశ్న: సమాధానం చెప్పడం ఋషులకు కూడా సాధ్యం కాలేదన్న మాట...

జ్ఞానశిశువు: యెందుకంటే "తానే" సమాధానం.
తనకు సమాధానం కాదు కాబట్టి.

ఋషికి సృష్టీ ఉండదు, బంధమూ ఉండదు.

70. ప్రశ్న: జన్మలకు వాసనలే కారణమంటారు?
తొలి వాసన ఎప్పుడు వచ్చింది?

జ్ఞానశిశువు : "ఎప్పుడు?" అనేది కాలానికి సంబంధించినది.
కాలం అనేది నీ తలపులలో తప్ప...దానికి స్వయం ఉనికి లేదు.

మనం నిద్రనుండి మేలుకోగానే
"నేను" అనే తొలి ఆలోచన కలిగాకే
మిగతా ఆలోచనలు, వ్యవహారాలూ కలుగుతాయి.

అలాగే భగవంతుని "తొలి ఆలోచన" అయిన "నేను" నుండే సర్వసృష్టీ జరిగింది.

అందుకే సృష్టిలోని ప్రతివ్యక్తిలోనూ, వస్తువులోనూ దివ్యత్వం ఉందనడానికి కారణం.

71.ప్రశ్న: నేను కనే ఈ సృష్టి నాదేనంటారా?

జ్ఞానశిశువు : అక్షరాలా....

ఈ సృష్టి నీ మనో వైచిత్ర్యమే...
ఇది తెలిసి ఓ మహాత్ముడుగా ఈ జగత్తులో చరించు...

72.ప్రశ్న: ఈ జగత్తు ఇంత సత్యంగా కనిపిస్తుంటే
ఇది కల అని యెందుకు అనుకోవడం?

జ్ఞానశిశువు : నిజమే. ఆధ్యాత్మికంలో అత్యుత్తమస్థాయికి చేరుకునే వరకు దీనిని కలగా భావించాలి తప్పదు.
ఇదొక మంచి సాధన.

మూలసత్యం వైపుకు నీ దృష్టి మరలే వరకు
నీవనుకునే సత్యాలన్నీ అసత్యాలే అని చెప్పాల్సి ఉంటుంది....

ఆ కోణంలో జగత్తు అసత్యమన్నారేగాని,
నిజానికి సత్యంవైపు నుండి చూస్తే
జగత్తు కూడా సత్యమే.

చైత్యన్యస్థాయిలో ఈ జగత్తు కూడా చైతన్యపు తునకే.
చైతన్యస్థాయిలో ఈ జీవితం కూడా ఆనందపు సారమే.

నిద్రలో కలిగే మెలకువ - కల.
మెలకువలో కలిగే కల - మెలకువ.

మొదటి కల - జీవునిది.
రెండవ కల - దేవునిది.

అందుకే ముందు నీవు ఈ మెలకువ నుండి మేలుకో.... అంటాను...

నిద్ర నుండి మేలుకుంటే కల చెదిరిపోయినట్టు.
ఈ మెలకువ అనే కల నుండి మేలుకుంటే ఈ సృష్టి చెదరిపోతుంది(కల ఉన్న ప్పటికీ కలకు బాధితుడై ఉండడు అని భావము)

కల కనేవాడు ఒకడే శేషిస్తాడు.
ఇదే ఆధ్యాత్మిక లక్ష్యం.

వచ్చిన కలను విధిలేక కనేవాడు - జీవుడు.
నచ్చిన కలను స్వేచ్ఛగా కనేవాడు - దేవుడు.

73.ప్రశ్న: భగవంతుడు ఈ సృష్టి ఎందుకు చేశాడు?

జ్ఞానశిశువు : సృష్టి కూడా తానే కాబట్టి....
తనకు విడిగా రెండవ వస్తువు లేదు కాబట్టి...
ఎందుకు అన్న ప్రశ్నకు తావులేదు.

బంగారం సదా బంగారంగానే ఉంది.
నీవెందుకు ఆభరణాల్ని సృష్టించావు?
అని బంగారాన్ని నిలదీయగలమా?

అవునా....నేనెప్పుడు ఆభరణమయ్యాను?
నేను నేనుగానే ఉన్నానే! అని అది ఆశ్చర్యపోతుంది.

ఆభరణసృష్టి మనం చేసుకున్న రూపకల్పనే తప్ప
బంగారం సదా బంగారంగానే ఉన్నది.
జగత్సృష్టి కూడా మనో విక్షేపమే తప్ప
బ్రహ్మము బ్రహ్మముగానే ఉన్నది.

ఆభరణం అనేది వ్యావహారిక సత్యం.
బంగారం అనేది పారమార్థిక సత్యం.

ప్రపంచం అనేది వ్యావహారిక సత్యం.
బ్రహ్మం అనేది పారమార్థిక సత్యం.

ఒకటి యెప్పుడూ రెండు కాలేదు.

ఒకటి(ఏకం) అనేది - ఆత్మకు సంబంధించినది.
రెండు(అనేకం) అనేది - మనసుకు సంబంధించినది.

ఒకటి అనేది - ఉన్నది.
రెండు అనేది - ఉన్నట్లున్నది.

ఒకటి అనేది - సత్యము.
రెండు అనేది మిథ్య.

ఒకటి అనేది - దైవము.
రెండు అనేది - ప్రపంచము.

తెల్లకాగితం - దైవం.
అక్షరాలు - ప్రపంచం.

జడమైన ఈ సకల నామరూపాల మరుగున ఆత్మచైతన్యమే ఉండేది.

74. ప్రశ్న: ఇదంతా నా మనస్సృష్టే అనేది నమ్మలేకపోతున్నాను...

జ్ఞానశిశువు : జ్ఞానంలో నీవు మేలుకుంటే గాని తెలియదు
ఈ జాగ్రదవస్థ అనేది నీ మనస్సృష్టే అనేది.
అప్పటి వరకు వాస్తవంగా ఉండి బాధిస్తుంది.

ఆ జ్ఞానమెలకువలో స్వప్నం కూడా జ్ఞానప్రకాశంతో(సంపూర్ణ ఎఱుకతో) ఉంటుంది.

ఇది కల, ఇది మెలకువ, ఇది నిద్ర అనే తేడా చూచేవాళ్లకేగానీ తన అనుభవంలో "జ్ఞానం" తప్ప మరొక అవస్థ ఏదీ ఉండదు.

ఇదే తురీయం.
ఆ తురీయాన్ని  సద్గురు సన్నిధిలో మాత్రమే సాధించగలం.
* * *

గుర్వనుగ్రహమే ప్రధానం.
ఇతరత్రా సాధనలన్నీ ద్వితీయం.
అని రమణులు చెప్పి ఉన్నారు.

75. సాయి చరణ్:
కోరిక ఒక వాస్తవం.
కోరిక లేని స్థితి ఒక అవాస్తవం.
అన్నారు UG...వివరించండీ....

జ్ఞానశిశువు:
కోరికలు ఉండడమే జీవలక్షణం.
కోరికలు లేకపోవడం శవలక్షణం.
* * *
కోరికలు లేకుండా ఉండడం అనేది
తాను మరణించడమే అవుతుంది.

* * *

యవ్వనంలో అందరికీ కలిగినట్లే
UG కి కూడా సహజంగానే సెక్స్ కోరికలు కలిగాయి.

నివారించలేని ఆ సహజమైన కోరికల్ని తీర్చుకోవడానికి చట్టబద్ధంగా వివాహం చేసుకున్నారు.

76. హబీబ్ బాషా: గురువంటే ఎవరు?

జ్ఞానశిశువు: నీవు మరచిపోయిన నీ స్వరూపమే గురువంటే.
మరచినవాడు - శిష్యుడు.
గుర్తులో ఉన్నవాడు - గురువు.

77.కిరణ్మయి: విచారణ లో ప్రశ్నే సమాధానం అవుతోంది.
శరణాగతి లో నాదేమీ లేదు అనటం తోనే అంతా నాదవుతోంది.
కదూ గణపతీ?

జ్ఞానశిశువు: అవును....
నేనెవడను? అనేది ప్రశ్న కాదు...
అది సమాధానం.
నేను "ఎవడను".

ఫలానా అని చెప్పడానికి వీలులేని వాడను కాబట్టి
"ఎవడను" అనేదే నా స్థితి మరియు నా పేరు కూడా అదే.

శరణాగతి అంటే  నేను-నాది అని గీసుకున్న నీ చిన్ని వృత్తాన్ని తుడిపేయడమే.
అప్పుడు నీ పరిధి అనంతం అవుతుంది.

78. చరణ్: స్వర్గంలో అందరూ సుఖంగా ఉంటారు
ఒక్క ఇంద్రుడు తప్ప.
నరకంలో అందరూ దుఃఖంలో ఉంటారు
ఒక్క యముడు తప్ప.
అన్నారు గురువుగారు...వివరించండి...

జ్ఞానశిశువు: దేవేంద్రుడికి, తపస్సులు చేసే మునులకు టెస్టులు పెట్టే Extra Duty ఒకటి ఉంది కదా....
అందువలన తాపసికుల వలన తనకు ఏ ఆపద ముంచుకొస్తుందో అనే భయం
సదా తనను వెంటాడుతూ ఉంటుంది.
* * *
యమధర్మరాజుకు అసలు డ్యూటీనే లేదు....
స్వర్గానికి, నరకానికి మధ్యలో తన సింహాసనం ఉంటుంది.
మరణించిన జీవులు యమధర్మరాజు సన్నిధికి వెళ్లగానే
యధేచ్ఛగా ఎవరికి వారు స్వర్గ నరక ద్వారాల్లోకి ప్రవేశిస్తారు.
తీర్పులు, శిక్షలు ఎవరికివారు వేసుకునే "యమ"ధర్మపీఠం అది.

79. ఒకరు: సత్సంగం అంటే?

జ్ఞానశిశువు:
నీకు నీవు
నీలో నీవు
సదా సదసద్విచారణ
చేస్తుండడమే సత్సంగం.

80. రాధిక:
అన్నయ్యా! గురువుగారికి నేను గుర్తున్నానా... అంటే, అంత ఎక్కువ పరిచయం లేదు కదా...
అన్నారు.

జ్ఞానశిశువు:
అంతేకదా...
వారి అనంతస్వరూపంలో
మన రూపాలు వారి 'జ్ఞప్తి'లో
సుస్థిరవాసం చేయడమంటే
ఎంతో అదృష్టముండాలి...

81.శశిధర్: మీరు ధ్యానం చేస్తారా?

జ్ఞానశిశువు: మేం ధ్యానం చేయం.

82. శశిధర్: నాకు ధ్యానం కుదరడం లేదు
ఎలా చేస్తే ధ్యానం కుదురుతుందో చెప్తారా...

జ్ఞానశిశువు: ధ్యానం మిమ్మల్ని ఆవహించాలి.
అప్పుడే మీకు ధ్యానం కుదురుతుంది.

83. శశిధర్: కరోనా కారణంగా కాళహస్తి రాలేకపోతున్నాము...

జ్ఞానశిశువు: కాళహస్తి,  కరోనా ...ఇవన్నీ మీలో ఆలోచనలే తప్ప....బయట ఏమీ లేవు...
'బయట' అనేదేలేదు.

84.ప్రతాప్: శరీరంలో "నేను" స్థానమేది?
జ్ఞానశిశువు: శరీరంలో నేనుండడం కాదు.
"నేను"లో శరీరం ఉంది.
* * *
85. ప్రతాప్: నేనును తెలుసుకోవడమెట్లా?
జ్ఞానశిశువు: "నేను"ను తెలుసుకోలేవు...
అసలు ఎందుకు తెలుసుకోవాలి?
* * *
"నేను"ను నీవు తెలుసుకోలేవు.
నిన్ను తెలుసుకుంటుంది "నేను".

86. ప్రతాప్: నేను మిమ్మల్ని కలవాలి...
జ్ఞానశిశువు: జ్ఞానాంబ అనుగ్రహం ఉంటే...

87. శర్మ: మనసనేది వెతికితే, అది లేదంటారు భగవాన్ ఉపదేశసారంలో...
మానసంతుకిం నైవమానసం....

జ్ఞాశిశువు: వ్యష్టి ఆత్మకే మనసు అని పేరు.
సమిష్టి మనసుకే ఆత్మ అని పేరు.
ఆత్మ-మనసు అనేవి రెండుకావు.

88. శర్మ:  అంటే వ్యష్టి ఆత్మ అనేది కల్పితం అని అర్ధమా? లేక వ్యష్టి ఆత్మ అనేది  సమిష్టి కన్న వేరుగా లేదు అని అనుకోవాలా?

జ్ఞానశిశువు: ఘటాకాశం మహాకాశం కన్నా వేఱా?

89. శర్మ: వేరు కాదు అని దృష్టాంతం వరకు అర్ధం అవుతున్నదండీ. కానీ, అంతకు మించి స్వయంగా అనుభవంలోకి రావడంలేదు.

జ్ఞానశిశువు: అర్థం అవడమే....అనుభవం అవ్వడం....

అనుభవం అవడం అనే ప్రత్యేక కార్యక్రమం ఏదీలేదు...

అవగాహనే అనుభవం.

90. శర్మ: ధన్యుడను.

91. శర్మ: అంతర్ముఖమైనా బహిర్ముఖమైనా అది మనసే(ఆత్మే). అంటే ఉండేది ఒక్కటే. అది ఆత్మే(నేనే). ఎంతగా ఊరకనే ఉంటే అంత చక్కగా అనుభవమునకు వస్తుంది అని అనుకుంటున్నాను.  ఎప్పుడూ ఇదే చదువుతున్నా వింటున్నా ఎప్పుడూ కొత్తగా అనిపిస్తోంది....

జ్ఞానశిశువు:
ఊరక ఉండకపోయినా నీవు ఆత్మవే....
పొరపాటున కూడా, మాటవరసకు కూడా
రెండవ వస్తువును అంగీకరించవద్దు.

"ఉన్నది ఒకటే. దానికి విడిగా ఏమీలేదు...."
ఇదే సర్వవేదాంతసారము....

92. శర్మ: నాకన్నా ఇతరమైన రెండవ వస్తువు లేదు అనేది అర్ధమవుతున్నది. భగవాన్ బోధనలను చాలా కాలంగా చదువుతున్నాను. వారి బోధనలు, సద్గురువులు సుబ్రహ్మణ్యం గారి బోధనల సారాంశం, నెమ్మది నెమ్మదిగా ఈ సర్వవేదాంతసారమును నాయందు నిలుపుతున్నవి.
సిద్ధమయ్యే ఉన్నదానిని శీఘ్రంగా గ్రహించలేకపోవడము దురదృష్టం.

జ్ఞానశిశువు: నీవు తెలుసుకున్నదానిని
"అవును సత్యమే" అని గురువు స్థిరపరుస్తాడు.
అంతవరకే గురువు పని. శుకుని విషయంలో జనకుడు చేసింది అదే.

93. ప్రశ్న: ధర్మం అంటే?

జ్ఞానశిశువు: ఏకకాలంలో నీకూ, ఇతరులకు శ్రేయస్సును చేకూర్చే
జీవనవిధానం.
ధర్మాచరణంలోనే 'సత్యసాక్షాత్కారం' కలిగించే
ప్రక్రియ ఉంది.
ధర్మాచరణం ఒకటీ, సత్యాన్వేషణ ఒకటీ కాదు.
శ్రద్ధతో కూడిన ధర్మాచరణం వలన
సత్యాన్ని దర్శించగలిగే సున్నితత్వం కలుగుతుంది.

94. సత్యనారాయణ: దేవుడు, జీవుడు ఒకడే అంటున్నారు...ఇక
'అనుగ్రహం' అన్నమాటకు అర్థమేమి?

జ్ఞానశిశువు: ఒకే పరతత్త్వానికి('నేను'కి) ఉన్న రెండు చేతులు-
1. దేవుడు.   2. జీవుడు.
యెడమచేతికి దురద పుడితే
కుడిచేయి గోకడమే అనుగ్రహం.

95. రాధిక: నా పుట్టినరోజును మీరు బాగా గుర్తుంచుకున్నారు...
అని చాలా ఆనందం వేసింది....
ఎంతంటే మోక్షం వచ్చినంత...
ఎందుకంటే మీ జ్ఞాపకంలో నేను వున్నాను అంటే
సద్గురువుకు, జ్ఞానాంబకు జ్ఞాపకంలో వున్నట్లే...

జ్ఞానశిశువు: అవునవును....
"జ్ఞా"నాంబలోనూ
"జ్ఞా"పకంలోనూ
"జ్ఞా" ఉన్నది.

"జ్ఞా" అంటే జ్ఞాత.
జ్ఞాత అంటే ఆత్మ.

96. రమణభక్తుడు: ఇది అంతా కల అనుకున్నప్పుడు... జీవుని చేతిలో ఏముంది?
అంతా వాడి ఇచ్ఛననుసరించి జరుగుతుంది కదండీ...

జ్ఞానశిశువు: ఆ ఉపదేశంలో మీరు స్థిరంగా ఉన్నప్పుడు మళ్లీ మీకు సంశయం కలగకూడదు... అనేదే నా వాదన.
ఇదే విషయం ఉదయం పట్టెయ్యకు కూడా చెప్పాను...

97. రమణభక్తుడు: స్వేచ్ఛగా కర్మలు చేయగలిగే వెసులుబాటు మనిషికి ఉంది అని మీరు అంటేను...సంశయం వచ్చిందండీ....

జ్ఞానశిశువు: మీరు ఒక ఉపదేశంలో స్థిరంగా ఉన్నప్పుడు...
తద్విరుద్ధంగా అనిపించే ఉపదేశాలు బోలెడు వినొచ్చు, చదవొచ్చు...
వాటికంతా డిస్ట్రబ్ కావొద్దు....
"ఇదంతా కల" అనుకున్నావు...
అందులోనే స్థిరంగా ఉండు...
నీ చివరి శ్వాస వఱకు.

98. రవి: మా ఆఫీస్ లో పై ఆ ఆఫీసర్ ఒత్తిడి ఎక్కువగా ఉంది స్వామీ....

జ్ఞానశిశువు: నీకు ఒత్తిడి తెచ్చే ఆఫీసర్ ను నీవు కొలిచే దైవంగా చూస్తూవుండు....కొంతకాలానికి అతను నీకు అనుకూలమైపోతాడు.

99.పట్టెయ్య: దేహం  ప్రపంచంలో భాగమే కదా...!

జ్ఞానశిశువు:
దేహం ప్రపంచంలో భాగమే అనేది మీకు నిజంగా అనుభవంలో ఉంటే మళ్లీ సంశయం ఎందుకు ఉంటుంది?

సంశయం ఉందంటేనే మీకు శరీరభావన ఉన్నదనే అర్థం.

శరీరభావన ఉన్నంతవఱకు...
ప్రకృతికి, పరాప్రకృతికి దేహమొక హద్దు.

ఇదొక ద్వారబంధం...
ఇదొక వంతెన...
తరించడానికి(దాటడానికి) ఇదొక పడవ...

ఈలోపు దేహాన్ని వదలడానికి లేదు...
దాటాక దేహంతో అవసరమూ లేదు...

నదిలో మునగకుండా నదిని దాటే మెకానిజం
ఆ పడవలో ఉన్నట్టు....

సంసారంలో మునగకుండా సంసారాన్ని దాటే మెకానిజం దేహంలో ఉన్నది...

ఆ మెకానిజాన్ని వాడుకునే క్రమవిధానమే హఠయోగం.

మృత్యువు ఎదురుపడ్డప్పుడు ప్రాణం విలవిలలాడకుండా ఉండేందుకే ఏ యోగమైనా ఉండేది...

అంతేగాని

అయ్యప్పమాల 18 సార్లు వేసుకున్నాను అనేవాడికి...
షిరిడీకి 15 సార్లు వెళ్లాను అనేవాడికి...
అరుణాచలానికి ప్రతిపౌర్ణమికి వెళతాను అనేవాడికి...
బహుదూరం ఈ ఆధ్యాత్మికం...

సద్గురు సన్నిధిలో గడపడం ఒక్కటే ఆధ్యాత్మికం.
ఇందులో రెండో మాటే లేదు...

సద్గురు సాన్నిధ్యాన్ని పొందక
ఋషి అయినవాడూ లేడు.

సద్గురు సాన్నిధ్యాన్ని పొంది
ఋషి కానివాడూ లేడు.

ఋషులను తయారు చేసే పరిశ్రమలు - గురుకులాలు...
ఋషులను తయారుచేసే యంత్రాలు - గురువులు.
ఆ జీవనవిధానాన్ని పాడు చేసుకున్నాం...

ఇప్పుడు పరుగులప్రపంచంలో ఉన్నాం...
రంగులరాట్నంలో తిరుగుతూనే నిశ్చలత్వాన్ని పొందే ప్రయత్నం చేస్తున్నాం...

shortcut లో తరించే ఉపాయాల కోసం facebook, whatsapp ల్లో వచ్చే ఆధ్యాత్మిక సందేశాలను సేవ్ చేసుకుంటున్నాం...

వీటితో అంతా పనిగాదు...

నిన్ను నీవు పొందాలంటే
నిన్ను నీవు పోగొట్టుకోవాలి.

మోక్షానికి పెట్టుబడి నీ జీవితం....అంతే.

100.పట్టెయ్య: అంటే... దేహంతో ఉన్నవారు దాటలేదనా? మీరు చెప్పదలచేది...!

జ్ఞానశిశువు:
1. అజ్ఞాని దేహం - ఈవల తీరంలో కదలక ఉన్న పడవ.

2. సాధకుని దేహం - ప్రయాణించే పడవ.

3. జ్ఞాని దేహం - ఆవలి తీరం చేరి కదలక ఉన్న పడవ.

కాబట్టి అజ్ఞాని కదలకపోవడం, జ్ఞాని కదలకపోవడం చూడ్డానికి రెండూ ఒకేలా కనిపిస్తాయి. కానీ మొదటిది జడం. రెండవది చైతన్యం.

కాబట్టి జ్ఞానికి దేహం ఉన్నాకూడా...దానితో అవసరం(బంధం) లేకుండా ఉంటాడు.

అజ్ఞానికి, సాధకునికి పడవ అనే సాధనం అవసరం.

దేహమే నిన్ను భవసాగరాన్ని దాటించే నావ.
దేహము లేక లోకము కలదా? అని ప్రశ్నించారు భగవాను...
దేహము యొక్క extension కొనసాగింపు లోకము...

101.పట్టెయ్య: "నిన్ను" అంటే ?
జ్ఞానశిశువు: వివిధ సంస్కారాలతో కలుషితమైన మనస్సే నీవు(జీవుడు).

102.పట్టెయ్య: ఆ విషయం మీకు ఎలా తెలుసూ?
జ్ఞానశిశువు: సుఖదుఃఖాలు...ఘర్షణలు...ప్రశ్నలు...
అన్వేషణలు...ఉన్నాయి కాబట్టి.

103. పట్టెయ్య: ఎవరికి ఉన్నాయి?
జ్ఞానశిశువు: ప్రశ్నించేవానికి...

104. పట్టెయ్య: ప్రశ్నించే వాడు ఎక్కడ ఉన్నాడు?

జ్ఞానశిశువు: ప్రశ్నించినప్పుడు మాత్రమే ఉనికి కలిగి ఉంటాడు ఉనికే లేని ఆ పృచ్ఛకుడు....

105. పట్టెయ్య: అంటే నిజానికి వాడికి ఉనికి లేదనేగా?
జ్ఞానశిశువు: అంతే.
సదా ఉనికి కలిగింది "సమాధానం" ఒక్కటే.

పృచ్ఛకుణ్ణి బట్టి దానికి "సమాధానం" అని పేరేగాని....లేకుంటే దానికి "స్వరూపం" అని పేరు.

106. తేజ: నేను అరుణాచలంలో ఉండి సాధన చేసుకోవాలని అనుకుంటున్నానండీ...

జ్ఞానశిశువు:
నీవు అరుణాచలంలో ఉండటం కాదు
నీవే అరుణాచలంలా ఉండు.
తనువును మనసును కదలనీకు.
ఇదే గొప్ప సాధన.

నిశ్చలంగా ఉండడం - సాధన.
అచలంగా ఉండడం - సిద్ధి.

107. ప్రశ్న: స్వధర్మం, పరధర్మం గురించి చెప్పండీ...

జ్ఞానశిశువు: స్వధర్మం అనేది 'పర'ధర్మంలో అంతర్భాగం.

కాబట్టి స్వధర్మంలో పరధర్మమూ ఉంది.
పరధర్మంలో స్వధర్మమూ ఉంది.

స్వధర్మం అనేది - పురుషయత్నం.
పరధర్మం అనేది - దైవయత్నం.

తానే స్వయంగా సైకిల్ నడుపుతున్నట్టు
పిల్లవాడు భావించడం - పురుషయత్నం.

పిల్లవానికి తెలియకుండా సైకిల్ వెనుక భాగాన్ని
తండ్రి పట్టుకుని నడిపించడం - దైవయత్నం.

శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ |
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ||

"పర"ధర్మం అంటే పరాయిధర్మం అని కాదు.
ఉత్కృష్టమైన ధర్మం అని అర్థం.

పరమాత్ముడు ఆచరించే ధర్మం "పర"ధర్మం.
దానిని వ్యక్తి ఆచరించలేడు అని అర్థం.

"అంతా నాదే" అనుకోవడం - పరధర్మం.
"అంతా నీదే" అని ఉండడం - స్వధర్మం.

108. ప్రశ్న: మృత్యువు అంటే?
జ్ఞానశిశువు: మృత్యుభయమే మృత్యువు.

* * *

జ్ఞానశిశువు
9533667918

139. కేరింతలు - 3

---

1. మంగరాజు: కురుక్షేత్రంలో...కృష్ణుడు అర్జునుడితో
అర్జునా! ఇప్పుడు వీరిని నీవు క్రొత్తగా చంపేదేమీ లేదు...
already వారందరూ నా చేత సంహరింపబడి ఉన్నారు...
అని అన్నారు కదా!
మరి మన జీవితాన్ని కూడా గడిచిపోయిన కథగా చూడవలసిందేనా?

జ్ఞానశిశువు: అవును.
చేసినపనినే చేసుకుపోవడమే తప్ప ఏముంది ఇందులో సారం?
మన ముత్తాత చేసిన పనులే మన తాతా చేశాడు.
మన తాత చేసిన పనులే మన తండ్రీ చేశాడు.
మన తండ్రి చేసిన పనులే మనమూ చేస్తున్నాము.
మనం చేసిన పనులే మన పిల్లలు, మనుమలూ చేస్తారు...

"ఈ జీవితం పాతబడ్డ పనికిమాలినగాధ" అంటారు వివేకానందులు.

"ఇదొక చెత్త" అని తెలిసి,
ఇందులో సారాసారము అంటూ వెతకడం మాని,

గట్టున చేరి నదీప్రవాహాన్ని సాక్షిగా చూస్తున్నట్టు
అలా నీ జీవితప్రవాహాన్ని సాక్షిగా ఉండి చూడడడం నేర్పుతుంది
ఆధ్యాత్మికం.

అంతేగాని జరుగుతున్న, లేదా జరుగబోయే ఏ సంఘటననూ మార్చదు
ఆధ్యాత్మికం.
నిన్ను వాటికి అంటకుండా చేస్తుంది అంతే.

స్క్రిప్టు తరువాతే కదా నాటకప్రదర్శన జరిగేది!

అలాగే విశ్వకథారచయిత కృష్ణభగవానుడు.
యుద్ధంలో ఎవడెవడు చావాలనేది already స్క్రిప్టు వ్రాసేశాడు.

మన జీవితమూ అంతే.

ఏడవాలని వ్రాసుంటే ఏడుస్తావ్...
నవ్వాలని వ్రాసుంటే నవ్వుతావ్...
అంతే.

ఇదొక నాటకం.
ఇదొక బూటకం.
అంతే.

2. రాధిక: వైరాగ్యం కూడా సంసారమే అన్నారు...అదెలా అన్నయ్యా?

బాబు: బలహీనుడు బలవంతుణ్ణి 'నిన్ను క్షమించాను పో...!' అన్నట్టు...
కుంటివాడు యుద్ధం గుఱించి ప్రగల్భాలు పలికినట్టు...
వృద్ధనారీ పతివ్రత అన్నట్టు...
అందని ద్రాక్ష పుల్లన అన్నట్టు...
బోనులో ఉన్న పులిని చంపి నేను వీరుణ్ణి అన్నట్టు...
అలాందటిదే సన్న్యాసి వైరాగ్యం కూడా...

సంసారంలో ఉంటూనే వైరాగ్యం కలిగి ఉన్న గృహస్థు ఒక్కడే విరాగి.

కాబట్టి వైరాగ్యం అనేది సంసారంలో ఉన్నవాడికి ఓ కవచం లాంటిది.

రామకృష్ణులు అన్నట్టు-
చేతులకు నూనె పూసుకుని పనసపండు వలవడం లాంటిది.

అంతేగాని సంఘాన్ని, సంగమాన్ని, సంసారాన్ని వొదిలి దూరంగా
పారిపోయిన సన్న్యాసి అసలైన విరాగి కాదు.

నా ఓటు ఎప్పటికీ సంసారికే...

వైరాగ్యం కూడా సంసారమే....అన్నారు గురువుగారు.

నిజమే...

అభిమానం ఎంతో వైరాగ్యం కూడా అంతే.
రెంటి స్పర్శా లేనివాడే నిజమైన సన్న్యాసి.

అభిమానము, వైరాగ్యము లేని సన్యాసికే 'అత్యాశ్రమి' అని పేరు.

అత్యాశ్రమి నా గురువు సుబ్రహ్మణ్యుడు.

* * *

మీరీ సమాధానాలు ఎలా చెప్పగలుగుతున్నారు?
అని సంతోష్ రెడ్డి అడిగితే,

గురువుగారు నవ్వుతూ-
అడిగేవాని ప్రశ్నలోనే
నాకు సమాధానం దొరుకుతుంది...అన్నారు.

కాబట్టి ప్రశ్నను బట్టే సమాధానం.

నిజమైన 'సమాధానం' చెప్పబడదు.
అది కేవలం అనుభవైకవేద్యం.

చెప్పబడిన సమాధానాలన్నీ...
మేకప్ చేయబడిన ప్రశ్నలేగాని
సమాధానాలు కావు.

3. పట్టెయ్య:
ఇప్పటి వరకూ "గురువు" ఏమీ చెప్పలేదనికదా!

బాబు: అసలు జగత్తులో గురువే లేడంటేనూ...!

మేకప్ చేయని ప్రశ్న - శిష్యుడు.
మేకప్ చేయబడిన ప్రశ్న - గురువు.

4. పట్టెయ్య: గురువు మాత్రమే కాదు
మీరు కూడా లేరు కదా!

బాబు: అంతేకదా...!
గురువూ లేడు, శిష్యుడూ లేడు...
అని 'అనేవాడు'(ద్రష్ట) మాత్రమే ఉన్నాడు.
వాడే నేను.

సకలాన్ని గుర్తించేవాడు గురువు.
ఒకరిచేత గుర్తింపబడేవాడు కాడు.

5. పట్టెయ్యి: అది స్వానుభవం మాత్రమే...
వాచా చెప్పబడదు.

బాబు: బంగారంలో నుంచే ఆభరణం వస్తుంది.
అనుభవంలో నుంచే వాక్కు వస్తుంది.
ద్రష్టలో నుండే దృశ్యం ప్రసరిస్తుంది.

6. పట్టెయ్యి: మార్పు లేని "తన"యందు మార్పులున్నట్లు తోచడమే కదా జగత్తు?

బాబు: అవును.
తోచడమే ప్రపంచం.
తోచకపోవడం పరబ్రహ్మం.

7. పట్టెయ్యి:
రఘు అనే అతను గురువుగారి సూక్తులను
క్రింద '-సద్గురు' అని పెట్టకుండా తనవిగా ఉపయోగించుకుంటున్నాడు...
* * *
జ్ఞానశిశువు:
అదే సరి.
From - To అడ్రసు లేని ఉత్తరాలు జ్ఞానప్రసూనాలు...

పైగా గురువుగారే చెప్పి ఉన్నారు-
'ఎవరెత్తుకుంటే వారి బిడ్డే ఇది' అని.

8. రాజు: ఖేచరి, శాంభవి యోగం గురించి సెలవు ఇవ్వండి....

జ్ఞానశిశువు: వాటికి నేనెప్పుడో శెలవిచ్చేశా....
మీరు కూడా శెలవిచ్చేయండీ...

9. డా. శ్రీకాంత్:
నాకు ప్రతిసారి ఒక సందేహం వస్తుంది...
ఇంద్రియాలకు అతీతంగా ఉండే సంఘటనలు జరుగుతాయా? అని.
మీరు ఏవైనా ఇలాంటివి ప్రత్యక్షంగా చూసారా?

జ్ఞానశిశువు:
ఇంద్రియాలకు అతీతం అన్నారు....
ప్రత్యక్షంగా చూశారా? అని అడుగుతున్నారు...
ఇది స్వవచోవిఘాతము...

కన్ను ఇంద్రియమే కదా....
కంటితోనే కదా చూడాలి...
ఇంద్రియాలకు అతీతమైనదానిని ఇంద్రియం ఎలా చూడగలదు?

10. ప్రవీణ్: సద్గురు దర్శించి అయ్యాక, శ్రీకాళహస్తి లో చూడదగ్గవి ఏమున్నాయండీ...

జ్ఞానశిశువు: సద్గురువు...అంతే.

వారిని చూచాక కూడా చూడదగింది మరొకటి ఉంది అని మీకనిపిస్తే, సద్గురువును సద్గురువుగా గుర్తించలేదనే అర్థం.

చివరికి శివుణ్ణి కూడా చూడవలసిన అవసరం లేదు.

గురువు 'మాట్లాడే శివుడు'.

దేనిని చూస్తే 'చూడడం' అనే క్రియ ముగుస్తుందో
అదే సద్గురుదర్శనం.

దేనిని వింటే 'వినడం' అనే క్రియ ముగుస్తుందో
అదే 'పరమపదం'.

దేనిని ఆఘ్రాణిస్తే 'ఆఘ్రాణించడం' అనే క్రియ ముగుస్తుందో
అదే 'జ్ఞానప్రసూనం'.

మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు పోవునే మదనములకు....

మందారపూవులోని తేనెకు రుచిమరిగిన తుమ్మెద
ముళ్లపొదల మీదకు వెళుతుందా?
అన్నారు పోతనామాత్యులు...

సద్గురు సన్నిధికి రుచిమరిగిన శిష్యుడు
బాహ్యావిషయాల మీదకు మనసును మళ్లించగలడా?

దీపంపురుగు దీపంలో స్వచ్ఛంద మరణాన్ని పొందునట్లు...

శిష్యుడు ఆ ఆత్మాశ్రమి సన్నిధిలో ప్రజ్వల్లించే జ్ఞానాగ్నిలో స్వచ్ఛంద మరణాన్ని(వ్యక్తిత్వనష్టాన్ని)పొందటమే మోక్షం.

గురుదర్శనం అయ్యాక...
గురువును విడిచి...
అడుగు తీసి ఇంకొక్క అడుగు వేసినా సరే...
గురువును అవమానించినట్లే...
కాదు కాదు...
తనను తాను అవమానించుకున్నట్లే.

ఇక్కడ పొందలేనివాడు ఇంకెక్కడా పొందలేడు...
అంటారు గురుదేవులు.

11. అనురాధ: ఈ మధ్య మా అన్నయ్య వాళ్లబ్బాయి 'రంగడు' చనిపోయాడు...
అప్పట్నుంచి ఏదో తెలియని భయం...

జ్ఞానశిశువు: ఏదో తెలియని భయం కాదు....
తెలిసిన భయమే...
అదే చావు భయం.

12. అనురాధ: అవును.

జ్ఞానశిశువు: భయపడండి....
భయం వచ్చినప్పుడు భయపడడమే భయనివారణం.

13. అనురాధ: నా భయంలో, నా సంతోషంలో భగవంతుడు తోడు కావాలంటే ఏం చేయాలి?

జ్ఞానశిశువు: నీవేమి చేసినా...
నీవేమీ చేయకపోయినా...

అందరికీ భగవంతుడే తోడు.
ఆయనే చివరితోడు.

14. అనురాధ: ఆయన మీలో ఉన్నాడు కదా!

జ్ఞానశిశువు: అందరిలోనూ ఉన్నాడు...
జ్ఞానిలో జ్ఞానంగా...
అజ్ఞానిలో అజ్ఞానంగా...
మీలో భయంగా...
ఉండేది భగవంతుడే.

15. అనురాధ: అజ్ఞానిలో జ్ఞాని ఉన్నాడు కదా...

జ్ఞానశిశువు: అజ్ఞానిలో ఉండే జ్ఞాని పేరే 'భగవంతుడు'.

16. అనురాధ: రెండూ నేనే కదా...!

జ్ఞానశిశువు: అవును రెండూ "నేనే".
కాని "నేనే" అంటే అనూరాధ కాదు...

17. అనురాధ: రెండూ నేనే అయినప్పుడు
అన్నీ వదలమని ఎందుకు చెప్పడం?

జ్ఞానశిశువు: వదలమని ఎవరు చెప్పారు?

18. అనురాధ: ఎక్కడో చదివాను...

జ్ఞానశిశువు: చదివింది ప్రమాణం కాదు,
గురువు చెప్పిందే ప్రమాణం...

దేనినీ వదలాల్సిన అవసరం లేదు.
దేనినీ పట్టుకోవల్సిన అవసరమూ లేదు.

19. అనురాధ: మరి శరీరాన్ని ఎందుకు ఆత్మ విడిచి పెడుతుంది?

నేను ఏమైనా తప్పుగా అడిగినా, మాట్లాడినా
చంటిబిడ్డ తల్లిని అడుగుతోందని అనుకోగలరు...

జ్ఞానశిశువు: సముద్రంలో జలచరాలు ఉన్నట్లు
ఆత్మలో సచరాచరము ఉన్నది.
పోవడం రావడం ఏమీ లేవు...
అవన్నీ మన భావనలే.

కల విడిచి మరో కలను కన్నట్టు
జీవుడు ఒక దేహాన్ని విడిచి మరో దేహాన్ని  మరో ప్రపంచాన్ని
సృష్టించుకుంటాడు...
అంతా భావనాత్మకమే...
నిజంగా నిజం అంటూ ఏమీలేదు.
ఒకటే నిజం- "కల కనేవాడు" మాత్రమే నిజం.
మిగతా అంతా అబద్ధమే...
ఉత్త తోచడమే...
నిజంగా ఉనికి లేదు..

20. అనురాధ: మరి మా 'రంగడు' ఏమయ్యాడు?

జ్ఞానశిశువు: ముడి సరుకుగా ఉన్నాడు....
ఆభరణాన్ని చెరిపేస్తే బంగారానికేం నష్టం?:

ఉండేది ఎప్పుడూ ఉంటుంది.
లేనిది ఎప్పుడూ ఉండదు.

21. అనురాధ: మా రంగడి ఫోటోలు చూసుకుంటూ వున్నామండీ..

జ్ఞానశిశువు: చూసుకునేకొద్ది బంధం.
మానుకునేకొద్ది మోక్షం.

మరీ ఇంత నిర్దయా? అనిపిస్తుంది...
నిర్ద్వంద్వమైన ఆధ్యాత్మికంలో దయకు, ప్రేమకు చోటు లేదు...

ఏడ్వడంలో కూడా సుఖం ఉంటుంది...
అందుకే ఏడుస్తారు...

ఏడుపొస్తే ఏడువు...
నవ్వొస్తే నవ్వు...

అంటుంటారు మా గురువుగారు.

ఎవరైనా తమ బాధలు చెప్పుకుని ఏడుస్తుంటే,
వారి వైపు అలా చూస్తూ ఉండిపోతారు.
అనునయవాక్యాలు పలకరు.
కన్నీళ్లు తుడవరు...

కన్నీళ్లు ఖాళీ అయ్యాక,
తరువాత తాను చెప్పదలచుకున్నది చెబుతారు.

ఏ అనుభవమైనా కలిగేది ఆత్మ వలననే.
మళ్లీ ఆత్మానుభవం అంటూ ప్రత్యేకంగా ఏమీలేదు.

తెర ఉంటేనే సినిమా ఆడేది.
ఆత్మ ఉంటేనే ప్రపంచం ఉండేది.

సినిమా చూస్తూ సుఖదుఃఖాలు అనుభవిస్తావో
లేక
ఉత్త తెర చూస్తూ నిరామయంగా ఉంటావో

నీ ఇష్టం.

నిజమైన ఆధ్యాత్మికం-
దేనినీ రెకమెండూ చేయదు...
దేనినీ డిమాండూ చేయదు...

"అది" అలా ఉంటుంది అంతే.
రంగులరాట్నంలో మధ్యస్తంభం వలె.

తాను తిరగకనే...
సకలం తిరగడానికి కారణం అవుతుంది.

ఆ స్తంభమే జ్యోతిస్తంభం(అరుణాచలం)
సకలసృష్టికి కేంద్రం.
అదే మన హృదయం
హృదయానికి బాహ్య సంకేతమే ఆ పర్వతం.
Heart is Arunachalam

ఆత్మనిష్ఠుడివికా...అని భగవాన్ పలుమార్లు చెప్పివున్నారు...

చలనరూపమైన రంగులరాట్నాన్ని వదిలి
అచలమైన ఆ స్తంభాన్ని పట్టుకో అని దాని అర్థం.

అంతే.
చెప్పడానికి ఇంకేమీలేదు.

22. ఒకరు: ప్రతి ఒక్కరూ...
నీకు జీవితము గురించి తెలియదు...
అని చావగొడుతున్నారు...
అసలు జీవితం అంటే ఏమిటీ?

జ్ఞానశిశువు:
ఏమీ జరగకపోయినా...
ఏదో జరుగుతున్నట్టుగా...
అనిపించే నీ భ్రమ కే "జీవితం" అని పేరు.
* * *
ఏమి జరుగుతున్నా...
ఏమీ జరగడం లేదు...
అన్న నీ స్థిరమైన అనుభవానికే...
"ఆధ్యాత్మికం" అని పేరు...

23. ఒకరు:  శూన్యం అంటే?
జ్ఞానశిశువు: మనకు అనుభవంలోకి రాని పదార్థం.

24. ఒకరు: ఈ లోకంలో ఎలా నడచుకోవాలి?
జ్ఞానశిశువు: ఒకడు అద్దె ఇంట్లో ఉంటాడు...
కానీ ఇల్లు తనది అనుకోడు...
బ్యాంక్ క్యాషియరు వద్ద అపారమైన డబ్బు వుంటుంది...
అదంతా తనది అనుకోడు...
అలానే ఉండు నీవు ఈ తనువులో...ఈ జగత్తులో...

25. ఒకరు: గాఢనిద్రలో ఉన్న హాయి నుంచి ఎందుకు మెలకువలోకి జారిపడ్డాను...?

జ్ఞానశిశువు: మాయకు సృష్టి చేయడం, లయం చేయడం స్వభావం.
అదే మన మనసుకు మెలకువగా, నిద్రగా అనుభవంలోకి వస్తోంది...
మాయ యొక్క కల పేరు - లీల.
మనసు యొక్క లీల పేరు - కల.
లోకవత్ లీలా లీలా కైవల్యం...అంటోంది బ్రహ్మసూత్రం...
ఇంతకు మించి ultimate truth లేదు నిజంగా...
మన చిన్న బుర్ర అందుకోగలిగే చిట్టచివరి సమాధానంగా కనుగొన్నారు ఈ వాక్యాన్ని ఋషులు...
* * *
గాఢనిద్ర - స్వరూపస్థానము.
మెలకువ - విహార స్థానము.
మళ్లీ తిరిగి మనం స్వంతగూటికి చేరుకుంటాం
అన్న జ్ఞప్తిలో ఉంటే జాగ్రదవస్త కూడా హాయే...
పక్క ఊరిలో జాతర చూడడడానికి వెళ్లడం లాంటిదే ఈ జాగ్రదవస్త...
జాతరను ఎంజాయ్ చేయండి...
ఎలాగూ తిరుగుప్రయాణం తప్పదు...
స్వంతగూడైన నిద్రలోకి వెళ్లడం తప్పదు...
ఇదీ కాసేపు...అదీ కాసేపు...
ఈ క్రీడ మాత్రమే శాశ్వతం...
బ్రహ్మ మిథ్య...జగత్తు మిథ్య...క్రీడ సత్యం.
* * *
"ఎందుకు" అన్న ప్రశ్నను వదిలి...
జీవితాన్ని ఎంజాయ్ చేయండి...
కళాత్మకంగా...రసాత్మకంగా...

26. ఒకరు: భగవంతుని మీద విశ్వాసం ఎలా కలుగుతుంది?
జ్ఞానశిశువు: జీవితం మీద విశ్వాసం పోయినప్పుడు...

27. ఒకరు: నమస్తే గురువుగారూ!
మన గురువుగారిలా...మెలకువలో ఉంటూనే...
గాఢనిద్రలో ఉన్న విశ్రాంతిని పొందడం ఎలా?

జ్ఞానశిశువు: ఆ సశరీర గురువు కూడా నీ స్వప్నంలో భాగమే...
వారు అనుభవించే విశ్రాంతి స్థితిని కూడా...
నీవు ప్రసాదించిందే...
వారు ప్రబోధించే మాటలన్నింటినీ...
నీవు అప్పుగా ఇచ్చినవే...
వారు నీకు తిరిగి అప్పజెబుతున్నారు...
నీ దానిని నీవు "ఉపదేశం"గా తీసుకుంటున్నావు...
అన్నీ నీదే...
అన్నీ నీవే...
మరిచావు అంతే...
ఆ మరపు కూడా ఉద్దేశపూర్వకమే...
మళ్లీ ఉద్దేశపూర్వకంగా జ్ఞప్తికి తెచ్చుకోవడమే సాధన...
సాధనా-సిద్ధీ...రెండూ నీ కేళీవిలాసములే...
మరపు-జ్ఞప్తి...రెండూ నీ లీలా విశేషములే...
దేవుడు సృష్టి చేయడం కాదు...
దేవుణ్ణి కూడా నీవే సృష్టించావు...
* * *
"గాఢనిద్ర" అనే ఉన్నతమైన ఆధ్యాత్మికస్థితి నుండి జారి...
మెలకువలోకి...ద్వంద్వంలోకి వచ్చిపడ్డావు...
మళ్లీ ఈ మెలకువలో గాఢనిద్రానుభవం పొందడం ఎలా?
అనే పిచ్చిప్రశ్న యెందుకు?
ఎలా? అన్న ప్రశ్నను వదిలేయ్...
అదే మోక్షం...
ఆ ప్రశ్నే కాదు...
అన్ని ప్రశ్నలూ వదిలేయ్...
ప్రశ్న లేకుండడమే గాఢనిద్రానుభవము...

ప్రశ్నలు వేయడం - విజ్ఞానం.
ప్రశ్నలు వదిలేయడం - సుజ్ఞానం.
ఒక్క మనిషి తప్ప మిగతా ఏ జీవరాశీ...
ఏ ప్రశ్నా లేకుండా హాయిగా జీవిస్తున్నాయి...
ప్రశ్నే ఆటంకం సమాధానానికి...
ప్రశ్న లేకుంటే సమాధానం అక్కడే ఉంటుంది...
ప్రశ్నే మనస్సు...
ప్రశ్న పరిత్యాగమే చిత్తపరిత్యాగము...
ప్రశ్న లేకుంటే మనసు చచ్చి ఊరుకుంటుంది...
అదే "సుమ్మా ఇరు"...
గురువు అంటే "కేవల సమాధానము"...
అందుకే గురుసన్నిధి విశ్రాంతిగా ఉంటుంది...
గురుసన్నిధిలో గడపడమే గొప్ప సాధన....
గురుసన్నిధిలో గడపడమే గొప్ప సమాధి...
గురున్నిధి అంటే కేవలం వారి దేహం దగ్గర కూర్చోవడం మాత్రమే కాదు...
వారి తత్త్వానికి దగ్గరగా గడపడం కూడా...

28. ఒకరు: ముక్తి పొందటం ఎలా?

జ్ఞానశిశువు: ముక్తి పొందటం అనేది...
నీ ప్రయత్న-అప్రయత్నాలతో సంబంధం లేదు...
నీ ఇష్టా-అయిష్టాలతో నిమిత్తం లేదు...
చచ్చినట్టు ప్రతి ఒక్కడూ ముక్తి పొంది తీరుతాడు...
మోక్షం ప్రతి ఒక్కని జన్మహక్కు...
ఈలోపుగా తొందరపడి...
బాధగురువుల బారిన పడకండి...
ఆధ్యాత్మికవ్యాపారవలలో చిగులుకోకండి...
కాయలన్నింటికీ చెట్టే ఆధారం...
కాయకు మరో కాయ ఆధారం కాదు...
ఏ గురువూ, ఏ బోధకుడూ నీకు ఆధారం కాదు...

"అందరికీ శ్రీహరే అంతరాత్మ" అన్నాడు అన్నమయ...
భగవంతుడు నీకు కేటాయించిన పనిని...
నిరామయంగా చేసుకుంటూ వెళ్ళిపోవడమే...
గొప్పసాధన...
* * *
నదికి ప్రవహించడమే సాధన...
జీవికి జీవించడమే సాధన...
* * *
ప్రతి భావం ప్రయాణం అభావంలోకే...
ప్రతి మాట ప్రయాణం మౌనంలోకే...
ప్రతి కర్మ ప్రయాణం అకర్మలోకే...
ప్రతి చలనం ప్రయాణం అచలంలోకే...
ప్రతి జీవి ప్రయాణం దైవంలోకే...

29. రవి: గురువుగారూ...
జీవితం నశ్వరమా?

జ్ఞానశిశువు:
బోగీల వైపు నుంచి చూస్తే...
ఒకడు ఒక బోగీలో నుంచి...
మరో బోగీలోకి వెళ్లినట్టు ఉంటుదేగానీ....
రైలుతో పోలిస్తే వాడు ఎక్కడికీ వెళ్లడం లేదు...
వాడు రైల్లోనే ఉన్నాడు...
* * *
ప్రదేశాల వైపు నుంచి చూస్తే...
రైలు ఒక ప్రదేశం నుంచి...
మరొక ప్రదేశానికి వెళ్లినట్టు ఉంటుందేగానీ...
భూమితో  పోలిస్తే...
రైలు ఎక్కడికీ వెళ్లడం లేదు...
రైలు భూమ్మీదనే ఉంది...
* * *

భూమి వైపు నుంచి చూస్తే...
ఏదో ఒక కక్ష్యలో అది ప్రయాణిస్తున్నట్టు ఉంటుందేగాని...
ఆకాశం వైపు నుంచి చూస్తే...
భూమి ఎక్కడికీ వెళ్లడం లేదు....
అది ఆకాశంలోనే ఉంది...
* * *
పంచభూతాల వైపు నుంచి చూస్తే...
ఏదో సృష్టి జరిగిన"ట్టు" అనిపిస్తుందేగానీ...
ఆత్మ వైపు నుంచి చూస్తే...
సృష్టి ఏమీ జరగలేదు...
సృష్టి ఆత్మలోనే ఉంది...
* * *
ప్రతీది కదులుతోంది....
కానీ "మొత్తము" కదలదు...
గోడగడియారంలోని ప్రతి పార్టూ కదులుతుంటుంది...
కానీ గడియారాన్ని మొత్తంగా చూసినప్పుడు...
ఆ గడియారం అక్కణ్ణుంచి ఎటూ కదలదు...
అచలంలోనే సకల చలనాలూ ఉన్నాయి...
నిద్రలోనే కలలు, మెలకువలు ఉన్నాయి...
శిలలోనే సకల శిల్పాలూ ఉన్నాయి...
శాశ్వతంలోనే నశ్వరాలూ ఉన్నాయి...
ఉన్నది సద్వస్తువు ఒకటే అన్నప్పుడు...
ఏదైనా నశించి ఎక్కడికెళుతుందబ్బా...
ఆకాశాన్ని విడిచిపెట్టి పోవాలని...
ఓ పక్షి అనుకుందట...
అది ఎక్కడికెళ్లినా ఆకాశమే...
ఏదైనా నశించి ఎక్కడికెళుతుంది?
ఎక్కడికెళ్లినా...ఉన్నది సత్పదార్థమే...
ఆభరణాన్ని చెరిపేస్తే, ఆభరణం ఎక్కడకెళ్లింది...?

బంగారంలోనే కలిసిపోయింది అనాలి...
నిజానికి-
బంగారానికి...
నేను విలువైన ఖనిజాన్ని అని...
కంసాలి తనను ఓ ఆభరణంగా మలచాడని...
ఓ అందమైన అమ్మాయి మెడలో హారంగా ఉన్నానని...
అందరూ చూసి తనను మెచ్చుకుంటున్నారని...
ఆ బంగారానికి ఏమీ తెలియదు...
అన్ని భావాలూ...అన్ని లెక్కలూ మనవే.
ఆభరణంగా నశ్వరం...
బంగారంగా శాశ్వతం...
"రవి"గా(జీవితంగా) నశ్వరం...
"నేను"గా(ఆత్మగా)  శాశ్వతం...
బాహ్యంలో...వ్యవహారంలో...
రవిగా నటిస్తూ ఉండు...
ఆంతరంలో...అనుభవంలో...
"నేను"గా జీవిస్తూ ఉండు...
కల నశ్వరం...
కల కనేవాడు శాశ్వతం...
జీవితం నశ్వరం...
జీవించేవాడు(భగవంతుడు) శాశ్వతం.
జీవించేవాడు రవి కాదు...
రవి కూడా జీవితంలో భాగమే...
భగవంతుని జీవితాన్ని...
రవి తన జీవితంగా భ్రమపడడమే మాయ...
* * *
మాయ-
సమిష్టిరూపంగా అది నిత్యమైనది...
రూపుమాపలేం...

వ్యక్తిగతంగా అది అనిత్యమైనది... రూపుమాపగలం...
ఆసుపత్రిగా నిత్యము...
రోగిగా అనిత్యము...
బాగు చేసుకొని బయటపడవచ్చు...
కానీ ఆసుపత్రి కొనసాగుతూనే ఉంటుంది...
అలానే మాయ కొనసాగుతూనే ఉంటుంది...
వ్యక్తిగతంగా తాను దాన్నుంచి బయట పడవచ్చు...
మాయ అనాది...కానీ అంత్యం ఉంది...
అని శాస్త్రం చెప్పిన మాటకు అర్థం ఇదే...
* * *
సమిష్టిగా తాను శాశ్వతం...
వ్యక్తిగా తాను నశ్వరం....

30.ఒక తల్లి: నమస్తే అండీ...
నా కుమారుడు ఆత్మహత్య చేసుకున్నాడు...
నాకు ధైర్యం ఉండే సందేశం ఇవ్వండీ....

జ్ఞానశిశువు:
అమ్మా....!
ప్రతీది భగవదిచ్ఛ ప్రకారమే జరుగుతోంది...
భగవదిచ్ఛ...
భగవదిచ్ఛ...
భగవదిచ్ఛ...
దీనిని మంత్రం లాగా జపించుకోండి కొంతకాలం...
* * *
నిజానికి మన స్వంతం అయింది ఏదీలేదు...
మన దేహం కూడా....
ఇది కూడా ఒకనాటికి పంచభూతాల్లోకి జారిపోతుంది...
అందరమూ కాస్త వెనక ముందు...అంతే.
ఒకడు విదియ రోజు పోతే...

మరొకడు తిదియరోజు పోతాడు...
అందరం ఏదో ఒక తిథిలో పోతాం...అంతే.
ఏడుపును ఆపవలసిన అవసరం లేదు...
కన్నీళ్లు ఖాళీ అయ్యేవఱకు పూర్తిగా ఏడ్చేయండి...
free అయిపోండి...
ఇక తలుచుకోకండి...
ఇక బాధపడకండి...
మీరు బాధపడి, వాణ్ణి బాధపెట్టకండి....
మీ బిడ్డ భగవంతుని ఒడిలో సుఖంగా...
హాయిగా ఉన్నాడు...
వాడు సృష్టిరహస్యాన్ని కనుగొని...
మనవైపు...
మన అజ్ఞానం వైపు చూస్తూ...
చిరుమందహాసం చేస్తున్నాడు...
మనమెందుకు ఏడ్వడం...?
మనమూ హాయిగా ఉందాం...
జగన్నాటకంలో మనమూ కాసేపు పాల్గొని...
వెళ్లిపోదాం...
చచ్చిపోవడం అంటే...
వచ్చిపోవడమే...
ఎప్పటికైనా నాటకం(జీవితం) ముగుస్తుంది...
నాటకదీపం(ఆత్మ) మిగుల్తుంది...

31. ఒకరు: మీరు సన్న్యాసం స్వీకరించారా?

జ్ఞానశిశువు: సన్న్యాసానికి మేం వ్యతిరేకులం...
సన్న్యాసం బౌద్ధ సంప్రదాయం...

32. ఒకరు: ప్రతి మనిషి లోను జ్ఞానం, అజ్ఞానం
కలిసి వున్నాయి అని అనుకుంటున్నాను...

జ్ఞానశిశువు: మీరే అన్నారుగా....అనుకోవడమే....

33. ఒకరు: ప్రతి మనిషి తెరచిన పుస్తకమే కదా...

జ్ఞానశిశువు: ఉండేది నీ ఒక్క పుస్తకమే...
నీ తెరచిన పుస్తకంలో ఉండే అక్షరాలే...
ఈ స్థావరజంగమాలు...
పుస్తకం తెరవడం జననం...
పుస్తకం చదవడం జీవితం...
పుస్తకం మూసేయడం మరణం...
ఇతరులు లేరు...
ఇతరమూ లేదు...
నీవు మాత్రమే సత్యం...
ఇతరమంతా స్వప్నం...

34. ఒకరు: మీ లాంటి వారితో సత్సంగం కావాలి...

జ్ఞానశిశువు: ఇప్పుడు జరుగుతున్నదంతా సత్సంగమే...
సత్యంతో(నేనుతో) సంగం లేకుండా...
నీవూ ఉండవు...నేనూ ఉండను...
ప్రపంచమే ఉండదు...

35. ఒకరు: స్వామీ...నమస్తే...
కవులకు ఈ ఆధ్యాత్మికంలో importance ఎంతవరకు ఉన్నది?

జ్ఞానశిశువు:
కవులు కాకులు...
కావుకావుమంటూ వుంటారు...అన్నారు తాతగారు.
కాకి అరుపులు వలన లోకానికి ఎంత ప్రయోజనమో...
కవుల వలన కూడా ఆధ్యాత్మికానికి అంతే ప్రయోజనము...
ఆధ్యాత్మికంలో ఎవరికీ...దేనికీ...
importance లేదు...
గురువుకు కూడా...దేవుడికి కూడా...
importance ఉంటే అది ఆధ్యాత్మికం కాదు...

ఈ ఆధ్యాత్మికంలో మనం నేర్వవలసింది...
నీతో సహా దేనికీ ఎవరికీ importance ఇవ్వకపోవడం అనేదే...
రమణులు-
మహారాజులు వచ్చి ప్రక్కనే నిలబడినా...
చేస్తున్న పని ఆపలేదు...
పీఠాధిపతులు వచ్చి నమస్కరించినా...
కూర్చోమని ఆసనం చూపలేదు...
నారాయణగురు లాంటి ఆధ్యాత్మికవేత్తలు వచ్చినా...
రాధాకృష్ణన్ లాంటి పండితులు వచ్చినా...
తన మౌనం వీడలేదు...
అలా అని వారిని అవమానించడం కాదు...
ప్రత్యేకత ఇవ్వకపోవడం...
అందరి యెడల ఒకే దృష్టి కలిగి ఉండడం...
అనేవే ప్రధాన ఆకర్షణలుగా అనిపించేవి వచ్చినవారికి...
"ప్రత్యేకత"ను కోల్పోయిన మనసే ఆత్మ...
స్రష్ట యొక్క తీర్పు వలననే...
సృష్టి యొక్క తీరు ఉన్నది...
మధ్యలో నీవు దూరి తీర్పు ఇవ్వకు...
ఇదే స్థితప్రజ్ఞుని లక్షణం...
అన్నీ కను...
అన్నీ విను...
తీర్పులేని మనసుతో కను, విను...
ఇదే స్థితప్రజ్ఞుని లక్షణం...
మనుషులే కాదు...
పశుపక్ష్యాదులతో సహా...
దేవతలు సైతం...
నీకు నమస్కరించి వెళుతున్నా సరే...
"ప్రత్యేకత"ను కోల్పోయిన నీ మనసు...

వాటికి చలించదు...ఆనందించదు...
ఇదే స్థితప్రజ్ఞుని లక్షణం...

36. బెంగుళూరు రవి:
నమస్కారం స్వామీ...
మా సత్సంగం ఇప్పుడే ముగిసింది...
ఆత్మ ఎవరిని వరిస్తుంది?
ఎవరికి నిరాశను మిగులుస్తుంది?

జ్ఞానశిశువు:
మనలో ఆత్మ ఉండడం కాదు...
ఆత్మలో మనమందరమూ ఉన్నాము...
సముద్రంలో జలచరాల్లాగా...
ఉన్న సకలమూ ఆత్మలోనే ఉంది...
మనం సత్సంగం చేసుకోవడం ఎలాంటిదంటే...
సముద్రాన్ని చేరుకోవాలంటే...
ఏ మార్గమైతే బాగుండును...?
అని సముద్రంలోని చేపలు కొన్ని...
సత్సంగం చేసుకున్నాయట...
కర్మ మార్గం మంచిదని ఒక చేప...
భక్తిమార్గం గొప్పదని ఒక చేప...
జ్ఞానమార్గం అంతిమమని ఒక చేప...
అలా రకరకాల మార్గాలతో...మాటలతో...
"సత్సంగం" పేరుతో కాలక్షేపం చేసుకున్నాయి...
వాటి పుట్టుక, జీవితం, మరణం...
అన్నీ సముద్రంలోనే...
అలా మనమందరం ఆత్మను చేరుకోవడానికి...
ఎంచుకునే మార్గాలు కూడా అలాంటివే...
మన జననం, జీవితం, మరణం అంతా ఆత్మలోనే...
ఆత్మ ఎవరినీ వరించదు...

ఎవరినీ నిరాశ పరచదు...
నిరాశ పరిచేది నీ Expectation...
నీ గురించిగానీ...
ప్రపంచం గురించిగానీ...
దైవం గురించిగానీ...
expect చేయడం మానుకో...
గతాన్ని స్మరించకు...
భవిష్యత్తును ఊహించకు...
వర్తమానాన్ని సాధన పేరుతో పాడుచేసుకోకు...
పక్షి  గింజ...గింజ  ఏరుకుని తిన్నట్టు...
నీవు క్షణం...క్షణం జీవితాన్ని అలా అనుభవించు...
వదలాల్సింది దెయ్యమే కాదు...
దేవుడు కూడా వదలాలి...
అప్పుడే మనకు ముక్తి...
దేవుణ్ణి వదిలించే మహామాంత్రికుడే సద్గురువు...

37. ఒకరు: గురుదర్శనానికి అంత దూరం రాగలనో, లేనో...

జ్ఞానశిశువు: మీరు మౌనంగా ఉంటూ...
మీతో మీరు గడిపిన సమయమంతా...
సద్గురువుతో గడిపినట్లే...

38. ఒకరు: ఎందుకో చూడాలని ఉంది ఒక్కసారి...

జ్ఞానశిశువు: మిమ్మల్ని మీరు అద్దంలో చూసుకోండి...
అదే గురుదర్శనం...
మిమ్మల్ని విడిచి గొప్పదైన విషయమంటూ ఎక్కడా ఏమీ లేదు...
మిమ్మల్ని మీరు విడవకుండా ఉండండి చాలు...

39. ఒకరు: కానీ ఎప్పుడో ఒకప్పుడు కచ్చితంగా
సద్గురువును దర్శించుకుంటాను...

సద్గురు: ఆ ప్రారబ్దం ఉంటే కలుస్తారు...

40. గౌరి: నమస్కారం...ఒక సందేహం...
ఈమధ్య నాలో జరిగిన మార్పు ఏమంటే...
ఎటువంటి సందేహమూ కలగడంలేదు...
పూజ చెయ్యాలి అనిపించటంలేదు...
దేని మీదా భయము లేదు...
దేని మీదా ప్రత్యేకత లేదు...
ఏదీ కావాలి అనీ లేదు...
నేనుగాని ఏమైనా మొద్దు బారిపోయనా?
అలా అని బాధ దుఃఖము ఇవి కూడా లేవు...
ఇంకేదో చదవాలి...
ఇంకేదో తెలుసుకోవాలి... అని కూడా  లేదు...
తమోగుణంలో కూరుకుపోతున్నానా?
దయచేసి మీ సమాధానం...

జ్ఞానశిశువు:
మీరు స్వస్థితిని పొందారు...
మీరు స్వరూపాన్నే వర్ణించారు...
సందేహం లేదు...
సాత్వికం-తామసం రెండూ ఒక్కలాగే కనిపిస్తాయి...
వైరాగ్యం, సోమరితనం ఒక్కలాగే కనిపిస్తాయి...
నిద్ర, సమాధి ఒక్కలాగే కనిపిస్తాయి...
అచలం, జడం ఒక్కలాగే కనిపిస్తాయి....
దేని యెడలా "ప్రత్యేకత" లేకపోవడం...
అనే ఒక్క లక్షణం చాలు...
నీవు జ్ఞాననిష్ఠలో ఉన్నావు అనడానికి...

41.డా. సత్యనారాయణ: ఏ కర్మ చేస్తున్నా మనసు భగవంతుని మీద పెట్టి, చేయి అంటుంటారు...ఇది ఎట్లా సాధ్యం?
నాకు వేరుగా దేవుడు ఉన్నాడు అంటారా?
నాలోనే నేను ఐనప్పుడు ఇది ఎట్లా గురూజీ?

జ్ఞానశిశువు: భగవంతుణ్ణి నీకు వేఱుగా అనిపిస్తే...
భగవదిచ్ఛ అని ఉండు...
భగవంతుడు నీలోనే ఉన్నాడని అనిపిస్తే...
నా ఇచ్ఛ అని ఉండు...
నేనైతే భగవంతుణ్ణి వేఱుగానే  భావిస్తున్నాను...
భగవంతుణ్ణి తల్లిగా...
నేను బిడ్డగా..

42. డా.సత్యనారాయణ: మాంసాహారం అలవాటు ఉన్నవారు చాలా మంది ఉన్నారు...
అయితే ఆధ్యాత్మికమార్గం లోకి వచ్చేవారికి
ఈ అలవాటు వుండకూడదు అంటారు...
ఇది నిజమా తెలుపగలరు గురూజీ....

జ్ఞానశిశువు: ఆకుకూరలు, కూరగాయలు వలిచేటప్పుడు
కనబడే చెమ్మ కూడా రక్తమే.
ఎర్రగా ఉంటేనే  రక్తం అనుకుంటే...
నేనేమీ చేయలేను...
ఇక నీవే ఆలోచించు...
ఎవడు శాఖాహారియో...
ఎవడు మాంసాహారియో...

43. డా. సత్యనారాయణ: స్త్రీ అందం చూపును ఆకర్షిస్తుంది సహజంగా...
ఇది పోవడం అంటూ ఉంటుందా?
మన భావనలో మార్పు చేసుకోవడం
కుదిరేది ఎట్లా? గురూజీ...

జ్ఞానశిశువు: అందమైనా ఆస్వాదించడానికే...
తప్పులేదు...
స్వంతం కావాలని భావించడం తప్పు.
చందమామను ఎవడూ తన షోకేసులో
పెట్టుకోవాలని ఆశపడడు కదా...

44. తలరాత అంటే ఏమి?

జ్ఞానశిశువు: జగన్నాటకంలోకి రాక మునుపు...
స్వయంగా నీవే నీ తలతో(బుద్ధితో)
వ్రాసుకున్న రాతే(స్క్రిప్టే) తలరాత...
తెరపైన ఒక అక్షరం కూడా మార్చడం కుదరదు...
ఏం మార్చాలన్నా తెర వెనుక జరగాల్సిందే...
తెరపైన-
జీవునిదీ ఓ పాత్రే...
దేవునిదీ ఓ పాత్రే...
తెరవెనుక ఇద్దరూ ఒకరే...
తెరపైన ఉన్నదంతా ద్వైతం...
తెరవెనుక ఉన్నదంతా అద్వైతం...
ఏకంగా ఉన్న బీజంలో నుంచే...
అనేకమైన శాఖోపశాఖలు...
ఉద్భవించి విస్తరిల్లినట్లు...
సమస్త ద్వైతప్రపంచానికి...
అద్వైతమే మూలబీజం...
ద్వైతప్రపంచంలో ప్రశ్న తొలగదు...
అద్వైతనిష్ఠలో ప్రశ్న కలుగదు...
అద్వైతం నీ స్వస్థానం...
ద్వైత ప్రపంచం నీకు విహారస్థానం...

45.అంజి: ఏది స్వధర్మం? ఏది పరధర్మం?

జ్ఞానశిశువు: అంజిగా ఉండడం స్వధర్మం.
ఆత్మగా ఉండడం పరధర్మం.
పరధర్మం అంటే పరాయి ధర్మం అని కాదు...
పర అంటే ఉత్కృష్టమైన అని అర్థం...
గీతలో కూడా పరధర్మం భయంకరమైనది...ఆచరణకు
అనుచితమైనది....అన్నారు భగవానులు....

46. వైద్య: మనసంతా ఖాళీగా ఐపోతున్నది...

జ్ఞానశిశువు: ఖాళీ అవ్వాలనే కదా అందరూ సాధనలు చేస్తుండేది....

47. వైద్య: ఏ విషయం పట్లా ఆసక్తి కలగడం లేదు.
ప్రపంచవిషయాలేవీ ఉత్సాహమివ్వడం లేదు.
స్తబ్ధుగా ఉంది.

జ్ఞానశిశువు: ఆసక్తి లేకపోవడం
ఉత్సాహం లేకపోవడం
ఆధ్యాత్మిక లక్షణాలే.
స్తబ్ధత అనేది కూడా అవలక్షణమేమీ కాదు.
ఇవన్నీ మంచి లక్షణాలే.
భగవంతుని వైపుకే మీ అడుగులు పడుతున్నాయి...
ఏ విచారమైనా ఆత్మవిచారంలో అంతర్భాగమే.

48. వైద్య: నన్నిప్పుడు ఎలా ఉండమంటారు...?

జ్ఞానశిశువు: ఏ పరిస్థితికా పరిస్థితి....
ఏ క్షణానికాక్షణం...
ఎలా ఉంటే అలా ఉండండి.
అలా ఉండడం, ఇలా ఉండడం అనేది
మన చేతుల్లో ఏమీ లేదు.
ఈ ఒక్క విషయం జ్ఞప్తిలో ఉండడమే శరణాగతి.

49. ఒకరు: నన్ను నేను తెలుసుకోవడానికి
మనస్సు యెందుకు సహకరించదు?

జ్ఞానశిశువు: అసలు మనస్సనేదే లేదు...
అదెలా సహకరిస్తుంది...?

50. ఒకరు: దాని గురించి తెలిసినవారికి
లేకపోవచ్చునేమో...
మనకుంది కదా!

జ్ఞానశిశువు: తెలిసినవారికైనా తెలియనివారికైనా
మనసు అనేదే లేదు...

మనస్సనేది ఉందనుకోవడం వల్లనే
అన్ని సమస్యలూ...

51. ఒకరు: లేదు అని మనం అనుకున్నంతమాత్రాన
లేకుండా పోతుందా?

జ్ఞానశిశువు: అవును...

52. ఒకరు: నిద్రలో మాత్రమే మనస్సు ఉండదు...
జ్ఞానశిశువు: మెలకువలో కూడా అది లేదు.

53. జ్ఞానశిశువు: మరి లేనట్టు తెలియడం లేదే!

జ్ఞానశిశువు: లేనిది లేనిదే...
లేనిది ఎందుకు తెలియాలి?

54. ఒకరు: లేదనుకోవడం ఓ ఊహ...
జ్ఞానశిశువు: ఉందనుకోవడం కూడా ఓ ఊహే...

55. ఒకరు: నిద్రలో ప్రశాంతంగా ఉంది...
భయం లేదు...
అసలు విశ్వమే లేదు...

జ్ఞానశిశువు: అలాగే ఉండండి మెలకువలో కూడా...

56. ఒకరు: కానీ మెలకువలో భయం, బాధ, నొప్పి...
అన్నీ ఉన్నాయి కదా...

జ్ఞానశిశువు: ఉండనివ్వండి....
అవి మీవి కావు...
మీకు కాదు....

57. ఒకరు: అదెలా!! నేను అనుభవిస్తున్నాను కదా...

జ్ఞానశిశువు:
నా శరీరం...

నా సమస్య...
నా బాధ...
నా భయం...
నా నొప్పి...
అనుకోవడంవలన...
ఆ భావ తీవ్రత వలన అవి నీవి అయినాయి...
ఆ భావ తీవ్రత లేకుంటే అవి నీకు దూరంగా ఉంటాయి...
నీవు నీవుగా ఉంటావు...

58. ఒకరు: ఈ శరీరరం నాది కాదు...
అని అనుకున్నంత మాత్రాన నొప్పి పోతుందా?

జ్ఞానశిశువు: అవును...
రమణమహర్షికి మత్తు ఇవ్వకనే...
క్యాన్సర్ ఆపరేషన్ చేశారు...
నేను ఈ శరీరం కాదు...అని
భావతీవ్రత కలిగి ఉన్నారు భగవాన్...
మనం కూడా అలా అనుకుని ఉండొచ్చు.

59. ఒకరు: కానీ మనం ఈ శరీరంతో ఎంతో కాలం నుంచి
మమేకం అయి వున్నాము...

జ్ఞానశిశువు: అవును...ఆ మమేకత్వం పోవాలంటే....
నేను ఇదికాదు....అని అనుకుంటూ ఉండాలి...

60. ఒకరు: ప్రతి ఆలోచన మన నుండే వస్తోంది...
కానీ మనం వాటిని ఎందుకు కంట్రోల్ చేయలేకపోతున్నాము?

జ్ఞానశిశువు: కంట్రోల్ ఎందుకు చేయాలి?

61. ఒకరు: ఎందుకంటే, వాటి వలన మన ప్రశాంతత
కోల్పోతున్నాము కనుక...

జ్ఞానశిశువు: అవి ఉండడానికి, నీ ప్రశాంతతకు
సంబంధం లేదు....

ఫ్యాక్టరీ ప్రక్కనే ఇల్లు ఉన్నవాడు...
హాయిగా నిద్రపోతాడు....శబ్దాలు ఉన్నా సరే...

62. ఒకరు: వాడికి తప్పదు...

జ్ఞానశిశువు: మనకూ తప్పదు....హాయిగా నిద్రపోవచ్చు...

63. ఒకరు: కానీ సంఘం నన్ను పనికిమాలినవాడివి అంటోంది...

జ్ఞానశిశువు: పనికిమాలినవాడుగానే ఉందాం...
మునిగిపోయేదేముంది?
నీవేంటో నీకు తెలుసు కదా...
అనుకునేవాళ్లను అనుకోనివ్వండీ....
నీవు నీవుగా ఉండు...

64. ఒకరు: ఎంత దూరం ఇలా....

జ్ఞానశిశువు: ఈ శరీరమే నేను... అని
ఎంత దూరం ప్రయాణించావో....
మళ్లీ ఈ శరీరం నేను కాదు... అని
అంతదూరం ప్రయాణించాల్సిందే....

65. ఒకరు: భయం, బాధ, కోపం...ఇవి నశించవా?

జ్ఞానశిశువు: ఇవన్నీ చిరంజీవులు...
నువ్వు పోతావు...అవి వుంటాయి...

66. ఒకరు: ఎలా ఉండమంటారు?

జ్ఞానశిశువు: ఎలా ఉంటే అలా....అంతే...
వెళుతూ....ఉండడమే...

67. ఒకరు: దీనికి ముగింపు లేదా?

జ్ఞానశిశువు: ముగింపు ఉంది...
కానీ అది ముగింపు అని నీకు తెలియడానికి...
నువ్వు అక్కడ వుండవు...

68. ఒకరు: కోమాలో వున్న మనిషికి ప్రాణం వుంటుంది...
కానీ మిగిలినవి ఏవి పని చేయడం లేదు...
అంటే అక్కడ అతని మనసు ఏమయ్యింది...?

జ్ఞానశిశువు: ఎవరికీ(స్వంత)మనస్సు అనేదే లేదు.

69. ఒకరు: కోమాలో వున్న మనిషికి మనకి
తేడా వుంది కదా...

జ్ఞానశిశువు: ఏం తేడా?
వాడూ ఏం చేయడం లేదు...
నువ్వూ ఏం చేయడం లేదు...

70. ఒకరు: నిద్రలో వున్న మనిషి కూడా
అలానే వుంటాడు...

జ్ఞానశిశువు: ఈ శరీరం నేను కాదు...అని
తీవ్రంగా భావిస్తూ ఉండు....
అప్పుడు నీవు మెలకువలో ఉన్నా...
నిద్రలో ఉన్నట్టే...

71. ఒకరు: దానికి చాలా టైం పడుతుంది కదా...

జ్ఞానశిశువు: అవును...
నేను ఈ శరీరం అని ఎంతకాలం భావించావో...
నేను ఈ శరీరం కాదు... అని
అంతకాలం భావించాల్సి ఉంటుంది...

72. ఒకరు: అప్పుడు మనం సొసైటీకి
దూరంగా వుండడం మంచిది కదా...

జ్ఞానశిశువు: నీ ఇష్టం...
ఏలా అయినా ఉండు...
ఎక్కడైనా ఉండు....
నేను ఈ శరీరం కాదు...అని తలపోస్తూ వుండు...

73. ఒకరు: సంసారంలో వుంటూ అలా ఉండగలమా?

జ్ఞానశిశువు: ఉండొచ్చు...
ఆయా సమయాన్ని బట్టి...
ఆయా పరిస్థితిని బట్టి...
ఎలా ఉండాలో అలా ఉండు...

74. ఒకరు: ఆలోచనలు అన్నీ గతం చుట్టూ...
తిరుగుతూ ఉంటాయి ఎందుకు?

జ్ఞానశిశువు: జరగనీ....ఆలోచనలు నీవి కావు...

75. ఒకరు: అయితే ఆలోచనలు...అనుభవాలు...ఎవరివి?

జ్ఞానశిశువు: 'ఎవరు' అనేదే వాని పేరు.
లేదా నీ ఇష్టం వచ్చిన ఏ పేరైనా పెట్టుకో...

76. ఒకరు: అనుభవిస్తున్నది నేను కాదు...
అని చాలా క్లియర్ గా తెలుస్తోంది...

జ్ఞానశిశువు: అవును...

77. ఒకరు: కానీ ఆ గమనించేది ఎవడో తెలియడం లేదు...

జ్ఞానశిశువు: "ఎవడో" ఉన్నాడని తెలుసుకున్నావు...చాలు.
వాడికి "ఎవడో" అనేదే వాని పేరు.

78. ఒకరు: ఆ "స్థితి"లో నేనెందుకు ఉండలేకపోతున్నాను?

జ్ఞానశిశువు: "నేను ఈ శరీరం" అని గాఢంగా భావించడం వలన...

79. ఒకరు: గమనించే దానిని ఎల్లప్పుడూ పట్టుకుని వుండేది ఎలా?

జ్ఞానశిశువు: నేను ఈ శరీరం కాదు...
అని సదా భావించడం వలన...
ఆ పట్టు వస్తుంది.

80. ఒకరు: మీరు ఇప్పుడు అలాగే వున్నారా?

జ్ఞానశిశువు: అవును...

81. జ్ఞానశిశువు: నేను శరీరం కాదు అనుకోవడం వేఱు...
దానిని తెలుసుకుని వుండడం వేరు...

జ్ఞానశిశువు:
అనుకోవడం సాధన.
ఉండడం సిద్ధి.

నేను ఈ శరీరాన్ని కాదు...అనుకోవడం సాధన.
అదే నేను అని ఉండడం సిద్ధి.

82. ఒకరు: నేను ఈ శరీరాన్ని కాను...
అనుకోవడమనే ఆలోచనకు బంధీ అయిపోమా?

జ్ఞానశిశువు: బంధీలము కాము...
బంధవిముక్తులవుతాము...

83. ఒకరు: వేరే మార్గం లేదా...?

జ్ఞానశిశువు: ఉండొచ్చు...నాకు తెలియదు...

జ్ఞానశిశువు:
శ్వాస మీద ధ్యాస - బౌద్ధమార్గం.
ధ్యాస మీద ధ్యాస - సనాతన మార్గం.

84. ఓకరు: ధ్యాస మీద ధ్యాస అంటే?
దయచేసి అర్థం వివరించగలరు గురూజీ...

జ్ఞానశిశువు: ద్రష్ట మీద దృష్టి పెట్టడం.
గమనించేవాణ్ణి గమనించడం.
సాక్షికి సాక్షిగా ఉండడం.
ఎఱుకను ఎఱిగి ఉండడం.
ధ్యానించేవాణ్ణి ధ్యానించడం.

85. ఒకరు: బాబుగారూ...!
భగవంతుడు నాకు అన్నీ ఇచ్చాడు...
మనశ్శాంతిని ఇవ్వలేదు...

జ్ఞానశిశువు: భగవంతుడు నీకు  మనస్సు ఇచ్చాడు...
ఆ మనసుకు శాంతిని నీవు ఇవ్వాలి...

మామగారు బంగారు బిస్కట్లు ఇచ్చాడు...
దానిని ఏఏ ఆభరణాలుగా మార్చుకోవాలనేది కోడలి ఇష్టం.
మనసు అనేది భగవంతుడిచ్చిన ముడిసరుకు.
దానిని శాంతిగానో, అశాంతిగానో మార్చుకోవడం అనేది నీ ఇష్టం...

అతి వ్యవహారం ఉన్నప్పుడు అశాంతిగానే ఉంటుంది...
పరిమిత వ్యవహారం ఉన్నప్పుడు శాంతిగానే ఉంటుంది...
ఇక వేటే మార్గమే లేదు...

వ్యవహారం అతిగా వెళ్లడానికి అవకాశం ఉండని విధంగా...
ఋషులు ఏర్పరచిన గొప్ప ఏర్పాటు - ధర్మం.
ఎవడి ధర్మాన్ని వాడు ఆచరిస్తే...
వ్యవహారం కరెక్టుగానే ఉంటుంది...
మనసు సమస్థితిలో ఉంటుంది...
సమస్థితిలో ఉన్న మనసే ఆత్మ.

రామచంద్రులవారు, ధర్మరాజులవారు
నగరవాసంలోనూ, అరణ్యవాసంలోనూ
సమస్థితిలో ఉండగలిగారు...
వారు ఆత్మజ్ఞులు.

86. ఒకరు: నమస్కారమండీ బాబుగారూ...
నా దగ్గరకు ఒకరు వచ్చి వాళ్ల లౌకిక బాధలేవో చెప్పుకున్నారు...
నేను మన గురువుగారి bless తీసుకోండీ...
అని గురువుగారి నెంబర్ ఇచ్చాను...
ఇది ఏమైనా తప్పా?

జ్ఞానశిశువు:
ఆధ్యాత్మికంగా ఎదగడానికే లౌకిక బాధలు వచ్చేది...
బాధలు ఆశీర్వాదాల వలన పోవు...

అవగాహన వలన పోతుంది...
బాధలు తగ్గించమని గురువు వద్దకు వెళితే...
ఆ బాధలు ఇంకా ఎక్కువవుతాయి...
వాటికి temperament పెరుగుతుంది...
తలనొప్పి చిన్న బాధే...
దానిని అలానే భరించడం మంచిది...
నివారణ కోసం గురువు వద్దకు వెళితే...
తలకు జండూబామ్ రాయడు...
తలే తీసేస్తాడు...
సంపాదించాలని వెళితే ఉన్నవి పోగొడతాడు...
రక్షించమంటే భక్షిస్తాడు...
బ్రతకడానికి ఉపాయాలు అడిగితే...
చావడానికి ఉపాయాలు చెబుతాడు...
'నేనున్నాను కదా భయమెందుకు?'
అన్న సద్గురు అభయం భయంగొల్పుతుంది...
పాము కప్పతో అన్నట్టు ఉంటుంది ఆ అభయం...
ఒరే మీకు సమస్య ఉండడం కాదు...
మీరే అసలు సమస్య అంటూ...
మిమ్మల్ని అమాంతంగా మ్రింగేసి...
'నేను మాత్రమే ఉన్నాను' అని స్థిమితంగా ఉంటాడు...
అందుకు సిద్ధపడే గురుసన్నిధికి వెళ్లమనండి...

87. ఒకరు:
ఆత్మవిచారణను తెలియజేసే మంచిగ్రంథాలు లిస్ట్ ఇవ్వండి
తెప్పించుకుంటాను...

జ్ఞానశిశువు: పుస్తకాలన్నీ ప్రక్కనబెట్టి...
నీలోపలికెళ్లిపో....అన్నాను.

87. ఒకరు:ఆత్మవిచారణ అంటే ఇదేనా?
అక్కడ నేనెవడను? అని ప్రశ్నించుకోవాలా?

జ్ఞనశిశువు: కాదు...
(నేనుగాక)నీవెవడవు? అని నిన్ను ఆత్మ విచారిస్తుంది...
అదే ఆత్మవిచారణ.
ఆత్మ చేసే విచారణే ఆత్మవిచారణ.
నీకు ఉనికే లేదని తెలుసుకోవడమే...
ఆత్మవిచారణాఫలం.
అదే శరణాగతి.
అదే పరమవిశ్రాంతి.
* * *
విశ్రాంతిలో నీవుంటావు...
పరమవిశ్రాంతిలో నీవుండవు...
పరమవిశ్రాంతే ఉంటుంది...

88. గౌరి: నమస్కారం అయ్యగారు...
నాకు ఒక dout...
జ్ఞానాన్ని తెలుసు కోవాలి అంటే,
చక్కగారోజూ సత్ గ్రంధములు చదువుతూ...
మఠాలు,ఆశ్రమములో ఉంటూ...
గురువు చెప్పినది విని ఆచరించటం...
నియమాలకు కట్టుబడి ఉండటం...
ఇవి అన్నీ చేస్తేనే భగవంతుని చేరుకుంటానా?
ఇవిచేయని వారికి అర్హత లేదా?
ఇంకా క్రియాయోగ, సిద్దయోగ ,ధ్యానం...
ఇలాంటి ప్రక్రియలు వల్లనే భగవంతుని పొందుతామా?

జ్ఞానశిశువు: భగవంతునితో నీకు పని ఏమి?
ముందు అది తేల్చుకో...

89. గౌరి:
నేను నాతోనే ఉంటే....
ఈ గుడులు ఏమిటి?

సాధనలు ఏమిటి?
ఒకొక్కరు ఒకొక్కటి చెపుతున్నారు...

జ్ఞానశిశువు: నీ గురువాక్కే నీకు ప్రమాణం...

90. ఒకరు: అభిషేకాలు,పూజలు,ఉపవాసాలు,కళ్యాణములు, జాగరణ చేస్తుంటాము... దీని అంతరార్థం ఏమి దీనివలన మానవుడు ఏవిధముగా తరించవచ్చునో వివరించగలరు...

జ్ఞానశిశువు: అవన్నీ కాలక్షేపములే(timepass)...

91. ఒకరు: ఈ అజ్ఞానం పోయేది ఎట్లా?

జ్ఞానశిశువు: అజ్ఞానం ఎక్కడుంది? ఎలా ఉంది?

92. ఒకరు: నాకు తెలియదు తెలుపగలరు...

జ్ఞానశిశువు: మీకు తెలియని దానిని గుఱించి
మీకు చింత ఏమి?

93. ఒకరు: కానీ జరగాల్సిన నష్టం జరిగిపోతుంది కదా...
మాకు ఆ నష్టం మీద చింత ఉంటుంది కదా...

జ్ఞానశిశువు: సంపాదనా మీది కాదు...
నష్టమూ మీది కాదు...
అని తెలిస్తే ఏ చింతా ఉండదు...

94. ఒకరు: నా కుమారుని మరణానికి
నాకు తెలియకనే నేనే కారణం అయ్యాను...

జ్ఞానశిశువు: లోకంలో-
ఎవరికీ ఎవరూ కర్త కాదు...
ఎవరికీ ఎవరూ కారణం కాదు...
ఇది ఒక్కటి గ్రహిస్తే చాలు...
పరమశాంతి నిన్ను ఆవహిస్తుంది...

95. ఒకరు: నేను ఈ విషయమై చాలా లోతుగా(deepగా)ఆలోచించాలి...

జ్ఞానశిశువు: ఆలోచించడం మానేస్తే అదే deep...
సుఖదుఃఖాలు రెండూ ఆలోచనే...
ఆలోచన వదిలేస్తే అదే పరమసుఖం...

96. ఒకరు: నష్టం ఎందుకొస్తుంది?

జ్ఞానశిశువు: లాభాన్ని నాది అనుకుంటున్నావు కాబట్టి...
నష్టం అనేది బాధిస్తుంది...
లాభనష్టాలు రెండూ నీవి కావు....
అసలు నీదంటూ ఏమీలేదిక్కడ...
అసలు నీవే లేవు...
దారిలో దొరికిన పెన్ ను నీవు జేబులో పెట్టుకుని
వాడుకున్నట్లు...
ఈ దేహాన్ని వాడుకుంటున్నావు...
తనువుతో సహా అన్నీ నీకు ఉచితంగానే దొరికాయి...
ఉచితంగా వాడుకుంటున్నావు...
ఎప్పుడో దానిని దారబోసుకుంటావు?
అయితే ఏమి?
ఎందుకు బాధపడాలి?
ఇన్నాళ్లు ఉచితంగా వాడుకున్నందుకు సంతోషించాలి...

97. ఒకరు: నాకు కొన్ని ప్రశ్నలున్నాయి...

జ్ఞానశిశువు: ప్రశ్ననే ధ్యానించాలి...
అదే సమాధానంగా మారుకుంటుంది...
కాయే పండుగా మారుకున్నట్టు...

98. ఒకరు: భగవదిచ్ఛ ప్రకారమే మనం పుట్టాము...
మనకు free will అంటూ లేదా...

జ్ఞానశిశువు: Free will కూడా  భగవదిచ్ఛలో అంతర్భాగమే...
భగవంతుడు నీకిచ్చిన పరిమిత శక్తికే...
free will అని పేరు...

ఆ పరిమితశక్తికి లోబడి....
నీవు ఏమేమి చేయగలవో....
అదంతా చేసుకో....
నీ  శక్తికి మించి ఉండేదానిని...
ఎలాగూ నీవేమీ చేయలేవు...
మైదానంలో పలుపు చేత కట్టివేయబడిన పశువు...
ఆ పలుపు పొడవును బట్టి ఎంత దూరం పోగలదో...
అంత మేరకే తిరుగుతూ గడ్డి మేస్తున్నట్లుగా...

99. ఒకరు: మీ భవిష్యత్తును మీరే వ్రాసుకోండి...అన్నారు వివేకానందులు...

జ్ఞానశిశువు: ఇక సమస్యేముంది...వ్రాసుకోండీ...
వివేకానంద తన భవిష్యత్తును...
100 ఏళ్లకు వ్రాసుకుని ఉండొచ్చు కదా....
39 కే ఎందుకు ఖాళీ అయిపోయాడు?

100. ఒకరు: ఆనందంగా ఉండాలన్నా...
ఉండలేకపోతున్నాను...
తప్పు చేయకూడదనుకున్నా...
తప్పు చేస్తున్నాను...
ఏదో శక్తి బలవంతంగా నడిపిస్తోందని అనిపిస్తోంది...

జ్ఞానశిశువు: అవును...
అదే విధి...అదే దైవం...
మన చేత మంచి చేయించేదీ అదే...
చెడు చేయించేదీ అదే...

101. ఒకరు: మనిషికి స్వేచ్ఛ అనేది లేకపోతే ఎలా?

జ్ఞానశిశువు: కొంత మేర స్వేచ్ఛ ఉండనే ఉంది కదా...
ఆ స్వేచ్ఛ మేర ఏం చేయగలవో అది చేయి...
ఎవరు వద్దన్నారు...
శారీరకమానసిక పరిమితుల్లో ఉండే దైవశక్తినే...

పురుషకారం(free will) అంటున్నాం...
తనువు, మనసును దాటి ఉన్న దైవశక్తినే...
విధి  అని భగవదిచ్ఛ అని అంటున్నాం...

102. ఒకరు: భగవాన్ చెప్పిన "ఊరక ఉండు" అర్థమేమి?

జ్ఞానశిశువు: నేను కర్తను కానని ఉండడం.

103. ఒకరు: మన లోపలి సంస్కారాలకు కర్త ఎవరు?

జ్ఞానశిశువు: కర్త ఒకడే...
లోపల ఒక కర్త....బయట ఒక కర్త ఉండడు...

104. ఒకరు: ఎలాంటి థింక్స్ లేకుండా...
హాయిగా ఉండాలంటే ఏం చేయాలి?

జ్ఞానశిశువు: ఎలాంటి థింక్స్ లేకుండా ఉండడం అసాధ్యం...
అది ఒక్క శవానికే సాధ్యం...
అన్నీ face చేయాల్సిందే....
అన్నీ taste చేయాల్సిందే...
అన్నిటికీ  సిద్ధపడి ఉండడమే జ్ఞానలక్షణం...

105. దేవీప్రసాద్: ప్రపంచం గాడి తప్పింది...
జ్ఞానప్రసూన: గాడి తప్పాకే ప్రపంచం ఏర్పడింది....

106. ఒకరు: ఏదో చేసి తెలుసుకోవలసిన అగత్యం...
అసలు ఎందుకు ఏర్పడింది?

జ్ఞానశిశువు:
ఆది నుంచి తాను అనంతుడే, అసంగుడే...
సినిమాలో ఓ పాత్రను అభిమానించి...
వాని సుఖదుఃఖాలను...
తన సుఖదుఃఖాలుగా భావించినట్లు...
సర్వ శరీరములు తానే అయినప్పటికినీ...
ఒక తనువుతో మాత్రమే అభిమానించి...
తాదాత్మ్యం చెంది...

ఆ అనంతుడు పరిమితుడైనట్టు...
అనిపించడమే సంసారం...
దేవుడికైనా... జీవుడికైనా...
అభిమానమే బంధం...
నిస్సంగత్వమే మోక్షం...
మళ్లీ ఆ పాత్రతో మమేకత్వం వదలాలంటే...
సద్గురు సాంగత్యంలో  మనసు నానాలి...
అనంతుడు మళ్లీ క్రొత్తగా అనంతత్వాన్ని పొందినట్టు అనిపించడమే కైవల్యం.
కేవలుడే కైవల్యం పొందగలడు...
ముక్తుడే ముక్తి పొందగలడు...
గురువుగారు అంటుంటారు...
బంధం బంధమే అయితే అది తొలగదు...
మోక్షం మోక్షమే అయితే అది కలుగదు...అని.
తొలిగేది బంధం కాదు...
కలిగేది మోక్షం కాదు...
తగులుకున్నట్లుగా అనిపించడమే బంధం...
తొలగినట్లుగా అనిపించడమే మోక్షం...
తనను ఏదీ తగులుకోలేదు....
తొలగించుకోవడానికి ఏ సాధనా అవసరం లేదు...
అపరిమితుడైన నేను...
పరిమితమయ్యి..కుదించుకుపోయి...
ఒక నామానికి...ఒక రూపానికి...
సెట్ అయిపోయాడు...
సృష్టిలో దేనిని చూసినా...ఎవరిని చూసినా..
"నేనే" అనే అనుభవం కలగడమే స్వస్వరూపానుభవము...
* * *
మొదట్లో సకలమూ సత్యమనిపిస్తుంది...
నేను అనేది ఉత్త భావం అనిపిస్తుంది...

తర్వాత సకలమూ భావంగా తోస్తుంది...
నేను అనేది సత్యంగాఅనుభవమౌతుంది...

107. ఒకరు: జ్ఞానప్రసూనాలలో పునరుక్తులున్నాయండీ...

జ్ఞానశిశువు: మంచిదే కదా...
మళ్లీ మరొకసారి మననం చేసుకోవడానికి
అవకాశం దొరికినట్టయ్యింది కదా...
ఓ మంత్రాన్ని పదే పదే స్మరిస్తుంటాం...
పునరుక్తి అనుకోం కదా...
తాత్త్విక గ్రంథాలలో పునరుక్తులను
దోషాలుగా పరిగణించవలసిన అవసరం లేదు...
"జ్ఞానప్రసూనాలు" లోని ప్రతి మాటా మంత్రమే...
రాబోవు తరాలవారికి "వేదాంతం" అంటేనే...
జ్ఞానప్రసూనాలే అవుతాయి...
అన్నారు మా గురుదేవులు....

108. ఒకరు: ప్రయత్నమే వద్దంటారా?

జ్ఞానశిశువు: ప్రయత్నం వద్దని నేను చెప్పడం లేదు...
మీ ప్రయత్నం కూడా మీ ప్రయత్నంతో సంబంధం లేకుండా
జరుగుతోంది...అనేదే.

* * *

140.నత్కీరుడు

---

1. జగన్మిథ్య... అన్నారు శంకరులు.
2. సర్వం ఖల్విదం బ్రహ్మ... అన్నారు వేదఋషులు.

రెంటిలో ఏది సత్యం?
రెండూ సత్యమే.

మొదటిది సాధనావవస్థలో చెప్పబడింది.
రెండవది సిద్ధ్యావస్థలో చెప్పబడింది.

* * *

జగన్మిథ్య అన్నా-
జగత్తులోని ఏ విషయానికీ ఆశ్చర్యపోనక్కర్లేదు...
అది మిథ్యే కాబట్టి.

సర్వం ఖల్విదం బ్రహ్మ అన్నా-
జగత్తులోని ఏ విషయానికీ ఆశ్చర్యపోనక్కర్లేదు...
అంతా బ్రహ్మమే కాబట్టి.

* * *

"దేనికీ ఆశ్చర్యపోవద్దు"
ఇది వివేకానందులకు వారి తండ్రి ప్రసాదించిన
మహోపదేశం...

అందువల్లనే-
ఆ సంపన్న దేశాలలో...
ఆ భోగ దేశాలలో
దేనికీ అంటకుండా...
ఓ ఋషిలా సంచరించగలిగారు.

* * *

1. ఆశ్చర్యపోవడం,
2. ఆసక్తిగా చూడడం...
ఇవి అజ్ఞానానికి ప్రధాన లక్షణాలు...

* * *

ఓ సన్నివేశాన్ని అలా ఆశ్చర్యంగా, ఆసక్తిగా చూసి-
యోగభ్రష్టుడైన ఓ మహనీయుని కథ ఇది.

* * *

నత్కీరుడు...
పాండ్యుల రాజధాని అయిన మధురానగరంలో పాండ్యరాజాస్థానంలో
ఆస్థానపండితుడుగా ఉన్నాడు...

ఆ ఊళ్లోనే బాణుడనే ఓ పేదబ్రాహ్మణుడున్నాడు...
సుందరేశ్వరాలయంలో అర్చకుడు...
ఆ అర్చకుణ్ణి శివుడు అల్లుడూ! అని సంబోధించేంతటి గొప్పశివభక్తుడు.

మధురానగరంలో కరువు ఏర్పడి, ప్రజలందరూ వలస వెళ్లిపోతున్న సందర్భంలో...
తాను కూడా వలస వెళ్లాలని ఆ అర్చకుడు నిశ్చయించుకున్న తరుణంలో శివుడు వారిస్తూ
అతనికి ఓ అందమైన పద్యాన్ని తాళపత్రంలో వ్రాసిచ్చి...
ఇది రాజుకు వినిపించు...
ఆ కవితాసౌందర్యానికి ముగ్ధుడై...
నీకతడు తరతరాలకు సరిపడా సంపదనిస్తాడు...అన్నాడు.

బాణుడు సంతోషంతో రాజాస్థానం చేరుకుని శివుడు ప్రసాదించిన ఆ కవితను రాజుకు వినిపించాడు...

రసహృదయుడైన రాజుగారు యెంతగానో ప్రశంసించి, అతడి దారిద్ర్యం తీరిపోయేటట్లు కానుకలిచ్చాడు...

ఆస్థానపండితుడైన నత్కీరుడు సహించలేకపోయాడు...
ఆ కవితలో -
"మహారాణి కొప్పు సహజగంధ గంధిలమై అలరారుతున్నది..."
అన్న వాక్యాన్ని తప్పుపడుతూ...
కేవలం పార్వతీదేవికి మాత్రమే ఉండే ఆ సహజసుగంధ ధమ్మిల్లము(కొప్పు) మహారాణికి అన్వయించడం సరికాదు...
అంటూ నత్కీరుడు ఆ బ్రాహ్మణుడికి కానుకలివ్వకుండా అడ్డుతగిలాడు...

ఆ బ్రాహ్మణుడికి నోటి వరకు వచ్చిన ముద్దను లాగేసినట్లైంది...

విచారిస్తూ సుందరమందిరం చేరి సుందరేశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు...

శివుడు పండితవేషంలో అతనికి తోడుగా రాజాస్థానం చేరి నత్కీరునితో వాదిస్తాడు...

ఇందులో దోషమేముంది?
కావ్యాలంకారాలు సహజమే కదా...!
అంటాడు శివుడు.

అయినా నత్కీరుడు ఆమోదించలేదు...

శివుడు తన పండితవేషం వదిలి నిజరూపంతో అందరికీ దర్శనమిచ్చి-
ఈ కవితను నేనే వ్రాశాను...అంటాడు.

శివదర్శనం కాగానే
సభ సభంతా లేచి నిలబడుతుంది...

కృతికర్త శివుడైనా సరే...
ఆ మాట అసత్యం...అని వాదించాడు నత్కీరుడు.

శివుని కోపావేశుడై "కుష్ఠువ్యాధిగ్రస్తుడవుకమ్మ'ని
శపించాడు...

నత్కీరుడు పశ్చాత్తాపపడ్డాడు...
శివచరణాల మీద పడి, శాపవిముక్తికై వేడుకుంటాడు...

"కైలాస దర్శనమే శాపవిమోచనం..." అంటూ అంతర్ధానమైనాడు శివుడు...

రాజు ఆ పేదబ్రాహ్మణుణ్ణి ఘనంగా సత్కరించాడు.

నత్కీరుణ్ణి కుష్ఠువ్యాధి ఆవహించింది....
శాప విమోచనం కొఱకు కైలాసగిరి వైపుకు ప్రయాణమైనాడు...

ఎక్కడ మధురానగరం?
ఎక్కడ కైలాసపర్వతం?
అక్కడికి ఎప్పటికి చేరుకోను?
ఎప్పటికి నాకీ శాపం తీరును?
అనుకుంటూ వగచుతూ నడుస్తున్నాడు...

నత్కీరుడు సుబ్రహ్మణ్యేశ్వరునికి పరమభక్తుడు...
దారిలో ఓ సరస్సు గట్టున...మఱ్ఱిచెట్టుక్రింద కూర్చుని తన ఇష్టదైవాన్ని
ఉపాసిస్తూ ఉండగా...

మట్టాకు ఒకటి రాలి ఆ నీటిలో పడి...
సగం మునిగింది...సగం తేలింది...
మునిగిన సగం చేప అయ్యింది...
తేలిన సగం పిట్ట అయ్యింది...
చేప క్రిందకు గుంజుతోంది...
పిట్ట పైకి లాగుతోంది...
ఆ నత్కీరుడు తన మానాన తాను ఉపాసన చేసుకోక...
ఈ విచిత్రసన్నివేశాన్ని ఆసక్తిగా తిలకించాడు...
అంతే...ఓ బ్రహ్మరాక్షసి తీసుకెళ్లి  ఓ కొండగుహలో బంధించింది...
అప్పటికే అక్కడ ఇలాంటి యోగభ్రష్టులు 99 మంది ఉన్నారు...
నత్కీరునితో కలిపి వందమంది...
ఆ బ్రహ్మరాక్షసికి 100 మంది యోగభ్రష్టులు ఉంటేగాని భోజనం సిద్ధమైనట్టు కాదు...

మిగతా 99 మంది నత్కీరుణ్ణి తిట్టడం మొదలుపెట్టారు...
నీవొక్కడు దొరకడం వలన మేమందరం ఆ రాక్షసికి ఆహారం ఐపోతున్నామని...

తన ఇష్టదైవమైన సుబ్రహ్మణ్యుని ప్రార్థించగా...
సుబ్రహ్మణ్యుడు నిజరూపంతో ప్రత్యక్షమై తన శక్త్యాయుధంతో ఆ రాక్షసిని హతమార్చి యోగభ్రష్టులందరికీ బంధవిముక్తులను చేస్తాడు.

నత్కీరా...! నీకీ దుస్థితి ఏమి? అని స్వామి ప్రశ్నించగా...
పాండ్యరాజసభలో జరిగిన విషయాన్ని వివరించి చెబుతాడు నత్కీరుడు...

ఈ వ్యాధి బాధతో కైలాసానికి నేనెప్పటికి చేరుకోను? అని వాపోతాడు స్వామితో...

నత్కీరా! మా తండ్రిగారు "కైలాసం" అన్నాడేగాని,
ఉత్తరకైలాసమా? దక్షిణకైలాసమా? అని చెప్పలేదు కదా!

ఉత్తర కైలాసం - కేదార్ నాథ్.
దక్షిణ కైలాసం - శ్రీకాళహస్తి.

నీవు తక్షణం శ్రీకాళహస్తికి చేరుకో...
అని అంతర్ధానమౌతాడు స్వామి.

నత్కీరుడు శ్రమ తగ్గినందుకు సంతోషించి...
వడివడిగా నడుచుకుంటూ శ్రీకాళహస్తికి చేరుకుంటాడు...

పరమ పవిత్రమైన సువర్ణముఖరీ నదీ జలాలలో మునిగి లేవగానే తన వ్యాధి నయమైంది.

అనిలాచలేశ్వరుణ్ణి, జ్ఞానప్రసూనాంబికను కనులారా దర్శించి...

జ్ఞానసిద్ధి పొంది..."సిద్ధులయ్య" అయ్యాడు....

తన జీవితం అంత్యం వఱకు శ్రీకాళహస్తిలోనే గడిపి...

అనిలాచల పర్వతం మీదనే జీవసమాధి అయ్యారు...

అదే "సిద్ధులయ్య గుడి"గా ఇక్కడ వ్యవహారంలో ఉంది...

ప్రతియేటా ఉత్సవాలు చేస్తారు...

శ్రీకాళహస్తి, భేరివారి మండపం, కొండమిట్ట వీధి నుంచి...సిద్ధులయ్య గుడికి చేరుకోవచ్చును...

నేను 1-1-1991 * మంగళవారం నాడు
సిద్ధులయ్య గుడిని (నత్కీరుని జీవసమాధిని)
దర్శించి ధన్యుడనయ్యాను....

* * *

జ్ఞానశిశువు
9533667918

141. గ్రంథం: నా గురువు

రచన: జ్ఞానశిశువు

---

తాళం చెవి

---

23-7-2022 * ఆడికృత్తిక.

ఈరోజు ఆడికృత్తిక.
ద్రవిడదేశంలో విశేషంగా జరుపుకునే పండుగ.
ద్రవిడదేశానికి హద్దు శ్రీకాళహస్తి అనిపిస్తుంది.
యెందుకంటే  శ్రీకాళహస్తిని దాటక ఇక ఏ ప్రాంతం వాళ్లూ ఈ పండుగను జరుపుకోరు.

శ్రీకాళహస్తి విజ్ఞానగిరిపై వెలసి ఉన్న కుమారస్వామికి గొప్పగా ఉత్సవాలు చేస్తారు ఈ మూడురోజులు.

గుడికెళదాం రా...అంది మా ఆవిడ ఉదయాన్నే.

మా స్నేహితుడు దేవీప్రసాద్ తో కలసి 5.46 కు కేరళా అంగట్లో టీ త్రాగడం అనే ముఖ్య కార్యక్రమం ఉండటం వలన- 'నేను రావడం లేదు నువ్వెళ్లి రా...' అన్నాను.

కేరళా టీ షాప్ కు  ఎదురుగానే కుమారస్వామి గుడి ఉంది.
నేను, దేవీప్రసాద్ ఇద్దరమూ ముందుగా స్వామి దర్శనం చేసుకుని వచ్చి టీ ఆర్డర్ ఇచ్చాం.
స్వామిని చూస్తూ...టీ త్రాగుతూ... దేవీప్రసాద్ తో ఓ మాటన్నాను-

నేను పొందిన ఆధ్యాత్మిక దర్శనం ఏమంటే....

అని, కాస్త ఆగాను...
కాస్త టీ సిప్ చేశాను...

నేను ఏం చెబుతానా...అని దేవీప్రసాద్ ఆసక్తిగా టీ సిప్ చేయడం ఆపి,  నా వైపు చూస్తున్నాడు...

"అసలేమీ జరగడం లేదు...." అన్నాను నిశ్చయంగా...

"అవును..." అన్నాడు నిర్లిప్తంగా...

నిజంగా ఇది నాకు జ్ఞానఅష్టాక్షరీ మహా మంత్రం-

ఏ-మీ-జ-ర-గ-డం-లే-దు

ఏమీ జరక్కపోయినా...
ఏదో జరుగుతున్నట్టు అనిపించడమే మహామాయ.

జరిగేది, జరగనిది రెండూ ఒక బిందువులోనే ఉన్నాయి.
అదే తమాషా.

చలన చిత్రము, అచల వస్త్రము(తెర)
రెండూ ఒకే బిందువులో ఉన్నాయి.

అందుకే మన గురుదేవులు అంటారు-
సినిమా చూడకు...తెరను చూడు...అని.

ఎగసిపడే కెరటము, గంభీర సముద్రము
రెండూ ఒకే బిందువులో ఉన్నాయి.

అందుకే వివేకానందులు అంటారు-
అలను గమనించకు...సముద్రాన్ని గమనించు...అని.

ఎన్నిసార్లు సినిమాలో లీనమై, తెరను మరిచానో...!
అన్నిసార్లూ నా దృష్టిని తెర వైపుకు మళ్లించారు నా గురువు.

జ్ఞానాంబ(సద్గురు) అనుగ్రహం వలన-
నేను తెరను చూడడం కాదు,
నేనే తెరగా మారిపోయాను.

'బాబు' ఇప్పుడు నాలో కదిలే ఓ నీడ...అంతే.

* * *

సద్గురు సన్నిధికి వెళ్లాం...
గురువుగారు గుండు గీయించుకుంటున్నారు...

బయట మామిడి చెట్లక్రింద చెంగల్వరాయరెడ్డితో పిచ్చాపాటి
మాట్లాడుతుండగా- పనిమనిషి లక్ష్మి వేడివేడిగా కప్పులో టీ తీసుకొచ్చింది.

ఇంతలో గురువుగారు స్నానం చేసుకుని వచ్చారు.
విబూధి, తీర్థం తీసుకొని మౌనంగా అరగంట గడిపి, శెలవుతీసుకున్నాం.

గురువుగారు ఏమీ చెప్పడం లేదన్న లోటేమీ లేదు.

హృదయకుహరమధ్యే కేవలం బ్రహ్మమాత్రం
హ్యాహ మహమితి సాక్షాదాత్మ రూపేణభాతి...
అన్నారు రమణులు.

హృదయకుహరమధ్యాన అద్వితీయుడైన పరమేశ్వరుడు నేను-నేను
అంటూ ఆత్మరూపంగా ప్రకాశిస్తున్నాడు....

ఆ హృదయగుహను తెరచే తాళంచెవులు(జ్ఞానప్రసూనాలు) కొన్ని వేలు
ప్రసాదించారు గురువుగారు...

మనకు మనమే తెరవాలి.
మనకై ఎవరూ తెరవరు.

'జ్ఞానప్రసూనాలు' గ్రంథంలోని ప్రతి సూక్తీ ఓ తాళం చెవి లాంటిదే.

తాళంచెవుల సేకరణలోనే కాలాన్ని గడిపేయకుండా,
తాళంకప్పను తెరచే పని ముఖ్యం కావాలిప్పుడు.
క్షణంలో సమస్య తెగుతుంది.
సత్యం బట్టబయలు అవుతుంది.

గురువుగారు జ్ఞానవాక్యాన్ని పలికిన ప్రతిసారీ
'ఆహా! ఈ ఒక్కవాక్యం చాలు...తరించడానికి' అంటుంటాం.

కానీ తాళంకప్పను మాత్రం తెరవం.

తాళంకప్పను తెరచే ఉద్దేశం నిజంగా తనకు ఉంటే-
ఒక్కవాక్యం చాలు...ఒక్క క్షణం చాలు...

ఒక్క సంకీర్తనైనా చాలు... నన్ను ఒద్దిక రక్షింపగ...
తక్కినవన్నీ భండారాన దాగి ఉండనీ...అంటాడు అన్నమయ్య.

నేను ఉపయోగించిన తాళం చెవి ఇదే-

'అసలేమీ జరగడం లేదు' అనేదే.

దీంతో నేను తత్త్వదర్శనం పొందాను...

మాటలన్నీ మౌనం దాల్చిన చోటులో
చలనాలన్నీ అచలంగా మారిన చోటులో
తలపులన్నీ స్వరూపంగా వెలిగే చోటులో
నేను ఉన్నాను జ్ఞానంగా ఆనందంగా...

* * *

142. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

నేతి - నేతి

---

31-7-2022 * ఆదివారం
ఈరోజు ఉదయాన్నే నేనూ దేవీప్రసాద్ గురుసన్నిధికెళ్లాం...

అలా గురుసన్నిధిలో కూర్చోగానే...
గురుసేవకురాలు సునీతగారు టీ తీసుకొచ్చి ఇచ్చారు..

అరుణాచలం నుండి రాజా అనే అతను వచ్చి ఉన్నారు...
వారు మంచి అనువాద రచయిత...
David Godmen గారు ఆంగ్లంలో వ్రాసిన అన్నామలైస్వామి జీవిత చరిత్రను వారు తెలుగులోకి అనువదించారు.
ప్రస్తుతం నిసర్గదత్తగారి 'Iam That' అనే ఆంగ్ల పుస్తకాన్ని తెలుగులోకి వ్రాస్తున్నారు...

రాజా-సద్గురు మధ్య సంభాషణ కొనసాగుతోంది...
కానీ దేవీప్రసాదుకు ఒక వివాహకార్యక్రమానికి హాజరవ్వాల్సి ఉండడం వలన అక్కడ ఎక్కువ సమయం గడపలేకపోయాం...

ఉన్నంతలో జరిగిన సబ్జక్టును వ్రాస్తున్నాను...

1. 'ఇది కాదు' అని ఉంటే చాలు అది అదిగానే ఉంటుంది.
చెత్తను ఊడ్చేస్తే చాలు. శుభ్రత అనేది అక్కడే ఉన్నట్టుగా.
ఋషులు చెప్పిన 'నేతి-నేతి' ఇదే.

2. మెలకువ వచ్చినప్పటి నుంచి మెలకువ పోయేవరకు మధ్యలో 'అది దొరకదు' అన్న నిశ్చయజ్ఞానం వలన కలిగిన నిశ్చింత రమణునిది.

కానీ వారికేదో దొరికేసిందని జనం వారి చుట్టూ గుమికూడారు.

3. ఉన్నాను - ఉన్నాను

మొదటి ఉన్నాను - నామవాచకం.
రెండవ ఉన్నాను - క్రియావాచకం.

4. 'తెలుసుకోవడం' వలన లాభమూ లేదు,
'తెలియకపోవడం' వలన నష్టమూ లేదు'.

ప్రపంచమనే క్లబ్బులో జరిగే ఆటే జీవితం.
క్లబ్బులోకి ఉత్తచేతులతో ప్రవేశిస్తాం.
పెట్టుబడి వారే ఇస్తారు...
ఆటలో లాభనష్టాలు కలుగుతాయి...
చివరికి ఉత్తచేతులతోనే బయటకు రావాలి...

5. 'లాభం లేదు' అని తెలియటమే లాభం...అన్నాను.
అందరూ నవ్వుకున్నారు...

6. తనకు తెలిసిందాంతో తృప్తిపడడు.
తనకు తెలుసు అన్న విషయం ఇతరులు తెలుసుకోవాలన్న దుగ్ధ ఉండడం వల్లనే
ప్రవచనాలు చెబుతారు.

7. నీవు నెత్తిన మోస్తున్న గ్రంథాలన్నింటినీ క్రిందపడవేయడమే ఆ గ్రంథాల సారం.
కానీ నీవు చేస్తున్న పని ఏమంటే-

'బరువు తగ్గించుకోవడం ఎలా? అనే గ్రంథాన్ని నెత్తిన బెట్టుకుని బరువును పెంచుకుంటున్నావు.

* * *

143. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

విశిష్ట వాశిష్ఠం

---

మా వీధిలో మునెయ్యస్వామి అనే ఓ బ్రహ్మచారి ఉండేవాడు.

రమణులు జీవించి ఉండగా  ప్రత్యక్షదర్శనం చేసుకున్నవాడు.
ఆ కారణం చేత అతనితో ప్రతిరోజూ కాసేపు గడిపేవాణ్ణి.

వివాహం చేసుకోవడానికి తీరిక లేనంతగా ఆధ్యాత్మికాన్వేషణ చేసినవాడు...

ఈ ఆధ్యాత్మికంలో సాధించింది ఏమీలేదని చివర్లో నాతో వాపోయాడు.

ఆస్తిపాస్తులు ఉన్నాయిగానీ, తరువాత వాటిని అందిపుచ్చుకోవడానికి వారసులు లేరనే ఆలోచన వలన కావొచ్చు...

వృద్ధాప్యంలో భరించరాని ఒంటరితనం వలన కలిగిన నైరాశ్యం వలన కావొచ్చు...

"వివాహం చేసుకొని ఉండవలసింది..."  అన్నాడు విచారంతో...

ఆ మాట అతని ఆధ్యాత్మిక అపజయాన్ని తెలియజేసింది...

భ్రష్టయోగిలా కనబడ్డాడు నాకు...

అతని వద్ద వందలకొద్ది ఆధ్యాత్మికగ్రంథాలు ఉండేవి...

అందులో వెన్నెలకంటి సుందరరామశర్మ గారు రచించిన 'జ్ఞానవాశిష్ఠం' ఉండేది.

ఓరోజు గురువుగారు వారిని అడిగి ఆ గ్రంథం తీసుకొచ్చారు...

మా వీధిలో ఉన్న శ్రీరామమందిరం వరండాలో కూర్చొని చదువుతూ ఉండేవారు...

మేం వెళ్లి వారి సన్నిధిలో కూర్చున్నప్పుడు...
ఆ గ్రంథం యొక్క గొప్పతనం గుఱించి చెప్పేవారు...
అందులో మంచి మంచి ఘట్టాలను చదివి వినిపించేవారు...
సూక్ష్మవిషయాలను విడమరచి చెప్పేవారు...

అందులోని తెలుగుభాష చాలా సుందరంగా తోచింది.
పైగా రచయిత వెన్నెలకంటి సుందరరామశర్మగారు పుట్టుగ్రుడ్డివారై వుండి మనకు జ్ఞాననేత్రాన్ని తెరిపించారు.
మొత్తానికి చాలా అద్భుతం అనిపించింది ఆ గ్రంథం.

ఎలాగైనా ఆ గ్రంథాన్ని పొందాలని, ఆ పుస్తకంలో ఉన్న చిరునామాకు...అనగా పుస్తకప్రచురణ సంస్థ అయిన వావిళ్ల ప్రెస్(చెన్నై) వారికి ఉత్తరంవ్రాశాను...

వారు వెంటనే తిరుగు జాబు వ్రాశారు...
కాపీలు లేవు...మీకు కావాలంటే జెరాక్స్ చేసి పంపుతాము...300 రూపాయిలు ఖర్చు అవుతుంది అని...

వెంటనే 300 రూపాయిలను మనీ ఆర్డర్ చేశాను.
ఓ వారంలో జ్ఞానవాశిష్టం జెరాక్స్ కాపీ నా చేతికి అందింది.

నా ఆనందానికి అవధులు లేవు....

సాక్షాత్తు పరబ్రహ్మమే నా చేతిలోకి చేరినట్టు అనుభూతి కలిగింది.

ఆ గ్రంధాన్ని కళ్లకద్దుకున్నాను...
నా గుండెలకు హత్తుకున్నాను...

నాకు అంతకన్నా ప్రియమైన వస్తువు అప్పుడు, ఇప్పుడు ఉండలేదు, ఇక ఉండబోదు.

నా ఆధ్యాత్మిక జీవితమనే భవనానికి
మూలస్తంభం ఆ గ్రంథం.

'ఎందుకు?' అనే నా ప్రశ్నకు పలురకాలుగా సమాధానమిచ్చింది ఆ గ్రంథం.

'ద్రష్ట లేక దృశ్యము సున్న' అని నన్ను ద్రష్టలో
నిలబెట్టింది ఆ గ్రంథం.

అన్నిటినీ తెలుసుకునే తనను తెలియదనుట హాస్యాస్పదం...
అని నన్ను ఎగతాళి చేసింది ఆ గ్రంథం.

జన్మపరంపరలనేవి స్వప్నసమానమని
తెలియజేసింది ఆ గ్రంథం.

జన్మలు-కర్మలు ఈశ్వర నియతి అని
తేటతెల్లం చేసింది ఆ గ్రంథం

గ్రంథరూపంలో ఉన్న దేవుడు ఆ గ్రంథం.
గురువు లేనివారికి గురువు ఆ గ్రంథం.
చిక్కడగ్రంథిని సుళువుగా విప్పేది ఆ గ్రంథం.
జీవితానికి అర్థం పరమార్థం చేకూర్చేది ఆ గ్రంథం.

ఆ గ్రంథం లేని ఇల్లు నరకం.
ఆ గ్రంథం ఉన్న ఇల్లు స్వర్గం.

ఈ మానవలోకానికి వాల్మీకి ప్రసాదించిన
అద్భుతమైన కానుక ఈ వాశిష్ఠరామాయణం.

అర్థం అయినా అవకపోయినా
ఒక్కసారి చదివినా వినినా మోక్షం తథ్యం అని
ప్రతిజ్ఞావాక్యం ఉన్న గ్రంథం ఈ వాశిష్ఠరామాయణం.

అందులోని ప్రతి వాక్యమూ బ్రహ్మపదార్థమే.

సత్సంగంలో గురుసన్నిధిలో ఆ దివ్యగ్రంథాన్ని చాలాకాలంపాటు
నిత్యపారాయణం చేశాం శిష్యులం.
ప్రతిరోజూ రెండుమూడు పేజీలు మాత్రమే చదివేవాళ్లం...తరువాత దానిని
గురించి విడమరిచి చెప్పేవారు గురువుగారు...

ఆ రోజులన్నీ అదో అద్భుతంగా ఉండేవి...

ఆ సమయంలో గురువుగారు అన్నమాట గుర్తుకు వస్తోంది-
వాశిష్ఠాన్ని నోటితో మీరు గట్టిగా చదవడం వలన మీకు వాక్శుద్ధి కలిగింది...
మాట్లాడేటప్పుడు జాగ్రత్తగా మాట్లాడండి...మీరు ఏది అంటే అది
జరిగిపోతుంది...పరిహాసానికి కూడా అమంగకరమైన మాటను
పలకకండి...
అన్నారు.
* * *
వాశిష్ఠానికి సంబంధించి నేను చదివిన గ్రంథములు-

1.జ్ఞానవాశిష్ఠం - వెన్నెలకంటి సుందరరామశర్మ
2.యోగవాశిష్ఠం - సముద్రాల లక్ష్మణయ్య
3.వశిష్ఠ రామ సంవాదం - శ్రీరామకృష్ణమఠం
4.యోగవాశిష్ఠహృదయం - కుప్పా వేంకటకృష్ణమూర్తి.
5.యోగవాశిష్ఠసారం - వేంకటేశానంద.
* * *
శివానంద స్వామి వారి శిష్యులైన వేంకటేశానందగారు రచించిన
యోగవాశిష్ఠసారం అనే గ్రంధాన్ని రమణజయంతి రోజున రమణాశ్రమం
వారు ఉచితంగా భక్తులకు అందజేశారు...మిత్రులు బుక్ స్టాల్ రత్నంగారు
నాకు ఒక కాపీ ఇచ్చారు...
ఆ రోజు నుంచి ఈ రోజు వరకు ప్రతినిత్యం ఆ గ్రంథాన్ని పారాయణం
చేస్తున్నాను...
అందులోంచి ఓ 108 ఏరి 'వాశిష్ఠమాల'గా
తయారుచేశాను...ధరించండి...తరించండి...

---

వాశిష్ఠమాల

---

1. నాకు బంధం ఉంది, ముక్తి పొందాలి
అని తలచేవాడే ఈ వాశిష్ఠం చదవడానికి అధికారి.
జ్ఞానికిగాని, అజ్ఞానికిగాని అధికారం లేదు.

2. దేని నుండి ఈ సమస్తమూ పుట్టి, ఉండి, చివరికి అందులోనే లయం అయిపోతోందో ఆ పరబ్రహ్మకు నమస్కారము.

3.ఏ మహానంద సాగరం నుండి పుట్టిన విషయానందమనే బిందువులు సమస్త జీవులలో ప్రకాశించుచున్నదో, ఏది సమస్త జీవులకు జీవనమో, ఆ బ్రహ్మానందస్వరూపుడైన పరబ్రహ్మకు నమస్కారము.

4. పక్షి ఆకాశంలో ఎగరడానికి రెండు రెక్కలూ అవసరమైనట్లు, ముక్తి పొందడానికి కర్మ-జ్ఞానములు రెండూ అవసరమే.

5. ఆత్మ సృజింపబడలేదు.
ఆత్మ దేనినీ సృజించలేదు.

6. జీవుడన్నది నామమాత్రమే.
ఉన్నది బ్రహ్మమే.

7. భగవంతుడు సర్వశక్తిమంతుడు.
కనుక ఆయన ఆలోచనారూపములు మూర్తిమంతములగును.

8.లెక్కింప సాధ్యముగాని ఈ నామరూపములన్నియు
సమస్తమూ చైతన్యమే.

9. జీవుడు, మనస్సు మొదలయినవి అన్నియు చైతన్యమునందలి స్పందనలే.

10. మనము కలవరపాటుకు అతీతులము.

11. మార్పులు లేనిదానిలో మార్పులు చూడడమే అజ్ఞానము.

12. కలలోని వస్తువులు ఘనంగా కనబడ్డా వాటిలో భౌతికత్వం లేనట్లు, ప్రపంచం భౌతికంగా కనబడ్డా నిజంగా ఇది శుద్ధచైతన్యమే.

13. నిజానికి ప్రపంచము, బ్రహ్మము, ఆత్మ అను పదముల అర్థములలో భేదమే లేదు.

14. సృష్టికర్తయగు బ్రహ్మ నుండి గడ్డిపోచ వఱకు
ఈ సమస్తమూ ఆత్మయే తప్ప వేరేదియు గాదు.

15.జల్లెడను ఎన్నటికీ నీటితో నింపజాలము.
వ్యక్తి ప్రాపంచిక వస్తువులను ఎంతగా సమకూర్చుకొన్నప్పటికి మనస్సు ఎప్పటికి కృతార్థము కాజాలదు.

16. శకమునకు క్షణమునకు మధ్య తాత్త్వికంగా ఎట్టి భేదము లేదు.

17. ఆసక్తి లేని వ్యక్తియే నిజమైన జీవన్ముక్తుడు.

18. స్రష్టలోని స్పందనమే సృష్టి.

19. వైరాగ్యం అనేది విసుగు వలన కలిగేది కాదు.
వివేకం వలన కలిగేది నిజమైన వైరాగ్యం.

20. ఈ ప్రపంచమొక క్రీడారంగము.

21. దారుణమైన ఈ సంసారసాగరమును దాటుటకై
మానవుడు శాశ్వతము, అవ్యయమునయిన దానిని ఆశ్రయింపవలెను.

22. అవిచ్ఛినమైన ఆత్మవిచారణ వల్లనే
ఆత్మసాక్షాత్కారం కలుగును.

23. ఆత్మవిచారము అంటే తనలోకి తాను సూటిగా చూడడమే.

24. మనస్సు అనంతమైన ఆత్మకంటె భిన్నమూ కాదు,
దానికి స్వతంత్రమైన అస్తిత్వము లేదు.

25. ద్రష్టలోనిదే దృశ్యము.

26. స్రష్టకు భౌతిక దేహం లేదు.
సృష్టి కూడా భౌతికత్వము లేని
భావనా స్వభావము కలదే.

27. స్రష్ట ఆత్మరూపుడు, అదేవిధముగా ఆయన సృష్టి కూడ నిజముగా తాత్త్వికముగా ఆత్మమయమే.

28. భావన మనస్సులో అంతర్గతముగా ఉండును.
దృశ్యవిషయము ద్రష్టలో అంతర్గతముగా ఉండును.

29. బాహ్యముగా సామాన్యజీవితమును గడుపుచు ప్రపంచమంతయు శూన్యమని అనుభవగోచరము గావించుకొన్న వ్యక్తి జీవన్ముక్తుడు. ఆయన జాగ్రదవస్థలో ఉన్నప్పటికీ గాఢనిద్రా ప్రశాంతిని అనుభవించును. కష్ట-సుఖములు కొంచెముగా గూడ అతనిపై తమ ప్రభావము చూపవు.

30. శిలలో చెక్కని ప్రతిమ సర్వదా ఉన్నట్లే
ప్రపంచము కూడా అఖండతత్త్వములో అంతర్గతముగా ఉన్నది.

31. ఏక కాలంలో సమత్వము-స్పందనము పరమాత్మయందున్నవి.

32. ఏదియు ఎప్పుడును సృజింపబడి యుండలేదు.

33. కారణము-కార్యము అనునవి కేవలము శబ్దములేగాని సత్యములు కావు.

34. సదా ఆత్మ విషయమై ఆసక్తితో ఉండుటయే అభ్యాసము.

35. చైతన్యము యొక్క స్వభావము వలన ఈ లోకములన్నియు మాటిమాటికి ఆవిర్భవించుచునే యుండును. మరియు తిరిగి తమ సంకల్పశక్తి వలన ప్రశాంతస్థితికి తిరిగి వచ్చును. ఇది బాలుని యాదృచ్ఛిక క్రీడ వంటిది.

36. నీ చైతన్యమే తపస్సుగా లేక దేవతగా అయి స్వతంత్రముగా ఫలమునిచ్చును.

37. ఒక్క అనంతచైతన్యము తప్ప ఏదియు ఎప్పుడు ఆవిర్భవించి ఉండలేదు. దీనిని దృఢముగా విశ్వసింపుము.

38. జ్ఞాని దేహము దృశ్యమైనదిగా కనిపించినప్పటికి, నిజముగా అది అదృశ్యము, ఆకాశమయము.

39. కంకణమునకు బంగారమునకు మధ్య
తరంగములకు జలమునకు మధ్య
విభాగము లేనట్లే
ప్రపంచమునకు అనంతచైతన్యమునకు మధ్య భేదము లేదు.

40. ఈ నియతికి రెండు దశలున్నవి-
మానుషము,అతిమానుషము.

41. జ్ఞాని సంపర్కము వలన చుట్టూ ఉన్న గాలి, ధూళికణములు సైతం మోక్షమును పొందును.

42. ఆత్మ నూరుప్రయత్నములతో పొందదగినది.
అయినను అది పొందబడినను ఏదియు పొందబడినట్లు కాదు(అనగా అది ముందే ఉన్నది).

43.తండ్రి లేకుండా కొడుకు ఉండనట్లే
ద్రష్ట లేకుండా దృశ్యము లేదు.

44. దేవా! విశ్వసృష్టి నిశ్చితముగా నీకు ఉద్దేశరహితమైన వినోదము.

45. మనస్సే దేహమునకు బీజము.

46. ఇది అంతయు బ్రహ్మమే కనుక
జడము కూడ శుద్ధచైతన్యమే.

47. సమస్తము అవిభక్త స్థితిలోనున్నది.

48. వ్యక్తిగతమైన చైతన్యమే మనస్సు.
జ్ఞాని మనస్సు అఖండబ్రహ్మము.

49.ఆత్మలో విభాగము లేదు.
ఏలనగా ఇది అంతయు అఖండబ్రహ్మమే.

50. "ఒకడే" ఉన్నప్పుడు ఎవడు దేనిని ఎట్లు చేయును?

51. అపరిచ్ఛిన్నమగు ఆత్మలో స్రష్ట లేడు, సృష్టి లేదు, లోకములు లేవు, స్వర్గము లేదు, మానవులు లేరు, రాక్షసులు లేరు, దేహములు లేవు, భూతములు లేవు, కాలము లేదు, స్థితి లేదు, సంహారము లేదు.

52. ద్రష్ట-దర్శనం-దృశ్యం అను వాని మధ్య గల విభాగమును
విసర్జించినప్పుడు పరబ్రహ్మ మొక్కటే ఉండును.

53. కుండ పగిలినప్పుడు దానిలోని ఆకాశం పగులదు.
వ్యక్తి మరణించినప్పుడు వానిలోని ఆత్మ నశించదు.

54. ప్రపంచ-బ్రహ్మముల మధ్య కార్య-కారణ సంబంధముండునని ఊహించుట వట్టి మూర్ఖత్వము. బ్రహ్మము మాత్రమే ఉన్నదనియు, ప్రపంచముగా కనుపించునది ఆ బ్రహ్మమే అనియు అన్నది సత్యము.

55. దృశ్యము జ్ఞానికి బ్రహ్మముగాను, అజ్ఞానికి ప్రపంచముగాను అగుపించును.

56. భోజనం భుజించు వ్యక్తిని పొందును.

57. ప్రపంచము పరమేశ్వరుని అనంతశక్తుల యొక్క ఆవిర్భావమే.

58. ఆత్మ ఒక్కటే సర్వకాలములయందుండును. ఆత్మయే ప్రపంచము, ఆత్మయే కాలము, పరిణామక్రమము కూడా.

59. ఏమియు లేనివానికి ఈ ఆత్మజ్ఞానమొక్కటి ఉన్నచో సమస్తము ఉన్నట్లే.

60. ఈ ఆత్మ మాత్రమే కోరదగినది, ఆరాధింపదగినది, ధ్యానింపదగినది.

61. ఆత్మకు వెలుపల ఏదియు లేదు.

62. రామా! నీవు చైతన్యసాగరరూపుడవు.
అందు రాముడను వ్యక్తి ఒక తరంగము.

63. అంతర్గతమయిన శుద్ధ చైతన్యము యొక్క
ఎడతెగని ఎఱుకయే ఉత్తమ ధ్యానము, ఉత్తమపూజ.

64. ప్రతి జీవాణువునందును ఆత్మాచ్ఛాదన-ఆత్మజ్ఞానములను ఈ నాటకము ఎల్లప్పుడు అభినయింపబడుచుండును.

65. ఆ చైతన్యమే ప్రకృతిలో వస్తువులుగాను
వ్యక్తిలో ఇంద్రియములుగాను అగుపించును.

66. నీవు ఎట్టి సుఖ-దుఃఖములకు గురి అయినను సహింపుము. అవి వచ్చును, పోవును.

67. సృష్టిలో కనిపించు ఖండవిధానము మనస్సు యొక్క స్వీయచిత్రణమే.

68. శుద్ధాకాశములో చర్య(కర్మ) లేక చలనము లేదు.

69. 'చిత్' యొక్క చమత్కారమే ప్రపంచముగా భాసించుచున్నది.

70. వాస్తవముగా దేవతల దర్శనము స్వప్నము కంటె అభిన్నము.

71. ఆ చైతన్యము యొక్క ప్రథమభావనావిర్భావమే జీవుడు.

72. నేను క్రీడార్థము ప్రపంచమున సంచరింతును. ఏల అనగా, ఎవని నుండియు పొందవలసినది ఏదియు నాకు లేదు.

73. నిరర్థకమైన ఈ తపస్సులలోను, ఇతర క్రియలలోను నీవు నీ జీవితమును ఎందుకు వ్యర్థము చేయుచున్నావు?

మహాత్ముల సాంగత్యమునాశ్రయించుట వలనను నీవాత్మజ్ఞానమును పొందెదవు.

74. ఆచారముల వలన, శాస్త్ర విధుల వలన గాక జ్ఞానుల ఆరాధన వలన మాత్రమే వ్యక్తి జ్ఞానమును పొందును.

75. చిత్తపరిత్యాగమే సర్వపరిత్యాగము.

76. 'నేను' అను సంకల్పమే బంధమును కలిగించును.
'నేను లేను' అను సంకల్పమే మోక్షమును కలిగించును.

77. అనిబద్ధములో(నిబంధన రహితములో) ఉండుము.

78. బ్రహ్మమే ఈ సమస్తముగా ఇక్కడ అభివ్యక్తమయినది. దానికి వేఱుగా ఏదియు లేదు. అందువలన బంధ-మోక్ష భావనలను గూడ పరిత్యజింపుము.
సహజకార్యనిమగ్నుడవయి శుద్ధమయిన నిరహంకారదశలోనుండుము.

79. నీ సందేహములన్నింటిని వదిలివేయుము.
ధార్మికధైర్యమునాశ్రయింపుము.
మహాకర్తగా, మహాభోక్తగా, మహాత్యాగిగా ఉండుము.

80. ఈశ్వరుడు ఈ ప్రపంచదృశ్యమునందు క్రీడించి పిదప దానిని తనలోనికి ఉపసంహరించును. సృజించి బంధమును కలిగించు శక్తియే సృష్టిని లయింపజేసి మోక్షమును కలిగించు శక్తిగా ఉండును.

81. అంతర్గతముగా సమస్తమును పరిత్యజింపుము. బాహ్యాముగా యుక్త కార్యములో నిమగ్నుడవగుము.

82. నిర్మలమయిన అంతర్దృష్టియే జ్ఞానలక్షణం.

83. సగము మేల్కొన్న పసిబిడ్డవలె ఆత్మలో నెలకొని యుండుము.

84.ఉన్నది నశింపజాలదు.
లేనిది ఉండజాలదు.

85. నేను సమాధానము చెప్పజాలక మౌనం వహింపలేదు,
మౌనము మాత్రమే సమాధానము కనుక మౌనము వహించితిని.

86. వ్యక్తి సజీవుడుగా నున్నప్పటికి మృతని వలె ప్రవర్తించుదానిని సర్వోత్తమదశ అందురు.

87. విషయం 'విషయి' లోనిదే.
దృశ్యం 'ద్రష్టలోనిదే.

88. వందల కొలది ప్రతిబింబములున్నను అద్దము నిర్వికారముగా నుండునట్లు ఎన్నో లోకములు తనలో ఆవిర్భవించుచున్నను పరమాత్మ నిర్వికారముగా ప్రశాంతముగానుండును.

89. సహజమైన నీ అన్ని కర్మాలతోను, అనుభవములతోను, నీ జ్ఞానముతో గూడ పరమేశ్వరుడగు ఆత్మను ఆరాధింపుము.

90. సమాధిలో నెలకొన్న వ్యక్తి మానవరూపంలోనున్న బ్రహ్మమే.

91. ఈ విశ్వము, నీవు, నీ స్వప్నంలో జూచునదంతయు గూడ బ్రహ్మమే అనునదే సత్యము.

92. ప్రపంచము పరమాత్మ యొక్క స్వప్నము.

93. అపరిచ్ఛిన్న చైతన్యము ఎక్కడ ఏ రూపమున అగుపించవలెనని సంకల్పించుకొనునో అది ఆ విధముగా తన నిజస్వభావమును ఆ రూపములో తనకిష్టమయినంత కాలము అనుభవించును.

94. ఈ అపరిచ్ఛిన్న చైతన్యము ఎప్పుడును తన యధార్థస్థితిని విడువకుండా 'నేను జీవుడను' అని తలంచుట నిజముగా గొప్ప

అద్భుతము.

95. మనస్సే సృష్టికర్తయగు బ్రహ్మ.

96. తత్త్వవేత్త వ్యవహార నిమగ్నుడయినను మౌనమునాశ్రయించి ఆకాశము వలె అసంగుడయి మూగవానివలెనుండును.

97. స్వప్నములలో నిర్దిష్టమైన క్రమముగానీ, వ్యవస్థగానీ, కార్యకారణ సంబంధముగానీ లేనట్లే, ఈ ప్రపంచదృశ్యములో గూడ నిర్దిష్టమయిన కార్యకారణ భావము లేక క్రమము ఉన్నట్లు అగుపించినను అట్టిదేదియులేదు.

98. ఆ పురుషుడు స్రష్ట అనియు, విశ్వము సృష్టింపబడినది అనియు భావించుట అసంగతము. ఒక దీపము మరియొక దీపముతో వెలిగింపబడినప్పుడు వాని మధ్య స్రష్ట-సృష్టి అను సంబంధము లేదు. అగ్ని ఏకమే.

99. ఈ భ్రాంతి ఏ కారణము వలన వచ్చినది?
అను ప్రశ్న ఇక్కడ సముచితం కాదు. ఏల అనగా ఉన్నదానిని విచారించుట వలన లాభము కల్గునుగానీ లేనిదానిని విచారించుటవలన లాభము కలుగదు. భ్రాంతికి మూలమయిన లేని అజ్ఞానమును విచారించుట వ్యర్థమని సారాంశము.

100.ఆకాశము ఆకాశముగా ఆకాశములో నుండునట్లే
బ్రహ్మము బ్రహ్మముగా బ్రహ్మములో నుండును.

101. ఈ సృష్టి అనునది అవిభాజ్యమగు బ్రహ్మమే.

102. ధనార్జనకై వంటచెరకును సేకరించుటలో నిమగ్నుడయిన వానికి చింతామణి లభించినట్లు
తమ అవసరములను నెరవేర్చుకొనుటకై గురువును, శాస్త్రములను ఆశ్రయింతురు. అయినను కాలక్రమమున గురు, శాస్త్రముల ఉపదేశములను అనుష్ఠించుటవలన వారు ఎక్కువ విలువగల ఒకానొక విషయమును(మోక్షమును) సాధింతురు.

103. బ్రహ్మము సర్వశక్తి సంపన్నము.

104. ఈ బ్రహ్మము యొక్క అభివ్యక్తికి హద్దు ఏదియు లేదు.

105. ఈ అఖండబ్రహ్మము సర్వశక్తిసంపన్నుడగుట వలన అపరిచ్ఛిన్న శక్తులు ఈ దృశ్యప్రపంచముగా అగుపించును.

106. ఉన్నదేదో అదే ఉన్నది.

107. సమస్తమూ నీ స్వాత్మయే.

108. ఆత్మనిష్ఠయే పరమ శ్రేయము.
ఆత్మనిష్ఠయే మోక్షము.
* * *
బాహ్యంలో సంగం.
ఆంతరంలో నిస్సంగం.
ఇదే యోగవాశిష్ఠగ్రంథసారమని
రమణభగవాన్ ఉవాచ.

* * *

144. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

విఠోబా - జ్ఞానేశ్వరుల సంవాదం

---

పద్మావతమ్మగారితో కలిసి షిరిడీ వెళ్లినప్పుడు,
ఓ వ్యాన్ మాట్లాడుకుని ఆళంది వెళ్లాం అందరం...

అది జ్ఞానేశ్వరులు పుట్టి పెరిగి అక్కడే జీవసమాధి పొందిన దివ్యక్షేత్రం.

వారి దివ్యసాన్నిధ్యంలో భావోద్వేగానికి గురి అయ్యాను...

కళ్లు చెమర్చాయి...

మోకాళ్ల మీద నిలబడి వందనాలు సమర్పించాను.

ఎన్ని అద్వైతసూత్రాలు వల్లించినా, మనో పరిధిలో ఉన్నప్పుడు భావోద్వేగం కలగడం సహజం.

నాకటువంటి అనుభవం కలగడం(కళ్లు చెమర్చడం) అనేది ఇది రెండవసారి.

మొదటిసారి మొట్టమొదటగా రమణాశ్రమం పాతహాలులోకి నేను అడుగిడినప్పుడు...
భావుకతకు లోనై కంట కన్నీరు కారింది...

* * *

1. దేహము - జడము.
2. మనసు - భావము.
3. హృదయము - జ్ఞానము.

ఈ మూడు గదులున్న ఇల్లు - "నేను".
జీవుడనేవాడు ఈ మూడు గదుల్లోకి మార్చి మార్చి తిరుగుతుంటాడు...

దేహమనే గదిలో ఉంటే  తాను - కర్మయోగి.
మనస్సనే గదిలో ఉంటే తాను - భక్తియోగి.
హృదయమనే గదిలో ఉంటే తాను - జ్ఞానయోగి.

సామాన్యులైనా, మహనీయులైనా ఈ  మూడు గదులలోనే తిరుగాడుతూ ఉంటారు.

కాకపోతే సామాన్యులు దేహమనే గదిలో(దేహాత్మభావములో) ఎక్కువగా కాలం గడుపుతుంటారు.

మహనీయులైన వారు మనస్సు, హృదయమనే గదుల్లో యెక్కువగా గడుపుతుంటారు.

దేహమనే గదిలో ఎక్కువగా గడిపినవాడు - గాంధీ.

మనస్సనే గదిలో ఎక్కువగా గడిపినవాడు - త్యాగరాజు.

హృదయమనే గదిలో  ఎక్కువగా గడిపినవాడు - రమణుడు.

* * *

రమణుడు వంటకోసం కాయగూరలు తరిగేటప్పుడు - కర్మయోగి.

అరుణాచల అక్షరమణిమాలై వ్రాస్తున్నప్పుడు - భక్తియోగి.

సోఫాలో కూర్చొని తనలో తాను రమిస్తున్నప్పుడు - జ్ఞానయోగి.

* * *

వివేకానందులు అమర్ నాథ్ వెళ్లినప్పుడు భావోద్వేగానికి లోనై, గుహ వెలుపలే దుస్తులు వదలి, కౌపీనం ధరించి అమరనాథేశ్వరదర్శనానికెళ్లారు...

* * *

రమణసన్నిధిలో భక్తులొకరు రామాయణం చదువుతుంటే, తారా విలాపం వద్ద రమణులు భావోద్వేగానికి  గురై, కంఠం గద్గదమైంది.
"చాలు...ఆపు" అన్నారు రమణులు.

* * *

14-1-1999 న గురువుగారి సతీమణి పద్మావతమ్మగారు కాలం చేసినప్పుడు తన స్నేహితుడు శంకరయ్య రాగానే గురువుగారు భావోద్వేగానికి లోనైనారు-
శంకరయ్యా...! అంటూ కంఠం గద్గదమైంది...మాట పెగల్లేదు...
నేను ప్రత్యక్షసాక్షిని...

* * *

ఎవరైనా సరే ఆయా గదుల్లో ఉన్నప్పుడు
ఆయా స్వభావంలో ఉండడం సహజం.

ఆత్మనిష్ఠలో సదా ఉండమని రమణులు నొక్కి వక్కాణించేవారు.

కారణమేమంటే-
ఆత్మలో ఉంటే, ఆత్మగానే ఉంటావు...అనే.

అలా సదా ఆత్మనిష్ఠలో ఉన్నవాడు జ్ఞానేశ్వరులు.
నిష్ఠ నుండి జారుతూ ఉండేవాడు విఠోబా.

వీరిద్దరి మధ్య జరిగిన సంభాషణే
సిద్ధ-సాధక సంవాదం.

* * *

మరాఠీ కవులలో భక్తులలో "జ్ఞానేశ్వరులు"కు
సాటి అయినవారు మరొకరు లేరు అంటే అది అతిశయోక్తి కాదు.

మన తెలుగులో ఆదికవి నన్నయ్య ఎలాగో
అలా మరాఠీలో ఆదికవి జ్ఞానేశ్వరులు.

శాలివాహక శక సంవత్సరం 1197 లో కృష్ణాష్టమి రోజున విఠల్ పంత్-
రుక్మిణీబాయి  పుణ్యదంపతులకు ఆళందిలో జన్మించారు.

విఠల్ పంత్  భక్తి జ్ఞాన వైరాగ్యములను కలిగి, సదా భగవత్ చింతనలో
ఉండేవాడు.

ఏకాంతంగా తపస్సు చేసుకోవడానికి అప్పుడప్పుడు సమీప అరణ్యాలకు
వెళ్లేవాడు.

ఓసారి తన బిడ్డలైన నివృత్తులు, జ్ఞానదేవులు, ముక్తాబాయి, సోపానులను
వారి అమ్మమ్మ ఇంట వదిలి అరణ్యానికెళతాడు.

వీరి బిడ్డల జ్ఞానసంపత్తికి మెచ్చి ఆ దేశపురాజు-
వీరిని కన్న ఆ తండ్రి ఎంతటి మహనీయుడో అని తలచి,
అతడు అరణ్యంలో నివసిస్తున్నాడు తెలిసి
ఆ మహనీయుణ్ణి తమ నగరానికి తీసుకొచ్చే బాధ్యతను  విఠల్ పంతు
రెండవ బిడ్డడైన జ్ఞానేశ్వరులకు అప్పగిస్తాడు.

తన తండ్రిని తన వాదనాపటిమతో ఒప్పించి, నగరానికి తీసుకొస్తాడు...

ఆ తండ్రీ తనయుల సంవాదమే
ఈ సిద్ధ-సాధక సంవాదము.

సిద్ధుడు - తనయుడు.
సాధకుడు - తండ్రి.

* * *

జ్ఞానదేవ్: నాన్నగారూ! మీరు నగరంలో ఉండక, ఇలా అడవిలో విరక్తిగా
ఉంటే మేం మాత్రం అక్కడ సుఖంగా ఉండగలమా చెప్పండి?

మేము కన్నతండ్రిని వదిలేసుకుంటామా?
నా మాట విని మీరు వెంటనే నగరానికి ప్రయాణం అవ్వండి.

1. విఠోబా: నాయనా జ్ఞానేశ్వరా!
కక్కిన పాయసం ఆయాసం తీర్చేదేగాని,
కక్కినదాన్ని మళ్లీ తినేవాళ్లుంటారా?

తెలివిలేని మనుష్యులతో సాంగత్యం చేయవచ్చా?
అల్పుడైన రాజును పూజింపవచ్చునా?
సంపసాంగత్యం వద్దని ఈ అడవికి వచ్చాను.
మళ్లీ నన్ను జన సమూహంలోకి లాగవద్దు.

నువ్వు పుట్టుకతోనే జ్ఞానస్వరూపుడివి. నీవెక్కడున్నా సరిపోతుంది.

నేనొక సాధకుడను. నాకు ఈ అరణ్యమే శరణ్యం.

జ్ఞానేశ్వరా! నీ పట్టుదలను వదలి నగరానికి తిరిగి వెళ్లు.

జ్ఞానదేవ్: నాన్నా! ఒక మాట అడుగుతాను చెప్పండి...మీరు అరణ్యంలో నివసించడానికి కారణం ఏమిటో చెప్పండీ....

2. విఠోబా: జ్ఞానేశ్వరా! నేను విరక్తి మార్గంలో ఉన్నవాణ్ణి. నగరంలో ఉండి నేను అనుభవించదగిన విషయం ఏదీ లేదు.
అక్కడుండే విషయాలన్నీ నా మోక్షానికి ఆటంకం కలిగిస్తాయేగాని, ఒక్క విషయం కూడా నా సాధనకు సహాయపడదు. అందుకే ఈ నిర్జనమైన అరణ్యమే మౌననిష్ఠకు యోగ్యమైనది.

జ్ఞానదేవ్: ఓ వెర్రినాన్నా! ఇది యెలా ఉందంటే, ఆకాశం అగుపడకుండా ఉండాలంటే, కళ్లు మూసుకుంటే చాలు; కానీ ఒకడు దుప్పటి చేత ఆకాశాన్ని కప్పేయాలని అనుకున్నాడట.

చిన్ని పిచ్చుక తన చిన్ని పాదాలతో పిడుగును ఆపాలని అనుకున్నదట.

పాపకర్మలు చేసేవాడు ధర్మాన్ని వెదకినట్లు
కఠినాత్ముడు ఈశ్వరదర్శనం చేయాలని ఆశపడ్డట్టు

అహంకారాన్ని చంపక జ్ఞానాన్ని పొందాలని భావించినట్లు నాన్నగారూ...! అచ్చంగా మీరూ ఇలాంటి చేష్టలనే కలిగి ఉన్నారు.

మోక్షాన్ని సాధించాలనే పట్టుదలతో ఉన్నారు మీరు...మంచిదే, ఇంతకీ మోక్షం అంటే ఏమి? భేదభావం లేకపోవడమే కదా!

మీరేమో ఇది అడవి, అది నగరం అంటూ భేదభావంలోఉన్నారు. మీకిది తగదు నాన్నగారూ!

3. విఠోబా: 'నాది' అనే మమకారం ఉన్నంతవరకు 'నేను' అనే అహంకారంగాని, అదివేఱు, ఇదివేఱు అనే భేదబుద్ధిగాని పోదు. ఈ భేదభావాన్ని పోగొట్టేది ఒక్క నిర్వికల్పసమాధి మాత్రమే.

అటువంటి నిష్ఠ కలగాలంటే, సంకల్పాలు లేకుండా ఉండాలి. అలా సంకల్పాలు లేకుండా ఉండాలంటే జనసాంగత్యం ఉండకుండకూడదు.

అందుకు అరణ్యావాసమే అనుకూలమైనది.

జ్ఞానదేవ్: నేనెవడను? అనే ఆత్మవిచారణ ద్వారా "బ్రహ్మమే నేను" అని తెలుసుకుని, ఊరక ఉండడమే బ్రహ్మనిష్ఠ. అంతేగాని ఈ అరణ్యంలో నివసించడం బ్రహ్మనిష్ఠ కాదు.

4. విఠోబా: సద్గురు కృప వలన "బ్రహ్మమే నేను" అని తెలుసుకున్నాను. కాని అది స్థిరం కావడానికి ఈ అరణ్యావాసాన్ని ఎన్నుకున్నాను.

జ్ఞానదేవ్: అరణ్యంలో ఏకాంతంగా తపస్సు చేసినంత మాత్రాన నేను-నాది అనే అహంకార మమకారాలు పోవని, జ్ఞానులైనవాళ్లు గ్రహించి, ఇది అరణ్యం, అది నగరం అని, ఇది సన్న్యాసం, అది సంసారం అని భావించకుండా వారు సదా నిర్వికల్పసమాధిలోనే సంస్థితమై ఉంటారు.

మీరు మాత్రం సంసారాన్ని కాదని ఇలా అరణ్యనివాసం చేయడానికి కారణమేమి తండ్రీ!

5. విఠోబా: సాంసారంలో ఉన్నట్లయితే సమాధికి ఆటంకం కలిగి, అంతిమదర్శనానికి దూరం అవుతాం.

అందుకే మాలాంటి సాధకులు కలలో కూడా సంసారాన్ని తలవరు.

జ్ఞానదేవ్: ఇది కావాలి, అది వద్దు...ఇలాంటి సంకల్ప వికల్పాలు లేకుండా ఉండడమే సహజసమాధి నిష్ఠ.

అంతేగాని నగరం వద్దని, అరణ్యంలో ఉండాలని
భావించడం నిష్ఠ కానేకాదు.

6. విఠోబా : జ్ఞానా! నువ్వన్నట్టు అస్సలు సంకల్పాలే లేకుండా
నిత్యవ్యవహారం ఎట్లా జరుగుతుంది?

అలాంటప్పుడుఅలాంటీ వ్యక్తి నగరంలో ఉండడం కంటే, అరణ్యంలో ఉండడమే మంచిది కదా!

అలాంటి సంకల్పరహితుడు నివసించడం అంటే,
శవానికి పెళ్లి చేయటం లాంటిదే.

జ్ఞానదేవ్: వ్యాపారం అనేది మీకు ఇష్టం లేనప్పుడు, సమాధి సాధన చేస్తున్నారుగా ఇదీ ఒక వ్యాపారమే కదా! ప్రతీది వ్యాపారమే అయినప్పుడు సంసారవ్యాపారమూ ఉండనివ్వండి...నష్టమేముంది?

7. విఠోబా: నిజమే...సమాధిసాధన అనేదీ వ్యాపారమే కావొచ్చు; కానీ అది సంకల్పాలను నాశనం చేస్తుంది.

అదే సంసారవ్యాపారమైతే, సంకల్పాలను పెంచి కష్టాలపాలు చేస్తుంది.

జ్ఞానదేవ్: సత్ - చిత్ - స్వరూపమే తాను.
ఇక సాధనలు ఎందుకు చేయాలి?

8. విఠోబా: మెలకువలో ఉంటూనే సుషుప్తిలో ఉండే ఆనందాన్ని అనుభవించగలగాలి.

సుషుప్తిలో ఉంటూనే మెలకువలో ఉండే ఎరుకను అనుభవించగలగాలి.

అందుకే ఈ సమాధిసాధన.

జ్ఞానదేవ్: మెలకువలో - ఇంద్రియానుభవాల్ని.
కలలో - మనసు చేసే ఇంద్రజాలసృష్టిని.
నిద్రలో - శూన్యాన్ని.

సాక్షిగా ఉండి చూడడమే ఆనందం.

గ్రద్ధ నీడలాగా దేనికీ అంటకుండా ఉండడమే "జాగృత్ సుషుప్తి" అని సకల శాస్త్రాలు చెబుతున్నాయి...

అంతేగాని, కేవలం శుద్ధశూన్యమైన సుషుప్తిలో ఉండడమే సమాధి అని, ఆనందమని మీరు భావించవచ్చా!

9. విఠోబా: మెలకువలో, కలలో ఇంద్రియాలు మనల్ని లోబరుచుకుని చాలా కష్టపడతాయి. అందువల్ల శుద్ధశూన్యమైన సమాధియే ఉత్తమమైనది.

జ్ఞానదేవ్: దొంగకు మరో దొంగ గురువైనట్లు,
జనకమహారాజులాగా జగత్తులో ఉంటూనే అందులోని విషయాలను జ్ఞానమనే ఖడ్గముతో నఱికి నిశ్చలంగా తాను ఉండడమే సమాధి.

అంతేగాని ఎట్టి ఆలోచనలు లేకుండా వ్యవహార శూన్యంగా ఉండడం సమాధి కాదు.

10. విఠోబా: ఎన్నో జన్మముల నుండి సంస్కారములను కూడబెట్టుకంటూ వస్తున్న ఈ "మనస్సు" అనే కోతిని సర్వసంగ పరిత్యాగి అయిన శుకమహర్షే జయించాడు.

అంతేగాని నువ్వనుకున్నట్టు సమాధిలో ఉండని జనకుడు కాదు.

జ్ఞానదేవ్: కోల ఆడిన కోతి ఆడినట్లు, దృఢజ్ఞాని అయిన జనకమహారాజే మనస్సును జయించినవాడు.

అంతేగాని, కేవలం తనకు బాహ్యంగా ఉన్నవాటిని మాత్రమే వదిలి అరణ్యంలో జీవించే శుకుడు కాదు.

11. విఠోబా: సమాధిలో మాత్రమే దృశ్యం లేకుండా పోతుంది.

అంతేగాని మనం దృశ్యంలోనే ఉంటూ దృశ్యాన్ని లేకుండా ఎలా చేయగలం? విషానికి విరుగుడు విషాన్నే ఇచ్చినట్లుంది.

జ్ఞానదేవ్: విషాన్ని హరించడానికి, విషానికే విషం లాంటి ఔషధాన్ని తీసుకున్నట్లుగా ఈ భయంకరమైన జగత్ విషయాలను ధృడజ్ఞానము చేత

నాశనం చేసినవాడే సమర్థుడు.

అంతేగాని సదా సమాధినిష్ఠలో ఉంటూ, విషయాలనే మృగాలు ఎక్కడ మీదకు వచ్చి పడతాయో అని నిరంతరం భయపడేవారికి ఆ భీతియే వారికి దొరికే ఫలం. బ్రహ్మానందం వారికి మచ్చుకైనా దొరకదు.

12. విఠోబా: సర్వ విషయాలనూ వదిలి సదా సమాధినిష్ఠలో ఉండే సన్న్యాసినే విషయాలు చుట్టి ముట్టి అతన్ని భంగపరుస్తుంటాయి అప్పుడప్పుడు. మరి సంసారంలో ఉన్నవాళ్లను విషయాలు మరింతగా ముప్పుతిప్పలు పెట్టవా?
ప్రవాహంలో పడిన ఎండుటాకు నిశ్చలంగా ఉండగలదా?

జ్ఞానదేవ్: దృఢజ్ఞానం లేనివాళ్లు ఎంతకాలం సమాధినిష్ఠలో ఉన్నా సరే, వారు ఎప్పటికైనా బహిర్ముఖులై కష్టాల పాలవుతారు.

ప్రవాహంలో పడ్డ పెద్ద బండరాయి కాస్త కూడా చలించనట్లు దృఢజ్ఞానం గలవారిని కూడా విషయాలు ఏమీ చేయలేవు.

13. విఠోబా: ఎంత దృఢజ్ఞానం ఉన్నా కూడా సదా ఆ నిష్ఠలో లేకపోతే మళ్లీ మాయలో పడిపోవడం ఖాయం.

జ్ఞానదేవ్: బ్రహ్మానికి విడిగా మాయకు ఉనికి ఉందా అసలు?
తన నీడతో  తాను యుద్ధం చేసినట్లుంది.
లేని మాయను ఉన్నట్లు కల్పించుకుని, సదా నిష్ఠలో ఉండి మాయను జయించాలని అనుకోవడం కూడా.

లేని మాయను లేదు అని తెలిసి ఊరక ఉండక,
ప్రొద్దస్తమానం నేతి-నేతి(ఇదికాదు-ఇదికాదు) అనుకుంటూ ఉండడం సరియైన సాధన కాదు.

14. విఠోబా: నేతి చేయక, మనస్సును ఏకాగ్రం చేయక, సాక్షిగాను ఉండక, మోక్షం ఎలా కలుగుతుంది?
జ్ఞానదేవా! నన్ను తికమక పెడుతున్నావు...
జ్ఞానదేవ్: 'నేతి' చేసేకొద్దీ విషయాలు వస్తూనే ఉంటాయి.
మనస్సును ఏకాగ్రం చేసేకొద్దీ మనసు చంచలం అవుతూనే ఉంటుంది.

సాక్షిగా ఉండేకొద్దీ 'శరీరమే నేను' అన్న భ్రాంతి కలుగుతానే ఉంటుంది. నాన్నగారూ! కేవలం ఆత్మవిచారం వల్లనే ఈ మాయ నశిస్తుంది.

15. విఠోబా: ఇతర ఏ సాధనలూ చేయకుండా, కేవలం ఈ ఆత్మవిచారం వలన మాత్రమే మాయను జయించడం సాధ్యమా?

జ్ఞానదేవ్ : బ్రతికున్న పశువే పులిని చంపలేదు.
చచ్చిన పశువు పులిని చంపగలదా?
దృఢజ్ఞానం గలవారిని విషయాలు ఏమీచేయలేవు.

16. విఠోబా: వ్యభిచారిణితో స్నేహం చేస్తే పతివ్రత కూడా చెడిపోతుంది. అలాగే అజ్ఞానితో చేరి సుజ్ఞాని కూడావిషయాలలో చిక్కి మనసు చెదరి దుఃఖాల్ని పొందడా?

జ్ఞానదేవ్: దృఢమైన మనస్సుగల పతివ్రత ఎంతమంది వ్యభిచారిణులతో ఉన్నా కూడా ఆమె నిర్మలంగానే ఉంటుంది. ఆ శక్తిలేని పతివ్రత స్వబుద్ధి చేతనే చెడిపోతుంది.

అట్లే దృఢజ్ఞాని యెంతమంది అజ్ఞానుల మధ్య ఉన్నా సరే తన జ్ఞాననిష్ఠ నుండి జారడు. ఆ శక్తి లేనివాడు ఏకాంతంగా ఉన్నా జారిపోతాడు.

17. విఠోబా: అయితే సంసారంలో ఉంటూనే ఎవడైనా సహజజ్ఞాని ఎలా కాగలడు?

జ్ఞానదేవ్: బ్రాహ్మణుడు ఓ నాటకంలో ఛండాలుడిగా నటిస్తాడు.
అంతమాత్రం చేతనే వాడు ఛండాలుడైపోతాడా?

అట్లే జ్ఞాని వ్యవహారంలో ఉన్నట్లు మనకు కనబడ్డా కూడా అతణ్ణి ఏదీ అంటదు.

తాను సదా సహజ జ్ఞానంలో స్థిరమై ఉంటాడు.

18. విఠోబా: జ్ఞానేశ్వరా! నువ్వెన్నయినా చెప్పు...
యెంతటి దృఢజ్ఞాని అయినా సరే ఒక్క నిమిషమైనా సరే బ్రహ్మాన్ని ధ్యానం చేయకపోతే బ్రహ్మజ్ఞాని అవడం కష్టం.

జ్ఞానదేవ్: ఛండాల వేషం వేసిన బ్రాహ్మణుడు మాటిమాటికి "నేను బ్రాహ్మణుడను" అని గుర్తు చేసుకుంటి ఉంటాడా? ఒకవేళ అతను అలాఅనుకోకుంటే ఛండాలుడైపోతాడా?

"నేను" అన్న అహంకారం నశించాక కూడా
నేను అది - నేను ఇది అనుకోవడం ఎందుకు?
అహంకార-మమకారాలు నశిస్తే చాలు.
యెటువంటి సాధనలు చేయనక్కర్లేదు.
తాను సదా బ్రహ్మానందస్వరూపుడే.

19. విఠోబా: ప్రతిరోజూ ధ్యానం చేయకపోతే,
"దేహమే నేను" అన్న అహంభావం అంత సులభంగా పోదు.

జ్ఞానదేవ్: చేతిలో దీపాన్ని పట్టుకొని
చీకటీ! ఉండు....అంటే ఉంటుందా?

ఆత్మవిచారం వలన 'బ్రహ్మమే నేను' అని తెలుసుకున్న తర్వాత 'ఓ అజ్ఞానమా! ఉండు' అంటే ఉంటుందా?

పిల్లిని ప్రక్కన పెట్టుకొని 'చిలుగా పలుకు' అంటే పలుకుతుందా?

జీవ-జగత్-జగదీశ్వరులు మూడూ అబద్ధం అని తెలిసాక - 'ఓ మాయా! రా' అంటే వస్తుందా?

నపుంసకుడు స్త్రీ యెదుట నిలబడి నేను పురుషుడనని గర్వంగా చెప్పుకోగలడా?

సద్గురుకృప చేత 'బ్రహ్మమే నేను' అని తెలుసుకున్నవానికి-

సంకల్పమేది? వికల్పమేది?
బంధమేది మోక్షమేది?
జననమేది? మరణమేది?
నగరమేది? అరణ్యమేది?
దానమేది? తపమేది?
సన్న్యాసమేది? సంసారమేది?

అని చచ్చిన గొఱ్ఱెకన్ను వలె,
జగత్తులో ఉన్నా సరే
వాని యెదుట మాయ యొక్క పనితనం
అణుమాత్రమైనా ఫలిస్తుందా?

నాన్నగారూ! బాగా యోచించండి...

ఈ విధంగా జ్ఞానేశ్వరులు పలుకగానే-
విఠోబా యెంతో సంతోషించి, నగరానికి తిరిగొచ్చి, రాజుచే ఘనంగా సత్కరించబడి, నగరంలో నివసిస్తూనే, తామరాకు యందు నీటి బొట్టులాగా దేనికీ అంటక, సదా సహజజ్ఞానములోనే స్థిరమై సుఖించాడు.

* * *

145. గ్రంథం: నా గురువు
రచన: జ్ఞానశిశువు

---

ఋభుగీత

---

15-5-2022 * పౌర్ణమి

ఈ ఉదయాన్నే అరుణాచలం వెళ్లాను...
కాదు కాదు... వెళ్లాల్సివచ్చింది...
సతీమణి కోరికపై...

* * *

దారిలో ఉండగా మృత్యుంజయులు గారు
దారిఖర్చులకని ph pay లో పైకం పంపారు...
నిజంగానే ఆ పైకం దారిలోనే ఖర్చైపోయింది.

నా పైకాన్ని చాలామంది జేబుల్లో దాచుకున్నాను...
దాన్నే వారు నాకు 'దక్షిణ' రూపంగా ఇస్తున్నారు...

'నాకు నేనే ఇచ్చుకున్నాను'
'నాది నేనే పుచ్చుకున్నాను'

అని ఇచ్చే, పుచ్చుకునే దక్షిణ వలన
ఇరువురికీ ఫలం అంటారు మా గురుదేవులు...

* * *

లౌకికం నుండి అలౌకికానికి చేసే ప్రయాణంలో
జ్ఞానాంబ ప్రసాదించిన దారిఖర్చులే 'ఆయుస్సు'.

నా పుణ్యాన్ని జ్ఞానాంబ కొంగుముడిలో దాచుకున్నాను...
దాన్నే నాకు 'ఆయుస్సు' రూపంగా ప్రసాదిస్తోంది.

ఆ అర్థాన్ని
ఈ అర్థాన్ని
పరమార్థానికే వినియోగించాలి...

* * *

అరుణాచలేశ్వరుడి దర్శనం...
రమణాశ్రమ సందర్శనం...
అరుణాచల ప్రదక్షిణం...

ఇవన్నీ చూడడం నా అదృష్టం...
అనుకునేవాణ్ణి అప్పుడు.

ఇవన్నీ చూడవలసిరావడం నా ప్రారబ్ధం...
అని అనుకుంటున్నాను ఇప్పుడు.

నిజానికి ప్రారబ్ధం-అదృష్టం రెండూ ఒక్కటే అర్థం.
రెండూ కంటికి కనబడనివే.
రెండూ మన స్వాధీనంలో లేనివే.

"విషయం" ఒక్కటే-
పాజిటివ్ గా ఉంటే అదృష్టం అని...
నెగిటివ్ గా ఉంటే ప్రారబ్ధం అని...
వ్యవహారంలోకి వచ్చేసింది...అంతే.
కానీ రెండూ ఒక్కటే...

రమణుని స్థితిని చూసి ఆహా ఓహో అంటాము...
కానీ వారు మాత్రం, 'ఇది నా ప్రారబ్ధం' అంటారు...

అందుకే
ఈశ్వరుడు వారి వారి ప్రారబ్ధకర్మానుసారంగా జీవులను ఆడించును...
అని తల్లికి బోధించారు.
ఈశ్వరుడు ఆడే ఆ ఆటలో
మనిషైనా ఒకటే, ఋషైనా ఒకటే...

ఆ ఆటలో-
దేవుడు చేసిన బొమ్మ - జీవుడు.
జీవుడు చేసిన బొమ్మ - దేవుడు.

యూజీ పుణ్యాన-
మ్యూజియంలో బొమ్మలకు..
దేవాలయంలో బొమ్మలకు...
అట్టే తేడా లేకుండా పోయింది.
* * *

మాటవరుసకు-
ప్రారబ్ధం-అదృష్టం వేఱువేఱు అనుకున్నా కూడా...
శివదర్శనం చేసుకోవడం - ప్రారబ్ధం.
శివుడే తానైపోవడం - అదృష్టం.

అందుకే భగవత్ సన్నిధిలో గడపడం కంటే
'నా' సన్నిధిలో నేను గడపడం నాకు సుఖం.

"నమశ్శివాయ" జపం కంటే
"శివోహం" భావన గొప్పది.

శివోహం
శివోహం
శివోహం

నేను శివుడను
నేను శివుడను
నేను శివుడను.

అంటూ సదా స్మరించు...సదా జపించు...

శివోహం అని అనుకోకపోతే
శివోహం అని ఉండకపోతే
ఈ ఆధ్యాత్మికతకు అర్థమే లేదు.

శివోహం-శివోహం అని అంటే - సాధన.
శివోహం-శివోహం అని ఉంటే - సిద్ధి.

అలా అనుకోవటానికి...
అలా ఉండటానికి...
ఋభుగీత చాలా సహాయం...
ఋభుగీత సదా స్మరణీయం...

* * *

కేదార్ నాథ్ ప్రాంతంలో...
ఓ గురుకులాశ్రమం...
గురువు ఋభువు...
శిష్యుడు నిదాఘుడు...
ఆశ్రమంలో చదువు పూర్తిచేసుకొని...
సొంతూరికి చేరుకున్నాడు నిదాఘుడు...
చాలాకాలం అయ్యాక...
తన శిష్యుడు అద్వైతనిష్ఠలో ఏ మాత్రం నిలబడి ఉన్నాడో...
చూసి వద్దామని బయలుదేరాడు గురువు...
మారువేషంలో ప్రవేశించాడు ఆ ఊళ్లోకి...
ఆ సమయానికి ఆ ఊరి మీదుగా...
ఆ ప్రాంతపురాజు మందీమార్బలంతో వెళుతున్నాడు...
పట్టపుటేనుగు మీద ఊరేగుతున్న రాజును...

ప్రజలందరూ ఆసక్తిగా  చూస్తున్నారు...
ఆసక్తిగా చూస్తున్నవారిలో తన శిష్యుడు కూడా ఉన్నట్టు గుర్తించాడు...
శిష్యుని ప్రక్కనే నిలబడి-
* * *
ఋభువు: బాబూ...! ఏమిటా సందడి...?
నిదాఘుడు:(తల త్రిప్పకనే) కనబడ్డం లేదా...?
రాజుగారు ఏనుగు మీద ఊరేగుతున్నారు...
* * *
ఋభువు: ఊరేగింపు అనేది అర్థమైందిగానీ...
రాజు, ఏనుగు అన్నావే...అది అర్థం కాలేదు...
* * *
నిదాఘుడు:(చిరాగ్గా) పైనుండేది రాజు...
క్రిందుండేది ఏనుగు...
* * *
ఋభువు: ఏనుగు, రాజు...అనేది అర్థమైందిగానీ...
పైన, క్రింద అన్నావే...అవి అర్థం కాలేదు...
* * *
నిదాఘుని కోపం తారాస్థాయికి చేరుకుని...
ఆ పృచ్ఛకుణ్ణి వంగమని...
అతని వీపుపైకి ఎగిరి కూర్చుని...
నేను పైన, నీవు క్రింద...అన్నాడు.
* * *
ఋభువు: పైన, క్రింద అనేది అర్థమైందిగానీ...
నేను, నీవు అన్నావే అది అర్థం కాలేదు...
* * *
ఇలాంటి మాటలు పలికేది మన గురువుగారొక్కరే...
అంతే...ఆ శిష్యుడికి అనుమానం కలిగి...
ఆ ఆగంతుకుని వైపు తెరిపారా చూశాడు...
ఆశ్చర్యం...తన గురువే...!
సాష్టాంగపడ్డాడు...

శిష్యుణ్ణి లేవనెత్తి హృదయానికి  హత్తుకున్నాడు...
* * *
ఆ ఋభువు తన శిష్యుడికి ప్రబోధించిన అద్భుత గ్రంథమే ఋభుగీత...
అద్వైతశాస్త్రాన్ని అభ్యసించే ప్రతి  ఒక్కరు ఋభుగీత చదివితేనేగానీ,
అద్వైతసిద్ధి పరిపూర్ణం కాదు...అనడంలో ఏ మాత్రమూ అతిశయోక్తి కాదు.
* * *
కారణంలో కార్యం ఉండదు...
కార్యంలో కారణం ఉంటుంది...
మట్టిలో కుండ ఉండదు...
కుండలో మట్టి ఉంటుంది...
కార్యం అనేది ఓ తోపకమేగాని...
కార్యం అస్సలు లేనే లేదు అని తెలిస్తే...
కారణం ప్రసక్తి కూడా ఉండదు...
ప్రస్తావించడమే ప్రధాన దోషం...
ప్రస్తావిస్తే జ్ఞానం కూడా అజ్ఞానమైపోతుంది...
ప్రస్తావిస్తే దైవం కూడా ప్రపంచమైపోతుంది...
ప్రస్తావిస్తే 'ఒకటి' కూడా 'రెండు' అయిపోతుంది...
ప్రస్తావించకుంటే అది అదిగానే ఉంటుంది...
అందుకే "దానిని" ప్రస్తావించకు...
నిర్వచించకు...ఆలోచించకు...
అసలు నోరే తెరవకు...
బ్రహ్మము గుఱించి-
వాగేదంతా వ్యర్థమే...
తలచేదంతా వ్యర్థమే...
వాక్కు, మనసు బ్రహ్మాన్ని గ్రహించలేవు...
దేనిని అందుకోలేక వాక్కూ మనసూ వెనుతిరుగుతాయో...
అదే బ్రహ్మము అంటుంది తైత్తిరీయం...
* * *
"నేనే కేంద్రం" అన్న ఒక్క మాటకు...

విస్తరణరూపమే ఋభుగీత...
విశ్వరూపసందర్శనం అనేది...
అప్పటికప్పుడే చూపబడిన ఓ ప్రదర్శన కాదు...
అర్జునుడి వఱకే పరిమితమైన "నేను"...
కృష్ణుభగవానుడు ఇచ్చిన అవగాహన వలన...
విస్తరణరూపం దాల్చి...
అనంతమైన నేనుగా మారుకుంది...
నది సముద్రంలో కలిసి సముద్రమే ఐనట్లు...
సమస్తమూ ఏకాత్మవస్తువుగా తోచింది...
* * *
"ఒకటి" లేనప్పుడు "రెండు" అనేది కూడా లేదు.
"రెండు" లేనప్పుడు "ఒకటి" అనేది కూడా లేదు.
ఏకం అనేకం అయ్యింది అంటే....
"ఒకటి" రెండు, మూడు అయ్యిందని కాదు...
అనేకం అంటే "అది"(తత్) ఏకం కూడా కాదు...
అని క్రొత్త అర్థం చెప్పారు మా గురువుగారు...
* * *
"ఒకటి" ఒకటిగా ఉండటమేగాని...
"ఒకటి"ని ఒకటి అని అనడం పొసగదు...
"ఒకటి" అనగానే అది రెండైపోతుంది...
రెండు అనగానే అది మూడైపోతుంది...
ఒకటి ఒకటిగా ఉండాలంటే...
నీవు ఊరికే ఉండాలి...
పూర్ణం పూర్ణంగా ఉండాలంటే...
నీవు శూన్యంగా ఉండాలి...
* * *
నిధాఘా!
ఉన్నదెల్లా బ్రహ్మమే అన్న నమ్మకంతో ఉండు...
అనాత్మ అంటూ ఏమీలేదు...

మనస్సు అనాత్మ కాదు...
సృష్టి అనాత్మ కాదు...
అనాత్మగా ఏమీలేదు...

నాకు ప్రభువు లేడు...
నేను బ్రహ్మమును...

ఈ ప్రపంచము సృజించబడలేదు...
తనకు తానుగా నిలువదు...
ఇదొక చిత్రపటం...
ఇదెప్పుడూ అసత్యమే...

కర్త లేడు...
క్రియ లేదు...
కర్తవ్యము లేదు...
బ్రహ్మమొక్కటే సత్యము...
సర్వమూ బ్రహ్మము...
'సర్వము' అనునది ఒక భావము మాత్రమే...

నాకు బంధమూ లేదు, మోక్షమూ లేదు...
అక్షరమైన ఈ బ్రహ్మమే సర్వమూ.
"ఇది" అంటూ చూపదగినదేదీ లేదు...

గురువును త్యజించి...
అన్నిటినీ ఎల్లప్పుడూ త్యజించి...
మౌనముగా కూర్చుండుము...

సర్వత్యాగమే మహామోక్షము...
సర్వమును త్యజించుటే నిత్యసుఖము...
సర్వమును త్యజించుటే పరమానందము...

ఉన్నదెల్లా సదా పూర్ణమైన బ్రహ్మమే...
అని ఉన్నవాడు జీవన్ముక్తుడు...
జీవన్ముక్తుని వివరణము ఏ వేదాల్లోనూ లభించదు...

ఎల్లెడలా మౌనియై...
ఏ ప్రయోజనమూ లేనివాడు విదేహముక్తుడు...

కాలభేదము...
దేశభేదము...
వస్తుభేదము...
స్వల్పమైనా భేదభావము లేనివాడు విదేహముక్తుడు...

తన ఉనికినే గుర్తింపనివాడు విదేహముక్తుడు...

దేని గురించీ ఏ నిశ్చయమూ లేనివాడు విదేహముక్తుడు...

ఆత్మ అవిభక్తము...
సమాధానము ఆత్మయందే సంస్థితము...
నిన్ను ఆత్మగానే భావించుకో...
ఆత్మనే వీక్షించు...
ఆత్మయందే ఉండు...
స్వాత్మయందే మోదము కలిగి ఉండు.
ఆత్మనే ప్రేమించు...
ఆత్మ గురించే చింతించు...
ఆత్మ వినా అన్యము లేదు...
ఆత్మకు అన్యముగా సుఖము లేదు...
ఆత్మకు భిన్నముగా ఏమీలేదు...
ఆత్మను విడచి ఎక్కడికీ వెళ్లలేవు...
సదా ఆత్మనిష్ఠుడవగుము...

స్రష్ట ఉంటేనే సృష్టి సంభవము...
అంతా కేవలము చిన్మాత్రమే...
కార్యకారణరూపములు లేవు...

నేను దేహాతీతుడను...
నేను వేదాతీతుడను...

'నేను బ్రహ్మమును' అను నిశ్చయము కలవాడు బ్రహ్మజ్ఞాని...

చెదపట్టిన కట్టెను వలె...
తుప్పుపట్టిన ఇనుమును వలె...
తక్షణం నామరూప ద్వయాత్మకమును వదులు...

నోటితో ఏమి పలికినా...
మనసుతో ఏమి తలచినా...
అంతా మిథ్యే...
ఉన్నది కేవలం నేనే...

1. సర్వం నాస్తి
2.సర్వము బ్రహ్మం
ఈ రెండూ ఉత్తమోత్తమ మంత్రములు.

ఉచ్ఛరింపబడని మంత్రమే ఉత్తమ మంత్రము...
వృత్తి లేకుండుటయే మహనీయము...
'సర్వమూ బ్రహ్మమే' అన్న నిశ్చయమే పరమపదము...
'సర్వమూ బ్రహ్మమే' అన్న నిశ్చయమే సర్వపరిత్యాగము...

త్రిమూర్తుల రూపములు భ్రాంతి...
వర్ణాశ్రమ విభాగములు భ్రాంతి...

ఏదీ లేదు...
ఏదీ లేదు...
నేను కేవలము చైతన్యమే...
దీనినే పలుకు...
ఈ నిష్ఠలోనే ఉండు...
వెంటనే నీవు విముక్తుడవవుతావు...

అక్షరమైనది ఒకే అక్షరము అదే ఓంకారము...
ఆ ఏకాక్షరము నేను...

ఏకము నేను...
అన్యము కాను...

ఈ భావమును ఏ సందేహమూ లేక కలిగి "ఉండుము..."

నేను నేనే...
ఇట్లే నిత్యమూ భావిస్తూ ఆత్మనిష్ఠుడవగుము...

(ఆత్మకాక) ఏదైనా ఉన్నదన్న భావమే మిథ్య.
చూడవలసింది ఏమీలేదు అన్న ధృఢనిశ్చయంతో ఉండు.

నాకు ఏ స్తోత్రమూ లేదు...
అన్ని దేవతలను ప్రకాశింపచేతును...

సర్వమూ బ్రహ్మమే...
'ఈ దేహము నేను' అను భావమూ బ్రహ్మమే...
'ఈ సర్వము బ్రహ్మమే' అను భావమూ బ్రహ్మమే...
సందేహము లేదు...
నేను ఆ బ్రహ్మమును...సందేహము లేదు...
'ఏమీ లేదు' అనే మాట కూడా బ్రహ్మమే...

'అహం బ్రహ్మాస్మి' వాక్యాన్ని సదా వింటూ ఉండాలి.
నిరంతరము  తాను పరమాత్మననే భావించుకోవాలి.

'బ్రహ్మము నీవే' అని బోధించే గురువే పరమగురువు...
'నేను బ్రహ్మమును' అను నిశ్చయము కలిగిన సచ్ఛిష్యుడు పరబ్రహ్మమే అగును...

సంకల్పం వల్లనే బంధం కలుగుతుంది...
నిజంగా ఉన్నదల్లా బ్రహ్మమే...

'నేను బ్రహ్మము' అనే నిశ్చయభావమే ఆత్మజ్ఞానము...
ఇదే బంధనాశకము...
సందేహం లేదు...
ఇదే సిద్ధాంతాల సారము...

"ఇదంతా బ్రహ్మమే, నేను బ్రహ్మము"
ఇదే ధ్యానింపవలసినది...
ఇది భగవంతుని వాక్కు...
ఇది సత్యమని విశ్వసించు...

* * *

ఆత్మ కర్త అనడం సరి కాదు;
ఆత్మ కర్తృత్వం వహించదు.
కుండక మట్టి కారణమైనట్లు
జగత్తుకు ఆత్మ పరమ కారణము.

* * *

బ్రహ్మము-
నాసిక లేకయే ఆఘ్రాణించును.
నేత్రము లేకయే విలోకించును.
కర్ణము లేకయే ఆకర్ణించును.

* * *

ఈ గ్రంథమే పరబ్రహ్మము...
ఇందులో సర్వజ్ఞానమున్నది...
ఇదే పరమపదము...
గురువును పరిత్యజించైనా ఇందులో దానిని అభ్యసించు...

అన్ని శాస్త్రములను పరిత్యజించి...
దీనిని ప్రతిదినము పఠించిన మోక్షము తథ్యము...

తడుపలేని బృహత్ స్వరూపమునకు అభిషేకము చేసెదరు.

* * *

దిక్కులే అంబరముగా గలవానికి వస్త్రములు సమర్పించెదరు.

* * *

వాసనలు లేనివానికి గంధము నలంకరించెదరు.

* * *

రూపము లేనివానికి పూలతో పూజించెదరు.

* * *

స్వయంప్రకాశునకు దీపము నిచ్చెదరు.

* * *

సర్వమును మ్రింగినవానికి నైవేద్యము సమర్పించెదరు.

* * *

సర్వత్రా వ్యాపించినవానికి ప్రదక్షిణ చేసెదరు.
* * *
జ్ఞానులు అంతఃకరణముతో లోలోపలే పూజించెదరు.
* * *
పరమేశ్వరుడు భావార్చన చేయువారికి ఆత్మపదమునిచ్చును.

* * *

నిధాఘుడు:

గురువర్యా! తమరి అనుగ్రహము వలన...
నా అజ్ఞానము...
నా మహాదోషము...
నా మహాభయమూ...
కర్మాచరణలో విశ్వాసము...
ప్రపంచమే సత్యమనే భావన...
అన్నీ క్షణములో నశించిపోయాయి...

నా అజ్ఞానము బ్రహ్మత్వంగా  మారింది...
నా మనసు పరబ్రహ్మంగా మారింది...
ఏకమనే సాగరంలో మునిగి ఉన్నాను...
నాకేమీ గోచరము కాదు...
గురువు అన్యుడుగా కానరాడు...

సర్వమూ పరబ్రహ్మము...
ఈ నిశ్చయముతో స్వస్వరూపములో...
స్వాత్మనిష్ఠుడను సదా...
* * *

ఋభువు:

నిధాఘా! ఈ నిశ్చయమే నీలో దృఢముగ నిలుచుగాక...

* * *

